ప్రథమ ముద్రణ
17 ఫిబ్రవరి 1974.

ప్రథమ పరిష్కరణ
4 జూలై 1974.

ద్వితీయ పరిష్కరణ
14 జనవరి 1986.

ప్రచురణ :
నవభారతి ప్రచురణలు
3-4-852, బరకత్‌పురా
హైదరాబాదు - 500 027

ముద్రణ :
భారత ముద్రణాలయం
3-4-705/4, నారాయణగూడా
హైదరాబాదు - 500 029

ప్రతులకు :
సాహిత్యనికేతన్
3-4-852, బరకత్‌పురా
హైదరాబాదు - 500 0

సాహిత్యనికేతన్
ఏలూరు రోడ్డు
విజయవాడ - 520 00

వెల : రు 90 లు.

అర్థించినంతనే అర్థాపేక్ష లేకుండా

బంచ్ ఆఫ్ థాట్స్

ఆంధ్రానువాదానికి అనుమతించిన

విక్రమ ప్రకాశన్

(బెంగుళూరు)

వారి

సహృదయ, సౌజన్య, సౌదర్యాలకు

కృతజ్ఞతా పూర్వక కుసుమాంజలి

సమర్పిస్తున్నాం

# మనవి

"రాష్ట్రీయ స్వయంసేవకసంఘ్ - ఆర్. యస్. యస్. అని సామాన్యంగా అంటూ ఉంటారు - 1925 లో విజయదశమి పర్వదినాన ప్రారంభమైంది. సంఘసంస్థాపకులైన పూజ్యశ్రీ డాక్టర్ కేశవ బలీరామ్ హెడ్గేవార్ 1940 లో పరమపదించారు. 'గురూజీ'గా జగత్ప్రసిద్ధినందిన శ్రీ మాధవ సదాశివ గోళ్వల్కర్ ఆనాటినుంచి సర్‌సంఘ్‌చాలక్‌గా ఉంటున్నారు. 1965 సంవత్సరం నాటికి సంఘం ప్రారంభించి 40 యేళ్లు, దానికి పూజ్యశ్రీ గురూజీ నేతృత్వంవహించి 25 యేళ్ళు పూర్తయాయి.

నాటికి పాతికేండ్లపాటు తమ వేలకొలది ఉపన్యాసాల్లో, చర్చల్లో, ఇష్టాగోష్ఠుల్లో శ్రీ గురూజీ జాతీయ విషయాలన్నిటిపైన వ్యక్తంచేసిన వివిధాభిప్రాయాలను క్రోడీకరించి ఒక పుస్తకంలో ఇమిడ్చాలని ప్రయత్నం జరిగింది. వాటన్నిటినీ అందులో ఇమడ్చటమనేది దుస్సాధ్యమైనా, విభిన్న విషయాలను గురించి వారి దృక్పథం ఇది అని చూపటానికి మాత్రమే ఆ ప్రయత్నం. వారి ఆలోచనలు వివిధశీర్షికలక్రింద విశ్లేషణచేసి గుది గ్రుచ్చబడ్డాయి. "అయితే ప్రతిశీర్షికక్రింద ఆ యా విషయాలను క్రమబద్ధంగానూ, సమగ్రంగాను ప్రదర్శించామని మేం చెప్పుకోవటంలేదు. రత్నాకర తీరాన గులకరాళ్ళేరుకుంటున్నామేమోనని మా కనిపించింది."

"పైగా శ్రీ గురూజీ ప్రసంగాల్లో చాలాభాగం హిందీలో ఉన్నాయి. స్వచ్ఛము, సుందరము, గంభీరమునైన వారి ప్రసంగాల్లోని శైలీపాటవం, స్ఫూర్తిప్రద భావచిత్రీకరణాలు ఇతరభాషల్లోకి - అందునా - ఒక విదేశీ భాషలోకి అనువదించటంలో దెబ్బతిని తీరుతాయి. ఇందులో భావాలు వారివి, భాష మాది. కనుకనే ఈ పదప్రయోగాల్లోని లొసుగులు మేం గుర్తించాం.

అయినా శ్రీ గురూజీయొక్క భావతేజఃపుంజము ఇటువంటి మా లొసుగులను దిగమ్రింగి జాతీయమేధకు ప్రబోధకంగాను, ప్రచోదకంగానూ ఉండగలదన్న విశ్వాసమే మాచే ఈ సాహసం చేయించింది. ప్రసిద్ధమేధావి, రచయిత, పాత్రికేయుడు, తాత్త్వికుడు అయిన కీర్తిశేషులు ఆచార్య యం. ఎ. వెంకటరావుగారు, శ్రీ గురూజీతో తమకున్న ఆత్మీయత, భావసాదృశ్యాలను పురస్కరించుకొని ఈమాకృషిని ఆశీర్వదించి ప్రోత్సహించారు. అంతేగాదు; అడుగడుగునా అవసరమైన సహకారాన్నిగూడ వారు మా కందచేశారు. ఈ సంకలనానికి భావస్ఫోరకమైన సుదీర్ఘ పీఠికనుగూడ రచించారు. అది మా ప్రయత్నసాఫల్యానికి దోహదంచేసిన ఒక ముఖ్యాంశం.

"భౌతికముకన్న ఆలోచనాత్మకము, మానసికమునైన సమస్యయే ఈనాడు దేశంలో ఉంది. అట్టిసమస్యలను పరిష్కరించుకోడానికి అవసరమైన ఆర్ద్రత, అవగాహనలు శ్రీ గురూజీ భావాల్లో ఉన్నాయి. వాటిని పుస్తకరూపంలో ప్రచురించి ఇంటింటికీ అందచేయటం మాయొక్క పవిత్రమైన జాతీయకర్తవ్యంగా భావిస్తున్నాం."

అంటూ వినమ్రంగా విన్నవించుకుంటూ శక సం. 1888, విశ్వావసు నామ సంవత్సర మాఘ బహుళ ఏకాదశినాడు (16 ఫిబ్రవరి 1966)- పూజ్యశ్రీ గురూజీ షష్టిపూర్తి శుభపర్వాన బెంగుళూరులోని విక్రమ ప్రకాశన్‌వారు, "బంచ్ ఆఫ్ థాట్స్" పేరున ఒక ఆంగ్లగ్రంథం పాఠక లోకానికి అపూర్వకానుకగా అందించారు.

దాన్ని చూచిన తర్వాత తెలుగు పాఠకలోకానికిగూడ పూజ్యశ్రీ గురూజీ భావామృతాన్ని పుస్తకరూపంలో అందీయాలనే ఆలోచన మాకు కలిగింది. తెలుగుపాఠకలోకంగూడ దాని ప్రచురణకోసం ఎంతోకాలంగా ఎదురుచూస్తోంది. కారణాలేమైనప్పటికీ ఈనాటికైనా దాన్ని ప్రచురించ గలుగుతున్నామనే ఆనందం మాకు, అందులోని భావమకరందాన్ని ఆస్వాదించే అదృష్టం మీకు లభించబోతోంది.

ధర్మభూమియైన పవిత్రభారతిని ఈనాడు భౌతిక భావనాలహరులు ముంచెత్తుతున్నాయి. స్వార్థమే పరమార్థం అయిపోయింది; దాన్ని సమర్థించుకునేందుకు ప్రాకులాడే ప్రవృత్తి ప్రబలమౌతోంది. దానితో సంకుచితభావప్రభంజనం సర్వరంగాలనూ సతమతం చేస్తోంది. సమస్యల కారుమబ్బులు నలుగడలనుంచి క్రమ్ముకొస్తున్నాయి. జాతీయమేధకు గ్రహణంపట్టినట్లుంది. గతాన్ని తరచిచూచి ఆగతానికి దాన్ని అన్వయించి, సరియైన మార్గదర్శనం చేయగల ఆలోచనాస్రవంతి కరవైంది. జాతీయమైన ఏ విషయంపట్లా విశ్లేషణాత్మక విజ్ఞానం కనిపించటంలేదు. తాత్కాలిక నిర్ణయాలనేతప్ప భావితరాలకు భవ్యమైనమార్గం చూపగలిగిన నేతృత్వం నేడు కొరవడింది. ఈవిధంగా ఆత్మవిస్మృతికి, తత్ఫలితంగా అనేక ఆఘాతాలకు గురి అవుతున్న అభినవభారతానికి సమయోచితమైన నవీన మార్గదర్శనం అవసరం.

దేశధర్మాల సంరక్షణకార్యంలో దేహంగురించికూడ ఆలోచించకుండా నిరంతరకృషితో, నిరుపమాన వ్యక్తిత్వంతో, నిశితమైన అవగాహనతో సమాజానికి మార్గదర్శనం చేసిన పూజ్యశ్రీ గురూజీయొక్క ప్రతిపలుకు వెనుక నిర్మలత, నిశ్చలత, త్యాగం, సత్యం, ఉత్తేజం నిలచి ఉంటాయి. కనుక సమాజహితంతప్ప మరొక ఆలోచనలేని శ్రీ గురూజీ పలుకులకన్న నేడు మనకు మార్గదర్శనం చేయగలవి మరేమీలేవు.

అకర్మణ్యతతో అస్త్రసన్యాసం చేసిన అర్జునిడిలా ఉంది నేటి భారతావని; అనవసరవాదాలతో అడ్డుత్రోవలు వెదకుతోంది; సమస్యల రణరంగంలో వెన్నుతట్టి, నిలబెట్టి, నడుంకట్టించి ముందుకు నడిపించ గలిగిన మహత్తర రాష్ట్రప్రబోధాత్మకము, సదా శివంకరమునైన అభినవ మాధవుని పాంచజన్యశంఖారావాన్ని ఆంధ్ర పాఠకలోకానికి వినిపిస్తున్నాం.

ఈ గ్రంథాన్ని అనువదించిన శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావుకు, భాషాసారళ్యంకోసమై పరిష్కరించిన, ముద్రణలో సహకరించిన మిత్రులకు ఈ శుభసమయాన మా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

—ప్రచురణకర్తలు

# మూడవ ముద్రణకు ముందు మాట

పూజ్యశ్రీ గురూజీ ప్రవచించిన జాతీయ గీతామృత సారాన్ని తెలుగులో పాంచజన్యం పేరున 1974లో ప్రచురించాం. రెండేళ్ళ వ్యవధి లోనే రెండు సార్లు ముద్రించవలసి వచ్చిందంటే దానివల్ల సమాజంలోని ఆదరణ అర్థమవుతుంది. మూడవ ముద్రణ చాలా కాలంగా అవసరమని పిస్తూనే వున్నా మరల దీనిలో ఎన్నో సంస్కరణలు జరుపవలసి వచ్చి నందున ప్రచురణ జరగలేదు. ఆంగ్లంలో 1966లో తొలిగా ప్రచురింప బడిన తర్వాత- పూజ్యశ్రీ గురూజీ ఏడు సంవత్సరాలు జీవించారు. ఈ కాలవ్యవధిలో వారనేక ప్రసంగాలు చేసారు. వాటన్నిటినీ చేర్చిన సమగ్ర గ్రంథం 'బంచ్ ఆఫ్ థాట్స్' మరల ద్వితీయ సంస్కరణగా వెలువడిం తర్వాత దానిలోని నూతనాంశాలతోను జోడించిన తెలుగు అనువాదం ప్రచురింపవలసిన అవసరం ఏర్పడింది. ఆ అవసరం ఈనాటికి తీరు తున్నందుకు మాకు చాలా ఆనందంగా ఉంది.

ఇందులోని అనేక అధ్యాయాలలో, చిన్న, పెద్ద చేర్పులు, మార్పులు చేయబడ్డాయి. అంతేగాక, పూజ్యశ్రీ గురూజీ, రచనలు, ప్రసంగాలు, గోష్ఠులు, ప్రశ్నోత్తరాల నుంచి వివిధ నూతానాంశాలపై వారి అభిప్రాయాలను సంకలనం చేసి, పదిహేను నూతనాధ్యాయాలుగాను, ప్రశ్నోత్తరాల అనుబంధ రూపంలోనూ ఇందు చేర్చటం జరిగింది. పాఠకుల సౌలభ్యంకొరకు విషయసూచికలో ఆయా అధ్యాయాలసంఖ్యలకు ముందుగా నక్షత్రం గుర్తుతో సూచించటం జరిగింది. పాత అధ్యాయాల క్రమంలో గూడా కొద్దిపాటి మార్పులు చేసాం. అందుచేతనే ఇది పాంచ జన్యం యొక్క రెండవ సంస్కరణ అని చెప్పటం న్యాయం.

ముద్రణ ధరలు విపరీతంగా పెరిగిపోయినందువల్ల, పేజీలనుకూడా ఎక్కువగా చేర్చడంవల్ల ఇదివరకు రు. 30/- లుగా వున్న ఈ గ్రంథం వెలను యిప్పుడు రు. 90 /-లకు పెంచక తప్పడం లేదు.

పూర్వపు ముద్రణలవలెనే ఇది కూడా పాఠకుల ఆదరణకు నోచు కుంటుందనే మా నమ్మకం. చైతన్యప్రదమైన ఈ పాంచజన్య శంఖారావం మన సమాజాన్ని ప్రగతిపథంలో మరింత ధైర్యంగా విజయోత్సాహంతో ముందుకు నడిపిస్తుందని ఆశిస్తున్నాం.

—ప్రచురణకర్తలు

# వి ష య సూ చి క

# రెండవ భాగం

# రాష్ట్రం - సమస్యలు

# వైభవానికి రాచబాట

## (2) సామాజికాభ్యున్నతి

జాలి లేనేలేదు - అనుకరించదగిన ఉదాహరణ- విశాల హృదయం కోసం.

# చతుర్థ భాగం - వ్యక్తి నిర్మాణం

## 33. సఫల కార్యపద్ధతి

—

# అనుబంధం

# ప్రశ్నలు—జవాబులు

# పరిచయం

స్ఫూర్తిప్రదమైన ఒక సముచిత జీవన ప్రణాళికకు అనుగుణంగా జాతియొక్క ఉజ్జ్వల భవిష్యత్తును తీర్చిదిద్దటానికి స్వతంత్రభారతదేశంలో పునరుజ్జీవన పునర్నిర్మాణ కార్యక్రమాలు బహుముఖంగా కొనసాగుతున్నాయి. రాజారామమోహనరాయ్‌తో దాదాపుగా ప్రారంభమైన ఈ కృషిని శ్రీరామకృష్ణ వివేకానందులు, దయానంద అరవిందులు, లోకమాన్య మహాత్ములు, రవీంద్రుడు, డాక్టర్ హెడ్గెవార్ సావర్కారులు - ఇంకా ఇట్టివారనేకులు వివిధరంగాలలో కొనసాగించారు. ఇది ఆధునికయుగంలో క్రొత్తగా ప్రారంభమైన ప్రయత్నంకాదు. బౌద్ధ, మౌర్య, శుంగ, గుప్త, హర్షుల కాలాల్లోనూ, అనంతరం విజయనగరం, మరాఠా, సిక్కు రాజ్యాల కాలంలోనూ జాతీయఆత్మ నిలద్రొక్కుకోవటానికి పదేపదే ప్రయత్నించిందని రాధాకుముద్ ముఖర్జీ, హేవెల్ వంటి దేశ విదేశాలలోని చారిత్రక పరిశోధకులు, భారతీయ విషయవివేచకులు ముక్తకంఠంగా వక్కాణించారు.

విదేశీభావాల, ఆదర్శాల ఝంఝూమారుతం వీచిన బ్రిటిష్ పరిపాలనా కాలంలోగూడ మనం నిలద్రొక్కుకుని జాతికి మూలస్రోతస్సు లెక్కడున్నాయి అని అన్వేషణ ప్రారంభించాం. గాంధీజీ భారతీయపద్ధతి కనుగుణమైన ఉపవాసాలు, మౌనవ్రతాలు, సత్యాగ్రహాలు, ప్రార్థన సమావేశాలవంటి తపస్సుల పద్ధతులను అనుసరించారు. ఆవిధంగా ప్రజల మనస్సుల్లో నిద్రాణమై ఉన్న సాంస్కృతిక వారసత్వంనుంచి గాంధీజీ నడిపిన జాతీయ స్వాతంత్ర్యోద్యమం బలంపుంజుకుంది. కాని దురదృష్టవశాత్తు వారి ఉద్యమంలో రాజకీయాల ప్రాబల్యమే అధికమైనందున, సాంస్కృతిక శక్తులు వెనుకబడ్డాయి. కాబట్టే రాజకీయ, ఆర్థిక, సామాజిక ఆదర్శాలు సజీవమైన ప్రాచీనధర్మంతో అంగాంగీభావాన్ని పొందలేకపోయాయి.

నిర్దిష్ట, నిరుష్ట గమ్యాలులేక ఆ యా రంగాలు కేవలం బ్రిటిష్ వ్యతిరేక భావనతోనే మలచబడ్డాయి. భావాత్మక జీవనపద్ధతిని వ్యతిరేకాత్మకపద్ధతి త్రోసిరాజంది. భావాత్మక విషయాలను స్వతంత్రభారతంలో నిర్ణయించు కుందాంలే అని నాటివారు వాయిదా వేసుకున్నారు. మానవుడు, జాతి, భగవంతుడు మొదలైన విషయాలను గురించిన అభిప్రాయాల్లో మహాత్మా గాంధీకి, వారితర్వాత భారతదేశ నేతృత్వం వహించిన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూకు ఎక్కడా పోలికలు లేవు. నెహ్రూ "డిస్కవరీ ఆఫ్ ఇండియా" (భారత సందర్శనం) చేసినా అతని మనస్సుమాత్రం విదేశాలవల్లనే ప్రభావితమైంది. మన సంస్కృతిలోని ఉత్తమత్వాన్ని ఆయన ఏనాడూ పూర్తిగా గ్రహించలేకపోయాడు. కనుక స్వతంత్ర భారతదేశంలో జాతీయ పునర్నిర్మాణానికి నెహ్రూ సూచించినది సమాజవాదసరళీసమాజం. ఇది మన మౌలికభావాలకు విరుద్ధమైనది. దీంట్లో వర్గసంఘర్షణ అంతర్నిహితమై ఉంది. విదేశీ అచ్చుల్లో జాతీయజీవనాన్ని రూపొందిస్తే అది స్వాతంత్ర్యం కాదు. స్వాతంత్ర్యంయొక్క పరమావధి ఇది :- 'మన జాతీయ జీవన ఆదర్శాలను - ధర్మ సంస్కృతులను - పరిరక్షించి ప్రచారం చేయటమే అసలు స్వాతంత్ర్యంయొక్క పరమలక్ష్యం అని మన చారిత్రక పరంపర చెపుతోంది' - (21వ అధ్యాయం) కానీ మనవారుమాత్రం 'స్వతంత్ర' లోని 'స్వ' అన్నది మరచిపోయి, పాశ్చాత్యుల నమూనాలుగానే తయారవుతున్నారు. అన్నిరంగాల్లోనూ - ముఖ్యంగా విద్యారంగంలో-'స్వ'ను పూర్తిగా మరచిపోయి మనవారు విఫలురయ్యారు. ప్రస్తుత విద్యావిధానం పరిశీలిస్తే మనవారికి హిందూ విద్యాపద్ధతియొక్క స్వరూప స్వభావాలు ఏమాత్రమూ పొడగట్టలేదని స్పష్టమౌతుంది.

రాజకీయరంగంలోకూడ మనవారి పరిస్థితి ఇట్లాగే ఉంది. మన జాతీయవారసత్వాన్ని వారు గ్రహించలేకపోయారు. జాతీయతను గురించి వారికి సరియైన కల్పనే లేదు అని స్పష్టపడుతుంది. కనుకనే గాంధీగారు కూడ ఆలీ సోదరులతోను, ఖిలాఫత్ ఉద్యమంలోనూ వ్యవహరించిన తీరులో

దోషం ఏర్పడింది. వీ రెంతప్రాకులాడినా, భారతదేశం విషయంలో హిందువులకు ఎట్టి భావం ఉందో అట్టి భావాన్ని ముస్లిములలో కలుగచేయ లేకపోయారు. వీరు ముస్లిములకు ఎన్నో హామీలు, మినహాయింపులు ఇచ్చినా గత చరిత్రలో శకులు, సిథియనులు, హూణులు మన జాతీయ జీవనంలో మిశ్రితమైపోయినట్లు ముస్లిములు కలిసిపోలేకపోయారు.

"మొగలులు, తురుష్కులవంటి విదేశీ తెగలు కత్తి ఝళిపించి మిమ్మల్ని ముస్లిములుగా మార్చారు. మీరు అట్టి దురాక్రమణకారులతో మానసికంగా పెనవేసుకొని, వారి అడుగుజాడలలో నడవాలని ఇంకా ఆలోచించటంలో అర్థంలేదు. అటువంటి వేర్పాటుధోరణులను మరచిపోయి ఈ రాష్ట్రజీవనంలో లీనంకావాలి". (10-2 అధ్యాయం)

ఇట్లా చెప్పలేకపోవటంవల్లనే దేశాన్ని విభజించుకోవటం జరిగింది. ఈ దోషాన్నే ఇంకా కొనసాగిస్తూ మరికొన్ని "పాకిస్తాన్" ల ఏర్పాటును ప్రోత్సహిస్తున్నారు. దీనికి సంబంధించినదే మరొక విషయంకూడా ఉంది. హిందుత్వమంటే వీరు పొరబడ్డారు; అది ఒక ప్రత్యేకమైన పంథా అనీ, ప్రత్యేకమైన ఆరాధనాపద్ధతులకు, సాంఘికాచారాలకు మాత్రమే పరిమిత మైనదని అనుకున్నారు. కానీ 'హిందూ' శబ్దం, జాతిసూచకం; 'ఇండియన్' అన్న శబ్దమూ, ఇదీ ఏకార్థప్రతిపాదకాలే. 'హిందూ'శబ్దం ప్రాక్చారిత్రక కాలంనుండి ఈ దేశంలో అభివృద్ధిపొందిన యావత్ సంస్కృతినీ, నాగరి కతనూ సూచిస్తుంది. గాంధీగారు రచించిన 'హింద్ స్వరాజ్' అన్న చిన్న పుస్తకంలో - హిందూజీవనవిధానాని కనుగుణంగా నేటి సమాజాన్ని తీర్చి దిద్దాలి అన్నభావన సూచనామాత్రంగా లభిస్తుంది. కాని నేడు ఆభావాలన్నీ తారుమారై విదేశీయమైన, పాశవికమైన, వర్గపోరాటంతోకూడిన మార్క్సు సిద్ధాంతాలచేత ప్రభావితమైన ఒక సాంఘికవ్యవస్థను నిర్మించటానికి మన నాయకులు ప్రయత్నం చేస్తున్నారు.

# పూజ్యశ్రీ గురూజీ జీవిత సంగ్రహం

పూజ్యశ్రీ గురూజీ భావాల క్రోడీకరణరూపమైన ఈ గ్రంథాన్ని చక్కగా అవగాహన చేసుకోటానికిగాను, ముందుగా వారి జీవితాన్ని గురించి తెలుసుకోవటం అవసరం. వారు తాము ప్రవచించిన ఆదర్శాలకు సజీవ మూర్తిగా ఆజన్మాంతం సంచరించారు; కాబట్టి వారి జీవితప్రవచనాలలో లక్ష్యలక్షణ సమన్వయం మనకు కనపడుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే శ్రీ గురూజీయొక్క పవిత్రజీవనాన్ని సంక్షిప్తంగా ఇచ్చట పరిచయం చేయటం సముచితమని భావిస్తున్నాం.

పూజ్యశ్రీ మాధవ సదాశివ గోళ్వల్కర్ శా॥ శ॥ 1827 మాఘ బహుళ ఏకాదశి (క్రీ॥ శ॥ 1906 ఫిబ్రవరి 8) నాడు నాగపూర్‌లో పుణ్య దంపతులైన లక్ష్మీబాయ్, సదాశివ బాలకృష్ణ గోళ్వల్కర్‌లకు జన్మించారు. తొమ్మండుగురు బిడ్డలలోనూ, ఆ దంపతులకు దక్కినది వీరొక్కరే. పూవుపుట్టగనే పరిమళించేట్లు భవిష్యత్తులోని ప్రాభవం బాల్యంలోనే వారిలో ప్రభవించింది. భగవద్గీత, బైబిలు మొదలైన ధర్మగ్రంథాలను అతిబాల్యంలోనే ఆపోసన పట్టి అధ్యాపకులనే ఆశ్చర్యపరచిన అసమాన ప్రతిభ వారిది. చదువుసంధ్యల్లోను, సాము గరిడీల్లోనూ ఆరితేరి 1922 లో మెట్రిక్ పరీక్షలో వారు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై నాగపూర్‌లోని హిస్లాప్ కాలేజీలో చేరారు. ఇంటర్మీడియట్ పూర్తి అయినపిదప 1924లో కాశీలోని హిందూ విశ్వవిద్యాలయంలో చేరి శ్రీ మదనమోహన మాలవీయ పండితుల సన్నిధిలో జీవనాదర్శాల నధ్యయనం చేస్తూ, 1928 లో యం. యస్‌సి. పట్టాను పొందారు. తరువాతకొద్దికాలం మద్రాసులో పరిశోధనకొనసాగించారు. 1930 లో కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా చేరారు. వారి విద్వత్తును, ఆదర్శపూర్ణమైన, ఆత్మీయతాయుక్తమైన నిరాడంబరజీవితాన్ని

వచ్చిన తొలిదినాల్లో మన హృదయాన్ని కలచివేసే సంఘటనలు అనేకం జరిగాయి. అనేక ప్రాంతాల్లో ప్రజల మానప్రాణాలు ప్రమాదానికి గురి అయ్యాయి. ఆ సందర్భంగా శ్రీ గురూజీ యావద్భారతం పర్యటించారు; సమయోచితమైన సందేశాన్నిచ్చి ప్రజలహృదయాలకుఆశ్వాసనఅందించారు. దేవ దుర్లభమైన కార్యకర్తాగణం వారి నేతృత్వంలో విజృంభించి సంఘ శాఖలను నలుగడల వ్యాపింపచేసింది. ఆ విధంగా ఆనాటికి సంఘం విరాట్ రూపాన్ని సంతరించుకుంది.

పెరుగుతున్న సంఘశక్తిని చూచి కొందరు కళ్ళలో నిప్పులు పోసుకున్నారు. 1947 లో కాంగ్రెసుపార్టీ మీరట్‌లో జరిగిన సమావేశంలో సంఘాన్ని నిషేధించుమని కోరుతూ ఒక తీర్మానంగూడా చేసింది. అంతలోనే అశనిపాతం; మహాత్మాగాంధీ హత్య జరిగింది. దానితో సంఘానికెట్టి సంబంధం లేకపోయినప్పటికీ ఆ నేరాన్ని సంఘంపై రుద్దటానికి పెద్దపెట్టున ప్రయత్నంజరిగి, ప్రభుత్వం సంఘాన్ని నిషేధించింది. పూజ్యశ్రీ గురూజీనీ, వేలకొలది సంఘ కార్యకర్తలనూ నిర్బంధించింది. ప్రభుత్వం తమపై వేసిన అభాండాలకు, చేసిన అన్యాయాలకు ప్రతిచర్య చేయాలని శక్తి ఉత్సాహాలతో ఉద్రేకపడుతున్న లక్షలాది యువకార్యకర్తలను జాతిహితంగోరి ఒక్కమాటతో కట్టివేశారు వారు; మహత్తర వ్యక్తిత్వము. నేతృత్వము వారి సొత్తు.

అన్యాయంగా సంఘంపై విధించిన నిషేధాన్ని తొలగింప చేయటానికి శ్రీ గురూజీ శతథా ప్రయత్నించారు. ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. రాయబారాలు నడిపారు. అన్ని ప్రయత్నాలు వ్యర్థమై చివరకు స్వయంసేవకులు దేశం కనీవినీయెరుగని శాంతియుత అహింసాత్మక సత్యాగ్రహంచేశారు. గత్యంతరంలేక ప్రభుత్వం దిగివచ్చింది. నిర్నిబంధంగా నిషేధం తొలగించింది. పూజ్యశ్రీ గురూజీతోబాటు కార్యకర్తలందరినీ విడుదలచేసింది.

వెనువెంటనే వారు యావద్భారతం పర్యటించారు. ఎక్కడచూచినా లక్షలాదిప్రజలు వారికి బ్రహ్మాండమైన స్వాగతసుమాంజలులు సమర్పించారు.

ప్రభుత్వాధికార ప్రాబల్యం లేకుండా, ఆవిధంగా లక్షలాది జాతీయులను ఏకత్రితంచేసి, తన అమృతవాక్కులతో మంత్రముగ్ధులనుగా చేయజాలినవ్యక్తి ఆనాడు సమాజంలో మరొకరులేరని, దేశీయ, విదేశీయ పరిశీలకులెందరో ప్రకటించారు.

సంఘం ఆకాంక్షించే భవిష్యద్భారత సర్వాంగీణ ఉన్నతిని సాధించేందుకు వివిధరంగాలలో ప్రవేశించి కృషిచేస్తున్న కార్యకర్తలనేకులకు వారు స్ఫూర్తికేంద్రంగా ఉంటూ మార్గదర్శనం చేశారు. రైలుపెట్టే వారి ఇల్లు; నిరంతర పర్యటనల్లో, సమయ సమయాల్లో సముచితమైన జాగృతిని సమాజంలో కల్గిస్తూ జీవించారు వారు.

శ్రీ గురూజీ సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. అంతటి చదువరి అరుదు. అంతటి ధారణాశక్తిగలవారు మరింత అరుదు. అన్నిప్రాంతాల్లోనూ పేరు పేరున ఆత్మీయతతో వారివలె వేలకొలదివ్యక్తులను సంబోధించి ప్రసంగించ గలవారుకూడ అరుదే. వారు పర్యటించినంతగా యావద్భారతాన్ని ఏ ఒక నాయకుడు పర్యటించలేదు. వారు హిందీ, ఇంగ్లీషు, మరాఠీ భాషల్లో అనర్గళంగా, అమృతోపమంగా ప్రసంగించగలరు. యావద్భారతహిత దృష్టితో సమస్యలన్నిటినీ విశ్లేషణచేసి సముచిత పరిష్కార మార్గాన్ని సూచించటంలో వారికి వారే సాటి.

నిరంతరకృషివల్ల, నిర్విరామ పర్యటనలవల్ల వారి పార్థివశరీరానికి ఒక మహాభయంకరమైన ఆఘాతం తగిలింది. పుట్టకురుపు నివారణకై వారికి శస్త్రచికిత్స జరిగింది. అంతటి చికిత్సాసమయంలోగూడ, రోగవ్యాధీ, రోగచికిత్సా కూడ అనుభవిస్తోంది శరీరమేగాని, 'నేను'మాత్రం కాదన్నట్లే వారుండేవారు. వారిలో ఎప్పటి ఉల్లాసమే, స్ఫూర్తిప్రదమైన మార్గదర్శనమే కనిపించేది. పార్థివశరీరంతో పవిత్రభారతభూమిని పునీతమ్మొనరించిన ఒక దివ్యతేజం 1973 జూన్ 5 వ తేదీన (జ్యేష్ఠ శుద్ధ పంచమి) దివికి చేరబోయింది.

ఈ విధంగా 33 సంవత్సరాల సుదీర్ఘకాలం హైందవసమాజ సంఘటనాకార్యానికి నేతృత్వం వహించినవారు, మనలను వీడిపోతూ, మనకు మార్గదర్శకాలుగా మూడులేఖలను వ్రాసిపోయారు.

(మూడు లేఖలు చతుర్థభాగం చివర ఇవ్వబడ్డాయి)



# జగత్కల్యాణకార్యం

ఏ ఉద్యమం చేపట్టినా, దానికి ఒక విశాల భూమిక ఉండాలనీ, ప్రపంచ ప్రజలందరికీ మేలుకూర్చే ఉదాత్తవసుధైకభావన ఉండాలనీ, సంకుచితాలైన దేశం, జాతి, మతం మొదలైన అడ్డుగోడలకు దాంట్లో ఆస్కారం ఉండరాదనీ, మన దేశంలో నేడు అనేకులు భావిస్తున్నారు. ఖండాంతరవేధులు, వ్యోమవాహనాలు వాడుకలోనికివచ్చిన ఈ నవీనశకంలో దూరాలు అంతరించి పోయాయనీ, దేశాల సరిహద్దుల మాట కర్థంలేదనీ, యావత్ప్రపంచం కుంచించుకుపోయిందనీ అంటున్నారు. దేశం, జాతి మొదలైన ఆలోచనలకు కాలదోషం పట్టిందని, విశ్వసమైక్యభావనయే మన కార్యక్రమాలకు స్ఫూర్తినివ్వాలని భావిస్తున్నారు. అంతర్జాతీయనినాదాన్ని తారకమంత్రంగా వాడుకుంటున్న ఈనాటి క్రొత్తవాదాలు మాత్రమే మనం ఆశించే ప్రపంచసమైక్యం అనే గమ్యానికి మనలను చేర్చగలవని వారు తీర్మానిస్తున్నారు.

అయితే హిందువుల జాతీయజీవనాన్ని మరల సుసంఘటితం చెయ్యాలని సంఘం చేపట్టినపని, మానవశ్రేయస్సు, విశ్వసమైక్యభావనలకు ఎంతవరకు దోహదకారిగా ఉంది అనే ప్రశ్న మనకు ఈనాడు సహజంగా ఎదురవుతుంది.

## అగ్రతాంబూలం

విశ్వసమైక్య శ్రేయస్సులను దృష్టిలో ఉంచుకొని, ఆలోచించిన వారి కోవలో ఈనాటి మేధావులు మొదటివారుమాత్రం కారనేది నిస్సందేహం. ఈ ముఖ్యవిషయాన్ని గురించి అతిప్రాచీనకాలంలోనే – అంటే నిజానికి నవీనయుగ మనబడేది ఆరంభంకావటానికి పూర్వమే–ఈదేశంలో జన్మించిన జ్ఞానులు, ద్రష్టలు ఎంతో గాఢంగా తరచి చూచారు. బాధాకలహాల ఛాయలుగూడా సోకని ఒకే విశాల విశ్వంలో సర్వమానవ సమైక్య జీవనాన్ని సందర్శించాలనే ఆదర్శం అనాదికాలంనుంచీ మన హృదయాలను ఉబ్బితబ్బిబ్బు లూగిస్తూనే ఉండేది.

"సర్వేఽపి సుఖినస్సన్తు సర్వే సన్తు నిరామయాః"
(అందరు సుఖముగా సుందురుగాక! ఎవ్వరికి క్లేశములు లేకుండునుగాక!)

ఇదే యుగయుగాలుగా మన ఏకైక ప్రార్థన.

నేటి పాశ్చాత్య ప్రపంచం "అధిక సంఖ్యాకులకు అధికలాభం" అనే నినాదాన్ని మించి పైన ఆలోచించలేని స్థితిలో ఉండగా ఏ ఒక్క మానవుడుగాని – అంతేకాదు, ఏ ఒక్క ప్రాణిగాని దుఃఖిస్తే మనం భరించ లేదు. 'సమస్త జీవులకు సంపూర్ణకల్యాణం' అనేదే మన ముందున్న ఉజ్జ్వలమైన ఆదర్శం.

## రెండు దృక్పథాలు

మరి, నేటి ప్రపంచస్థితిలో ఎక్కడ చూచినా, వైరుధ్య వైషమ్యాలు మానవసమాజాన్ని సర్వవిధాలా ఛిన్నాభిన్నం చేస్తున్నాయి అనే కఠోర సత్యం మనకు కనబడుతుంది. ఈనాడు మానవ సమాజమంతా అనేకంగా చీలికవాలికలై, జాతులని, దేశాలని, ప్రత్యేకమయిన పేర్లు పెట్టుకొని ప్రత్యేకమైన ముఠాలుగా ఏర్పడి తమతమ సంకుచితస్వార్థప్రయోజనాల

సాధనకుమాత్రమే అంకితం ఐపోతున్నాయి. ఆవిధంగా కేవలం తమ స్వార్థ ప్రయోజనాలకై మాత్రమే పనిచేసే ప్రజాసమూహాలు ఎక్కడున్నా పరస్పర సంఘర్షణ ఉండితీరుతుంది అనేది అందరికి అనుభవంలోని విషయమే. అట్టి సంఘర్షణ కొనసాగినంతకాలం మానవ సమైక్యత, సంక్షేమాలు సాధ్యం కావనేది గూడా సుస్పష్టమే. స్పర్ధలు, యుద్ధాలు కారణంగా నేడు జరిగిన మారణహోమం, దుర్భరపరిణామాలూ ఎంతోమంది మేధావులను ఆలోచనా మగ్నుల్ని చేశాయి. కేవలం తమతమ స్వార్థప్రయోజనాలకే దోహదంచేసే జాతీయభావమే ప్రపంచ సమైక్యత, మానవ సంక్షేమాల సాధనకు అడ్డుతగులుతున్నదని అట్టి మేధావులనిర్ధారణ. అందుచేతనే వారు ప్రపంచ వ్యాప్తంగా మానవుల మనస్సులనుండి ఈ జాతీయ భావాన్ని మటుమాయం చేయాలి అని ప్రకటిస్తూ ఉంటారు. అంతర్జాతీయతయే తనకు మూలాధారమని చెప్పుకొనే సామ్యవాద భావనాసరళియొక్క ధోరణి ఇదే.

జాతీయభావం చిరంతనమై గాఢంగా వేళ్లూని నిలచిఉంది, దానిని పెకలించివేయడం అసంభవం అనే మరియొక ఆలోచనాసరళికూడా ఇంకొక ప్రక్కనఉంది. ఈ జాతీయ భావాలను నిర్మూలించడంవల్ల, నిష్ఠతో వ్యక్తులు కొనసాగించే కృషికి ప్రేరణ నశించిపోతుందని, అంతర్జాతీయ సామ్యవాదాన్ని అలవరచుకోవడానికి జాతీయ భావాన్ని విడనాడాలని ప్రయత్నంచేసిన సోవియట్‌రష్యా గూడా అచిరకాలంలోనే స్వానుభవం ద్వారా గ్రహించింది. సోవియట్ రష్యా విప్లవంయొక్క తొలిఊపులో కొంతవరకు భౌతికాభివృద్ధిని సాధించింది; సందేహం లేదు. తొలి సప్తవర్ష ప్రణాళికలు కొన్ని కొంతవరకు విజయవంతమయ్యాయి. కాని రానురాను ప్రజల్లోని ఉత్సాహం సన్నగిల్లింది; కృషి చేయాలనే ప్రేరణకూడా వారిలో క్రమంగాఅడుగంటింది; తుపాకి గురిపెట్టి బలవంతంగా కార్మికులచేత పెద్దపెద్ద కర్మాగారాలలో పని చేయించవలసి వచ్చింది. అంతేకాదు. రెండవప్రపంచయుద్ధసమయంలో హిట్లరు పంపిన 'టాంకులు' రష్యా భూభాగంపై ఎదతెగక ముందుకు చొచ్చుకొనివస్తుంటే "అంతర్జాతీయత"

"కమ్యూనిజం" వంటి ఈ నినాదాలు రష్యా పౌరులను ఉత్తేజ పరచలేకపోయాయి. ఈ సంఘటన రష్యా నాయకులకు కనువిప్పు కల్గించింది; మాతృభూమిపట్ల, మహావీరులైన తమ పూర్వీకులపట్ల రష్యా ప్రజల్లో తరతరాలుగా నెలకొనిఉన్న భక్తివిశ్వాసాలను ఆవాహనచేసి వారిలో నిద్రాణమైఉన్న దేశభక్తిభావనలను మేలుకొలపడం అత్యవసరం ఐంది. మాతృభూమి, సమాజం, సంప్రదాయం - వీటిపట్ల శ్రద్ధాభక్తులను ప్రత్యక్షానుభవంలోకి తేగల్గేది జాతీయభావం మాత్రమే అనీ, అది మాత్రమే వ్యక్తిలో త్యాగాన్నీ, సేవాభావాన్నీ ప్రేరేపించగలదని పై ఉదాహరణలను బట్టి రూఢి అవుతున్నది.

## విఫల ప్రయత్నాలు

కనుక జాతీయభావం నశించేదీకాదు,నాశనంచేయటానికి ప్రయత్నించనూ కూడదు అని నిర్ణయించగలం. అయితే జాతీయాకాంక్షలకు, విశ్వసంక్షేమానికి సామరస్యం సాధించవలసిన సమస్య ఒకటి ఎదురౌతుంది. ఈదృష్టితో కాలచక్రగమనంలో ఆయాసమయాల్లో వివిధాలైన సామరస్య ప్రయత్నాలు జరిగాయి. చిన్నచిన్న జాతులను ఒకే సామ్రాజ్యంలో అంగాలుగా చేయడం ద్వారా వాటిమధ్య స్పర్ధలను నిర్మూలించటం సాధ్యం అవుతుందనీ, విశ్వసంక్షేమసాధనలో అట్టిది ఒక పెద్దప్రయత్నం అనీ,సామ్రాజ్యవాదులు ఒకొ్కక్కసారి వాదించేవారు. కాని కేవలం స్వీయాధిక్యాన్ని పెంచుకోవటమే సామ్రాజ్యాల మౌలికలక్ష్యం కనుక, తమను అణగద్రొక్కి కొనసాగిస్తున్న దోపిడికి వ్యతిరేకంగా సామంతదేశాలు వాటిపై తిరుగుబాటు జరపటానికి అవి అవకాశం కలిగించాయి. అందువల్ల సామ్రాజ్యవాదం ప్రపంచజాతుల మధ్య సంఘర్షణలను నివారింపలేకపోయింది.

యుద్ధాలను నివారించి ప్రపంచసమైక్యాన్ని సాధించాలని జరిపిన యత్నాలలో ప్రథమప్రపంచసంగ్రామానంతరం ఏర్పడిన నానాజాతిసమితి

కూడా ఒకటి. కాని పుట్టిన రెండు దశాబ్దాలలోనే అది విశృంఖలమైన జాతీయదురాశలకు, వాటివల్ల కలిగిన సంఘర్షణల తాకిడికి తట్టుకోలేక ఛిన్నాభిన్నమయింది.

గతంలో వచ్చిన యుద్ధాలన్నింటికంటె భయంకరమైన ఒక మహా యుద్ధం మళ్లీ దాపురించింది; మారణహోమధూమంతో భూమాతముఖం మ్లానం ఐంది. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఏర్పడిన ఐక్యరాజ్యసమితి అయినా మొదటిదానికంటె మెరుగుగా నడవడంలేదు. న్యాయాన్ని సమకూర్చటానికిగాని, తప్పుచేసిన సభ్యదేశాలను మందలించటానికిగాని, తద్వారా వివిధజాతుల మధ్య సగౌరవమైన సామరస్యాన్ని ఏర్పరచటానికిగాని ఈ ఐక్యరాజ్యసమితికి శక్తిలేదని, కాశ్మీర్ సమస్య విషయంలో మన అనుభవమే చెప్తుతుంది. రానురాను జాతులమధ్య పరస్పర సంఘర్షణలకు అది ఒకరంగంగా మారింది. శక్తిమంతాలైన జాతులు, తమతమ అధికారాన్ని విస్తరింపచేసుకోవాలనే లక్ష్యంతో ఆ వేదికను స్వాధీనపరచుకోవటానికి యత్నిస్తున్నాయి. మూడవప్రపంచయుద్ధమనే కారుమబ్బు మళ్లీ లోకాన్ని క్రమ్ముకొని వస్తున్నది. అదేగనుకవస్తే తృటిలో ఈనాటి నాగరికత సమూలంగా నాశనమైపోతుంది.

ప్రపంచ జాతులు మానవజాతి సంక్షేమాన్ని మనసులో ఉంచుకొని సన్నిహితం కావడానికి సుసిద్ధంగా లేవని దీనినిబట్టి మనకు తెలుస్తూనే ఉంది. పైగా జాతులయొక్క ప్రత్యేకతలు మరింత బలపడుతున్నాయి; వాటి దురాశలు మరింత పదనెక్కుతున్నాయి. ఈ వసుధారంగం మీద సరిక్రొత్త జాతులుకూడా సాక్షాత్కరిస్తున్నాయి. భూతలమంతా జాతులమధ్య సంఘర్షణలతో నిండిపోయింది.

క్లుప్తంగా చెప్పాలంటే – జాతీయతను నాశనం చేయగల్గటం అసంభవం; జాతుల ఆకాంక్షల మధ్య సామరస్యం సాధించేటందుకు ఇంత

వరకు జరిగిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ప్రపంచమంతాఅణుమారణ హోమంలో ఆహుతి అయిపోయేటట్లున్నది. ఈస్థితిలో మానవజాతి విముక్తికి మార్గమేది ? ఈ ప్రశ్నకు సమాధానం మాత్రం దొరికేటట్లులేదు. యావత్ ప్రపంచమేధావులూ ఇదే సమస్యతో సతమతమవుతున్నారు.

## అంతరంగిక సామరస్యం

అయినప్పటికీ, మనం – అంటే హిందువులం – ఒక పరిష్కారాన్ని సూచించగలం. అయితే అది భౌతికవాదంపై ఆధారపడినదిమాత్రం కాదు. ఇంతవరకు సాగిన ప్రయత్నాలు, జరిగిన ప్రయోగాలు – అన్నీ భౌతికవాదం లోంచి పుట్టుకొనివచ్చిన వాదాలమీద ఆధారపడ్డవే. ఐతే "అసలు మానవులు ప్రపంచసమైక్యత, మానవ సంక్షేమాలను ఎందుకు కోరుకోవాలి ? ఒక మానవుడు తోటిమానవునితో ఘర్షణకు దిగితే ఇతరులు ఎందుకు బాధపడాలి? అసలు ఒకరినొకరం మనమెందుకు ప్రేమించుకోవాలి ?" – ఇట్లాంటి ముఖ్యమయిన మౌలిక ప్రశ్నలకు భౌతికవాదం ఏ విధమైన సమాధానం ఇయ్యలేదు. భౌతికవాద దృష్టిలో : మనలో ప్రతిఒక్కరికీ ప్రత్యేకమైన అస్తిత్వం ఉన్నది. ఎవరికి వారమే; ఎవరి ప్రత్యేకత వారిదే; మనలోమనకు అనుబంధం, ఆపేక్ష ఏర్పడే అవకాశంలేదు. యావత్తు మానవజాతియొక్క క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని తమ స్వార్థం విశృంఖలవిహారం చేయకుండా తమ్ముతాము నిగ్రహించుకోగల సంయమనశక్తికూడా వ్యక్తుల్లో ఉండదు.

విశ్వశ్రేయస్సుకై ఏ వ్యవస్థను నిర్మించుకొన్నప్పటికీ, దానికై కృషి చేసేవారిలో తమ తోటిమానవులపట్ల సహజసిద్ధమైన ప్రేమాభిమానాలు ఎంతవరకు ఉంటాయో విజయంకూడా అంతమేరకే లభిస్తుంది. వారు వ్యక్తి స్థాయిలోను, జాతి స్థాయిలోను తమతమ ప్రవర్తనలను మానవ కల్యాణానికనువుగ మలచుకొనేందుకు అట్టి ప్రేమాభిమానాలే దోహదం చేస్తాయి. అటువంటి ప్రగాఢమైన ఆకాంక్ష వారిలో లేకపోతే, వారు ఏ పథకం

చేపట్టినా-దాని ఉద్దేశ్యం ఎంత మంచిదైనాసరే - అధికారదాహంతో నిండిన జాతులు తమ స్వీయాధిక్యాన్ని పెంచుకొనేందుకు చేసే ప్రయత్నంలో మరియొక అందమైన ముసుగుగానే అది మిగిలిపోతుంది. అనాదిగా మానవ చరిత్ర దీన్నే ఋజువుపరుస్తోంది.

అందుచేతనే మన ప్రాచీన హిందూతత్త్వవేత్తలు తమ దృష్టిని భౌతికతను అధిగమించిన ఒక ఉన్నతస్థాయిలో ప్రసరింపచేశారు. భౌతిక విజ్ఞానానికి అతీతమైన జీవాత్మయొక్క లోతులను తరచిచూచి దానిలోని రహస్యాలను అవగాహన చేసుకొని ఈ సృష్టి అంతటా ఒకే పరతత్త్వం వ్యాపించి ఉందని కనిపెట్టారు. దాన్ని మనం ఆత్మ, దేవుడు, సత్యం, సత్ అసత్ - అంటూ ఏ పేరుతో వ్యవహరించినప్పటికీ, అదే (పరతత్త్వం) సమస్తంలోనూ ఉండే ఏకైక మహోత్తమసామాన్యతత్త్వం. ఎదనెద కలిగే ఈ ఏకాత్మతాసాక్షాత్కారమే ఇతరుల సుఖాన్నిగూర్చి కృషి చేయాలనే ప్రేరణ మనలో కలిగిస్తూ ఉంటుంది. నాలోని 'నేను' ఇతర జీవుల్లోని 'నేను' ఒక్కటే కాబట్టి, నా సుఖదుఃఖాల విషయంలో నాలోని 'నేను' ఎట్లా వ్యవహరిస్తుందో, అట్లాగే ఇతరుల సుఖదుఃఖాల పట్లగూడ ఆ 'నేనే' ప్రవర్తింపజేస్తుంది. నిజానికి ఈ అంతర్గతమైన ఏకాత్మతా సాక్షాత్కారమే మానవ సమైక్య సౌభ్రాత్రాలకై మనకు సరియైన ప్రేరణ యిస్తుంది.కాబట్టి ఇట్టి ఆంతరంగికసంబంధం స్వానుభవంలోకి మానవసమాజం తెచ్చుకోగలిగినంతమేరకు మాత్రమే విశ్వసమైక్యత, మానవసంక్షేమాలు వాస్తవాలుగా ఈ లోకంలో సాక్షాత్కరించగలవు, భౌతికవాదంనుండి జనించే తీవ్రకాంక్షలనన్నింటినీ, కలహాలనన్నింటినీ అదిమాత్రమే అదుపులో ఉంచగలదు. అదే మానవుని ఆలోచనాపరిధులను విశాలం చేసి వ్యక్తిగతమైన జాతీయమైన ఆకాంక్షలను మానవజాతిసంక్షేమంతో చక్కగా సమన్వయం అయ్యేట్లు చేయగలదు.

## సరియైన మార్గం

అయితే మరొక ప్రశ్న ఎదురవుతుంది. సంకీర్ణమైన మానవ సమాజ జీవనవ్యవస్థలో ఏవిధంగా ఈ ఆంతరికమైన ఏకాత్మత వ్యక్తమవుతుంది? వివిధ జాతుల విశిష్టలక్షణాలను తొలగించి అన్నిజాతులను ఒకే అచ్చులో పోసినట్లుగా చేస్తే వ్యక్తం అవుతుందా? లేక వివిధ ప్రజా సమూహాలను దగ్గరకు చేర్చి అవి తమతమ జాతీయవ్యక్తిత్వాలను నిలుపుకుంటూనే మానవజాతిలోని ఆంతరంగిక సమైక్యతను గుర్తించేట్లు చేసి, అన్నిటినీ స్నేహితులుగా చేయడంలో వ్యక్తం అవుతుందా?

ఈ విషయంలోకూడా మన తత్త్వవేత్తలు మానవజాతియొక్క నిజమైన ఆనందానికి ఒక నిర్దిష్టమార్గాన్ని సూచించారు. లోకంలో ఒక వ్యక్తికి ఉన్నట్లే, వ్యక్తుల సమష్టి స్వరూపమైన ఒక జాతికిగూడా కేవలం ఆ జాతికి చెందిన ఒకానొక ప్రత్యేకవ్యక్తిత్వం ఉంటుంది. భూగోళంలోని ప్రతిభాగంలోను వ్యక్తులకు, జాతులకు విలక్షణస్వరూపస్వభావాలు ఉంటాయి; ఈ విశ్వరచనా ప్రణాళికలో, ప్రత్యేకస్థానాలూ ఉంటాయి. వివిధ మానవ సమూహాలు తమతమ స్వభావాలకు అనుగుణంగా విశిష్టపథాల్లో ఒకే లక్ష్యంపైపు పురోగమిస్తున్నాయి. అందుచేతనే ఒకవ్యక్తి లేక సమూహంయొక్క విశిష్టలక్షణాలను నాశనంచేయటమంటే ప్రకృతి సిద్ధమైన సామరస్యంలోని మధురిమను పాడుచేయటమేగాక, తమ స్వత్వ వ్యక్తీకరణలో అవి పొందే ఆనందాన్నిగూడా నాశనంచేయటమన్నమాట. తద్వారా బహుముఖమైన మానవజీవనపరిణామంగూడా కుంటుపడుతుంది.

తన విశిష్టలక్షణాన్ని తనలో పెంపొందించుకోవటం ద్వారానే ఒక వ్యక్తి తన సంపూర్ణస్వరూపాన్ని వికసింపజేసుకొని సుఖసంతోషాలను అనుభవిస్తున్నాడనేది సాధారణ అనుభవంలోని విషయమే. అందుచేత వివిధములైన విశిష్టలక్షణాల మధ్య సామరస్యాన్ని సాధించే ఒక

ప్రయత్నమే ప్రపంచభావనాసరళికి మనవారొసగిన ప్రత్యేకమైన కానుక. మానవజాతి సమైక్య, సంతోష, సంవర్ధనాలకు దోహదకారియైన ఈ మూల సూత్రాన్ని వారు చక్కగా అవగాహన చేసుకొన్నారు. మన జాతీయ స్వభావానికి లక్షణంగా తరచు చెప్పే - భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించడం-అనేది దీనివల్ల మనకు అలవడింది. ఒక మాటలో చెప్పాలంటే జాతులయొక్క సామరస్యపూర్ణసమ్మేళనాన్ని సాధించటానికే మన కృషి ; వాటిని నాశనం చేయటానికి కాదు. రాజ్యాలను రూపుమాపి, మానవులందరినీ ఒకే ఒక భౌతికస్థాయి గలవారినిగా కుదించి వారి వారి వ్యక్తిగతమైన సామాజికమైన ప్రత్యేకతలను తుడిచిపెట్టే ఆలోచన మనది కాదని వేరుగా చెప్పనక్కరలేదు. స్వాయత్తాలూ, స్వయంసత్తాకాలూ ఐన అనేకజాతులు ఒక సమాఖ్యగా ఏర్పడి, ఒకే కేంద్రానికి అవన్నీ అనుబంధాలుగా ఉండే వసుధైకప్రభుత్వం రూపొందడమే మన తలంపు.

## పవిత్ర ధర్మం

కాబట్టి హిందూసమాజాన్ని దాని విశిష్ట జాతీయ స్వభావాని కనుగుణమైన ఒరవడిలో మరల సంఘటితం చేయాలని సంఘం స్వీకరించిన ఉద్యమం నిజమైన భారతీయ పునరుజ్జీవనానికి త్రోవదీసే ఒక మహాయత్నం మాత్రమే గాక, ప్రపంచసమైక్యత, మానవసంక్షేమాలకై కనేకలలు యథార్థాలు కావటానికి ఒకమెట్టుగాకూడా పనిచేస్తుందనేది నిస్సంశయం. ఎందుచేతనంటే సృష్టి అంతటిలో నిండియున్న ఒకే అంతరాత్మయొక్క ఉనికిని గుర్తించటమొక్కటే, సర్వమానవ సంక్షేమానికి కృషి చేయాలనే పవిత్ర ప్రేరణను మానవుని మనస్సులో కలిగిస్తుంది; భూమిపైనున్న ప్రతివిశిష్టజీవి-ఎంతటి అల్పజీవి అయినాసరే – తన స్వరూపాన్ని సంతరించుకొనేందుకు పరిపూర్ణమైన స్వేచ్ఛను, అవకాశాన్ని ఇదే కల్పిస్తుంది. హిందువులయొక్క ఈ భవ్యమైన విశ్వసమైక్యభావన మాత్రమే సర్వమానవ సౌభ్రాత్రానికి పునాది కాగలదు. ఇది సువిదితమే.

సామ్రాజ్యమే 700 సం॥ పాటు-చైనీయుల విస్తరణకాంక్షకు సమర్థమైన అడ్డుగోడగా నిలిచింది.

ఇన్ని శతాబ్దుల కాలంలో, ఆయా దేశాల్లోని స్థానికులు, విప్లవాలు లేపటంగాని, అధికారంలో ఉన్నవారిని నిర్మూలించటంగానీ జరుగలేదు. విదేశీయులు, విదేశీసంస్కృతులు వీసమెత్తు పెత్తనం చెలాయించినా దోపిడీ కొనసాగించినా, తప్పనిసరిగా అట్టివిప్లవాలు ఏ దేశంలోనైనాసరే సంభవించి తీరుతాయి. కానీ అట్టి వేమీ అచట జరుగలేదు సరిగదా, వారు మనపట్ల కృతజ్ఞులుగా ఉన్నారు. వారు మనజాతిని ఆరాధించారు. పవిత్ర గంగాతీరంలోనే తమ నశ్వరశరీరాలను విసర్జించాలని ఉవ్విళ్ళూరారు. విస్తరణదాహంగల ఇస్లాం, క్రైస్తవం, ఇక ఇప్పుడు కమ్యూనిజం ఇంకా ఇతరదేశాల్లో జన్మించిన అనేకమంది విశ్వవిజేతల చేతలచే చరిత్ర పుటలు రక్తసిక్తాలయ్యాయి. వాటితో పోలిస్తే మనచరిత్ర కొట్టవచ్చినట్లు విలక్షణంగా కన్పిస్తుంది. మనం అడుగుపెట్టిన ఆయా దేశాల్లో ఇప్పటికీ అనేకమంది ప్రజల మౌలిక జీవనవ్యవస్థ 'హిందూత్వం'తో నిండి ఉంది. వారు హిందువులపేర్లు పెట్టుకొంటారు. ఆయాదేశాల్లో ప్రజలు నేడు మతరీత్యా చాలామంది ముస్లిములైనప్పటికీ తాము హిందూపరంపరకు చెందినందుకు గర్వపడే వ్యక్తులుగా మనకు కనిపిస్తారు.

విశ్వభావనాగగనపథంలో ఒక్కొక్కరు ఒక్కొక్క నక్షత్రంలా మిలమిల మెరసిన అనేకమంది మహాత్ములను, పరంపరగా తరతరాలలో ప్రసవించింది మన సమాజం; తోటి మానవుల సుఖదుఃఖాలతో మాత్రమేగాక జడ చేతన వస్తుజాలాలతో గూడా తాదాత్మ్యానుభూతిని పొందజాలిన రామ కృష్ణపరమహంస వంటి తేజోమూర్తుల పరంపరను నేటికీ సృష్టిస్తూనే ఉంది. కొరడాదెబ్బలు తినే ఆవును చూచినప్పుడు ఆయన బాధతో ఏడ్చాడు; ఆయన వీపుపై ఎర్రని వాతలు తేలాయి. వేరొకసారి పచ్చికబయలులో మేసే ఎద్దుయొక్క గిట్టగుర్తుగల గాయం ఆయన గుండెపై పడింది.

ఆధ్యాత్మికవిజ్ఞానాన్ని తాము సాధించి, ప్రబోధించిన మన మహాగురువుల తాదాత్మ్యస్థితి ఇటువంటిది.

## తొలిమెట్టు

కాని ఇంతటి ఉజ్జ్వలమైన పరంపరను ఈనాడు ఈ సంస్కృతీ సంతానమే నిరాకరిస్తోంది; నిరసిస్తోంది. మన ప్రాచీన ఆదర్శాలను, సంప్రదాయాలను చులకనచేయటం, మన సమాజాన్ని నూతనమైన ఇతర వాదాల అచ్చుల్లో పోతపోయాలని చెప్పుకోవటం, ఈ దినాల్లో ఒక హేలావిలాసమయిపోయింది. కాని మన ఆంతరంగిక విశిష్టతను సహజంగా వికసింపచేసుకోటంపట్ల శ్రద్ధ చూపక మన జీవనవ్యవస్థ స్థానంలో వేరొక వ్యవస్థను పాదుకొల్పాలని చేసే ప్రయత్నాలు మన విచ్ఛిన్నానికి మాత్రమే దారితీస్తాయి. దీనియొక్క భయంకర పరిణామాల ఛాయలు మన సమాజంలో అప్పుడే కనపడుతున్నాయి. అసంఘటితము, ఆత్మవిశ్వాసరహితము అయిన మన సమాజం, వివిధాలైన వాదాలయొక్క, మతాలయొక్క ముసుగుల్లో పొంచి ఉండి, మింగజూచే దోపిడీగాండ్రకు సులువుగా బలి అయింది. ఆత్మనిందల కలవాటుపడి, అన్నివిధాలా విఘటన విచ్ఛిన్నతలకు గురియై బలహీనపడి, ప్రతివిషయంలోను, లోకంలోని ప్రతి బూచివాని కాలితాపులకు గురియై అవమానం పొందుచున్న జాతి ప్రపంచానికేమి బోధించగలదు? స్వీయజీవితాన్ని భవ్యమొనర్చుకోవాలనే ఆసక్తిగాని శక్తిగాని లేని ఒక జాతి ఇతరులకు ఔన్నత్యపథాన్ని ఎట్లా చూపగలదు?

అందుచేతనే, మనయొక్క అద్వితీయ విజ్ఞానాన్ని మానవజాతికి కానుకగా సమర్పించేందుకుగాను ప్రపంచసమైక్యత, సంక్షేమాలకొరకు కృషిచేస్తూ జీవించేందుకుగాను, ఆత్మవిశ్వాసపూర్ణము, పునరుత్థానశీలము ఐన జాతిగా మనం ప్రపంచంముందు నిలవటం తప్పనిసరి అవుతుంది. యుగయుగాల జాతీయకర్తవ్యాన్ని నెరవేర్చటంలో, తొలిమెట్టుగా ఈనాడు

చెల్లాచెదురుగా ఉన్న హిందూసమాజంలోని అన్నివర్గాలను సంఘటితమొనర్చి ఆధ్యాత్మిక, భౌతిక జీవనరంగాలలో దానిని అజేయంగా రూపొందించాలని రాష్ట్రీయ స్వయంసేవక సంఘ నిశ్చయించుకుంది.

విశ్వసంబంధియైన ఉద్యమం ఏదైనా ఉంటే - అది వాస్తవికము ఆచరణయోగ్యము ఐన ఈకృషి ఒక్కటే.

# 2. మానవ జాతికి ఏకైక శరణ్యం

అధునాతన "అభ్యుదయ సమాజాలు" తమవని కొన్ని జాతుల వాళ్ళు గొప్పలు చెప్పుకుంటున్నారు. వారి జీవన విధానంలో ప్రధానాంశం ఏమిటి? భౌతిక ఆనందాన్ని సాధించటమే. ఇది మానవజాతి సంతోషానికీ, అభ్యుదయానికీ అసలు దారి తీస్తుందా?— ఈ విషయాలు పరిశీలించటం అవసరం.

ఈ ఎండమావుల వెంట పరిగెత్తటంలో మొదటి అంశం అంతులేని పోటీ. సుఖసాధనాలను పేర్చుకోవటంలో ప్రతి వాడూ పోటీ పడతాడు. రెండవ అంశం— నీతి, నియమాలు లేని విచ్చలవిడి సమాజం.

## సామాజిక ఆత్మహత్య

ఈ రెండవ అంశాన్ని ముఖ్యంగా పరిశీలిద్దాం. సూటిగా చెప్పాలంటే "స్వైరవిహారం" అంటే ఇలా ఉంటుంది: మనస్సు పోయినదారిన ఇష్టమొచ్చిన రీతిగా తాను వెళ్ళిపోవటం. ఇష్టా, ఇష్టా లేకుండా అనుభవించటం— ఆహార విహారాల్లో కుటుంబ జీవనంలో, సామాజిక సంబంధ బాంధవ్యాలలో, కామం విషయంలో నిగ్రహం లేకుండా వ్యవహరించటం— అచ్చుపోసిన ఆంబోతులాగా తిరగటం. ఇదే, మాటల్లో, వ్రాతల్లో, ఆలో

చనల్లో ప్రతిబింబిస్తూ వుంటుంది. ఈ రీతి 'స్వైరవిహారం' మానవుని అచ్ఛమైన ఆనందానికి దోహదం చేస్తుందా?

దీని తొలి దుష్ఫలితం, సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నం కావటం. పాశ్చాత్య సమాజాలన్నీ 'సామాజిక ఒడంబడిక సిద్ధాంతం' మీద అధార పడి ఉన్నాయి. ఈ సిద్ధాంతం ప్రకారం "వ్యక్తి", "సమాజము" పరస్పర సంరక్షణ గురించి ఒక అవగాహనకు వచ్చాయి. కనుక వ్యక్తి ఈ ఒడంబడిక వల్ల తనకు కలిసొచ్చేదేమీ లేదనుకుంటే ఈ ఒడంబడికను అతిక్రమించటం జరుగుతుంది. సమాజంలోని వ్యక్తులు పరస్పర అవగాహనను కోల్పోయి ఒడంబడికలకు లోబడక తెగతెంపులు చేసుకుంటే సామాజిక ఏకత్వమనేది నాశనమైపోతుంది. కనుక ఈ 'సామాజిక ఒడంబడిక సిద్ధాంతం' ఈ విచ్ఛిన్నాన్ని ఆపలేదు. అప్పుడు సమాజమనేది నామరూపాలు లేకుండా పోతుంది. సమాజమే చితికిపోతే సుఖాల వెంట పరుగులు పెట్టేవారికి ఏం దక్కుతుందో ఊహకందని విషయం కాదు.

సమాజం ఒక సజీవమైన శరీరం; వ్యక్తులు అవయవాలు— ఈభావం ఉన్నప్పుడే ఏకత్వభావన వ్యక్తి మనసులో మెరుస్తూ ఉంటుంది. అప్పుడు మాత్రమే అతడు తన తప్పుడు కోరికలకు కళ్ళేలు వేసి, సామాజిక అవసరాలతో తన కోరికలను సమన్వయపరుచుకొంటాడు. హిందుత్వం సరిగ్గా ఇదే ప్రతిపాదిస్తుంది.

## అవాంఛనీయ అకాంక్షలకు అంకురార్పణ

'పోటీ' అనేది ఆధునిక సమాజం యొక్క రెండవ లక్షణం. సముచితమైన స్పర్ధ ప్రగతికి దోహదం చేస్తుందంటారు. కానీ 'పోటీ' అనేది సముచితమైన పద్ధతిలోనే ఎక్కువ కాలం కొనసాగదనేది లోకానుభవం. హితప్రదంగా కొనసాగటం అసలు దాని స్వభావమేగాదు. త్వరలోనే అది దిగజారిపోతుంది. ఇతరుల కంటె మెరుగ్గా ఉండాలనేది 'పోటీ'లోని అంతరార్థం. కానీ త్వరలోనే అది తోటివాణ్ణి దిగమింగి తాను పైకెక్కాలనే

కోర్కెను కలిగిస్తుంది. ఆటల పోటీలలో గూడా ఈ ధోరణి రోజు రోజుకీ ప్రబలిపోతోంది. వ్యక్తుల్లో నైపుణ్యం పెంచటం, ఆనందాన్ని పంచటం— ఇదే గదా ఆటలలోని పరమార్థం. ఎవరు గెల్చారు, ఎవరు ఓడారన్నది అంత ప్రధానం గాదు. అయినా క్రీడారంగంలో కూడా సౌజన్యం, సౌమనస్యం లోపిస్తున్నాయి. మంచేమిటి? చెడేమిటి? గెలుపు ముఖ్యమనే మోజు క్రీడారంగాన్ని కలుషితం చేస్తోంది. క్రీడారంగమే ఇలా అయితే భౌతిక అవసరాలు తీరటమే ప్రధానంగా ఉండే ఇతరరంగాల మాట వేరుగా చెప్పాలా? అసలింతకీ ఈ పోటీ ఎందుకటా?— జీవన ప్రమాణాన్ని పెంచటానికని వాళ్ళంటారు.

## దుర్మార్గపు పోటీ

సంతోషమంటే వారి కల్పన ఇంద్రియ వాంఛలను సంతృప్తి పరచటమే. కనుక జీవన ప్రమాణాన్ని పెంచటమంటే, భౌతిక సుఖాన్ని అందించే విషయాలను దొంతరలుగా పేర్చుకుంటూపోవటమే. కాబట్టి వ్యక్తి ఇతర ఆలోచనలు, ఆకాంక్షలన్నిటినీ ప్రక్కకునెట్టి ఈ కోరికల ఊబిలో కూరుకుపోవటమే జరుగుతోంది. ఈ భౌతిక సుఖసాధన సంపత్తి సమకూర్చుకోవటానికి డబ్బును మూట కట్టడం అవసరం. మరింత ధనం సంపాదించాలంటే అధికారం కావాలి. భౌతిక సుఖాల ఆకలి తీరేది కాదు. అది మనిషిని నిలువనీయక దేశవిదేశాలకు ఈడ్చుకుపోతుంది. తన ఖజానా నింపుకోవటానికి, తన రాజ్యాధికారం తోడ్పాటుతో, పరజాతులను లొంగదీసి పీడించటం ప్రారంభమవుతుంది. దీంతో సంఘర్షణలూ, సంగ్రామాలూ మొదలౌతాయి. కనీసపు మానవతా భావం గూడా హరించుకుపోతుంది. మానవునికీ, జంతువుకూ తేడా అనేది కనిపించకుండా పోతుంది. "పోటీ", "జీవనస్థాయి పెంపుదల" ఇటువంటి తీయని మాటల మాటున మానవుని పతనం పొంచిఉంది.

## ఉదాహరణలు నిరూపిస్తాయి

ఈనాడు అమెరికాలో అమానుషమైన ధోరణులు వికటాట్టహాసం చేస్తున్నాయి. ఒకప్పుడు అనేక యూరపుజాతులవారు భౌతికమైన సిరి సంపదలను సంపాదించుకోవటానికి అమెరికాలో తమ తమ వలసలను ఏర్పాటు చేసుకున్నారు. ఈ ప్రయత్నంలో వారు స్థానిక జాతులను సర్వ నాశనం చేసారు. ఈ నాగరిక శ్వేతజాతులవారు పశుప్రవృత్తితో అచట జరిపిన మానవ మారణహోమం గురించి వింటేనే ఒళ్ళు కంపరమెత్తుతుంది. చెదురుమాటుగా నిలిచిపోయిన ఎఱ్ఱ ఇండియనులను వారు మచ్చుకు మాత్రమే మిగిల్చారు. అమెరికాలో మాత్రమే గాదు శ్వేతజాతులు వెళ్ళిన చోటనల్లా– అది ఆస్ట్రేలియా కావచ్చు, అమెరికా కావచ్చు, జరిగింది– చావూ, సర్వనాశనమే. దక్షిణ అమెరికాలో ఇప్పటికి గూడా అదే ధోరణి.

రష్యా, చైనాలలోని సామ్యవాద నియంతృత్వం కూడా ఇలాటిదే. మాటల గారడీ ఎంతగా చేసినా, వాళ్ళ ప్రణాళికల పరమోద్దేశ్యం గూడా జీవన ప్రమాణాన్ని పెంపొందించటమే. ఫలితం, మళ్ళీ అదే వరుస. భౌతిక సుఖసాధనాలను పెంచుకుంటూపోవటం, దానికోసమని దండెత్తటం, దాని కోసమనే బలహీన జాతులను లొంగదీసుకోవటం, సంఘర్షణలు, మారణహోమాలు, తత్పరిణామంగా మానవత్వాన్నే కోల్పోయి ప్రవర్తించటం.

అధునాతన నాగరికత గల సమాజాలనబడే ఈనాటి సమాజాల తీరుతెన్నులను నిష్పాక్షికంగా పరిశీలిస్తే భగవద్గీతలో చెప్పిన "అసుర" లక్షణాలతో ప్రతి అక్షరం సరిపోతాయి.

ఆధునిక పాశ్చాత్య సమాజాల ముఖ్యలక్షణాలైన 'స్వైరవిహారం' "పోటీ"లవల్ల మానవసమాజం శాంతి సౌఖ్యాలకు దూరమైపోయింది.

ఈ వైఫల్యానికి అసలు కారణం ఏమిటి? అనే విషయం మరింత లోతుగా పరిశీలిద్దాం.

## ఆధునికతా సంకటం

సుఖాన్వేషణ జీవకోటికి మౌలికమైన భావావేశమని అందరికీ తెలిసిందే. కాబట్టి మానవుడికి గూడా అది సహజమే. అతడు సుఖంగా ఉండాలని కోరుకుంటాడు. ఒకనాడూ, రెండ్నాళ్ళు గాదు– జీవితమంతా ఎడతెగని సుఖాన్ని కోరుకుంటాడు. ఇతర జీవుల్లాగానే మానవుడు కూడా ఇంద్రియాల ద్వారా సుఖానుభూతికై ప్రయత్నిస్తాడు. ఆ యత్నంలో ముందుగా వచ్చేవి, శారీరిక, మానసిక అవసరాలు, ఆకాంక్షలు. ఈ ఆకళ్లు తీరితే ఒకానొక సుఖానుభవబుద్ధి అతనికి కలుగుతుంది. అట్టి వాంఛాపూర్తి మానవునికి తాత్కాలికంగా సుఖాన్ని కలిగిస్తుందనే సత్యాన్ని కాదనలేం. అలాగే అట్టి సుఖం మెఱుపులా క్షణికమూ, కేవలం తాత్కాలికం కూడా. శారీరిక సుఖానుభవానికై యత్నించినకొలదీ దాని ఆకలి మరింత తీవ్రతరమౌతుంది. ఇది మన అనుభవమే. అలా మానవుడెన్నడూ సంతృప్తిని పొందలేడు. కోరికలను సంతృప్తిపరచేందుకు ఎంత ఎక్కువగా ప్రయత్నిస్తే అంత అధికంగా అసంతృప్తి పెరుగుతుంది. ఆ విధంగా, భోగసామగ్రిని ఎంత అధికంగా కూడబెట్టుకుంటే, అంత అధికమైన అసంతృప్తి ఎదురవుతుంది. భోగాలలో మునిగితేలినకొలదీ ఆశాభంగం అధికమవుతుంది. మన శాస్త్రాలు "న జాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతి" అనుభవించినంతమాత్రాన కోరికలు తీరవని ప్రకటించాయి. "మేము చితికిపోయాం, అయినా మా కోరికలు చితికిపోలేదు" అన్నట్లు ముసలితనం వచ్చినా కోరికలు మాత్రం కుఱ్ఱతనం విడిచిపెట్టవు. ఆధునిక మానవుడు సరిగా ఇదే సంకటంలో చిక్కుపడ్డాడు.

## అంతా మనలోనే ఉంది

హిందూతత్వశాస్త్రం దీనికి సరైన పరిష్కారమార్గం సూచిస్తుంది. సుఖానుభూతికి మూలం వ్యక్తికి లోలోపలనే ఉంటుంది తప్ప వెలుపల

ఉండదని అది చెపుతోంది. ఏ కొద్దిపాటి అంతర్వీక్షణమున్నా ఇది నిరూపితమవుతుంది. సంగీతాస్వాదనలో లీనమైన ఒక వ్యక్తి ఉన్నాడనుకుందాం. ఆ సమయంలో తనకు సన్నిహితుడూ, ఆప్తుడూ అయిన ఒక వ్యక్తి మరణించినట్లుగా అతనికి తంతి వస్తే, ఆపైన సంగీతం అతనికి రుచించదు. వెంటనే అతడు లేచిపోతాడు. సంగీతంలోనే సౌఖ్యాన్ని కలిగించే శక్తి స్వతహాగా ఉన్నట్లయితే అతడు దుఃఖంలో మునిగిపోయేవాడు కాదు, సంగీతం వింటూనే ఉండేవాడు. కానీ జరిగింది మాత్రం ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. క్షణాల క్రిందటి వరకూ సుఖానుభూతికి హేతువైన సంగీతం, అతనికి మరుక్షణంలో విముఖతనుకలిగించే విషయమై పోయింది.

అంటే మనకు సంతోషం కలుగచేస్తాయనిపించే బాహ్యవస్తువులన్నీ కేవలం నిమిత్తాలో, సాధనాలో మాత్రమే అవుతున్నాయి. నిజమైన సుఖానుభవ హేతువు ఆంతరికంగా మన లోపలనే ఇమిడుందని అర్థమవుతుంది. అయినా, మనం మాత్రం భ్రమలో పడి, బాహ్యవస్తువుల ఆరాటంలో పడి వెంపర్లాడతాం. ఎండిన బొమిక ముక్కను కొరుకుతూ, చప్పరిస్తూ కూర్చున్న కుక్క తంతుగా ఉంటుందిది. కొంతసేపటికి ఆ ఎముక అంచు గుచ్చుకొని, దానినోటిలో పుండు పడి, రక్తం కారుతుంది. కుక్క ఆ రక్తాన్ని రుచి చూచి ఉప్పొంగిపోతుంది. బాహ్యవస్తువులు సమకూర్చే సుఖానుభవం ఆ విధంగా ఉంటుంది. అట్టి అనుభవాలు కొద్దిసేపటిలోనే సుఖమివ్వటం మానేస్తాయి. పైగా మనల్ని, నిరాశా నిస్పృహల్లో, దుఃఖంలో ముంచుతాయనేది స్పష్టం.

## ఆనంద రహస్యం

తన అంతరాంతరాలలోనే ఒదిగివున్న ఆనంద స్రోతస్వినిని వ్యక్తి అందుకోవటం ఎట్లా? అన్నది ప్రశ్న. కొద్దిగా ఆలోచిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. బాహ్యవస్తువు ద్వారా ఆనందం కలిగినా— ఆనందం అనుభవించేప్పుడు మాత్రం ఆ వస్తువు స్పృహే మనకుండదు. అంటే

మనలో సహజంగా ఉండే ఆనందాన్నే మనం అనుభవిస్తున్నాంగానీ, ఆనందమనేది ఆ వస్తువులో నెలకొనిలేదనేది స్పష్టం. కాబట్టి శాశ్వతంగానూ, నిరంతరాయంగానూ, ఆనందం పొందాలంటే, ఏ బాహ్యావస్తువు యొక్క సహాయం లేకుండానే మనం ఆనందాన్ని అనుభవించగలిగేటువంటి ఒకానొక స్థితికి మనం చేరుకొనగలగాలి. ఇదే పరమసత్యం.

అయితే, ఆ స్థితిని చేరుకునేందుకు మార్గమేమిటి? ఆందోళన పడే మనస్సు అనందాన్నెన్నటికీ పొందలేదు. మనస్సుప్రశాంతంగా ఉన్నప్పుడే వ్యక్తి ఆనందం అనుభవిస్తాడు. మనస్సు అట్టి ప్రశాంతమైన నిశ్చలస్థితిని పొందాలంటే, రకరకాల కోరికలు మన మనస్సులో తల ఎత్తకుండా చేయటం అవసరం. కలచిన నీటిఅడుగున ఏమున్నదో కనిపించదు. మన బొమ్మని కూడా అందులో చూడలేం. అలలు అణగారిపోయి, నీరు నిశ్చలంగా నిలబడినప్పుడే ప్రతీదీ మనకు స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే, మనస్సు నిశ్చలమైనప్పుడే, మానవుడు తన మనస్సులోని అంతరాంతరాలలోని సత్యస్వరూపాన్ని గుర్తించగలుగుతాడు. మనస్సున నిశ్చలత ఏర్పడనంతవరకూ యదార్థతను గుర్తించటం వలన కలిగే ఆనందం కూడా లభించదు. అందుకని మానసికమైన ఆరాటపు అలలను పూర్తిగా ఆపగలిగితే, బాహ్యమైన ఏ భోగవస్తువు యొక్క సహాయం అక్కరలేకుండానే వ్యక్తి ఆనందాన్ని అనుభవించగలడనేది సుస్పష్టం.

## అంతిమ లక్ష్యం

నిజమైన ఆనందం బాహ్యావస్తువులలో గాక, తనలోనే ఉంటుందనే నిజాన్ని గుర్తించినప్పుడు మనిషి దృష్టి అంతర్ముఖమవుతుంది. అప్పుడు బాహ్యావస్తువుల యొక్క ఆకర్షణలు క్రమంగా సమసిపోతాయి. ఆ విధంగా బాహ్యావస్తువుల ఆకర్షణల బంధనాల నుండి విముక్తుడైనప్పుడు పూర్తిగా మోక్షాన్ని పొందుతాడు. అట్టి వ్యక్తి బాహ్యాప్రపంచంలో ఆనందాన్వేషణకై అర్రులు చాచి పరుగులు పెట్టడు. తనలో అలజడిని రేపే భౌతిక వాంఛల

ఆరాటాలు అతనికి ఉండవు. యదార్థమైన శాశ్వత సుఖసంతోషాలకేంద్రం తనలోనే ఉందని కనుగొంటాడు. అతడు సంపూర్ణమైన సంతృప్తినీ, ప్రశాంతతను, నిశ్చలత్వాన్ని పొందుతాడు. అట్టి ఆనందమే శాశ్వతం. అది అనంతమైనది. దాంతో పోల్చినపుడు, బాహ్యవస్తువులద్వారా పొందే సుఖసంతోషాలు నామమాత్రాలు. దానినే వ్యక్తి ఆశించవలసినది. అదే, తుదకు చేరుకొనవలసిన అత్యున్నత స్థితి. 'మోక్షం' అన్నా 'ముక్తి' అన్నా అదే.

## ఓటమికి కారణం

పరమానందాన్ని సమకూర్చే తత్వమనే గీటురాయి మీద ఒరిపిడి పెట్టి చూచినప్పుడు ఈ ప్రగతికాములనబడే ఆధునిక సమాజాలు మానవ కోటికి ఆనందాన్ని అందించగలవా? తమ యొక్క కుత్తుక లుత్తరించు కొనే పోటీ మనస్తత్వంతోనూ, హింసా, అసూయ ద్వేషాలతోనూ ఈ పనిని చేయగలవా? అన్నది ప్రశ్న— అట్టి స్థితిగతులు మానవుని మనస్సును నిశ్చలంగా, ప్రశాంతంగా ఉంచటానికి దోహదం చేస్తాయా? నిజానికి అలా ఎన్నిటికీ చేయజాలవు. ప్రతీ కోరికలోంచీ క్రొత్త కోరిక పుట్టుకొస్తూ వుంటుంది. ఆ విధంగా అగ్నిజ్వాలలకు ఆజ్యం మరింత అందుతుంది. అట్టి కోరికలు తీరనంతవరకూ మనకు ప్రశాంతి లేదు. మనసు ఇంద్రి యాలకు లోబడిపోతుంది. వాటికి కావలసిన వస్తువులనే కోరుకుంటూ ఉంటుంది. అట్టి మనసు నిశ్చలంగానూ, ప్రశాంతంగానూ ఎలా కాగలుగు తుంది?

## యోగ మార్గం

మానసిక ప్రశాంతిని పొందగలగటమొక్కటే మనసాధనకు ఏకైక లక్ష్యం. ఇతరులు సుఖసమృద్ధులు కలిగి సద్గుణవంతులుగానూ, ధర్మాత్ములు

గానూ వుంటే వారిని చూచి అసూయ చెందక సంతోషించాలనీ, వారిని అభినందించాలనీ పతంజలి మహర్షి తన యోగసూత్రాలలో ఉపదేశించాడు. స్వయంకృషితో వ్యక్తి తన ప్రగతిని తాను సాధించుకోవాలేతప్ప స్పర్ధకూ అసూయకూ లోనై ప్రవర్తించరాదని ఉపదేశించాడు. భౌతిక సంతోష సాధనాలని ఎంత మేరకూ, ఏ విధంగా కూడబెట్టాలీ, ఎంతమేరకు అనుభవించాలి అనే విషయంలో వెనుక ముందులు చూచుకోవాలి. వివేకంతో వ్యవహరించాలి. లేకపోతే ఇతరుల ఆనందానికి అడ్డుపడైనాసరే, తన పబ్బం గడుపుకోవాలనిపిస్తుంది. అట్టి కృషి వ్యక్తి యొక్క మానసికమైన సంతులనాన్ని చెదరగొడుతుంది. అతని ఆనందమే నశించిపోతుంది. అలాగే తోటివ్యక్తి పాపం చేస్తున్నప్పుడూ, కష్టాలలో మునిగి ఉన్నట్టు చూచినప్పుడూ మనం సహజంగా జాలిని చూపాలి అని కూడా పతంజలి మహర్షి ఉపదేశించాడు. మన శక్తివంచన లేకుండా తోటి వ్యక్తి యొక్క కష్టాన్నీ, దుఃఖాన్నీ తొలగించేందుకు కృషి చేయాలి. అట్టి మనస్తత్వం మనకు సుఖసంతోషాలనూ ప్రశాంతినీ కలిగిస్తుంది.

## స్వైర విహారం సర్వనాశనానికే

స్వైరవిహారం నవీన నాగరికతలోని తదుపరి లక్షణం. అది సుఖశాంతులకు పూర్తిగా విరుద్ధమైంది. అయితే, సాంఘిక నియమాలూ, సామాజిక నిబంధనలూ ఏమీ లేనట్టి ఒకానొక కాలఖండం గురించి మన ప్రాచీన పురాణాలు వర్ణిస్తున్నాయి. కానీ, అచిరకాలంలోనే మనిషికీ, మనిషికీ నడుమ విరోధం, సంఘర్షణ కలిగింది. సర్వత్రా అవినీతి అరాజకత్వం వ్యాపించింది. తత్ఫలితంగా మనఃశ్శాంతిని విధ్వంసం చేసే అస్థిరత, ఆతురత, భయం, అసూయ, విద్వేషం వంటి మానసిక స్థితులు ఏర్పడ్డాయి. అందుచేతనే, అటువంటి మానసిక అలజడులను పరిహరించ గలిగినట్టి మానసిక ప్రశాంతినీ, సంతులనాన్ని మరల సమకూర్చగలిగినట్టి ప్రవర్తనా నియమావళి ఏర్పడింది. ఇంతకీ నవీన సమాజాలు గత ఒకటి

రెండు శతాబ్దుల కాలంలో మాత్రమే ముందుకొచ్చాయి. మిరుమిట్లుగొలిపేటు వంటి వారి భౌతిక సమృద్ధులూ, శాస్త్రీయ సాంకేతిక విజయాలను చూచి వాటి మోజులో పడి, వారి అల్పానుభవాలను, ఆధారం చేసుకొని, పరిమితం కాని మానవజీవితంలోని ముఖ్యాంశాలపట్ల కొన్ని నిర్ధారణలు చేయటం క్షేమం కాదు. సుదీర్ఘమూ, సుస్థిరమూనైన అనుభవపు గీటురాయిపై పరీక్షించింతర్వాతనే మానవుని యొక్క నిజమైన ఆనందానికి త్రోవదీసే సరియైన జీవన దృక్పథాన్ని ఎవరైనా నిర్ణయించుకోవాలి.

## ఉభయతారకం

అంతులేని ఇంద్రియ సుఖానుభవం, దానిని తృప్తిపరుచుకునేందుకై ఆరాటంతో పోటీ పడటమనేవి ఎన్నడూ సంతోషానికి దోహదం చేయజాలవని ఈ దేశంలోని వేల సంవత్సరాల మన జాతీయ జీవితానుభవం చెపుతోంది. వ్యక్తి వికాసానికి ఎంతగా అవసరమో, సాంఘిక జీవనభూమికను పరిరక్షించటానికి గూడా అంతటి అవసరమే అయిన, ఆత్మ సంయమన సాధన అది మనకు నేర్పింది. ఇట్టి ఆత్మ సంయమనాన్నీ, భావననూ మనలో నింపేటందుకే, చతుర్విధ పురుషార్థ కల్పన ఇచట ఏర్పడింది.

ధర్మ, అర్థ, కామ మోక్షరూపమైన చతుర్విధ పురుషార్థ జీవనసాధన ఆత్మ సంయమనానికీ, సంతులనానికీ జీవన సామరస్యానికి సహాయపడుతుంది.

అట్టి వ్యవస్థ వ్యక్తిగత, సామాజిక స్థాయిలు రెంటిలోనూ మనిషికి అవసరమైన విధులనూ, బాధ్యతలనూ గూడ ప్రతిపాదిస్తుంది. మానవునికి పరమసుఖాన్ని సాధించడాని కుపకరించే ప్రవర్తన నియమావళి— అంటే ధర్మం, అర్థము— అంటే అతని జీవితం యొక్క భౌతికాంశాలన్నీ— కామం, అంటే శారీరికవాంఛల పరిపూర్తులను— అదుపులో ఉంచి అతనిని ముందుకు నడిపిస్తుంది.

## జీవన వాహినికి ఇరుతటములు

నాలుగవ పురుషార్థం— మోక్షం— దాన్ని, ఏ పేరుతో పిలిచినాసరే— దానిని చేరుకోవటమే ఇట్టి ప్రవర్తన నియమావళి యొక్క పరమార్థం. ఆ విధంగా మన అభిరుచులూ, అనుభూతులూ, ఒక ప్రక్క ధర్మాన్ని, వేరొక ప్రక్క మోక్షాన్నీ కలిగి ఆ రెండింటికీ నడుమనే నడుస్తూఉంటాయి. రెండు గట్టుల నడుమ ఒదిగి ప్రవహించే నది మాత్రమే ప్రయోజనకారిగా ఉంటుంది. అది గట్లు త్రెంచుకుంటే సర్వనాశనం చేస్తుంది. అలాగే మానవ జీవనవాహిని యొక్క గమనం కూడా. ధర్మమూ, మోక్షమూ అనే కరకట్టల నడుమగా ప్రవహించినప్పుడు మాత్రమే వ్యక్తికీ, సమాజానికీ సుఖసంతోషాలకు దోహదం కలిగిస్తుంది. ఈ రెండు మేరలకు మధ్య మాత్రమే ప్రతివాడూ సుఖాన్ననుభవించవచ్చు. ఇట్టి వ్యవస్థ మాత్రమే, అనుభవానికీ, మనఃశాంతికీ నడుమ సంతులనాన్ని సాధిస్తుంది. చివరకు అదే పరమానందస్థితికి మానవుని చేరుస్తుంది.

మానవకోటి కంతకూ పరమానందాన్నందించేందుకే, హిందూ సంఘటనా కార్యం రా. స్వ. సంఘం స్వీకరించింది. అధునాతన,పురోగామి సమాజములనబడేవి గూడా తప్పక ఈ పవిత్ర భూమికి చెందిన అత్యంత ప్రాచీనమూ, చైతన్యవంతమునైన ఈ విజ్ఞానాన్ని కాలం గడిచినకొలదీ శరణు పొందక తప్పదనేది మన ధృఢ విశ్వాసం.

> శ్లో॥ తావత్ గర్జన్తి శాస్త్రాణి జంబుకా విపినే యథా,
> న గర్జతి మహాతేజా యావత్ వేదాంత కేసరీ॥

("వేదాంతం" అనే సింహం ఘనంగా గర్జించనంతవరకే ఇతర శాస్త్రాలనే నక్కలు ఊలలు పెడుతుంటాయి.)



# పరిస్థితుల సవాలు

ఆంగ్లేయులు మనదేశం విడచిపోయినతర్వాత మన జాతీయ పునర్నిర్మాణానికి సరియైన విధానాన్ని ఎంచుకునే సమస్య మనకెదురైంది. అయితే ఆధునిక ప్రపంచంలో ప్రధానమైన సామాజికవ్యవస్థలు రెండు వాడుకలో ఉన్నాయి.

## తొలి ప్రతిక్రియ- తీరుతెన్నులు

ఆరెంటిలోను ముందుపుట్టినదాన్ని ప్రజాస్వామ్యం అంటున్నాం. యూరప్‌లో ఏర్పడిన అదుపులేని నిరంకుశ రాజరికానికి ప్రతిక్రియగా ఇది జన్మించింది. ఆనాడు సామాన్యవ్యక్తి కేవలం బానిస; స్వప్రేరణగాని స్వాతంత్ర్యంగాని అతనికి లేవు. సాక్షాత్ భగవంతుడుగా భావించబడే రాజుచేతిలో అతడు ఆటబొమ్మ. అట్టి స్థితిలో ప్రజలు ఉవ్వెత్తున తిరుగబడి దైవదత్తమని ఎంచబడే రాచరికపుటధికారాన్ని కూలద్రోసి తిరిగి తలెత్తకుండా రాజశక్తిని తుత్తునియలు చేశారు. "స్వాతంత్ర్యం, సమానత్వం సౌభ్రాత్రం" అనే ఉత్తేజకరమైన నినాదం ప్రతిఒక్కరి పెదవులపైన మెదలుతూ ఉండేది. బానిసత్వము, అత్యాచారాలు అనే సుదీర్ఘమైన చీకటి రాత్రి పూర్తిగా అంతమయిందని, "వ్యక్తిస్వాతంత్ర్యం", "వ్యక్తిహక్కుల

పవిత్రత" అందరకు సమానావకాశము కల్పించే ఒక నూతనశకం ఉదయించిందని వారు ఉద్ఘోషించారు.

అయితే ఇంచుమించు అదేసమయానికి యాంత్రికయుగం ఆరంభమయింది. పరిశ్రమలు వృద్ధిచెందసాగాయి. పెద్దపెద్ద పరిశ్రమలు ప్రారంభించేందుకు శాస్త్రీయ సాంకేతికవిజ్ఞానాలను పెద్దపెద్ద పారిశ్రామికులు ఉపయోగించుకోవడం మొదలుపెట్టారు. భారీఉత్పత్తి జరిగే ఆ పరిశ్రమల్లోకి లక్షలాది కార్మికులను తీసికొన్నారు. 'సమాన అవకాశం' అనే నినాదం చాటున ధనమూ, మేధాశక్తీ అధికంగా గలవ్యక్తులు సంపదను ఉత్పత్తి చేసే ఆ నూతనక్షేత్రాలకు గుత్తహక్కుదారులై అడ్డూ అపూ లేని ఆర్థిక సమ్రాట్టులయ్యారు. పొంగిపొరలే తమ ఆర్థికశక్తితో వారు రాజకీయ యంత్రాంగాన్నికూడా లోబరచుకున్నారు. ఇక సామాన్యప్రజల పరిస్థితి మరింత మట్టిగొట్టుకుపోయింది. కేవలం ఓటువేసే హక్కు మాత్రం మిగిలింది. అదైనా దుర్భరమైన ఆర్థిక ఇబ్బందులున్న పరిస్థితులలో స్వేచ్ఛగా ఉపయోగించుకొనేందుకు అవకాశం లేకుండాపోయింది.

ఆ విధంగా వినటానికి గొప్పగా ఉండే 'వ్యక్తి స్వాతంత్ర్యం' కేవలం ప్రతిభావంతులైన కొద్దిమందికి సామాన్యప్రజలను పూర్తిగా తమకు బానిసలుగా చేసికొనేందుకు అవకాశం కలిగించింది. కర్మాగారాల్లో పనిచేసే కార్మికుల-పురుషులు, స్త్రీలు, పసిపిల్లలు సైతము-పరిస్థితులు చెప్పలేనంత ఘోరంగా మారాయి. పాతనిరంకుశుల స్థానే వచ్చిన ఈ క్రొత్తనిరంకుశుల పాదాలక్రింద వారు నలిగిపోసాగారు.

## రెండవ ప్రతిక్రియ యొక్క వైఫల్యం

ఈ 'పెట్టుబడిదారీ' విధానపు క్రొత్త నిరంకుశత్వానికి ప్రతిక్రియగా ఆ సమయంలో సామ్యవాదం పైకివచ్చింది. పారిశ్రామిక విప్లవం తీవ్రమైన ఆర్థిక అసమానతలకు దారితీస్తుంది; కలవారు (పెట్టుబడిదారులు), లేనివారు

(శ్రామికవర్గం) అనే రెండువర్గాలను లోకంలో సృష్టిస్తుంది అనే నమ్మకం నుండి సామ్యవాదం పుట్టింది. తప్పనిసరిగా ఆ రెండు వర్గాలమధ్య ఒక పోరాటం ఆరంభమవుతుంది, దానిలో కార్మికవర్గం విజయం పొందుతుంది అనే విశ్వాసంకూడా సామ్యవాదానికి ఉంది. ఆ తర్వాత కార్మికవర్గం నడిపే ప్రభుత్వం, సంపదను ఉత్పత్తిచేసే సాధనాలను అన్నింటినీ, పంపిణీని కూడ, తన అదుపులో ఉంచుకొని తద్వారా ప్రజలయొక్క భౌతికావసరాలనన్నిటినీ తీర్చే భారాన్నంతనూ తానే స్వీకరిస్తుంది; అప్పుడు ప్రజల కష్టాలు గట్టెక్కుతాయి; ఆ విధంగా ఒకదేశం పారిశ్రామికంగా పెరిగినకొద్దీ ఆర్థిక వ్యత్యాసం పెరుగుతుంది; దానివల్ల వర్గపోరాటంకూడా పెరిగి అతిత్వరలోనే కార్మికవర్గంయొక్క పరిపాలన ఆ దేశంలో ఏర్పడు తుంది- అని జోస్యం చెప్పింది సామ్యవాదం.

కాని మానవచరిత్రకు చెప్పిన భౌతికవ్యాఖ్యానాలకు పరాకాష్ఠ అయిన సామ్యవాదజోస్యం పూర్తిగా అసత్యమని తదనంతరకాలపు చరిత్ర నిరూపించింది. ప్రపంచంలో ఎన్నోదేశాలుండగా పారిశ్రామికంగా బొత్తిగా వెనుకబడిన రష్యాలో సామ్యవాదవిప్లవం మొదటి విజయం పొందింది. ఈనాటికిగూడా పారిశ్రామికాభివృద్ధిలో ముందంజవేసిన అమెరికా ఇంగ్లండు, జర్మనీవంటి దేశాలు - నిజానికి పారిశ్రామికవిప్లవమనేది ముందుగా అక్కడే ఏర్పడినప్పటికీ-సామ్యవాదంవైపుకు మొగ్గుతున్నట్లుగా ఎట్టిసూచనా లేదు. పైగా పారిశ్రామికంగా వెనుకబడిఉన్న మరొకదేశం చైనా, ఈమధ్యకాలంలో సామ్యవాదదేశంగా మారింది. మానవచరిత్రకు భౌతికమైన వ్యాఖ్యానంచేసి, దాన్ని ఆధారం చేసుకొని ప్రపంచంలో సామ్య వాదం వచ్చితీరటం ఒక చారిత్రకసత్యమని చెప్పేవాదం మనకండ్లముందు జరిగిన కఠోరసత్యాలు అనే కఠినశిలపై తుత్తునియలైపోయింది.

అది అట్లా ఉండగా, స్వేచ్ఛ, శాంతి సమృద్ధులకు నిలయమని నమ్మించిన ఆ దేశంలోని సామాన్య మానవుని స్థితిగతు లెట్లాఉన్నాయి?

ఆ దేశంలో కార్మికవర్గనియంతృత్వం అనేది నియంతృత్వపక్షంయొక్క అనగా సామ్యవాదపక్షంయొక్క నియంత చేతిలోని నియంతృత్వంగా దిగజారి పోయిందని అందరికీ బట్టబయలయిన విషయమే. మూకఉమ్మడి హత్యలు బానిసశిబిరాలు, వాదకట్టునివాసాలు, బలవంతపుచాకిరీ, మెదడుమరమ్మత్తు -మనస్సులను తమకనుకూలంగా మార్చేప్రయత్నాలు-ఇటువంటి అమానుష నియంతృత్వ యంత్రాంగం అక్కడ ఉంది. అదుపులేని రాజరికపుదమననీతి కొనసాగినపుడుగానీ, పెట్టుబడిదారీ దుర్మార్గం చెలరేగిన రోజుల్లోగాని కనివిని యెరుగనంతటి దుఃఖపూరితమైన బానిసత్వపుటగాధాల్లోకి ప్రజలను ఆ యంత్రాంగం అణగద్రొక్కింది. "మీకు పోయేది ఏమీలేదు; మీసంకెళ్ళు తప్ప" అంటూ సామాన్యప్రజానీకానికి వారిచ్చిన పిలుపు ఆచరణలో ఈవిధంగా పరిణమించింది.

## చూపిన ఆశ – చేసినపని

ప్రాథమిక భౌతికావసరాలను సమకూరుస్తామంటూ తమ ప్రజలకు వారు చేసిన మొదటివాగ్దానం నెరవేర్చటంలోనైనా వారు విజయం పొంద గలిగారా? ఉదాహరణకు రష్యాను పరిశీలిద్దాం. ఒక కట్టుదిట్టమైన పద్ధతిలో ప్రయోగం ప్రారంభించిన పెద్దరాజ్యాల్లో రష్యా మొదటిది. వ్యక్తిగత ఆస్తులను రద్దుపరచి, పరిశ్రమల యజమానులను మట్టుపెట్టి, పరిశ్రమ లన్నిటినీ తమ హస్తగతం చేసకొన్నారు. వ్యవసాయరంగంలో భూస్వాము లను, రైతులను పూర్తిగా తొలగించి వాదకట్టులను, ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాలను ఏర్పరచారు. రాజకీయ దృష్ట్యా పరిశీలించినా వారు చేసింది అన్నివిధాలా ఒక కట్టుదిట్టమైన ప్రయోగమే. దాని ఫలితంగా గత 50 సంవత్సరాలలోను రష్యాలో అత్యధికమైన పురోభివృద్ధి సహజంగా కలిగి తీరాలని మనం తప్పక ఆశించవలసిఉంది.

"చూడండి! వారు రోదసీవేధిని చంద్రమండలానికి పంపగలిగారు" అని కొందరంటారు. సామాన్యప్రజానీకం గురించి వారు మాట్లాడుతూ

ఉంటారు. కాని ఆ ప్రజలకు చంద్రమండలం చేరగలగడమెట్లా అన్నది ప్రశ్నకాదు. కడుపునిండా కూడు వాళ్ళ ప్రముఖసమస్య. నిజావి కదే సామ్యవాదవిప్లవసౌధానికి మూలాధారం. రష్యాప్రభుత్వం తనప్రజలకు రెండుపూటల కడుపునిండా భోజనం పెట్టగల్గుతోందా? ఇదే మొదటిప్రశ్న. ప్రతి పౌరుడికీ రెండుపూటల కడుపునిండా కూడు, తలదాచుకొనడానికొక గూడు, ఒళ్ళుదాచుకునేందుకు చాలినంత గుడ్డ, రోగం రొష్టూ వస్తే మందూ, మాకూ, విద్య, విజ్ఞానం ఇవ్వగలగటం – వీటినిబట్టే ఒక ప్రభుత్వంయొక్క గాని, ఒక రాజకీయసిద్ధాంతంయొక్కగాని విజయం నిశ్చయింపబడుతుంది; అదే గీటురాయి.

ఈపరీక్షకు రష్యా నిలబడిందా? రష్యాకు అతివిశాలమైన భూభాగం ఉంది. ఒకనాడు అది ప్రపంచం మొత్తంలోనే గోధుమపంట అత్యధికంగా పండించే దేశం. దేశవైశాల్యంతో పోల్చిచూస్తే అచటి జనసంఖ్య చాలా తక్కువ. కాబట్టి తిండిపెట్టవలసినవారిసంఖ్యకూడా తక్కువే. వ్యవసాయానికి అవసరమైన ఆధునిక పరికరాలన్నీ వారికి ఉన్నాయి. దానికి తోడు సర్వశక్తిమంతమైన ప్రభుత్వంయొక్క బ్రహ్మాండమైన సాధన సంపత్తి ప్రతి పథకానికి అందుబాటులో ఉంది. ఇన్నిఉన్నప్పటికీ రష్యా ప్రభుత్వం కెనడానుండి, అమెరికానుండి, ఇంకా ఇతరదేశాలనుండి గోధుమలు తదితర ఆహారపదార్థాలు దిగుమతి చేసుకోవలసి వస్తోంది. సామ్యవాదం చిత్తుగా ఓడిపోయిందనడానికి ఇంతకన్న గట్టి ఋజువు ఏంకావాలి !

## రెండూ వీగిపోయిన మార్గాలే

ఇట్టి విషఫలితాల నెదుర్కొన్నపిదప సామ్యవాదదేశాలు సహితం తామనుసరించిన సంపూర్ణ ప్రభుత్వీకరణపద్ధతిని గూర్చి పునరాలోచన చేస్తున్నాయి. వ్యక్తిస్వేచ్ఛను గనుక నాశనంచేస్తే అది ఆ వ్యక్తిలోని సృజనాత్మకవాంఛను, ప్రేరణను చంపివేస్తుందని వారికి తెలిసివస్తోంది.

అందుచేత వారు క్రమంగా వ్యక్తిస్వాతంత్ర్యంవైపు తరలివస్తున్నారు. వ్యక్తికి కొన్ని సొంతవస్తువులు ఉండవచ్చు, తన ఆస్తిని తాను అనుభవించేందుకు కొంచెం స్వాతంత్ర్యం ఉండాలి. అట్టి అనుమతి ఇవ్వాలి అని తూర్పుఐరోపాలోని సామ్యవాదదేశాలతోబాటు రష్యాలోగూడ ఒక ఒత్తిడి బయలుదేరింది.

"సాగుబడిలోఉన్న మొత్తం భూమిలో 34% వరకు రైతులు సొంతకమతంగా "పెరటితోటలు" పేరుతో సాగుచేసుకోవచ్చునని రష్యా ఈనాడు అనుమతిస్తోంది. ఈ సొంతకమతాలకు, ప్రభుత్వ గుత్తాధిపత్యం క్రింద ఉన్న పెద్దపెద్ద వ్యవసాయ పరికరాల సహాయం లేదు. అయినప్పటికీ ఈ సొంతకమతాల దిగుబడి మొత్తందిగుబడిలో 60 శాతం ఉంటుండగా ప్రభుత్వపు సాగుబడిలోఉన్న 66 శాతం కమతాలు కేవలం 40 శాతం దిగుబడిమాత్రమే ఇచ్చినవి" అని అమెరికాకు చెందిన చెష్టరు బౌల్స్ అన్నాడు. సంపూర్ణ ప్రభుత్వీకరణవాదం అనే నిష్కర్షతో మొదలుపెట్టిన కేవల సమష్టివాదం తన జన్మభూమిలోనే పలాయనమంత్రం పఠిస్తోందని మరొకసారి ఋజువు అయింది.

వేరొకప్రక్క చూస్తే, కేవలం వ్యక్తివాదమే మేలు అనే నిష్కర్షతో బయలుదేరిన ప్రజాస్వామ్యవాదానికి పుట్టినిల్లైన దేశాలుకూడా తమప్రాథమిక సిద్ధాంతంనుండి తప్పుకొన్నాయి. అదుపులేని సమానావకాశాలు, వ్యక్తిస్వేచ్ఛలవలన అనేకదుష్ఫలితాలు వచ్చాయి. కనుక అమలులోకి తెచ్చేప్పుడు సర్వసామాన్యసంక్షేమంకొరకు ఈ సిద్ధాంతాలను అదుపులో ఉంచవలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు కొన్ని తీవ్రచర్యలు తీసుకొన్నారు. అట్టి చర్యలద్వారానే వారు విప్లవాల బెడదను తప్పించుకొని తమ ప్రజాస్వామ్య వ్యవస్థను నిలుపుకోగలిగారు.

ఈవిధంగా ప్రజాస్వామ్యం, సామ్యవాదం అనబడే ఈ రెండు సిద్ధాంతాలలోను సమానంగా కనిపించే విషయాలు రెండున్నాయి. ఈ

సిద్ధాంతాలు రెండూ కూడ అంతకు ముందున్న ఒక వ్యవస్థకు ప్రతిక్రియగా పుట్టినవనేది వాటి మధ్య ఉన్న మొదటి సామాన్య విషయం. తమతమ మౌలిక వాదాలనుండి అవి రెండుకూడ వెనుకడుగువేసి ఒకదానివైపు మరొకటి పయనించితీరవలసిన స్థితిలో ఉన్నాయి – వ్యక్తి కేంద్రితమైన ప్రజాస్వామ్యం సమష్టితత్త్వంవైపుకు, సమష్టివాదంనుండి సామ్యవాదం వ్యక్తిస్వేచ్ఛవైపుకు జరుగుతున్నాయి. కొన్ని చారిత్రిక కారణాలవల్ల వాటి ప్రారంభం పరస్పర విరుద్ధస్థానాల్లో జరిగినా, అవి పుట్టిన తీరులోనూ పెరిగిన రీతిలోనూ, ఈ రెంటిమధ్య చెప్పుకోతగ్గ పోలిక ఒకటి ఉంది.

## ఒకే దుంపనుంచి పుట్టిన రెండు పిలకలు

ఈ పోలిక మన కేమీ ఆశ్చర్యం కలిగించ నక్కరలేదు. ఎందుచేతనంటే, మనం లోతుగాపోయి మూలాలను పరిశీలిస్తే ఈ రెండుకూడ ఒకేవిధమైన మానవజీవనలక్ష్యంనుండే జనించాయని తెలుస్తుంది. ప్రజాస్వామ్య సామ్యవాదాలు రెండింటికీ మూలమైన పాశ్చాత్యుల ఆలోచన ప్రకారం, మానవజీవితం భౌతికవిషయాలకు మాత్రమే పరిమితమైనది. మానవుడు కేవలం భౌతికవాంఛలపుట్ట; అంతే. అందువల్లే మానవుని భౌతిక వాంఛలను తృప్తిపరచగల భౌతికవస్తుజాలంయొక్క ఉత్పత్తి సరఫరాలు మాత్రమే వారి సిద్ధాంతాలన్నిటికీ ఏకైకలక్ష్యాలయ్యాయి. అంతేకాదు మనుష్యులందరికి ఇట్టి మౌలిక భౌతికావసరాలు సమానమే కాబట్టి భౌతిక స్థాయిలో మానవసమానత్వం ప్రతిపాదించబడింది.

వ్యక్తి అటువంటి భౌతికవాంఛలచేత ప్రేరేపించబడే ఒక ప్రాణిమాత్రమే అయినందున, అతని దృష్టిలో సమాజం తన అవసరాలను తీర్చే ఒక సాధనంకంటె ఎక్కువకాదు. కాని కేవలం స్వార్థప్రయోజనపరాయణులైనట్టి వ్యక్తులతో ఏర్పడిన సమాజం ఒక దినమైనా నడవగలదని మనం ఆశించలేము. సమాజం జీవించాలంటే అందులోని వ్యక్తుల్లో ఒకవిధమైన

త్యాగభావన ఉండాలి. అట్లాగే సమాజంలేకుండా వ్యక్తులు తమ మనుగడనే కొనసాగించలేరు. అందుచేత ఈ రెంటిమధ్య-అంటే-పరస్పరవిరుద్ధాలుగా ఉన్న వ్యక్తిప్రయోజనాలకు, సమాజప్రయోజనాలకు మధ్య ఒక ఒప్పందం కుదుర్చుకొనవలసివచ్చింది.

వ్యక్తి సమాజాలమధ్య ఆగర్భశత్రుత్వం అంతర్నిహితమై ఉన్నదనే కల్పనయొక్క ఫలితమే ఈ 'ఒప్పందపు' సిద్ధాంతం (కాంట్రాక్టు థియరీ). వ్యక్తిని సమాజంపట్ల విరోధిగా మార్చే పెట్టుబడిదారీవ్యవస్థ రూపంలో ఒకప్రక్కన, సమాజాన్ని వ్యక్తికి విరోధిగా రూపొందించే సామ్యవాదం రూపంలో మరొకప్రక్కన ఈ మౌలికఘర్షణే వ్యక్తమయింది. భౌతికతాకల్పనయే మానవజీవనపరమావధిగా గల ఈ రెంటిలోనూ కలిగే చెడును తగ్గించుకొనేందుకు ఈ రెండు వ్యవస్థలూ ప్రయత్నిస్తూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం.

## విఫలమైన భౌతికవాదం

కాని మనుష్యుణ్ణి కేవలం భౌతికవాంఛలప్రోవుగా పరిగణించడం అంటే అతణ్ణి జంతువుతో సమానంగా చేయటమే అవుతుంది. మనుష్యుడు ఒక జంతువుమాత్రమే అయితే, స్నేహశీలము, వ్యవస్థితము ఐన జీవితం గడపవలసిన అవసరం అతనికి ఏముంది? మల్లయ్య, పుల్లయ్యను భక్షించా లనుకొంటే, 'ఎల్లయ్య' 'మల్లయ్య'ను స్వాహా చేయటానికి యత్నిస్తాడు. కనుక మానవులు జంతువులవలె ఒకరినొకరు చంపుకొని తినరని మాత్రమే మనం చెప్పగలం. ఈ విధంగా ఒకరినొకరు నాశనం చేసికొనకుండా ఉండడంకొరకు మాత్రమే మానవులు ఒక ఒప్పందానికి రావలసి ఉంటుంది. అయితే తోటివారికోసం త్యాగం చేయాలి, వారి కష్టాల్లో పాలుపంచుకోవాలి అనే కోరికలు మానవుని మనస్సులో ఎందుకు పుడుతాయో ఈ భౌతికవాదం వివరించలేదు. కానీ ఇతరులకోసం స్వేచ్ఛగా, ప్రేమతో చిరునవ్వుతో తమ జీవితాలను బలిదానం చేసినట్టి వ్యక్తులు, మానవచరిత్ర

అంతటా మనకు సాక్షాత్కరిస్తారు. వృత్రాసురుడనే రాక్షసుణ్ణి చంపేందుకు ఆయుధంగా నిర్మించడానికి తన ఎముకలను స్వచ్ఛందంగా సమర్పించిన దధీచి కథ మన ప్రాచీనసాహిత్యంలో ఉంది. అతడు అడవిలో జీవించే ఒక ఋషి. తనకోసం అతడు కోరుకున్నది ఏమీలేదు. అటువంటప్పుడు తనను తాను బలిదానం చేసికొనడానికి అతణ్ణి ప్రేరేపించిందేమిటి?

ఈ ఇరువదియవ శతాబ్దపు ఉదాహరణ ఒకటి చూద్దాం. ఒకసారి కలకత్తానగరంలో నడివీథిలో ఇద్దరు బాలురు, మూత తెరచిఉన్న మురుగు నీటి కాలువగుంటలో పడిపోయారు. త్వరత్వరగా తన ఉద్యోగపు పనిపైన పోతున్న ఒక పెద్దమనిషి అకస్మాత్తుగా ఆ బాలురు మురుగుకూపంలో పడిపోవడం చూచాడు. తాను ధరించిన కోటునైన ఊడదీయకుండా అతడు ఆ గుంటలోకి దూకి, ప్రవాహవేగాన కొట్టుకొనిపోతున్న ఆ బాలురను పట్టుకొని బయటికి విసరివేశాడు. కాని తానుమాత్రం ఆ ఊబిలో దిగబడి చనిపోయాడు. ఎందుకతడు చనిపోయాడు? ఇది నీకర్తవ్యం అని ప్రబోధించినదేమిటి? భౌతికవాదం దీనికి సమాధానం ఇవ్వలేదు.

## సరిఅయిన ఆధారం

అందుకు ఒకేఒక సమాధానం ఉంది. అదేమంటే – మనందరిలోనూ ఒకే సమానమైన సజీవసత్యం ఉన్నది. అదే ఆంతరికమైన ఒక బంధాన్ని మనమధ్య కల్పిస్తోంది. దానినే మన తత్త్వశాస్త్రం 'ఆత్మ'అని చెపుతోంది. మనం ఒకరినొకరు ప్రేమించి, సేవించటానికి కారణం బాహ్యసంబంధాలు కావు. ఆత్మలయొక్క సజాతీయతే దానికి కారణం. యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో ఇలా చెప్పాడు :

> *నవా అరే మైత్రేయి పత్యుః కామాయ పతిః ప్రియో భవతి।*
> *ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి॥*

(ప్రియ మైత్రేయీ! తన 'భర్త' కాబట్టి 'భార్య' అతణ్ణి ప్రేమించటం లేదు; అతనిలో తన ఆత్మనే చూచి ప్రేమిస్తోంది.)

ఈ అర్థంలో, అనగా ఒక ఆత్మ అందరిలోను అంతస్థమై ఉన్న కారణం చేతనే, మానవులంతా ఒకటి అవుతున్నారు. పరమాత్మయొక్క స్థాయిలోనే సమానత్వం కుదురుతుంది. కాని భౌతికస్థాయిలో అదేపరమాత్మ, ఆశ్చర్య కరమైన వైవిధ్యంతోను, అసమానతలతోను లోకంలో వ్యక్తం అవుతాడు.

మన తత్త్వశాస్త్రానుసారం చూస్తే - సత్త్వరజస్తమో గుణాల యొక్క సంతులనం తప్పడంవల్లనే ఈ విశ్వం ఈ రూపంలో వ్యక్తం అయింది. ఈ గుణసామ్యం కుదిరితే, అంటే - ఈ త్రిగుణములు సంపూర్ణ సంతులనాన్ని పొందితే, అప్పుడు ఈ విశ్వమంతా తనయొక్క అవ్యక్తస్థితిలో లీనమయిపోతుంది. కాబట్టి ఈ అసమానత, ప్రకృతినుండి విడదీయలేని ఒక అంశం. దానితోబాటు సహజీవనం మనకు తప్పదు. ఈ అసమానతను దాని హద్దుల్లో ఉంచడం, ఈ అసమానతవల్ల కలిగే కటుత్వాన్ని దూరం చేయటం వరకూ మాత్రమే మనం ప్రయత్నించాలి.

## దొంగప్రవక్తలు

పైపైకి కనిపించే సమానతను ఆధారం చేసుకొని లోలోపల ఉండే సహజసిద్ధమైన వ్యత్యాసాలను తొలగించాలని ప్రయత్నించేసే ఏ వ్యవస్థ అయినా విఫలమయితీరుతుంది. ఇంతటి పురోగతిని సాధించిన పశ్చిమ దేశాల్లోగూడ ప్రజాస్వామ్యం అంటే రాజనీతిచతురులై, సామాన్యప్రజలను తమపక్షంలో నిలుపుకొనగలిగే కొద్దిమందియొక్క పరిపాలన మాత్రమే. పరిపాలన నిర్వహణలో అందరు సమాన భాగస్వాములే అన్న అర్థం సూచించేట్లుగా- "ప్రజలచేత" "ప్రజలయొక్క" అంటూ ప్రజాస్వామ్య తత్త్వంలో ప్రయోగించే పదాలు ఆచరణలో చాలామట్టుకు మిథ్యలే.

సామ్యవాదంకూడ తాను చెప్పుకొనే 'సమానతను' స్థాపించటంలో పూర్తిగా విఫలమైంది. దాని కల్పన ప్రకారం, కార్మికవర్గనియంతృత్వం స్థాపించిన పిదప, అందరికీ ఆహారం, తదితరాలైన జీవితావసరాలన్నీ

సంతృప్తికరంగా లభిస్తాయి. అప్పుడు ఒండొరులమధ్య ఘర్షణకు అవకాశం ఉండదు; దానివలన కేంద్రీకృతమైన ఒక ప్రభుత్వం ఉండవలసిన అవసరం ఉండదు. ఆ విధంగా రాచరికం నశించిపోయి, ఒక శాసనం అవసరంలేని 'అరాజక సమాజం' ఏర్పడుతుంది. సామ్యవాదం ప్రకారం మానవుని ఊహకందినంతవరకు అదే సమానతకు పరాకాష్ఠ.

అయితే భౌతికవాదంపై ఆధారపడిఉన్న సామ్యవాదం, అట్టి ఆదర్శ ప్రాయమైన సమాజస్థితి ఏవిధంగా ఏర్పడుతుందో వివరించిచెప్పలేదు. మానవులు కేవలం పశువులు–అంటే, కేవలం భౌతికజీవులేఅయినట్లైతే వారుతమను పాలించే ఆయా శక్తులపట్ల భయంవల్ల మాత్రమే ఒకరినొకరు భక్షించకుండా ఉంటారు. అటువంటప్పుడు, అట్టి శక్తిగాని, ప్రభుత్వంకాని లేకుంటే కలహంలేని జీవితాన్ని వారెందుకు గడపాలి? మనిషికూడ ఒకజంతువులాగానే మనోవాంఛలకు, ఉద్రేకాలకు గురి అవుతాడు. ఆ మనోవాంఛలు తీర్చినకొద్దీ పెరుగుతూనే ఉంటాయి. మరి సంతృప్తిచెందని ఆ మానవుడు శాంతి అనురాగాలతో ఇతరులతో కలసిమెలసి ఎట్లా జీవించగలడు ? అంతేగాక తన వ్యక్తిగతమైన అవసరాలు సమకూరి, తృప్తిచెందిన తరువాతనైనా ఇతర జంతువులకన్న మేధావియైన మానవుడు గాటిలో కుక్కలాగా [తాను అనుభవింపక, ఇతరులను అనుభవింపనీయని బుద్ధితో] వ్యవహరించడని నమ్మకం ఏమిటి ? కాబట్టి సమానత్వం స్థాపింపబడుతుందని మనం ఊహించుకున్నప్పటికీ, అది తిరిగి మరొక అసమానతకు దారితీస్తుంది. ఆ విధంగా మళ్లీ రక్తం కాల్వలై పారే మరొక విప్లవం అవసరమై తీరుతుంది. అంటే హింసతోకూడిన విప్లవాలు, కల్లోలాలు ఈ సిద్ధాంతానికి పునాదిరాళ్ళని తెలుస్తూ ఉంది. ఎల్లప్పుడూ విప్లవ నినాదాలను చేస్తూ ఉండటం, సాయుధ సంఘర్షణనూ, అరాజకాన్ని, అశాంతిని ఆహ్వానించి ప్రోత్సహించటమే అవుతుంది.

వీటివలన. మనకండ్లకు కనుపించినంతమేరకు కేంద్రీయశక్తి నశించిపోయే చిహ్నాలుగాని, ఒకవేళ కాకతాళీయంగా అట్టిది జరిగినా

ప్రభుత్వం అదృశ్యమయినతరువాత శాంతి ఉదయించే అవకాశంగాని కనిపించటంలేదు. గత ఏబదిసంవత్సరాలుగా రష్యాలో ఉన్న సామ్యవాద ప్రభుత్వం దానంతట అది నశించిపోయే సూచనలు కనిపించడంలేదు సరిగదా అది మరింత బలపడింది. సామ్యవాద సిద్ధాంత భూమిక పట్టి అవాస్తవికం అనేందుకు ఇది ఒక ప్రత్యక్ష నిదర్శనం.

## సమానతకాదు సమన్వయం కావాలి

మన తత్త్వం సమాజంయొక్క అత్యున్నతస్థితి ఎట్లా ఉంటుందో వర్ణించి దాన్ని స్పష్టంగా వివరించిందికూడ.

న రాజ్యం న చ రాజాఽఽసీత్ న చ దండ్యో న దాండికః
ధర్మేణైవ ప్రజాః సర్వా రక్షంతిస్మ పరస్పరమ్ ॥

(రాజ్యం లేదు. రాజు లేడు. దండన లేదు. దండించువాడును లేడు.
ప్రజలంతా ధర్మాన్ని ఆధారం చేసుకొని పరస్పరం రక్షించుకొన్నారు)

సత్ప్రవర్తన స్వరూపమైన ధర్మమే, సమానమైన ఆంతరిక అనుబంధాన్ని మేల్కొలుపుతుంది; స్వార్థపరత్వాన్ని అదుపులో పెడుతుంది. బాహ్యమైన ఒక ప్రభుత్వం అవసరంలేకుండానే ప్రజలందరినీ కలిపి సమున్నతస్థితిలో ఉంచగలుగుతుంది. స్వార్థపరత్వంగాని, అక్రమంగా దాచుకోవటంగాని అందులో ఉండవు. అందరు సమష్టికోసం కృషిచేస్తారు; జీవిస్తారు.

మానవ జీవితంయొక్క విశిష్టలక్షణం ధర్మమే.

ఆహార నిద్రా భయ మైథునం చ
సామాన్య మేతత్ పశుభిర్నరాణామ్
ధర్మో హి తేషా మధికో విశేషో
ధర్మేణ హీనాః పశుభిస్సమానాః ॥

(తిండి, నిద్ర, భయము, మైథునము - ఇవన్నీ పశువులకు మానవులకు సమానమే. ధర్మమే మానవునిలోని విశేషం - ధర్మహీనుడు పశువుతో సమానం).

తమలో సహజసిద్ధమైన అసమానతలు ఉన్నప్పటికీ, ధర్మాన్ని సాక్షాత్కరించుకోవటంవల్ల మాత్రమే, మానవులు అత్యున్నత సమరస స్థితిలో జీవించగలరు. అది గ్రుడ్డివానికి కుంటివాని సహకారం వంటిది. ఆ విధంగా కుంటివానికి కాలు, గ్రుడ్డివానికి కన్ను లభించినట్లవుతుంది. అసమానతవల్ల కలిగే కటుత్వాన్ని పరస్పరసహకారభావన పోగొడుతుంది.

మనదృష్టిలో వ్యక్తికి సమాజానికి మధ్యఉన్న సంబంధం,ఎన్నడూ ఘర్షణతో కూడిందికాదు. వ్యక్తులందరిలోనూ ఒకే పరమసత్యం వ్యాపించి ఉన్నదన్న విషయాన్ని గ్రహించటంవల్లకలిగే సామరస్య సహకారాలవల్ల మాత్రమే అది ఏర్పడుతుంది. వ్యక్తి సంఘటితమైన సమాజవ్యక్తిత్వంలో ఒక సజీవమైన అవయవం వంటివాడు. వ్యక్తి—సమాజము, ఈరెండూ పరస్పరపూరకాలు; ఆవిధంగానే అవి రెండూ బలపడతాయి, ప్రయోజనాన్ని పొందుతాయి.

## సాధనాలను సాధ్యాలుగా భావించటం పొరపాటు

ఆంతరికమైన ఏకత్వ సమానత్వాలతో, అంటే ధర్మంతో అనుశాసితమైన, అచ్చమైన మానవతకు ప్రతిబింబాలుగా వ్యక్తులను మలచటం తప్పనిసరియైన విషయం. వాస్తవానికి ఒక పద్ధతి సమంగా పనిచేస్తోందా లేక చెడిపోయిందా అనేది, ఆపని చేసే వ్యక్తుల మంచిచెడులపై ఆధారపడి ఉంటుంది. అందుచేతనే సరియైన భావనతో ప్రేరితులైన వ్యక్తులు లేనప్పుడు ప్రజాస్వామ్యం, ఒక తక్కువస్థాయిమనుష్యుల వ్యవహారంగా మారిపోతుంది. అంతేగాదు అల్లరిమూకల అధికారంగా దిగజారిపోతుంది. వ్యక్తిలో సద్గుణాలను నిర్మించేపని పూర్తిగా అశ్రద్ధచేసి, సాధనాలైన సిద్ధాంతాలను, వాదాలను సాధ్యాలుగా భావించటమే పాశ్చాత్యదేశాల్లో ప్రవచింపబడ్డ వివిధసిద్ధాంతాల విషాదపరిణామానికి కారణం. ఈ సిద్ధాంతాలు ఈ వాదాలు అనేవి, మానవజీవితానికి నిండుతనం సమకూర్చే మంచి

సాధనాలు ఐతే కావచ్చును – చిన్నదైనా చాలా ప్రముఖమైన ఈ సత్యాన్ని వారు గుర్తించలేదు. ఈ విధంగా సాధనాలనే సాధ్యాలుగా వారు పొరబడి నందువల్లనే వారి జోస్యాలకు, ఆశలకు పూర్తిగా విరుద్ధమైన ఫలితాలను వారి ప్రయత్నాలు కలుగజేశాయి.

సాధనాలను సాధ్యంకన్న మిన్నగా భావించడం ఒక భ్రాంతి. దీనివల్ల కలిగిన తీవ్రమైన సాంఘికసమస్యలతో ఈనాటికిగూడ, ప్రజాస్వామ్యదేశాలు సతమతమవుతున్నాయి. వారు రూపొందించిన ప్రజాస్వామ్యం రెండు దోషాలకు దారితీసింది. ఒకటి ఆత్మ స్తుతి; రెండు పరనింద. ఇవి మానవుని మనస్సులోని ప్రశాంతతను విషపూరితంచేసి, సమాజంలోని వ్యక్తులమధ్య ఉండే పరస్పర సామరస్యాన్ని భగ్నంచేస్తాయి. ప్రజాస్వామ్యవ్యవస్థలో ఈరెండు దోషాలు ఎన్నికలసమయాలలో విచ్చలవిడిగా వినియోగ పడుతున్నాయి.

అందుచేతనే, మన జాతీయ సంప్రదాయంలో, పైపైన కనిపించే ప్రభుత్వ స్వరూపాన్ని గురించి ఎక్కువగా పట్టించుకోకుండా, వ్యక్తి నిర్మాణాన్నే మన పద్ధతులన్నిటికీ మూలాధారంగా స్వీకరించాం. దానిపైనే, మన మనస్సులను లగ్నం చేశాం. గణతంత్ర రాజ్యంనుంచి రాచరికం వరకు గల అనేక పద్ధతులను ఇచ్చట అవలంబించి చూచాం. చివరకు పాశ్చాత్యదేశాల్లో నిరకుంశత్వాన్ని పాదుకొలిపి రక్తం కాల్వలు గట్టించే విప్లవాలకు దారితీసిన రాచరికమే ఇక్కడమాత్రం ప్ర[illegible] కారిగా, వేల ఏండ్లుగా కొనసాగి, మన సమాజంలోని వ్యక్తులంద[illegible] శాంతి సౌభాగ్యాలను వర్షించేదిగానూ, మానవజీవనంలోని ప్రతిరంగంలోనూ స్వేచ్ఛాభావాన్ని సజీవంగా నిలిపిఉంచేదిగానూ, బహుళ ప్రయోజనకారి గానూ వెలిసిందని మనకు తెలుసు.



# రాజకీయ ఆర్థిక సువ్యవస్థ

మన దేశం ఈనాడు ప్రజాస్వామ్య వ్యవస్థను వరించింది. అయితే సామాన్య ప్రజలకు సరైన విద్యావిజ్ఞానాలు కలిగినప్పుడే అది విజయవంత మవుతుంది. ప్రజలు అక్షరాస్యులయినంతమాత్రాన ప్రయోజనం సిద్ధించదు. మన జాతీయ జీవితానికి సంబంధించిన రాజకీయ ఆర్థిక సూత్రాల వంటి వివిధ విషయాలలో తమ పాత్ర, బాధ్యతల గురించి వారికి గుర్తింపు కలిగించాలి.

## నేటి వికృతులు

అట్టి విజ్ఞానం కలిగిన ప్రజలు మాత్రమే సరైన ప్రజాప్రతినిధుల నెన్నుకోగలరు. అట్లాకాక విద్యావిహీనులు, అజ్ఞానులునైన ప్రజలు, స్వార్థానికీ, సంకుచిత ప్రయోజనాలకీ, నీచవ్యామోహాలకీ లోనై తేలికగా కొట్టుకుపోతారు. అట్టివారు సరైన ప్రతినిధుల నెన్నుకోలేరు. కాబట్టి మళ్ళీ ఎన్నికలు వచ్చేవరకూ, ప్రజానీకం ఆ విషఫలితాన్ననుభవించక తప్పదు. అటువంటప్పుడు అసలు ప్రజాస్వామ్యమే ప్రయోజనకారి కాదనే నిరాశా నిస్పృహలు కలుగుతాయి.

నేడు ప్రతినిధుల నెన్నుకొనే పద్ధతే ఒక విచిత్రంగా ఉంది. వ్యవసాయమంటే ఏమీ ఎరుగని ఒక వైద్యుడో, న్యాయవాదో, మరొక కేవల రాజకీయవాదో గ్రామీణ నియోజకవర్గానికి ప్రతినిధిగా ఎన్నికవుతున్నాడు. ఓట్లు రాబట్టుకోవటంలో గల సమర్థత ఎన్నికవటానికి అర్హతగా ఉంటోంది. గత మూడు దశాబ్దాలుగా ఎన్నికై ముందుకొస్తున్నవారిని ప్రజాప్రతినిధులనటంకన్న రాజకీయవాదులనటం సబబు.

## కొన్ని ఉదాహరణలు

1965లో పాకిస్తాన్ యుద్ధం జరుగుతున్న రోజుల్లో దిగ్భ్రాంతికరమైన ఒక సంఘటన జరిగింది. అప్పట్లో సరిహద్దుల్లోని ఒక ఆనకట్ట నుండి నీటిని విడువలేదు కాబట్టి మన వైపున వున్న కాలువలు ఎండిపోయాయి. కానీ పాకిస్తాన్‌వైపు మాత్రం కాలువలు నిండుగా ప్రవహిస్తూనే ఉన్నాయి. రక్షణశాఖలోని ఒక ఉపమంత్రిని కలిసినప్పుడు, "ఎందుకు మన కాలువలకు నీరు వదలలేదు? నీరు లేకపోతే పంట లెండిపోయి, ఆహారధాన్యాల కొఱతతో దేశంలో ప్రయత్నాలన్నీ కుంటుపడతాయిగదా" అన్నాను. "కాలువ నీటిమీద ప్రతిబింబాలవల్ల, శత్రువిమానాల దాడికి అవి తేలికగా గురవుతాయి" అని ఆయన సమాధానం చెప్పాడు. పాకిస్తాన్ వైపున ఉన్న కాలువలలో నీటి ప్రవాహం ఉందని గుర్తు చేసి, "దాని వలన, మనం ఊహించిన ఇబ్బంది వంటిది వారికి కలగదా" అనిఅడిగాను. అందుకు మంత్రిగారి వద్ద మారుమాట లేదు. కొద్ది దినముల తర్వాత ఒకసారి మరో పెద్ద మంత్రి తటస్థపడ్డప్పుడు, "మీ ఉపమంత్రి ఇచ్చిన వివరణ సరైనదేనా" అని అడిగాను. "అది కేవలం నిరాధారమైనదనీ ఆ ఉపమంత్రికి బొత్తిగా ఏమీ తెలియదనీ", బదులు చెప్పాడు.

ఈ విధంగానే ఆయా రంగాలలో కీలక పదవులను, దానితో ఏమీ తెలియని ప్రజాప్రతినిధులు స్వీకరించటం జరుగుతోంది. దానివలన విషయ

పరిజ్ఞానం కలిగిన సాంకేతిక నిపుణులు దిక్కుతోచని స్థితిలో పడి పోతున్నారు. "పైవారి" ఆజ్ఞలను అనుసరించటమే వారి పనై పోతోంది. బీహారులో వరదలు ప్రతీ ఏడాదీ భీతావహాస్థితిని సృష్టిస్తుంటాయని అందరికీ తెలుసు కూడా! "రైలు మార్గాలపై వంతెన లెన్నుండాలి? ఎంత పొడుగుండాలనే నిర్ణయం చేసేప్పుడు, కొండల్లో పుట్టిన నదులు వరదలు సృష్టిస్తాయనే సత్యం పరిగణనలోకి వచ్చిందా?" అని వంతెనలు కట్టడంలో నిపుణుడైన ఒక రైల్వే ఇంజనీరును అడిగాను. లేదని ఆయన నిజం ఒప్పుకున్నాడు. అట్టి విషయాలలో నిపుణుల మాటల కంటే, సామాన్యంగా రాజకీయాలకో, మరే ఇతర విషయాలకో ప్రాధాన్యం ఉంటుందని ఆయన చెప్పాడు.

## ప్రాదేశికము + వృత్తి ప్రాతినిధ్యము

ఈనాటి ఎన్నికల విధానంలో ఏర్పడే పెద్ద ఇబ్బంది ఇది ఒకటి. దీని నుంచి బయటపడటమెట్లా? జనాభా ప్రాతిపదికపై జరిగే భౌగోళికమైన ఎన్నికల పద్ధతి ఒకటీ నాడున్నది గదా. అలాగే వృత్తిపరమైన—

అంటే వివిధ వృత్తి వ్యాపారాల నుండి ప్రజాప్రతినిధుల నెన్నుకొనే రెండో పద్ధతి ఉంది. ఈ రెండో పద్ధతిని దీనికి జోడించటం ఇందుకొక పరిష్కారమార్గం కాగలదు. వ్యవసాయిక ప్రజాసమూహానికి ఒక వ్యవసాయికుడే ప్రతినిధిగా ఉండాలి. ఇలాగే జాతీయ జీవనంలోని ముఖ్యమైన ప్రతి రంగం నుంచీ ప్రతినిధులుండాలన్నమాట. దీని ద్వారా కొంత వరకైనా అవకతవకలను తగ్గించేందుకు వీలవుతుంది. అలాగే ఎన్నికైన ప్రతినిధివర్గం సమాజంలోని, అన్ని వృత్తులనూ, అన్ని అవసరాలనూ ప్రతిబింబించగలుగుతుంది.

## పంచాయతీయే పునాది

ఈ పద్ధతే ప్రాచీనకాలం నుంచీ మన దేశంలో వ్యవహారంలో ఉన్నది. మన సాంఘిక ఆర్థిక వ్యవస్థకు గ్రామపంచాయితీలే పునాది రాళ్ళుగా ఉంటూవచ్చాయి. ఈ పంచాయితులే ఎన్నికల పరిధిని పెంచు కుంటూపోయి, చిట్టచివరకు రాజులకు సలహా ఇచ్చే అష్టప్రధాన సమితి (ఎనిమిదిమంది మంత్రులు గలది) అనే సలహా మండలిని ఎన్నుకునేవి. ఈ పంచాయతులన్నీ వృత్తి ప్రాతినిధ్యం కలిగినవి. ఆనాటి ప్రజాజీవితం నేడున్నంత జటిలంగా లేదు. ఆ రోజులలో ప్రధానంగా నాలుగు వృత్తి కారుల సమూహాలుంటుండేవి. మొదటి వర్గం భౌతిక, ఆధ్యాత్మిక శాస్త్రాల నధ్యయనం చేసి ప్రబోధిస్తూ ఉండేది. పరిపాలనా వ్యవస్థకు చెందినవారు రెండవ వర్గం. మూడవ వర్గం వ్యాపారస్తులు. నాలుగవ వర్గంలో వ్యవ సాయదారులు, వ్యావసాయిక వృత్తులకు చెందిన చేతిపనులవారూ, తది తరులూ ఉండేవారు. అడవుల్లో నివసించేవారుండేవారు. వేట వారివృత్తి. ఆ విధంగా అటవీసంపద జీవనాధారంగా ఉండే ఐదోవర్గం కూడా ఉండేది. ఈ ఐదో వర్గాన్ని "నిషాదులు" అనేవారు. ఈ ఐదువర్గాల ప్రతినిధులూ సమాజంలోని అందరి ప్రయోజనాలను కాపాడేవారు.

## పరిష్కార మార్గం

ఈ రోజుల్లో పంచాయితీరాజ్ అనే నినాదం తరుచు వినవస్తోంది. కానీ దాని పద్ధతంతా అస్తవ్యస్తంగా ఉంది. వృత్తిపరమైన పద్ధతిని, ముఠాతత్వం, కులతత్వాలు త్రోసిరాజన్నాయి. కులతత్వాన్ని రెచ్చ గొట్టడం, బెదిరింపులూ, దాడులూ ఈ వ్యవస్థను నేడు నిర్ణయిస్తున్నాయి. వృత్తి నైపుణ్యం గంగపాలైంది. ఏది ఏమైనా నేడు ఇట్టిఅవకతవకలను సరిచేయాలి. ప్రతి రంగం నుంచీ, సద్బుద్ధీ, సామాజిక చైతన్యమూ గల వ్యక్తులనుకూడగట్టాలి. జాతీయ పునర్నిర్మాణానికి కావలసిన స్వచ్ఛమైన,

సమర్థమైన గ్రామీణ భూమికను ఏర్పరచటంలో ఇట్టి ప్రతినిధుల ప్రభావాన్ని వాటిమీద పడేట్లు చేయాలి. పంచాయితీలకు ఏకగ్రీవంగా ఎన్నిక జరగాలి, లేదా అసలు ఎన్నికలే కూడదు. ఈ నిర్ణయం చేసుకుంటే సరైన దిశలో ముందడుగు వేసినవాళ్ళమవుతాం. సముచితంగా, ప్రయోజనాత్మకంగా ఈ మౌలిక స్థాయి రూపొందాలంటే, ఓటర్ల జాబితాలూ, ఎన్నికల నియమావళి వంటి వానిని తగురీతిగా సరిదిద్దాలి. ఇందుగ్గాను రాజ్యాంగాన్ని తగురీతిగా సరిదిద్దుకోవచ్చును. ఈ విధంగా చేస్తే వివిధ వర్గాల మధ్య పరస్పర సహకార భావన పెరుగుతుంది; వారి వారి అవసరాలకూ, ఆకాంక్షలకూ సామరస్యం కుదురుతుంది. అయితే ఈ మార్గం అంత సులువైనది కాదు; ఎన్నో అడ్డంకులు ఎదురవుతాయి. అయినా, ప్రయోజనకరమైన ఫలితాలనిచ్చే అవకాశం ఉంది గాబట్టి, ఈనాటి వ్యవస్థలోని, విష పరిణామాలను తొలగించగలదు కాబట్టి అది ఆచరింపదగిన ప్రయోగమే.

## పదజాలానికి బానిసలమా ?

జాతీయ ఆర్థిక వ్యవస్థను రూపొందించటంలో గూడా, కేవలం ధనదృష్టికి ప్రాధాన్యం ఇవ్వని సంప్రదాయం మనకున్నది. మనం అర్థశాస్త్రాన్ని నీతిశాస్త్రము అన్నాం. ఈనాడు మనం రాజనీతి, ఆర్థికవిధానం వేరువేరని భావించుకుంటున్నాం— కానీ ప్రాచీన కాలంలో, నీతిశాస్త్రంలో ఈ రెండూ ఇమిడి ఉన్నాయి.

ఈనాడు ఈ రెంటిలోనూ ఆర్థికవ్యవస్థ మాత్రమే మరింత ముఖ్యమైపోయింది. అంతేగాక, ఈ విషయంలో 'సమాజవాదమే' ఆదర్శప్రాయమంటున్నారు. కానీ అనేక రకాల సమాజవాదాలుండటంచేత, దానియొక్క నిజస్వభావమేమిటో, స్వరూపమేమిటో తెలుసుకోవటం దాదాపు అసంభవమైపోతోంది. గిల్డు సోషలిజం, ఏనార్కిజం, సిండికలిజం, కమ్యూనిజం

వంటివన్నీ సమాజవాదం యొక్క వివిధ రూపాలు అంటున్నాం. ఏది ఏమైనా మనం అటువంటి మాటలకు మోజుపడి వానికి ఊడిగం ఎందుకు చేయాలి? మన దేశానికి స్వతఃసిద్ధమైన ఆలోచనా సరళి నాధారం చేసుకుని మనం సరిక్రొత్తగా ప్రయత్నం ప్రారంభించటం ఉత్తమం. అయితే ఇతర ఆలోచనాధోరణులలో మనకుపకరించే వాటిని తప్పక స్వీకరించాలి.

## విపరీతమైన కేంద్రీకరణ వైఫల్యం

ఆర్థికశక్తి యొక్క వికేంద్రీకరణమే సమాజవాదంయొక్క మౌలిక సిద్ధాంతం. ఈ వికేంద్రీకరణం, సమంజసంగా, సర్వసమంగా ఉండాలని సమాజవాదం ప్రధానంగా ప్రతిపాదిస్తుంది. అంతమేరకు భిన్నాభిప్రాయం ఉండనక్కరలేదు. కానీ వికేంద్రీకరణను అమలుపరిచే అధికారం ఎవరిది? ఈ ప్రశ్న ఉదయించగానే వానిలో విభేదాలు ఆరంభమవుతాయి. అట్టి నిర్వాహక వ్యవస్థ ఏది? వికేంద్రీకరణ అమలుపరచాలంటే కేంద్రీ కరణ తప్పనిసరి అనే ధోరణి ఈ రోజుల్లో ప్రబలుతోంది. అనేకములైన ఆర్థికశక్తి కేంద్రాలకు బదులు ప్రభుత్వమొక్కటే తన చేతుల్లో అన్ని శక్తులనూ కేంద్రీకరించుకోవాలనీ,– రాజకీయమైనశక్తి ఒక్కటే, ప్రభావ శాలియైన కేంద్రంగా రూపొందాలనీ, అది ఒక్కటే అన్నివిధాల ఉత్పత్తి సాధనాల మీద గుత్తాధిపత్యం కలిగి ఉండాలనే ధోరణులుగూడా బలపడు తున్నాయి.

ఇట్టి పరిస్థితుల్లో, రాజకీయాధికారమే సర్వశక్తిమంతమై, సమాజ మంతా రాజ్యాధిపతుల బానిసత్వంలోకి దిగజారిపోతుంది. ప్రభుత్వ దయా దాక్షిణ్య భిక్షల పరిమితిమేరకే ప్రజలకు అధికారం సంక్రమిస్తుంది. ఆ అధికారం ఎంత, ఎప్పుడు, ఎలా సంక్రమింపచేయాలన్నదంతా కూడా పరిపాలకులే నిర్ణయిస్తారు. సర్వసత్తాకమైన ప్రభుత్వానికి తందానా, తానా అనటంతోనే ప్రజలు సంతృప్తి చెందాలి.

ఏది ఏమైనప్పటికీ, ఈ దిశలో విదేశాల్లో కొనసాగిన వివిధ ప్రయోగాలు విజయవంతంకాలేకపోయాయి. ఈ ప్రయోగాల మొదటిఊపులో వారు, ఎవరింటిలో వారు వంటా, వార్పు వడ్డన మానేసారు. వాడకంతకు ఒకే వంటిల్లనే పథకాన్ని రూపొందించేంతవరకూ వెళ్ళారు. పిల్లలుగూడా, ప్రజాసమూహానికే చెందినవారనీ, వేరువేరు తల్లిదండ్రులకు చెందినవారు కాదనే అభిప్రాయంలో గూడా వారు ప్రయోగాలు చేసారు. పసివాళ్ళ పెంపకం, పోషణ మూకుమ్మడిగా సాగించారు. నిర్ణీత సమయాల్లో తల్లి వెళ్ళి తన బిడ్డకు స్తన్యం ఇచ్చివస్తూ ఉంటుంది. అయితే అంత తక్కువ వ్యవధిలో, ఆ మందలో, తల్లికి తన బిడ్డే తనకు దొరుకుతుందనే నమ్మకం, అట్టి అవసరం కూడా లేదు. తనకు ఏ బిడ్డ దొరికితే వారికే తాను పాలిచ్చి వచ్చివేయగలుగుతుంది అంతే.

అయితే, ఇట్టి ప్రయోగాల్ని జరిపిన తర్వాత, తమ కెదురైన దారుణానుభవాలనుబట్టి, మనిషి ఒక యంత్రం కాదని వారు తెలిసికోవటం ప్రారంభించారు. ప్రతి వ్యక్తీ, స్వంత లక్షణాలూ, అభిరుచులూ,మోజులూ కలిగి వుంటాడు. మానవ జీవితంలోని ఈ మౌలికాంశాన్ని విస్మరించి నప్పుడు, అందర్నీ ఒక నిర్జీవమైన యంత్రంలోని భాగాలవలే పరిగణించ వలసివచ్చింది. అప్పుడు అసంతృప్తి పెరిగింది. సంఘర్షణలు ఆరంభ మయ్యాయి; సామర్థ్యం దిగజారిపోయింది. తత్ఫలితంగా, అట్టి ప్రయో గాలను వారు మానివేయవలసివచ్చింది. ఇలా క్రొత్త పద్ధతులను కనుక్కో వాలనే వారి భావనకూ, వారు చేసిన ఈ ప్రయోగాలకూ వారిని మనం అభి నందించవచ్చు. సందేహించక్కర్లేదు. కానీ మనం కూడా అదే రకమైన వ్యర్థ ప్రయోగాలలో, నిమగ్నం కావాలని భావింపనక్కరలేదు!

## ధర్మకతృత్వం అక్కరకు వచ్చేనా ?

అర్థశక్తి యొక్క సమ్యగ్వికేంద్రీకరణ అమల్లోకి రావటానికి అవసరమైన మౌలిక సిద్ధాంతం గురించి ఇప్పుడాలోచిద్దాం. ఈ ఆలోచించే

టప్పుడు, మన పూర్వీకుల ఆలోచనలతో మన స్వంత ఆలోచనలను మేళ విద్దాం, ఈ దేశం యొక్క జీవనతత్త్వ, సంప్రదాయాల కనుగుణంగా మహాత్మాగాంధీ ధర్మకర్తృత్వ సిద్ధాంతమనేదానిని ప్రతిపాదించారు. ఆ సిద్ధాంతంలో ఉత్పత్తి చేయాలనే ప్రేరణ కుంటుపడదు. సాధ్యమయినంత ఎక్కువగా ఉత్పత్తిని సాధించాలనే ప్రేరణ కలుగుతుంది. కానీ ఆ సంపద కంతకూ తనను ప్రభువుగా భావించుకోకూడదు; అది మౌలికంగా సమాజానికి చెందినదే. సమాజసేవలో సద్వినియోగం అయ్యేట్లు చేయటానికి మాత్రమే ఆ ఆస్తికంతా తానొక ధర్మకర్తనని భావించుకోవాలి.

ఇది మన ప్రాచీన హిందూ భావనకు సన్నిహితమే. అందుకు సందేహం లేదు. కానీ దీనిలో ఒక పెద్ద ఇబ్బంది ఉంది. తనకు కలిసి రానిచోట కూడా, తన శక్తియుక్తులను ఏకోన్ముఖం చేసి పనిచేసేటువంటి పద్ధతి ఆధునిక కాలంలో కరవైపోయింది. మానవుని మనస్సు ఇంతగా వికృతమైపోయింది. ఈ అంశాన్ని మనం దృష్టిలో ఉంచుకోవాలి. ఆదాయం పన్ను విషయమే ఆలోచిద్దాం. అత్యధికాదాయం కలిగినవారిలో ఒక వ్యక్తి నూటికి రెండున్నర రూపాయలు మాత్రమే మిగుల్చుకోగలుగు తాడు. మిగిలినదంతా పన్నుగా చెల్లించాల్సిందే. అటువంటప్పుడు ఒక ఉత్పత్తిదారుడు, తాను అంత ఎక్కువగా ఉత్పత్తి చేయటం వలన ఉప యోగం లేదనీ, దానికన్న చాలా తక్కువ ఉత్పత్తి చేస్తేనే తనకు చాలా మిగులుతుందనీ భావించటం సహజం. కాబట్టి అతడు తక్కువ శ్రమ పడతాడు, లేదా పనినైనా ఎగవేస్తాడు. మన దేశంలోనే కాదు అన్ని చోట్లా ఇదే అనుభవం.

దీనికి పూర్తిగా వ్యతిరేకంగా, పశ్చిమ జర్మనీకి చెందినఉదాహరణ సుప్రసిద్ధం. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఆ దేశఆర్థికవ్యవస్థ దాదాపు కుప్పకూలిపోయింది. కాబట్టి ఆ దేశపు ఆర్థికశాస్త్రనిపుణులు, ఉత్పత్తిని పెంచే చర్యలపై ఆంక్షలన్నిటినీ తొలగించాలని నిర్ణయించారు; తొల

గించారు: తత్ఫలితంగా అత్యధికమైన ఆర్థికాభివృద్ధి అచట జరిగింది. పిమ్మట సంపదను చక్కగా వికేంద్రీకరించే వ్యవస్థను రూపొందించారు.

దీనివల్ల ఆ దేశంలో ఆర్థికవ్యవస్థ సుస్థిరమై ముందడుగు వేసిందని తెలుస్తోంది. ప్రపంచవ్యాప్తంగా ఉన్న పరిశ్రమల్లోనూ ఇదే అనుభవం. తగిన ప్రతిఫలం తమకు లభించటం లేదని తెలియగానే పని చేయాలనే ప్రేరణే కార్మికులలో దూరమవుతుంది.

## మధ్యే మార్గం

ఇటు ఉత్పత్తి తగ్గకూడదు, అటు సంపద యొక్క వికేంద్రీకరణా సరిగా కొనసాగాలి. అందుకు తగిన మధ్యేమార్గాన్ని మనం పట్టుకోవాలి. దీనికోసం వ్యక్తిపై కొన్ని అదుపులుంచాలి. అతని సంకుచిత వ్యక్తిగత స్వాతంత్ర్యభావన, విశాల సమాజ హితాన్ని భగ్నం చేసేదిగా ఉండరాదు. తనలాగానే ఇతరులు గూడా, సమానావకాశాలు కలిగి సుఖసమృద్ధులతో భౌతిక జీవనాన్ని కొనసాగించగలగాలి. దీని దృష్ట్యా ఒక వ్యక్తి, సంపాదించుకొనే స్వేచ్ఛ, కూడబెట్టే స్వేచ్ఛ కొన్ని పరిమితులకు లోనై ఉండాలి.

ఈ విషయానికనుగుణంగా వ్యక్తి మనస్సును మలచటానికి హిందూ దృక్పథంలోని విశిష్టత దోహదం చేస్తుంది. ఆనందం యొక్క అసలు తత్వం గురించి అతనికి బోధ జరుగుతుంది. అతని ఆదర్శం కేవలం భౌతిక సుఖాలనుభవించటం కాదు. అది ఆతనికి శాశ్వతానందాన్నివ్వలేదు. భౌతిక వస్తువులపైన ఆధారపడిగాక తనను గురించి తాను గంభీరంగా ఆలోచించుకొని అంతూ అవధీ లేని శాశ్వతానంద సాగరంలో అతడు ఓలలాడుతాడు. అప్పుడే అతడు తన చుట్టూ ఉన్నవారంతా తనలాగానే ఒకే చైతన్యంయొక్క ప్రతి రూపాలనీ, తన కృషి ఫలితాన్ని, తనలాగే వారందరూ అనుభవించదగినవారేనని అతడు గుర్తించగలుగుతాడు.

ఈ విధమైన జీవన దృక్పథం వలననే ఒక సమన్వయకారకమైన మధ్యేమార్గం లభిస్తుంది. తన అవసరాలూ, కుటుంబావసరాలూ, తీర టానికీ, బాధ్యతలు నిర్వర్తించటానికీ, అవసరమైనంతమేరకు ఆతనికి ఆస్తిహక్కు హామీ ఇవ్వాలి. (అయితే వ్యక్తిగత ఆదాయంపై పరిమితి గూడా దీనితో ముడివడి ఉండాలి) అంటే, ఒక పరిమితమయిన స్థాయి వరకూ, తన సుఖానుభవానికీ, వాంఛలు తీర్చుకోవటానికీ అవకాశం ఉండాలి. దాంతోబాటు సమాజంలోని ఇతర సభ్యులయొక్క అవసరాలను తీర్చేందుకు అతడు సమకూర్చవలసిన దానిని గూడా నిర్దేశించటం జరగాలి.

## విజయానికాధారం

ఏమైనప్పటికీ, ఈ పద్ధతి విజయవంతం కావాలంటే, ముందుగా మనిషి స్వభావాన్ని సరిదిద్దటం అవసరం. జీవనతత్వాన్ని గురించినసరైన అవగాహన వారిలో కలిగించాలి. వారు స్వార్థమే పరమార్థంగా గల తమ వేడుకలను అదుపు చేసుకొని, తోటిజీవుల యొక్క సుఖదుఃఖాలలో తాదాత్మ్యం చెందగలగాలి. సర్వతోముఖమైన జాతీయ సమృద్ధికీ, వికా సానికీ, అవసరమైన సమరసతా, సమన్వయాలనూ, పరస్పర సహకార కృషినీ, నిర్మించగల ఒకే ఒక సాధనం ఆత్మానుశాసనం. దానిని ప్రజలలో కలిగించాలి. ఆ విధంగా తమ జీవిత పరమలక్ష్యం గురించిన సరైన అవ గాహనతోబాటు, సమస్త సమాజంపట్ల ప్రేమానుబంధం కలిగి, ఆత్మాను శాసనంతో కూడిన వ్యక్తులతో నిండిన, సాంఘిక వ్యవస్థను నిర్మాణం చేయాలి. అదే ఈ భారతమాత సంతానంలో ప్రతి ఒక్కరి బాధ్యత.

# 5. రాష్ట్రీయ అంతరాత్మ ఆహ్వానం

మనదృష్టిలో 'హిందూరాష్ట్రం' అంటే ఒక రాజకీయహక్కుల ఆర్థికహక్కుల రాశిమాత్రం కాదు. అది ముఖ్యంగా సాంస్కృతికమైనది. ప్రాచీనములైన మన సాంస్కృతికమూల్యాలు దానికి ప్రాణంపోశాయి. అట్టి మన సాంస్కృతిక భావనలకు పటిష్ఠమైన నూతనచైతన్యాన్ని తిరిగి కల్పిస్తే అది మనలో నిజమైన రాష్ట్రీయజీవనదృష్టిని కలిగిస్తుంది. అదే ఈనాడు మనజాతి ఎదుర్కొనే అనేకసమస్యలను పరిష్కరించుకొనేందుకు మనంచేస్తున్న ప్రయత్నాలు సఫలం అయ్యేందుకు మార్గం చూపెడుతుంది.

కానీ, ఈరోజుల్లో సంస్కృతిలో నూతనచైతన్యాన్ని నింపటమనగానే అదివెనక్కి నడవడమనీ "ప్రతిక్రియాత్మక"మనీ తరచు ముద్రవేస్తున్నారు. ప్రాతకాలపు దురభిప్రాయాలనుగాని, మూఢవిశ్వాసాలనుగాని, సమాజ వ్యతిరేకాలైన ఆచారాలనుగాని పునరుద్ధరించడం "ప్రతిక్రియాత్మకం" అనిపించుకోవచ్చు. అట్టిప్రయత్నం సమాజాన్ని శిలాజంగా (ఫాసిల్) చేసి వేస్తుంది. కాని ఒకదివ్యత్వాన్ని సమకూర్చే శాశ్వతాలైన జీవనమూల్యాలను నూతనచైతన్యంతో నింపటం ఎన్నటికీ ప్రతిక్రియాత్మకకార్యం కానేరదు. అది ప్రాచీనకాలానికి చెందిఉన్నంత మాత్రాన దానిని ప్రతిక్రియాత్మకంగా

లేదన్నా, సత్యం లేకుండాపోదు

నిర్వచనానికి అందకపోయినా, మన సంస్కృతి మన జీవనంలోని అన్నిరంగాలపైనా, తన చెరగనిముద్ర వేసింది. సంస్కృతి వాటిలో ఆవిష్కరింపబడుతుంది. వాటిలో సంస్కృతియొక్క తత్త్వాన్ని మనం గుర్తించవచ్చు.

పండిత జవహర్లాల్ నెహ్రూ జీవితంలో దీనికొక ఉదాహరణ లభిస్తుంది. జీవనసమస్యలన్నింటియెడ, వారిది ప్రధానంగా భౌతికదృష్టి. దేవుడు, మతం, ఆత్మ, పునర్జన్మ మొదలైన విషయాలన్నీ వారి దృష్టిలో అర్థరహితాలు. వైద్యంకోసం వారు భార్యను విదేశాలకు తీసికొనివెళ్ళారు. దురదృష్టవశాత్తు ఆమె అక్కడే చనిపోయింది. మన సంప్రదాయప్రకారమే ఆమెశరీరం దహనం చేశారు. పాతిపెట్టలేదు. ఆ దేహం గుప్పెడు బూడిదగా మారిపోయింది. దాన్ని ఏంచేయాలి? ఒక అజ్ఞేయవాది "ఇది కేవలం బూడిద. పొలాలలో ఎరువుగా ఉపయోగించటమొక్కటే దీనికి సద్వినియోగం" అని తప్పనిసరిగా అనాలి. భౌతికవాదం ప్రకారం వట్టి బూడిదనుగురించి ఆలోచించటంలో అర్థం ఏమాత్రం లేదు. "నీవు మట్టివి. మళ్లీ మట్టిలోనే కలుస్తావు" అనిమాత్రం చెప్పవచ్చు. అంతే. నెహ్రూపండితుని మనస్సులో తీవ్ర సంఘర్షణ చెలరేగింది. ఆ దూరదేశంలో ఆ బూడిదను పారబోసి, తిరిగి రమ్మని వారిలోని అజ్ఞేయవాది (ఎగ్నాస్టిక్) చెప్పుతుంటే వారిలోని పురాతన హిందూరక్తం, తమ ప్రియభార్యయొక్క పవిత్రావశేషాలను తీసుకొనివచ్చి గంగామాత గర్భంలో కలుపుమని చెప్పింది. చివరకు పురాతనసంస్కారాలే జయించాయి. బూడిదను మన దేశానికి తీసికొనివచ్చారు. గంగాయమునలు, అంతర్వాహినియైన సరస్వతీ నది—వీటి పవిత్ర సంగమ స్థానమైన ప్రయాగలో ఆ చితాభస్మాన్ని కలిపారు. తమ బుద్ధి, ఆధునిక విద్యాభ్యాసం, శిక్షణ ఎదురుతిరిగినా, తమలోని అనిర్వచనీయశక్తి ఏదో ఆ భస్మాన్ని త్రివేణీ సంగమంలో కలుపుమని ఒత్తిడిచేసింది అని ఆతర్వాత

ముద్రవేయటం బుద్ధిహీనతను సూచిస్తుందేగాని వేరు కాదు. మన సంస్కృతిని నవచైతన్యభరితంగా చేయటమంటే వేలకొలది సంవత్సరాలుగా మన రాష్ట్రీయజీవనాన్ని వికసింపజేసి అమరంగా నిలిపిన ఆయా శాశ్వత జీవనలక్ష్యాలను అనుష్ఠించడమే అని మన భావన.

## నిర్వచనానికందని సుందరభావన

"హిందూ సంస్కృతిని ఎట్లా నిర్వచిస్తారు ?" అని అప్పుడప్పుడు కొందరు ప్రశ్నిస్తుంటారు. దాన్ని మనం నిర్వచించలేకపోవచ్చును కాని అనుభవించగలం. తాము నిర్వచించలేరు కాబట్టి, దాని అస్తిత్వాన్నే పూర్తిగా నిరాకరిస్తారు కొందరు. "మనం నిర్వచించలేని వస్తువువలన మనకు ప్రయోజనమేమిటి ? " అని వారంటారు. కాని ఈ వాదన తర్కానికి నిలబడుతుందా ? ఒక ఉదాహరణ చూద్దాం. వైద్యశాస్త్రం యావత్తూ ప్రాణ సంరక్షణకోసమే అభివృద్ధి చెందింది. ఐనా అత్యంత నవీన శాస్త్రజ్ఞులుకూడా 'ప్రాణం' అంటే ఏమిటో నిర్వచించలేకపోతున్నారు. అంతమాత్రాన వైద్యశాస్త్రంయొక్క ఉపయోగానికి ఆటంకం ఏమీలేదు. ప్రాణంయొక్క బాహ్యావ్యక్తీకరణ, మానవునిపై దాని ప్రభావం–ఈ రెండు దానియొక్క అస్తిత్వాన్ని విశ్వసించడానికి చాలును.

అదేవిధంగా మన ఆలోచనలు, మన ఆదర్శాలు, మన ఆకాంక్షలు అనేవి ఒక నిర్వచనరూపంగాను, గణితశాస్త్రంలోని ఒక సూత్రం మాదిరిగాను ప్రవచించడానికి సాధ్యంకానివైనా, తమ ప్రత్యేక వాస్తవిక అస్తిత్వాన్ని కలిగిఉన్నాయి. మానవ జీవితంలో అవి కీలకపాత్రను నిర్వహిస్తూనే ఉన్నాయి. నిజానికి అంచనా వేయటానికి, నిర్వచించటానికి, సాధ్యమయ్యే విషయాలకన్న ఎక్కువగా ఇటువంటి సూక్ష్మాంశాలే ఒక మనిషిలో నిజమైన వ్యక్తిత్వాన్ని రూపొందిస్తున్నాయి.

ఒకప్పుడు పండితనెహ్రూ చెప్పారు. ఇది సంస్కారం; మన సంస్కృతి వేసిన ముద్ర.

సంస్కృతియొక్క అట్టి ఆవిష్కారాలు మన జాతీయజీవనంలో ఎక్కడెక్కడ కనిపిస్తున్నాయి ?

## ప్రత్యక్షదైవం

విశ్వమంతటా వ్యాపించియున్న పరమసత్యాన్ని - దానికి ఏపేరు పెట్టినా సరే-సాక్షాత్కరించుకోవాలనే ఆకాంక్ష వాటిలో మొదటిది, మౌలికమైనది. చిన్న మాటల్లో చెప్పాలంటే 'భగవత్సాక్షాత్కారం పొందటమే' అది. అయితే ఆ దేవు డెక్కడున్నాడు ? ఆయనను తెలుసుకోవటం ఎట్లా ? ఆయన ఎట్లాఉంటాడు ? ఆయనయొక్క ఏ ఆకృతినిబట్టి, ఏ గుణాలనుబట్టి ఆయనపై మనసు లగ్నంచేసి, ఆయనను మనం సాక్షాత్కరించుకోగలం ? ఆయన నిరాకారుడు, నిర్గుణుడు, ఇత్యాదివివరాలన్నీ మనకు ఉపయోగించవు. ఇకపోతే ఇచట అనేక ఆరాధనామార్గాలు వికసించాయి. దాని ప్రకారం ప్రజలు దేవాలయాలకు పోయి అక్కడి విగ్రహాలను సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని ప్రతీకలుగా భావించి వాటిపై తమ మనస్సులను లగ్నం చేస్తుంటారు. కాని, చైతన్యంతో ఉప్పొంగే మనకు ఇవన్నీ సంతృప్తిని కలిగించవు. మనకు ప్రత్యక్షదైవం కావాలి. వింటూ మూర్ఖుని సమాధానం చెప్పని భగవంతునివల్ల ప్రయోజనమేమిటి ? భక్తులైన వ్యక్తులు అసామాన్యమైన యోగ్యతలను కలిగి ఉన్నప్పుడు తప్ప ఇతరత్రా ఈ విగ్రహాలు విచారించవు, సంతోషించవు, ఏభావాన్నీ వ్యక్తీకరించవు. సామాన్యమానవులందరికీ విగ్రహాలనేవి భగవంతునియొక్క చైతన్య రహితమైన ప్రతీకలు మాత్రమే. అందుచేత, మనలను కార్యాచరణయందు నిమగ్నులను చేసి, మన వ్యక్తిత్వంలో ఇమిడియున్న శక్తిసామర్థ్యాలను వెలికి తేగలిగే ప్రత్యక్షదైవాన్ని మనం కోరుకుంటాం.

అందుచేతనే మనపూర్వీకులు 'మనప్రజలే మనభగవంతుడు' అని ప్రకటించారు. మానవజాతికి జ్ఞానప్రబోధంచేసిన ఉత్తమగురువులలో ఒకడైన శ్రీరామకృష్ణపరమహంస 'మానవుణ్ణి సేవించు' అని అన్నారు. వారియొక్క అత్యుత్తమ శిష్యుడైన వివేకానందుడుకూడా అదే విషయం మరింతగా నొక్కివక్కాణించాడు. మానవుడు అంటె 'మానవజాతి' మొత్తం అన్నభావన చాలా పెద్దవిషయం; దాన్ని మనం కండ్లారా చూచి అనుభవించగల ఒకే ఒక స్థూల ఆకృతిగా తేలికగా అర్థంచేసికోవటం చాలాకష్టం. అందుచేతనే మానవసమాజం అంతకూ సేవచేయాలని కృషిప్రారంభించిన అనేకమంది జీవితాలు చివరకు జడాలుగా, నిష్క్రియాలుగా పరిణమించాయి. కాబట్టే మన పూర్వీకులు మానవుని మనస్సుయొక్క, ఆలోచనలయొక్క అవధుల నర్థంచేసుకొని, మానవతాభావం మంచిదేకాని, ఒకడు ఆ స్థాయికి చేరాలి అంటే తాను అర్థంచేసుకొని అనుభవించి సేవించగలిగిన కొన్ని పరిధులకు పరిమితం కావాలి అని అన్నారు. హిందూసమాజమే సర్వశక్తి మంతుడగు పరమేశ్వరునియొక్క అభివ్యక్తమైన విరాట్స్వరూపం అని వారన్నారు. వారు 'హిందు' అనే పదాన్ని ఉపయోగించకపోయినప్పటికీ పురుషసూక్తంలో వారుచేసిన సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని వర్ణనలలో సూర్యచంద్రులు అతని కండ్లుగాను, ఆకాశం నక్షత్రాలు అతని నాభినుండి ఉత్పన్నమైనవిగాను చెప్పబడినవి.

> బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః
> ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥

(బ్రాహ్మణుడు అతని శిరస్సు, క్షత్రియుడు అతని చేతులు, వైశ్యులు తొడలు, శూద్రులు పాదములు. ఈవిధమైన చాతుర్వర్ణ్యవ్యవస్థ కలిగిన ప్రజానీకం, అంటే ఈ హిందూసమాజమే మన భగవంతుడని దీని అర్థం.)

## నిజమైన సేవాభావం

సమాజంలోనే భగవంతునిచూచే శ్రేష్ఠమైన ఈ దృష్టియే మన రాష్ట్రీయతలోని మూలతత్త్వం. ఇది మన భావనయందంతటా వ్యాపించి మన సాంస్కృతిక వారసత్వంలోని అనేక విశిష్టభావనలకు జన్మనిచ్చింది.

ఈదృష్టియే సమాజంలోని ప్రతివ్యక్తిని సమష్టిలోని ఒక అంశంగా మనం భావించేట్లుచేస్తోంది. అందుచేతనే మనదృష్టిలో వ్యక్తులందరూ సమానముగా పవిత్రమైనవారే, మనం సేవించదగినవారే. కాబట్టి వారిమధ్య వ్యత్యాసంచూపే తలంపు నింద్యమవుతోంది. ఈవిధంగా సమాజసేవాభావం దివ్యమైన భగవత్సేవాభావనగా మనసంస్కృతిలో మలచబడింది.

మనచుట్టూ అనేక లక్షల మానవులు ఆకటితో అలమటిస్తూ దిక్కులేక్క బ్రతకటానికి కావలసిన కనీసపు సదుపాయాలైనా లేకుండా ఉన్నారు. వారి దుఃఖమయ జీవితగాథలు, రాతిగుండెలనుకూడా కరిగించివేస్తాయి. సాక్షాత్తూ భగవంతుడే నిరుపేదల, నిరాశ్రయుల, వ్యధితుల రూపాలు దాల్చి వచ్చాడు. ఎందుకొరకు ? ఆయనకు ఏదైనా కావాలా ? తనను సేవించేందుకై మనకొక అవకాశమియ్యడానికి ఆయన ఆ యా రూపాల్లో వస్తాడు. అట్టి వ్యక్తులనే శ్రీ రామకృష్ణపరమహంస 'దరిద్ర నారాయణులు' అని అన్నారు.

ఒకసారి మన జీవితం ఇట్టి నిజమైన సేవాభావంతో నిండితే మన యొక్క వ్యక్తిగత, సాంసారిక సంపదలు–ఎంత అధికంగా ఉన్నాసరే– నిజానికి అవి మనకు చెందినవి కావు అనే భావన మనలో కలుగుతుంది. అవన్నీ సమాజరూపంగా ఉన్న సర్వేశ్వరుణ్ణి పూజించేందుకు ఉపకరణాలు మాత్రమే అని తోస్తుంది. అప్పుడు మన జీవితమంతా సమాజసేవకు అంకితమౌతుంది.

*ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్*
*తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ ధనమ్ ॥*

(ఈసృష్టియందంతటా ఈశ్వరుడు వ్యాపించియున్నాడు. అతడు నీకై వదలిన దానిని అతనికి నైవేద్యము చేసిన అనంతరం అనుభవించు. ఇతరులకు చెందిన సంపదను దోచుకోవద్దు.)

అని ఉపనిషత్తులు చెప్పుతున్నాయి.

కాబట్టి మనం అధికాధికంగా భౌతికసంపదను సాధిద్దాం. అప్పుడే సమాజంలో ఉన్న పరమేశ్వరుని మనం మరింత ఉత్తమంగా సేవించ గలం. నీలోని సేవాశక్తిని దెబ్బతినకుండా నిలిపి ఉంచేందుకు ఎంతసంపద అవసరమో అంతస్వల్పసంపదనే నీవు నీ సంపాదన మొత్తంలోనుండి నీకొరకు వాడుకోవాలి. అంతకన్నా అధికసంపదను నీవు కోరినా, నీస్వార్థానికి ఉపయోగించుకున్నా అది సమాజాన్ని దోచుకోవటమే అవుతుంది. మనువు ఇట్లా అన్నాడు :

*యావత్ భ్రియేత జఠరం తావత్ స్వత్వం హి దేహినాం*
*అధికం యోఽభిమన్యేత స స్తేనో దండ మర్హతి ॥*

(దేహధారణకొరకు ఎంత అవసరమో, అంతమాత్రమే స్వీకరించు. అంతకన్న ఎక్కువ స్వీకరించటం దొంగతనమౌతుంది; అది దండనార్హం.)

ఈ విధంగా మనం సమాజానికి ధర్మకర్తలం మాత్రమే. నిజమైన ధర్మకర్తలుగా మనం రూపొందినపుడే సమాజాన్ని ఉత్తమరీతిలో సేవించ గలం. ఇట్టి విశుద్ధమైన సేవాభావం అహంకారానికిగాని, ఆత్మస్తుతికిగాని అవకాశమివ్వదు.

## అధికారం కాదు—కర్తవ్యం

ఈనాడు ప్రతిచోటా హక్కుల గురించి గోలపెట్టడం మనం వింటూఉన్నాం. మన రాజకీయపక్షాలన్నీగూడా పదేపదే ప్రజల హక్కులను గురించి మాట్లాడుతూ వారిలో అహంకారాన్ని రెచ్చగొడుతున్నాయి. విధులను గురించి, నిస్వార్థ సేవాభావన గురించి నొక్కిచెప్పడం ఎక్కడా జరగటం లేదు. అహంకారపూరితమై, అధికారవాంఛలతో నిండిన వాతావరణంలో సమాజానికి ఆత్మమైన పరస్పర సహకారభావన జీవించజాలదు. అందుకనే గురు శిష్యుల మధ్యగాని, కార్మికులకు పరిశ్రమల యజమానులకు మధ్య గాని, సమాజంలోని ఇటువంటి అనేక అంగాంగాల మధ్య వివిధాలైన

సంఘర్షణలు మనం చూస్తున్నాం. మన సాంస్కృతిక దృష్టిని సరిగా అలవరచుకోవడంవల్ల మాత్రమే నిజమైన సహకారభావన, కర్తవ్యజ్ఞానాలు మన జాతీయజీవనంలో మరల నెలకొంటాయి.

## ఇంద్రధనస్సు మన సంస్కృతి

నేటికీ ప్రపంచంలో మరెవ్వరూ అధిరోహించడాని కాశించని

*"ఏకం సద్ విప్రా బహుధా వదంతి"*

(సత్యమొక్కటే. పండితులు దాన్ని అనేకవిధములుగా చెప్పుతారు)

అనే భావన మన సంస్కృతియొక్క హిమవంతునివలె మహోన్నతమైన మరొక దృష్టిని వ్యక్తీకరిస్తోంది. ఇట్టి చక్కని భావనను ప్రకటించేటందుకు ఆంగ్లంలో సరియైన పదజాలం లేదు. ఇట్టిభావనను వ్యక్తంచేసేందుకు తరచు ఆంగ్లంలో ఉపయోగించే సహిష్ణుత అనే పదం చాల అల్పమైనది; బాధను భరించకలిగి ఉండడం అనేదానికి ఇది మారుపేరు. ఈ మాటలో ఒక విధమైన అహంకారం ఇమిడిఉంది. ఇతరుల దృక్పథాలపట్ల ఏ విధమైన ప్రేమగాని, గౌరవంగాని లేకుండా, కేవలం వాటిని సహించే ఉద్దేశ్యం మాత్రమే ఇందున్నది. ఇతరుల విశ్వాసాలను, దృక్పథాలను గౌరవించడమే గాకుండా ఒకే సత్యాన్ని చేరే అనేక మార్గాల్లో అవీ ఉన్నాయి అని స్వీకరించటం, విశ్వసించటం మనం నేర్చుకొన్నాం.

తలో ప్రక్కనుండి పర్వతశిఖరంపైకి ఎక్కుతున్న వ్యక్తులు ఎవరికి వారు ఆ పర్వతాన్నిగూర్చి చేసిన విభిన్నవర్ణనలవంటిది ఈవిషయం. ఒకడు ఆ పర్వతాన్ని పెద్ద బండరాయి అనీ, వేరొకడు అంతా అడవేగాని రాళ్ళులేవు అనీ, ఇంకొకడు పొదలతో నిండిఉన్నదనీ ఇట్లాగే అనవచ్చు. వారిలో ప్రతిఒక్కడు చెప్పినది నిజమే కాని అది అసంపూర్ణం. అటువంటి అనేక పాక్షికవర్ణనలను జోడించి చూచినప్పుడు ఆ పర్వతముయొక్క

సంపూర్ణమైన, నిర్దుష్టమైన స్వరూపపవర్తన మనకు లభిస్తుంది. ఒకటిలో సగంగాని, మూడవవంతుగాని దానిలో భిన్నం అవుతుంది. అటువంటి భిన్నాంకాలన్నిటినీ కూడితే మన కొక పూర్ణాంకం లభిస్తుంది.

అట్లే వ్యక్తులు ఎంత అసంపూర్ణులైనప్పటికీ, అట్టివారినందరిని సమష్టిలో చేర్చినపుడు అది ఒక సమగ్రమైన సమాజంగా రూపొందుతుంది. వ్యక్తుల్లోని అసంపూర్ణతలు కారణంగా పైపైన కనిపించే తేడాలు శక్తిమంతమూ, పరిపూర్ణమూ అయిన ఒకే గొప్పరాష్ట్రం అనే పరమసత్యం యొక్క అసంఖ్యాక వ్యక్తీకరణ వైవిధ్యాలను మాత్రమే సూచిస్తాయి. ప్రతివ్యక్తియందు సహజంగానే దివ్యత్వమున్నదనే సత్యస్ఫురణాన్ని గుర్తించకలగటం మన జీవితంలోని ఆర్థిక, రాజకీయ, సామాజిక, ధార్మికాది రంగాలన్నింటిలోను-వివిధాంగాల్లో - చొచ్చుకుపోయింది. అది పరస్పర సౌహార్దంతో, గౌరవంతో కూడుకొన్న ఒక సామరస్య విధానాన్ని వారియందు రూపొందించింది. సార్వజనికమైన ఈ ఆత్మీయతాభావమే ప్రపంచపు టాలోచనారీతులకు మనసంస్కృతి సమకూర్చిన అమూల్యమైన కానుక.

## సామాన్యుని స్థాయి పెంచాలి

మనసంస్కృతిలోని ఇటువంటి ఉదాత్తమైన విశిష్టలక్షణాలను పునరుద్ధరించినప్పుడే మన సామాన్య ప్రజానీకం మన జాతీయ జీవన దృక్పథంతో ప్రేరితమౌతుంది. అపుడే వారు వ్యక్తిగతమైన, కుటుంబ సంబంధమైన, తదితరాలైన సంకీర్ణాలోచనల ఆవరణను బ్రద్దలుకొట్టుకొని బయటపడతారు; స్నేహ సౌశీల్యాలను పెంచుకొని, బలిదానం చేయడంలో ఉన్నతస్థితి నందుకొంటారు. చెదురువాటుగా అసాధారణ శక్తిసంపన్నులైన కొద్దిమంది దీర్ఘకాయులున్నంతమాత్రాన మరుగుజ్జులతో నిండిన ఏ జాతిగాని తన సర్వసాధారణస్థితిని పెంచుకోలేదు. అసాధారణ గుణాలు కలిగిఉండడం ఏ కొద్దిమందికో అదృష్టవశాత్తు లభిస్తుంది. అట్టి

మహాత్ములఎదుట మనం తలవంచి మోకరిల్లుతాం. వారికి తలవంచి నమస్కరిస్తూనే మనం—అంటే సామాన్యులమైన మనం—మనసంగతేమిటి? అని మనలో మనమే ప్రశ్నించుకొంటాం. అట్టి అసాధారణవ్యక్తులు మనకు ధైర్యాన్ని ఇవ్వవచ్చు. కాని ఒక్కొక్కసారి, మనం అతిసామాన్యస్థితిలో నిలచిఉన్నామని, వారివలె దివ్యమైన ఉన్నతి పొందలేనిస్థితిలో ఉన్నామనే ఆలోచనలను కల్పించి ఆ వ్యక్తులు మనలను క్రుంగతీస్తారుగదా. అటువంటప్పుడు దీనినుండి బయటపడటం ఎట్లా ?

ఒకనాడు ఈ దేశ సామాన్యమానవుడు ఇతరభూములలోని సామాన్యమానవునికన్న పోలిక కందనంత ఉన్నతస్థాయిలో ఉన్నాడని ఆనాటి విదేశీ చరిత్రకారులు, యాత్రికులు జరిపిన తులనాత్మక అధ్యయనం తెలియజేస్తోంది. ఆనాటి మన రాష్ట్రీయనాయకులు సమాజంలోని అన్నిస్థాయిల్లోను మన సాంస్కృతిక సంస్కారాలను అలవరిచేందుకు చేసిన నిరంతరమైన తీవ్రప్రయత్నమే అందుకు స్పష్టమైన కారణం. అందుచేతనే మనసమాజంలోని ప్రతివర్గమునుండి – విద్య, విజ్ఞానాభివృద్ధికి అంకితమైనవారితో మొదలుకొని రైతు, సాలె, చర్మకారుడు, పాకి—అందరిలోకూడా మహాత్ములు వీరులు ఉద్భవించారు. వారి ఆలోచనలు, ఆచరణలు, పాటలు, ప్రవచనాలు పైకి కనిపించే అడ్డుగోడలన్నిటినీ అదిగమించి మనజాతీయుల నందరినీ ఉత్తేజపరచాయి.

## నేటి జాగృతి

ఇటువంటి సరియైన సాంస్కృతిక దృక్పథం లేకపోవడంవల్లనే ఈనాడు మన ప్రజానీకం అంతులేని సమస్యలతో కొట్టుమిట్టాడుతోంది. అవన్నీ సామాన్యమానవుని స్థాయి దిగజారిపోవడం అనే ఒకే దుంపనుండి పుట్టిన పిలకలే. ఈ మధ్య మన ప్రజలలో ఒక గొప్ప జాగృతి కలిగిందని, ఒకానొక రాజకీయ చైతన్యం దినదినాభివృద్ధి చెందుతోందని, తరచు వింటూంటాం. జాగృతి అంటే విజ్ఞానం; విజ్ఞానం అంటే భిన్నత్వంలో

ఏకత్వాన్ని దర్శించగల్గి, స్పర్థకు బదులు సమరసతను చూడగల్గి, స్వార్థ సేవకు బదులు సమాజాన్ని ఆరాధించగలగటం – ఇటువంటి యోగ్యతను కలిగిఉండటం అని అర్థం. అంటే వేర్పాటుధోరణులు అదృశ్యమై వాటి స్థానే సమైక్యతకు ప్రేరణ జనించాలి. అట్లాకాకుండా మనం మన ప్రజలను సమైక్యపరచేందుకు కృషిచేయక ఉన్న చీలికలను పెంచడానికే వివిధ సమస్యలను వాడుకుంటే మనం అజ్ఞానంనుంచి జ్ఞానంలోకి పురోగమిస్తున్న వారం కాక కేవలం అజ్ఞానపు అగాధాల్లోకి కూలిపోవటమే ఔతుంది.

అయితే ఈ సందడికి, మనచుట్టూ జరిగే ఆందోళనలకు అర్థమేమిటి? జీవకోటి స్పృహలేనిస్థితిలోగూడా క్రియాశీలతను కనపరుస్తూ ఉంటుంది. ఉదాహరణకు – బాహ్యచైతన్యం లేనిస్థితిలో గూడ కప్పయొక్క రక్త నాళాలలో రక్తం ప్రవహిస్తూ ఉండటం ఒక సూక్ష్మదర్శినిద్వారా మనం చూడవచ్చు. అయితే అది పురోగమిస్తుందా ? లేదు. అంతేగాదు: అది చచ్చిపోతూఉంది. అట్లాగే అజ్ఞానం పరాకాష్ఠ నందిఉన్నపుడుకూడా కార్య శీలత ఉంటుంది. ఈనాటి మన కార్యక్రమాలలో చాలావాటిని ప్రేరేపించే ఉద్దేశ్యాలను, అలవోకగా చూచినానరే, అవన్నీ నిజమైన జాగృతి–అంటే విజ్ఞానం కారణంగా ఆరంభమయినవిగాక అజ్ఞానమూ, అంధకారాల వల్ల ప్రారంభం అయినట్టివే అనే విశ్వాసం మనకు కలిగితీరుతుంది.

## నేటి వికృతులను పారద్రోలాలి

మనం మన ఉదాత్త సాంస్కృతిక మూల్యాలను గురించి మాట్లాడ టంతోటే, అధునాతన పాశ్చాత్య నాగరికతలో మునిగితేలే వ్యక్తులు అది ఏదో రహస్యమైనది, పరలోకానికి చెందినదీ అని భావిస్తారు. ఒకనాడు మన రాష్ట్రీయ జీవనానికి వైభవాస్పదమైన ఆ యా సిద్ధాంతాలను అర్థం చేసుకొనే శక్తిని పోగొట్టిన మన భావదన్యపు లోతులను అది సూచిస్తుంది. ఒకసారి నా మిత్రుడొకడు నాదగ్గరనుంచి ఒక పుస్తకం తీసుకువెళ్ళాడు అతడు దాన్ని నాకు తిరిగి ఇయ్యవలసినరోజున, దాన్ని ఒకకోతి ఎత్తుక

పోయింది. అది ఒక చెట్టుకొనన కూర్చొని, దాన్ని ఇటు అటు తిరగవేసి (బహుశః నా మిత్రుడు ఆ విధంగానే చేయటం అది చూచిఉంటుంది) అనేక పర్యాయాలు తెరచి, మూసి, చివరకు వెనుకకు తిరిగివచ్చి నా మిత్రుడు ఆశ్చర్యంతో చూస్తూ ఉండగా దానిని బల్లపై పెట్టి వెళ్ళిపోయింది. బహుశః మానవుల చర్యలు నిగూఢమైనవి, రహస్యమైనవి అని అది భావించి ఉండవచ్చు. మన సంస్కృతి బోధించే విషయాలపట్ల మన నేటి మనఃస్థితి అటువంటిదే.

మరోవైపు నృత్య, నాటక, సంగీతాలనుమాత్రమే సంస్కృతి అని భావించేవాళ్ళు ఉన్నారు. అట్టి సాంస్కృతిక కార్యక్రమాలు మన దేశంలో ప్రతిచోటా జరుగుతూ ఉండటం మనం చూస్తాం. సంస్కృతి అంటే చౌకబారు వినోదాలకు మారుపేరయింది. ఇది చివరకు ఎంతటి హాస్యాస్పదము, అవమానకరమునైన స్థితిదాకాపోయిందంటే, అగాధమైన అవినీతిలో పొర్లాడ దానికి 'పేరు పడ్డ' సినిమా నటీనటులు కొందరు విదేశాలను దర్శించే మన సాంస్కృతిక రాయబారవర్గాల్లో సభ్యులుగా ఉండేటంతవరకు దిగజారి పోయింది. సీతారాముల జన్మదాత్రి అయిన ధాత్రి మనది. అలనాడు సమస్త ప్రపంచాదరాభిమానాలకు పాత్రులైన అనేకమంది మహర్షులను, దార్శ నికులను, ఆధునికకాలంలో వివేకానంద, రామతీర్థులవంటివారిని తన సాంస్కృతిక రాయబారులుగా దేశ దేశాలకు పంపించినట్టి మన భూమినుండి ఈనాడు ఈ సాంస్కృతిక రాయబారులు వెళ్ళడం నేటి మన పతనస్థితిని కండ్లకు కట్టినట్లు చూపుతుంది.

అనేకమంది మన "సాంస్కృతిక పురుషులు" 'మిస్ ఇండియా' అందాలపోటీలలో న్యాయనిర్ణేతలుగా పాల్గొనడం చూస్తూ ఉంటాం. మన సంస్కృతికల్పనలో, మన స్త్రీత్వ ఆదర్శాలపట్లవారికిగల అభిప్రా యాలనుబట్టిచూస్తే సీత, సావిత్రి, పద్మిని, నివేదితలవంటివారికి స్థానం లేదు. అట్టిపోటీలో నిజంగా అచ్చమైన భారతీయసౌందర్యాన్ని మనం చూడలేము.

## పటాటోపం లేదు, ప్రచ్ఛన్నం కాదు

మనం ఈనాటి వికృతులనుండి విడివడి శాశ్వతమైన, ప్రాణప్రదమైన మన సాంస్కృతికసారాన్ని ఆకళించుకోవాలి. మన సాంస్కృతిక సంస్కారాలను ప్రసాదించే కార్యక్రమం ఇది. అట్టిది బహిరంగమైన పటాటోప ప్రచారాలకు అతీతమైన వాతావరణంలో నిశ్శబ్దంగా నిలకడగా ప్రతిరోజు సంవత్సరాలతరబడి కొనసాగుతూనే ఉండాలి. కాని ఈనాడు సంస్కృతిని సమంగా అర్థంచేసుకోలేక నిశ్శబ్దతను రహస్యం అని పొర పాటున భావిస్తున్నారు. మనసంస్కృతి పైపై పటాటోపాన్ని సమర్థించదు.

ఉదాహరణకు హిందూదంపతులు తమ అన్యోన్యానురాగాన్ని పైకి ప్రదర్శించరు. హైందవగృహిణి తన ప్రేమను కన్నీరు, కౌగిలింతలు ఆక్రోశాలు మొదలైన వాటి ద్వారా ప్రకటించదు. కాని పాశ్చాత్యులు మాత్రం నాటకీయాలైన చుంబనాలింగనాదుల ద్వారా తమ ప్రేమ ప్రకటిస్తారు. ఇది చాలామట్టుకు పైపై ప్రదర్శనమాత్రమే. ఎందుకంటే మరునాడే వారు విడాకులు పొందే ప్రమాదముంది. మనవారు బాహ్యంగా ప్రదర్శించరుకాని, వారిముఖాలలో ప్రేమభావం దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ ప్రేమ భగ్నమౌతుందేమో ననే భయానికైనా ఆస్కారం లేకుండా శాశ్వతంగాఉంటుంది. విచ్చలవిడిగా ప్రదర్శించటంకన్న హృదయ సంవేదనలను అదుపులో ఉంచుకొనడం శక్తిమంతము, మనోజ్ఞము అవు తుందని మన సంస్కృతి ఎల్లప్పుడూ బోధిస్తూఉంది. ప్రేమ ప్రకటనలోని మన పద్ధతి శ్రేష్ఠమైనదైతే పటాటోపంలేకుండా పనిచేయడంకూడ శ్రేష్ఠమైనదే ఔతుంది.

## శాశ్వతమూల్యాలకు దోహదం చేయాలి

ఇటువంటి సనాతనములు, జీవనప్రదములు నైన మన సాంస్కృతిక విశేషాలను నూత్నచైతన్యంతో నింపటం, ఈనాటి మన జాతీయస్థితిగతుల

దృష్ట్యానేకాక, అంతర్జాతీయ స్థితిగతులదృష్ట్యాకూడా అతిప్రధానము అత్యంతావశ్యకము. మనయొక్క సాంస్కృతిక దృక్పథమే మనిషికి మనిషికి మధ్య ప్రేమాభిమానాలకు, సమరసతకు పునాది కల్పిస్తుంది; ఒక సమగ్ర జీవన దర్శనాన్ని మూర్తీభవింపచేస్తుంది. యుద్ధాలచేత ఛిన్నాభిన్నమైన నేటి ప్రపంచానికి మనం దాన్నే ప్రసాదించాలి. ఈ కార్యంలో మనం విజయం పొందాలంటే ముందుగా మనమే కొన్ని ప్రమాణాలను ఏర్పరచుకోవాలి. విదేశీ వాదాలయొక్క భావబంధాలనుండి, విదేశీ పద్ధతులనుండి, అస్థిరాలైన నూతన జీవనపద్ధతులనుండి ముందుగా బయటపడాలి. ఇతరులకు ప్రతిబింబంగా ఉండటంకన్న జాతికి వేరే అవమానం ఉండబోదు. గ్రుడ్డిగా అనుకరించడం ప్రగతి ఎన్నటికీ కాదని మనం గుర్తించాలి. అది కేవలం భావదాస్యానికి తీసుకుపోతుంది.

ఏది ఏమైనప్పటికి నేటి వికృతులు, పొరపాటు ఆలోచనలు కేవలం తాత్కాలికములే అని మన విశ్వాసం. మన సంస్కృతియొక్క వేళ్ళు అమృతస్రోతస్వినిలోకి గట్టిగా లోతుగా వ్యాపించాయి. అవి అంత తేలికగా ఎండిపోవు. అవి తప్పనిసరిగా తమయొక్క యుగయుగాల ఓజస్సును జీవనశక్తిని ప్రతిష్ఠించుకొని, కడచిన కొద్ది శతాబ్దాల కాలంలో ఏర్పడిన పరభాగ్యోపజీవియైన పద్ధతిని త్రోసివేసి మరొక్కసారి స్వచ్ఛంగా ఉజ్జ్వలంగా చిగురించి తీరుతాయి,

# 6. నిజమైన రాష్ట్రీయ వైభవం

మన హిందూరాష్ట్రంయొక్క ఘనతను, సర్వతోముఖవైభవాన్ని పునరుజ్జీవింపచేయడమే మనం స్వీకరించిన ఏకైక లక్ష్యం. ఈ లక్ష్యాన్ని సరిగా ఆకళింపుచేసుకొనేందుకుగాను ముందుగా మనం మన ప్రార్థనలో చెప్పుకునే 'పరమ వైభవస్థితి' అంటే ఏమిటో సరిగా అర్థంచేసుకోవాలి. అటుతరువాత అట్టి వైభవం చేరుకోవటం ఎట్లాగో, అట్టి జాతీయ వైభవ స్థితిని పొందిన తరువాత నిలుపుకోవటం ఎట్లాగోకూడ అర్థం చేసుకోవాలి.

సాధారణంగా ఒక జాతియొక్క వైభవాన్ని దానియొక్క భౌతిక సంపదలనుబట్టి అంచనా వేస్తాం. వైభవస్థితినందిన జాతికి సర్వసమృద్ధి తప్పక ఉండితీరాలనటంలో ఎట్టిసందేహం లేదు. సమాజంలోని ప్రతి వ్యక్తికి జీవితావసరాలన్నీ సంపూర్ణంగా సమకూర్చాలి. అయితే మనం ఆశించే జాతీయ వైభవంయొక్క స్వరూపం పూర్తిగా ఇట్టిదేనా? ఇదే అన్నిటికన్నా ముఖ్యంగా మనం ఆలోచించవలసిన ప్రశ్న.

## మన దృష్టిలో వైభవం

ప్రతి జాతికి తన ప్రత్యేక జీవనరాగం ఒకటి ఉంటుంది. అట్టి జాతీయ స్వరంతో లయబద్ధంగానే అది పురోగమిస్తూ ఉంటుంది. అనాదికాలంనుండి

మన హిందూజాతికూడ ఒక నిరుపమానమైన విశిష్ట లక్షణాన్ని సంరక్షించు కొంటూఉంది. మన దృష్టిలో భౌతిక సుఖ స్వరూపాలైన అర్థ (సంపదను సంపాదించటం) కామాలు (భౌతిక వాంఛలను సంతృప్తిపరచడం) మానవుని జీవితంలో ఒక భాగం మాత్రమే. మానవుడు సాధించవలసిన 'ధర్మము, మోక్షము' అనే మరో రెండు అంశాలుకూడా ఉన్నాయని మహా మహులైన మన పూర్వీకులు ప్రకటించారు. ధర్మార్థ కామ మోక్షాలు అనే ఈ చతుర్విధ పురుషార్థ సాధన ఆధారంగానే మనవారు మన సమాజాన్ని నిర్మించారు. అతి ప్రాచీనకాలంనుండి గూడ మన సమాజం కేవలం సంపద సమృద్ధులకు మాత్రమేగాక, మిగిలిన రెండు పురుషార్థాలలో మరింత అధిక మైన ప్రఖ్యాతిని పొందింది. అందుచేతనే, మనం భగవంతునితో సాక్షా త్సంబంధం గలిగిన స్థితిని – దీనికంటె చిన్నమెత్తుగూడ తగ్గని స్థితి – అంటే మోక్షాన్ని పరమలక్ష్యంగా పెట్టుకొన్న ఒక నైతిక, ఆధ్యాత్మిక, తాత్త్విక సమాజంగా పేరొందాం. మానవుని మనుగడయొక్క పరమ లక్ష్యమైన ఈ మోక్షాన్ని విడిచిపెడితే, ఇంక మనిషిలోని పశుత్వాన్ని పోషించటంకన్న మిగిలేది వేరే ఏముంది? మనిషికి, పశువుకు మధ్య తేడా ఉండటమే వాస్తవం ఐతే, వాటివాటి సుఖసమృద్ధుల భావనలోగూడ ఆ రెంటి మధ్య వ్యత్యాసం ఉండితీరాలి. సుష్టుగా తినటం, త్రాగటం, భోగించటమే యీ రెంటికీ సమానలక్షణమైతే అపుడు మనిషిని పశువుతో సమంగా లెక్కించాలి. అందుచేతనే, మనిషిలోని ఆత్మనుకూడా పరిపోషించాలని మనం చెప్పుతాం. ఆ పని చేసినపుడే ఒక జాతిగా మన అస్తిత్వం నిజంగా ఘనమైనది, వైభవపూర్ణమైనది అని మనం భావించగలం.

కాబట్టి మనజాతియొక్క వైభవాన్ని, ఘనతను గూర్చి ఆలోచించి నప్పుడు సంపద సమృద్ధులనుగూర్చి, లేదా శరీరావసరాలను సంతృప్తిపరచే సాధనాలన్నిటినిగూర్చి మాత్రమే ఆలోచించక, వ్యక్తిలోని మనస్సును గూర్చి కూడా ఆలోచిస్తాం. ఏవిధంగా ఆ మనస్సు ఈవిషయాలన్నిటినీ క్రమంగా అధిగమించగలుగుతుంది? మానవజీవిగా ఒక వ్యక్తి పొందవలసిన

ఉన్నతికి అది అతణ్ణి ఎట్లాచేరుస్తుంది? అంటే మనిషికి ఈశ్వరునితో సాక్షాత్సంబంధం కలిగేటట్లు ఎట్లాచేస్తుందనే విషయంగూడ ఆలోచిస్తాం. "ధర్మాదర్థశ్చ కామశ్చ" అని చెప్పబడిందిగదా. అంటే మొదట ధర్మాన్ని అనుష్ఠించు – అదే నీకు అర్థ కామాలనుగూడ సమకూరుస్తుందని అర్థం.

## ధర్మానికిగల స్థానం

ధర్మాన్ని సంరక్షించి, కాయకల్పచికిత్స చేయాలని మనం కోరుతున్నామంటే, మన ఉద్దేశ్యం–ధర్మంయొక్క బాహ్యరూపాలైన కర్మకాండ ఆచారాలు సంరక్షించాలి అనా? మనదేశంలో కొందరు యజ్ఞోపవీతం ధరిస్తారు; కొందరు ధరించరు; కొందరు పిలక పెట్టుకుంటారు; కొందరు పెట్టుకోరు; కొందరు విగ్రహాలను పూజిస్తారు; కొందరు పూజించరు. వాటిలో విశ్వాసమున్నవారికి అవి అర్థవంతాలుగా కనిపిస్తాయి. అట్టివన్నీ సర్వవ్యాపకమయిన మన ధర్మంయొక్క చిన్నచిన్న బాహ్యచిహ్నాలు మాత్రమే. కేవలం వాటినే ధర్మంగా భ్రమపడకూడదు.

మనం ధర్మాన్ని రెండువిధాల నిర్వచించాం. మానవుని మనస్సును సమ్యక్ స్థితిలో ఉంచడం మొదటిది. సామరస్యపూర్ణమైన ఒక సాంఘిక జీవితానికి అనువుగా వివిధవ్యక్తులను తీర్చిదిద్దటం, అంటే ప్రజలందరిని కలిపి ఉంచేందుకై ఒక చక్కని సాంఘికవ్యవస్థ నేర్పరచడం రెండవది.

ముందుగా మొదటి నిర్వచనం పరిశీలిద్దాం. మనస్సును సమ్యక్ స్థితిలో ఉంచటం అంటే ఏమిటి? మానవుని వ్యక్తిత్వం అతని మనస్సుయొక్క బాహ్య వ్యక్తీకరణమాత్రమే అని మనకు తెలుసు. కాని మనస్సు అనేక వస్తువులవైపు పరుగెత్తే పశువువంటిది. కోరిన వస్తువులన్నిటితోనూ తానుకూడ ఒకటి అయిపోయేటట్లు నిర్మింపబడింది. సాధారణంగా మానవుని మనస్సు ఏది తప్పో, ఏది ఒప్పో ఆలోచించటానికి తాళదు. తన కోర్కెలను తీర్చుకొనేందుకు అది ఎంత క్రిందికైనా దిగజారుతుంది. అటువంటి

మనస్సుగల మానవుడు, ఒక సామాన్యమైన పశుస్థాయిని దాటి పైకివచ్చే అవకాశం లేదు. అందుచేతనే సంయమనంవంటి కొన్ని సద్గుణాలను మనస్సు అలవరచుకోవాలి. అట్టి సత్ప్రవర్తనయొక్క లక్షణాలు భగవద్గీత మొదలైన పవిత్రగ్రంథాల్లో అనేక సందర్భాల్లో ఉద్ఘాటింపబడినాయి. అవి దేహానికి ఐదు యమాలు, మనస్సుకు ఐదు నియమాలు వర్ణించాయి.

రెండవది సాంఘికమైన ప్రయోజనం. మానవజీవితం సమాజమందలి ప్రజలందరి ప్రయోజనాలకు అనుకూలంగా మలచబడాలి. ఈ రెండు ఒకదానికొకటి పూరకాలు.

*"యతోఽభ్యుదయ నిఃశ్రేయససిద్ధిః స ధర్మః"*

అని మొదటి అంశం నిర్వచింపబడింది. అనగా కోర్కెలను అదుపులో ఉంచుకుంటూ, సమృద్ధమైన భౌతికజీవితాన్ననుభవిస్తూనే దైవత్వాన్ని లేక శాశ్వతసత్యాన్ని సాక్షాత్కరించుకోగల సామర్థ్యాన్ని పెంపొందించు కోవటానికి తగిన అవకాశాన్ని, ప్రోత్సాహాన్ని వ్యక్తికి కలిగించే వ్యవస్థయే ధర్మమని అర్థం.

*"ధారణాత్ ధర్మమిత్యాహుః ధర్మో ధారయతి ప్రజాః"*

అని రెండవ అంశం నిర్వచింపబడింది. అనగా వ్యక్తులను ఒకచోటచేర్చి వారిని ఒక సమాజంగా నిలువబెట్టజాలిన శక్తికి "ధర్మం" అని పేరు. ఈ రెండు నిర్వచనాలను కలిపి చూచినపుడు ధర్మాన్ని ప్రతిష్ఠించడం అంటే సమాజంలోనివారందరు తన కాత్మీయులే అని ప్రతిఒక్కడు గుర్తించి తనతోబాటు వారి భౌతికజీవితం అధిక సంపన్నంగానూ, అధిక సుఖమయం గానూ చేయటానికి అవసరమైన త్యాగభావనతో నిండియున్నట్టి సువ్యవస్థిత మైన సామాజిక జీవితాన్ని నిర్మించడమే అవుతుంది. పరమసత్యాన్ని సాక్షాత్కరించుకోగల ఆధ్యాత్మికజీవితాన్ని అదే పెంపొందిస్తుంది.

సమాజంయొక్క సమైక్యత, సంక్షేమాలతో వ్యక్తిగత జీవితాన్ని సమన్వయపరచేందుకు మరొక మార్గంకూడ ఉంది. మన భావసంపదను మనకొసగిన మహామహులు ఏది శాశ్వతమో, ఏది అశాశ్వతమో గుర్తించాలని మనకు చెప్పారు. దానినే శంకరాచార్యులవారు నిత్యానిత్యవస్తువివేకమని అన్నారు. దానిలోని లోతైన తాత్త్విక వ్యాఖ్యానాలను దూరంగా ఉంచి ప్రస్తుతానికి దాన్ని మన జాతీయజీవనానికి అన్వయించి చూద్దాం. వ్యక్తులు పుడుతూ ఉంటారు; గిడుతూ ఉంటారు. లెక్కకుమించినన్ని తరాలు వచ్చాయి; పోయాయి. కాని జాతిమాత్రం నిలిచేఉంది. నీటిబిందువులు వస్తాయి; క్షణకాలం నిలుస్తాయి; అంతలోనే ఆవిరైపోతాయి; కాని గంగమట్టుకు ఎడతెరపిలేకుండా ప్రవహిస్తూనే ఉంటుంది. అట్లాంటిదే శాశ్వతమైన మన జాతీయజీవనప్రవాహంకూడ. వ్యక్తులమైన మనం ఏటిలోని బుడగల్లాగ బిందువుల్లాగ, క్షణకాలంనిలచి అదృశ్యమవుతూ ఉంటాం. కాని శాశ్వతమైనది జాతీయజీవనమే. "అశాశ్వతమైనది" వ్యక్తి. కాబట్టి సాంఘికసంక్షేమమనే శాశ్వతవిషయాన్ని సాధించేందుకు అశాశ్వతమైన "వ్యక్తిని" ఒకసాధనంగా మలుస్తూ, దానితోబాటే ఆవ్యక్తికూడా వృద్ధిచెందుతూ, తనయొక్క అంతర్నిహితమైన దైవత్వాన్ని వికసింపచేసికొనేందుకు అతనికి అవకాశం కల్పించేదే ఆదర్శప్రాయమైన వ్యవస్థ కాగలదు. మానవజాతిని దాని అంతిమ లక్ష్యమైన భగవత్సాక్షాత్కారానికి లేక మోక్షానికి చేర్చునట్టి ధర్మంయొక్క ద్వివిధమైన స్వరూపం ఇదే.

## నేటి హెచ్చరికలు

నేడు మన దేశవ్యవహారాలను నడిపించే నాయకులు ఈ విధమైన రాష్ట్రీయ దృక్పథాన్ని దురదృష్టవశాత్తు కోల్పోయారు; భౌతికమైన సమృద్ధి వైభవాలను మించి పైకి చూడలేని విదేశీ వాదాల వ్యామోహంలో పడ్డారు. "జీవనస్థాయిని పెంచుము" అనే నినాదాన్ని వారు ప్రచారం చేశారు. అది కేవలం మానవుని కోర్కెలనుపెంచి, భౌతికమైన సుఖాలను, సౌకర్యాలను

సమకూర్చటం ద్వారా వాటిని సంతృప్తిపరచటానికి ప్రయత్నించటమే అవుతుంది. నేటి విలాసవస్తువులు రేపటి అత్యవసర వస్తువులుగా మారుతాయి. ఈవిధంగా మానవుని భౌతికవాంఛలకు అధికాధికసంతృప్తి కలిగించేందుకు అంతులేని ప్రయాస కొనసాగుతూనే ఉంటుంది.

భౌతికవాంఛలకు తృప్తిలేదని విదితమే. నూనె పోసినపుడు ఆరిపోవటానికి బదులు, అగ్ని యింకా ప్రజ్వరిల్లినట్లు భౌతికవాంఛలను సంతృప్తిపరచినకొద్దీ అవి మరింతతీవ్రంగా పెరుగుతాయి. "మనిషికి ఎంత భూమి అవసరం" అనే పేరుతో నీతిని బోధించే ఒక చక్కని కథ టాల్‌స్టాయి వ్రాశాడు. సూర్యోదయంనుంచి సూర్యాస్తమయంవరకు పరుగెత్తుతూ ఎంత భూమిని చుట్టివస్తే అంత భూమి ఉచితంగా లభిస్తుందని ఒక రైతుకు వాగ్దానం చేయబడింది. మరింత ఎక్కువగా భూమిని పొందాలనే ఆశతో ఆ రైతు ఎంతోదూరం పరుగెత్తి చివరకు సూర్యాస్తమయంలోపు తాను బయలుదేరిన చోటికి చేరలేకపోయాడు. మరి పూర్తిగా అలసిపోయి చనిపోయాడుకూడ. చివరకు ఏడడుగులపొడవు, రెండున్నరడుగుల వెడల్పుగల కొద్ది భూమి మాత్రమే అతణ్ణి సమాధి చేయటానికి అవసరమయింది.

తీరనికోరికలు అనేకంగాగలవ్యక్తి వాటిని తీర్చుకొనేందుకుకావలసిన సాధనాలను ఎంతఎక్కువగా పెంపొందించుకొన్నప్పటికీ ఎన్నటికీ పూర్తిగా సుఖపడలేడు. ఇదికూడా అందరికీ బాగా తెలిసిన విషయమే. ఉదాహరణకు అమెరికాలో అంతులేనంతసంపద, పురోభివృద్ధి ఉన్నాయిగదా! అయినప్పటికీ అనేక రకాల భయంకరమైన నేరాలు అక్కడ జరుగుతున్నాయి. సమాజంలోని అన్ని వర్గాలవారిలోను మానసికవ్యాధులు సంభవిస్తున్నాయి. ఇవన్నీ అక్కడ రోజురోజుకీ భయంకరంగా పెరిగిపోతున్నాయి. లక్షలాది అమెరికా దేశవాసులు ప్రతిరాత్రి నిద్రించబోయేముందు నిద్రమాత్రలను మ్రింగుతుంటారు. ఇది వారి జీవనసిద్ధాంతంలోని ఒక తీవ్రమైన లోపాన్ని సూచిస్తుంది. జీవితంలోని రాజకీయ, ఆర్థిక విషయాలనే ప్రధానాంశంగా వారు

తీసుకొన్నారు. మనస్సును అదుపులోపెట్టి, ఉదాత్తమొనర్చి, సుఖశాంతులలో మానవుని ఆత్మను వికసింపచేయజాలిన ఆధ్యాత్మిక తత్త్వాన్ని వారు ఉపేక్షించారు.

## ఆచరణ

చతుర్విధ పురుషార్థసాధనమనే మన సమగ్ర జీవనకల్పన మన సమాజానికొక ప్రత్యేకతను సమకూర్చి దిగ్దిగంతాలు మనకీర్తిని తేజరిల్ల చేసింది అని మనం మరువరాదు. ఇట్టి మన జీవనకల్పన కేవలం ఊహా లోకంలో విహరించటంవంటిది మాత్రం కాదు. అది మన జాతీయజీవనంలో సజీవసత్యంగా వేల ఏండ్లుగా నెలకొని ఉన్నదని మన ప్రాచీన జాతీయచరిత్ర ఋజువుచేస్తుంది. ఇచ్చట మానవుడు అంతులేనన్ని సంపదలతోబాటు అత్యున్నతమైన సుగుణసంపత్తిగలిగి, అత్యుత్తమస్థాయిని సాధించాడు. మనదేశం చూడవచ్చిన విదేశీయాత్రికులందరు ఇట్టి సాక్ష్యమే ఇచ్చారు. అర్థకామాలను ఉన్నతాలైన ధర్మమోక్షాలతో చక్కగా మేళవించినట్టి సమగ్ర జీవన కల్పనా స్వరూపమే మనవారియొక్క ఉదాత్త శీలానికి కారణం, దాన్ని వ్యక్తిగతస్థాయిలోనేకాక జాతీయస్థాయిలోగూడ మనం ఆచరణలోనికి తెచ్చుకున్నాం.

మన మహర్షులు మానవునిలోని దివ్యత్వ సందేశాన్ని ప్రచారం చేసేందుకు ప్రపంచమంతా పయనించారు. వారి పవిత్రశీలం కారణంగా ఇతరదేశాలు మన జాతియొక్క పాదాలముందు ఎంతో శ్రద్ధాభక్తులతో మోకరిల్లినట్లుగా ఎన్నో ఉదాహరణలు చరిత్రలో ఉన్నాయి. తదనంతర కాలంలో బౌద్ధంయొక్క ప్రథమదశలో మన సరిహద్దులను దాటి చాలా దూరదేశాలకు చేరుకొన్న మన బౌద్ధభిక్షువులు, ప్రచారకులుకూడా ఆయా దేశాలలో పూజించబడ్డారు. వారి జీవితాలు, ఉపదేశాలు ప్రమాణాలుగా అచట స్వీకరింపబడ్డాయి. బుద్ధుని శిష్యుడొకడు టిబెట్టు, చైనా, జపానులకు

వెళ్ళాడు. ఆ దేశాలలో భగవంతుణ్ణి పూజించినట్లు అతని విగ్రహాన్ని పూజించారు. ఇది ఒక అద్భుతవిషయం. ఇది ఎట్లా సంభవించింది ? అట్టి ప్రచారకులయొక్క ప్రగాఢమయిన స్వార్థత్యాగం, సేవ, సర్వవ్యాపి అయిన ప్రేమ, ఉదాత్తమైనశీలం వారిని ఆ యా దేశాల్లోని ప్రజలకు సాంస్కృతిక ప్రబోధకులుగా చేశాయి అవే మన భారతదేశానికి 'విశ్వ గురువు' అనే కీర్తిని తెచ్చాయి.

మనవారనేకులు నేడు విదేశాలకు రాయబారులుగా, ఆచార్యులుగా విద్యార్థులుగా, వ్యాపారులుగా, వినోదయాత్రికులుగా వెళ్ళుతున్నారు. వారు ఆ యా దేశాల ప్రజలకన్న ఏవిధంగానూ అధికులు కాకపోగా భౌతిక సుఖాల్లో పొర్లాడి ఎన్నో రెట్లు వారికన్న భ్రష్టులైపోవటం చూస్తున్నాం. ఇట్టి పరిస్థితిలో ఒకప్పుడు మన జాతికి విశ్వగురుత్వాన్ని సంపాదించిపెట్టిన విశిష్టలక్షణాలపట్ల మన జాతీయజీవనంలో ఎక్కువ శ్రద్ధ చూపటం అత్యవసరమని స్పష్టమవుతుంది.

మనజాతియొక్క నిజమైన పునరుజ్జీవనం 'వ్యక్తి'ని తీర్చిదిద్దడంతో ప్రారంభంకావాలి. మానవసహజమైన బలహీనతలను అధిగమించగల శక్తిని వ్యక్తిలో కలుగజెయ్యాలి. పరంపరాగతమైన ఆత్మసంయమనం త్యాగం, సేవ, సౌశీల్యం అనేవాటిని అతడు పెంపొందించుకొనేట్లు చేయాలి; హిందూ పురుషార్థానికి ఒక తేజోవంతమైన ప్రతీకగా అతడు నిలబడాలి. మన రాష్ట్రీయ వైభవానికి మూలసూత్రమైన యిట్టి యోజనను ఏమరుపాటు లేక మనముందుంచుకోవాలి. మనం ఆవిధంగానే మరల మన ప్రాచీన విశ్వ గురుపీఠాన్ని చేరుకోగలం.

## అర్హత

ఇక రెండవ విషయానికి వద్దాం. చతుర్విధ పురుషార్థ సాధనద్వారా జాతీయవైభవంయొక్క పరాకాష్ఠనుపొంది, దాన్ని కలకాలం నిలుపుకొనేందుకు

ఈ ఆధునిక ప్రపంచంలో మనం ఏమి చేయాలి? అలాంటి వైభవస్థితి ఆంతరంగికమైన కల్లోలాలచేతగాని, బాహ్య దురాక్రమణలచేతగాని నాశనమయ్యే ప్రమాదం ఎల్లప్పుడు ఉంటుందని మనకు తెలుసు. ఒకప్పుడు ప్రపంచానికే అసూయ కల్గించిన వైభవస్థితినుంచి, ఈనాటి హేయమైన స్థితికి దిగజారడానికి ఈ రెండూకూడా హేతువులైనవని మన చరిత్ర మనకు బోధిస్తోంది. అందుచేతనే ఈ రెండు ప్రమాదాలను దూరంచేసుకొనేందుకై మన జాతీయజీవనాన్ని పునర్నిర్మించుకోవాలి.

ఈ యుగంలో బాహ్యదురాక్రమణలనుండి, ఆంతరికకల్లోలాలనుండి మనలను మనం రక్షించుకోగల శక్తి ముఖ్యంగా ప్రజలయొక్క సంఘటిత జీవనంలో ఉందని మనకు బాగా తెలిసిన విషయమే – "సంఘే శక్తిః కలౌయుగే." అందుచేత మనజాతిని పరమవైభవశిఖరాగ్రానికి తీసికొనిపోవాలి అంటే, జాతిని మేల్కొల్పి సంఘటితంగాను, శక్తిమంతంగాను చేయాలి. జాతులు తమ సుసంఘటితశక్తి అనే పునాదిపైననే నిలబడుతాయనేది పరమసత్యం. కూడు, గుడ్డ, వైద్యసదుపాయం, తదితర భౌతికావసరాలు–అవి ఎంతటి ఆవశ్యకాలైనా–ప్రథమస్థానాన్ని వహించవు. మొదటిది అన్నిటికన్న ముఖ్యమయింది, ఆ ప్రజలయొక్క అజేయమైన సంఘటిత జీవనం. అది లేకపోతే ఎంతటి అత్యధికమైన జాతీయ సమృద్ధి అయినా క్షణకాలంలో మట్టిలో కలిసిపోతుంది.

## ఓటికొక్కెలతో గట్టిగొలుసు తయారుకాదు

జాతిలో అటువంటి శక్తి ఎలా కలుగుతుందో పరిశీలిద్దాం. అది ఎక్కడ ఉంటుంది? అది ప్రజలయొక్క సుసంఘటిత జీవనంలో ఉంటుందని మనం అంటాం. అయితే ఆ ప్రజలు ఎటువంటివారై ఉండాలి? మనస్సులు ఆలోచనలు ఒకటిగాఉంటూ, ఒకే నైతికసూత్రాలనుపాటిస్తూ, పరస్పరం విశ్వాసంగలిగి జాతిపట్ల పూర్తి విధేయత గల్గినవారై ఉండాలి. ప్రజలు అట్టివారు కాకపోతే వారి సంఘటితశక్తి జాతిని సంరక్షించగల్గుతుందని చెప్పలేం.

పైగా జాతీయజీవనానికే అది ప్రమాదకారికూడ కావచ్చు. ఉదాహరణకు స్వార్థపరులు, సమాజవ్యతిరేకవర్గాలు, దొంగలు, బందిపోటులుకూడా తమలో తాము సుసంఘటితం కావచ్చుగదా!

శీలరహితులై, స్వార్థపరులైన వ్యక్తులను సమాజవ్యతిరేకకార్యాలకు ఒకచోట చేర్చటం సులువేననికూడా మనకు తెలుసు. అట్టి ముఠాలు తమ తమ తెగల ప్రయోజనాలను, ఇతర సంకుచితప్రయోజనాలను కాంక్షిస్తూ దేశం మొత్తంలో ఈనాడు తలెత్తుతున్నాయి. తమ స్వార్థప్రయోజనాలను సాధించుకొనేందుకు అవి మన జాతీయజీవనంయొక్క సమైక్య, పవిత్రతలను నాశనంచేయటానికికూడ సిద్ధపడుతున్నాయి. అట్టి వ్యక్తులు తేలికగా ఏకమౌతుంటారు. అది సంఘటితజీవనంలోని తక్కువస్థాయి. జీవకోటిలోని క్రిందిస్థాయిలోని సంఘటన చాలా సులభం; సరళంకూడ. ఒక్క మాంసపు ముక్క విసిరితే గుంపులకొద్దీ కాకులు అక్కడ చేరుతాయి. అది మంద యొక్క మన స్తత్వం. విశాలమైన జాతీయజీవనదృష్టి పోయి, పంథ, తెగ, కులం మొదలైన సంకుచిత విషయాలు మనస్సు నాక్రమించినప్పుడు ఇట్టి మన స్తత్వం పైకి వస్తుంటుంది; ఐతే ఇది చాలా సులువుకదాయని మనం ఈ పద్ధతిని అనుసరించరాదు.

కాబట్టే, సరియైన వ్యక్తులను ఒకచోట సమకూర్చటంద్వారా సంఘటితశక్తి నిర్మించబడాలని మనం నిశ్చయించుకొన్నాం. అట్టి సుసంఘటిత శక్తికి సజీవావయవాలుగా ఉండే వ్యక్తులలో కావలసిన సద్గుణాలు ఎటువంటివి?

## బలమే జీవనం — బలహీనతే మరణం

అజేయమైన భౌతికశక్తి వాటిలో మొదటిది. ఈ ప్రపంచ మంతటిలోను ఎవ్వడూ మనను బెదరగొట్టి లొంగదీయలేనంతటి శక్తిమంతులముగా మనముండాలి. దానికి మనశరీరాలు బలిష్ఠంగా, ఆరోగ్యంగా ఉండాలి. మానవరూపంలో దిగివచ్చిన మన భగవదవతారమూర్తులన్నీ

అటువంటివే. "బలమే జీవం, బలహీనతయే మరణం" అన్నదే మన శాస్త్రాలన్నిటియొక్క సారం. "నాకు ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కలిగిన మనుష్యులు కావాలి" అని స్వామి వివేకానందుడు అంటుండేవాడు. ఆయన స్వయంగా ఆవిధంగా ఉండేవాడు. తన తోటి శిష్యులు కొందరు ఒకచోట కూర్చొని, కండ్లనీళ్లు పెడుతుంటే, అది "భక్తి అనిపించుకోదు; అది నరముల బలహీనత; ఒకచోట కూర్చొని ఆడపిల్లలాగ ఏడవవద్దు" అని గర్జించేవాడు.

ఈనాడు మన రూపాన్ని మనం అద్దంలో చూచుకుంటే కనిపించేదేమిటి? మనలో పురుషత్వంయొక్క, శక్తియొక్క చిహ్నాలేమైనా కనిపిస్తున్నాయా? దేహంలో ఏముంది అని అనుకోవద్దు. మనశాస్త్రాలు "*శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్*" అని చెపుతున్నాయి. (జీవితంలో మనం ధర్మాన్ని నెరవేర్చేందుకు శరీరమే ప్రథమసాధనం. ఇది నిశ్చయమైన మాట) దృఢమైనశరీరంలేకుండా మనందేనినీసాధించలేం. దేవుణ్ణిచూడటానికి గూడఆరోగ్యవంతమైన, ధృఢమైనదేహంకావాలి. దేవుడుబలహీనులకులభ్యం కాడు. "*నాయమాత్మా బలహీనేన లభ్యః*" దేవునిగూర్చి ధ్యానంచేద్దామని మనం కూర్చున్నప్పుడు, మన తలతిరగడం ఆరంభమై, వెన్నునొప్పి మొదలై, కూర్చొన్నచోటనే మనం కుంచించుకపోయి వణకటం ఆరంభిస్తే వచ్చేది భగవంతుడుగాదు;వచ్చింది జ్వరం మాత్రమే. నేటి మనయువకులలో కండల్ని పెంచటంకన్న, శరీరాన్ని అలంకరించుకొనే మోజు ఎక్కువగా ఉంది. అది విడిచిపెట్టాలి. వారు తగినంత వ్యాయామంచేస్తూ, ఆరోగ్యకరమైన అలవాట్లుగలిగి శీతోష్ణాలను, ఆకలిని, శ్రమను తట్టుకోగలిగి జీవితంలోని కష్టాలను చిరునవ్వుతో ఎదుర్కొగల శక్తిమంతమైన దేహాలను పెంపొందించుకోవాలి.

## శీలమే సర్వస్వం

భౌతికశక్తి అవసరమే. కాని శీలం మరింత ముఖ్యం. శీలంలేని శక్తి మనిషిని కేవలం పశువుగా మారుస్తుంది. వ్యక్తిగతంగాచూచినా

జాతిపరంగాచూచినా పవిత్రత, శీలమూ జాతీయవైభవానికి, మహత్త్వానికి ప్రాణాధారం.

శీలంయొక్క ప్రాముఖ్యాన్ని ప్రహ్లాదుని కథ వివరిస్తుంది. తానొనర్చిన పుణ్యకర్మలఫలితంగా అతడు ఇంద్రుని వెడలగొట్టి దేవతలకు రాజైనాడు. ఇంద్రుడు దేవతలకు గురువైన బృహస్పతినిచేరి, "స్వామీ! నాయొక్క దయనీయమైనస్థితి మీరెరిగినదేకద! నా సింహాసనం మరల పొందడానికి ఏమిచేయవలెనో సెలవిండు" అని అడిగాడు. అప్పుడు బృహస్పతి "నీవొక సామాన్య భిక్షుకునివేషం దాల్చి ప్రహ్లాదుని కొలువుకు పోయి, ఇచ్ఛాదానసమయంలో (అనగా భిక్షుకులు ఏది అడిగితే అది యిచ్చే సమయాన) అతని శీలాన్ని దానమడుగు" అని చెప్పాడు. ఇంద్రుడు దాని కంగీకరించి బిచ్చగానివేషంలో ప్రహ్లాదునిచేరి అతని శీలాన్ని దానమడిగాడు.

'కేవలం నా శీలంతోనే ఎట్లు నీవు తృప్తిచెందుతా'వని ప్రహ్లాదుడు అడుగగా 'నా కది చాలు' అని యాచకుడు బదులుచెప్పాడు. 'తీసుకో' అని ప్రహ్లాదుడన్నాడు. అతడు ఈమాట పలికినవెంటనే ఒక తేజోమూర్తి అతని దేహంనుండి వెలికివచ్చి బిచ్చగాని దేహంలో ప్రవేశించింది. "నీవెవ్వరవు? నా దేహాన్ని విడచి యీ బిచ్చగాని దేహంలోపల ప్రవేశిస్తున్నావు ?" అని ప్రహ్లాదుడడిగాడు. 'నేను నీ శీలాన్ని, నీవు నన్నాతనికి దానంచేశావు గనుక నేనిప్పుడాతనిలో ప్రవేశించాలి' అని ఆ తేజోమూర్తి బదులుచెప్పింది. మరుక్షణం వేరొక తేజోరాశి అతని దేహంనుండి వెలికివచ్చింది. మరల ప్రహ్లాదుడు 'నీవెవ్వరవు ? నా దేహాన్ని ఎందుకు విడిచి వెళుతున్నావు ?" అని ప్రశ్నించాడు. "నేను నీ శౌర్యాన్ని. నేను శీలంయొక్క సేవకుణ్ణి మాత్రమే. నీలో శీలమున్నంతకాలము నేనుకూడా నిన్ను సేవించాను. ఇప్పుడు శీలం వెళ్ళిపోయింది. కాబట్టి నేనుకూడా శీలాన్ననుసరించి పోతున్నాను" అని పలుకుతూ ఆ తేజోమూర్తిగూడ ఆ బిచ్చగానిలో ప్రవేశించింది. చివరకు దేదీప్యమానమయిన స్త్రీ ఆకృతిగల ఒక తేజోమూర్తి

అతని దేహంనుండి వెలికివచ్చింది. ఆమె "నేను నీయొక్క రాజ్యలక్ష్మిని; నేనుకూడా శీలంయొక్క సేవకురాలనే. నీవు శీలాన్ని దానమిచ్చావు. కనుక నేనుకూడా పోతున్నాను" అన్నది. దానిఫలితంగా ప్రహ్లాదుడు తన సంపూర్ణ అధికారాన్ని, వైభవాన్ని కోల్పోయాడు. పిదప ఇంద్రుడు తన సింహాసనాన్ని తాను పొందాడు.

క్లుప్తంగా ఈ కథలోని నీతి: మనలో శీలం ఉంటే, దేన్నైనా సంపాదించవచ్చు; శీలం లేకపోతే ప్రతిదాన్నీ కోల్పోతాం. ఇది వ్యక్తి విషయంలో ఎంత నిజమో, జాతివిషయంలోగూడ అంతే నిజం. అందుచేతనే శీలంయొక్క రెండు అంశాలయిన వ్యక్తిగతశీలం, రాష్ట్రీయశీలం జాతీయ వైభవానికి రెండు ఊపిరితిత్తులవంటివి.

## చక్కని లోకజ్ఞానం విజయానికి అవసరం

మనకు బలమైన దేహం, పవిత్రము, నిష్ఠావంతము అయిన శీలం ఉన్నాయనుకుందాం. అయితే ఈదేహాన్ని, మనస్సును ఎట్లావినియోగించాలి? అందుకొరకు పరిస్థితులయొక్క లోతుపాతులను, వాస్తవికస్థితిని గ్రహించి ఏది సరియైన ప్రవర్తనో నిర్ణయించుకోగల సూక్ష్మబుద్ధికూడా మనకు కావాలి. మనం ఏకాగ్రత నలవరచుకొని బుద్ధికి పదనుపెట్టి సరియైన సమయంలో సరియైన పనిని చేయగల శక్తిని పెంపొందించుకోవాలి. అంతేగాక క్రియాశీలురమై మనం అనుకొన్న నిర్ణయాలను అనుకొన్నట్లు సత్వరమే అమలుపరచాలి.

అటువంటి ఆచరణయుక్తమైన సమయస్ఫూర్తి లేకపోతే మన మంచితనం, మన శక్తి నిష్ప్రయోజనం. మన ప్రాచీన చరిత్రలోని అనేక అపజయాలకు కారణం లోకజ్ఞానం లేకపోవటమే. జాతిని మళ్లీ సంఘటితం చేయడం పూలపాన్పుపై పవళించడం కాదని మనం మరచిపోరాదు. నీచులను దుష్టులను ఎదుర్కొనవలసినపుడు సమయస్ఫూర్తిలేని కేవల ధర్మశ్రద్ధ

కు ఉపయోగించదు. వాస్తవిక జగత్తులో కౌశలాన్ని, జ్ఞానాన్ని
దడానికి వ్యక్తి కానొక మహామేధావి కానక్కరలేదు. సమాజంలోని
సామాన్యస్థాయికిచెందిన వ్యక్తులుగూడా అట్టి జ్ఞానాన్ని అలవరచుకోవచ్చు.
గ్రామంలోని మన సంఘ కార్యకర్త ఒకరు తాను అక్షరజ్ఞానంలేని
సామాన్య రైతే అయినప్పటికీ, ఎంతో ప్రమాదసమయాలలోకూడ, వది
హేను పరిసర గ్రామాలవారికి సరియైన మార్గం చూపి అదుపులో ఉంచిన
ఉదాహరణ మనకుంది. అతడు జీవితంలోని అన్ని రంగాలలోని గ్రామ
లకుకూడ సరియైన మార్గాన్ని చూపగలిగాడు. మనలో ప్రతి ఒక్కరు
"సజీవమైన జ్ఞానబీజం జన్మతః నాలో ఉంది. దానిని నేను సరిగా
ంచుకుంటే అది నాకు విజయం చేకూర్చి తీరుతుంది" అనే విశ్వాసాన్ని
హృదయంలో పెంచుకొని తదనుగుణంగా జీవించేందుకు కృషిచేయాలి.

## ...తి

ఒకవేళ మనకు బలమైన దేహము, స్పష్టమైన శీలము, నిశితమైన
ఉండికూడ ధైర్యంలేకపోతే వానివల్ల ప్రయోజనమేమిటి? ఎల్లప్పుడూ
...తులు అనుకూలంగా ఉండవు. అడ్డంకులను, కష్టాలను మనం
...ర్కోవలసి ఉంటుంది. వీటిని కలిగివలసిన మొదటి లక్షణము
...తి. అదే ఇతర సద్గుణాలన్నింటికి నాంది. భగవద్గీతలోకూడ
...గుణములవర్ణన "అభయం"తో మొదలవుతుంది. "ఒకరిని భయపెట్టం,
...కి భయపడం – ఇలా కొనసాగాలి జాతిని పటిష్ఠంచేసే కృషి" అని
...స్థాపకులయిన డాక్టర్ హెడగేవార్ అంటూఉండేవారు. "నా భయ వేళ
...కో నా భయ జానత అహి" మనం ... నిర్భయత్వం
...ర్యం తమలో మూర్తీభవించినవారే. ... నాయకుల ...
సైన్యం శ్రీరామచంద్రుని ఎదురించ వచ్చింది. ... చేసి ...
...ంలో మబ్బుల్లాక్రమ్ముకుంది. శత్రువు సమీపించటంచూచి రాముడు ...
...డు "సీత ఇటువంటి విషయాలకలవాటుపడిందికాదు. ఆమెనుకాపాడి...

మనకు ఉపయోగించదు. వాస్తవిక జగత్తులో కౌశలాన్ని, జ్ఞానాన్ని పొందడానికి వ్యక్తి తానొక మహామేధావి కానక్కరలేదు. సమాజంలోని సామాన్యస్థాయికిచెందిన వ్యక్తులుగూడా అట్టి జ్ఞానాన్ని అలవరచుకోవచ్చు. ఒక గ్రామంలోని మన సంఘ కార్యకర్త ఒకరు తాను అక్షరజ్ఞానంలేని సామాన్య రైతే అయినప్పటికీ, ఎంతో ప్రమాదసమయాలలోకూడ, పది పదిహేను పరిసర గ్రామాలవారికి సరియైన మార్గం చూపి అదుపులో ఉంచిన ఉదాహరణ మనకుంది. అతడు జీవితంలోని అన్ని రంగాలలోని గ్రామ పెద్దలకుకూడ సరియైన మార్గాన్ని చూపగలిగాడు. మనలో ప్రతి ఒక్కరు కూడ "సజీవమైన జ్ఞానబీజం జన్మతః నాలో ఉంది. దానిని నేను సరిగా పోషించుకుంటే అది నాకు విజయం చేకూర్చి తీరుతుంది" అనే విశ్వాసాన్ని మన హృదయంలో పెంచుకొని తదనుగుణంగా జీవించేందుకు కృషిచేయాలి.

## నిర్భీతి

ఒకవేళ మనకు బలమైన దేహము, స్వచ్ఛమైన శీలము, నిశితమైన బుద్ధి ఉండికూడ ధైర్యంలేకపోతే వానివల్ల ప్రయోజనమేమిటి ? ఎల్లప్పుడూ పరిస్థితులు అనుకూలంగా ఉండవు. అడ్డంకులను, కష్టాలను మనం ఎదుర్కోవలసి ఉంటుంది. వీరున కుండవలసిన మొదటి లక్షణము నిర్భీతి. అదే ఇతర సద్గుణాలన్నింటికి నాంది. భగవద్గీతలోగూడ దైవీగుణములవర్ణన "అభయం"తో మొదలవుతుంది. "ఒకరిని భయపెట్టం, ఒకరికి భయపడం – ఇలా కొనసాగాలి జాతిని పటిష్ఠంచేసే కృషి" అని సంఘస్థాపకులయిన డాక్టర్ హెడగేవార్ అంటూఉండేవారు. "నా భయ దేత కాహూకో నా భయ జానత అప్" మనఆదర్శవీరులందరూ నిర్భయత్వం ధైర్యం తమలో మూర్తీభవించినవారే. ఖరదూషణాదుల నాయకత్వాన ఒక పెద్దసైన్యం శ్రీరామచంద్రుని ఎదురించ వచ్చింది. ఆసైన్యం రేపిన దుమ్ము ఆకాశంలో మబ్బుల్లాక్రమ్ముకుంది. శత్రువు సమీపించటంచూచి రాముడు తమ్ముణ్ణి పిలిచాడు "సీత ఇటువంటి విషయాలకలవాటుపడిందికాదు. ఆమెనుకాపాడుతూ

నీవిక్కడే ఉండు. ఈ తుచ్ఛులను తుదముట్టించి నేను తిరిగివస్తాను" అని చెప్పి రాముడు చేత ధనుస్సు ధరించి ఒంటరిగా వారినెదిరించటానికి వెళ్లాడు. అతడట్లా ఒంటరిగా పోవటంచూచి సీత గజగజలాడింది. అప్పుడు లక్ష్మణుడు "ఈ పదునాలుగువేలమందినేగాదు, రావణుని సైన్యం అంతటినీ గూడా శ్రీరాముడొక్కడే చంపగలడు; కనుక భయపడవద్దు" అని ఆమెకు చెప్పాడు. రాక్షసులనందరిని నాశనంచేసిన తరువాత శ్రీరాముడు అక్కడ అసలేమీ జరుగనట్లు ఎప్పటివలెనే నెమ్మదిగా, ప్రశాంతంగా, సంక్షోభరహితంగా తిరిగి వచ్చాడు.

భగవంతుని ఆరాధించేందుకైనా వీరవ్రతం కావాలి. పిరికివాడు ఆ పని చేయలేడు. భగవంతుని ధ్యానం చేయటానికి కూర్చున్న వ్యక్తికి భయంకరమైన రూపాలు కనిపిస్తాయి. అతడు పిరికిగుండెవాడైతే వాడిపని అయిపోయినట్లే, అని జ్ఞానేశ్వరిలో వ్రాసిఉంది. పిరికివాడు ఇహలోకంలో గాని, పరలోకంలోగాని ఏమీ సాధించలేడు. మనం సరియైనమార్గంలో ఉన్నప్పుడు దేనికీ భయపడవలసిన అవసరంలేదు.

కొన్ని ఏళ్ళక్రితం మనకార్యకర్తలలో ఒకరు చనిపోయారు. చనిపోవటానికి వారంరోజులు ముందు అతణ్ణి కలిశాను. "ఏమందులు వాడినా ఫలితం గల్గుతున్నట్లులేదు. నేను కోలుకొంటానని ఆశలేదు. త్వరలో చనిపోతాననిపిస్తోంది" అని అతడు నాతో అన్నాడు. "నీవొక మహత్తర ఆదర్శంకోసం, స్వార్థంలేకుండా, శ్రమను లక్ష్యపెట్టకుండా కృషిచేశావు; నీవెవరికీ కీడు చేయలేదు; ఎప్పుడూ అందరికీ మంచినే చేశావు, మరి మృత్యువునుచూచి ఎందుకు భయపడతావు? ఆనందంగా ప్రశాంతచిత్తంతో మృత్యువునెదుర్కో" అని అతనితో చెప్పాను. అతడు అట్లానే మనస్సు చెదరకుండా ప్రశాంతచిత్తంతో మృత్యువును ఎదుర్కొన్నాడు. మంచినే చేస్తున్నాం, మనం సరైనత్రోవలోనే నడుస్తున్నాం, అనే విశ్వాసం వల్ల పుట్టిన నిర్భయత్వమే లక్ష్యసాధనలో మనలను ఎంతో ముందుకు నడిపిస్తుంది.

## ఆదర్శానికే తొలి విధేయత

అంతమాత్రంతో చాలదు. మనలోపల ఈ సద్గుణాలన్నిటినీ అలవరచుకోవాలనే ఆకాంక్ష ఒకటి కావాలి. మనం స్వీకరించిన ఆదర్శంపట్ల తీవ్రమైన భక్తిశ్రద్ధలే మన జాతికి పరమవైభవాన్ని సాధించేందుకు కావలసిన సద్గుణాలన్నిటినీ సమకూర్చుకొనేందుకవసరమైన ప్రేరణ మనలో కలిగిస్తాయి.

అనేక కర్తవ్యాలలో ముందు వెనుకలు నిర్ణయించుకొనేటప్పుడు మన మనస్సులలో సంఘర్షణలు ఎదురయ్యే సందర్భాలు కొన్ని వుండవచ్చు. అప్పుడే మనం విచక్షణను చూపి వ్యామోహం లేని దృష్టిని అలవర్చుకుని మన జీవిత లక్ష్యంగా స్వీకరించిన ఆదర్శం యొక్క అత్యుత్తమమైన ఆహ్వానానికి అనుకూలంగా స్పందించాలి. ఈ విషయంలో తానాజీ మాల్‌సురే యొక్క బలిదానం ఒక ఉజ్వలమైన ఉదాహరణ కాగలదు. శివాజీ అతనికి కబురుపెట్టి పటిష్ఠమైన 'కోండాణా' దుర్గం (తదనంతర కాలంలో అదే సింహగఢ అయినది) గెలిచే సాహస కార్యాన్ని అతనికి అప్పగించినపుడు తానాజీ తన కుమారుని యొక్క పెండ్లి ఏర్పాట్లలో మునిగి వున్నాడు. "నా కుమారుని పెండ్లి కొంత కాలం వాయిదా పడవచ్చు. నా రాజు ఆజ్ఞను నేను ముందు నిర్వహిస్తాను. స్వరాజ్యకార్యమే నా తొలి కర్తవ్యం" అంటూ తానాజీ పెండ్లి ఆలోచనను విడిచిపెట్టాడు. ఒక్క క్షణం కూడా తటాపటాయించకుండా తానాజీ కోండాణా దుర్గాన్ని జయించటానికి బయలుదేరాడు. వీరోచితమైన ఆ ఉద్యమం విజయం పొందింది. కాని తానాజీ యొక్క జీవితాన్నే అది బలిగొంది.

మౌలికమైన వ్యక్తినిర్మాణమనే ఈ మహాకార్యంలో మనశక్తులన్నిటినీ అంకితంచేసినప్పుడే అత్యంత ప్రాచీనము, పవిత్రము ఐన మన జాతి తన సహజసిద్ధమైన మహత్త్వాన్ని, వైభవస్థితిని మరల పొందుతుంది; శాంతి సమృద్ధులను, శీల సంస్కృతులను నలుగడల ప్రసరింపచేయగలుగుతుంది.



# భావాత్మక హిందుత్వ జీవనం

శ్రేష్ఠము, విశిష్టమునైన హిందూజీవనపద్ధతిని నవచైతన్య పూరితం చేయడానికి సంఘం అంకితమైందని మన మన్నప్పుడు, మీరు "హిందు" శబ్దాన్ని ఏవిధంగా నిర్వచిస్తారో ముందు చెప్పాలని అనేకమంది అడుగుతుంటారు. నిజమే. అది ఒక క్లిష్టమైన విషయమే. ఒకసారి ఒక పెద్దమనిషి "నేను ముస్లిమును నిర్వచించగలను; క్రైస్తవుని నిర్వచించ గలను; కాని హిందువునుమాత్రం నిర్వచించలేను" అన్నాడు. అతడట్లా అనడం సమంజసమే. మనం సూర్యుణ్ణి, చంద్రుణ్ణి నిర్వచించగలంగాని ఏ పరమసత్యంనుండి ఇవన్నీ పుట్టాయో, దానినిమాత్రం నిర్వచించలేం. అంతమాత్రాన అది లేదని అర్థమా? కేవలం అది కొన్ని చిహ్నాలకు లోబడక నిర్వచనాని కందకున్నంతమాత్రాన అది లేదని ఋజువు అవుతుందా? భగవంతుడొక్కడే "అనుచ్ఛిష్టుడు" అంటే శుద్ధమైనవాడు, కలుషితం కానివాడు అంటూ రామకృష్ణులొకసారి అన్నారు. అంటే అతడొక్కడే ఇంత వరకు ఎవరిజిహ్వాచేత కలుషితం చేయబడలేదు; వర్ణింపబడలేదని అన్నారు. దేనైనా మనం నిర్వచించగలంగాని, సర్వవ్యాపియైన పరమసత్యాన్ని నిర్వచించలేం.

## నిర్వచనాని కందని హిందువు

హిందువులమైన మనం, మన ఋషిగణం భగవంతుడే ఆధారమనే విశ్వాసంతో జీవిస్తున్నాం. బహుశః అందుకనే స్వరూప స్వభావాల్లో ఆశ్చర్యజనకమైన వైవిధ్యంగలిగిన హిందూసమాజం సర్వతోముఖంగా అభివృద్ధి చెందింది. అయినా అట్టి విభిన్నములు, అనంతములునైన అభివ్యక్తీకరణాల్లో సహజసిద్ధమైన ఒక సమైక్యసూత్రం వ్యాపించిఉంది. హిందువులలోని విభిన్నపంథాలను, కులాలను పూర్తిగా నిర్వచించవచ్చు గాని, హిందూ అనే పదాన్ని మాత్రం నిర్వచించలేం. ఆశబ్దంలో అవి అన్నీ ఇమిడి ఉండటమే అందుకు కారణం. అయినా ఆ పదాన్ని నిర్వచించేందుకై అనేకసమయాల్లో అనేక ప్రయత్నాలు జరిగాయి. కాని ఆయా నిర్వచనాలన్నీ అసంపూర్ణాలని ఋజువయింది. సంపూర్ణ సత్యాన్ని అవి వ్యక్తంచేయలేక పోయాయి. గత అనేకశతాబ్దులుగా వృద్ధిచెందూతూ, ఒక క్రమపరిణామం చెందిన సమాజాన్ని నిర్వచించటంలో అవి విఫలంకావటంలో ఆశ్చర్యంలేదు.

మనజాతి ఎప్పుడు పుట్టింది, మనం ఎప్పటినుండి నాగరికజీవనాన్ని గడుపుతున్నాం అనే విషయం చరిత్రవిద్వాంసులకు తెలియదు. ఒకవిధంగా చూస్తే మన జాతి 'అనాది'-అనగా మొదలులేనిది. తరువాతపుట్టిన పదజాలం అనాదియైన పరమసత్యాన్ని నిర్వచించలేనట్లుగానే, అట్టి జాతినిగూడ నిర్వచించటం అసంభవం. హిందూజాతి విషయంగూడ అట్టిదే. ఒక పేరుండవలసిన అవసరంలేని కాలంలోకూడ మనం జీవించిఉన్నాం. మనం సుజనులం, జ్ఞానవంతులం. ప్రకృతి నియమాలను, ఆత్మనియమాలను తెలిసికొన్న జాతి మనది. ఒక గొప్ప నాగరికతను, ఒక గొప్ప సంస్కృతిని ఒక నిరుపమానమైన సామాజికవ్యవస్థను నిర్మించాం. మానవజాతికి మేలును సమకూర్చే విషయాలను-దాదాపుగా అన్నింటినీ-మన ప్రత్యక్ష జీవితంలో సాధించాం. ఆనాడు మిగిలిన మానవులంతా ద్విపాదపశువులుగా ఉండేవారు. అందుచేత మనకు ఒక ప్రత్యేకమైన పేరు పెట్టుకోలేదు, ఒక్కొక్కసారి

ఇతర మానవులనుండి మనలను ప్రత్యేకించిచూపే యత్నంలో మనలను ఆర్యులని, ఇతరులను మ్లేచ్ఛులని వ్యవహరించుకొన్నాం. కాలక్రమంలో విదేశాలలో విభిన్నసంప్రదాయాలు, విశ్వాసాలు పుట్టి అవి మనతో సంపర్కం లోనికి వచ్చినపుడుమాత్రమే మన కొక పేరుండాలనే అవసరం ఏర్పడింది. గంగానదికి విభిన్నదశలలో గంగోత్రి, భాగీరథి, జాహ్నవి, హుగ్లీ అనే పేర్లు ఏర్పడినట్లే మన జాతికిగూడ విభిన్నసమయాల్లో అనేక పేర్లు ఏర్పడ్డాయి. సింధునదినుండి జనించిన 'హిందు' అన్న పేరు చరిత్రలో మనకు ఏర్పడి సాంప్రదాయికంగా ఇంతవరకూ విశ్వమంతట అంగీకరింపబడి ఆదరణీయంగా ఉంటోంది.

## లక్ష్యశుద్ధిగల జీవితం

ఆవిధంగా హిందువులమైనమనం, నిర్వచనానికందనివారమైనప్పటికీ ప్రత్యక్షంగా ఈనాడు ఇక్కడ ఉంటున్నాం. ప్రతిరక్తబిందువులోనూ, మనం ప్రత్యక్షంగా అనుభవిస్తున్న ఒక సజీవసత్యం హిందూసమాజం. హిందువును నిర్వచించలేకపోయినప్పటికీ హిందువులను ఒక విశిష్టమైనజాతిగావర్తిచూపే ప్రత్యక్షలక్షణాలను మనం గుర్తిస్తాం; తప్పక గుర్తించగలగాలికూడ. కేవలం ముస్లిము, క్రైస్తవుడు కానందువల్ల, ఇక అతడు హిందువుడే అని అనలేం. మనదేశంలో రాజకీయనాయకులు "హిందువు"ను "ముస్లిమేతరుడు" అని పేర్కొంటున్నారు, మనయొక్క నిజస్వభావాన్ని గుర్తించటానికి ఇది సరియైన భావాత్మకపద్ధతి కాదు. హిందువు వ్యతిరేకాత్మకమైన జీవి కాదు. అయితే "హిందూ" అన్న మాటకు నిజమైన అర్థమేమిటి ?

జీవితం హిందువునకు లక్ష్యవిహీనమైనదికాదు. ఆ లక్ష్యం అధికారం పదవి, పేరుప్రఖ్యాతులతో అంచనావేసే వైభవాన్ని సాధించుకోవటం కాదు.తన నిజప్రకృతిని, తనలోని దైవాంశను, తనలో ఉన్న పరమసత్యాన్ని సాక్షాత్కరించుకొంటే అదే అవ్యక్తిని శాశ్వతపరమానందస్థితికి చేరుస్తుంది, గనుక అదొక్కటే అతనిముందున్న లక్ష్యం. కాని మానవజీవనప్రమాణం

చాలా స్వల్పంగదా! అంత స్వల్పవ్యవధిలో ఆతడు అట్టి మహోన్నతస్థాయికి చేరుకోవటంఎట్లా? జీవితపర్యంతం తానుపయోగించే శరీరంగురించే ఆతనికి పూర్తిగా తెలియదుగదా! అటువంటప్పుడు ఆ శరీరంలో నిహితంగాఉన్న "దాని" నెట్లా గ్రహించగలడు? మనంచేసే ప్రతిఒక్క పనికీ - అదికూడ ఒకకారణమేగాబట్టి, తగినఫలితం-"కార్యం"-ఉండితీరుతుందని కార్యకారణ వాదం చెప్తుతుంది. ఇట్టి కార్యకారణచక్రం పెద్దదై ఒక అంత్యస్థితిలో పర్యవసించాలి. అందుచేత మానవుని నేటిఉనికి అతని నిజమైన అస్తిత్వపు గాథను పూర్తిగా వివరింపలేదు. తనలోని దివ్యత్వాన్ని వికసింపచేసుకొని వెలికి ప్రకటించాలని మనిషికి సహజసిద్ధమైన ఒక ప్రత్యేకవాంఛ ఉంటుంది. తనలోని ఆ దివ్యత్వపు నిజస్వరూపాన్ని గుర్తించాలనే సహజమైన విశిష్ట వాంఛతో అజ్ఞానం లవలేశంకూడా మిగులనంతవరకు, వ్యక్తి మళ్లీ మళ్లీ పుడుతూనే ఉంటాడు. ప్రతిజన్మలోనూ శ్రద్ధతో ప్రయత్నిస్తే అతడు ఆ దిశలో కొంత ప్రగతిని సాధిస్తూనేఉంటాడు.

పరమసత్యంతో తాదాత్మ్యం చెందటానికే, ఒకదానితరువాత ఒకటిగా ఇట్లా జన్మలు కలగటం జరుగుతుందనే సిద్ధాంతమే మానవుని ఆత్మకు ఒక పెద్ద ఆశాజ్యోతి. హిందూత్వమనే ఆకాశదీపమొక్కటే శాశ్వతమైన ఆశాకిరణాన్ని ప్రసరింపచేస్తోంది. ఈజన్మతోనే అంతా పూర్తికాలేదు. ఒక జన్మతర్వాత మరొకజన్మఎత్తుతూ, చివరకు గమ్యంచేరేందుకుగాను ప్రగతి రథచక్రపరిభ్రమణానికి అనంతమైన కాలవ్యవధి ఉన్నదని హిందూత్వ మొక్కటే చాటుతోంది. ఈ విశాల మానవసమాజంలో ఒక ఆశను, ఒక విశ్వాసాన్ని కల్గించగల కరదీపికను చూపగలిగినవాడు హిందువొక్కడే. మన ప్రాచీన పవిత్రగ్రంథాలు, మన సంప్రదాయాలు-ప్రాతవీ, క్రొత్తవీ-అన్నీగూడా ఇట్టి మౌలికతత్త్వాన్ని తమలో రంగరించుకొన్నవే.

## మానవుణ్ణి సేవించు

ఈభూమికతో మన మిక ముందుకుపోదాం. మనం ఈ ప్రపంచంలో జీవిస్తున్నాం. లెక్కలేనన్ని ప్రాపంచికవ్యామోహాలు ఏకాగ్రతను సడలించే

ఆకర్షణలు మనచుట్టూ ఉన్నాయి. బహుశః నిజమైన జీవితలక్ష్యాన్నిగురించి మనం కనీసం ఒక్కసారైనా ఆలోచించకపోవచ్చు. అటువంటప్పుడు మరింత అజ్ఞానంలోబడి ఈ జీవితకాలంలోనే మన వాస్తవిక వికాసక్రమంలో హీనస్థాయికి దిగజారిపోకుండా మనలను మనం ఎట్లా రక్షించుకోగలం? ఒకవ్యక్తి ఏదైనా హింసచేసినాగాని, అతనికి చెడుతలంపులేకపోతే, అతనిదోషం అంత తీవ్రమయింది కాదని న్యాయశాస్త్రం చెప్పుతుంది. అట్టివాడు తానొనరించిన పాపంనుండి పూర్తిగా విముక్తుడైనట్లుగూడా ఒక్కొక్కసారి భావింపబడతాడు. అదేవిధంగా ఎట్టిస్వార్థభావన లేకుండా, కేవలం కర్తృత్వభావనతో మనం పనిచేస్తాం; అంటే మనంచేసేపనుల్లో మన యొక్క వ్యక్తిగతమైన ఆసక్తిని, స్వార్థప్రయోజనాన్ని, అనుభూతిని విడిచిపెట్టగలిగితే మనంచేసే ఎన్నోపనులు, వాటిఫలితాల ప్రభావం మనలను అంటదు. అపుడే మనపైపడే బాహ్యప్రపంచంయొక్క ఆఘాతాలనుండి ప్రభావాలనుండి విముక్తులం కాగలం. అపుడే నిజమైన ఆత్మపదార్థంపై మనస్సును మనం లగ్నంచేయగలం. అందుచేతనే మన తత్త్వశాస్త్రం నీ కర్తవ్యం నీ వాచరించు; నీ విధిని నిస్వార్థభావనతోనే చెయ్యి అని చెప్పుతున్నది.

అయితే మనమిప్పుడు చేయవలసినపని ఏమిటి? మనకర్తవ్యంయొక్క తీరుతెన్నులెట్టివి? దాన్ని మనం ఎక్కడ ఆరంభించాలి? అంతిమసత్యాన్ని చేరుకోగలందుకై మన జీవితాన్ని ఏవిధంగా నడుపుకోవాలి? సత్యమనేది ఒకటున్నది; అయితే అది కాలక్రమంలో తనంతటతానుగానే ప్రకటితమవుతుంది, అని ఉద్ఘోషించినంతమాత్రాన వ్యక్తమవుతుందా? కాదు. వాస్తవికజగత్తులో మన ఇంద్రియాలకు గోచరమై, నిత్యానుభవంలోని విషయమై ఒక సజీవసాకారస్వరూపంగా దానియొక్క అభివ్యక్తిని మనం కండ్లారా చూడాలి. సత్యసాక్షాత్కారంకోసం, మనం చేసేయత్నం ఆవిధంగానే సఫలం కావాలి. అట్టి పరమసత్యపదార్థంయొక్క బాహ్యావ్యక్తీకరణయే 'మానవుడు' అని తత్త్వవేత్తలు భావించారు. అతణ్ణే పూజ్యుడుగా

ువ్యుడుగా స్వీకరించారు. "మనవలెనే ప్రతివ్యక్తి ఒకేసత్యంయొక్క స్ఫులింగమనీ, దినదినప్రవర్ధమానమయ్యే మానవుల సుఖదుఃఖాలే మన ుఖదుఃఖాలుగా చేసుకొనేందుకు యత్నిస్తూ మన అస్తిత్వాన్ని వికసింప ేసుకొంటూచివరకు విశ్వమంతటా వ్యాపించియున్న మహాసత్యాన్ని మనలో సాక్షాత్కరింపచేసుకోవాలి" అని వారు ప్రకటించారు.

అటువంటప్పుడు మనలోని ప్రతిఒక్కడు, జీవనపరిణామక్రమంలోని ాతనస్థాయికి తగినట్లు తోటిమానవుని సేవించేందుకు అవకాశమిచ్చే ఏర్పాటు ఏమిటి ?

మనిషి ఒంటరిగా జీవించలేడు-ఒంటరితనాన్ని అతడు నిరసిస్తాడు. స్వభావతః అతడు సంఘజీవి. అందుచేత మానవులు ఒకచోటజేరి సంఘ జీవులుగా ఉంటూ ఒక సమాజంగా ఏర్పడుతారు. ఆవిధంగానే అతడు ఆదర్శవంతంగా జీవిస్తూ క్రమవికాసంచెంది తనలోని ఉత్తమత్వాన్ని చక్కగా వ్యక్తీకరించగలుగుతాడు. ఆవిధంగానే అతడు సమాజంలో ఒక్కొక్కమెట్టే పైకెక్కి తన జీవితలక్ష్యాన్ని చేరటంలో ముందడుగువేస్తాడు. సమాజంలోని వర్గాల్లో - క్రమవిస్తృతిపొందే సమూహాలతో తాదాత్మ్యం పొందేటందుకు ప్రతి వ్యక్తికీ సంపూర్ణావకాశాలను కల్పించగల ఒక సాంఘికవ్యవస్థను నిర్మించుకోవటం. దాన్ని నిలుపుకొంటూ వ్యక్తి తన సర్వస్వాన్ని సమాజ సేవలో వినియోగించగల్గటం - ఇవే తన అంతిమలక్ష్యాన్ని సాక్షాత్కరించు కొనేందుకు ప్రతి వ్యక్తి అనుసరించిపోయే మార్గంలో వెలుగులను విరజిమ్ముతాయి. కాబట్టి "స్వార్థపూరితమైన ఆకాంక్ష ఆసక్తులు లేకుండా సమాజాన్ని సేవించాలి"అని మనం అన్నాం. మానవసేవయే మాధవసేవ అనేది మనయొక్క జీవనదర్శనంలోని ప్రత్యేక లక్షణంగా రూపొందింది

## మన ఆదర్శపురుషులు

ఇదే అంతిమలక్ష్యాన్ని ఎల్లప్పుడు మనముందుంచుకొన్నాం, మన చరిత్ర అంతటా మానవజాతి సంక్షేమానికి దోహదకారియైన వ్యక్తియొక్క

మేధాశక్తికి, సుగుణసంపత్తికీ ప్రాధాన్యం ఇచ్చినామేగానీ, వ్యక్తి పొంద గలిగిన ప్రాపంచిక సంపదల ఆధిక్యానికి ప్రాధాన్యమివ్వలేదు. ఉదారమైన హృదయం, పవిత్రమైన మనస్సు, ఉదాత్తమైన శీలమూ సర్వదా మన జీవన మూల్యాలకు గీటురాళ్ళుగా ఉంటూ వచ్చాయి. ఆంతరిక సుగుణ సమృద్ధియే ఒకవ్యక్తి ఘనతకు కొలబద్ద; బాహ్య సంపత్తిమాత్రం కాదు. బాహ్యవిషయాలన్నీ వస్తూ ఉంటాయి; పోతూ ఉంటాయి. క్షణికాలైన ఆ వస్తువులవెంట మనమెందుకు పరుగెత్తాలి? సద్గుణజాలము నిర్మలజ్ఞానము, ఆత్మోదాత్తతలు అనే సంపదను మనం కోరుకుంటున్నాం. అదే మానవజీవితానికి నిరుపమానమైన నిధి. దాన్ని మనలో పెంపొందించు కోగలం. అది వాస్తవికమైంది; అదే శాశ్వతమైందికూడ. అందుచేతనే ఇతర దేశాలలోని సామాన్య ప్రజానీకం ఒక సేనాధిపతినో లేక శక్తిమంతు డైన ఒక నాయకుణ్ణో ఆరాధిస్తుంటే, మనదేశంలోని మహావీరులు చక్రవర్తులుగూడ, ఇది నాది అని చెప్పుకునేందుకు అర్ధ నగ్న సన్యాసుల పాదధూళిని సేవించారు. ఇందుకు కారణమేమిటి? జీవితాన్ని మనం చూచేతీరే దానికి కారణం. జీవాత్మలోని ఆంతరిక సుగుణసంపత్తియే ముఖ్యమైనదనీ, పరిపూర్ణతను పొందేటంతవరకు అది ఒక జన్మనుండి మరియొక జన్మకు సంక్రమిస్తూ ఉంటుందనేదికూడా అందుకు కారణమే.

## సజీవ జంగమ ప్రతీకలుగా ఉండాలి

నిజమైన హిందువులుగా మనలను రూపొందించే కొన్ని ప్రాథమిక లక్షణాలు ఇవి. వీటిపట్ల ప్రత్యేక శ్రద్ధను చూపి, అలవరచుకొని జీవితంలో ఆవిష్కరించుకోగలిగినప్పుడే మనం నిజమైన హిందువులం. అట్టి మహోన్నత భావనలకు మనం సజీవ జంగమ ప్రతీకలుగా ఉంటేనే దివ్యమైన హిందు త్వానికి వారసులుగా పుట్టినందుకు మనకు సార్థక్యం లభిస్తుంది; అప్పుడు మనజన్మ వ్యర్థంకాదు.

మరి ఇప్పుడు, ఈ దృష్టిలో అట్టి నిజమైన, భావాత్మకమైన హిందువులమని దృఢవిశ్వాసంతో చెప్పుకోగలమా ? మనలను మనం ప్రశ్నించుకుందాం. మనం ఏవిధంగా జీవిస్తున్నాం? మనముందున్న ఆదర్శా లేమిటి? మన భావనలు ఏమిటి? పరిస్థితుల ప్రాబల్యంచేతకాని, విధివశాత్తు ఏర్పడిన జన్మవల్లకాని మాత్రమే మనం హిందువులమా? మతం మార్చేవారి సంఖ్య స్వల్పమైనది కనుక, మన సంఖ్య చాలా అధికం కనుక, ఇంతవరకు మనం ముస్లిములుగాను, క్రైస్తవులుగాను మారకుండా మిగిలిఉన్నాం కాబట్టి మనం హిందువులమా? మనం హిందువులుగా ఉండటానికర్థం కేవలంఇంతేనా? 'మాది చాలా గొప్ప సంస్కృతి' అని నోటిమాటలు చెప్పినందువల్ల ప్రయోజనంలేదు. దానినిగురించి మన కేమితెలుసు ? దాన్ని మనం ఎట్లా అనుష్ఠిస్తున్నాం ? మన వ్యక్తిగత జీవితాన్ని సమాజానికి ఒక సమర్పణగా భావిస్తున్నామా ? కేవలం సంపద, అధికారాలకొరకు పరుగెత్తకుండ జీవితంలో సద్గుణాలకు ఉన్నతస్థానం ఇయ్యాలి, అని మనం భావిస్తున్నామా? 'యథార్థ మానవత్వంయొక్క పరిపూర్ణతను సాధిస్తూన్నవాడు ఇదిగో ఇక్కడొకడున్నాడు' అని మనలను చూచిన వెనువెంటనే ఎవరైనా చెప్ప గలుగుతున్నారా? అంతటి చక్కని మానవులం కావాలనేభావన నిజంగా మనలో ఉందా? ఈ అంశాలు దృష్టిలో పెట్టుకొని, మనం ఆత్మ పరిశోధన జరుపు కొని, క్రమంగా హిందుత్వ విశిష్టలక్షణాలన్నిటినీ అలవరచుకొందాం. ప్రపంచంలో క్రియాశీలురైన హిందువులుగా నిలబడదాం. మనతత్త్వానికీ మనధర్మానికీ, తరతరాలుగా మన జీవితాలను మలచిన మన ఉదాత్త గుణసంపత్తికి అనుగుణంగా జీవిద్దాం.

హిందూ సమాజాన్ని సంఘటితం చేయాలనే ఆలోచన ఒక చిన్న విషయంగా కనిపించవచ్చుగాని, దానిలోని ఆంతర్యంవేరు. ముందుగా మనయొక్క దైనందినజీవితంలో మనం హిందువులమని గుర్తుంచుకోవాలి. పరంపరాగతమైన హిందుత్వంలోని శ్రేష్ఠ ఆదర్శాలకు అనుగుణంగా మన జీవితంలోని ప్రతి చిన్న అంశాన్ని మలచుకోగలగాలి. మనం చేసే ప్రతి

పనిలోనూ, మన వేషభాషల్లో-జీవితంలోని అన్నిరంగాలలోనూ మనయొక్క విశ్వాసం, నిష్ఠలముద్ర సుస్పష్టంగా కన్పించాలి. ఇది మనపైనున్న పెద్ద బాధ్యత.

## ప్రతి క్రియాత్మక హిందుత్వం

కాని దురదృష్టవశాత్తు ఈనాడు మనచుట్టు కనిపించేదేమిటి? కొందరు దృఢమైనవిశ్వాసంవల్లగాక, ప్రతిక్రియాత్మకంగాహిందువులుగాఉంటున్నారు. దీనికి ఒక ఉదాహరణ: ఒకసారి మన కార్యకర్తలు, గోవధ నిషేధించాలని కోరుతూ, సంతకాల సేకరణ ఉద్యమం చేపట్టారు. ఆ సందర్భంగా వారు ఒక ప్రముఖ హిందూనాయకుని వద్దకు వెళ్ళారు. అయితే అతని మాటలు వారికి దిగ్భ్రాంతికలిగించాయి. "ఉపయోగంలేని పశువులవధ నిషేధించిఏమిలాభం? వాటిని చావనివ్వండి. చస్తే ఏం? అన్ని జంతువులు ఒక్కలాంటివేగదా! కాని ముస్లిములు గోవును చంపాలని మొండిపట్టుపడుతున్నారు. కాబట్టి దాన్ని మనమొక సమస్యగా చేయాలి. అందుకే నేను సంతకం పెడుతున్నాను" అని అతడు వారితో అన్నాడు. ఇది దేన్నిసూచిస్తుంది? తరతరాలుగా హిందువులకు గోవు శ్రద్ధాకేంద్రంగా ఉంది కాబట్టి, దాన్ని మనం రక్షించుకోవాలా? లేక ముస్లిములు చంపుతున్నారు కాబట్టి, దాన్ని మనం రక్షించుకోవాలా? వ్యతిరేకతనుండి జనించిన ప్రతిక్రియాత్మక హిందుత్వమంటే ఇట్లా ఉంటుంది.

మరికొందరున్నారు. 'హిందూ' అన్నపదం కేవలం తమ రాజకీయ ప్రయోజనాలను సాధించుకొనేందుకే వారు ఉపయోగించుకొంటారు. ఒక కాంగ్రెసువాది, లేక ఒక సమాజవాది లేక ఎవరో ఒక వెంకయ్యో, పుల్లయ్యో "మిశ్రసంస్కృతిని" గూర్చి మాట్లాడుతున్నారుకాబట్టి తమకు స్వచ్ఛమైన హిందూసంస్కృతి కావాలని అంటారు కొందరు. అంతకంటె విచిత్రమైనది 'హిందూ సామ్యవాద' నినాదం. ఒకవ్యక్తి, అయితే హిందువన్నా అవుతాడు

లేకుంటే సామ్యవాదియైనా ఔతాడు. కాని రెండూమాత్రం కాలేడు. అంటే 'హిందూసామ్యవాదం' అని అరిచేవారికి అటు సామ్యవాదంగాని ఇటు హిందుత్వంగాని తెలియదన్నమాట. ఇవన్నీ ప్రతిక్రియాత్మకంగా ఏర్పడినవే. ఒకసారి ఒక పెద్దమనిషి నన్నుకలిసి "మీరు ముస్లిముల కార్యకలాపాలను ఎదుర్కొనేందుకే హిందువులను సంఘటితపరుస్తున్నారా ?" అని అడిగాడు. మహమ్మదుప్రవక్త పుట్టకపోయినప్పటికీ, ఇస్లాంస్థాపించబడకపోయినప్పటికీ హిందువులు ఆత్మవిస్మృతిలో మునిగి అనైక్యంగా ఉన్నట్లుగుర్తిస్తే ఈరోజున మేము చేస్తున్నరీతిగానే, ఇదేపనిని అనాడుకూడ మేము చేపట్టి ఉండేవారమని నేను క్లుప్తంగా సమాధానంచెప్పాను. "ఇది నాహిందూరాష్ట్రం; ఇది నాధర్మం; ఇది నాతత్త్వం; ఈప్రకారం నేను జీవించాలి. నన్నుచూచి ఇతరజాతులు అనుసరించేటంత ప్రామాణికంగా నేనునిలబడాలి" అనేభావనయే హిందువులను సంఘటితం చేసేందుకు కావలసిన గట్టిపునాది.

కేవలం 'రాజకీయహిందూప్రాణి'గాగాని 'ప్రతిక్రియాత్మకహిందువు'గా గాని కాకుండా ఉండాలంటే, 'భావనిష్ఠచేత హిందువులుగా' మనం జీవించి తీరాలి. మన దైనందిన జీవితంలోని అన్ని అంశాలలోను, అట్టి భావనిష్ఠను వ్యక్తంచేయగలిగి ఉండాలి. సాహిత్యంలోనూ, వార్తాప్రతికల్లోనూ హిందుత్వభావనను ప్రచారంచేసినంతమాత్రాన ప్రయోజనంలేదు. ఉదాహరణకు చెప్పాలంటే వీరసావర్కరు "హిందుత్వ" అనే ఒక చక్కని పుస్తకం వ్రాశారు. దానిలో వర్ణింపబడిన స్వచ్ఛమైన హిందూజాతీయ తత్త్వంమీద హిందూమహాసభ ఆధారపడింది. అయితే నాసిక్‌లో జరిగిన హిందూమహాసభ సమావేశాలలో ఒక తీర్మానం చేయబడింది. కాంగ్రెసుసంస్థ ముస్లింలీగుతో మంతనాలకుదిగి తన 'జాతీయ' ప్రాతిపదికను త్యజించరాదనీ లీగుతో మంతనాలు జరిపేపని హిందూమహాసభకు అప్పగించాలనీ ఆ తీర్మాన సారాంశం. దానిఅర్థమేమిటి? కాంగ్రెసుప్రతిపాదించిన సంకర జాతీయవాదంస్వచ్ఛమైందని, మతదురహంకారపూరితమై, దేశద్రోహకరమైన ముస్లింలీగుకు ప్రతిగా, హిందువులకొరకు హిందూమహాసభ పుట్టిందని

మాత్రమే దాని భావం. ఇటువంటి విచిత్రమైన వైపరీత్యం ఎట్లాఏర్పడింది? ఏ పరిస్థితిలోనైనా సరే, చివరకు కలలోగూడా, ఇది "హిందూ రాష్ట్రం" అని అప్రయత్నసిద్ధమైన సత్వరసమాధానాన్ని ఇయ్యగలిగిన దృఢమైన భావనిష్ఠ లేకపోవటమే దానికి కారణం.

## విలువగల విషయాలు

అందుకే రాజకీయాల్లోగాని, తదితరమైన ఏ ఆలోచనాప్రవాహంలోగాని కొట్టుకొనిపోకుండా మనల్ని నిలిపి ఉంచగలిగే ప్రగాఢమైన జాతీయ భావాత్మక సంస్కారాలను, అలవరచుకోవాలని చెప్పుతుంటాము. మన నిత్యజీవితంలో హిందూజీవనపద్ధతిని అమలుపరచకుండా హిందూజాతీయత హిందూజీవన విధానాల యొక్క గొప్పతనాన్ని గురించి మాట్లాడడం నిష్ప్రయోజనం.

సూర్యోదయానికి ముందు, వేకువజామున నిద్రలేవటం, మన ప్రాచీన ఆచారాలలో ఒకటి. ఒకసారి ఒక సాధువు తన చిన్ననాటి జీవితం గురించి నాకు చెప్పాడు. వేకువజామున తనతల్లి మేల్కొనేదనీ, మామూలుగా ఇంటిపనులు నిర్వర్తించుకుంటూనే ఆమె, తన మధురమైన కంఠస్వరంతో విశ్వజననియైన ఆ పరదేవతయొక్క వైభవాన్ని వర్ణించే అనేక గీతాలు పాడేదనీ, ఆదేవియొక్క ఆశీస్సు లభించాలనికోరుతూ తనను నిద్రలేపేదని అతడు వివరించి చెప్పుతూ "నిద్రనుండి మేల్కొంచిన వెంటనే నిత్యం నేనూ వింటూఉండే ఆ దివ్యమైన గీతాలప్రభావం నా అంతరాంతరాల్లోకి వ్యాపించి, నన్ను పవిత్రం చేసింది; ప్రాపంచికవ్యామోహాల నెదుర్కొని ఆ జగన్మాతయొక్క సేవలో నాజీవితం అంకితంచేయటానికవసరమైన దృఢ విశ్వాసాన్ని, శక్తిని నాలో కలిగించింది" అన్నారు. హిందూసంస్కార మంటే ఇది. ఆవిధంగా, వేకువనుండి రాత్రివరకు, దినమంతా క్రమశిక్షణ భావంతో జీవితాన్ని మలచుకుందాం. జీవితం అంతా క్రమశిక్షణతో

ఆత్మసంయమనంతో శిక్షణ పొందేందుకే హిందువు జన్మించాడు. అదే జీవితంయొక్క శ్రేష్ఠమైన లక్ష్యాన్ని చేరుకొనేందుకు అతణ్ణి పవిత్రుడుగాను, శక్తిమంతుడుగాను చేస్తుంది.

ఇవన్నీ చిన్నచిన్న విషయాలు, వీటినిగురించి మనం పట్టించుకోవలసిన పనిలేదని మనం అనరాదు. ఇట్టి చిన్నచిన్న విషయాలు మాత్రమే మన జీవితాన్ని క్రమశిక్షణతో నిలిపి, మన శీలానికి రూపురేఖలను, శక్తిని కలిగిస్తాయి.

అయితే, దురదృష్టవశాత్తు, ఈనాడు ఏం చూస్తున్నాం? అటువంటి హితప్రదాలైన ఆచారాలను, వ్యవహారాలను మూఢవిశ్వాసాలు అని పరిహసిస్తున్నారు. ఈమధ్యనే ఒక సంఘటన జరిగింది. ఒక విద్యార్థి మనదేశంనుండి అమెరికా వెళ్ళాడు. అక్కడ ఒక సామాన్యకుటుంబంలో డబ్బుచెల్లించే అతిథిగా చేరాడు. మొదటిరోజున ఆ కుటుంబంలోని సభ్యులందరితోపాటు ఆతడుగూడ భోజనానికి బల్లముందు కూర్చొని వెంటనే పదార్థాలను వడ్డించుకోనారంభించాడు. అపుడా ఇంటిఇల్లాలు ఒక్కనిమిషం వేచి ఉండుమని మెల్లగా అతణ్ణి కోరుతూ భోజనం చేసేముందు భగవంతుని ధ్యానించటం తమ ఆచారమని చెప్పింది. ఈశ్వరునిదేశంగా, ఆధ్యాత్మిక భూమిగా భావింపబడే భారతదేశంనుండి అతను కేవలం డబ్బును పూజించే, ఆధిభౌతికవాదాన్ని మాత్రమే పాటించేదేశం వెళ్ళాడని మనం గుర్తించుకోవాలి!! అయితే భగవంతునిపై వారికున్న ఈ విశ్వాసమే పాశ్చాత్య దేశాలకు ప్రపంచంలో విజయాన్ని సాధించటానికవసరమైన శక్తిని చాలవరకు సమకూర్చిందనటంలో ఎట్టిసందేహం లేదు.

## ఆధునికత

మనం మన ఆధ్యాత్మికపరంపరను చూచుకొని గర్వపడుతూఉంటాం. అయితే నిజానికి మనం ఏవిధంగా జీవిస్తున్నాం? మనయొక్క నిత్యసంస్కారా

లేమిటి? మన నిత్యజీవనకార్యకలాపాలలో భగవంతునికి స్థానముందా? ఒకచోటకూర్చొని భగవంతునిపై మనసును లగ్నంచేసేందుకు కనీసం ఒక నిర్దిష్టస్థానమైనా మనఇండ్లలోఉందా? ఒకప్పుడు ఒకపరిచితుడు తాను క్రొత్తగా నిర్మించుకున్న ఇంటిని చూడటానికి నన్ను రమ్మన్నాడు. ఆ ఇంటిలో అన్నిసదుపాయాలూ ఉన్నాయి. అన్నివిధాలా అది ఒక అధునాతన గృహం. ఆయింటిలోని ప్రత్యేకతలను అతడు నాకు చూపించాడు. అదంతా పూర్తయినతర్వాత "ఇల్లంతా బాగుందిగాని, పూజామందిరం ఎక్కడ? మీ తండ్రి, తాతలు అర్చించి మీకప్పగించిన కులదైవమెవ్వరు మీకు లేరా?" అని అతణ్ణి అడిగాను. నాప్రశ్న అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణిచేసింది. "అవును అవును. ఆవిషయాన్ని అసలు మర్చిపోయాను" అని నీళ్ళునమిలాడు. తరువాత కొన్నినెలలకు నేను మళ్ళీ ఒకసారి ఆఊరు వెళ్ళినపుడు "మీ సూచన పాటించాను చూతురుగాని రండి" అని ప్రత్యేకంగా అతడు నన్ను తనయింటికి ఆహ్వానించాడు. చూద్దామని వెళ్ళాను. మేడమెట్లక్రింద ముక్కోణాకారంలో నిర్మింపబడ్డ ఒక అలమారు చూపించాడతడు. ఆకుటుంబసభ్యులందరియొక్క రకరకాల చెప్పుల జతలు, బూట్లు, అందంగా దానిపైన అమర్చిఉన్నాయి—వారి ''జీవనస్థాయి'' చాలాగొప్పదిమరి. "ఈ అలమారు క్రొత్తగానిర్మించి, దీనిలో మా కులదేవత నుంచా"నని ఒకవిధమైన సంతృప్తితో చెప్పాడతడు. దాన్ని చూడటంతోనే స్తంభించిపోయాను. "ఆవిధంగా దేవత నవమానించేబదులు ఆ చెప్పులనే అలమారులో ఉంచి పూజిస్తేపోలేదా!'' అని మాత్రం అన్నాను. అధునాతన అభ్యుదయ హిందువుల జీవనం ఇట్లా ఉంది.

శ్రీరామచంద్రుడు, శివాజీ, వివేకానందుడు మొదలైనవారు ఈవిధమైన ఆధునికతవల్ల జనించినవారుమాత్రం కాదని మనం మరువరాదు. రామాయణ భారతాలు కీర్తించిన ఆదర్శాలచేత శివాజీ ఉత్తేజితుడైనాడు. మన హిందూ జీవనంపట్ల ఆయనకున్న ప్రగాఢమైన శ్రద్ధకు ఆయనలోని అసమానమైన సంఘటన చాతుర్యం తోడై దానికి చైతన్యవంతమైన ప్రయోజకత్వాన్ని

సమకూర్చింది. అదియే ఆయననొక మహాశక్తిగా రూపొందించింది. అందు వల్లనే ఆయన చరిత్రయొక్క గతినే మార్చివేయగలిగాడు. వైదిక ఋషులు మొదలుకొని, రామకృష్ణపరమహంస, వివేకానంద, రామతీర్థాది మహా పురుషులవరకు, అందరూ తరతరాల ఆదర్శాలను, తమయెదలో సాక్షాత్కరించుకొని తమ ప్రేమమయజీవితాలద్వారా, ఉత్తేజకరమైన తమవ్యక్తిత్వ ప్రభావాలను మనవారిపై ముద్రించారు. ప్రతికూలశక్తులన్నిటినీ ఎదుర్కొని స్థిరంగా నిలబడి, సవాలుచేస్తూ ప్రపంచాన్ని సంబోధించారు. వారిసంతతికి చెందిన మనం ఈనాడెంతటి దయనీయమైన స్థితికి దిగజారిపోయాం!!! వారిని వీరులనుగా తీర్చిదిద్దిన ఆదర్శాలయొక్క ఓనమాలుకూడ మనకురావు.

ప్రభుత్వమిచ్చిన ఉపకారవేతనంతో విదేశాలకు వెళ్ళిన ఒకయువకుడు నాకు తెలుసును. అక్కడ ఆత్మ, ప్రాణాయామం; గీత - ఇంకా అనేక హిందూజీవన పద్ధతులను గురించి అతణ్ణి అనేకులు ఎన్నో అడిగారు. పాపం ఆ విషయాలగురించి అతనికున్న పరిజ్ఞానం పూజ్యం. తన యిబ్బంది గురించి అతడు నాకు తెలియపరచాడు. అయితే, నేనుమాత్రం ఏంచేయగలను? యోగాభ్యాసం, సమాధి, ప్రాణాయామం ఇంకా అటువంటి ఇతరవిషయాలలో నేనాతనికి 'తపాలాశిక్షణ' ఇవ్వగలనా! ఈభూమికి చెందిన ఒక విద్యార్థికు డనబడే యువకునకు మన జీవనతత్త్వముయొక్క ప్రాథమిక విషయ వాసనైనాలేదు - వాటిని అతడు తన జీవితంలో సాక్షాత్కరించుకోవటం గురించి ఇంక చెప్పేదేముంటుంది! ఎంతటి అవమానకరమైన పరిస్థితి ఇది!!

## వివిధ అంశాల్లో మన ఆదర్శం

ఇంక, ఇతర అంశాలు చూద్దాం. ఉదాహరణకు మనకుటుంబం, మన ఇరుగుపొరుగు, మనవిద్యాకేంద్రాలు, మనవృత్తిక్షేత్రాలు మొదలుగా సమాజం లోని అనేకరంగాలతో మనసంబంధాలు ఏ విధంగా ఉన్నాయో పరిశీలిద్దాం. జీవితంలోని ఈ రంగాలన్నిటికి హిందువులొసగిన విశిష్టమైన కానుక

ఏమీలేదా ? ఉన్నది. అంతేగాదు. మానవుని కార్యక్షేత్రాలలోని అతిస్వల్ప మయినదానినుంచి, అతివిశాలమైన విషయంవరకు, హిందూతత్త్వం ఒక్కటే ప్రభావితంచేస్తూఉంది.వ్యక్తి సమష్టిగా రూపొందడంలో తొలిమెట్టుకుటుంబం. కాబట్టి, కుటుంబసభ్యులమధ్య ఉండే సున్నితమైన తీయని అనుబంధాలను సమైక్యతను ఎల్లప్పుడు చక్కగా నిలుపుకొనేందుకుగాను, ఆ కుటుంబ సభ్యులుగా మనం వివిధకర్తవ్యాలను సరిగా నిర్వర్తించాలి. కుమారుడుగా సోదరుడుగా, భర్తగా – యింకా యే యితరమైన బాంధవ్యం కలిగి ఉన్నా మనం మాత్రం, ఒక ఉదాత్త హిందూగృహస్థజీవితంయొక్క ఆదర్శాన్ని మనలో నిలుపుకోవాలి. 'నేను సమాజకార్యం చేస్తున్నాను, ఈ కుటుంబ బంధాలతో నాకేంపని' అని మనమంటే, అది మనకు గౌరవప్రదంకాదు. మనదేశంలో జన్మించిన ఆదర్శపురుషుల జీవితాలను ఒకసారి పరికించండి. శ్రీరామచంద్రుడు పదహారేండ్లు నిండకముందే, తన తండ్రి ఆజ్ఞానుసారం రాక్షసులను చంపేందుకు విశ్వామిత్రునివెంట అడవికి పోయాడు. అటుపైన కేవలం తండ్రిమాట వమ్ముకానీయకుండా ఉండడంకోసమే సంతోషంగా పదు నాలుగేండ్ల వనవాసానికిబయలుదేరాడు. సోదరుడుగా, అతడు లక్ష్మణునిపట్ల తదితరులపట్ల ఎంతటి గాఢమైనఅనురాగం చూపాడు! ఆయన ఒక ఆదర్శ పుత్రుడు, ఒక ఆదర్శసోదరుడు, ఒక ఆదర్శభర్త, ఒక ఆదర్శమిత్రుడు, ఒక ఆదర్శశిష్యుడు– అంతేగాక శత్రువులకతడొక ఆదర్శవైరికూడా; ఆయనలో ఆదర్శహిందూపురుష లక్షణాలన్నీ మేళవించాయి. అట్టివాడే శ్రీకృష్ణుడు కూడ. యశోదా నందులకు ఆతనివల్ల ఎంతటి సాంత్వనము, ఎంతటి ఆనందం ! తన మధురమైన ప్రవర్తనలతో తన పరిసరాలన్నిటిని ఎంతగా పరవశింపచేశాడతడు ?

ఇక విద్యార్థిదశలో కేవలం విషయాన్ని మన మెదడులోనికి దట్టించడం మాత్రమే గాకుండ, విజ్ఞానాన్ని, శీలాన్ని పెంపొందించుకోవటమే ఎల్లప్పుడు మనఆకాంక్ష గాఉంటూవచ్చింది.మనం కేవలంపుస్తకాలపురుగులం కానక్కరలేదు. విద్యార్జనకు మనస్సును ఏకాగ్రం చేయటమొక్కటే కీలకం.

క్రమబద్ధము, ఆరోగ్యప్రదమునైన అలవాట్లు మనలో ఉంటే ఏకాగ్రతను అభ్యాసంచేయటం కష్టతరం కాదు. అటుపైన మనం చదువుకునే అనేక విద్యాసంస్థల్లో, అనేకులైన మన ఉపాధ్యాయులతో, తోటివిద్యార్థులతో మనకు పరిచయం ఏర్పడుతూ ఉంటుంది. మన హైందవ సంప్రదాయం ప్రకారం గురుశిష్యులమధ్య సంబంధం ఒక వ్యాపారపుటొప్పందం వంటిది కాదు. అది ఒక ఉదాత్తమైన విషయం. శిష్యుడు గురువును మూర్తీభవించిన విజ్ఞానసర్వస్వంగాను, భగవత్స్వరూపంగాను భావించి, ఆతనిపట్ల వినయవిధేయతలు కల్గి శ్రద్ధాభక్తులతో ప్రవర్తిస్తాడు.

ఈమాట చెప్పటంతోనే, ఈనాటి అధ్యాపకులు అంతటి శ్రద్ధాభక్తులకు అర్హులైనవారా అని ప్రశ్నించేవారు కొందరున్నారు. కాని విద్యార్థులు అటువంటి వక్రభాష్యానికి, వక్రదృష్టికి ఎరకాగూడదు. మన కర్తవ్యమేమిటో మనం ఆచరిద్దాం; అది మనమంచికే; మనను చక్కదిద్దుకొనడానికే. దేవాలయంలోని హనుమంతుని విగ్రహాన్ని మనం పూజిస్తాం. కొంతకాలానికి దానిపై పూయబడే సిందూరంచేత అది దట్టంగా కప్పబడుతుంది. దానితో దాని ఆకారం గుర్తుపట్టలేనంతగా మారిపోతుంది. అయినా, మనంమాత్రం ఎప్పటివలెనే, అంతటి భక్తితోను హనుమంతుని విగ్రహంగానే పూజిస్తాం. విద్యకు అధిదేవతయైన వినాయకునకు బానలాంటి బొజ్జ, ఏనుగుతల ఉంటాయి. అంతమాత్రాన ఆయనపట్ల భక్తిశ్రద్ధలను అవేమీ మార్చలేవు. జన్మతః జగద్గురువైన శ్రీకృష్ణుని చూడండి – ఒక సామాన్యవిద్యార్థివలె ఆయన సాందీపని ఆశ్రమంలో మెలిగాడు. ఆయనలో ఆదర్శ హిందూవిద్యార్థి యొక్క రూపం కనబడుతుంది. ఇతర విద్యార్థులందరివలెనే అతడుకూడ తన గురువును ప్రగాఢమైన భక్తిశ్రద్ధలతో సేవించాడు. యజ్ఞానికవసరమైన సమిధలనుతెచ్చేందుకు అతడు వర్షంలోను, తుఫానులోను అడవులకువెళ్లాడు. మూర్తీభవించిన విజ్ఞానస్వరూపుడైన ఆతనికి ఇంక వేరే అధ్యయనం చేయవలసిందేముంది ?

ఇంక తోటివిద్యార్థులతో, సహచరులతో అతనిప్రవర్తనను చూడండి! వారందరిపట్ల ఎంతటిగాఢమైన, నిర్మలమైన ప్రేమ ఉన్నదాతనిలో! సుదాముడనే ఒక పేదబ్రాహ్మణ బాలుడు, సాందీపనియొక్క ఆశ్రమంలో అతనికి సహాధ్యాయుడు. తదనంతరజీవనంలో శ్రీకృష్ణునికీర్తి దేశదేశాల వ్యాపించిననాడు, ఒకనాడు సుదాముడు చిరిగినబట్టలతో, గుప్పెడు అటుకులతో తన చిన్ననాటి సహాధ్యాయుణ్ణి చూడ బయలుదేరాడు. చిన్ననాటిమిత్రుని చూచినవెంటనే శ్రీకృష్ణుడు పరుగునపోయి ఆలింగనంచేసికొని ఆదరంతో హృదయానికి హత్తుకున్నాడు. తనమిత్రుడు తనకొరకుతెచ్చిన అమూల్యమైన ఆ కానుకను లాగుకొని ఎంతోసంతృప్తితో ఆరగించాడు. అటుపిమ్మట సుదామునిపై అంతులేని సంపదలను వర్షించాడుకూడా.

మన పెద్దలతో ఎప్పుడైనా అనుకోకుండా ఆదర్శపరమైన విషయాలలో విరోధం ఏర్పడినప్పటికీ, వారిపట్ల మనం పాటించే మర్యాదపూర్వకమైన నడవడిలో ఎట్టి మార్పు రానక్కరలేదు. మహాభారత యుద్ధంలో భీష్మార్జునులు ఒకరినొకరు ఎదుర్కొనినపుడు అర్జునుడు ముందుగా అయిదు బాణాలను భీష్ముని పాదాలదగ్గరకు గురిపెట్టి విడిచాడు. అమోఘాలైన అర్జునుని బాణాలు భీష్ముని వక్షస్థలాన్ని తగులక, అతని పాదాలవద్ద పడటం చూచి భీష్ముని రథసారథి ఆశ్చర్యచకితుడయ్యాడు. అది చూచి "నాకు ప్రియతముడైన అర్జునుడు తన పంచప్రాణాలతోనూ నా పాదాలవద్ద మోకరిల్లి నా ఆశీస్సులను కోరుతున్నాడు" అన్నాడు భీష్ముడు.

## స్వధర్మే నిధనం శ్రేయః

ఈ ఉదాహరణ లన్నిటిని పాతకాలపు పురాణగాథలుగా మనం త్రోసివేయరాదు. వాటిలోనే అమూల్యమైన మన సంస్కృతీరత్నాలు పొదుగబడి ఉన్నాయి. మన హిందూ జీవనపద్ధతిని చూచి యావత్ప్రపంచం ఈర్ష్యపడేటట్లుగా అవే ఒకనాడు చేశాయి. ఈ రోజుల్లో అవన్నీ ఆచరణయోగ్యాలు కావని అంటూ విడచిపుచ్చరాదు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో

గూడ అటువంటి స్ఫూర్తిదాయకాలైన ఉదాహరణలున్నాయి. వాటిలో మన సంఘస్థాపకులైన డాక్టరు హెడ్గేవార్ జీవితం ఒకటి. సంఘకార్యం నిమిత్తమై ఒకసారి వారు పూనా వెళ్ళారు. వారు ఒక పురప్రముఖుల సమావేశంలో ప్రసంగించవలసి ఉంది. ఆ సమావేశానికి ఆహూతులైన పెద్దలలో డాక్టర్‌జీ చిన్ననాటి గురు వొకరున్నారు. నగరంలోని ప్రముఖులలో అనేకమంది ఆ సమావేశంలో ఆసీనులై ఉన్నారు. డాక్టర్‌జీ ఆయనను చూచినవెంటనే లేచి నిలబడి, ఆయన పాదాలకు వందనంచేసి తన ఆసనాన్ని వారికి సమర్పించారు.

శాశ్వతాలైన మన జీవనమూల్యాల ఉద్యానమునుండి నేడు మనం గ్రహిస్తున్న పుష్పాలు కొన్నిమాత్రమే ఇవి.

ఒక వ్యక్తివలెనే. ఒకజాతిగూడ తన స్వధర్మమనే వేళ్ళు తెగకుండా అంటిపెట్టుకొని నిలబడినప్పుడే అభివృద్ధిని, క్రమవికాసాన్ని పొందుతుంది. ఆవిధంగానే సర్వతోముఖవైభవ సాధనలో విజయం పొందుతుంది. ఒక జాతియొక్క స్వధర్మముయొక్క వేళ్ళను పెల్లగించి వాటిస్థానంలో వేరొక దాన్ని అంటుగడితే, అది అస్తవ్యస్తతకు, పతనానికి దారితీస్తుంది. భగవద్గీత ఇట్లా చెప్పుతున్నది :

*స్వధర్మే నిధనం శ్రేయః । పరధర్మో భయావహః ॥*

(తన ధర్మం ఆచరించేటప్పుడు మృత్యువు సంభవించినా శ్రేయస్సే: కాని పరధర్మం స్వీకరించటంమాత్రం భయంకరమైనది.)

హిందూ హృదయంలోని పరంపరాగతమైన, అమరాలైన సంస్కారాగ్నికణాలను కప్పివేస్తున్న ఆత్మవిస్మృతి, పరానుకరణం అనే నివురును ఊదివైచి ఈ పవిత్ర భూమిలోని స్వచ్ఛమైన జాతీయాత్మజ్వాలను తిరిగి సంపూర్ణతేజంతో ప్రజ్వరిల్ల చేయాలి. దానికొరకు హిందూ జీవనపద్ధతిని పునరుద్దీపింపచేసేకార్యాన్ని చేపట్టుమని రాష్ట్రీయ స్వధర్మం మనలను ఆహ్వానిస్తోంది.

# 8. మన కార్యలక్ష్యం

ప్రతివ్యక్తి ఒక ఆదర్శహిందువుగాను, సమాజపురుషుని చైతన్య వంతమైన అవయవంగాను రూపొందే సుసంఘటిత సమాజస్థితి మన కార్యంయొక్క పరమలక్ష్యం. ఆ లక్ష్యమే మన ప్రయత్నాలకు నిరంతరము ప్రేరణ ఇస్తున్నది.

ఈ లక్ష్యం కొద్దిరోజుల్లో లేక కొద్దిసంవత్సరాల్లో సాక్షాత్కరింప బడదనేది స్పష్టమే. దీనికి అంకితమై ఆర్భాటం లేకుండా నిర్విరామ కృషిచేసే వందలు, వేలు కార్యకర్తలు కావాలి. అందుకుగాను వ్యతిరేకతలకు వ్యామోహాలకు చలించని గుండెనిబ్బరం కావాలి. అట్టి ప్రేరణగల జీవితాలను రూపొందించేందుకే సంఘం దైనందిన సంస్కారాలపట్ల శ్రద్ధ చూపుతున్నది. జీవితాన్నంతనూ ఈ కార్యానికి అంకితంచేసి ముందు కురికేందుకు అవసరమైన శక్తిని, యోగ్యతను వ్యక్తిలో సృష్టించే సద్గుణా లన్నిటిని అలవర్చేందుకు ప్రతిదినము ప్రయత్నిస్తున్నది.

## అడ్డు త్రోవలపై మోజు

ఒక కార్యానికి అంకితమై ఈవిధంగా స్థిరంగా, ప్రశాంతంగా, జీవిత పర్యంతము శ్రద్ధతో కృషిచేయటం నేటి ప్రపంచములో విచిత్రం అనిపించ

వచ్చు. అయితే ఒకనూతనత్వం, ఒకమౌలికత దానిలో ఇమిడియున్నాయి. అందుచేత మన ఈ కార్యపద్ధతిని అర్థంచేసుకోవటానికి, ఒంటపట్టించు కోవటానికి సామాన్యప్రజలకు కొంతసమయం సహజంగా పడుతుంది. ఉదాహరణకు, మన కార్యపద్ధతిప్రకారం ఒక నిర్ణీతసమయంలో, నిర్ణీత స్థలంలో ఏండ్లతరబడి జీవితాంతం వ్యక్తులు సమావేశం కావలసి ఉంటుం దనేసరికి చాలామంది ఆశ్చర్యచకితులౌతారు. ఒకసారి ఒక యువకుడు ఏకాగ్రత సాధించేందుకు తనకొకమార్గం చెప్పుమని నన్నడిగినాడు. అతని నిష్ఠ ఎంతటిదో తెలిసికొందామని, ఒక సాధనను నిత్యం అభ్యసింపుమని చెప్పాను. వెంటనే అతడు "దీనిని నే నెంతకాలం అభ్యసించాలి" అని అడిగినాడు. జీవితాంతం చెయ్యి అన్నాను. దానికి ఆశ్చర్యపడి 'జీవి తాంతమూనా? అదెట్లా సాధ్యమవుతుంది?' అన్నాడు. 'అయితే ఈ నియమానికైనా అంటిపెట్టుకుని జీవితాంతం వుండగలవా?' అని హాస్యంగా నేను అన్నాను.

ఈనాటి మన సత్త్వము అట్టిది. సత్వరఫలితాలు, అడ్డుత్రోవలు కావాలి. నిజాయితీతో కష్టపడి పనిచేయడంపోయి, మంచిచెడ్డలతో పని లేకుండా సత్వరఫలితాలనిచ్చే మార్గాలు వచ్చినాయి. సంపాదనాపరుడు ధన వంతుడయ్యేందుకు అడ్డుత్రోవలగురించి ఆలోచిస్తున్నాడు. తెల్లవారేసరికి ఆవిధంగా అయ్యే అవకాశమేఉంటే దాని నిమిత్తమై ఎంతటి నీచస్థాయికైనా దిగజారడానికి అతడు సిద్ధంగా ఉన్నాడు. దొంగవ్యాపారం, సట్టావ్యాపారం చేస్తాడు; జూదం ఆడుతాడు; గ్రహబలం కలిసివస్తుందేమో చెప్పుమని జ్యోతిష్కుల వెంటపడతాడు. ఇక దొంగతనం, దోపిడీలు అడ్డుత్రోవల్లో రాచబాటలుగదా!

భగవత్ సాక్షాత్కారంలోగూడ అడ్డుత్రోవలకోసం వెదకడం ఆరం భించినారు ప్రజలు. జీవితాంతము తపస్సుచేస్తూ భగవంతునిపై మనస్సును ఏకాగ్రంగా లగ్నంచేసే కష్టం ఎవరుపడుతారు? తనకు భగవంతునికి

మధ్యవర్తిగా ఉండే ఒక సాధువునో, సన్యాసినో పట్టుకునేందుకు ప్రయత్నిస్తారు. అట్టి మధ్యవర్తులు తమపాపాలు వారినెత్తిన వేసికొని, వారి పుణ్యాన్ని తమకిస్తారని, ఆవిధంగా తాము పవిత్రులు అయిపోగానే ఇక భగవంతునితో ప్రత్యక్షసంబంధమేనని వీరి ఊహ. అడ్డుత్రోవలమోజుతో కలుషితంకాని జీవితరంగం ఏదీలేదు.

## ఆత్మహత్యా సదృశ ప్రలోభాలు

నలుదిక్కుల అటువంటి వాతావరణం వ్యాపించిఉన్న కారణంచేత ప్రజలు సంఘకార్యంలోకూడ అటువంటి అడ్డుత్రోవలేమైనా ఉన్నాయేమోనని ఆలోచిస్తుంటారు. "ఈ విధంగా ఎంతకాలం పనిచేస్తారు? మీరు కాంక్షించే సంపూర్ణ సమాజ పరివర్తనాన్ని ఎప్పటికి సాధించగలరు? ఇంకా ఎన్ని సంవత్సరాలు ఇదే మార్గాన్ననుసరించి కొట్టుమిట్టాడుతూ ఉంటారు?" అని అడుగుతుంటారు. అటుపైన వారిదృష్టిని నలుగడల ప్రసరింపజేస్తారు. సువిశాలమైన జాతీయజీవనాన్నంతనూ ఆవరించగల విస్తృతాధికారాలు గల, శక్తిమంతమైన ప్రభుత్వయంత్రాంగం చూస్తారు. ఇట్టి పరిపాలనా యంత్రాంగం, ఆర్థికసంపత్తి, అధికారాలు తమకున్నట్లయితే విద్యాబోధన మొదలయినవాటిద్వారా తాము కొద్దికాలంలోనే మొత్తం దేశపరిస్థితిని మార్చివేసి, ముందుతరాలను తామాశించిన విధంగా రూపొందింపగలమని కలలుగంటారు. స్వల్పత్యాగంతో సత్వరఫలితం ఇచ్చే అడ్డుత్రోవలు అంటే వారు మోజుపడతారు. ఈ ఆలోచనాపద్ధతి పైకి చాలాఆకర్షణీయంగా ఉంటుంది. దానికితోడు ఆర్థిక, రాజకీయ అంశాలకు మన ప్రభుత్వం ఇస్తున్న ప్రాధాన్యం, పంచవర్ష ప్రణాళికలగూర్చి వారు చేసే ఎడతెగని ప్రచారం, దేశంలోని యువకశక్తిని ఆకట్టుకోవటానికి వారారంభించేక్రొత్త క్రొత్త పథకాలుకూడా-రాజకీయ అధికారమే మన సమస్యలన్నిటికీ సర్వ రోగనివారిణి అని భావించే ఈనాటి ప్రజల మనస్థితికి దోహదం చేస్తున్నాయి.

కాని మనంమాత్రం ఇటువంటి పైపై ఆలోచనలతో మోసపోరాదు. దురదృష్టవశాత్తు పైపైన ఆలోచించటమే ఈనాడు పరిపాటి. కాని, ప్రతి విషయాన్ని నిశితంగా ఆలోచించిమాత్రమే గ్రహించాలని మన ప్రజల కుద్బోధించాలి. ఒకసారి నాగపూర్‌లో అఖిలభారత విద్యావిషయసమ్మేళనం ఒకటి జరిగింది. దానిలో పాల్గొనేందుకు వచ్చిన ప్రముఖవ్యక్తుల్లో నాకు తెలిసినవారు కొందరున్నారు. వారాసభలో జరిగిన విషయాలు, నిర్ణయించిన నియమాలు, పాఠ్యప్రణాళికలను గురించిన వివరాలు నాకు చెప్పినారు. అంతా విన్నతరువాత, విద్యబోధించాలని మీరు ప్రయత్నిస్తున్న వ్యక్తియొక్క స్వభావం, అసలు అవసరాలు ఏమిటో చెప్పగలరా? అని వారిని చిన్నప్రశ్న అడిగినాను. ఈప్రశ్న తమకు తట్టలేదని అందులో ఒకరు వెంటనే ఒప్పుకొన్నారు. మనదేశంలో పనులు జరుగుతున్న తీరు ఇది. గుడ్డివాణ్ణి మరొక గుడ్డివాడు నడిపించే కథలాగున్నది ఇదంతా. సమస్యయొక్క మూలకారణం గ్రహించే ఉద్దేశ్యంగాని, ప్రయత్నంగాని లేదు.

ఇటువంటి పైపై ఆలోచనలు, రాజ్యాధికారంలాంటి అడ్డుత్రోవలు ఒకదేశంలో శాశ్వతమైన జాతీయజీవనాన్ని సృష్టించడానికి నిజంగా ఉపయోగపడతాయా? ప్రపంచ చరిత్ర పుటలు తెరచి ఒకసారి పరిశీలిద్దాం. పూర్తిగా రాజకీయాధికారంపై ఆధారపడిన సామ్రాజ్యాలు గతంలో అనేకం ఉన్నాయి. ఉదాహరణకు: సమృద్ధి, సంరక్షణలకు పర్షియాదేశం తన చక్రవర్తిమీదనే ఆధారపడి ఉండేది. మతంతోసహా ప్రజాజీవితంలోని అన్ని అంశాలూ అతని అధీనంలోనే ఉండేవి. అతడే సర్వోచ్చాధికారి. కొంతకాలంపాటు అక్కడి ప్రజలు నిశ్చింతగా, సుఖంగా జీవించినారు. కాని అరబ్బుల దండయాత్రయొక్క ప్రథమాఘాతానికే వారి జాతీయ జీవనప్రాసాదంయావత్తూ కుప్పకూలిపోయింది. ఇట్టి దురవస్థే రోమన్ గ్రీకు సామ్రాజ్యాలకుకూడా పట్టింది. ఈ సామ్రాజ్యాలలో సంపదగాని చక్కని పరిపాలనావ్యవస్థగాని, సైనికశక్తిగాని లేవనికాదు దానిఅర్థము. ఐతే అవన్నీకూడా రాజాధికారమనే ఇసుకపునాదులపై ఆధారపడి

ఉండేవి. అట్టి రాజకీయాధికారము, ఒక్క క్షణంలో భగ్నమయ్యేసరికి దానితోపాటు వారి నాగరికత,మతం, జాతీయత పూర్తిగా నేలకూలిపోయినవి. విశ్వరంగస్థలాన అవి ఎన్నడూ మరి కనిపించలేదు. ఈ విధంగా ఒక్కొక్క దేశమే జాతీయాత్మలను ఇస్లాముకు అంకితంచేసి, ముస్లిందేశములుగా మారిపోయినవి.

## మనజాతి అమరత్వంలోని విశేషం

అయితే మనదేశగాథ మాత్రం దీనికి పూర్తిగా విభిన్నంగా రూపొందింది. ముష్కరజాతులు జరిపిన భయంకర దండయాత్రలు ఎన్నింటినో మనజాతి ఎదుర్కొన్నది; ఆ విరోధశక్తుల కబంధహస్తాల్లో కొంతకాలం – అప్పుడప్పుడు శతాబ్దాలతరబడికూడా – చిక్కుకొంది. రావణాసురునికాలం నుండి అనేక పర్యాయాలు అధర్మశక్తులువిజృంభించి ఈభూమిని శాసించాయి. ఔరంగజేబు పాలించిన ఆ చీకటిగడియల్లో సర్వనాశనం నుంచి ఈ హిందూజాతిని రక్షించటానికి సర్వశక్తిమంతుడగు ఆ పరమేశ్వరుని అవతారానికే సాధ్యమని, సమర్థరామదాసస్వామివంటి వీరసాధువుకూడ సంతాపంచెందినాడు. మన జాతీయజీవనాన్ని కూలద్రోయటానికి జిత్తులమారి ఆంగ్లేయుడుకూడ ప్రయత్నించినాడు. ఈనాడుకూడ అధర్మశక్తులు స్వైరవిహారం చేస్తున్నాయి. అయినా మనజాతి అనేకసార్లు ఇట్టి తీవ్ర ప్రమాదాలన్నిటిని తట్టుకొని నిలబడింది.చితాభస్మంలోనుండి కూడా, మన జాతి, చైతన్యవంతమై తిరిగిలేచింది; దుష్టశక్తుల ధృతరాష్ట్రకౌగిలినుంచి తప్పించుకొని ధర్మరాజ్యాన్ని స్థాపించింది. జాతీయాదర్శభావనతో ప్రేరితమైనూతనోత్సాహంతో అదే ఉజ్జ్వలపరంపరతో ఈనాటికీఅఖండంగా కొనసాగుతూ ఉంది. ఇట్టి అద్భుతం ఎట్లా సంభవించింది ? మనజాతి యొక్క ఈ అమరత్వ రహస్యం ఏమిటి ? అతిభయంకర విషప్రయోగాలకు తట్టుకొని మనజాతి మృత్యువు నెదిర్చి నిలువగల్గటంలోని రహస్యం ఏమిటి ?

మనజాతి మనుగడకు రాజకీయాధికారం ఆధారం కాదనేది సుస్పష్టం. లేకపోతే ఇతరజాతులవలెనే పురావస్తుప్రదర్శనశాలలో మాత్రమే మిగిలే గతి మనకూ పట్టేది. రాజకీయపాలకులను మనజాతి ఎన్నడూ ఆదర్శంగా స్వీకరించలేదు. మన జాతీయజీవనానికి వారెన్నడూ ఆధారం కాలేదు. కాని సర్వసంగపరిత్యాగులై తమ సర్వస్వాన్ని దేశకల్యాణానికి అంకితంచేసి యావత్తుసమాజాన్ని సన్మార్గంలో నడిపించిన సాధువులు, మహాత్ములే మనజాతికి ఆధారం, ఆదర్శం. ధర్మశక్తికి వారు ప్రతినిధులు. ఆ సర్వోచ్చ ధర్మాధికారానికి నమ్మినబంటు మాత్రమే రాజు. దురాక్రమణ శక్తులకు తట్టుకోలేక రాజశక్తి మట్టిగొట్టుకపోయినా, ధర్మశక్తి మాత్రం సమాజాన్ని విచ్ఛిన్నం కాకుండా నిలిపిఉంచింది.

రావణుడు మేధావి. మన సమాజ సమైక్య కీలకం అతనికి తెలుసు. మన జీవనకేంద్రం ఋషివాటికల్లో ఉన్నది. కనుకనే ఆ అరణ్యాలలో జరిగే యజ్ఞయాగాదులమీద విరుచుకపడ్డాడు. కాని ఆ వీరమహర్షులు రావణుని దురాక్రమణలకు ఎదురు నిలబడి సమాజాన్ని జాగృతంచేసి సమైక్యపరచే తమ కృషికి అంటిపెట్టుకునే ఉన్నారు. సమాజమంతా–చివరకు దేవతలుకూడా–రావణుని పాదాలక్రింద నలిగి మూలిగినారు. అట్టిస్థితిలో ఈ సమాజం శ్రీరామచంద్రుని రూపంలో జాగృతమయింది. ఆ జగద్రక్షకుడయిన శ్రీరాముని తీర్చిదిద్దినది మహర్షులైన వశిష్ఠ విశ్వామిత్రఅగస్త్యాదులు. అంత మాత్రమేగాదు; సమాజమంతటిలోను ప్రగాఢ జాతీయచైతన్యాన్ని యజ్ఞ యాగాదుల్లో జరిగే ప్రవచనాలు, శాస్త్రార్థాలద్వారా జాజ్వల్యమానంగా ఉంచినారు. ఈ గోచిపాతరాయుళ్ళలో సమాజసంక్షేమంపట్ల ఎంతో నిష్ఠ, జాగరూకత ఉండేవి. చివరకు రావణుని సంహరించిన భయంకరాస్త్రంకూడ శ్రీరామునికి అగస్త్యుడే ఇచ్చినాడు. ముల్లోకాలను ముంచెత్తుతూ విరుచకపడే అధర్మప్రవాహంయొక్క తాలోత్తుంగతరంగాలను ఆనాటి ఋషులు అవిరళకృషిచేత, ప్రేరణచేతనే చివరకు అదుపులో పెట్టగలిగినారు.

అధర్మశక్తుల అభేద్యదుర్గమైన లంకానగరంయొక్క చితాభస్మంనుండి తొల్లిటికన్న తేజోవంతమైన సమాజము ఆవిర్భవించింది.

## పరంపర కొనసాగుతూనే ఉంది

బౌద్ధులకాలంకూడ మన కిదే సందేశాన్నిస్తుంది. బుద్ధుని తరువాత అతని అనుచరులు భ్రష్టులై, పరంపరాగత జాతీయసంప్రదాయాలను సమూలంగా పెకలించివేయ నారంభించినారు; మన శ్రేష్ఠమైన సంస్కృతీ సద్గుణాలను సర్వనాశనం చేయాలనుకొన్నారు; గతంలో పెనవేసుకొని ఉన్న సంబంధాలను త్రెంచివేసినారు; ధర్మం దాదాపు అంతరించింది; సమాజవ్యవస్థ పూర్తిగా ఛిన్నాభిన్నం కాసాగింది.

బౌద్ధ దురభిమానులు, బౌద్ధమతపుముసుగు ధరించిన విదేశీ దురాక్రమణదారులను ఆహ్వానించి వారికి సహాయం చేసినారు. జాతిపట్ల పరంపరపట్ల ఉండవలసిన శ్రద్ధాభక్తులు అంతగా దిగజారిపోయినవి. అంటే మాతృదేశంపట్ల, ధర్మంపట్ల ఈబౌద్ధసంప్రదాయం ద్రోహంచేసిందన్నమాట. అట్టి విషగడియల్లో మన ధర్మాన్ని, సమాజాన్ని కాపాడేందుకు, ఉద్ధరించేందుకు ముందుకు వచ్చిందెవరు ?

అనాదిసిద్ధమైన ఋషి, ముని పరంపరయే శక్తితో, తేజస్సుతో శ్రీ శంకరాచార్యుని రూపంలో సాక్షాత్కరించింది. ఆయన ఒక సన్యాసియే గాక అద్వితీయతత్త్వవేత్త; సాటిలేని సంఘటనకర్త. ఆయనమాహాత్మ్యము భౌతికసంపత్తిలోగాని, పదవిలోగానిలేదు. ఒకకొన నుంచి మరొకకొన దాక ఈ దేశమంతా ఆయన అర్ధనగ్నంగా కాలినడకతో కలయదిరిగినారు. ఆయనకు విషంపెట్టి చంపివేయాలనే ప్రయత్నంగూడ జరిగింది. ఇటువంటి అనేక ప్రమాదాలను ఆయన ఎదుర్కొనవలసి వచ్చింది. అయినా నిర్భయంగా ఒకచోటినుంచి మరియొక చోటికి విశ్రాంతిగాని, సుఖంగాని ఎరుగక ప్రయాణంచేస్తూ మన ప్రాచీనసంస్కృతీజ్యోతిని మరల ఉద్దీపింపచేసినారు.

ఆయన శిష్యులు నిష్ఠావంతులైన సన్యాసుల బృందం. చెమటా, నెత్తురూ ధారపోసి, ఉజ్జ్వలమైన భవిష్యత్తుకొరకు గతాన్ని వర్తమానంతో అతి దృఢంగా జోడించినారు. వారు మేల్కొల్పిన జాతీయచైతన్యం, నిస్స్వార్థ సేవాభావం మరొకసారి సమాజం తనకాళ్ళపై తాను నిలబడేటట్లు చేసింది; విద్రోహశక్తులను పెకలించివేయగలిగింది. భౌద్ధంయొక్క ప్రత్యేక అస్తిత్వం తుడిచిపెట్టుకుపోయింది. కాని బుద్ధుడుమాత్రం ఒక అవతారంగా నిలిచినాడు. మనం శివుని పూజిస్తాము. కాని ఆయన చుట్టూఉండే భూత గణానికి స్వాగతం పలుకంగదా!



ముస్లిముల ఆధిపత్యం కొనసాగినకాలంలోగూడ అదే ప్రాచీన సంప్రదాయాన్ని కొనసాగించటానికి అనేకులు మహాత్ములు, సన్యాసులు ఉద్భవించినారు. చైతన్యుడు, తులసీదాసు, సూరదాసు, జ్ఞానేశ్వరుడు రామానందుడు, తుకారామ్, రామానుజుడు, మధ్వాచార్యులు, గురునానక్ మొదలైన మహాపురుషులు ఎందరో జన్మించి ఈదేశాన్ని ఆమూలాగ్రంగా ధార్మికశ్రద్ధతో ముంచెత్తినారు. ఆ ధర్మనిష్ఠను సమర్థ రామదాసస్వామి జాతీయచైతన్యస్రోతస్సుగా రూపొందించినాడు. శ్రీరామునియొక్క శ్రీకృష్ణునియొక్క కథలను వారు ప్రవచనంచేసినారు. ఆ అవతారమూర్తుల వీరత్వాన్ని వర్ణించే దివ్యగాథలు గానంచేసినారు. తాము ఆరాధించే దేవతల పట్ల ప్రజల్లో విశ్వాసాన్ని మేల్కొలిపి, ప్రజల నైతికబలం ప్రభుత్వ దమనచర్యలవల్ల చెదిరిపోకుండా కాపాడారు. సంవత్సరాలతరబడి కొన సాగిన ఆధ్యాత్మిక, సాంస్కృతిక జాగృతియొక్క ప్రత్యక్ష పరిణామమే ఛత్రపతిశివాజీ నేతృత్వంలో సాధించిన మహత్తర జాతీయ పునరుజ్జీవన కార్యం. అంతకుముందుగూడ విద్యారణ్యస్వామి కలిగించిన ఆధ్యాత్మిక జాతీయ జాగృతినుండే ఉజ్జ్వలమైన విజయనగర సామ్రాజ్యశక్తి ఉత్పన్న మయింది. ధర్మప్రబోధకుడైన గురునానక్, అతని తరువాతివారు హిందూ విప్లవానికి పునాదివేసినారు. ఆ విప్లవం గురుగోవింద్, బందాబైరాగుల నాయకత్వంలో మహాయోధులైన సిక్కుల్లో వ్యక్తమయింది. ఆవిధంగా జాతి

సుదృఢంకావడానికి ధర్మమే మరొకసారి కేంద్రమయింది. దేశవిద్రోహ శక్తులు నిర్మూలింపబడ్డాయి. జాతీయ విజయధ్వజం అటక్‌నుండి కటక్‌వరకు కాశ్మీర్‌నుండి కన్యాకుమారివరకు సగర్వంగా ఎగిరింది.

ఆంగ్లపరిపాలన నెదిరించిన నాటి జాతీయపునరుత్థానప్రయత్నంలో కూడ అదే ఆధ్యాత్మికసంపత్తి కన్పిస్తుంది. ఆధ్యాత్మికతా సూర్యుడు పరిపూర్ణ తేజస్సుతో దేశమంతా తేజరిల్లినాడు. వంగభూమిలో రామకృష్ణ వివేకానందులు, పంజాబులో దయానంద రామతీర్థులు, దక్షిణాదిని రమణ మహర్షి అరవిందయోగులు-వీరంతా ప్రజలమనస్సుల్లో ఆధ్యాత్మికసంపత్తి గల జాతీయతను స్థాపించినారు.

చరిత్ర మనకు చూపిన తిరుగులేని సాక్ష్యమిది. దానినుంచి గుణపాఠం గ్రహించాలి. శీలసంపదగలిగి, సాంస్కృతిక ఆధ్యాత్మిక ఆదర్శాలపట్ల మొక్కవోని శ్రద్ధగల సంఘటితజీవనాన్ని, వేలాది సంవత్సరాలు అచంచలంగా నిలిచేటట్లు నిర్మాణంచేయాలి. మన ప్రాచీన ఆధ్యాత్మిక పరంపరచే ఉత్తేజితమైన సంఘటిత సమాజశక్తియే యుగయుగాల మన అమరత్వానికి కీలకం. అదే మన రాష్ట్రధర్మం. దాన్ని పునరుద్ధరించి సంపూర్ణ శక్తిని సమకూర్చడానికి కంకణం కట్టుకొన్నాము.

ఈనాడు మన ఆలోచనలను క్రమ్మివేస్తున్న ఒక పొరపాటు ఊహను తొలగించుకోవటం అవసరం. ధర్మం, ఆధ్యాత్మికత అనగానే 'రాజకీయాల్లోకి మతాన్ని ఎందుకు తెస్తారు' అని అంటారు. 'ధర్మం' అంటే సమంగా అర్థంకాక, అదీ పాశ్చాత్యుల 'మతం' ఒకటే అని తికమకపడ్డంవల్లనే ఇట్టి ప్రశ్న ఉదయిస్తుంది. మతం అంటే వారికున్న మూఢభావనచేతనూ, రాజ్యాధికారం మతాధిపతుల ఆధీనంలో ఉండడంచేతనూ పాశ్చాత్యదేశాలు అనేక శతాబ్దాలపాటు బాధలుపడ్డాయి. ధర్మంపట్ల మనకున్నభావానికీ, వారిమతానికీ మధ్య వెలుగుకు చీకటికి ఉన్నంత వ్యత్యాసం

ఉన్నది. ధర్మం, ఆధ్యాత్మికత–ఒక మూఢవిశ్వాసం కాదు. అది సమగ్రజీవన దృక్పథం. ఆర్థిక, రాజకీయ రంగాల మాదిరిగా జాతీయజీవనంలో కేవలం ఒక అంశంమాత్రం కాదది. ఆధ్యాత్మికత అంటే మానవజీవితానికి పరిపూర్ణతను సమకూర్చే విధంగా, సమాజజీవితంలోని అన్ని రంగాలనూ తీర్చిదిద్ది, వికసింపచేసి, సమన్వయాన్ని సాధించగల్గిన సమగ్రజీవన దృక్పథం. అదే మనజాతితరువుకు జీవరసం; అదే మన జాతీయ వ్యక్తిత్వానికి ప్రాణం.

## అధికారం భ్రష్టులను చేస్తుంది

ఇవన్నీ అర్థంచేసుకున్నతర్వాతగూడ, ధర్మప్రచారానికి రాజ్యాధికారం తప్పనిసరియని భావించేవారుకొందరున్నారు. గతంలో ఇస్లాం క్రైస్తవాలు రాజకీయఅధికారంచేతనే దేశవిదేశాలకు వ్యాప్తిచెందాయనివారంటారు. కానీ నిశితంగాపరిశీలిస్తే, సమస్యలను రాజకీయాధికారం ఎప్పుడూపరిష్కరించలేదని గమనిస్తాము. ఉదాహరణకు; ప్రభుత్వమే కాదు, ప్రజల్లో కూడా అనేకులు ఒంటరివాడైన ఏసుక్రీస్తును వ్యతిరేకించినారు. అతణ్ణి శిలువవేసిన తర్వాత, శిష్యులకు మార్గంచూపేవా డొక్కడైనా లేకపోయినాడు. కాని ఆదర్శం వారి హృదయాలను ఉద్రూతలూగించింది. క్రీస్తు భావనచే ప్రభావితులై, నూతనానుభూతిపట్లగల విశ్వాసంతో, ఉత్సాహంతో వారు ప్రపంచం నలుగడలా అల్లుకుపోయినారు. ప్రపంచం వారి పాదాలవద్ద మోకరిల్లింది. అప్పట్లో వారివద్ద రాజకీయాధికారం లేదు. అయితే కాలక్రమంలో వారి వారసులు రాజకీయాధికారవ్యామోహానికి గురియై పతనం చెందినారు. తత్ఫలితంగా, క్రైస్తవదేశాలలో ప్రజాజీవితాన్ని తీర్చిదిద్దేందుకు ఈనాడు దానికి శక్తి లేదు సరిగదా, సామ్రాజ్యవాదశక్తుల చేతుల్లో క్రైస్తవం కీలుబొమ్మగా మారింది. అధికారదాహంగల అనుయాయులవలన ఇస్లాంలో వచ్చిన వికృతి సుస్పష్టమైనదే. దాన్ని ఇస్లాంవ్యాప్తి అనటం పొరపాటు. మానవజీవితంలో అది ఆధ్యాత్మికఆదర్శాలను ఉద్బుద్ధం చేయడం కానేకాదు.

అంతదూరమెందుకు ? నేటి కాంగ్రెస్ నాయకులు ఒకప్పుడు మహా త్యాగాలు చేసినవారే, గొప్పదేశభక్తులే. ఉజ్జ్వలమైన వారి జీవితాలను ఉదాహరణగా తీసుకొని ప్రజలుకూడా స్ఫూర్తిని పొందినారు. కాని, నేడు వారి అవస్థ ఎట్టిది ? అవినీతి, ఆశ్రితపక్షపాతం, అధికారవ్యామోహం స్వైరవిహారం చేస్తున్నాయి. అందుచేతనే స్వరాజ్యం వచ్చినవెంటనే కాంగ్రెస్ సంస్థను రద్దుచేసికోవడం మంచిది; అధమపక్షం అధికారానికి దూరంగానైనా ఉండాలని గాంధీజీ సలహా ఇచ్చినారు. కాని అధికారం రుచిమరిగిన వారి అనుయాయులకు, ఆ హితప్రదమైన సలహా కటువుగా తోచింది. ఈ ధోరణియొక్క విషఫలితాలను కాంగ్రెసేకాదు, దేశమంతా కూడా అనుభవిస్తోంది.

కేవలం రాజ్యాధికారంద్వారానే సమాజహితాన్ని సాధించాలి అని రష్యా చేసిన తాజాప్రయోగంకూడా దీన్నే నిరూపించింది. 'అధికారం భ్రష్టులను చేస్తుంది. సంపూర్ణాధికారం సంపూర్ణంగా భ్రష్టులను చేస్తుంది' అన్నది ఆదేశంలో అక్షరాలా నిజమైంది. ఒకసారి అధికారం చేజిక్కితే ఏమైనాసరే దాన్ని నిలబెట్టుకోవాలనే కోరిక, అధికారంచేసేవారిని పట్టి పీడిస్తుంది. అటువంటప్పుడు 'నేను యజమానిని – మీరు సేవకులు' అనే భావన ప్రజలపట్ల కలిగితీరుతుంది.

రష్యాదేశంలోసరిగ్గా అదేజరిగింది. విప్లవోత్సాహం, సంపదధికారాల ఫలస్వరూపమయిన మదోన్మత్తత – ఇవన్నీ కలసి, నిర్దాక్షిణ్యమైన నిరంకుశత్వాన్ని అచ్చట సృష్టించినవి. అది జాతిమొత్తాన్ని బానిసలుగా చేసి మానవత్వంనుండి దూరం చేసింది.

ఈ పద్ధతిలో చూచినా అదే నిర్ణయానికి రాగలము. పెడత్రోవపట్టే రాజ్యాధికారాన్ని అదుపులోపెట్టే శక్తికలిగి అధికారవ్యామోహాలకు అతీతంగా ఉంటూ, జాగరూకంగాఉండే సంఘటన నిర్మాణమే మన సమాజం సుఖంగా జీవించడానికి కావలసిన శాశ్వతమైన సుస్థువ్యవస్థను నిర్మించ

గలదు. మనం చేస్తోంది ఆ పనే. రాజకీయాధికారం బాహ్యసాధనం మాత్రమే. అది మనిషియొక్క అంతరంగాన్ని ఒక ఆదర్శానికనుకూలంగా మలచనేరదు. కేవలం ప్రభుత్వశాసనాలే మానవులను గుణవంతులుగా చేయలేవు. ఒక త్రాగుబోతు మద్యపాననిషేధచట్టం తెచ్చినాడనుకొందాం. అప్పుడు అతడు త్రాగుడు మానకపోగా, తన చాతుర్యం అంతా ప్రదర్శించి చట్టంనుండి తప్పించుకొనడానికి ప్రయత్నిస్తాడు.

ఈవిధంగాచూస్తే సాంఘికజీవనవిధానాల విలువలను పునరుద్దీపింపచేసి సమాజాన్ని సమైక్యం చేయడానికి కేవలరాజకీయాధికారం అసమర్థమని స్పష్టం అవుతుంది. ఇంతేగాదు, దాన్ని విచ్చలవిడిగా వదలిపెట్టితే, జాతియొక్క ఉన్నతప్రమాణాలనుగూడా భ్రష్టంచేస్తుంది. పరంపరాగతమైన సర్వోత్కృష్ట సద్గుణాలన్నిటినీ రక్షించుకొంటూ, ఒక జాతి శాశ్వతంగా మనగలగడానికి మూలాధారం రాజ్యాధికారంమాత్రం కాదు; మరొకటేదో ఉన్నది. అందుకే ప్రభుత్వంయొక్క విధులను ఇదమిత్థంగా నిర్ణయించాలి; దాని యొక్క అధికారాలను కొన్ని అవధులకు పరిమితం చేయాలి.

## అధికారంపై అంకుశం

సామాజికజీవితంలోని ఇట్టి విభిన్నవిషయాలను నిశితంగాపరిశీలించిన మన ప్రాచీన ధర్మశాస్త్రకర్తలు రాజకీయ అధికారాన్ని పరిమితంచేశారు; అది విదేశీదండయాత్రలనుండి ప్రజలను సంరక్షించడానికి, అసూయ, ద్వేషము, దురాక్రమణ మొదలైన వాటివల్ల కలిగే ఆంతరికసంఘర్షణలను పరిష్కరించటానికి మాత్రమే పరిమితం. ఈ పరిమితిని ఉల్లంఘించే రాజ్యాధికారం ప్రజాహితకారి కానేరదని వారు చెప్పినారు. వాస్తవానికి అది వారికి శత్రు వౌతుంది. ఎందుకంటే, అటువంటి రాజ్యం వ్యక్తుల్లోని సహజసిద్ధమైన శక్తిసామర్థ్యాల పెరుగుదలకు దోహదం చేయదు. అంతేగాదు; అధికారంలోనివారిని సంతృప్తిపరిచే వాంఛతో ప్రజలు తమ ఉన్నత జీవితాదర్శాలకు తిలాంజలి ఇచ్చి పతితులుకూడా అవుతారు.

సంక్షేమ రాజ్యమని చెప్పుకుంటూ మన ప్రభుత్వం శక్తిని అధికారాన్ని తనచేతుల్లో కేంద్రీకరించుకొని విద్యా, వైద్య, సదుపాయాలు సామాజిక జీవితం, ఉత్పత్తి, పంపిణీ మొదలైన జీవనరంగాలన్నీ తన ఛత్రచ్ఛాయల్లో ఉంచుకోవాలని ప్రయత్నిస్తూ ఉన్నది. ఆ విధంగా ప్రభుత్వమే మానవుని కార్యకలాపాలన్నీ గుత్తకొంటే, ఇంక వ్యక్తి ఏపనీ చేయటానికి ప్రేరణలేకుండా బానిసమాత్రమే అయిపోతాడు. అధికారం చెలాయించేవాణ్ణి అది నిరంకుశుడుగాను, అత్యాచారిగాను మార్చగలదని విదితమే. అందుచేతనే ప్రభుత్వంలో ఉన్నవారు గట్టి ప్రత్యర్థులను అణగద్రొక్కటానికి యత్నిస్తుంటారు; ఆవిధంగా ప్రజల యోగక్షేమాలను రక్షించలేకపోతుంటారు. కనుకనే అధికారంలో ఉన్నవారిపై గట్టి ఆంక్షలు అవసరమని మన ధర్మశాస్త్రకర్తలు భావించినారు. పరిపాలనాధికారం ఒక సాధనం మాత్రమే; అది సాధ్యంకాకూడదని వారు శాసించినారు. ధర్మాన్ని- ఉత్తమ జీవితాని కవసరమైన శ్రేష్ఠనియమాలను - ప్రతిష్ఠించటం వరకు పరిమితమైతేనే, రాజ్యం సమాజానికి మేలు చేయగలుగుతుంది. ఆ రాజ్యమే సాధ్యంగా మారితే ప్రజలకు ప్రయోజనకారి కాజాలదు. కనుకనే ధర్మాధికారం అధీనంలో - అంటే త్యాగధనులై, ఆశ్రమాల్లో నివసిస్తూ ఉండే ధర్మ స్వరూపులైన ఋషుల చెప్పుచేతల్లో - రాజును ఉంచినారు మన ధర్మ శాస్త్రకర్తలు.

రాజ్యాధికారాన్నీ, సంపదుత్పాదనను దూరదూరంగా ఉంచడానికి మనవారు బహుధా ప్రయత్నించారు. అది మరొక విశిష్టత. ధనంకూడ శక్తి యొక్క ఒకరూపం. రాజకీయ, ఆర్థిక శక్తుల కలయికవల్ల మదించిన రాజ్యం ఎంతటి విధ్వంసాన్ని సృష్టిస్తుందో అర్థం చేసికోవటానికి పెద్దతెలివితేటలు అక్కరలేదు. ఒకే వ్యక్తి వద్దగాని, ఒకే వర్గం చేతుల్లోగాని ఈరెండుశక్తులు కేంద్రితమయితే దానివల్ల ప్రజలు పతితులయి, బానిసలన్నా అవుతారు; లేదా బాధలను భరించలేక విప్లవాన్నైనా లేవదీస్తారు. ఏది ఏమైనప్పటికీ అట్టి సమాజంలో స్థిరత్వం, ప్రగతి, సమృద్ధి నశించితీరుతాయి.

## ఐరోపానేర్పే గుణపాఠం

ఐరోపా చరిత్రవల్ల ఎన్నో విషయాలు తెలుస్తాయి. ఫ్రెంచి విప్లవానికి ముందు, ఐరోపా దేశాల్లో ఆర్థిక, రాజకీయ శక్తులు పూర్తిగా రాజు యొక్క ఆధీనంలో ఉండేవి. నిరంకుశరాజరికంక్రింద ప్రజలు నలిగిపోయి స్వాతంత్ర్యం, స్వప్రేరణ, సుఖసంతోషాలు కోల్పోయినారు. అట్టి నిరంకుశత్వానికి వ్యతిరేకంగా 'స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం' కావాలని నినదిస్తూ ఫ్రెంచివిప్లవం విరుచుకొని పడింది. దాదాపు అదే సమయానికి పారిశ్రామిక విప్లవంగూడా ఆరంభమయింది. 'అందరికీ సమానావకాశాలు' అనే నినాదం మాటున ఎక్కువ తెలివితేటలు, సామర్థ్యం ధనమూ గల వ్యక్తులు పరిశ్రమలపై గుత్తాధిపత్యం సంపాదించి, అంతులేని సంపదలను సమకూర్చుకొని, ఆ బలంతో రాజకీయాధికారాన్ని గూడా స్వాధీనం చేసుకున్నారు. పాతవారిస్థానంలో కొత్త నిరంకుశప్రభువులుగా వీరు తయారైనారు. రాజకీయ, ఆర్థిక శక్తుల కేంద్రీకరణ నిరంకుశత్వానికి మరొకసారి దారితీసింది. ఈసారి ప్రజాస్వామ్యం అనే సరికొత్త ముచ్చటైన ముసుగులో సామాన్యవ్యక్తి వర్ణనాతీతమైన దుఃఖము, బానిసత్వములకు గురియైనాడు. బెర్నార్డుషా అన్నట్లు, ప్రజాహితుడైన నిరంకుశప్రభువు లేకపోబట్టి, ఈ ప్రజాస్వామ్యం ప్రభవించింది.

సాంఘికవ్యవస్థలోని ఇట్టి అవకతవకలు, వాటి పరిణామంగా పుట్టిన అశాంతి కలిసి, సామ్యవాద విప్లవరూపంలో మరొకసారి విరుచుకపడ్డాయి. రష్యా, చైనాల్లో నెత్తురు వరదలై పారిన విప్లవాలు, వాటిలో పెద్దఎత్తున జరిగిన ఊచకోతలు, ఏరివేతలు, బహిష్కరణలు, బానిస శిబిరాలవంటి అమానుష చర్యలు చూస్తే ప్రపంచచరిత్రలో బహుశః వాటి కవేసాటి అనిపిస్తుంది. ఆర్థిక, రాజకీయశక్తుల కేంద్రీకరణ సామ్యవాదదేశాలలో ఏర్పడి, సామాన్య మానవుణ్ణి అమానుషబానిసత్వంలోకి మరొకసారి దిగద్రొక్కింది. ఆర్థికశక్తి బారినుండి రాజకీయశక్తిని కొంతవరకైనా తొలగించడంవల్లనే, సామ్యవాదానికి ఎదురొడ్డినిల్చిన దేశాలు ప్రజాస్వామ్యాన్ని

కాపాడుకోగలిగినాయి. అయినప్పటికీ ఇట్టిదేశాల్లోనైనా ఇంతవరకు ఆర్థిక రాజకీయ శక్తులమధ్య సముచితమయిన సంతులనం ఏర్పడలేదు.

బానిసత్వంగాని రక్తసిక్తమైన విప్లవంగాని సమాజాన్ని మ్రింగి వేయకుండా, సుస్థిరశాంతిని, స్వాతంత్ర్యాన్ని ప్రసాదించేటందుకుగాను, ఆర్థికశక్తి ప్రభుత్వపుచేతుల్లో పడకుండా, రాజకీయాధికారం ఆర్థికశక్తికి అందకుండాచేసి, అవి ఒకదాని కొకటి ఆధారం అయ్యేట్లు, ఒకదానొకటి సరిదిద్దుకొనేట్లు నిర్ణయించింది ప్రాచీన హిందూపద్ధతి. అంతకంటెగూడా ముఖ్యంగా, స్వలాభాపేక్ష లేని మహాపురుషుల పర్యవేక్షణలో రెండు శక్తులనుగూడ వారు ఉంచినారు. ఈరెండు శక్తులలో ఏది తప్పుచేసినప్పటికీ దాన్ని సరిచేయటానికి ధనం, అధికారం మొదలైన అన్ని వ్యామోహాలకు తా మతీతంగా ఉంటూ ఎల్లప్పుడూ జాగరూకులై ధర్మదండాన్ని ధరించిన మహాపురుషుల పరంపరయే మన ప్రాచీన జాతీయవైభవానికి, అమరత్వానికి ప్రాణశక్తి.

## సమాజాన్ని సర్వశక్తిమంతంగా నిర్మించాలి

మన జాతీయ పరంపరలోని ఈ కీలకాన్ని గుర్తించినాము గాబట్టే మనజాతికీ, మనధర్మానికీ అంకితం అయిన వ్యక్తులను తీర్చిదిద్దే కంటకాకీర్ణ మార్గాన్ని స్వీకరించాము. అట్టి వ్యక్తులు తమ పవిత్ర శీలంచేత, అపార ప్రేమచేత అత్యుత్తమమైన సంఘటితసమాజశక్తిని-అంటే, అధికారంలో ఉండేవారు తమ హద్దులను దాటకుండా, సమాజహితకారి అయిన పనులు తప్ప మరే ఇతరము తలపెట్టడానికైనా సాహసించలేకుండా ఉండేటట్లు చేయగలిగిన శక్తిని – నిర్మించాలి.

అట్టి వ్యక్తుల సంఘటనమాత్రమే శాశ్వతమైన సమాజశక్తికి ఆధారం కాగలదు. అట్టి సంఘటన పరిస్థితుల ప్రభావాని కతీతంగా ఉండాలి. సంకుచిత స్వార్థప్రయోజనాలు తీర్చుకోవటం, రాజకీయాధికారాన్ని హస్తగతం చేసికోవటంవంటి వ్యామోహాలకు లోనుకారాదు. అట్టి సంఘటన

సంపూర్ణసమాజంతో తాదాత్మ్యం పొంది కేవలం తన ఉనికిచేతనే యావత్తు సమాజాన్ని సుస్థిరంగా ఉంచగలగాలి; సమాజంయొక్క సంపూర్ణవికాసానికి అవసరమైనస్ఫూర్తిని, శక్తిని అందించగలగాలి.

ఇట్టి ఉదాత్తదృష్టిని మన హృదయఫలకంపై ముద్రించుకొనిఉన్న మనం, రాజకీయాధికారమనే ఎండమావులవెంట ఎందుకు పరుగెత్తాలి? ఒకప్పుడు దక్షిణేశ్వర దేవాలయంలో ఒక దొంగతనం జరిగింది. రాధాకాంతుని విగ్రహంయొక్క ఆభరణాలు కొన్ని పోయినవి. "తన ఆభరణాలను తాను రక్షించుకోలేనివాడు దేవుడేమిటి?" అని ఒకరు వ్యాఖ్యానించినారు. వెంటనే శ్రీరామకృష్ణపరమహంస 'అట్టి మూర్ఖాభిప్రాయాలు వ్యక్తం చేయటం సిగ్గుచేటు. సంపద కధిదేవతయైన లక్ష్మీదేవి అతని చరణదాసి; అట్టి స్వామి వట్టి రాతిముక్కలకు, లోహానికి విలువఇస్తాడా?' అని మందలించినారు, అదే విధంగా, సంపూర్ణసమాజంయొక్క సంఘటితజీవనాన్ని లక్ష్యంగా పెట్టుకొన్న మనం, రాజకీయాధికారంవంటి తాత్కాలికవిషయాల నెందుకు వెన్నాడాలి?

చంద్రుడు, సూర్యతేజస్సును ప్రతిబింబించినట్లుగా, రాజకీయాధికారం మన సంస్కృతియొక్క, మనం నిర్మించదలచిన సమాజసంఘటన సామర్థ్యంయొక్క కాంతిని ప్రతిబింబించాలి. వర్ణనాతీతమైన దివ్యశక్తిని ప్రసాదిస్తున్న సూర్యునివలెనే సమాజంయొక్క పరంపరాగతమైన ఆకాంక్షలన్నిటినీ ప్రతిబింబించే శక్తికేంద్రంగామనం ఉండాలని కోరుకొంటున్నాము. అటువంటి శక్తినుంచి ప్రాణంపోసికొన్న రాజకీయాధికారం, దానికాంతినే ప్రతిబింబించక తప్పదు.

దీన్ని చక్కగా వ్యక్తం చేయగల కథ ఒకటి ఉపనిషత్తుల్లోఉంది. రాక్షసులను జయించినందున దేవతల్లో ఒకప్పుడు అహంకారం బలిసిందట. దాన్ని పోగొట్టవలసిన సమయం వచ్చిందని సర్వశక్తిమంతుడైన భగవంతుడు భావించినాడు. ఆయన ఒక బ్రహ్మాండమైన ఆకారాన్ని దాల్చి అకస్మాత్తుగా వారిముందు ప్రత్యక్షమైనాడు. విచిత్రము, అలౌకికమునైన

ఆ ఆకారాన్ని చూచి దేవతలు చకితులైనారు. ఆ ఆకారమేమిటో తెలిసికొని రమ్మని వాయుదేవుణ్ణి పంపినారు. తానొక యక్షుడనని చెప్పి ఆ ఆకృతి ఒక గడ్డిపరకను చూపి దాన్ని కదలింపుమని వాయుదేవుని సవాలుచేసింది. ప్రపంచాన్నంతనూ కదలించివేయగల తన శక్తినంతా వినియోగించికూడా వాయుదేవుడు దాన్ని ఒక వెంట్రుకవాసియైనా కదల్చలేకపోయినాడు; చిరాకుపడి వచ్చేశాడు. తరువాత అగ్నిదేవుడు వెళ్ళినాడు. ఆ చిన్న గడ్డి పరకను కాల్చలేక అతడుగూడా అవమానంతో తిరిగివచ్చినాడు. చివరకు దేవతలకు రాజైన ఇంద్రుడు వెళ్ళినాడు. కాని, అంతలోనే ఆ ఆకృతి అకస్మాత్తుగా అదృశ్యమైంది. ఆ అద్భుత విషయాన్ని కనుగొనలేక తన అసమర్థతకు సిగ్గుపడి ఇంద్రుడుకూడా తిరిగివచ్చినాడు. ఆ యక్షాకృతి సర్వ శక్తిమంతుడైన పరమేశ్వరుడే అని, అతని అనుగ్రహముచేతనే ఆయనలోని మహాశక్తియొక్క సూక్ష్మాంశం మాత్రమే తాము పొందినామనే సత్యం ఇంద్రుని మనస్సుకు అప్పుడు తట్టింది.

## జాతీయ ప్రతిభను అంటిపెట్టుకోవాలి

బాహ్యాకారణాలవల్ల కలిగే కష్టాలనుండి సమాజాన్ని కలకాలం కాపాడుతూ, జీవనరంగాలన్నింటినీ చైతన్యభరితంచేసి, దేదీప్యమానంగా ఉంచగల సర్వశక్తిమంతమైన సమాజనిర్మాణమే మన లక్ష్యం.

తరతరాల చైతన్యం నశించిపోలేదని గుర్తించండి. శతాబ్దాలతరబడి దురాక్రమణల తాకిడులను తట్టుకొని, నిలబడి, ధర్మమూర్తులకు, మహా వీరులకు జన్మఇచ్చిన మన జాతీయభావన తిరిగి ప్రస్ఫుటమై తీరుతుంది. అట్టి ప్రాచీన ఆదర్శపురుషులయొక్క, సాంస్కృతిక జ్యోతిర్మూర్తుల యొక్క అడుగుజాడల్లో మనజీవితాలను తీర్చిదిద్దుకుందాం. వశిష్ఠ, విశ్వామిత్ర, చాణక్య, విద్యారణ్య, సమర్థరామదాసులవంటివారిని కని, శ్రీరామ చంద్రుడు, చంద్రగుప్తుడు, శ్రీకృష్ణదేవరాయలు, శివాజీల వంటివారిలో ప్రతిఫలించి, వికసించిన ఉజ్జ్వల పరంపరను పునరుద్ధరిద్దాం.

అడ్డుగోడలకై ఆరాటాలు, రాజకీయ ప్రలోభాలవంటి బాహ్య ప్రచారాల ప్రవాహంలో కొట్టుకొనిపోకుండా దృఢనిశ్చయంతో స్థాణువులా మనం నిలబడుదాం. జాతీయ ప్రతిభను ఆధారంచేసికొని వికసించేట్లుగా మన సమాజాన్ని తయారుచేద్దాం. ప్రపంచానికంతకూ సాంస్కృతిక గురుపీఠంపై మన భరతమాతను జగద్గురువుగా మరల ప్రతిష్ఠించాలనే మన కలలు సఫలం చేసికొందాం. ఇట్టి దృఢనిశ్చయంతో మహోన్నత హిమాలయాల వలె మనం నిలబడగలిగినప్పుడే జాతీయ పునరుజ్జీవనం, సాంస్కృతిక ఆదర్శాలు అనే పవిత్ర గంగా, యమునా స్రవంతులు ప్రవహిస్తాయి. అటువంటి ఉదాత్తలక్ష్యం మన హృదయాల్లో సదా ప్రజ్వరిల్లుగాక! అవసరమైన కాలాన్ని, శక్తిని సమర్పించడానికి వెనుదీయక ఈ చరిత్రాత్మక జీవనలక్ష్యాన్ని సాధించేందుకు మనం సర్వదా సంసిద్ధులం కావాలి.

రెండవ భాగం

# రాష్ట్రం - సమస్యలు



# మన మాతృభూమి

## 1. ఉజ్జ్వల భావన

ఇది మన పుణ్యభూమి భారతదేశం. దీని మహాత్మ్యాన్ని దేవతలు గానం చేసినారు.

*గాయన్తి దేవాః కిల గీతకాని ధన్యాస్తు యే భారత భూమి భాగే,*
*స్వర్గాపవర్గాస్పదహేతుభూతే భవన్తి భూయః పురుషాః*
*సురత్వాత్ ॥*

(స్వర్గానికి ముక్తికి ద్వారమువంటిదైన ఈ భారతభూమిలో పుట్టిన మానవులు తమకన్న ధన్యులని దేవతలు గానం చేస్తున్నారు.)

విశ్వానికంతకు దివ్యజనని పరాశక్తియొక్క సజీవ ఆవిష్కృతిగా ఈభూమిని అరవిందమహాయోగి సాక్షాత్కరించుకున్నాడు. మనం కనులారా తనను చూసేందుకు, ఆరాధించేందుకు, అనువుగా మూర్తిని దాల్చివచ్చిన జగన్మాత, ఆదిశక్తి, మహామాయ, మహాదుర్గ ఈ భూమి.

*"దేవి భువనమనమోహినీ .... నీల సింధుజల ధౌత చరణతల"*

[జగత్తుయొక్క మనస్సును మోహింపచేసెడి దేవి! .... సముద్రుడు నీలజలాలచే నీ పాదాలు కడుగుచున్నాడు.]

అని యీ భూమిని కవి, తత్త్వవేత్త రవీంద్రనాథ టాగూర్ స్తుతించినాడు. మాతృభూమి స్వాతంత్ర్యంకోసం చిరునవ్వుతో ఉరికంబాలనెక్కిన వేలాది హృదయాలను ఉత్తూతలూగించిన అమరమైన 'వందేమాతరం' గీతంలో

"త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ"
(పది ఆయుధములతో కూడిన దుర్గవు నీవు)

అని దివ్యస్ఫూర్తితో బంకించంద్రుడు వందనం చేసినాడు. మాతృభూమిగా ధర్మభూమిగా, పుణ్యభూమిగా, కర్మభూమిగా, సాక్షాత్తు దేవభూమిగాను మోక్షభూమిగాను, మన ఋషులచేత, మునులచేత ఆరాధింపబడినది ఈ భూమి.

మన ప్రియతమ పవిత్ర భరతమాత! పేరు విన్నంత మాత్రాన అనంతకాలంగా మనహృదయాలను విశుద్ధమైన ఉదాత్తోత్తుంగభక్తితరంగాలలో ముంచియెత్తిన భూమి ఇది-తేజస్విని ఐన మాతృదేవత, మన భూమి.

## మాతృభూమి - అనాదిగా మన భావన

ఇది మనకు తల్లియని 'భారత్' అన్న పేరే సూచిస్తుంది. తల్లిని ఆమె బిడ్డలపేరున పిలవటం మన సాంస్కృతిక పరంపరలో ఒక గౌరవప్రదమైన పద్ధతి. ఒక స్త్రీని ఫలానివారి భార్యయని పిలవటం పాశ్చాత్య పద్ధతి. "ఆమె రాముని తల్లి" అని మనమంటాం. ఆవిధంగానే మన మాతృభూమిని 'భారత్' అని పిలుస్తాము. అనగా అనగా ఏనాడోపుట్టిన 'భరతుడు' మనకు పెద్దన్న. అతడు ఉదారుడు, శ్రేష్ఠగుణ సంపన్నుడు, విజయశాలి. హిందూ పురుషార్థానికి ఉజ్జ్వలమైన ఆదర్శం అతడు. ఒక స్త్రీకి అనేకమంది బిడ్డలుంటే, వారిలో పెద్దవారిపేరునగాని, లేక వారిలో బాగా ప్రసిద్ధి చెందిన వారిపేరునగాని, ఆమెను ఉదాహరిస్తుంటాము. భరతుడు సుప్రసిద్ధుడు. హిందువులందరకూ తల్లియైన ఈభూమి, అతనికికూడ తల్లియై, అతనిపేరున "భారత్" అని పిలువబడుతున్నది.

అయితే కొందరు ఇట్లా అంటారు : "హిందువులకు మాతృభూమి అంటే ఏమిటో తెలియదు; పరస్పరము కలహించుకొనే తెగలుగా, విడివిడిగా ఉండేవారు; దేశభక్తి, మాతృభూమిపట్ల భక్తి కలిగి ఉండటం అనేది వారికి తెలియదు; ఒకవేళ ఏ కొద్దో, గొప్పో అట్టి భక్తి ఉన్నా అది ఈ భూమిలోని చిన్నచిన్న భాగాలకే పరిమితమయిందికాని, కన్యాకుమారినుండి కాశ్మీరువరకు వ్యాపించిన యావత్తుదేశంపట్ల వారికి భక్తిలేదు". మనదేశం విభిన్న శీతోష్ణ స్థితులు, భూభాగాలు కలిగి, అనేక జాతుల కలగూరగంపగా కన్పిస్తున్నది కాబట్టి, ఒకేదేశమని చెప్పటానికి తగదని, అంటే ఖండమనో, ఉపఖండమనో అనాలని ఈనాటి ప్రముఖులుగూడా తరచు అంటూ ఉంటారు. ఇట్టి వింత ఆలోచనలు మనజాతి మస్తిష్కంలోనికి ఎట్లా దూరినవి ?

జిత్తులమారి ఆంగ్లేయులు తమ దుష్టసామ్రాజ్యవాద ప్రయోజనాలను సాధించుకొనేందుకై ఇటువంటి తప్పుడు తలంపులను మన ప్రజలలో ప్రచారంచేసినారు. తద్వారా దేశభక్తిభావన, మాతృభూమియొక్క సమగ్ర వ్యక్తిత్వంపట్ల కర్తవ్యభావనలు మనలో తుడిచిపెట్టుకుపోవాలి అని అనుకొన్నారు. మనం ఎన్నడు ఒకజాతికాదని, మనం ఎన్నడు ఈతల్లికి బిడ్డలంకాదనీ, మనమూ క్రొత్తగా వచ్చినవారమేననీ, విదేశీదోపిడీ ముఠాలైన ముస్లిములకు, ఆంగ్లేయులకు ఉన్నదానికంటే, మనకీభూమిపై ఎట్టిహక్కు అధికంగా లేదని ఆంగ్లేయులు కుటిల ప్రచారం చేసినారు. దురదృష్టవశాత్తు, మన పండితమ్మన్యులు ఈ జాలంలో చిక్కుకున్నారు.

కాని పాశ్చాత్యులు పచ్చిమాంసం పీకుకొని తినేస్థితిని దాటి కాల్చుక తినటం నేర్చుకోటానికి చాలా ముందుగానే, మనం ఒకే మాతృభూమికిచెందిన ఒకేజాతిగ జీవించినాము అన్నది వాస్తవం.

*పృథివ్యా స్సముద్ర పర్యంతాయా ఏకరాట్*

(సముద్రమువరకు వ్యాపించిన ఈ భూమి అంతా ఒకే రాష్ట్రము)

అని వేదము ఎలుగెత్తి ఘోషించింది. 'ఆసేతు హిమాచలము' – అనునది తరతరాలుగా మనలో స్పష్టంగా ఉన్న భావన, ఎంతో ప్రాచీనకాలంలోనే మన పూర్వికులు

*ఉత్తరం యత్సముద్రస్య, హిమాద్రేశ్చైవ దక్షిణమ్ ।*
*వర్షం తద్ భారతం నామ, భారతీ యత్ర సంతతిః ॥*

(సముద్రానికి ఉత్తరాన, హిమాలయ పర్వతమునకు దక్షిణాన వ్యాపించి ఉన్న భూమి భారత వర్షము, దాని సంతానము భారతీయులు)

అని గానంచేసినారు.

## మహోన్నత హిమాలయాలు

కేవలం హిమవత్పర్వతానికి దక్షిణంగా ఉన్న భూభాగమేగాక ఉత్తరానికి, దక్షిణానికి, తూర్పు పడమరలకు శాఖోపశాఖలుగా వ్యాపించి ఉన్న హిమవత్పర్వతశ్రేణులు, వాటిచే పరివ్యాప్తమైన భూభాగాలు కూడా మనవే. ధార్మికములు, తదితరములు నైన భావనలను ప్రక్కకునెట్టి చూచినప్పటికీ ఇది నిత్యవ్యవహారంలో అందరకూ తెలిసిన విషయమే, శక్తి కలిగి, బుద్ధిశాలి అయిన ఏ జాతీ పర్వతశిఖరాలను తన సరిహద్దులనుగా చేసికోదు. అట్లా చేసికోవటం ఆత్మహత్యాసదృశ మవుతుంది. కనుక మన పూర్వికులు, మన యాత్రాస్థలాల్లో కొన్నిటిని హిమాలయములకు ఉత్తరాన ఏర్పరచటం ద్వారా ఆ ప్రాంతాలను చైతన్యవంతములైన హద్దులుగా రూపొందించినారు. టిబెట్టు – అంటే త్రివిష్టపం–నేటి మన నాయకులు "చైనీయులకు చెందిన ఒక ప్రాంతం"గా భావిస్తున్నారు. అది నిజానికి దేవభూమి. కైలాసశిఖరం పరమేశ్వరనివాసం. గంగ, సింధు, బ్రహ్మపుత్రల వంటి మన పవిత్రనదులకు ఉద్గమస్థానంగా భావిస్తున్న మానససరోవరం మనకు మరొక పవిత్ర తీర్థస్థానం.

మన జాతీయ మహాకవియైన కాళిదాసు హిమాలయాల నిట్లా వర్ణించినాడు.

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః ।
పూర్వాపరౌ తోయనిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః ॥

(''పూర్వ పశ్చిమ సముద్రాలవరకు తన చేతులను చాచి భూమికి కొలబద్ద వలె ఉన్న పర్వతరాజైన దివ్యుడైన హిమవంతుడు ఉత్తరాన ఉన్నాడు.'')

మన రాజకీయశాస్త్రానికి ప్రామాణికుడైన చాణక్యుడు,

హిమవత్సముద్రాంతర ముదీచీనం
యోజన సహస్ర పరిమాణమ్

(సముద్రానికి ఉత్తరముగా హిమాలయపర్వతములవరకు, వేయియోజనాల పొడవున వ్యాపించిన భూమి)

అని ప్రకటించినాడు.

కాళిదాసకవి వర్ణన, రాజనీతికోవిదుడగు చాణక్యుని వాక్యంతో సరిపోతున్నది. అది మన మాతృభూమియొక్క వైశాల్యాన్ని చక్కగా నిరూపిస్తున్నదన్నమాట.

## మహోజ్జ్వల రూపం

మన ఇతిహాసాలు, పురాణాలుకూడ మన మాతృభూమి అంతటి వైశాల్యంకలది అనే ప్రకటిస్తున్నాయి. నేటి ఆఫ్ఘనిస్థానము ఒకనాటి మన ఉపగణస్థానము; మహాభారతంలో శల్యునిస్థానం అదే. నేటి కాబూలు కాందహార్‌లు ఒకనాటి గాంధారదేశం. ఇచటనే కౌరవుల తల్లియైన గాంధారి జన్మించినది. చివరకు నేటి 'ఇరాను'కూడ వాస్తవానికి ఒకనాటి ఆర్య దేశము. ఆ దేశపుచివరిరాజైన రెజాషాపహ్లవీ ఇస్లాముమతముకన్నఎక్కువగా ఆర్యులయొక్క విలువలనేఆదర్శంగాస్వీకరించిఅనుసరించినాడు. పార్శీలపవిత్ర గ్రంథమైన"జెండ్అవెస్తా"చాలావరకుఅధర్వణవేదమే. ఇంక తూర్పుదేశాలు

పరిశీలిస్తే నేటి బర్మా ఒకనాటి బ్రహ్మదేశం. నేటి 'ఇరావదీ' లోయ 'ఇరావతీ' అను పేరున ఆనాటి కురుక్షేత్ర మహాసంగ్రామంలో పాల్గొన్నట్లు మహాభారతం చెపుతుంది. సూర్యుడు తొలుత అటు ఉదయిస్తాడు కాబట్టి అస్సామును 'ప్రాగ్జ్యోతిష' మని మహాభారతం చెప్పుతుంది. దక్షిణాన లంక మనతో అతిసన్నిహిత సంబంధాలు కలిగిఉండేది. అసలది ఎన్నడు వేరయినది అని అనుకోలేదు. పశ్చిమాన ఆర్యన్ (ఇరాన్) వద్ద తూర్పున శృంగపురం (సింగపూర్) వద్ద హిమవంతుడు తన రెండుచేతులు చాచి సాగరంలో ముంచుతున్నాడు. ఆమె పవిత్రపాదాల చెంత దక్షిణ సముద్రం సమర్పించిన పద్మంలాగా శ్రీలంక (సింహళం) ఉంది. మాతృభూమి యొక్క ఈ చిత్రము మనప్రజల మనస్సుల్లో అనేకవేల సంవత్సరాలుగా ఎల్లప్పుడూ ప్రకాశిస్తు నిలచిఉన్నది. హిందువులు ఈనాటికిగూడ నిత్యమూ స్నానంచేస్తూ, గంగ, యమున, గోదావరి, సరస్వతి, సింధు, కావేరి మొదలైన పవిత్రనదులను

*గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి ।*
*నర్మదే సింధు కావేరి జలేஉస్మిణ సన్నిధిం కురు ॥*

అంటూ స్మరిస్తారు. భక్తిభావాన్ని కలిగించడానికి ఇదికూడా ఒకశిక్షణే. దీనివలన, ఈ పవిత్ర నదులలోని ఒక్క నీటిబిందువైనాసరే మన పాపా లన్నిటిని కడిగివేయగలదు అనే విశ్వాసం మనలో కలిగింపబడుతున్నది.

మన ప్రజల ప్రవృత్తిపైన, మన సంస్కృతిపైన చెరగని ముద్రను వేసిన మహోత్కృష్టవ్యక్తులలో శ్రీరామచంద్రుడొకడు.

*సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవా.ఎచ ॥*

అంటూ ఆయనలోని ప్రశాంతత, ఉదారత, విజ్ఞానం, అనుభూతులవంటి మహాగుణాలను, అంతుదొరకని సముద్రపు గంభీరతా, ప్రశాంతతతోనూ, ఆయన అజేయ పరాక్రమాన్ని, ధైర్యాన్ని అందుకోనలవిగాని మహోన్నత హిమాలయాలతోను పోల్చినారు.

ఒక ప్రక్కన హిమాలయముతోను, మిగిలిన మూడు ప్రక్కల సముద్రముచేతను, మన మాతృభూమి చుట్టబడి ఉన్నదని మనకు తెలియనిది కాదుగదా! ఆవిధంగా మన మాతృభూమి అంతా శ్రీరాముని ఆదర్శ వ్యక్తిత్వంలో పరిపూర్ణంగా దర్శింపబడింది. అఖండమైన సమగ్ర మాతృభూమి ఒక ఆరాధ్యవస్తువుగా అనేకవిధాల స్తుతింపబడింది. మాతృ విభజన - ఆ ఆలోచనే భరింపరానిది.

## ఇష్టభూమి

ఈ దేశమంతా మనకొక తపోభూమి. మన ప్రాచీనసాహిత్యంలో ప్రబోధాత్మకమైన సంఘటన ఒకటి ఉంది. సత్ఫలాన్నిచ్చే తపమాచరించ టానికి, యజ్ఞాలు చేయటానికి అనువైన పవిత్రభూమి ఏది? ఏది పరమాత్మ సాక్షాత్కారానికి అనువైన ప్రదేశమని ఒక ప్రశ్న వచ్చింది. కృష్ణసార మృగం సంచరించేదే దానికి తగిన స్థలం అని సమాధానం వచ్చింది. అట్టి ప్రత్యేకమైన జాతికి చెందిన లేడి కేవలం మనదేశంలోనే ఉంటుంది. ప్రపంచంలో మరిఎక్కడా కనిపించదని జంతుశాస్త్ర విద్యార్థి ఎవరైనా చెప్పగలడు. దీని అర్థం ఏమిటి? యావత్ప్రపంచంలో పరమ పవిత్రభూమి ఇదిఅనీ, ఇక్కడ చేసిన స్వల్పపుణ్యకార్యమైనా కొన్నివేలరెట్ల ఫలమిస్తుందనీ మన పూర్వీకుల దృఢవిశ్వాసం అని తెలుస్తుంది. స్వామి వివేకానందుడు— 'ధన్యమైన పుణ్యభూమి అనేది అంటూ ఉంటే అది ఈ భారతభూమియే. భగవత్సాన్నిధ్యాన్ని చేరటానికి యత్నించే ప్రతిప్రాణి తన లక్ష్యసిద్ధికి ముందు ఈ భూమిలో జన్మించి తీరా'లని అన్నాడు.

ఈశ్వర సాక్షాత్కారానికి ఆధారంగా ఈ భూమి నిర్ణయింపబడింది అన్నది నిశ్చయం. ఇది ఏదో భావోద్రేకంతో చెప్పేమాటకాదు; ఇది మన యొక్క ప్రగాఢ విశ్వాసం. కొన్నిఏండ్లక్రితం మనదేశానికి ఆధ్యాత్మిక తృష్ణతో వచ్చిన ఒక జర్మన్‌దేశీయుని కథను వార్తాపత్రికలు ప్రకటించినవి.

అతడు సన్యాసం స్వీకరించి, సర్వసంగపరిత్యాగికి అవసరమైన కఠోర నియమాలన్నీ పాటించినాడు. కాని ఎంతకాలానికీ, భగవత్సాక్షాత్కారము పొందలేకపోయినాడు. కాగా, నిశితమైన ఆత్మపరిశోధన చేసికొని, పాశ్చాత్య దేశాల భోగపూర్ణవాతావరణంలో పుట్టి పెరిగిన తన శరీరం భగవత్ సాక్షాత్కారానికి అర్హంకాదని అతడు చివరకు గుర్తించినాడు. అందుచేత హరిద్వారానికిపోయి. తనదేహాన్ని పవిత్ర గంగాప్రవాహంలో పరిత్యజించినాడు. "నా అంతట నేనే ఈ శరీరాన్ని విసర్జిస్తున్నాను. ఈ పవిత్ర గంగా ప్రవాహంలో శరీరాన్ని సమర్పించిన పుణ్యంచేత భారతభూమిలో జన్మఎత్తి నవస్వచ్ఛమైన దేహంతో భగవత్సాక్షాత్కారాన్ని పొందగలను" అని వ్రాసిపెట్టి చనిపోయినాడు.

ఇతరమతస్థాపకుల జీవితాలను తరచిచూచినపుడు, మన మాతృభూమి కున్న ప్రత్యేక అర్హతలపట్ల ఇదే అభిప్రాయానికి వస్తాం. తన జీవితకాలంలో సాక్షాత్తు భగవంతుని చూచినట్లు చెప్పే ఆధారాలు మహా తపస్వియైన ఏసుక్రీస్తువిషయంలోగూడ కనిపించవు. ఆయనకు దేవదూతలు మాత్రమే కనిపించినారు; ఒకసారి 'సైతాను' ఆయనకు కనిపించినాడు. సిలువవేసినప్పుడు, "ఏలీ, ఏలీ, లామా సబక్తానీ" (ఈ హీబ్రూ మాటలకు నా దేవా, నా దేవా, నన్నెందుకు చెయ్యివిడిచితివని యర్థం) అని ఒక్క క్షణం భగవంతుని దయనే సందేహిస్తూ ఆయన వాపోయినాడు.

ఇస్లాము మతప్రవక్తకూడా ఒకమహావ్యక్తి, గొప్ప శక్తిమంతుడు; అంతఃకలహాలతో ఛిన్నాభిన్నమైపోయిన తనఅనాగరికప్రజలు మానవత్వపు విలువలను గుర్తించేటట్లు చేసి, వారిలో సామ్రాజ్యాలు నిర్మించాలనే కాంక్షను, సంఘటితశక్తిని కలిగించినాడు. కాని అతడుగూడా 'గేబ్రియల్'ను మాత్రమే కలుసుకున్నాడు. కొన్ని దివ్యవాక్యాలను విన్నాడు. అంత మాత్రమే. ఆయన భగవంతుని ప్రత్యక్షంగా దర్శించలేదు.

ఈభూమిలో జనించిన సంతానానికి మాత్రమే భగవంతుని పరిపూర్ణ తేజోమయ రూపాన్ని దర్శించి, ఆత్మానుభూతిని పొందే అదృష్టం కలిగింది. ఇతరజాతులు అడవులను, గుహలను విడిచి వెలికిరాని రోజుల్లోనే వైదిక ఋషులు, ఈ మానవజాతిని అమృతసంతానంగా "శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః ఆ ఇ దివ్యాధామని తస్థుః" అంటూఉద్బోధించినారు.

వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం
తమసః పరస్తాత్ ।
తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః
పంథా విద్యతేఽయనాయ ॥

[చీకటి కంతకును అవల, తేజోమూర్తియై ప్రకాశించుచున్న ఆ మహాపురుషుని నేను దర్శించినాను. ఆయనను దర్శించడం ద్వారా జననమరణ చక్రంనుండి మానవుడు విముక్తుడగుచున్నాడు. మోక్షమున కంతకన్న వేరుమార్గము లేదు.]

అంటూ ఆ మహర్షులు ఘన గంభీర కంఠంతో ఘోషించినారు.

వారిలోని ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మసాక్షాత్కారాన్ని వ్యక్తంచేస్తున్న ఈ వాక్యములతో తుల్యములయిన వాక్యములు ప్రపంచంలో ఏ ఇతర సాహిత్యంలోనూ లేవు. అంతేగాక, మానవాత్మను మేల్కొల్పేటువంటి భగవద్గీత అనే అమరసందేశంలో 'నేనే భగవంతుడ'నని ఉత్తమ పురుషలో చెప్పిన శ్రీకృష్ణునిపోలినవారిని, ప్రపంచంలో వేరెక్కడ చూడలేము.

## మన అవిచ్ఛిన్న పరంపర

మనభూమియొక్క ఈ అసామాన్యలక్షణం మన ప్రాచీన పరంపరకు మాత్రమే పరిమితంకాదు. నవీనకాలంలోగూడ నరేంద్రుడు (తరువాత వివేకానందుడైనాడు) శ్రీ రామకృష్ణపరమహంసను కలిసిన చారిత్రక సంఘటన ఉన్నదికదా. చురుకైన కళాశాలావిద్యార్థిగా, అతడు అప్పటికే

ప్రాచ్య, పాశ్చాత్య దర్శనాలను మథించినాడు. ఆతని జిజ్ఞాసకు అక్కడ తృప్తికలుగలేదు. సమకాలీనులైన అనేక విద్వాంసులను, మహాత్ములను ఆయన కలుసుకొన్నాడు. అతని ఆధ్యాత్మిక పిపాసను ఎవ్వరూ తీర్చలేక పోయినారు. దక్షిణేశ్వర దేవాలయంలో ఒక పరమహంస ఉన్నారని అతనికి తెలిసింది. అతడు ఆయనవద్దకుపోయి, తనను అనేకసంవత్సరాలుగా వేధిస్తున్న ప్రశ్న "స్వామి! మీరు దేవుణ్ణి చూచినారా ?" అని మోమోటమి లేకుండా అడిగినాడు. క్షణమైనా తటపటాయించకుండా "ఆ ! ఇప్పుడిక్కడ నిన్నెట్లా చూడగలుగుతున్నానో, అట్లాగే అంతకన్న చక్కగాగూడ ఆ దేవుణ్ణి చూస్తున్నాను. అంతేకాదు, ఆదేవుణ్ణి నీకుకూడా చూపగలను." అని శ్రీ రామకృష్ణపరమహంస సమాధానం చెప్పినారు; ఆ వాగ్దానాన్ని నెరవేర్చినారుకూడా.

నరేంద్రుడు నవయువకుడనీ, మహోన్నత మేధావంతుడనీ, అద్భుత మైన ఇచ్ఛాశక్తి కలవాడని మనకు తెలుసు. ఇంద్రజాలంతో సమ్మోహితుణ్ణి చేసి, ఒక మూఢవిశ్వాసాన్ని కలిగించటానికి అందేరకం వ్యక్తి కాడతడు. అయినా భగవంతునితో ముఖాముఖి అయినప్పుడు, దేవుని ఉనికిని నమ్మక తప్పలేదు. మనదేశంలో పుట్టిన ఈశ్వరభక్తులపరంపర అట్టిది. వారు ఎల్లప్పుడు, భగవత్సాక్షాత్కారభూమిగాను, ధర్మభూమిగాను, మోక్షభూమి గాను దీన్ని సార్థకం చేసినారు.

ప్రతి ధూళికణంలోను దివ్యత్వాన్ని నింపుకొన్న ఈ భూమి మనకు శ్రద్ధాకేంద్రము, పరమ పవిత్రము కావటంలోఆశ్చర్యంలేదు. ఇట్టి శ్రద్ధా భక్తులు యావత్తు దేశంపట్ల – ఏదో ఒక భాగంపట్లకాదు – మనకున్నాయి. శైవుడు కాశీనుంచి రామేశ్వరందాకాను, వివిధ సంప్రదాయాలకు చెందిన వైష్ణవులు దేశమంతటనూ ప్రయాణం చేస్తారు. నలుదిశలా రక్షణార్థమై నిలిచినట్లున్న శంకరాచార్యుని నాలుగు ఆశ్రమాలు అద్వైతిని, దేశం నలు మూలలకు నడిపిస్తాయి. జగన్మాతయైన ఆదివ్యశక్తిని ఆరాధించేశాక్తేయునకు

ఏభై రెండు యాత్రాస్థలాలు, బలూచిస్థానంలోని హింగులాజనుండి అస్సాము కోని కామాఖ్యవరకు, హిమాచలంలోని జ్వాలాముఖినుండి దక్షిణాన కన్యాకుమారివరకు వ్యాపించి ఉన్నవి. జగజ్జననీ దివ్యరూపంగా ఈ భూమి వ్యక్తం అయినదని ఇది సూచిస్తుంది.

## జగన్మాత

ఈభూమికంటె పవిత్రమైనది మనకు వేరే ఏదీ ఉండబోదు. ఈ భూమిలోని ప్రతి ధూళికణం. సజీవ నిర్జీవ వస్తుజాలములోని ప్రతి ఒక్కటి, ప్రతిరాయీ రప్పా, ప్రతిచెట్టూ పుట్టా, మనకు పవిత్రమైనవే. ఈ భూమికి సంతానమయిన ప్రతిఒక్కని హృదయంలోనూ, ఇట్టి ప్రగాఢ భక్తిని, నిత్యనూతనంగా ఉంచేందుకుగాను, గతంలో ఇచ్చట అనేక పద్ధతులు, సంప్రదాయాలు రూపొందినాయి. తనస్థానం ఈ సువిశాల భరత వర్షంలో ఎక్కడున్నదో సవివరంగా

*"జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే..........."*

అంటూ సంకల్పంలో తప్పక చెప్పబడుతూ ఉంటుంది. ముఖ్యమయిన మన ధార్మిక ఉత్సవాలన్నీ భూమిపూజతోనే ప్రారంభమవుతాయి. ఉదయాన నిద్రమేల్కొనగానే, భూమాతను క్షమాపణ కోరే ఆచారం ఒకటున్నది. రోజంతా ఆ మాతృదేవిని, తన పాదాలతో స్పృశించకుండా ఉండటం ఎవనికీ సాధ్యంకాదుగదా. అందుకనే భారతీయుడు

*సముద్రవసనే దేవి పర్వతస్తనమండలే ।*
*విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే ॥*

('సముద్రమును వస్త్రముగా, పర్వతములను స్తనములుగా గలిగిన నీవు విష్ణువునకు భార్యవు; తల్లీ: కాలితో నిన్ను నేను స్పృశించినందుకు క్షమింపుము'.)

అంటూ ఆమె క్షమాభిక్షను వేడుతాడు.

నిజానికిది చాలా చిన్న విషయం. అయితే మాతృభూమిపట్ల
జగన్మాతయెడల ఉదాత్తభక్తి ఒక్కటే అనే తలంపును ఇది
ఉదయము మనస్సులలో కలిగిస్తుంది. సామాన్య నిత్యజీవన కార్యకలా
గూడ, అట్టి అనుభూతి తరచు కలిగేటంత ప్రగాఢంగా ఈ శిక్షణ వ
ఒంటబట్టింది. బాలుడు ఆటల్లో భూమిని తన్నుతుంటే ఆతనితల్లి 'బా
భూమాతను తన్నకు' అని అంటుంది. కావాలని మేకును భూమిలోకి
'వద్దు బాబూ! భూమాత బాధపడుతుం'దని ఆతల్లి మందలిస్తుంది.
సామాన్యరైతుకూడా, దున్నేముందు, తనను క్షమించుమని భూమ
కోరుతాడు. అట్టిది మన సజీవ సంప్రదాయం.

మనదేశం మనకు జీవంలేని, ఒక జడపదార్థం ఎన్నడూ కా
కానేకాదు. నీచుడు, ఉన్నతుడు అనే తేడాలేకుండా మనందరకు, ఈ
ఎల్లప్పుడు చైతన్యపూరితయైన జగజ్జననియే.

అమెరికా, ఇంగ్లండు వంటి సమృద్ధ దేశాలను సందర్శించిన తర
ఇంగ్లండును విడిచి భారతదేశానికి బయలుదేరుతుండగా, మాతృభూమి
మీ అభిప్రాయమేమిటని వివేకానందుణ్ణి కొందరు ప్రశ్నించినారు. "
దేశాన్ని లోగడ ప్రేమించాను. కాని ఇప్పుడు భారతభూమిలోని
ధూళికణము నాకత్యంత పవిత్రం. అది నాకొక తీర్థస్థానం"
వివేకానందుడు వారికి సమాధానం చెప్పినాడు.

"పాశ్చాత్య దేశాలలో విజయయాత్రను ముగించుకొని మన
భూమికి తిరిగి వచ్చినపుడు స్వామీజీకి సంబంధించిన, మరింతగా
యాల్ని కదలించే మరొక సంఘటన కూడ జరిగినది. వీరోచితమైన
తాన్ని ఆయనకు పలికేటందుకుగాను ఉత్సుకతతో ఎదురుచూస్తూ
దేశీయులెందరో సమావేశమయ్యారు. స్వామీజీ ఓడ దిగి దక్షిణ స

తీరభూమిమీద అడుగుపెట్టగానే దిక్కులు పిక్కటిల్లేవిధంగా స్వాగత ధ్వానాలు మిన్నుముట్టాయి. అయితే స్వామీజీ భూమిమీద సాష్టాంగ ప్రణామం చేస్తూ ధూళిని తన శరీరంపై చల్లుకోవడం చూసి ఆ ప్రజానీకం ఆశ్చర్యపోయింది. కుతూహలపూర్వకంగా ఎవరో ఇదేమిటని అడిగిన ప్రశ్నకు స్వామీజీ "ఇంతవరకు ఈ నా శరీరం భౌతిక జీవనపరమయిన పాశ్చాత్య దేశాలలో వుండి, కలుషితమైనది కాబట్టి ఈ పవిత్ర భూరజం చేత నన్ను పవిత్రుణ్ణి చేసుకుంటున్నాను" అని వివరించి చెప్పారు.

ఒకసారి ఒకడు శంక తీర్చికొని, ప్రక్షాళనానికి గంగానదికి పోతూంటే వివేకానందుని గురువైన శ్రీ రామకృష్ణపరమహంస చూచి 'గంగా వారి బ్రహ్మవారి....' పవిత్ర గంగానదీజలాలను నీ కశ్మలంతో కలుషితం చేయటం అనుచితం' అన్నాడు.

ఈ తల్లికి పుట్టిన మహాపురుషులు, ఉజ్జ్వల మాతృత్వముయొక్క సజీవ సాక్షాత్కారమే ఈ భూమి అనే భావన మనలో కలిగించినారు. ఇట్టి భావన మన సమాజంలోని అన్ని అంతస్తుల మనుష్యుల్లోను వ్యాపించింది.

నిజానికి, ఈ తల్లియే మన జాతీయజీవనగీతానికి పల్లవి. తన మట్టితో తన గాలితో, తన నీటితో ఈ భూమియే మనలను తల్లివలె పోషించింది. మన మనుగడకు, ఆనందానికి ఇంకా ఎన్నో ఆమెయే సమకూర్చింది. ఉత్తరాన దుర్భేద్యమైన హిమవన్నగంతోను, గతకాలంలో మన స్వాతంత్ర్యవీరులకు ఆశ్రయాన్నీ, రక్షణను సమకూర్చిన ఆరావళి, వింధ్య, సహ్యాద్రి, మొదలైన పర్వతాలతోను, మనకు తండ్రిలాగా ఈ భూమియే రక్షణ కల్పించింది. ధర్మభూమిగా, మోక్షభూమిగా, ఇదియే మనకు ఆధ్యాత్మగురువుగాకూడా పనిచేసింది.

తల్లి, తండ్రి, గురువు-ఈ మూడు రూపాలు ఒకే ఆకృతి దాల్చి వచ్చిన దివ్యమూర్తి మన మాతృభూమి.

# 9. మన మాతృభూమి

## 2. వీరవ్రతంతో కూడిన శ్రద్ధ కావాలి

మనదేశంలో ప్రసిద్ధ మహావ్యక్తులు కొందరున్నారు. "మాతృభూమి అంటే మట్టి, రాళ్ళు తప్ప ఏముంది" అని పెద్ద సర్వజ్ఞులుగా మాట్లాడారు. తెలివితేట లొక్కటే సర్వస్వమని వారి తలంపు. వారి మెదడున మెదలే తర్కంప్రకారం, దేశమంటే కేవలం ఒక అచేతనమైన భూభాగం మాత్రమే. తర్కానికికూడ అవధులున్నాయి. ఉదాహరణకు మానవదేహం కేవలం ఒక పదార్థం మాత్రమే. ఈదృష్టిలో తల్లి శరీరానికీ, ఇతరస్త్రీల శరీరాలకూ తేడాలేదు. అటువంటప్పుడు తనతల్లిని ఇతరస్త్రీలకన్న ప్రత్యేకంగా ఎందుకు భావించాలి ? ఆమె అంటే ఆరాధ్యభావం ఎందుకుండాలి ? బుద్ధిజీవి దీనికి సమాధానం చెప్పలేడు.

మరొక ఉదాహరణ : మానవదేహపోషణకు పిండిపదార్థం, మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థం, లవణం, నీరు అవసరం. ఈ ఆహారపదార్థాలన్నీ మానవుని శరీరంలో తగినపాళ్ళలో సిద్ధంగా ఉంటాయి. జీవశాస్త్రరీత్యా మానవుడంటే, మాంసం, రక్తం, ఎముకలేగదా. కాబట్టి మన సాటిమానవుణ్ణి ఎందుకు భక్షించకూడదు? కానీ ఈవిధంగా వాదించేవాడు తార్కికుడు

కావచ్చుగాని, నాగరికమానవుడు మాత్రం కాజాలడు. అట్టి తర్కం నరమాంస భక్షణకు మాత్రమే ధారితీస్తుంది. రావణుడు మహాపండితుడు; కాని కిరాతకుడు. కాబట్టి కేవలం బుద్ధి ఒక్కటే సరిపోదు. జీవితంలో హృదయ సంబంధమైన ఉదాత్తభావనలకు స్థానం ఉంది.

## మాతృభావనా వికాసం

అయితే ఈ మట్టిలో, ఈరాళ్ళయెడ మాతృభావన ఏవిధంగా వికసించింది? ప్రగతిపథంలో పరిణామంచెందుతూఉంటే, ప్రాణికోటిలో తమ కాహారమిచ్చి, పోషించే వస్తువులఎడ – జడచేతనాల తేడాలేదు–మాతృభావన పెంపొందుతుంది. ఉదాహరణకు ఒక కప్పనుగాని, పామునుగాని చూడండి. వాటికి తల్లి అనే ఆలోచన ఏమాత్రం లేదు. తన సంతానం ఏమవుతుందో అనేదికూడా వాటికి పట్టదు. వాటిల్లో తల్లీ, బిడ్డా అన్న భావన లేదు. క్రమంగా జీవకోటి పరిణామంచెందుతూ, స్తన్యజీవులదశలోకి వచ్చేసరికి, తల్లి పాలిచ్చి, బాల్యదశలోఉన్న సంతానాన్ని పోషిస్తుంది. పక్షులు గ్రుడ్లను, తర్వాత పిల్లలను వాటికి రెక్కలువచ్చేవరకు కాపాడుతాయి. తల్లి యొక్క అవసరం తీరిపోయినతర్వాత, సంతానం తల్లిని మరచిపోతుంది. అటుపైన ఆ తల్లీబిడ్డలకు ఎట్టిసంబంధమూ ఉండదు. జీవకోటి పరిణామక్రమంలో మానవుడు శిఖరాగ్రాన ఉన్నాడని భావిస్తున్నాంగదా! అతడు సంస్కారం కలిగినవాడైతే, అవసరం తీరిపోయిన తర్వాతకూడ, తల్లిపట్ల ప్రేమాభిమానాలు ఉంటూనే ఉంటాయి; నిజానికి, ఆమె బాగా ముసలిదై గ్రుడ్డిదై శారీరకంగా నిరుపయోగమైనతర్వాత, ఆమెను మరింత గౌరవభావంతో సేవిస్తాడు.

మానవజీవితం పరిణతినందుతున్న కొద్దీ, మాతృభావన విశాలమై మరింత ఉదాత్తరూపాన్ని పొందుతుంది. వివేచనాత్మక బుద్ధితో మానవుడు తనచుట్టు పరికించినప్పుడు, తాననేకవస్తువులకు ఋణపడి ఉన్నానని

గమనిస్తాడు. వాటినిగూడ మాతృభావనతో చూస్తాడు. తనకు ఆహారాన్ని నీటిని ఇస్తున్న నదిని మాతగా సంబోధిస్తాడు. తల్లి పాలను మానిననాటినుండి తనకు జీవితాంతం పాలిస్తున్న గోవును తల్లిగా చూస్తాడు. అటుపైన-తన్ను పోషించేది, రక్షించేది. మరణానంతరంకూడ తన్ను ఒడిలో దాచుకొనేది ఈ మాతృభూమి అని అర్థం చేసికొనేస్థాయికి చేరుకుంటాడు. ఆమెను తల్లులకు తల్లిగా తలుస్తాడు. అట్లా, తాను పుట్టినభూమిని మాతృభూమిగా దర్శించగల్గటం మహోన్నత మానవత్వపరిణామచిహ్నం అవుతుంది.

"మాతా భూమిః పుత్రోஉహమ్ పృథివ్యాః"

(ఈ పుడమి నా తల్లి, నేనామె పుత్రుడను)

అని వేదాలు ఘోషించాయి.

## చైతన్యవంతమైన శ్రద్ధ కావాలి

కనుకనే దేశంపట్ల మహోజ్జ్వలమైన, మాతృదేవతాభావన పెంపొందించుకోవాలి. ఇక, ఆమెపట్ల మనభక్తిని ప్రకటించటం ఎట్లా? దానికి రెండుమార్గాలున్నాయి. పూలతో, దీపారాధనతో, మంత్రపఠనాదులతో ఆరాధించడం సామాన్యమైన పద్ధతి. నేటికీ మనవారు తీర్థయాత్రలు, నదీనదాలలో స్నానాలు, పూజాపురస్కారాలు చేస్తూనే ఉన్నారు. ఇదంతా పుణ్యంకోసం. ఇది చైతన్యరహితభక్తి.

చైతన్యసహితభక్తి అంటే మాతృదేశ కణకణం యొక్క స్వాతంత్ర్యగౌరవాల సంరక్షణార్థం సర్వస్వార్పణ చేయడానికి నిత్య సంసిద్ధతను దైనందిన జాతీయజీవనంలో రూపొందించుకోవటమే. వ్యవహార ప్రధానమైన నేటి ప్రపంచంలో ఇట్టిభక్తికే తావుఉంది; తన శ్రద్ధాకేంద్రానికి-మాతృదేశానికి-జరిగే చిన్నమెత్తు అవమానానైనా, ఇట్టి భక్తిభావం ప్రజ్వరిల్లే హృదయం సహించలేదు. వెంటనే ఒకమహాభయంకరరూపాన్ని

దాలుస్తుంది; మాతృదేవిని అవమానించిన దురాక్రమణశక్తులు, మరొకసారి తలెత్తకుండా నాశనం చేయందే విశ్రాంతి నొందదు; జరిగిన అవమానాలు అంతమొందే దాక, ఆ హృదయంలో అసంతుష్టి ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది.

ఇట్టి విజిగీషుప్రవృత్తి లేనిదే, ఒక శ్రేష్ఠమైనకార్యంపట్ల వ్యక్తమయ్యే భక్తి భావనకు ప్రయోజనం ఉండదు. పాశవికశక్తులతో బలాబలాలు తేల్చుకోవలసిన రణరంగంవంటి ఈకఠోర ప్రపంచంలో, కేవలం మంచితనం-చైతన్యరహితమైన సాత్వికశక్తి - ఒక్కక్షణమైనా కాలూని నిలువలేదు. కనుకనే ఎంతటి ధర్మనిష్ఠ, ఎంతటి మంచితనం, దైవభక్తి ఉన్నా వేయిసంవత్సరాలుగా విదేశీయుల పాదాలక్రింద నలిగిపోయాం. వాళ్ళకూ, మంచితనానికీ మొగమెరుక లేదు; కాని సాహసప్రవృత్తి, సంఘటిత శక్తి - రజోగుణ ప్రధానమైంది - కలవారు వారు.

మనవారు చైతన్యసహితమైన సాత్వికభావనతోను, విజిగీషుప్రవృత్తి తోను, విజృంభించినప్పుడల్లా శత్రువుల రాక్షసరాజ్యాలు తుత్తునియలైపోయాయి. చరిత్ర ఇచ్చే సాక్ష్యం ఇదే.

పురాణాలుకూడా ఇదే వక్కాణిస్తున్నాయి. దేవతల్లో దైవత్వం ఉన్నప్పటికీ, ఉద్ధతులైన రాక్షసులయొక్క సంఘటితశక్తికి తట్టుకోలేక పోయేవారు, వీరోచిత కార్యానికి పూనుకున్నప్పుడే దేవతలు రాక్షసులను జయించగలిగేవారు. చైతన్యం, వీరత్వం - ఇవే ప్రపంచాన్ని పాలించ గలుగుతాయి. 'వీరభోగ్యా వసుంధరా' అన్నసిద్ధాంతమే సఫలమైన జీవితంలో సాక్షాత్కరిస్తుంది.

## బ్రతికే ఉన్నామా ?

మాతృభూమిపట్ల వీరోచితభక్తిభావం మన హృదయాలలో ప్రజ్వరిల్లుతూ ఉందా ? అట్టిభావన మన నాయకులలోను, సామాన్య

ప్రజానీకంలోనూ ఉండిఉన్నట్లైతే దేశవిభజన జరిగిఉండేదా ? ఏవిధమైన రాజీకి అంగీకరించక, ఆంగ్లేయుల, ముస్లిముల కుట్ర నెదిరించి, మన మాతృభూమియొక్క పవిత్రసమగ్రతను రక్షించేందుకు మన సమాజం విరాట్‌రూపాన్ని ధరించి తన చివరి రక్తబిందువువరకు సమర్పించటానికి సిద్ధపడకపోయేదా ?

అదిమాత్రం జరగలేదుపైపెచ్చునాయకుల అడుగుజాడల్లో ప్రజానీకం కూడా సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చిందనే భ్రాంతితో సంబరాలలో మునిగిపోయింది.

"అయిందేదో అయిపోయింది; సమసిపోయిన సమస్యలను త్రవ్వి పైకెత్తటంవల్ల ప్రయోజనమేమిటి ? దేశవిభజన ఇక 'తిరుగులేనిది' అని కొందరు అంటారు. ఎప్పటికైనా ఇది సాధ్యపడుతుందా ? మాతృదేవత ముక్కముక్కలు అయిన దృశ్యం అనుక్షణం కంటికెదురగా కనపడుతుంటే ఏ కుమారుడు అది మరచిపోయి గోళ్ళుగిల్లుకుంటూ కూర్చుంటాడు ? మరచిపోవటమా ! మాతృదేవతయొక్క అఖండస్వరూపాన్ని తిరిగి దర్శించేవరకు నిజమైన కుమారుడెవడూ విశ్రాంతి తీసుకోడు. దేశవిభజన తిరుగులేనిదైతే త్రిప్పివేయడానికి మనం ఉన్నాం. వాస్తవానికి ఈ ప్రపంచంలో 'తిరుగులేనిది' లేనేలేదు. నిశ్చితవిషయాలుగావి, అనిశ్చితవిషయాలుగాని కేవలం మనిషిలోని ఇచ్ఛనుబట్టి మాత్రమే జరుగుతాయి. తాను స్వీకరించిన కార్యం పవిత్రమైంది, శ్రేష్ఠమైంది అని గుర్తించినపుడు మానవునిలోని ఇచ్ఛ మొక్కవోని సమర్పణభావంతో ఉక్కుముక్కవలె గట్టిపడుతుంది.

"హిందువులు ముస్లిములు అన్నదమ్ములు ; దేశవిభజన అంటే ఆస్తిని అన్నదమ్ములు పంచుకోవటమేగదా ! దీనిలో ఏముంది" అంటూ దేశవిభజనను కొందరు సమర్థిస్తారు. అయితే కన్నతల్లి తమ ఉమ్మడి సొత్తు అని ఆమెను కండకండలుగా నరికే సంతానంగురించి మనం ఎప్పుడైనా విన్నామా ? ఎంతటి ఘోరపతనస్థితి ఇది ! ఇది ధర్మభూమి,

కర్మభూమి, పుణ్యభూమి కాకుండాపోయింది. చివరకు మాతృభూమి కేవలం ఒక పంపిణీవస్తువుగా, ఒక భోగభూమిగా, ఒక సత్రంగా మారిపోయింది. ఇట్టి నీచమైన ఆలోచనల కారణంగానే తల్లిని ముక్కలు చేసుకొన్నాం. లక్షలాది సోదరులనెత్తురు వరదలై పారింది. దేశవిభజనవలన కలిగిన విషఫలితాన్ని అనుభవిస్తూనే ఉన్నాం. కాశ్మీరు చీలికలయింది; నాగాలాండ్‌లోనూ అదే ధోరణి.

## గడ్డిపరకైనా మొలవదు అనే మనస్తత్వం

మనభూభాగాలపై దురాక్రమణగాని, అట్టి బెదిరింపుగాని జరిగినపుడల్లా పోనీలే దాన్ని వదిలివేద్దాం అని తేలిగ్గామాట్లాడే వ్యక్తులకు మన దేశంలో కొదువలేదు. చైనీయులు లద్దాఖ్‌లోని కొంతభాగాన్ని ఆక్రమించి కూర్చుంటే "పోనిద్దూ! అక్కడ ఒక్కగడ్డిపరకైనా మొలవదు'' అని అన్నారు. కొద్దికాలంక్రితం నేఫా (ఇప్పటి అరుణాచలప్రదేశ్) గురించి ఒక కుటిల ప్రచారం జరిగింది. నేఫా నివాసయోగ్యము కాదని, పాములపుట్ట అనీ, అక్కడి జలగలు మన సైనికాధికారుల గొంతుల్లోకికూడా దూరి వారి రక్తం పీల్చివేస్తాయనీ, ప్రచారం జరిగింది. ప్రజల్లో దేశభక్తి కల్గించవలసిన వార్తాపత్రికలుకూడా దీనికి ప్రాముఖ్యం ఇచ్చాయి. దానివల్ల ప్రజల్లో మన భూభాగాలపట్ల విరక్తి పుడుతుంది.

'కచ్ బాడవ' విషయంలోకూడా ఇట్లాగే జరిగింది. అక్కడి కీలకస్థానాలపై దురాక్రమణ జరిగినపుడు ఆందోళనకరమైన వార్తలతో పాటు, ఆప్రాంతాన్ని గురించిన తుచ్ఛమైన వర్ణనలుగూడా మన పత్రికల్లో కనుపించసాగాయి. ఈసందర్భంలో ప్రభుత్వం ప్రకటించిన కరపత్రంలో కూడా, కచ్ భూభాగం గడ్డిపరకైనా మొలవని మరుభూమి అని, సంవత్సరంలో ఎక్కువకాలం సముద్రపునీటిలో మునిగి ఉంటుందని, కాబట్టి నిరుపయోగమని, ఎప్పుడూ ఈగలు ముసిరిఉంటాయనీ, కనీసం కొన్ని

ఈగలైన మ్రింగకుండా, అక్కడ గుక్కెడు నీళ్ల త్రాగటంకూడా కష్టమని-ఇంకా ఇటువంటి అనేకవర్ణనలున్నాయి.

సామాన్యప్రజానీకం కిమ్మనకుండ. శత్రువులు ఆయాభూభాగాలను కబళించేందుకు అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించడానికి బహుశః ఇది ఒక పన్నాగమేమోనని పై రెండు ఉదంతాలను పోల్చి చూచినపుడు అనిపిస్తుంది. ముందుచూపులేనికారణంగా అట్టివార్తలు బహుశః ప్రచారమై ఉండవచ్చు. అది మరీప్రమాదం. ఎందుకంటే, ఎవడైనా ముందుచూపు తోనే ఆపని చేస్తే, ఆతనిది వక్రబుద్ధి అనిమాత్రమే అనవచ్చు. కాని సహజంగా చేస్తే, ఆతని హృదయాంతరాల్లో మాతృభూమిపట్ల మమత నశించిపోయిందని అవగతమవుతుంది.

వేలాదిమైళ్ళు చైనా ఆక్రమించుకుంటే మన నాయకులు అది చిన్న సరిహద్దు తగాదాఅని సర్దిచెప్పారు. వట్టి మంచుగుట్టల్లో పదిమైళ్ళు అటైనా ఇటైనా పోయేదేమీలేదని మన నాయకులు అంటున్నారు. అంటే వేలకొలది మైళ్ళు పోయేది ఇటు; ఒక్కమైలుగూడా పోనిది అటు-అని అర్థం. పైగా ఆ సరిహద్దురేఖ 'నికరంగా ఇది అని చెప్పలేం' అని మన నాయకులే అన్నారు. ఒకసారి పండితనెహ్రూ చైనీయులు ఆక్రమించిన మన భూభాగాన్ని గురించి మాట్లాడుతూ 'మనది అని మనమనుకొనేభూమి' అని ప్రయోగించారు.

## లక్ష్యాన్ని ఉజ్జ్వలంగా ఉంచుకోవాలి

మాతృభూమి సమగ్రతను సంరక్షించడంకోసం ప్రజలు ఎంతగానో పాటుపడాలి. కాని వారికి స్ఫూర్తిని ప్రసాదించే సమగ్ర మాతృదర్శనం కొరవడటం శోచనీయం. దురాక్రమణ జరిగితేచాలు, భూభాగాన్ని ధారాదత్తం చేసే మన స్తత్వం మననాయకులది. దురాక్రమణ జరిగింది అన్న విషయమే మనం మరచిపోతున్నాం. పవిత్ర కైలాసశిఖరం, మానససరోవరాలను

దర్శించే అవకాశంగూడా మనకులేకుండా పోయిందని, హిందు అన్న పేరు మనకు, మనదేశానికి రావడానికి కారణమైన సింధునదిలో స్నానంచేయలేమని -ఇది అవమానమని ఎంతమంది భావిస్తున్నారు? ఒకనాడు హిందూభావ ప్రసార కేంద్రమైన తక్షశిల మనకేది? హిరణ్యకశిపునిబారినుండి ప్రహ్లాదుణ్ణి సంరక్షించేందుకు ఉగ్రనారసింహుడవతరించిన మూలస్థానం [ముల్తాన్] ఈనాడు మళ్ళీ రాకాసిమూకల ఇనుప పాదాలక్రింద అణగారిపోతోంది. వీటి జ్ఞాపకాలవల్ల మన నెత్తురు ఉడుకెత్తుతోందా?

బాహ్యపరిస్థితులవల్ల మనచూపు మనకబారకుండా, మనస్సు మొద్దుబారకుండా మనలను, తరువాతితరతరాలవారిని కాపాడుకోవాలి. ఈనాడేర్పడ్డ రాజకీయ సరిహద్దులే మన సమగ్ర మాతృభూమియొక్క స్వరూపాన్ని తెలియజేస్తాయి, అని నమ్ముతూ, వాటినే పదేపదే భావించటం ద్వారా మన అంతరాత్మను చంపుకుంటున్నాం. మన మగతనానికి, తెలివితేటలకు ఇది సవాలు! ఒక్కొక్కసారి రాజకీయ ఒత్తిడులవల్ల, యుద్ధాలలోని జయాపజయాల వల్ల దేశం రాజకీయసరిహద్దులు కొంతమార్పు జెందుతుంటాయి. అంత మాత్రాన రాజకీయంగా మనం కోల్పోయిన భూభాగాలు, మనమాతృభూమి లోని భాగాలు కానేకావని దాని అర్థం కాదు.

నిన్నమొన్నటివరకు, మనదేశం యావత్తూ, ఆంగ్లేయులస్వాధీనంలో ఉండలేదా ? అంతకు ముందు మన దేశంలో కొంతభూభాగం ముస్లిముల ఆధీనంలో శతాబ్దాలపాటు ఉండలేదా ? అటువంటప్పుడు, ఆయా సమయాలన్నిటిలో, ఈదేశం మనది కానేకాదని అర్థమా? మరి, పరులపాలనలో ఉన్న ఆయాభాగాలను విముక్తం చేయటానికి మనం పోరాడలేదా ? త్యాగాలు చేయలేదా ? మన ఈ భూమిలోని ప్రతికణము, ఆత్మబలిదానమొనర్చిన అసంఖ్యాకవీరవరులయొక్క, హుతాత్ములయొక్క పునీతరక్తంచేత పవిత్రం కాలేదా ? సంరక్షింపబడలేదా ? ఈనాడు, దురాక్రమణకారులకు – వారు ముస్లిములుకావచ్చు, చైనీయులుకావచ్చు–మనం కోల్పోయినభూభాగాలు

మనవికావు; వాళ్ళదే హక్కు అని మనమంటే వాటిని తిరిగిపొందాలనే ఇచ్ఛనే కోల్పోయామని అర్థం; అవమానాలనే సమ్మానాలుగా భావించేమేరకు మనం దిగజారిపోయి మగతనాన్ని మంటగలిపాం అని అర్థం.

ఈజాతీయ ఆకాంక్ష నశించిపోకుండా జాగ్రత్తపడటం అన్నింటి కంటే ముఖ్యమైన విషయం. పోరాడాలనేవాంఛ, మాతృభూమియొక్క సమగ్రతా స్వాతంత్ర్యాలను సంరక్షించేందుకు సర్వస్వార్పణచేయాలనేఇచ్ఛ నశించిపోతే అది మనజాతియొక్క గౌరవస్వాతంత్ర్యాలకు గొడ్డలిపెట్టు.

మాతృభూమిపట్ల ప్రగాఢము, చైతన్య పూరితము, అచంచలము, ఉజ్జ్వలము ఐన భక్తియే, ఏదేశవాసులకైనాసరే, స్వతంత్రము, సమృద్ధము వైభవోపేతముఐన జాతీయజీవనానికి ఆధారం. మాతృభూమిపట్ల పరమోదాత్తమైనభక్తిభావనకు, మనంవారసులం. ప్రతిహిందువుహృదయం లోనూ, నివురుగప్పుకొనిఉన్న యుగయుగాలనాటి మాతృభక్తి రగుల్కొని పవిత్రజ్వాలలై, మన మాతృభూమిపై జరిగిన ఒకనాటి దురాక్రమణలన్నిటినీ దహించివేయాలి. అప్పుడే అఖండభారతమాతను పునఃప్రతిష్ఠించాలని, మనం కన్నకలలు నిజమవుతాయి.

# 10. మాతృభూమి సంతానం

అనాదికాలంనుంచి హిందువులు అనే పేరుగల సుసంస్కృతమైన ఒక గొప్ప సమాజం ఈ పవిత్రభూమికి పుత్రరూపంగా ఇక్కడ జీవిస్తూఉంది. అయితే 'హిందు' అన్న పేరు ఇతర పేర్లతో పోల్చిచూచినపుడు, క్రొత్తగా పుట్టిందని, అంతేగాక అది విదేశీయులు మనకు పెట్టినపేరనీ కొందరు అభ్యంతరం చెప్పుతూ ఉంటారు; 'హిందు'కు మారుగా 'ఆర్య' 'భారతీయ' అన్న పేర్లు సూచిస్తారు.

## 'హిందు' పదమే ఎందుకు?

'ఆర్య' అన్నది ప్రాచీనమైనది, గర్వించదగ్గది; సందేహంలేదు. కాని వేయిఏండ్లుగా వాడుకలో అదిలేదు. పైగా చారిత్రకపరిశోధనముసుగులో ఆంగ్లేయులు ప్రయోగించిన కృతకమైన ఆర్య, ద్రావిడ విబేధ ప్రచారవిషం మనవారి తలకెక్కింది. విబేధాలకు-ఒకనాటివి, నేటివి-అతీతంగా కాశ్మీరు నుండి కన్యాకుమారివరకు పరివ్యాప్తమైన మనసమాజంయొక్క సమగ్ర స్వరూపాన్ని సాక్షాత్కారంచేసుకొనే మనప్రయత్నానికి ఆర్యశబ్దాన్ని ప్రయోగించడం, మొదటికే మోసం తెస్తుంది.

'భారతీయ' నామంగూడా వైదికకాలంనుండీ వాడుకలోఉన్నదే. పురాణాలుకూడా మనభూమిని 'భారత' అని, మనను 'భారతీయు'లని పేర్కొన్నాయి. నిజానికి 'హిందూ' 'భారతీయ'శబ్దాలు ఒకేభావాన్నివ్యక్తం చేస్తాయి. కాని ఈనాడు 'భారతీయ' పదం గురించిగూడా అపోహలున్నాయి. ఈదేశంలో నివసించే ముస్లిములు, పార్శీలు, క్రైస్తవులు మొదలైన వారందరినీ గుదిగ్రుచ్చిచెప్పే 'ఇండియన్' అనే ఆంగ్లశబ్దానికి అనువాదంగా 'భారతీయ' పదాన్ని వాడుతున్నారు. కనుక ప్రత్యేకంగా మనసమాజాన్ని పేర్కొనదలిస్తే ఈ 'భారతీయ' శబ్దంకూడ మనను పెడత్రోవపట్టిస్తుంది. 'హిందూ' అన్న పదమొక్కటే మనం వ్యక్తంచేయదలచిన అర్థాన్ని సమంగాను, సమగ్రంగాను ప్రకటించగలుగుతుంది.

'హిందు' అన్నపేరు ఈమధ్య పుట్టిందనీ, ఇది మనకు విదేశీయులు పెట్టిన పేరనీ, చెప్పడం చారిత్రికంగా నిజంకాదు. సప్తసింధు-అన్నపేరు విశ్వానికే ఆదిగ్రంథమైన ఋగ్వేదంలో, మన దేశానికి, మన ప్రజలకు విశేషణంగా ఉపయోగింపబడినట్లు మనం చూస్తాం. సంస్కృత భాషలోని 'స' ఒక్కొక్కసారి మన ప్రాకృతభాషలు కొన్నిటిలోను, ఐరోపా భాషల్లో కూడ 'హ' కారంగా మారిపోతుంది అని సువిదితం. ఆ విధంగా మొదట హప్త హిందుగామారి పిదప హిందు అన్నశబ్దం వాడుకలో నిల్చింది. కాబట్టి హిందూ అన్ననామం మనదే; మనం గర్వించదగ్గదే. ఆ తరువాతనే ఇతరులు మనలను ఆ పేరుతో వ్యవహరించటం మొదలుపెట్టినారు.

బృహస్పతి ఆగమశాస్త్రం ప్రకారం హిందూ అన్న పదం హిమాలయములలోని 'హి'వర్ణము, ఇందుసరోవరములోని (దక్షిణ సముద్రం) 'ఇందు' పదములతో కూడి ఏర్పడి మన సంపూర్ణ మాతృభూమిని సూచిస్తున్నది. బృహస్పతి ఆగమం- ఇల్లా చెప్పుతోంది.

"హిమాలయం సమారభ్య యావదిందు సరోవరమ్
తం దేవనిర్మితం దేశం హిందూస్థానం ప్రచక్షతే ॥

[హిమాలయములు మొదలుకొని 'ఇందు' (దక్షిణ) సముద్రమువరకు

వ్యాప్తమగుచూ దేవతలచే నిర్మింపబడిన భూమి హిందుస్థానమని చెప్పబడు చున్నది.]

ముఖ్యంగా గత వేయిసంవత్సరాల ఒడిదుడుకుల్లో 'హిందు' అన్న పేరు మనకు హత్తుకుపోయింది. పృథ్వీరాజు కాలంనుంచి మహా మహులైన, మనరాష్ట్ర నిర్మాతలు, రాజనీతిజ్ఞులు, కవులు, చరిత్రకారులు మనజాతిని, మన ధర్మాన్ని వ్యక్తంచేయటానికి ఈ పేరును స్వీకరించారు. గురుగోవిందుడు, విద్యారణ్యస్వామి, శివాజీవంటి మన స్వాతంత్ర్య యోధు లందరూ, 'హిందు స్వరాజ్యాన్ని' ప్రతిష్ఠించాలని కలలుగన్నవారే వారి జీవితాలు, కార్యాలు, ఆకాంక్షలయొక్క అలిసిపోని స్మృతులు 'హిందూ' అన్న పేరుతో పెనవేసుకొని ఉన్నాయి; మన ఏకత్వం, ఉదాత్తత, విశిష్టతలను సద్యఃస్ఫురణకు తెచ్చేది ఈ శబ్దమే.

హిందూ శబ్దాన్ని వాడితీరాలని మనమంటున్నాం గనుక మనది సంకుచిత దృష్టి అని, మనమీద కొందరు అభాండం వేస్తుంటారు. పండిత నెహ్రూనొకసారి కలసినప్పుడు ఆయనా ఇలాగే అన్నారు. ఆయనేమన్నా రంటే "ఎల్లప్పుడూ హిందూ, హిందూ అంటుంటారెందుకు'. దీనివల్ల నాలుగు గోడలమధ్య కూరుకుపోయి, ప్రపంచంలోని నలుదిశల నుండీ వచ్చే మంచి గాలిని మీరు నిరోధిస్తున్నారు. మనకీ, విశాల విశ్వానికీమధ్య అడ్డు గోడలుండటానికి వీలులేదు. ఈ అడ్డంకులన్నిటినీ కూడా కూలగొట్టాలి". పండిత నెహ్రూ గొప్పవాడే. చాలా ఉద్రేకంగా మాట్లాడారు. నేను శాంత స్వరంతో ఇలా అన్నాను. "నలుదిశల నుండీ శుభ్రమైన గాలి మనకందా లన్న విషయంలో నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రపంచంలో వివిధ దేశాలలో అమల్లో ఉన్న అన్ని సిద్ధాంతాలూ, మనకు తెలియాలి; మంచి చెడులను మనం నిర్ణయించుకోవాలి. ప్రతి మంచి విషయాన్నీ మనం స్వీకరించాలి. దీనికోసమని గోడలే కూల్చేస్తే ఇంటికప్పు నేరుగా నెత్తిమీదే వాలుతుంది. అలా కాదు. కిటికీలు, గుమ్మాలు, తెరిచి అట్టే పెట్టుకోవాలి.

మన ఇల్లు భద్రంగా కాపాడుకోవాలి. విశాల హృదయమనేది సముచితమైన హద్దులు దాటితే మన జాతి అస్తిత్వమే అంతరించిపోతుంది. మీరనే సంకుచితమైన జాతీయభావమే మన జాతిని పునరుద్ధరించగలదు. ప్రపంచంలోని మంచినంతనూ స్వీకరించగలదు కూడా. ఇదీ నా విశ్వాసం. అది విని, "సరే. ఏ దృఢప్రయత్నం చేయాలన్నా ఇటువంటి విశ్వాసం అత్యవసర"మని అంగీకరిస్తున్నానని పండిత నెహ్రూ అన్నారు. ఈ మాత్రమైనా అంగీకరించినందుకు వారికి నేను కృతజ్ఞతను వ్యక్తం చేసాను.

## వికాసానికి గుర్తు

హిందూజీవనాన్ని పరిశీలిద్దాం. కొందరు, ముఖ్యంగా విదేశీయులు మనలోని మతాలు, సంప్రదాయాలు, కులాలు, భాషలు, ఆచారవ్యవహారాలు –వీటి బాహుళ్యాన్నిచూచి తికమకపడి, అడుగుతారు, 'మీలో ఇంతటి వైరుధ్యం ఉన్నదిగదా, మీరెట్లా ఒక్కజాతి కాగల్గుతారు? 'హిందు' అని మీరు చెప్పుకొనే జీవనపద్ధతి ఎక్కడుంది ?' అని.

మన హిందూ జీవనాన్ని పైపైనచూస్తే ఈ ప్రశ్న పుడుతుంది. ఉదాహరణకు చెట్టులో కొమ్మలు, ఆకులు, పూవులు, పండ్లు – అన్నీ పరస్పరంపోలికలేనివే. ప్రకాండము శాఖకాదు; శాఖ పత్రాలుగావు; ఒకదానికీ మరొకదానికీ పోలికేలేదు. కాని పైకికనపడే ఈ వ్యత్యాసాలవంటివన్నీ ఒకే వృక్షంయొక్క విభిన్న వ్యక్తీకరణలనీ, ఒకే జీవనసారం అంతటా ప్రవహిస్తూ, ఆ యా భాగాలనన్నింటినీ పోషిస్తున్నదనీ మనకు తెలుసు. వేలకొలది సంవత్సరాలుగా వికసిస్తూ వచ్చిన మన సమాజజీవనంలో ఏర్పడిన వ్యత్యాసాలు ఇటువంటివే. ఒక చెట్టు విషయంలో ఆకుగాని పూవుగాని ఎట్టివో, మన జాతీయజీవనంలో ఇవన్నీ అటువంటివే. అవి వేర్పాటుకు, విచ్ఛిత్తికి కారణాలుకావు. ఇటువంటి సహజసిద్ధమైన వికాసం మన సమాజజీవనంలోని అనన్య సామాన్య లక్షణం.

వాస్తవానికి ప్రకృతియొక్క యోజనలో జీవపరిణామం ఈ పద్ధతినే అనుసరించిఉంది. తొలిదశలో, జీవి 'అమీబా' అనే ఆకృతిలేనిస్థితిలో ఉంటుంది. అది స్వయంపూర్ణమైన ఏకకణజీవి. అది, సమానరూపంగల రెండుజీవాలుగా, విడిపోగలదు, అదిజీవనాధారపదార్థంయొక్క(ప్రోటోప్లాసమ్) తొలిదశ. అది వికాసక్రమంలో అట్టడుగుమెట్టు. వికాసం వృద్ధిచెందుతున్న కొద్ది, పెరుగుతున్న కర్తవ్యాలను పూర్తిచేయడానికై వేరువేరు అవయవాలతో అనేక జీవజాతులు పుట్టుకొచ్చాయి, చివరకు అత్యంత సంశ్లిష్టమైన యంత్రాంగంతోకూడిన మానవశరీరం రూపొందింది. దానిలో అగణితమైన అవయవాలున్నాయి. ప్రతిదానికి ఒకప్రత్యేకమైన పనిఉంది. అయినప్పటికీ వాటన్నింటినీ కలిపిఉంచే ఏకజీవప్రవాహంఉంది. మానవుడే భూమిపై అత్యుత్తమంగా వికసించినజీవి కాబట్టి, విభిన్నఅవయవాలు లేక వ్యత్యాసాలు అపరిపక్వతనుగాని, వైరుధ్యాన్నిగాని సూచించేవిగాక, బాగా వికసించిన దశను సూచిస్తాయి. పైకి వేరువేరురూపాలుగా ఉన్నప్పటికీ, అవయవాలన్నీ శరీరసంక్షేమానికే యత్నిస్తాయి. దానియొక్కశక్తికి, ప్రగతికి దోహదం చేస్తాయి.

## నిరుపమాన చిత్రం

సమాజం స్థితికూడ ఇటువంటిదే. వికసితసమాజం వివిధ కర్తవ్యాలను చక్కగా నిర్వహించుకొనేందుకుగాను విభిన్నవృత్తులుగల అనేకవర్గాలను రూపొందించుకొంటుంది. మన ప్రాచీన సామాజికవ్యవస్థ అట్టి ప్రతివర్గానికి ఒక నిర్దిష్ట కర్తవ్యాన్ని ఏర్పరిచింది. మెదడు శరీరంలోని అవయవాల యొక్క విధులను నిర్దేశించినట్లుగానే, అది వర్గాలన్నింటికీ, వ్యక్తులందరికీ వారియొక్క సహజమైన వికాసానికి మార్గం చూపింది. సమాజమనే విరాట్‌పురుషుని అత్యుత్తమంగా సేవించడంలోనే వ్యక్తి వికాసానికి సంపూర్ణమైన అవకాశంగూడ ఇమిడి ఉంది. అటువంటి సంశ్లిష్టము,

సంఘటితమున్నైన సమాజ వ్యవస్థను, ఆచరణయోగ్యమైన ఆదర్శంగా మనం స్వీకరించాం; దాన్ని మన జీవితాల్లో సాక్షాత్కరించుకోవాలని యత్నించాం. ఇది దూరంనుంచిచూస్తే. దిగ్భ్రాంతిని కలిగించేంతటి వైరుధ్యం; కాని వాస్తవానికి ప్రపంచం మొత్తంలో కనీ వినీ ఎరుగనంతటి అత్యున్నత వికాసం చెందిన ఒక సమాజస్థితిని అది సూచిస్తుంది.

కాని, విదేశీవాదాలు (ఇజములు) అవి కల్పించే 'సమానత' వంటి డాబుసరి నినాదాలకళ్ళద్దాలతో చూడటానికి అలవాటుపడ్డ ఆధునికులు మనసమాజంలోని ఈ అసామాన్య లక్షణాన్ని అర్థంచేసుకోలేక, మనజీవనం లోని వైవిధ్యమే మన విఘటనకు కారణమనీ, కనుక దాన్ని నాశనం చేయాలనీ, మనం ఒక వర్గరహితసమాజంగా రూపొందాలనీ గోలపెడు తుంటారు. శరీరంలోని వివిధావయవాలు, వాటివాటి విధుల్ని నిర్వహించ డానికి అనువుగా, వివిధరూపాల్ని పొందితే, వాటిని "విభిన్నవర్గాలు"గా భావించి, నిర్మూలించి, శరీరాన్ని ఒక "వర్గరహిత" వస్తువుగా చేయవలసిందేనా ? మనం అట్లా చేస్తే అది వికాసం అవుతుందా ? హత్య అవుతుందా ?

'భిన్నత్వంలో ఏకత్వం' అనే అనన్యసామాన్యలక్షణం మనసమాజ జీవనంలోని అన్నిరంగాలలోనూ, భౌతికంగా, ఆధ్యాత్మికంగాకూడా స్వయం ప్రకటితమైంది. నలుప్రక్కలా రంగురంగుల అద్దాలుఅమర్చిన ప్రకాశవంత మైన దీపంలాంటి దది. పైనుంచిచూచేవానికి ఏ రంగుఅద్దంలోంచిచూస్తే ఆ రంగుగా లోపలిదీపం కన్పిస్తుంది; చూచేకోణాన్నిబట్టి లోనిదీపం విభిన్నవర్ణాలు తాలుస్తుంటుంది. ఇట్టి అద్భుతమైన విభిన్నస్వరూపప్రకటన చూచి, కొందరు మనది ఒక సమాజంకాదనీ, ఒకజాతి కాదనీ, ఇది అనేక జాతులు నివసిస్తున్న దేశమనీ అంటారు.

మనసమాజజీవితాన్ని, సరిగాఅర్థంచేసుకోవటం ప్రారంభిస్తే, నేడున్న వివిధరోగాలను విశ్లేషణచేసి వాటిని కుదిర్చేందుకు ఉపాయాలనుకూడ కనిపెట్టగలం.

## ఏకం సత్ విప్రా బహుధా వదన్తి

పుష్పక విమానంలాంటి సహృదయత కలిగిన మనధర్మంయొక్క పరిధిలో ఒదిగిఉన్న వైష్ణవ, శాక్తేయ, వైదిక, భౌద్ధ, జైన, సిక్కు లింగాయత, ఆర్యసమాజాలవంటి రకరకాలపంథల, ఉపపంథల బాహుళ్యమే వెలుపలినుండి చూచేవానికి ముందుగా కనబడి, వానికి దిగ్భ్రాంతి కల్గిస్తుంది. ప్రజల్లోని విభిన్న అభిరుచులకు అనుకూలంగా, విభిన్న ఉపాసనా మార్గాలను మన ఆచార్యశ్రేష్ఠులు, పంథప్రవర్తకులు ఏర్పాటుచేసినారు. బ్రహ్మ, ఆత్మ, శివుడు, విష్ణువు, ఈశ్వరుడు, (చివరకు) శూన్యం లేక మహాశూన్యం–ఇత్యాది అనేకనామాలతో చెప్పబడే ఒకే పరమసత్యాన్ని సాక్షాత్కరించుకోవటమే అంతిమలక్ష్యమని, వారందరూ తేల్చిచెప్పినారు.

క్రింది శ్లోకం, హిందూత్వంలోని వివిధపంథలయొక్క, దర్శనాల యొక్క సమరసతను, ఏకత్వాన్ని, ఎంతసుందరంగా చెప్తున్నదో చూడండి.

*యంశైవాః సముపాసతే శివ ఇతి, బ్రహ్మేతివేదాన్తినో,*
*భౌద్ధా బుద్ధ ఇతి, ప్రమాణపటవః కర్తేతి నైయ్యాయికాః ।*
*అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః*
*సోఽయం వో విదధాతు, వాంఛితఫలం త్రైలోక్యనాథోహరిః ॥*

(ఎవనిని శైవులు శివుడని, వేదాంతులు బ్రహ్మయని, బౌద్ధులు బుద్ధుడని నైయ్యాయికులు కర్తయని, జైనులు అర్హతుడని, మీమాంసకులు కర్మయని సేవిస్తూన్నారో అట్టి ముల్లోకములకు ప్రభువగు 'హరి' మన కోర్కెలను తీర్చుగాక!)

సంత్ తులసీదాస్ జీవితంలోని ఒక ఉదంతం మనకు కనువిప్పు కలిగించగలదు. ఆయన ఆరాధ్య దైవం శ్రీరాముడు. ఒకసారి ప్రజానీకం ఆయనను శ్రీకృష్ణ మందిరానికి తీసుకెళ్ళారు. ఆ విగ్రహం ముందు ఆ సాధుమూర్తి ఏ సంచలనం లేకుండా నిలబడ్డాడు. చివరకు ఆయన శ్రీకృష్ణుని ఇలా స్తుతించాడు:-

కాహె వరణౌ భవి అప కీ భలే విరాజత నాథ ।
తులసీ మస్తక్ తబ్ నవై ధనుష బాణ లేఉ హాథ ॥

"దేదీప్యమానమైన నీ అవయవ శోభను నేనెట్లు వర్ణింపగలను? నీవు నిజంగా ఉదాత్త గంభీరంగా అలరారుతున్నావు. అయినా– నీవు ధనుర్బాణాలు ధరించినప్పుడు మాత్రమే ఈ తులసి నీకు తలవంచి నమస్కరిస్తాడు." వెంటనే ఆ శ్రీకృష్ణ విగ్రహం— ఆయన కోరుకున్నరీతిగా— కోదండధారియైన శ్రీరామ విగ్రహంగా మారిపోయిందని చెప్పబడింది.

శరీరతత్వంవలెనే ప్రతిఒక్కరికి ఒక విశిష్టమైన ఆధ్యాత్మికతత్త్వం ఉంటుంది. దాని కనుగుణమైన ఆధ్యాత్మికాహారాన్ని ఎంచుకొనేందుకు ఇచ్చిన స్వేచ్ఛ అది; వ్యక్తిగతమైన ఉపాసనా స్వాతంత్ర్యం అది.

అయితే ఆరాధనా పద్ధతులలోని భిన్నత, సమాజంలోని చీలికలను సూచించదు. సమాజాన్ని కలిపిఉంచిన ఒకే సామాన్యధర్మంయొక్క అవిభక్త అంగాలే ఇవన్నీ. మన సమాజంయొక్క ఇట్టి అవయవాలన్నిటిలోను అదే జీవిత తత్త్వదర్శనం, అదే లక్ష్యం, స్థూలప్రపంచపు బాహ్య విశిష్టతకంటె అంతశ్చేతన యొక్క సర్వాధిక్యంలో విశ్వాసం పునర్జన్మపట్ల అదే విశ్వాసం. బ్రహ్మచర్యం, సత్యం, మొదలైన కొన్ని సద్గుణాలపట్ల అదే పూజ్యత, అవే పవిత్ర సంస్కారాలు–క్లుప్తంగా చెప్పాలంటే అదే జీవనరసం ప్రవహిస్తూంది. కేవలఅద్వైతాన్ని ప్రవచించిన శ్రీ శంకరాచార్యుడే– సామాన్య మానవునికొరకు ఆదిత్యుడు, అంబ, విష్ణువు, గణనాథుడు మహేశ్వరుడు–అనే దేవతలను ఆరాధించే పంచాయతనపద్ధతిని నిర్దేశించాడు.

భగవత్సాక్షాత్కారానికి సూచించిన భిన్నమార్గాల మధ్యగల సామ రస్యానికి ఎంత భవ్యమైన ఉదాహరణ ఇది; ఆరాధనా పద్ధతులలోని విభిన్నత, మనప్రజలలో గతంలో ఎన్నడూ రక్తపాతాన్నిగాని, నీచ మైన స్పర్ధలనుగాని, సృష్టించలేదు. మనవారు తమ సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించ టానికి యత్నించేటప్పుడుగాని, ఇతరుల సిద్ధాంతాన్ని ఖండించేటప్పుడుగాని, ఎవ్వడూ తలలు పగలగొట్టుకోవటం జరుగలేదు. ఇట్టి లోతైన ఆంతరిక సమైక్యతాప్రవాహం, శివమహిమ్నస్తోత్రశ్లోకంలో చక్కగా వర్ణింపబడింది.

*త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం, వైష్ణవమితి*
*ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।*
*రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం*
*నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥*

(జలానికంతకు సముద్రంవలె, మానవులందరకూ నీవే చేరుకోవలసిన లక్ష్యమవు. సూటిగాను, వక్రంగాను ఉండే వివిధమార్గాలను అవలంబించే మానవులు వారివారి విభిన్న రుచులనుబట్టి, వైదికం, సాంఖ్యం, యోగం, శైవం, వైష్ణవం మొదలైన అనేకమార్గాల్లో ఇది శ్రేష్ఠమైనదని, అది యోగ్యమైనదని యోచించుకొని, అనుష్ఠిస్తారు.)

వేదకాలంనుంచి, నేటివరకుకూడ ఇదే మన సంప్రదాయం. మన ఆధ్యాత్మిక ఆచార్యులందరూ, మన ధర్మంయొక్క సర్వవ్యాపకము అద్వితీయమునైన స్వరూపాన్ని నిలబెట్టుకొంటూ వచ్చినారు. శ్రీరామకృష్ణ పరమహంస "ఎన్నికన్నులో, అన్ని తెన్నులు" అని వక్కాణించినారు. వ్యక్తుల స్వభావాలు, అభిరుచులు ఎన్నివిధాలుగా ఉంటే, అన్నిపంథలు అన్నిమతాలు ఉండవచ్చు.

ఇట్టి అనేకపంథలు, అనేక దర్శనాలు ఏర్పడటం మనకు మరొక ప్రయోజనాన్ని సమకూర్చింది. మనసమాజాన్ని సంరక్షించటానికి అఖండంగా

ఉంచుకోవటానికి ఇవి సహాయపడ్డాయి. ఉదాహరణకు సిక్కు సంప్రదాయం పంజాబు ప్రాంతంలో, ఇస్లాం వ్యాప్తిని అరికట్టటానికై జన్మించింది. తరువాత రోజుల్లో, ఆనాటి అవసరాలను గుర్తించి సిక్కులకు పదియవ గురువైన గురుగోవిందసింహ్ తన శిష్యులను శస్త్రధారులను చేసి వారిని ఒక జాతీయవీరబృందంగా మార్చినాడు. పశ్చిమతీర ప్రాంతంలో క్రైస్తవ పాదరీలు, సంపూర్ణదయాస్వరూపుడైన తమ సాకారదైవము పేర ప్రజలను తమ మతంలోకి చేర్చుకోవాలని యత్నిస్తున్న కాలంలో, అట్టి విదేశీవిషాన్ని విరుగగొట్టే ఉద్దేశ్యంతో మన ధర్మంలోని భక్తిభావనను శ్రీ మధ్వాచార్యులు ప్రబోధించినారు. రామానుజాచార్య, బసవేశ్వరుల ప్రయత్నాలుకూడ, మన ప్రజలలో ప్రవేశించిన ఉచ్చ నీచ భావనలను తొలగించి, ప్రజలను దైవభక్తి సూత్రబద్ధులనుచేసి సమైక్యంచేసే ప్రేరణవలన ఏర్పడ్డవే.

## సెమిటిక్ జాతుల ప్రభావం

మనధర్మంలోని ఈ సర్వగ్రాహకలక్షణం మన దృష్టిపథంనుండి ఈనాడు తొలగిపోవడం మన దురదృష్టం. ఇట్టి దయనీయమైన పరిస్థితికి అనేక కారణాలున్నాయి. మతాన్నిగురించి పాశ్చాత్యుల్లోగల సంకుచిత భావనయొక్క ప్రభావం మనపై పడ్డట్లుంది. యూదుమతం, క్రైస్తవం ఇస్లాం—ఈ సెమిటిక్ మతాలన్నింటిలోనూ ఒకేఒక ఉపాసనామార్గం అందరికీ విధించారు. ఆ మతాలలో ఉండేది ఒకేప్రవక్త, ఒకే పవిత్రగ్రంథం, ఒకే దైవం. జీవునకు అంతకన్న వేరే మోక్షమార్గం లేదు. అట్టి ప్రతిపాదనలోని అసామంజస్యాన్ని గుర్తించటానికి పెద్ద తెలివితేటలేమీ అవసరంలేదు. మతం విషయంలో సెమిటిక్ జాతులకు ఉన్న ఇట్టిభావనవల్ల అసహనం ఏర్పడటం సహజం. ఆ అసహనమే, మతంపేరట ప్రజను విభజించింది. అటువంటి మతమౌఢ్యంవల్ల కలిగిన విద్వేషాలకు విసుగుచెందిన కొన్ని పాశ్చాత్యదేశాలు అసలు ధర్మాన్నే సమూలంగా నాశనంచేయాలనే తీవ్ర

నిర్ణయానికి వచ్చాయి. రష్యా స్వీకరించిన సామ్యవాద సమాజవాద తత్త్వాలు ఇట్టి తీవ్ర విప్లవానికి ఉదాహరణలు.

దీని ప్రభావం మనదేశంపైకూడా కనిపించింది. పంథలమధ్య సంకుచిత విరోధ భావనలు ఇచ్చట ఎన్నడూ లేవనే విషయం ప్రజలు మరచిపోయినారు. పాశ్చాత్యదేశాల్లోని పరిణామాలనన్నిటినీ గ్రుడ్డిగా అనుకరిస్తూ మనవారుకూడ, తమ జీవితాలలో, ధర్మానికి స్థానమీయక అవహేళన చేయసాగినారు. దానివల్ల ప్రజలను కలిపిఉంచి, ఉన్నతమైన జీవితాన్ని గడిపేందుకు వారిని ప్రేరేపించే స్నిగ్ధాలైన అనుబంధాలు తెగిపోయాయి.

## నేటి వికృతస్థితి

దీని వినాశకర పరిణామాలను ఈనాడు మనం అనుభవిస్తున్నాం. ఒకరినొకరు అవహేళన చేసుకోవటం వాడుకలోని ఛలోక్తిగా దేశమంతటా వ్యాపించిపోయింది. ఒక సంప్రదాయం వేరొక సంప్రదాయంపై నెరపే 'ఆధిపత్యము', 'సామ్రాజ్యవాదము'-ఇటువంటిమాటలు వినబడుతున్నాయి. "పెత్తనం" చెలాయించటంవంటి మాటలు ఉపయోగించవలసివస్తే ఉత్తరభారతం దక్షిణదేశ దార్శనికసిద్ధాంతాల సామ్రాజ్యవాదంక్రింద నలిగిపోతోందని చెప్పవలసి ఉంటుంది. ఎందుకంటే మనదేశమంతటా-చివరకు ఉత్తరదిశలోని మారుమూలలవరకు - వ్యాపించిన ముఖ్యదార్శనికసిద్ధాంతాలన్నీ దక్షిణదేశానికి చెందిన శ్రేష్ఠులైన ఆచార్యులచేతనే స్థాపించబడ్డాయి. సాటిలేని అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన శంకరుడు, విశిష్టాద్వైత భక్తిపారవశ్యాన్ని ప్రచారమొనర్చిన రామానుజుడు, జీవేశ్వరుల ద్వైతాన్ని గూర్చిన ఉదాత్తభావనను అందించిన మధ్వాచార్యులు, ఈవిశ్వమంతనూ ఈశ్వరుని పరమానందమయ స్వరూపంగా చూచిన వల్లభుడు-వీరందరూ దాక్షిణాత్యులే. కాబట్టి ఆధ్యాత్మికంగా దక్షిణభారతంసమస్తదేశంమీదా తన

ప్రభుత్వం నెరపుతోందని చెప్పాలా? ఎంతటి అసంగతమైన విషయమిది? నాతల నాకాళ్ళపై అధికారం చెలాయిస్తున్నదా? అవిరెండూకూడా ఒకే శరీరంలోని సమానభాగాలు కాదా ?

దక్షిణమనబడేది మనకు ఎంతటి ప్రీతికరమైనభాగమో, భౌగోళికంగా ఉత్తరమనిపిలువబడేదికూడ మనకంత ప్రీతికరమే. కావేరిఎంతపవిత్రమైనదో గంగకూడా అంతపవిత్రమైనదే. హిమాలయ గుహలో ఏర్పడ్డ అమరనాథ్ హిమలింగం, రామేశ్వర సైకతలింగం-రెండింటి ఎడ మనభక్తి సమానమే. దూరం, మతం, సంప్రదాయంవంటి పైపైఅడ్డంకులన్నిటికి అతీతంగా మనమంతా ఆంతరంగికంగా ఒక్కటే. ఇట్టి ఏకతాజీవరసం క్షీణిస్తోంది . కాబట్టే,ఈనాడు ధర్మతరువుయొక్క విభిన్నశాఖలు ఎండిపోతున్నాయి.

రెండవ విషయమేమంటే, సమగ్రమైన మన 'ధర్మము'ను సూచించే 'హిందూ'నామం, ఈనాడు అపఖ్యాతిపాలై, హిందువులమని చెప్పకోవటానికి మనవారు సిగ్గుపడుతున్నారు. ఆవిధంగా, వివిధ ఆధ్యాత్మికకాంతులను వెదజల్లే ఈముత్యాలన్నిటినీ గ్రుచ్చిఉంచిన హిందుత్వ సువర్ణసూత్రం తెగిపోయింది. వివిధ మతాలు, సంప్రదాయాలు, తమతమ ప్రత్యేక నామధేయాలపట్ల అభిమానాన్ని, గర్వాన్ని పెంచుకొని తమను హైందవేతరులుగా ప్రచారంచేసుకొంటున్నాయి.

సిక్ఖులు, జైనులు, లింగాయతులు, ఆర్యసమాజీయులు- వీరిలో కొందరు తాము హిందువులం కామని చెప్పకొంటూఉంటారు. సిక్ఖ్ పంథకు ప్రత్యేకరాష్ట్రంకోసం - అయితే భాషాప్రయుక్తప్రాంతం బురఖాక్రింద- పంజాబీసుబాకావాలని కొందరు ప్రముఖసిక్ఖ్‌నాయకులు ఆందోళనచేస్తున్నారు. ఆకోర్కెను సమర్థించుకొనేందుకై వారిలో కొందరు ప్రత్యేకముస్లింరాజ్యాన్ని

అంటే, పాకిస్తాన్ ఏర్పాటుకు సమర్థించే నీచస్థాయికికూడా దిగజారిపోయారు. దేశవిభజనసమయంలో పాకిస్తానీయులచేతుల్లో వారనుభవించిన కిరాతకాలను అవమానాలనుకూడా మరచిపోయి, నేడు ఆ పాకిస్తాన్‌యొక్క సానుభూతిని, సాహాయ్యాన్ని ఆశించేంతవరకు పోయారు. దుష్టశక్తుల దురాక్రమణనుండి సమాజాన్నిరక్షించేందుకు పుట్టింది ఉత్కృష్ట సిక్ఖ్‌సంప్రదాయం. మనదేశాన్ని ధర్మాన్ని నాశనంచేయ ప్రతినబూనిన ఆ దుష్టశక్తులనే తమతో సమానంగా భావించుకోవటమేగాక. వారినుండి సాహాయ్యాన్ని ఈనాటి సిక్ఖ్‌నాయకులు కోరుతున్నారంటే ఇంతకన్న దురదృష్టం వేరొకటి ఉంటుందా ?

సిక్ఖులలోని నామ్‌ధారీపంథ అధినేత ఒకసారి మాట్లాడుతూ "నిష్ఠావంతుడైన హిందువుకానివాడు సిక్ఖ్ కాలేడు. అంతేకాక తమ మాతృసమాజం, మాతృధర్మాలకోసం - అంటే హిందూసమాజం, హిందూధర్మాలకోసం - తమరక్తాన్ని ధారపోసిన మహాగురుపరంపరకు శిష్యుడుకూడా కాలేడు" అన్నాడు. గురుగోవిందసింహ్ "వేదాల్లో, భగవద్గీతలో విశ్వాసముండి, రామ కృష్ణులను అర్చించేవాడే నిజమైన సిక్ఖ్'' అన్నాడు. గురుదేవుల ఈవాక్యంపట్ల సంపూర్ణ శ్రద్ధ ఉంటేనే నిజమైనసిక్ఖు అవుతాడు. హిందూ సమాజాన్ని సంరక్షించేందుకై గురువులు అటువంటిదళాన్ని సమీకరించి, వారు నిష్ఠావంతులైన శిష్యులు కాబట్టి సిక్ఖులన్నపేరు, శీలవంతులు. పరాక్రమవంతులు గాబట్టి 'ఖాల్సా' అన్నపేరు, కాలానికి అతీతమైనసత్యాన్ని విశ్వసించేవారుకాబట్టి 'అకాలీ' అన్నపేరు వారికి పెట్టినారు.

వాస్తవానికి, ఈనాటికికూడా, వారిజీవితమంతా ఇతర హిందువుల భావాలతో, అనుభూతులతో మాత్రమే పరివ్యాప్తమై ఉంది. నిన్నమొన్నటి వరకు-ఇరవై ఏండ్ల క్రితంవరకు కూడా - ప్రతి హిందూకుటుంబంలోనుంచీ ఒక పుత్రుణ్ణి సిక్ఖుచేసే ఆచారం ఉండేది. ఈనాటికికూడా రక్తసంబంధాలు కొనసాగుతూనే ఉన్నాయి. పరాక్రమవంతము, శ్రద్ధామహితము అయిన

సిక్ఖ్ సంప్రదాయం, నిజానికి హిందూధర్మానికి ఖడ్గపాణి అయిన బాహువే. అయితే రాజకీయ దురాశావిషం ప్రవేశించినందువల్ల, ఇందులోకూడా వేర్పాటుధోరణిభూతం పుట్టింది.

## హిందూవ్యతిరేక ప్రభుత్వం

నేటి వ్యవహారాలను నడిపించే మహానాయకులుకూడా తమకు తెలియకుండానే సిక్ఖులయొక్క అతిప్రమాదకరమైన వేర్పాటుధోరణికి లొంగిపోయారు. "హిందువులు, సిక్ఖులు" స్నేహంతోనూ, సమైక్యంతోనూ జీవించాలని కోరుతూ ప్రకటనలుచేయటం తరచు వింటూఉంటాం. సిక్ఖులు మిగిలిన హిందువులు వేరువేరు, అనేఅభిప్రాయానికి తమ ఆమోదముద్రను వేసేటువంటివి ఇట్టిపదాలు. అంత ఉన్నతపదవులలో ఉన్నవారు ఇట్లా ప్రకటించటం, సిక్ఖులకు తదితర హిందువులకుమధ్య సంబంధవ్యవహారాలను మరింత కటువుగా చేస్తుందని వారికి తోచటంలేదు. సిక్ఖు, జైన, బౌద్ధ సంప్రదాయాలు హిందూపదంలోని అంతర్భాగాలే అని రాజ్యాంగంలో స్పష్టంగా వ్రాసిఉంది. కాబట్టి హిందువులు, సిక్ఖులు వేరని సూచించే పదప్రయోగం రాజ్యాంగవిరుద్ధం అవుతుంది. ఉన్నత స్థాయిలోని వ్యక్తులుకూడా తెలియకుండానే మనరాజ్యాంగాన్ని ఇట్లా అవమానిస్తున్నారు.

అదేవిధంగా హరిజన సేవాసంఘం ప్రచురించిన కరపత్రంలో "హిందువులు మరియు హరిజనులు" అను పదజాలం స్వేచ్ఛగా ఉపయోగింపబడింది.

తమకు ప్రత్యేకమైన జైనఅనుశాసనం ఉంది కనుక తమను హిందువులనుగా ఏలా పరిగణించుకోగలుగుతామని కొందరు జైనసోదరులు నన్నడిగారు. జైన సంప్రదాయానికి చెందిన ఒక గొప్ప ఆచార్యుని ఈ ప్రశ్నే వేసాను నేను. వారి సమాధానం చెప్పారు:—

"వేదాలు నిరుపమాన విజ్ఞాన భండారాలు. అన్ని విశ్వాసాలకీ అందులో తావుంది. కొందరికి రజోగుణ ప్రధానమైన విశ్వాసం, మరి కొందరికి తమోగుణ ప్రధానమైన విశ్వాసం తగిఉంటాయి. వేదమాత ఎవరినీ ఆధ్యాత్మిక ప్రగతి నీకందదని శపించలేదు. తన సహజమైన భావనలు ఆలంబనంగా ముందుకు సాగడానికీ, నిస్సంకోచంగా పురోగమించటానికీ ఋషులు వేదాలలో బాటలు వేసారు. అత్యంత సాత్విక స్వభావం కలిగినవారికి గూడా వేదమాత దారి చూపుతోంది. జైన సంప్రదాయం అట్టి సూత్రాలాధారంగా పురోగమించింది. న్యాయానికి హిందు సమాజాన్ని అధికాధికంగా సత్వగుణ సంపన్నం చేయటానికే జైన సంప్రదాయం ఏర్పడింది." జ్ఞానదీక్షితులు వెదజల్లే ముచ్చటైన మరొక మాట గూడా సెలవిచ్చారు. "నేను హిందువును కాదు" అనేవాడు అసలు జైనుడేమిటి?"

మన సంప్రదాయాలకూ, ఉపసంప్రదాయాలకూ చెందిన సంకుచిత విధేయతలూ, పరస్పర వైషమ్యాలూ, అసభ్యమైన రూపాలు ధరించి మనల్ని ప్రపంచం దృష్టిలో నవ్వులపాలు చేసాయి. కొన్నేళ్ళ క్రిందట ఒక దేవాలయం ఏనుగుకి ఏ రకమైన 'నామం' పెట్టాలా? అని (Ψ లేక W అని) ఒకే సంప్రదాయానికి చెందిన రెండు శాఖలవారు తగాదా పడి, ఒక్కొక్క న్యాయస్థానంలోనే వ్యాజ్యాలాడుకుంటూ, హైకోర్టులకెక్కుతూ క్రమంగా ఇంగ్లండులోని 'ప్రీవీ కౌన్సిల్' దాకా వెళ్ళారు. ఈలోపుగా సదరు ఏనుగు కాలధర్మం చేసింది కనుక, ఆ చనిపోయిన ఏనుగుకు ఏ నామం పెట్టాలన్న ప్రశ్నే ఉదయించదు కాబట్టి న్యాయస్థానం నిర్ణయించవలసిన దిందులో లేదూ అని ప్రీవీ కౌన్సిల్ నిర్ణయించింది.

అసలు దౌర్భాగ్యమేమిటంటే, ఇటువంటి ఈ చెత్తంతా 'ధర్మం' పేరున చెలామణీ అవుతూ వుంటుంది. ఇన్ని వికారాలు చూచిన తర్వాత ప్రజానీకానికి, అసలు ధర్మంలోనే విశ్వాసం నశిస్తే ఆశ్చర్యమేముంది? ఇది 'ధర్మం' తప్పు గాదు. మన తప్పు. 'ధర్మం' అగ్నిలాంటిది. అది ఒక మహాశక్తి నిలయం. అది పొయ్యిలో వుండి చక్కగా ఆహారాన్ని

వండగలదు, అలాగే ఒక ఇంటిని బూడిద బుగ్గి చేయగలదు. అట్లాగే 'ధర్మం' కూడా, శక్తికీ ఐకమత్యానికీ ప్రాచీన కాలంలో కేంద్రం కాగలిగింది; మరి నేటి కాలంలో అదే వివాదానికీ, విఘటనకూ నిలయమై పోయింది.

ప్రస్తుత ప్రభుత్వవిధానం అగ్నిలో ఆజ్యంపోసింది. నేటి మన పాలకులకు 'హిందూ' అన్నపదం వింటేనే కంపరం పుడుతుంది. హిందూ సమాజంనుండి తెగత్రెంపులు చేసుకొంటూ, తమను హైందవేతరమైన అల్పసంఖ్యాకవర్గంగా ప్రదర్శించుకొనేవారందరికీ మన ప్రభుత్వంయొక్క ప్రత్యేకఅనుగ్రహం లభిస్తూ ఉంటుంది. దీనివల్ల మనలోని అనేక సంప్రదాయాలవారు తాము హైందవేతరులమని చెప్పుకునేందుకు పోటీలుపడి అధికారం, సంపదల పంపిణీలో తమకు ప్రత్యేక సదుపాయాలు కల్పింపబడాలని కోరుతూ అర్జులు వ్రాస్తున్నారు. దానికితోడు మన నాయకులు హైందవేతరులకు హిందూవ్యతిరేకవర్గాలకు ప్రత్యేకమైన రాజకీయప్రతిపత్తి నియ్యటంమూచి, వేర్పాటు ధోరణి, హిందూవ్యతిరేకభావనా మరింత పెచ్చుపెరుగుతున్నవి. హైందవేతరులుగా ఉన్నందుచేతనే ముస్లింలు ఒక ప్రత్యేకరాజ్యం పొందగలిగినారని వారికి తెలుసు. క్రైస్తవులు గూడా స్వతంత్ర 'నాగాల్యాండ్' సాధించుకొనేందుకు సిద్ధంగా ఉన్నారు. ఈనాటికిగూడ ఆగస్టు 15 వ తేదీన బ్రిటిష్‌జెండా ఎగురవేస్తూ మతోన్మాద ప్రచారం చేసే క్రైస్తవసంస్థలు తమకు ప్రభుత్వంచేసే ధనసహాయం ఆగిపోతుందేమోనని భయపడటంలేదు; మరి, ఏదైనా హైందవవిద్యాసంస్థ హిందూప్రార్థనలను, భగవద్గీతాపఠనాన్ని ఆరంభిస్తేచాలు, ధనసహాయం నిలుపుచేస్తామంటూ ప్రభుత్వం బెదరింపులు, తీవ్రచర్యలు తలపెడుతున్నది.

స్వయంగా మననేతలే, మనప్రజలే, సమాజంయొక్క మౌలిక ఏకత్వాన్ని కూకటివ్రేళ్ళతో పెల్లగించప్రయత్నిస్తున్నారు. మన విభిన్న

సంప్రదాయాలను ఒకప్పుడు సమరసభావంతో సమష్టిగామలచిన తాదాత్మ్య భావాన్ని నాశనం చేస్తున్నారు. ఏంతటిదౌర్భాగ్యం!

## ఒకనాటి వైభవం

వర్ణవ్యవస్థ మన సమాజంయొక్క మరొకవిశిష్టలక్షణం. కాని ఈనాడు దాన్ని 'కులతత్త్వం' పేరిట నిరసిస్తున్నారు; వర్ణవ్యవస్థ అని ఉచ్చరించటమే మహాపాపంగా భావిస్తున్నారు. దానిలో ఉన్న సామాజిక వ్యవస్థను, సామాజిక తారతమ్యభావనగా వారు పొరబడుతున్నారు.

వర్ణవ్యవస్థలో అసమానతలు, ఉచ్చనీచభావనలు తర్వాతతర్వాత ప్రవేశించినవి. కుటిలుడైన ఆంగ్లేయుడు 'భేదోపాయాన్ని' అనుసరించి వర్ణవ్యవస్థలో వచ్చిన ఈ వికృతిని మరింత ఎగసనతోసినాడు. కాని వర్ణవ్యవస్థ యొక్క ప్రారంభదశలో వివిధాంగాల విశిష్టతలు, విభిన్న అంగాలమధ్య తరతమ భేదాలను, ఉచ్చనీచభావాలను కల్పించేందుకు రూపొందలేదు. పైగా జీవితంలో తమకు విధింపబడిన ధర్మాన్ని నిస్స్వార్థసేవాభావంతో నెరవేరిస్తే భగవంతుని ఆరాధించినట్లవుతుందని,

*"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః"*

భగవద్గీత బోధిస్తోంది.

ప్రతివాడు తనకు తగిన పద్ధతిలో, తన శక్తిమేరకు ఆరాధించడానికి అనువుగా, పరమేశ్వరుడు చతుర్విధాత్మక సమాజంగా సాక్షాత్కరించాడని మనవారు భావించినారు. విజ్ఞానంప్రబోధించి బ్రాహ్మణుడు శ్రేష్ఠుడైతే, శత్రు నిర్మూలనంచేసి క్షత్రియుడుకూడా అంతటి శ్రేష్ఠుడు అయ్యాడు; కృషి వాణిజ్యాలద్వారా సమాజాన్ని పోషించి సంరక్షించిన వైశ్యుడు, తన కళా కౌశలంద్వారా సమాజాన్ని సేవించినశూద్రుడు ఏవిధంగాను తక్కువవారుకారు

తాదాత్మ్యభావనతో, ఒకరిపై నొకరు ఆధారపడి, కలసిమెలసి మన సమాజవ్యవస్థను నలువురూ నిర్మించినారు.

## తప్పుడు భావన

వర్ణవ్యవస్థయొక్క ఈనాటి భ్రష్టస్థితి చూస్తూ, అదే దాని అసలు స్వరూపమని భ్రమపడి ఇన్నివేల సంవత్సరాలుగా మనపతనానికి ఈ వర్ణ వ్యవస్థయే కారణమని అహోరాత్రాలు ప్రచారం చేసేవారు కొందరున్నారు. అయితే ఇట్టివిమర్శ చారిత్రకమైన పరీక్షకు నిలుస్తుందా? వేలకొలది సంవత్సరాలు కొనసాగిన వైభవోపేతమైన మన ప్రాచీన జాతీయజీవన కాలంలోకూడ ఈ కులాలున్నాయి. సమాజ సమైక్యప్రగతులను అవి భగ్నం చేసినవని చెప్పటానికి ఎక్కడా ఆస్కారంలేదు. వాస్తవానికి ఆ వ్యవస్థ సమాజానికి ఏకతాసూత్రంగా విలసిల్లింది.

గత వేయిసంవత్సరాలలో మనజాతి అనేక విదేశీదురాక్రమణలకు గురిఅయింది. మనలోని జాతీయ అనైక్యం, దురాక్రమణదారులు మనలను జయించటానికి కారణం. అయితే ఈ కులవిభేదాలే అట్టి జాతీయ అనైక్యానికి మూలకారణమని చెప్పటానికి ఒక్క ఉదాహరణకూడ చరిత్రలో కనిపించటంలేదు. ఢిల్లీని పాలించే పృథ్వీరాజు మహమ్మదుఘోరీ చేతుల్లో ఓడిపోవటానికి బాధ్యుడైన జయచంద్రుడు, పృథ్వీరాజు యొక్క కులంవాడే, బంధువుగూడ. రాణాప్రతాపును అడవుల్లో తరుము కుంటూ పోయిన రాజామాన్‌సింగ్ ప్రతాపునికులంవాడే. శివాజీనికూడ అతనికులంవారే వ్యతిరేకించినారు. హిందువులకు ఆంగ్లేయులకు మధ్య 1818 లో పూనాలో జరిగిన కట్టకడపటియుద్ధంలోకూడ, పీష్వాలకు దగ్గరబంధువగు 'నాతు' అనేపేరుగలవాడే హిందూధ్వజాన్ని క్రిందకు దించి ఆంగ్లధ్వజాన్ని పైకెగురవేసినాడు. వాస్తవానికి అట్టి దేశద్రోహుల తెగవంటిది ఒకటి ఇక్కడ ఉంటూవచ్చింది. వారు ఇతర వ్యామోహాలకో

అనేక ఇతర కారణాలకో లోనై ఆవిధంగా ప్రవర్తించినారు. అంతేకాని కులంమాత్రం ఎన్నడూ దీనికి కారణం కాలేదు.

వర్ణవ్యవస్థయే మన బలహీనతకు నిజమైన కారణమయినట్లైతే, అట్టి వ్యవస్థలేని ప్రజలకన్న మనవారు, విదేశీదురాక్రమణకు మరింతసులువుగా లొంగిపోయి ఉండవలసింది. అయితే చరిత్రచెపుతున్న దేమిటి? మహమ్మదు పైగంబరు మరణించిన తరువాత అతని అనుయాయులు, అరేబియానుండి అలలుఅలలుగా బయలుదేరి, తమ ఖడ్గాలకు రక్తస్నానం చేయిస్తూ, ఎన్నోదేశాలను ఆక్రమిస్తూ, తమమార్గంలో నిలచిన, ఇరాను, ఈజిప్టు, రోము మొదలుకొని చైనావరకు ఉన్న సామ్రాజ్యాలను తమ కాళ్ళక్రింద నలిపి వేసినారు. ఆ దేశప్రజలలో కులాలుగాని, అవాంతరకులాలుగాని లేవు. అయినా శక్తిమంతములైన ఆ యా సామ్రాజ్యాలవైభవం, సమృద్ధి, కీర్తి ప్రతిష్ఠలు ముస్లింల దురాక్రమణ దావానలంలో మాడి, మసియైపోయినవి. వాటిలో అనేకం ఈ ప్రపంచరంగస్థలంపై మళ్ళీ కనిపించకుండాపోయినవి.

ఆ మతమౌఢ్యదావాగ్నిజ్వాలలే, హిందూస్థానతీరాలనుకూడా తాకినవి. అయినా ఇక్కడి దృశ్యం చాలాభిన్నంగాఉంది. మనప్రజలు ఆ దురాక్రమణ లను, విసుగు విరామంలేకుండా, వేయి సంవత్సరాలకుపైగా సాహసంతో ఎదిరించినారేగాని, వాళ్ళకు లొంగిపోలేదు. చివరకు మనవాళ్లు శత్రుశక్తులను పూర్తిగా అణగద్రొక్కటంలో కృతకృత్యులయ్యారు. ఢిల్లీలోని ముస్లిముల అధికారపీఠం, మనప్రజల విజిగీష ముందు తుత్తునియలైంది. అంతిమవిజయం సాధించేంతవరకు శతాబ్దాలపాటు కొనసాగిన ఈ జీవన్మరణ సమస్యలో, ఈ వర్ణవ్యవస్థ ఉంటూనే ఉన్నదని మనం గుర్తుంచుకోవాలి.

వర్ణవ్యవస్థను భగ్నంచేసిన బౌద్ధమతప్రభావం అధికంగాగల మన దేశంలోని ఈశాన్య, వాయవ్య సరిహద్దు ప్రాంతాలు, ముస్లిముల దాడికి

తేలికగా బలిఐనట్లు చారిత్రకంగా మనకు తెలుసు. ఈనాడు కందహార్ అని పిలవబడే ఒకనాటి గాంధారం, పూర్తిగా ముస్లింప్రాంతం అయిపోయింది. తూర్పుబెంగాల్‌లోకూడ మతాంతరీకరణ చాలాఅధికంగా జరిగింది. కాని కులనియమాలను పాటించటంలో అతికఠోరంగా ఉండే ఛాందసప్రాంతాలుగా భావింపబడ్డ ఢిల్లీ, ఉత్తరప్రదేశ ప్రాంతాలు, అనేక శతాబ్దాలపాటు, ముస్లిం అధికారానికి. మతమౌఢ్యానికి చాలాకాలం దుర్గాలుగా నిలచినప్పటికీ ఇప్పటికీ అక్కడ ప్రధానంగా హిందువులే ఉన్నారు. నిన్నమొన్నటి శివాజీ కాలం నాటివరకుగూడ, నీచకులములనబడేవికూడా, స్వరాజ్యపునరుజ్జీవనంలో ప్రముఖపాత్రను వహించాయి అని మనకుతెలుసు.

ఈ విధంగా చరిత్రలో, ఈ రెండింటి తారతమ్యాన్ని ఋజువుచేసే ఉదాహరణలు, స్పష్టంగా కనిపిస్తాయి. రెండువేలయేండ్ల పైచిలుకు, గ్రీకు శక, హూణ, తురుష్కులూ, చివరకుయూరపు ఖండవాసులూ, దోచుకొన్న తర్వాతకూడా 'కులవ్యవస్థ కరడుకట్టిన' హిందూజాతి అమరమై, అజేయమై రామకృష్ణ, వివేకానంద, తిలక్, గాంధీవంటి మహాపురుషులను ప్రసవించే శక్తి కలిగియుండడం ఒకప్రక్క కనిపిస్తూఉంటే, వేరొకప్రక్క వర్ణరహితాలని చెప్పబడే సమాజాలు, అటువంటి ఒక్కవిదేశీ దండయాత్రకే, మట్టిలో కలసిపోయి మళ్ళీ పైకిలేవలేకపోవటం మనకు కనిపిస్తుంది.

## అగ్నిలో ఆజ్యం

వర్ణవ్యవస్థ ఈనాడు గుర్తుపట్టలేనంతగా భ్రష్టమైంది. వేల సంవత్సరాలలో ఏర్పడిన వక్రతతోబాటు, ఈ వర్ణవ్యవస్థను తీవ్రంగా దుయ్యబడుతూ, గోలపెట్టేవారే, దీనిలో మరింత కటుత్వాన్ని, వక్రతను పెంచే నూతనాంశం ఒకటి జోడించారు. వారు ఎన్నికల్లో అభ్యర్థులను ఎంపికచేసేటప్పుడు వారి దృష్టంతా కులాలపైనే; వారు ఓట్లకై అభ్యర్థించటంకూడా కులాలపేరటే. కేవలం తమ అధికారవ్యామోహాన్ని

తీర్చుకొనేందుకు, కులంపేరట ఓటుకోరి, కులాల పోటీని రెచ్చగొడుతున్నారు. ఈ భేదభావాలను మరింత ఎక్కువచేసేందుకు చివరకు పరిపాలనా యంత్రాంగంకూడా దుర్వినియోగపడుతోంది. మన ప్రజలను, హరిజనులు పరిగణితజాతులు, పరిగణితతెగలు మొదలైనపేర్లతో పిలుస్తూ డబ్బు ఎరగాచూపి, వారిని తమ బానిసలుగా చేసుకునేందుకు చేసే ప్రయత్నంలో వారికి కొన్ని ప్రత్యేక సదుపాయాలను కల్పించడం జరుగుతోంది. తద్వారా సమాజంలోని విభిన్న వర్గాలమధ్య అనుమానాలను, సంఘర్షణను సృష్టించే వేర్పాటు మనస్తత్వం రోజురోజుకు పెంపొందిస్తున్నారు.

అంతరాంతరాలలో ఈనాటి వికృతుల నన్నిటికీ అతీతంగా ఏకత్వభావనానుభూతిని పొందగలుగుతున్నవారు, వర్ణవ్యవస్థను విరోధించే తీవ్రవాదుల్లో లేరనే చెప్పవచ్చు. సాటివర్ణస్తుల్లో తమ ప్రత్యేకస్థానాన్ని బలపర్చుకునేందుకు, వర్ణవ్యవస్థపై దుమ్మెత్తిపోయడం, వారికి ముసుగుగా ఉపయోగిస్తోంది. ఈవిషం మనసమాజంలో ఎంతగా తలకెక్కిందో కొన్ని ఏండ్ల క్రితం జరిగిన ఒక సంఘటననుబట్టి ఊహించవచ్చు. పూనానగరానికి సమీపంలో పీష్వాలపై తమ విజయానికి స్మారకంగా ఆంగ్లేయులు ఒక విజయస్తంభం నిర్మించారు. ఒకసారి ఈ స్తంభచ్ఛాయల్లో ఒక ప్రముఖహరిజన నాయకుడు తన తోటి హరిజనసోదరులను సంబోధిస్తూ ఉపన్యాసంచేశాడు. ఆంగ్లేయుల నాయకత్వంలో, పోరాటంజరిపి తామే బ్రాహ్మణులైన పీష్వాలను ఓడించినారు కాబట్టి, ఈ విజయస్తంభం బ్రాహ్మణులపై తమ విజయానికి చిహ్నమని అతడు ప్రకటించినాడు. ఒక ప్రముఖనాయకుడు ఆవిధంగా బానిసత్వానికి చిహ్నమైనదాన్ని విజయానికి ప్రతీకగాను, ఒక విదేశీయునికి బానిసలై మన సొంతబంధువులతో జరిగిన అవమానకరమైన పోరాటాన్ని ఒక మహావిజయంగాను చెప్పుకోవటం ఎంత హృదయవిదారకమైన విషయం! ఎంతటి ద్వేషాంధత! ఎవరు గెలిచారు? ఎవరోడిపోయారు? ఈ సామాన్యసత్యంకూడా గుర్తించలేకపోయినాడతడు. ఎంతటివక్రత యిది!

## తీగలెన్నున్నా స్వరమొక్కటే !

మన జాతీయవారసత్వవైవిధ్యం మన భాషారంగంలోకూడా వ్యక్తమయింది. మనదేశ వైశాల్యం, జనసంఖ్యలదృష్ట్యా ఆలోచిస్తే ఏ మాత్రం ఆశ్చర్యపడవలసిన విషయంకాదది. మనదేశంలోని ఒకవ్యక్తి తన స్వస్థానంనుండి బయలుదేరి కాలినడకన ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వెళ్ళితే, ప్రతి పది, పదిహేనుమైళ్ళకు భాషలో క్రమంగా ఒక మార్పు-అంటే సహజంగా ఒకభాష, వేరొకభాషగా మారటం, సరిహద్దుల్లో ఆరెండు కలసిపోవటం-గమనించగలడు. ఇతరభాషలకు సన్నిహితంగా ఉన్నకారణంచేత ఒకే భాషలోని పదాల్లోనూ, పలుకుబడిలోనూ మండలం మండలానికీ చెప్పుకోదగ్గ వ్యత్యాసం కనబడుతుంది. ఈ భాషలన్నీ మౌలికంగా ఒక్కటేనని దీన్నిబట్టి తెలుస్తుంది. ఇంద్రధనుస్సులోని రంగులవంటివివి. అనేకవర్ణాలతో ప్రకాశిస్తున్నప్పటికీ, ఆ రంగులన్నీ ఒకే సూర్యకిరణంయొక్క ఆహ్లాదకరమైన విన్యాసం మాత్రమేకదా. మనభాషలయొక్క వైభవంగూడా అట్టిదే.

మనదేశంలోని ఏభాషను గ్రహించినా అవే ఉదాత్తభావనలు, అవే ఉత్తేజకరమైన ఆలోచనలు, అవే ఆదర్శాలు, ఆయా భాషాసాహిత్యాలన్నింటిలోనూ ప్రతిబింబిస్తూ ఉంటాయి. సంస్కృతంలో వాల్మీకి, హిందీలో తులసీదాసు, తమిళంలో కంబన్ ఆశ్రీరామచంద్రునివ్యక్తిత్వాన్నే స్తుతించినారు. అన్నిటిలోనుంచీ ఒకే వెలుగుప్రకాశిస్తుంటే, వ్యక్తీకరించేసాధనం మారినంత మాత్రాన కలిగేనష్టమేముంటుంది? ఎన్నోవిధాలైన మనోహరవస్త్రాలు ధరించిన ఒకవ్యక్తివంటిది ఇది. వస్త్రాలుమారినంతమాత్రాన మనిషిమారడు. అయితే ఆ దుస్తులన్నీ అతని సంస్కృతికీ, శీలానికీ తగినవిగా ఉండాలి.

ఈమధ్య తమిళాన్ని గురించి చాలా ఎక్కువగా వింటున్నాం. తమిళము ఒక ప్రత్యేక సంస్కృతిగల ప్రత్యేకభాష అని తమిళభాషావాదులు

కొందరు చెప్పుకుంటూఉంటారు. తిరుక్కురల్ తమకు ప్రత్యేకధార్మిక గ్రంథమని చెప్పుకుంటూ వారు వేదంపట్ల తమకు విశ్వాసం లేదంటారు. తిరుక్కురల్, రెండువేల సంవత్సరాల పూర్వమే రచించిన ఒకమహాగొప్ప ధర్మశాస్త్రగ్రంథం. సందేహంలేదు. తిరువళ్లువర్ అనేమహాత్ముడు దాన్ని రచించాడు, మనకాతడు ప్రాతః స్మరణీయుడు. ప్రఖ్యాత విప్లవవీరుడైన వి. వి. యస్. అయ్యర్, దానికి ప్రామాణికమైన ఆంగ్లానువాదాన్ని చేసినారు. ఇంతకూ దానిలో ప్రతిపాదించిన విషయమేమిటి ? చతుర్విధ పురుషార్థ సాధన అనేప్రాచీనభావనయే దానిలో ప్రవచించిన ఆదర్శం; మోక్షాధ్యాయం మాత్రంముందుగానే వర్ణింపబడింది. ఒక ప్రత్యేకమయిన ఆరాధనాపద్ధతినిగాని భగవంతుని నామధేయంగాని అది చెప్పటంలేదు. స్వచ్ఛమైన మోక్షాన్ని మాత్రమే అది ఆదర్శంగా వర్ణించింది. ఆకారణంచేత అది ఒక ప్రత్యేక సంప్రదాయానికి చెందిన పుస్తకంకూడా కానేరదు. తిరుక్కురల్ వర్ణించిన సాంఘికజీవనవ్యవస్థ మహాభారతంకూడా వర్ణించింది. ఒక్కహిందువులకు తప్ప ఇంక ఏ జాతికీ, ఈవిధమైన విశిష్టసామాజికజీవనలక్ష్యం లేదు. ఆవిధంగా స్వచ్ఛమైన ఒక హిందూభాషలో, మహోదాత్త హిందూభావాలు ప్రతిపాదించే తిరుక్కురల్ కేవలం హిందువులగ్రంథం.

వాస్తవానికి, తమిళం, బెంగాలీ, మరాఠీ, పంజాబీ మొదలైన మన దేశభాషలూ, మాండలికాలూ - అన్నీ మన రాష్ట్రభాషలే; మన జాతీయ సంస్కృతీసుగంధాన్ని వెరజిమ్మే సువికసిత సుమాలే. భాషాసామ్రాజ్ఞి అమరవాణి అయిన సంస్కృతమే, ఈభాషలన్నిటికీ స్ఫూర్తికేంద్రం. దాని సమృద్ధి, పవిత్రసాహచర్యం కారణంగా, అది ఒక్కటే సర్వసామాన్య వ్యవహారసాధనంగా జాతికి ఉపకరిస్తుంది. సంస్కృతంలో వ్యవహార జ్ఞానం సంపాదించటం అంతకష్టం కానేకాదు. మనజాతీయ సమైక్యానికి ఈనాడుకూడా సంస్కృతం ఒక గొప్ప సాధనం. కాని దురదృష్టవశాత్తు అది ఈనాడు సామాన్యప్రజల వాడుకలోలేదు. దాన్ని వాడుకలోనికి తీసికొని రావాలనే నైతికాభిమానంగాని, చేవగాని, నేటిపాలకులకులేవు.

## ఆంగ్లమా ? హిందీయా ?

ఆంగ్లభాషయే ఎల్లప్పటికీ యావద్దేశ సామాన్యభాషగా కొనసాగాలని కోరేవారు కొందరున్నారు. మానవులమధ్య పరస్పర వ్యవహారానికి భాష ఒక సజీవమైన సాధనం, అందుచేత విదేశీ భాషయైన ఆంగ్లం తనతోబాటు ఆంగ్ల సంస్కృతిని; ఆంగ్ల జీవనపద్ధతినికూడ వెంటతెస్తుంది. విదేశీ జీవన పద్ధతులను ఇక్కడ వేళ్ళూననియ్యటం, మన సంస్కృతీ ధర్మాలకు గోతులు త్రవ్వడమే. మన సాంస్కృతిక వారసత్వాన్ని మన భాషల మాధ్యమంలో సంరక్షించుకొన్నందువల్లనే శతాబ్దాలపాటు సాగిన విదేశీ పాలన శ్రేష్ఠమైన మనజాతిని నాశనం చేయలేకపోయింది. ఆంగ్లభాషను స్వీకరించటం మన జీవశక్తియొక్క మూలాధారాన్ని మొదలంట నాశనంచేయటమే. ఆంగ్లేయులు తమ ఆధిపత్యంతోబాటు ఆంగ్లభాషను మనపై రుద్దినారు. మనమిప్పుడు స్వతంత్రులమయ్యాం గనుక దాన్ని విసిరిపారేయాలి. విదేశీపరిపాలనా కాలంలో దానికిచ్చిన ఆ హోదాయే ఈనాడుకూడా కొనసాగనియ్యడం, మన మానసిక దాస్యానికి చిహ్నమేగాక, ప్రపంచదృష్టిలో మన జాతీయ ప్రతిష్ఠకు మచ్చగూడా అవుతుంది.

ఆంగ్లభాష వైదొలగితీరుతుందిఅని, అనుమానంఅవంతయినాలేకుండా చెప్పటానికి రెండు బలమైన కారణాలున్నాయి. 'పాలకులభాష నేర్చుకోవాలనే మనస్తత్వం ప్రజల్లో సహజంగా ఏర్పడుతుంది. కనుక నాడు, ఆంగ్లంలో పాండిత్యం సంపాదించుకున్నారు; దానిద్వారానే ఆంగ్లేయుల కెదురునిలిచారు. ఇప్పుడు ఆంగ్లేయులు వెళ్ళిపోయినారు కాబట్టి అట్టి వాంఛకూడా సహజంగా అదృశ్యమయిపోయింది. ఇది మొదటికారణం. ఆ రోజుల్లో ఆంగ్లం రాకపోతే ప్రభుత్వోద్యోగం మంచిది దొరికేదికాదు. ఆంగ్లవిద్య లేకపోతే, మహా మేధావులకుకూడా ఆర్థికంగాను, సామాజికంగాను గణింపు ఉండేదికాదు. ఇప్పుడు అట్టిభయంకూడా క్రమంగా తొలగిపోతోంది. ఇది రెండవకారణం. ఆంగ్లభాష కేవలం ఆంగ్లపరిపాలనలో ఒకభాగం మాత్రమే. కృత్రిమంగా

బ్రతికిద్దామని ఎంతగాలికొట్టినా, ఎంత ప్రయత్నించినా, దానికి ముఖ్యాధారమైన ఆంగ్లపాలన పోయిందికాబట్టి అది ఎంతోకాలం నిలువదు.

యావద్దేశభాషను నిర్ణయించే సమస్యకు పరిష్కారంగా సంస్కృతం అట్టిస్థితికి చేరుకునేటంతవరకు, సౌలభ్యందృష్ట్యా హిందీని స్వీకరించాలి. ఇతరభారతీయభాషలెన్నింటిమాదిరిగానో ఇదీ సంస్కృతజన్యమే. అధునాతన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానరంగాలలో ముందుముందు అభివృద్ధిపొందడానికి వీలుండే సంస్కృతనిష్ఠమైన హిందీనే మనం స్వీకరించాలి. అంటే మన భాషలన్నిటిలోనూ హిందీ ఒక్కటే జాతీయభాష అనిగాని, అన్నిటికన్న ప్రాచీనమనిగాని, సర్వసమృద్ధమనిగాని అర్థంకాదు. వాస్తవానికి తమిళభాష దీనికన్న మరింత సమృద్ధం, ప్రాచీనముకూడ. కానీ, హిందీ మన ప్రజల్లో అధికసంఖ్యాకులు మాట్లాడుకొనే భాషయేగాక, అది మనభాషలన్నిటిలోనూ నేర్చుకోవటానికి, మాట్లాడటానికి సులువైనది. పవిత్ర గంగానదిలో స్నానం చేసేందుకు దేశం నలుదిశలనుండి ప్రజలు ఏకత్రితమయే కుంభమేలాకో, ఇతరమేలాల సందర్భంగా ఏ కాశీకో, ప్రయాగకో పోతే అచట ప్రజావాహిని అంతా, హిందీలోనే వ్యవహారం నడుపుకొంటుంది-అది ఎంత కచ్చాపచ్చా హిందీయైనాసరే.

## అన్నిభాషలూ కలకాలం వర్ధిల్లాలి

కనుకనే జాతీయ సమైక్యస్వాభిమానాల దృష్ట్యా మనం హిందీని స్వీకరించాలి. 'హిందీ సామ్రాజ్యవాదం' 'ఉత్తరాది ఆధిపత్యం' వంటి నినాదాలలోపడి మనం కొట్టుకపోరాదు. ఆంగ్లేయులపాలన ఉన్నప్పటికీ వాస్తవానికి బెంగాలీ, మరాఠీ, గుజరాతీ భాషలు ఎంతో ప్రగతినిసాధించాయి, ప్రపంచమహావిద్వాంసుల ప్రశంసలుపొందిన గ్రంథాలు ఈ భాషల్లో రచింపబడ్డాయి. ఏదోఒక ప్రత్యేకభాషకు పట్టం కట్టేందుకుగాను అనేకశతాబ్దాలుగా మనజాతీయతను సమర్థంగా వ్యక్తంచేస్తూవస్తున్న మనోహరములైన మన

వివిధభాష లన్నింటినీ నాశనంచేయాలనే ఆలోచన ఎవడు సహిస్తాడు? అందుచేతనే హిందీ భాషయొక్క ఆధిపత్యం, ఇతరభాషలపై పడుతుందనే సందేహం స్వార్థప్రయోజనాలాశించే రాజకీయవాదులు కల్పించినదేకాగలదు.

నిజానికి, హిందీ పైకిరావటంతోబాటు, మనభారతీయభాషలన్నీకూడా అభివృద్ధిచెందుతాయి. మనభారతీయభాషలన్నిటికీ విరోధి ఆంగ్లభాష. ఒకసారి తమిళనాడులో ఒకసమావేశంలో, న్యాయవాదొకడు హిందీభాష తమిళభాషను నాశనం చేస్తుందన్నాడు. అయితే తమిళభాష నుపయోగించ టానికి అనుమతిఉన్న జిల్లాస్థాయి అంతకన్న తక్కువస్థాయిన్యాయస్థానాల్లో తమిళం మాట్లాడకుండా ఇంగ్లీషునెందుకు మాట్లాడుతున్నావని నేను అడిగితే మాట్లాడలేకపోయాడు. నిజంచెప్పాలంటే తమిళభాషకు అసలువిరోధి హిందీకాదు; ఆంగ్లభాషే ఈరెంటికీకూడా విరోధి. ఒక్కతమిళభాషవిషయం లోనేగాక, మనభాషలన్నిటి విషయంలోనూఇంతే,

ఈవిధంగా స్వరాజ్యం వచ్చినతర్వాత భాషకూడా వేర్పాటుధోరణికి కారణమయింది. ప్రజల్లో విద్వేషాలను రెచ్చకొట్టేందుకు రాజకీయ నాయకులకు భాష మరొక సాధనమయింది. ప్రముఖవ్యక్తులుకూడా ఇతర భాషలపై దుమ్మెత్తిపోయటం మరింత ఆశ్చర్యం కలిగిస్తుంది దక్షిణ భారతానికి చెందిన ఒక మహా ప్రముఖవ్యక్తి ఒక బహిరంగసభలో మాట్లాడుతూ, "హిందీభాషలో రెండేరెండు గొప్పసాహిత్యగ్రంథాలున్నాయి. వాటిలో ఒకటి తులసీరామాయణం, రెండవది రైల్వే టైమ్‌టేబుల్" అన్నాడు. దీనికి తగినట్లుగానే ప్రఖ్యాత మరాఠీ నాటకరచయిత, తాను సృష్టించిన ఒకపాత్రచేత "దక్షిణభారత భాషలా....కుండలో గులకరాళ్లువేసి గలగలా ఆడిస్తే-దక్షిణాదిభాషలు వినిపిస్తాయి" అని పలికించాడు. ఇవన్నీ హాస్యోక్తులే అయినా, ఇట్టి విఘటనాత్మకమైన హాస్యం, అమా యకపు అవహేళనలు సమస్యను మరింత క్లిష్టంచేస్తాయి.

## అభూతకల్పన

మరింత విరోధాన్ని విఘటనను కల్పించే అనేక ఇతరకారణాలు పుట్టుకొస్తున్నాయి. ఉదాహరణకు కృత్రిమమైన ఆర్యద్రావిడ వివాదం ఈమధ్యనే పుట్టింది. ఆలోచనారహితులై, అధికారదాహానికి లోనైన వ్యక్తులు, అతిప్రయాసపడి సృష్టించిన నవీన మూఢవిశ్వాసాల్లో ఇదొకటి. ఆరంభంలో ఈదేశంలో ఏదోవిధమైన విభేదం ఉండిఉండవచ్చుగాక, అది కాలంచేత, చరిత్రగతిచేత అంతరించిపోయింది. రెండువేల ఏండ్లక్రిందట ఈదేశాన్ని పంచగౌడులు, పంచద్రావిడులు అనే రెండుకూటాలుగా వర్గీకరించారు. దక్షిణదేశం రెండవకూటమి క్రిందకువచ్చింది. అది జాతిపరమైన పేరుకాదు. భౌగోళికమైన నామకరణం మాత్రమే. ఉత్తరాదివారు ఎంతటి ఆర్యులో, దక్షిణాదివారుకూడ అంతటి ఆర్యులే. మనదేశంలో ఆర్యశబ్దం సంస్కృతిని సూచించిందేగాని, ఏనాడూ జాతిని సూచించేదిమాత్రం గాదు. పురాణసాహిత్య మందంతటా భార్యలు తమ భర్తలను "ఆర్యా!" అని సంబోధిస్తారు. అంటే భార్యలు 'అనార్యలు' అని అర్థంమాత్రం కాదు. ఆర్యశబ్దానికి 'శ్రేష్ఠవ్యక్తి' యని మాత్రమే అర్థం. శ్రీకృష్ణుడుకూడ ఈ అర్థంతోనే 'ఆర్య' శబ్దాన్ని భగవద్గీతలో ప్రయోగించినాడు. కురుక్షేత్ర యుద్ధంలో మొదటిరోజున అర్జునుడు నిష్క్రియాకారిపోతున్నప్పుడు, శ్రీకృష్ణుడు అతనిలోని 'అనార్యజుష్ట'లక్షణాన్ని అంటే అధమలక్షణాన్ని గర్హించినాడు.

రామరావణ యుద్ధాన్ని, ఆర్యద్రావిడులమధ్య యుద్ధంగా చిత్రించటానికి ప్రయత్నం జరుగుతున్నదీనాడు. ఎంత హాస్యాస్పదం? రావణుడు స్వయంగా ఒక గొప్ప సంస్కృత విద్వాంసుడు; శివభక్తుడు. సామవేదానికి స్వరకల్పన చేసినవాడతడేననికూడా చెప్పుతారు. అతని తండ్రియైన విశ్రవసుడు, అతని తాతయైన పులస్త్యుడు బ్రాహ్మణులే. రావణుడు దక్షిణాపథాన్ని పీడిస్తుంటే, అతని పీడనుండీ దాక్షిణాత్యులకు శ్రీరాముడు విముక్తి కలిగించాడు అనాలి! అంతే.

అదిగాక, హర్ష పులకేశులమధ్య జరిగిన సంఘర్షణ, దాక్షిణాపథంపై ఉత్తరాదివారు ఆధిపత్యం నెరపటానికి చేసినయత్నంగానూ, దానికి విజయవంతంగా దక్షిణదేశంవారు చేసిన ప్రతీకారంగానూ, ప్రదర్శించటానికి ప్రయత్నం జరిగింది. కానీ పులకేశి ద్రావిడుడుకాడు. తమిళుడుమాత్రం కానేకాడు. మహారాష్ట్రంలో గోదావరి ఒడ్డున, ప్రతిష్ఠానపురంలో (నేటి పైఠన్) అతని సామ్రాజ్యం స్థాపించబడింది. ఎట్లా అనుకున్నా, ఆ రాజులిద్దరు సంధిచేసికొని, స్నేహంగా జీవించినారు. విఘటన బీజాలు నాటడానికి నేటి వాతావరణం బాగా అనుకూలంగా ఉందని గుర్తించిన అధునాతన రాజకీయవేత్తలు, అధికారం సంపాదించుకునేందుకు పన్నిన సిసలైనయెత్తు మాత్రమే, ఈ ఉత్తరాది దక్షణాది వివాదం.

## క్రొత్త కల్పనలు

సమాజంలోని ఒకవర్గానికి వేరొకవర్గానికీమధ్య మౌలిక వ్యత్యాసాలను ధ్వనింపజేసే నిత్యనూతనమైనపేర్లు సామాన్య వ్యవహారంలోనికి వస్తున్నాయి. మన జాతీయజీవనముయొక్క సహజక్రమంలో కొందరు నగరాలలో నివసిస్తుంటారు. వారు ముఖ్యంగా చదువుకొన్న ఉద్యోగులు, పారిశ్రామిక కార్మికులు, వ్యాపారులు. మరికొందరు, అంటే ముఖ్యంగా వ్యవసాయం చేసేవారు గ్రామాల్లో నివసిస్తారు. ఇంకాకొందరు ఈనాటివరకు అడవుల్లోను కొండల్లోనూ ఉండిపోయారు. వనవాసులను 'ఆదిమవాసులు' అంటున్నారు ఈనాడు అంటే మిగిలినవారంతా ఎక్కడనుండో ఊడిపడ్డారు; ఇక్కడ క్రొత్తగాతిష్ఠవేశారు – ఈ భావనను ఆ పేరు సూచిస్తున్నదిగదా!

ఇక నగరవాసులకు, గ్రామీణులకుమధ్య కృత్రిమమైన విభేదంకూడా కల్పిస్తున్నారు. ఏదో రెండుముక్కలు చదువుకొన్నవాడు, తానొక

ప్రత్యేక తరగతికి చెందినవాణ్ణని భావించుకొంటూ, గ్రామీణప్రజలను అనాగరికులని తక్కువగా భావిస్తుంటాడు. లోగడ ఆంగ్ల విద్యనభ్యసించి తమ ఆంగ్లేయయజమానులవలె వస్త్రధారణ, ప్రవర్తన కలిగినవారు సామాన్యులను నీచంగా భావించేవారు. ఆ ఆంగ్లపాలనావారసత్వం ఇంకా కొనసాగుతూనేఉంది. ఆంగ్లవిద్యనభ్యసించినవాడు ఈనాటికికూడా తానేదో విశిష్టతకల్గిన వ్యక్తిగా, ఇతరులకన్నా ఎంతో కొంత ఉన్నతమైనవాడుగా భావించుకొంటూఉంటాడు. గ్రామీణప్రజల జీవనప్రమాణాల్ని మెరుగు పరచేందుకుగాను గ్రామాలకు తరలండి అని చదువుకొన్నవారికి ఈనాడొక ఆదేశం ఇచ్చారు. కాని ఎంతమంది నిజంగా అట్లా వెళుతున్నారు ? గ్రామీణ జీవితం అనే ఆలోచనకే, వారికి గుండెదడ పుడుతుంది.

గ్రామాల్లోని సామాన్యప్రజానీకమే మనజాతికి వెన్నెముకగా ఉంటున్నదని మనం మరచిపోరాదు. గతంలోకూడా, మనసమాజం విదేశీ దండయాత్రలకు గురియైన సమయంలో స్వధర్మాన్ని, స్వదేశాన్ని సంరక్షించుకొనేందుకు, ఎన్నోకష్టాలు అనుభవించి, త్యాగాలుచేసి నిలిచినది ఈ 'పల్లెటూరి బైతులే,' 'నిరక్షరకుక్షులైన ఈమూకలే.'

ఈ రోజుల్లో 'స్త్రీలకు సమానమైన ప్రతిపత్తి' ఇవ్వాలని వారిని పురుషులబానిసత్వంనుండి స్వతంత్రలను చేయాలని ఒకపెద్దకోలాహలం ఆరంభమైంది. వారి స్త్రీత్వకారణంగా అధికారంలోని వివిధపదవుల్లో వారికి కొన్ని ప్రత్యేకంగా కేటాయించాలని కోరుతున్నారు. ఆ విధంగా కులతత్వం, మతతత్వం, భాషాతత్వాల వరుసలో 'లింగతత్వం' అనే మరొకవాదం చేరింది.

## మహత్తర ఏకత్వాన్ని గుర్తించండి

మన ప్రజాజీవనంయొక్క నాటిచిత్ర మట్టిది; నేటిచిత్ర మిట్టిది. ఈ గడ్డమీద పుట్టిన ప్రతిబిడ్డా, ఈ దృశ్యాన్ని చూచి, తరతరాలుగా

మన ప్రజల్లో ఉన్న సమైక్యభావాన్ని అతిస్వచ్ఛమైనరూపంలో పునరుజ్జీవింప చేసేందుకు ఉత్తేజపడాలి. ప్రత్యక్ష భగవత్స్వరూపంగా ఈ ప్రజానీకమంతా మన హృదయాల్లో ప్రతిష్ఠితంకావాలి. నిజానికి అటువంటి సమైక్యభావమే మన ప్రాచీనసంస్కృతి మనకొసంగిన అమరసందేశం. "ఈశ్వరుని పితృత్వం", "మానవుని భ్రాతృత్వం"-ఈభావనలతో ఇతరుల ఆలోచన ఆగిపోయింది. మనం మరింత ముందుకుపోయి బ్రహ్మనుండి జడపదార్థం వరకు అన్నింటిలోనూ అంతర్లీనంగా ఉన్న ఏకాత్మానుభూతిని సాక్షాత్కరించు కొన్నాం.

అందుచేతనే, ఈ పవిత్ర భారతమాతకు మనమంతా పుత్రులమనే భావనను సాక్షాత్కరించుకోవటంద్వారా కలిగే స్వచ్ఛమైన సమైక్యభావాన్ని మనం పునరుజ్జీవింపచేసుకొందాము. తెలిసీచేసినా, తెలియకచేసినా మనలో భ్రాంతినీ, విఘటనను సృష్టించే వివిధములైన అపస్వరాలకు మనం స్వస్తి చెప్పాలి. 'గ్రుడ్డివాళ్ళు-ఏనుగు' అనే కథలోని గ్రుడ్డివాళ్ళవలె మనం కారాదు. వారు దాని వివిధావయవాలను విడివిడిగా స్పృశించి, ఆపైన దాని స్వరూపాన్నిగురించి తమకు తోచినట్లు వర్ణించినారు. కాలు తాకినవాడు దాన్ని ఒక స్తంభంతోపోల్చినాడు; తొండం తడిమినవాడు సర్పంలాగ ఉందన్నాడు; పొట్టను వాటేసుకున్నవాడు ఒక పెద్ద పీపాతో పోల్చినాడు; ఇట్లాగే ఒక్కొక్కరు తలకొకవిధంగా వర్ణించినారు. వారిలో ప్రతిఒక్కడు పాక్షికంగా నిజమే చెప్పినాడు. కాని, ఏనుగుయొక్క మొత్తం స్వరూపాన్ని అవగాహన చేసికోవటంలో వారందరూకూడా పొరపడ్డారు.

జీవదాయినియైన ఏకతాప్రవాహం రాష్ట్రశరీరంలోని రక్తనాళా లన్నింటిలోనూ ఒక్కసారి స్వేచ్ఛగా ప్రవహించడం మొదలైతే, యావత్తు జాతికోసం, జాతీయ జీవనంలోని వివిధ అంగాలు వాంటతట అవే ఉత్సాహం తోనూ, సామరస్యంతోనూ పనిచేస్తాయి. అట్టి సజీవము, ప్రగతిశీలమునైన జాతి, అనేకములైన తన ప్రాచీనవ్యవస్థలు, పద్ధతుల్లో, ఏవేవి ప్రగతి పథంలో తాను పురోగమించటానికి అవసరమో, అనుకూలమో, వాటిని

నిలబెట్టుకుంటూ, అవసరంతీరినట్టి మిగిలినవాటిని విడిచివేసి, వాటి స్థానంలో క్రొత్తవ్యవస్థలు ఏర్పరచుకొంటుంది. ప్రాతపద్ధతి పోయినందుకు ఎవ్వరూ దుఃఖించనక్కరలేదు. క్రొత్తపద్ధతులకు స్వాగతం పలకడానికి వెనుకాడ నక్కరలేదు. చైతన్యవంతము, ప్రగతిశీలమునైన ప్రాణులన్నిటిలోనూ అది సహజంగా జరుగుతూనే ఉంటుంది. చెట్టు పెరుగుతూఉంటే పండుటాకులు ఎండురెమ్మలు రాలిపోయి, క్రొత్తవి పుట్టడానికి అవకాశం కల్పిస్తాయి. ఏకతా జీవరసం మన సామాజిక వ్యవస్థలోని అన్నిభాగాలకూ వ్యాపించేట్లుగా చేయాలని మాత్రం మనం ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. జీవ రసాన్ని పరిపోషిస్తుందా ? లేదా ? ఈ ప్రాతిపదికపైననే, ఏపద్ధతిఐనా, ఏవ్యవస్థ ఐనా జీవించటమో, మార్పుచెందటమో, చివరకు పూర్తిగాఅదృశ్యంకావటమో జరుగుతూ ఉంటుంది. అందుచేత ఈనాటి సమాజంలోని అట్టి వ్యవస్థల భవిష్యత్తును గురించి చర్చించుకోవటం నిరుపయోగం. మనజాతిలోని ఆంతరికమైన ఏకత్వభావాన్ని పునరుజ్జీవింపచేసి, అది తన జీవిత ప్రయోజనాన్ని గుర్తించేట్లు చేయటమే ఇప్పుడు మనం ఆచరించవలసిన అతిముఖ్యమైన కార్యం. ఇంక ఇతరవిషయాలన్నీ వాటంతటవే బాగు పడుతాయి.

## జన్మతః సిద్ధించిన కర్తవ్యం

మనమంతా హిందువులుగా జన్మించిన కారణంచేత ఈ సమైక్యభావం పుట్టుకతోనే మనరక్తంలో జీర్ణించిఉన్నదని మనం గుర్తుంచుకోవాలి. 'ఒక హిందువుగానో, ముస్లింగానో, క్రైస్తవుడుగానో ఏమనిషి జన్మింపడు; కేవలం ఒకమానవుడుగా మాత్రమే జన్మిస్తాడు' అని ఈనాటి బుద్ధిమంతులు కొందరు చెప్పుతుంటారు. ఇది ఇతరులవిషయంలో నిజంకావచ్చు. కాని హిందువుకు మొదట సంస్కారం మాతృగర్భంలో ఉండగానే లభిస్తుంది. చివరిది అతనిదేహం అగ్నిజ్వాలలకాహుతి ఐనప్పుడు లభిస్తుంది.

హిందువును హిందువుగా తీర్చిదిద్దేందుకు షోడశసంస్కారాలున్నాయి. నిజానికి మాతృగర్భంనుండి వెలువడకముందునుంచే మనం హిందువులంగా జన్మిస్తాము. ఇతరుల విషయానికివస్తే, వారు ఊరుపేరులేని మానవజీవిగా ఈ ప్రపంచంలో జన్మిస్తారు; అటుపైన 'సున్నతీ' చేస్తే, ముస్లింగానూ 'జ్ఞానస్నానం' చేయిస్తే, క్రైస్తవులుగానూ మారుతారు.

అందుచేత, మనసమాజంలో ఏకాత్మభావన, తాదాత్మ్యభావనలు పతిష్ఠం చేయటం మనకు జన్మతః సంక్రమించిన కర్తవ్యం, అది మన సహజకర్మ. మనకు సహజమైన కర్మను, అది ఒకవేళ దోషయుక్తమైనట్లు కనిపించి నప్పటికీ, విడిచిపెట్టరాదు.

*"సహజం కర్మ కౌంతేయ సదోషమపి నత్యజేత్"*

అని భగవద్గీత చెప్పుతోంది. అందుచేతనే, మనజీవశక్తిని క్షీణింపజేస్తున్న ప్రస్తుతవిభేదాలను, విద్వేషాలను నిర్మూలించి, మనసమాజాన్ని మరొకసారి సమైక్యము, సమన్వయపూర్ణమునైన దాన్నిగా చేయటం మన కన్నిటికన్న ప్రముఖకర్తవ్యం.

మనం పెరుగుతున్నకొద్దీ, రాజకీయాలవంటి వ్యాపకాలు వస్తూ ఉంటాయనికూడా గుర్తించుకోవాలి. రాజకీయాలు తదితరవిషయాలు కేవలం తాత్కాలికాలు, పైపైవిమాత్రమే. రాజకీయపక్షాలు వస్తాయి; పోతాయి. ఈనాడుకూడా, అనేకరాజకీయపక్షాలు ఒకదాన్నొకటి వ్యతిరేకిస్తున్నాయి. ఈనాడు ప్రజలమెప్పుతో పైమెట్టును, అధికారాన్ని పొందినపక్షం రేపు పతనంకావచ్చు; దాని స్థానంలో మరొకటిరావచ్చు. రాజకీయపక్షాలు సహజంగా అస్థిరమైనవి. కాని జాతిమాత్రం శాశ్వతం, అమరం. గత వేయి సంవత్సరాల్లో అనేకమంది రాజులు, రాజవంశాలు, అనేకపరిపాలనా పద్ధతులు అనేక రాజకీయ ఆర్థిక వ్యవస్థలు వచ్చాయి, పోయాయి. అయినా రక్తసంబంధంచేతనూ, చారిత్రకంగానూ, మనం ఒకే సంపూర్ణమైన

జాతిగా కలిసిఉన్నాం. కనుకనే, మనం ఏది శాశ్వతమో ఏది అశాశ్వతమో వివక్షణచేసి శాశ్వతమైనదాన్ని కనిపెట్టుకొనిఉండాలి. శాశ్వతమైనదాని త్రోవలో అశాశ్వతమయినది అడ్డుతగిలితే దాన్ని పరిత్యజించాలి.

*యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువం పరిషేవతే ।*
*ధ్రువాణి తస్య నశ్యంతి అధ్రువం నష్టమేవహి ॥*

(శాశ్వతమైనవాటిని వదిలిపెట్టి, అశాశ్వతమైనవాటివెంటపడేవాడు శాశ్వతమైన వాటిని కోల్పోతాడు. అశాశ్వతమైనది ఎట్లాగూ నశించేదే).

సమాజం శాశ్వతమైనది. రాజకీయాలు అశాశ్వతమైనవి. రాజకీయాల పోటీలో మన సమాజాన్ని విస్మరించి, దానిలోని ఆంతరికమైన ఏకత్వాన్ని నాశనంచేస్తే మనం ప్రాథమిక కర్తవ్యానికి వ్యతిరేకంగా ప్రవర్తించినట్లే.

## విశుద్ధభక్తి ఆహ్వానం

సంపూర్ణము, సుసంఘటితమునైన హిందూసమాజ నిర్మాణవిషయం ఒక్కటే మనందరికీ ఏకైక శ్రద్ధాకేంద్రం కావాలి. సమాజంపట్ల ఇట్టి ఏకాగ్రమైనశ్రద్ధకుఅడ్డుగాకులం,సంప్రదాయం,భాష,ప్రాంతం,రాజకీయపక్షం–ఇటువంటి ఇతరాలోచనలు–రానివ్వరాదు. అదే నిజమైనశ్రద్ధకు గీటురాయి. మీరాబాయి జీవితంలో ఒక ఉదంతం ఉంది. శ్రీకృష్ణునిపై తన భక్తిని లగ్నంచేసే యత్నంలో, బంధువులు అడ్డంకులు కల్పిస్తుంటే, తనకు సలహా ఇమ్మని కోరుతూ గోస్వామి తులసీదాసుకు ఆమె లేఖ వ్రాసింది. ఆతడు మనోహరమైన పద్యరూపంలో సమాధానం వ్రాసి పంపినాడు. 'వినయ పత్రిక'లో ఆ పద్యం కనిపిస్తుంది.

*జాకే ప్రియ న రామ వైదేహీ*
*తజియే తాహి కోటి వైరి సమ యద్యపి పరమ సనేహీ ॥*

అంటే మన ఇష్టదైవమైన శ్రీరామచంద్రుని ప్రేమించనివారిని, మనభక్తికి అడ్డుపడేవారిని, వారు మనకెంతటి స్నేహితులు ఆప్తులు అయినాసరే ఒక్కొక్కరిని కోటిశత్రువులుగా భావించాలి అనిఅర్థం. తర్వాత ఇష్టదైవ సాక్షాత్కారానికి అడ్డుతగిలిన తమ తల్లిదండ్రులను, తదితరులందరినీకూడ విడచివెళ్ళిన వారిని గురించి ఉదాహరించాడాయన. కనుక మనకు ప్రత్యక్ష దైవమైన హిందూసమాజంపట్లభక్తిని నింపుకొని, ఈనాడు మనమనస్సులను ఏలుతున్న విఘటనాత్మక వ్యామోహాలన్నీ విడిచిపెట్టాలి. లేకపోతే అవి ఆంతరిక సమైక్యాన్ని పటిష్ఠంచేసే మన ప్రాథమిక కర్తవ్యనిర్వహణకే అడ్డుతగులుతాయి.

మనకెదురయ్యే విఘటనలన్నిటినీ అణగద్రొక్కుతూ, ప్రాణప్రదమైన, ఆంతరిక ఏకత్వసందేశాన్ని ఇంటింటికి అందించాలి.సకలవైభవాలతో తులతూగుతూ జీవంతో తొణికిసలాడుతూ ఉండే జాజ్వల్యమానమైన సమాజ దేవతా స్వరూపాన్ని సాక్షత్కరింపచేసుకోవాలనే తహతహ ప్రతి హిందూహృదయంలోనూ రగిలించాలి.



# పౌరుషమయ రాష్ట్రీయజీవనం

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ స్థాపకులైన డాక్టర్ కేశవ బలీరామ్ హెడ్గెవార్ బాగా చిన్ననాటినుండి రాష్ట్రానికి అంకితమైనారు. వారు మాతృభూమిని స్వతంత్రం చేసేందుకు ఆనాడు జరుగుతున్న వివిధ ఉద్యమాలలో ప్రముఖపాత్రను వహిస్తూ ఉండేవారు; విప్లవోద్యమంలో అనేకసంవత్సరాలపాటు పాల్గొన్నారు; తదనంతరం భారతజాతీయ కాంగ్రెసు సంఘటన కార్యంలో, ఆందోళనలలో పాల్గొన్నారు.

అయితే, కేవలం బ్రిటిష్‌వారిని వెళ్ళగొట్టటమే ఈ ఉద్యమాలన్నిటిలోనూ అంతర్గతంగా ఉన్నభావన అని, ఈ భావననే జాతీయతగా భావిస్తున్నారనీ వారు త్వరలోనే గ్రహించినారు. ఆనాటి ప్రముఖవ్యక్తులలో ఎక్కువమందికి 'ఆంగ్ల వ్యతిరేకత', 'జాతీయత'లు పర్యాయపదాలుగా ఉండేవి. అట్టి అసమగ్రపు టాలోచనలపట్ల మనసంఘస్థాపకులు అసంతృప్తి చెందారు. మనజాతియొక్క, ఇతరజాతులయొక్క చరిత్రలను క్షుణ్ణంగా అధ్యయనంచేసి, రాష్ట్రం (జాతి) అనేది ఒక భావాత్మకమైన (పాజిటివ్) ఆలోచన అని, అన్యులపెడ వ్యతిరేకతపై ఆధారపడిందికాదనీ వారు గ్రహించారు జాతీయలక్ష్యనిర్ణయంలో తొల్దొల్త వీసమెత్తు

వికృతి ఏర్పడినా-మనఉద్దేశ్యం ఎంతటి శ్రేష్ఠతమమైనదైనప్పటికీ-సరిదిద్ద నలవికానంతటి విపరీతపరిణామాలకు దారితీస్తుందనికూడ వారు గుర్తించారు.

'వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్'
(అప్పుడుమనగతి అయ్యవారినిచెయ్యబోతే కోతిఐనట్లుంటుంది.)

ఈ విషయాలను గురించి గంభీరంగా ఆలోచించిన తరువాతనే వాస్తవికము, భావాత్మకము, శాశ్వతము ఐన మన జాతీయతఆధారంగా, డాక్టర్ హెడ్గెవార్ రాష్ట్రీయ స్వయంసేవక సంఘాన్ని ప్రారంభించారు.

అయితే మనజాతీయతయొక్క సరియైనభావన ఏమిటి? జాతీయత అనేభావనను నేటిప్రపంచంలో ఏవిధంగా అర్థంచేసుకుంటున్నారో ఆచరణలో పెడుతున్నారో మొదట గమనిద్దాం; జాతీయతను బాగా అర్థంచేసికొనేందుకు అది ఉపకరిస్తుంది.

## ఆధునిక విద్వాంసుల నిర్వచనం ?

'జాతి' అనే ఆలోచన పాశ్చాత్యదేశాలలో ప్రథమంగా ఎట్లా ఏర్పడింది? మొట్టమొదట వేర్వేరు జనసమూహాలు, కొన్ని సహజభౌగోళిక సరిహద్దులమధ్య జీవిస్తూఉండేవి. ఒకప్రత్యేక భూభాగంలో నివసించేప్రజలు తాము ఆ భూమికి పుత్రులమని, తమకొక స్వతంత్రజీవనవిధానం ఉందని దాన్ని తాము సంరక్షించుకోవాలని, తమవలెనే వేరుచోట్ల ఏర్పడిన జన సమూహాలప్రయోజనాలు తమప్రయోజనాలూ వేరువేరని, ఇంకా క్లుప్తంగా చెప్పాలంటే, తమకొక విశిష్టమైన అస్తిత్వం ఉందని - ఇట్టిభావనలను పెంపొందించుకున్నారు. ఆవిధంగా వారు సుసంఘటితము, అవిభాజ్యము ఐన ఒక సముదాయంగా రూపొందారు. వివిధసమయాల్లో, దేశదేశాలలోని మేధావంతులు ఈ సముదాయాలను నిర్వచించేందుకు 'జాతి' (రాష్ట్రం) అనే ఆలోచనను రూపొందించారు. వారు చెప్పిన విభిన్న అభిప్రాయాలను

నిర్వచనాలను మనం సేకరించి, వాటన్నింటి సారాన్ని గ్రహిస్తే కొన్ని స్థూలనిర్ణయాలు చెయ్యగలుగుతాం.

ప్రధానంగా ఉండవలసింది, జాతి జీవిస్తూ వికాసాన్ని పొందేందుకు సాధ్యమైనంతవరకు సహజమైన ఎల్లలుకలిగిఉన్న, ఏకఖండమైన ఒక భూభాగం. అట్టి ఒక నిర్దిష్టమైన భూభాగంలో నివసిస్తున్న ప్రజలు ఆభూమిని మాతృభూమిగా ప్రేమించి గౌరవించాలి. అదే తమ మనుగడకు భద్రతకు సమృద్ధికి ఆధారమని వారు భావించాలి. ఒక్కవాక్యంలో చెప్పాలంటే తాము ఆభూమికి పుత్రులమనే అనుభూతి వారికి ఉండాలి.

అట్టి ప్రజలు కేవలం ఒకగుంపుగా, పరస్పర సంబంధంలేని వ్యక్తులు ఒకచోట గుమిగూడి ఉన్నట్లుగా ఉండిపోరాదు. జీవనాదర్శాలు. సంస్కృతి అనుభూతులు, భావాలు, విశ్వాసాలు, సంప్రదాయాలు – వీటి సమ్మేళనం ద్వారా ఏర్పడిన ఒక నిర్దిష్టమైన జీవనపద్ధతిని వారు వికసింపజేసుకొని ఉండాలి. ఈవిధంగా సమాన సంప్రదాయాలు, సమాన ఆకాంక్షలు కలిగి తమ చరిత్రలోని సుఖదుఃఖానుభూతులను గూర్చి సమాన స్మృతులు కలిగి సమాన శత్రుమిత్ర భావనలుగలిగి, తమయొక్క ప్రయోజనాలన్నీ ఒక దానితో ఒకటి పెనవేసికొని ఏకరూపమై ఉండే సువ్యవస్థితసమాజంగా ఏకీకృతమయి, ఆ నిర్దిష్ట భూభాగానికి సంతానంగా జీవించే అట్టిప్రజలను రాష్ట్రం' (జాతి) అని వ్యవహరించవచ్చు.

## భారతమాత సంతానం - హిందువులు

ప్రపంచంలోని విజ్ఞానులందరూ అంగీకరించిన ఈ నిర్వచనాన్ని మనదేశానికి అన్వయించి చూద్దాం. ఉత్తరాన హిమాలయాలు మొదలుకొని నలుదిక్కులా వ్యాపించిన దాని శాఖోపశాఖలు, వాటిలో ఒదిగి ఉన్న భూభాగాలతోసహా–దక్షిణ సముద్రంవరకు – దానిలోని ద్వీపాలన్నింటితో సహా–ఇది ఒక సహజసిద్ధమైన, విశాల భూభాగం. ఈ భూమాతసంతానంగా

సువికసితమైన మన సమాజం ఇక్కడ అనాదిగా జీవిస్తూఉంది. ఈసమాజం, ముఖ్యంగా ఆధునిక యుగంలో, హిందూ సమాజమన్న పేరుతో ప్రసిద్ధి పొందింది. ఎందుకంటే, ఈ హిందువుల పూర్వీకులే. ఈ మాతృభూమిపట్ల ప్రేమ, భక్తి, సంప్రదాయాలను, ప్రమాణాలను ఇచట నెలకొల్పారు. ప్రజల మనస్సుల్లో ఈ మాతృభూమియొక్క సచేతన మైన సంపూర్ణస్వరూపం, దాని దివ్యత్వంపట్ల శ్రద్ధ, కలకాలం దేదీప్య మానంగా ఉంచే ఉద్దేశ్యంతో వారు వివిధ విధులను నిర్ణయించారు. వారే ఈ మాతృభూమియొక్క పవిత్రతను సమగ్రతను సంరక్షించేందుకు తమ రక్తం చిందించినారు. ఇవన్నీ చేసింది హిందువులొక్కరే అని వేల సంవత్సరాల చరిత్ర తిరుగులేని సాక్ష్యమిస్తోంది. అంటే హిందువు మాత్రమే ఈ భూమాత సంతానం అని అర్థం. అతి ప్రాచీనకాలంనుండి నేటివరకు జనించిన మహాపురుషులందరూ, ఆదర్శప్రాయమైన తమ జీవితాలద్వారా ఈ పవిత్రానుబంధాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు.

మాతృభూమిపట్లగల ఇట్టి శ్రద్ధాభక్తులే కాశ్మీరునుండి కన్యాకుమారి వరకు నివసిస్తున్న మన ప్రజలమధ్య-వనవాసులుగాని నగరవాసులుగాని-ఒకరితో ఒకరికి ఒకవిధమైన రక్తసంబంధాన్ని ఏర్పరిచాయి, వివిధ వర్ణాలు, ఆరాధనాపద్ధతులు. భాషలు-ఇవన్నీ ఈ మాతృభూమి సంతానమైన ఒకేఒక శ్రేష్ఠ, సజాతీయ, సుదృఢ, ఏకైక హిందూసమాజంయొక్క వివిధ రూపాలు మాత్రమే.

## సాంస్కృతిక ఏకత్వం

మనకు ఒకలక్ష్యంఉంది; పరమసత్యాన్ని సాక్షాత్కారం చేసుకోవడమే అది. దాని కనుగుణంగా ఒకధర్మం ఉంది; మానవజీవితంలోని అన్ని అంశాలను, అంతస్తులను తనలోఇముడ్చుకోగల్గిన, సాటిలేని విశాలదృష్టిగల ధర్మం అది. మన కొకజీవన ప్రవాహముంది; అదే మన సంస్కృతి

అది పవిత్రత, సౌశీల్యం, ధైర్యం, ఆత్మసమర్పణవంటి దివ్యగుణాలను వ్యక్తిలో ప్రేరేపించి, తద్వారా, మానవజీవిత మహోన్నతలక్ష్యాన్ని సాధించుకునేందుకు అతణ్ణి సమర్థుడుగా చేస్తుంది. లౌకికవిషయాన్ని అలౌకికం చెయ్యగల మన సంస్కృతియొక్క ప్రభావం, మన నిత్యజీవితంలో వ్యక్తమౌతూఉంటుంది. ఉదాహరణకు బాలికయే ఐనప్పటికీ, ప్రతిస్త్రీని 'అమ్మా' అని సంబోధించటం మన ఆచారం. మనభాషలన్నింటిలోను ఇదేపద్ధతి. అంటే, ఒకవ్యక్తికి అతని భార్యమినహాయించి ప్రతిస్త్రీ మాతృమూర్తియే – వయోవస్థలతో సంబంధంలేదు. మన సంస్కృతిలోని ఒక విశిష్టలక్షణమిది.

కళ్యాణగడ్ ముస్లింసుబేదారు కోడలు యుద్ధంలో చిక్కగా, ఆచక్కని చుక్కను శివాజీ, సగౌరవంగా చీరెసారెతో సాగనంపినాడు. ఈ ఉదంతం విదేశీయ చరిత్రకారుల దృష్టిలో – ముఖ్యంగా ముస్లిం చరిత్రకారుల దృష్టిలో – ఒక అసామాన్యవిషయంగా తోచవచ్చు. కాని, అది మన దివ్య సంస్కృతిని ప్రతిబింబించే ఒక సామాన్య సంఘటనమాత్రమే. అట్టిభావనే ఇప్పుట అతిసామాన్యుడిలోకూడ కనిపిస్తుంది.

ఈ సత్యాన్ని నిరూపించే మరొకఉదంతం: గాంధీజీ హత్యానంతరం రేగిన కల్లోలాల్లో, జాతి విధ్వంసక విద్రోహశక్తులు, అమాయిక ప్రజానీకంపై హత్యలు, దోపిడీ, దహనకాండలు జరిపి విలయతాండవం చేశాయి. అట్టి ఒకరాకాసిమూక ఒక ఇంటిపై దాడిచేసింది. ఆ ఇంట ఇల్లాలుమాత్రమే ఉంది. భయపడుతూనే ఆమె తలుపులు తెరిచింది. ఆమె ఒంటరిగా ఉండటం చూచిన ఆమూక క్షణకాలం స్తంభించిపోయింది. పెద్దపెద్ద రౌడీలు ఆ మూకకు నాయకులు. ఐనప్పటికీ 'మాతృవత్ పరదారేషు' (ఇతరుల భార్యలు తల్లివంటివారు) అనే మన సంస్కృతియొక్క పురాతన సందేశం వారి రక్తంలో రంగరించుక పోవటంచేత, వారు ఆమెపట్ల ఎంతో మర్యాదగా ప్రవర్తించారు. తాము ఆ ఇంటిని దోచుకొని దహనం చేయబోతున్నామని

అయినా ఆమెనుమాత్రం ఒకసురక్షిత ప్రాంతానికి చేరుస్తామని వారామెతో చెప్పారు. అంతేకాదు; ఆమెకు తోడుగా ఇద్దరిని వెంట పంపించారు. గత వేయిసంవత్సరాల వినాశకర విదేశీప్రభావానికి, నేటి 'ఉన్నతవర్గాల' సర్వత్రా స్వైరవిహారంచేస్తున్న శీలభ్రష్టతకు అతీతంగా, సౌశీల్యానికి ఇటువంటి ఉజ్జ్వలమైన ఉదాహరణలు ఇప్పటికీ మన సామాన్యప్రజానీకంలో కనిపిస్తూ ఉంటాయి. ఇది మన హృదయాల్లో పెంచిపోషించుకొన్న స్వచ్ఛము, దివ్యము ఐన సంస్కృతిలోని విశిష్ట భావనను సూచిస్తుంది. ఇట్టి భావన కేవలం మనసొత్తు.

ఇంతేకాదు. భగవదన్వేషణలో, భౌతికసమృద్ధి, గౌరవప్రతిష్ఠల సంపాదనలో మనకు మార్గంచూపిన మహర్షుల, మహావీరుల ఉజ్జ్వల పరంపర కడచిన వేలాది సంవత్సరాలలో ఇక్కడ ఉద్భవించింది. వారు పలురకాలవ్యక్తుల అవసరాలు తీరడానికి ఒక సామాజిక వ్యవస్థను ఇచట నెలకొల్పారు. సంపదయొక్క ఉత్పత్తి, పంపిణీలు సరిగా జరిగేందుకు తగిన ఆర్థిక వ్యవస్థలను ఇచట వికసింపచేశారు. క్రమబద్ధమైన సమాజ వికాసాన్ని కొనసాగించటానికి, సంరక్షించటానికి అవసరమైన రాజకీయ వ్యవస్థలను రూపొందించారు. దాని ఫలితంగానే, ఇన్నివేలసంవత్సరాల మన మనుగడలో సంపత్తులోను, విపత్తులోనూ, మిత్రత్వంలోనూ శత్రుత్వంలోనూ సమానమైన అనుభూతి మనకు కలిగింది. మనందరి ప్రయోజనాలు విడదీయలేనంతగా పెనవేసుకొనిపోయాయి.

తమ ప్రయోజనాలకు, ఇతరుల ప్రయోజనాలు విరుద్ధాలని భావించి పొరపాటున ఒకరితోనొకరు కలహించుకొని, వేర్వేరు రాజ్యాలను స్థాపించుకున్నప్పుడల్లా మనం విదేశీయులచేతుల్లో ఓడిపోయాం. చివరకు అందరం బానిసలమై కష్టాలపాలయ్యాం. మనసమాజంలోని ఒకవర్గం విదేశీశక్తులను ప్రతిఘటిస్తుంటే, వేరొకవర్గం విదేశీయులతోనే చేతులు కలపడం వల్లకూడ అదే ఫలితం ఏర్పడింది. పృథ్వీరాజ్ చౌహాన్ విషయం దీనికొక

ఉదాహరణ. మహమ్మద్ ఘోరీ అతని శత్రువు. జయచంద్రుడు మహమ్మద్ ఘోరీతో స్నేహంచేశాడు. మనదేశంలోని ఇద్దరు ప్రముఖవ్యక్తుల్లో ఒకరు దురాక్రమణచేసేవాడికి విరోధి; మరొకరు మిత్రుడు. దానిఫలితంగా పృథ్వీరాజు ఘోరీ చేతుల్లో ఓడిపోయి చనిపోయాడు. చివరకు జయచంద్రుడు కూడ నాశనమయ్యాడు. మహమ్మదు ఘోరీ రాజైనాడు. గత ఎనిమిదివందల సంవత్సరాలుగా మనం అనుభవిస్తున్నట్టి, ఈనాడు దేశవిభజనకు త్రోవ తీసినట్టి విపత్పరంపర దానితోనే ఆరంభమైంది. ఆ విధంగాకాక, మన ప్రయోజనాలు విడదీయరానివని, శత్రువులు మనకందరికి శత్రువులే అని మిత్రులు మనకందరికి మిత్రులే అని గుర్తించినప్పుడు–అది కొద్దికాలంపాటు ఐనాసరే – ఒక మహత్తరశక్తి మన జాతీయజీవనంలో ఆవిర్భవించింది. అది విదేశీశక్తులను తుత్తునియలుచేసి మనకాళ్ళదగ్గర పడవేయగలిగింది. సమగ్రమైన ఒక జాతిగా ఏర్పడటానికి అవసరమైన లక్షణాలన్నీ ఈవిధంగా శ్రేష్ఠమైన మన హిందూసమాజ జీవితంలో సమకూడాయి. కనుకనే ఈ భారతభూమిలో హిందువులదే జాతీయజీవనం. ఒక్కమాటలో చెప్పాలంటే ఇది హిందూరాష్ట్రం.

## రెండు విరుద్ధవిషయాల మేళవింపు

'రాష్ట్రం' యొక్క భావనను మనం వివరించేటప్పుడు ధర్మం సంస్కృతి మొదలగు పదాలు వినిపించేసరికి మత ప్రమేయం ఉండకూడదనే వారికి (సెక్యూలరిష్టులు) కలవరం పుడుతుంది. రాజకీయాల్లోకి మతాన్నెందుకు తెస్తారని వారడుగుతారు. స్టాలిన్ ఉదాహరణచూద్దాం. దేవుడు, మతములనేవి మూఢులను మైకంలోముంచే 'నల్లమందు' అని అతడు నిరసించాడు. అతడొకసారి 'జాతి' అంటే వివరిస్తూ ఒకే భూమిపై నివసిస్తున్న కొందరు ప్రజలయొక్క ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు ఒకటిగానున్నంతమాత్రాన జాతి అనేది ఏర్పడదు; అలౌకిక భావనానుభూతి ఒక్కటిగా ఉన్నప్పుడు మాత్రమే అది ఏర్పడుతుందని అన్నాడు.

ఉదాహరణ. మహమ్మద్ ఘోరీ అతని శత్రువు. జయచంద్రుడు మహమ్మద్ ఘోరీతో స్నేహంచేశాడు. మనదేశంలోని ఇద్దరు ప్రముఖవ్యక్తుల్లో ఒకరు దురాక్రమణచేసేవాడికి విరోధి; మరొకరు మిత్రుడు. దానిఫలితంగా పృథ్వీరాజు ఘోరీ చేతుల్లో ఓడిపోయి చనిపోయాడు. చివరకు జయచంద్రుడు కూడ నాశనమయ్యాడు. మహమ్మదు ఘోరీ రాజైనాడు. గత ఎనిమిదివందల సంవత్సరాలుగా మనం అనుభవిస్తున్నట్టి, ఈనాడు దేశవిభజనకు త్రోవ తీసినట్టి విపత్పరంపర దానితోనే ఆరంభమైంది. ఆ విధంగాకాక, మన ప్రయోజనాలు విడదీయరానివని, శత్రువులు మనకందరికి శత్రువులే అని మిత్రులు మనకందరికి మిత్రులే అని గుర్తించినప్పుడు–అది కొద్దికాలంపాటు ఐనాసరే – ఒక మహత్తరశక్తి మన జాతీయజీవనంలో ఆవిర్భవించింది. అది విదేశీశక్తులను తుత్తునియలుచేసి మనకాళ్ళదగ్గర పడవేయగలిగింది. సమగ్రమైన ఒక జాతిగా ఏర్పడటానికి అవసరమైన లక్షణాలన్నీ ఈవిధంగా శ్రేష్ఠమైన మన హిందూసమాజ జీవితంలో సమకూడాయి. కనుకనే ఈ భారతభూమిలో హిందువులదే జాతీయజీవనం. ఒక్కమాటలో చెప్పాలంటే ఇది హిందూరాష్ట్రం.

## రెండు విరుద్ధవిషయాల మేళవింపు

'రాష్ట్రం' యొక్క భావనను మనం వివరించేటప్పుడు ధర్మం సంస్కృతి మొదలగు పదాలు వినిపించేసరికి మత ప్రమేయం ఉండకూడదనే వారికి (సెక్యూలరిష్టులు) కలవరం పుడుతుంది. రాజకీయాల్లోకి మతాన్నెందుకు తెస్తారని వారడుగుతారు. స్టాలిన్ ఉదాహరణచూద్దాం. దేవుడు, మతములనేవి మూఢులను మైకంలోముంచే 'నల్లమందు' అని అతడు నిరసించాడు. అతడొకసారి 'జాతి' అంటే వివరిస్తూ ఒకే భూమిపై నివసిస్తున్న కొందరు ప్రజలయొక్క ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు ఒకటిగానున్నంతమాత్రాన జాతి అనేది ఏర్పడదు; అలౌకిక భావనానుభూతి ఒక్కటిగా ఉన్నప్పుడు మాత్రమే అది ఏర్పడుతుందని అన్నాడు.

ఉప్పతింటున్నాం అని వారు అనుకొంటున్నారా? ఇచ్చటి పరంపరకు తాము వారసులమని, దేశాన్ని పరంపరను సేవించడం తమ అదృష్టమని భావిస్తున్నారా? లేదు. మతవిశ్వాసం మార్చుకోవటంతోబాటు ఈ జాతిపట్ల ప్రేమాభిమానాలు, శ్రద్ధాభక్తులు వారిలో అడుగంటిపోయాయి.

అది అంతటితో ఆగలేదు. దేశ శత్రువులతో తాదాత్మ్యాన్నికూడా పెంపొందించుకొన్నారు.కొన్నివిదేశాలను తమపవిత్రస్థలాలుగాచూస్తున్నారు. 'షేకు', 'సయ్యద్' అన్నపేర్లతో తమను వ్యవహరించుకోనారంభించారు. 'షేకు' 'సయ్యద్' అనేవి అరేబియాదేశంలోని కొన్ని తెగలపేర్లు. అటువంటప్పుడు, తాము వారికి సంతానంగా ఈ జనం ఎట్లా భావించగలిగారు? అంటే వారు ఇచ్చటి తరతరాల జాతీయభావనలతో తెగత్రెంపులుచేసికొని దురాక్రమణకారుల మానసపుత్రులై పోయారు. ఇక్కడికి తామువచ్చింది విజయాన్నిసాధించి, తమసామ్రాజ్యాలను స్థాపించేందుకే అని, ఇప్పటికీ వారు విశ్వసిస్తున్నారు. కాబట్టి, వారి మతంలోనే కాదు, జాతీయతా తాదాత్మ్యంలోకూడా మార్పువచ్చింది. తమ మాతృభూమిని నట్టేటిలోముంచి శత్రుకూటమిలో చేరటమనేది విద్రోహంకాక మరేమౌతుంది ?

ఒకసారి అమెరికాకు చెందిన ఒక ప్రముఖ ఆచార్యుడు 'ముస్లింలు క్రైస్తవులు ఇక్కడివారేకదా, వారిని మీలో ఒకరుగా ఎందుకుభావించరు?' అని నన్నుప్రశ్నించాడు. దానికి సమాధానంగా, 'ఒకవేళ, మాదేశస్థుడొకడు అమెరికాకుపోయి, అచట స్థిరనివాసమేర్పరచుకొని అమెరికా పౌరస్వత్వాన్ని స్వీకరించాలని కోరాడనుకుందాం; కాని అతడు మీ లింకన్, వాషింగ్టన్, జఫర్సన్ మొదలైనవారిని తన జాతీయవీరులుగా అంగీకరించడు, అనుకొందాం. అప్పుడుకూడా అతణ్ణి, మీరు అమెరికాజాతీయుడుగా స్వీకరిస్తారా? నిజం చెప్పండి' అని అతనిని నిగ్గదీసి అడిగాను. 'స్వీకరించం' అని అన్నాడు.

"అయితే అదే సూత్రాన్ని మా దేశం విషయంలోకూడ ఎందుకు వర్తింపచేయరాదు ? ఈ దేశంలోనివసిస్తూనే, ఈ దేశంయొక్క గౌరవానికి పరంపరకు విరుద్ధంగా ప్రవర్తిస్తూ, మా జాతీయవీరులను, జాతీయశ్రద్ధా కేంద్రాలను అవమానించే వారిని మేము, మా స్వజాతీయులుగా భావించాలని మీ రెట్లాచెప్పగలరు?" అని అన్నాను.

## పెంపకంకాదు, సంస్కారం ముఖ్యం

ఒక దేశంలో పుట్టినంతమాత్రాన లేదా పెరిగినంతమాత్రాన తదనుగుణమైన మానసికస్థితిలేనంతకాలం, ఒకవ్యక్తికి ఆభూమిలో జాతీయుడయ్యే అర్హతలభించదు, మానసికంగా అంకితంకావడమే జాతీయతను నిర్ణయించే సరియైనసూత్రమని యావత్ప్రపంచం అంగీకరించింది.

నీతిని బోధించే చక్కనికథ ఒకటుంది. ఒకప్పు డొక ఆడసింహం అడవిలో తిరుగుతూ ఒక నక్కపిల్లనుచూచి, తనవెంట గుహకు తీసుకొనిపోయింది. అక్కడ సింహంపిల్లలున్నాయి. తనబిడ్డలతోపాటు ఆ నక్కపిల్లకుగూడ తనపాలిచ్చి పెంచసాగిందాతల్లిసింహం. అవన్నీ క్రమంగా పెరుగుతూ, అన్నదమ్ముల్లా ఆడుకుంటున్నాయి. అవి ఒకసారి అడవిలో ఒక ఏనుగును చూచాయి. అంతపెద్దజంతువును చూడటంతోనే ఆ నక్కపిల్ల హడలిపోయి పారిపోదామని ఏడుపు మొదలుపెట్టింది. అప్పు డాసింహంపిల్లలు, "ఇంతకాలానికి ఇటువంటి చక్కనివేట మనకు లభించింది. భయమైతే నీవు ఇంటికిపో, దానిసంగతి మేము చూసుకుంటాం," అని అన్నాయి. ఆ నక్కపిల్ల పరుగుపరుగున గుహకుచేర, తన పెద్దరికాన్ని లెక్కచేయకపోవడంవల్ల తమ్ముళ్ళకు ఎంతటికష్టం వచ్చిపడిందో తల్లికి వివరించిచెప్పింది. తల్లి ఒక్క చిరునవ్వునవ్వి 'నాయనా నాపాలే త్రాగి పెరిగావు, కాని నీ జాతిలక్షణంమాత్రం మారలేదు' అంది.

శూరోఽసి కృతవిద్యోఽసి దర్శనీయోఽసి పుత్రక ।
యస్మిన్ కులే త్వముత్పన్నః గజస్తత్ర న హన్యతే ॥

(నీవు ధైర్యవంతుడవే. విద్యావంతుడవే. అందగాడవే; సందేహంలేదు; కాని నీ జాతిమాత్రం ఏనుగుల్ని చంపే జాతికాదు.)

జాతులవిషయంకూడ అట్టిదే. ఒక ప్రత్యేక భూభాగంపై కలసి మెలసి జీవించినంతమాత్రాన సమానస్వభావం గుణములుగల ఏకాత్మక జాతీయ సమాజం ఏర్పడదు. క్రొత్తగావచ్చినవారు తమ జీవనదృక్పథంలో పూర్తిమార్పు తెచ్చుకొని, మరోజన్మఎత్తినారా అన్నట్లు అచటి ప్రాచీన జాతీయపరంపరలో లీనమై పోవాలి.

ప్రజాస్వామికదేశమైన ఇంగ్లండు ఉదాహరణ చూడండి. వంద ఏండ్లక్రితం, జర్మనులు కొందరు ఇంగ్లండులో స్థిరనివాసమేర్పరచుకొని పౌరసత్వం పొందారు. వారిని పరాయివారుగా అచట ఎవరూ భావించలేదు. ఇంగ్లండుదేశపు సేవకుడుగా వారిలో ఒకడు మనదేశానికి వచ్చాడు. అతడు మధ్యపరగణాల్లో ( నేటి మధ్యప్రదేశ్ ) ఐ. సి. యస్. అధికారి. 1914 లో ప్రపంచయుద్ధం ఆరంభంకాగానే, జర్మనీపట్ల అతని లోని మమత్వం పెల్లుబకవచ్చుననే సంశయంకొద్ది అతణ్ణి నిర్బంధించి కారాగారంలో ఉంచారు. జాతీయతపట్ల ఆంగ్లేయులకుగల పరిణతమైన, సవ్యమైన అవగాహనకు ఇది నిదర్శనం.

మనజాతి విషయంకూడ అట్టిదే. కేవలం మనదేశంలో పుట్టడం పెరగడం, నివసించడాల్లో సమానత ఉన్నంతమాత్రాన, ఈ దేశవాసు లందరిలోను, సమానమైన శ్రద్ధావిశ్వాసాలు, సద్గుణాలు, సమాన జీవనవిధానం ఉంటాయని చెప్పలేం.

## బానిసత్వాన్ని త్రెంచుకునేందుకు ఆహ్వానం

అందుకనే. ఇచట ఉన్న క్రైస్తవులు, మహమ్మదీయులు, తమలో ఉన్న విదేశీమనస్తత్వాన్ని విడిచిపెట్టి మన అందరికీ చెందిన జాతీయ జీవనప్రవాహంలో విలీనం కావాలని మాత్రమే మనం కోరుతాం.

కేవలం కొద్దిమంది ముస్లిములు మాత్రమే దండెత్తి ఇచటకువచ్చినారని అందరికీతెలుసు. అట్లాగే విదేశీ క్రైస్తవప్రచారకులుకూడ కొద్దిమందేవచ్చారు. ఈనాడు ముస్లిములు క్రైస్తవులు అపరిమితంగా పెరిగిపోయారు. వారు చేపలసంతతి పెరిగినట్లుపెరిగిపోలేదు. వారు ఇక్కడి ప్రజల్లో మతంమార్పిడి చేశారు. ఆవిధంగా వారిసంఖ్య పెరిగింది. మనమంతా ఒకే మూలస్రోతస్సు నుండి ఉద్భవించామని చెప్పగలం. అట్టి మూలాధారమైన ఈ హిందూ సమాజం నుండి కొందరు వెలికిలాగబడి ముస్లిములుగా మార్చబడ్డారు. మరికొందరు క్రైస్తవులయ్యారు. మిగిలినవారు మార్పిడికి లొంగక హిందువులుగా ఉండిపోయారు. మతం మార్చుకొన్న వీరంతా ప్రాచీనమైన ఈ కుదురునుండి బయటికి ఎట్లా పోయారు? క్రొత్తమతాలు మెరుగైనవి అని ముచ్చటపడి మారినారా? మరి చరిత్రలో చెప్పుకోతగ్గ ఉదాహరణ, అట్టిది, ఒక్కటీ కనబడదే!

పైగా ప్రాణభీతి, బలాత్కారం, పదవీవ్యామోహం, ప్రభువులను మంచిచేసికోవడానికి వారి పద్ధతులను ఆచారాలనుపాటిస్తూ, చివరకు వారి మతాన్నికూడా స్వీకరించటం – ఇట్లాంటివి కారణమని చరిత్ర చెప్తోంది. ఈ మతాంతరీకరణలో పెద్ద దగాకూడా ఉండేది. గోమాంసాన్నో, ఒక రొట్టెముక్కనో, గ్రామంలోని ఏచెరువులోనో విసరేవారు. ఆసంగతి తెలియని గ్రామీణులు మామూలుగా ఆ నీటిని ఉపయోగించేవారు. ఆ మరునాటి ఉదయం, ఒక మౌల్వీయో, ఫాదరీయోవచ్చి–కలుషితమైన నీటిని త్రాగిన కారణంచేత గ్రామీణులందరూ మతాన్ని కోల్పోయారని, ఇంక తమ మతంలో చేరటంకన్న వారికి మరోదిక్కులేదని ప్రకటించేవారు! ఈవిధంగా ఉత్తరాన ఇస్లాంలోకి, పశ్చిమతీరాన క్రైస్తవంలోకి గ్రామాలకు గ్రామాలు మారిపోయాయి. ఇది పచ్చిమోసం రాజకీయ పెత్తనం చెలాయించేందుకు తమ సంఖ్యపెంచుకోవాలనే పిచ్చి ఉత్సాహమిది, ఇది మత ప్రచారంకాదు. మతమనే ముసుగుదాల్చిన ఒక రాజకీయపన్నాగం. విదేశీ దుర్క్రమణకారులు

మన ప్రజలను రాజకీయంగాను, సాంస్కృతికంగాను, బానిసలుగా చేసికోవటమేగాక చివరకు వారిని తమ మతంలోకికూడా మార్చుకున్నారు. అదికూడా ఒకవిధమైన విదేశీఆధిపత్యమే. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ఆధిపత్యాలున్నట్లే, అది మతపరమైన ఆధిపత్యం.

మనలోంచి విడిపోయి, శతాబ్దాలతరబడి ధార్మిక దాస్యంలో మ్రగ్గిపోతున్న మనసోదరులను, మరల వారి తాతముత్తాల కుదుటికి ఆహ్వానించటం, మన విధ్యుక్తధర్మం. నిజాయితీగల, స్వాతంత్ర్య ప్రియులైన మానవులుగా, వారందరూ తమలోని బానిసత్వపు చిహ్నాలను తొలగించుకొని, తమ పూర్వీకుల ఆరాధనాపద్ధతులను, జాతీయజీవనాన్ని అనుసరించాలి. దాస్యమెట్టిదైనా సరే, అది మన స్వభావానికి ప్రతికూలం కాబట్టి దాన్ని తొలగించుకోవాలి. మనజాతీయజీవనంలో తమ సొంతస్థానాన్ని తిరిగి చేరుకొమ్మని అట్టి సోదరులందరిని మనం ఆహ్వానిస్తున్నాం. దారి తప్పిన సోదరులందరూ తిరిగివచ్చిననాడు మనమంతా పెద్దఎత్తున దీపావళి పండుగ జరుపుకోవాలి.

బైబిల్లో కట్టుతప్పిన కొడుకు కథ ఒకటున్నది. తన వాటా పంచుకొని, ఇల్లూ వాకిలీ విడిచి అతడెక్కడికో వెళ్ళిపోయాడు; దూబరా వ్యయం చేసి బికారైపోయాడు; మళ్ళీ వాళ్ళ ఊరికే వచ్చాడు; కానీ ఇంటికి వెళ్ళడానికి ముఖం చెల్లలేదు. ఊరి బయట ఎక్కడో ఉంటున్నాడు. ఒకనాడతని తండ్రి పొలం వెడుతూ దూరంగా ఉన్న ఆ కొడుకును చూచాడు.

కొడుకు సిగ్గుతో తలవంచుకొని నిలబడ్డాడు. తండ్రి కొడుకును దగ్గరగా పిలిచి, అక్కున చేర్చుకొని, వచ్చావా నాయనా! ఎంతో సంతోషంగా వుంది" అన్నాడు. ఇంకో కొడుకును పిలిచి ఇంటికి వెళ్ళి విందేర్పాటు చేయమన్నాడు. తండ్రిని అప్పుడా కొడు కడిగాడు. "నాన్నా ఇన్నాళ్ళుగా

నిన్నే సేవిస్తూ ఇక్కడున్నాను. నా గౌరవం కోసమని నీవెప్పుడూ విందు చేయలేదు. వీడేమో డబ్బంతా తగలేస్తే వీడి గౌరవానికై పెద్ద విందు చేస్తున్నావు నువ్వు" అన్నాడు. తండ్రన్నాడూ "చూడు బాబూ! వీడు ఎక్కడికో వెళ్ళిపోయాడు. వీడు మరింక దక్కడనుకున్నాను. భగవంతుని దయవల్ల నా కుమారుడు నాకు దక్కాడు. ఎప్పట్లాగానే ఈతని పట్ల నా వాత్సల్యం పొంగులు వారుతోంది. ఇతను తిరిగి ఇంటికి వచ్చినందుకు మనమంతా ఆనందించక్కర్లేదా? ఇతన్ని మన్నించి మన్ననచేయనక్కర లేదా" అన్నాడు.

అలాగే మన ఇల్లొదిలి పెట్టి ఎక్కడెక్కడో తిరిగి, తిరిగి ఇంటి పట్టుకు చేరిన ఈ సోదర బృందంపట్ల మనం ప్రేమాభిమానాలను చూపాలి. స్వాగతించాలి. గౌరవించాలి. ఇదంతా ఒక సంతోష సమయం. దీంట్లో ఎట్టిబలవంతమూ లేదు. ఇది ఒక ఆహ్వానం మాత్రమే; పరిస్థితులను సరిగా అర్థం చేసికొని, పరంపరాగత హిందూ జీవనంలో మళ్ళీ కలిసిపోయి, వేష భాషల్లో, ఆచార వ్యవహారాల్లో, అశుభంలో శుభంలో అన్నింటితో తాదాత్మ్యం చెందవలసిందిగా ఒక అభ్యర్థన మాత్రమే.

హిందూ, ముస్లిం, క్రైస్తవులు తదితరులందరిమధ్య సమైక్యాన్ని ఆర్థిక, రాజకీయరంగాలలో సాధించగలిగామని కొందరు చెప్పుకుంటూ ఉంటారు. ఐతే, అట్టి ఏకత్వాన్ని మరింత సమగ్రంచేసుకొని, తప్పిపోయిన మన తమ్ముళ్ళను హిందూజీవన విధానంలోకి మళ్ళీ ఎందుకు చేర్చుకోరాదు? ఆర్థిక, రాజకీయ రంగాల్లో సమైక్యాన్నిగురించి కృషిచేస్తున్నామనేవారితో "ఆర్థిక, రాజకీయ రంగాల్లో మాత్రమేగాక, మేము సాంస్కృతిక, ధార్మిక రంగాల్లోకూడ సమైక్యాన్నికోరుతాం" అని చెప్పుతాం. మన ఇళ్లూ వాకిళ్లు గుళ్ళూ గోపురాలు, సంస్కృతీ సంప్రదాయాలు చేతులుచాచి వారిని ఆహ్వానిస్తున్నాయి. నిజానికి ఇదే విశాలదృష్టి.

## పరాక్రమ వాదాన్ని పునరుద్ధరించాలి

అనేకులు ఇట్లాగే లోలోపల అనుకొంటూ ఉంటారు. ఉదాహరణకు: పండిత జవహర్‌లాల్ నెహ్రూ 'సంస్కృతీ కే చార్ అధ్యాయ్' అనే హిందీ పుస్తకానికి తొలిపలుకు వ్రాస్తూ, హిందూసంస్కృతిపట్ల — వారి మాటలలోనే చెప్పాలంటే భారతీయ సంస్కృతిపట్ల — తమ అంతరాంతరాల్లోగల గాఢ ప్రేమాభిమానాలను వ్యక్తంచేశారు. మన సంస్కృతికి సహజమైన జీర్ణశక్తి మళ్ళీ పెంపొందాలనే తమ తీవ్రవాంఛనుకూడ ప్రకటించారు.

మన సాంస్కృతికచరిత్రలో రెండు విభిన్న దశలున్నాయని వారు చెప్పారు. తొలిదశలో మనపైకి దండెత్తివచ్చిన శకులు, హూణులు మొదలైనవారందరూ తమతమ మతాలను, ఆచారాలను వదలుకొని తమను రాజపుత్రులని వ్యవహరించుకోసాగారు. వారంతా ఎంతో సంతోషంగా మనలో కలిసిపోయారు. అప్పట్లో మనకు ధైర్యం, సామర్థ్యం, జీర్ణశక్తి ఉండేవి. దానివల్ల వారందరినీ పూర్తిగా మన జాతీయజీవనంలో, సాంస్కృతిక మహాప్రవాహంలో విలీనం చేసుకొన్నాం. వారిలోఉన్న మంచినికూడ స్వీకరించాం. రెండవదశలో అత్యంత తీవ్రవాదులైన దురాక్రమణకారులు దండెత్తివచ్చారు. అప్పట్లో మనవారందరూ విధి, నిషేధ నియమాలచాటున దిగి తమ సాంఘికవ్యవస్థయే తమను సంరక్షించాలని ఆశించారు. అట్లా వారు సంకుచితమనస్కులై, గిరిగీసుకొని కూర్చున్నారు. ఇట్టి ధోరణి విడిచిపెట్టి జీర్ణంచేసుకోవాలనే మన పురాతన వాంఛను పునరుద్ధరించుకోవాలి అని వారు వ్రాశారు,

వారు రెండుదశలు మాత్రమే చెప్పారు. కాని మరొక అంశంకూడా ఉంది. హిందూసంస్కృతి అంటే అభిమానం అంటూనే విదేశీధాటికి

తట్టుకోలేక దండెత్తివచ్చినవారికి మోకరిల్లటంద్వారా తమ సంస్కృతిని సంరక్షించుకోగలమని భావించి, శత్రువుల ఆచారాలను, సభ్యతను కొందరు పాటించసాగారు. గతంలో ఇట్టిది జరిగింది. ఏభై, అరవై ఏళ్ళక్రితం హైద్రాబాద్‌నవాబుదగ్గర వజీరుగా పనిచేసే హిందువొకడు, అత్యంత శ్రద్ధాభక్తులుగల ముస్లింవలె రోజుకు ఐదుసార్లు నమాజు చేస్తుండేవాడు. ఇది కేవలం శరణాగతి. మొదటిదశ పరాక్రమవాదమనుకుంటే, రెండవది సంకుచితవాదమని భావిస్తే, ఇక ఇది శరణాగతివాదమవుతుంది. ఈనాడు కూడా ఇది కొనసాగుతూనే ఉంది. భాషావిషయంలోకూడా ఇట్లానే ఉంది. మన సైనికఆజ్ఞల్లో మూడవవంతు ఆంగ్లం, మరోమూడవవంతు పార్శీ పదాలు ఉపయోగిస్తున్నారు. ఈప్రకారం పాళాలు తూచటం, లెక్కలు కట్టటం మనసమాజంలో సామరస్యాన్ని, సమైక్యాన్ని సాధించగలదా? ఇది కేవలం దురాక్రమణ చేసినవారిని మంచిచేసికొందాం అని వారి అడుగులకు మడుగులొత్తడమే ఔతుంది. శత్రువులు లొంగటంలేదుకనుక సంకటంలోంచి బయటపడేందుకు ఈ శరణాగతివాదం మనవాళ్ళను ఆకర్షించింది.

మనం పరాక్రమవాదాన్ని పునరుద్ధరించాలి. దానికై ఇచట నివసించే ప్రతి హైందవేతరుడు ఒక రాష్ట్రధర్మం, ఒక సమాజధర్మం, ఒక కులధర్మం (వంశాచారం) పాటించవలసి ఉందనీ, కేవలం వ్యక్తిధర్మ నిర్వహణలో మాత్రమే అతడు, తన అంతఃప్రేరణకు అనువైన మార్గాన్ని అనుసరించవచ్చు అని మనం స్పష్టంచేయాలి. ధర్మాలన్నీ నిర్వర్తించిన తర్వాత వారిలో ఎవరైనా ఖురాన్‌షరీఫ్‌నో, బైబిలునో చదివాను; ఆ ఆరాధనా విధానం నా మనస్సుకు నచ్చింది; ఆ పద్ధతిలోనే మరింత చక్కగా భగవంతుని ఆరాధించుకోగలను-అని అనుకొంటే మనకెట్టి అభ్యంతరంలేదు. ఆవిధంగా జీవితంలో కొంతమేరకు స్వేచ్ఛగా వ్యవహరించేందుకు అవకాశముంది. మిగిలిన విషయాలన్నిటిలోనూ, అతడు తప్పనిసరిగా, ఈ జాతీయ ప్రవాహంలో లీనంకావాలి. అదే నిజమైన సమరసత.

గతంలో మనం అదేవిధంగా నడుచుకున్నాం. అనేకులకు మనం ఎల్లప్పుడు ఆతిథ్యమిస్తూనే ఉన్నాం; స్వాగతం పలికాం. అయితే ఇచట జీవించేవారంతా, మన జాతీయనియమాలను, ఆచారాలను పాటించాలని మనం కోరినాం. అనేక శతాబ్దాలక్రితం, కిరాతకులైన అరబ్బులు, తురుష్కులు పర్షియాపై దండెత్తినపుడు, కొందరు పార్శీలు తమ మాతృభూమిని వీడి పవిత్రమైన అగ్నిని, పవిత్ర గ్రంథాన్ని వెంటనిడుకొని సూరత్‌లో దిగారు. అచటి మహారాజైన యాదవరాణా వారికి స్వాగతం పలికారు. వారిని ఇక్కడ ఉండనియ్యాలంటే ఏంచేయాలి, చెప్పండని ద్వారకాపీఠాధిపతులను అర్థించాడు. గోమాంస భక్షణను విడిచిపెట్టి, గోమాతను జాతీయ శ్రద్ధా కేంద్రంగా భావిస్తూ, ఇక్కడ ప్రశాంతంగా జీవించండని పార్శీలను ఆదేశించాడు. జరతుష్ట్రుని అనుయాయులైన వీరు ఈనాటికిగూడా ఆ వాగ్దానాన్ని పాలిస్తూనే ఉన్నారు. వారు తమ మతాన్ని చెక్కుచెదరకుండా కాపాడుకుంటూ, ఇక్కడ జీవిస్తూ ఇచటి జాతీయజీవనగంగలో పూర్తిగా లీనమైపోయారు.

ఒకసారి నెహ్రూ జబల్‌పూర్‌లో మాట్లాడుతూ, చారిత్రక యుగంలో హూణులను, శకులను మనలో లీనంచేసికోగలిగినట్లు, ఈనాడు ముస్లిములను విలీనంచేసికోలేకపోవడానికి కారణం కనిపించటం లేదన్నారు. మన జాతీయ జీవనాన్ని సంఘటిత పరచేందుకు ఏకైకమార్గం పైనచెప్పిందే. ఇది నిర్వివాదం,

'హిందూరాష్ట్రం' అంటే ఇదే ఉద్దేశ్యం. ఇదే ఇచట నివసించే హైందవేతరులపట్ల మనభావం. వారి విషయమై హేతుబద్ధము. ఆచరణ యోగ్యము, నిర్దుష్టము ఐన మార్గం ఇది ఒక్కటే.

ఇది ఇంతటి హేతుబద్ధము, భావాత్మకము ఐన దృష్టియే ఐనప్పటికి, ఇచట నివసించే సాటిపౌరులైన ముస్లిముల, క్రైస్తవుల అస్తిత్వానికే హిందూజాతీయభావన ప్రమాదకరం అని, దానివలన వాళ్ళను తరిమివేసి నాశనం చేయటం జరుగుతుంది అని కొందరు ఊహిస్తుంటారు. మన జాతి తీరునుగూర్చి ఇంతకన్న అసమంజసమైన ఆలోచన మరొకటి ఉండదు.

సర్వగ్రాహకమైన మనసాంస్కృతిక వారసత్వానికి ఇంతకంటె అపచారం ఉండబోదు. ఉదాహరణ చూపాలంటే, ఛత్రపతిశివాజీ ఆధ్వర్యంలో ఏర్పడిన మొన్న మొన్నటి హిందూపునరుజ్జీవన యుగంలోకూడా, అతని సైనికాధికారుల్లో రణదుల్లాఖాను ఒకడని మనకు తెలియదా ? తదనంతర కాలంలో, హిందూ స్వరాజ్య పునరుత్థానానికై జరిగిన జీవన్మరణసమస్య లాంటి పానిపట్టుయుద్ధ రంగంలో (1761) కీలకప్రాయమైన శతఘ్నిదళానికి అధిపతి ఇబ్రహీంగార్ది. అటువంటి చారిత్రకసాక్ష్యాలు, జాతీయసంప్రదాయాలు వేలకొలది సంవత్సరాలుగా అనేకంగా కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నప్పటికీ-హిందూజాతి తన ఔన్నత్యాన్ని మళ్ళీపొందిందంటే, హైందవేతరులు కష్టాలపాలవుతారని కొందరు చెప్పటం ఎంత హాస్యాస్పదం.

## జాతీయ సమైక్యానికి పునాదిరాయి

మన రాజకీయనాయకులు, 'జాతీయసమైక్యం', 'భావసమైక్యం' అని మాటలు చెపుతూఉంటారు. అయితే అందరినీ ఒకటిగాచేసే ఆ 'సమానభావన' ఏమిటి ? జాతినంతనూ కలిపిఉంచి, నూతనోత్సాహం నింపి వైభవోపేతంగా చేయగల శాశ్వతమైన జాతీయ జీవనస్రోతస్సులేవి ?

అతి ప్రాచీనకాలంనుండి మనం పవిత్రమాతృభూమిగా భావించే ఈ దేశంపట్ల ప్రజ్వరిల్లే భక్తిభావన మొదటిది.

మనమంతా ఒకే మాతృదేవతయొక్క సంతానం అనే గుర్తింపువల్ల జనించిన స్నేహమయ సోదరభావం రెండవది.

సమానసంస్కృతీ వారసత్వాలు, సమానచరిత్ర పరంపరలు, సమాన ఆశయాకాంక్షలు-వీటివల్ల జనించిన జాతీయ జీవనప్రవాహాన్ని గురించిన గ్రహింపు మూడవది.

ఈమూడువిలువలు – ఒకేమాటలో చెప్పాలంటే, హిందూరాష్ట్రీయత-మన జాతీయసౌధానికి పునాదిరాయి.

# 2. ప్రాదేశిక రాష్ట్రవాదం

## 1. మూలకారణాలు

బాగా ఆలోచించి, సన్నిహితులతో సంప్రదించిన తర్వాతనే, పూజ్య డాక్టర్‌జీ మన సంఘటనకు రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ అన్న పేరు పెట్టారు. సహజంగా చాలా పేర్లు సూచింపబడటం, ప్రతిపేరుకు ఏదో అభ్యంతరం రావడం జరిగింది. ఇప్పుడున్న పేరుకుసైతం కొందరు అభ్యంతరం తెలిపారు. ఇందులో 'రాష్ట్రీయ' అనేపదంఉంటే, హిందువులకె పరిమితమైన ఈసంఘటనలో ముస్లిం, క్రైస్తవాదులకుగూడా ప్రవేశమివ్వ వలసివస్తుంది. గనుక 'హిందూ స్వయంసేవక సంఘ్' అనేపేరు ఉంచాలని కొందరన్నారు.

## 'రాష్ట్రీయ' ఎందుకు? 'హిందు' ఎందుకు కాదు?

'రాష్ట్రీయ' శబ్దమే ఎందుకు వాడారు? దీని వెనుకనున్న ఆశయాన్ని సరిగా తెలియజేసే ఉదంతం ఒకటి ఉంది. బొంబాయి నగరంలో 'హిందూ కాలనీ' అనేపేట ఒకటుంది. అక్కడి వ్యక్తులు కొందరు, ఆ పేరులోని కాలనీ' అన్న విదేశీపదాన్ని మార్చటానికి ఒకచోటచేరారు; ఆ సమయానికి బొంబాయిలోనే ఉన్న పూజ్యులైన మన సంఘస్థాపకులనుకూడా ఆ సభకు

ఆహ్వానించినారు. వారి అభిప్రాయాన్ని కోరినారు. దానికి వారు ముందు 'హిందూ' అన్న పదాన్ని మార్చవలసి ఉంటుందన్నారు. అక్కడ చేరిన వారంతా నిష్ఠాగరిష్ఠులైన హిందువులు కనుక ఈసూచన విని చకితులైనారు. "నిష్ఠగల హిందువులై ఉండికూడా మీరు 'హిందూ' పదాన్ని వ్యతిరేకిస్తున్నారే" అని డాక్టర్‌జీ నడిగారు. "హిందూపదంపట్ల నాకెట్టి వ్యతిరేకత లేదు. స్వదేశంలోనే హిందువులొక వలసను (కాలనీ) ఏర్పరుచుకొంటున్నారనే అర్థంవచ్చే ఈ పేరును నేను వ్యతిరేకిస్తున్నాను. హిందూస్థానంలో హిందువులకొక వలస ఉండటమేమిటి? ఇంగ్లీషువారు హిందూస్థానంలో ఒకచోట నివాసమేర్పరుచుకొని 'బ్రిటిష కాలనీ' అనే పేరుపెట్టారంటే అర్థంఉంది. అలాగే మీరు ఇంగ్లండువెళ్ళి అక్కడ మీ నివాసానికి 'హిందూ కాలనీ' అన్న పేరు పెట్టారంటే అది సమంజసం. అంతేగాని ఇంగ్లండులో 'బ్రిటిష కాలనీ' సంయుక్తరాష్ట్రాలలో 'అమెరికను కాలనీ' హిందూదేశంలో 'హిందూ కాలనీ' ఇవన్నీ అసందర్భాలు. ఇది మా మాతృదేశం కాదనీ, బయటనుండి వచ్చి ఇచట వసతి ఏర్పరుచుకొన్నాం అనైనా అంగీకరించండి, లేదా 'హిందూ' అన్న పదాన్నైనా మార్చండి" అని అన్నారు వారు. అయితే స్వదేశంలోనే ఒక 'హిందూ కాలనీ'ని ఏర్పరచుకోవటంలోని అనౌచిత్యంగాని, అసందర్భంగాని, వారు గుర్తించలేకపోయినారు. కాబట్టే ఇప్పటికీ ఆపేరు అట్లాగే ఉంది.

దీన్నిబట్టి మన సంఘటనకు "రాష్ట్రీయ" పదాన్నే ఎందుకు స్వీకరించారో 'హిందూ' పదాన్ని ఎందుకు వాడలేదో గ్రహించవచ్చు. మన దేశంలో "రాష్ట్రీయ" శబ్దానికి సహజమైన అర్థం "హిందు" అనే. కనుక 'హిందూ' అన్నపదం ప్రత్యేకంగా ఉపయోగించనక్కరలేదు. 'హిందూ' పదాన్నివాడితే, దానిఅర్థం, ఈ దేశంలోని అసంఖ్యాక జాతులలో మనదికూడ ఒకజాతి, అని మనల్నిమనం పరిగణించుకొంటున్నామని అర్థం. అంటే ఈదేశ రాష్ట్రీయులుగా మనకున్న సహజ అస్తిత్వాన్ని మనం గుర్తించటం

లేదని అర్థం' అని డాక్టర్‌జీ అనేవారు. 'రాష్ట్రం' అంటే ఏమిటి ? అన్న విషయంపట్ల మనదేశంలో చాలా పొరపాటు అభిప్రాయాలున్నాయనేది మాత్రం నిజం. బొంబాయి ఉదంతం దానికొక నిదర్శనం.

## ఆంగ్లేయుల నాటకం

ఇట్టి పొరపాటు అభిప్రాయం ఏవిధంగా ఏర్పడింది ? వేయిసంవత్సరాలుగా మనదేశంపై అనేక విదేశీ ఆక్రమణలు జరిగాయి. ముందుగా దండెత్తివచ్చిన గ్రీకులను, శకులను, హూణులను, ఓడించి తరిమివేశాం. ఇక్కడ మిగిలిపోయినవారంతా హిందూసమాజంలో లీనమైపోయారు. కానీ గత పది పన్నెండు శతాబ్దాలలో దండెత్తివచ్చినవారిని మాత్రం తరిమివేయలేకపోయాం. వారిని లీనం చేసుకోవటంకూడా అసాధ్యమయింది. వారొక ప్రత్యేకవర్గంగా ఇచ్చట అస్తిత్వమేర్పరుచుకొని, విదేశీయులుగానే దేశాన్ని పరిపాలించారు. చివరిపరిపాలకులైన ఆంగ్లేయులు అనేకవేలమైళ్ళ దూరాన ఉండి ఇచట తమ ప్రభుత్వం కొనసాగించినారు. వారు లౌక్యం తెలిసినవారు. కనుకనే స్వాతంత్ర్యంకోసం పోరాడాలనే శక్తినీ, ఉత్సాహాన్నీ ప్రజల్లో కలిగించే విశ్వాసాలను వారిమనస్సులనుండి తొలగించటం ద్వారా మాత్రమే, తమ సువిశాల సామ్రాజ్యాన్ని ఇచ్చట నిలుపుకోగలమని వారు తెలుసుకొన్నారు. మరి, ప్రజల్లో ఉన్నట్టి విశ్వాసమెట్టిది ?

ఈదేశంలో ప్రతిఒక్కడు తన మాతృభూమిని ఆరాధిస్తాడు. తాత్కాలికంగా సమైక్యం భంగమైనప్పటికీ, ఇచటి ప్రజలు ఒకపరిపూర్ణమైన సుసంఘటిత సమాజంగా ఉన్నారు. తీవ్రమైన ఆత్మాభిమానము, స్వాతంత్ర్య పిపాస, తమ సంస్కృతీ పరంపరలపట్ల శ్రద్ధాభక్తులు, వారిరక్తంలో ఉన్నాయి. అటువంటి అజేయమైన జాతీయభావం తమ సామ్రాజ్యానికి ముప్పుతెస్తుందని గుర్తించి మాతృభూమిపట్ల, ధర్మం, పరంపరలపట్ల మనలోఉన్న విశ్వాసాన్ని నాశనంచేసేందుకు బ్రిటిష్‌వారు ఒక క్రమబద్ధమైన యోజన చేసినారు.

ప్రముఖ విప్లవవీరుడు లాలాహరదయాళ్ చెప్పిన ఉదంతం ఒకటున్నది. దక్షిణదేశంలో ఒకఆంగ్లేయ ఉన్నతాధికారి ఉండేవాడు. అతనికి సహాయకుడు స్థానికుడు-బహుశః ఒక 'నాయుడు'; బంట్రోతు బ్రాహ్మణుడు. ఒకనాడు ఆ అంగ్ల అధికారి వీధిలో పోతున్నాడు. సేవకుడు వెనుక నడుస్తున్నాడు. అతనికి సహాయకాధికారి ఎదురుపడ్డాడు. అధికారులిద్దరు పరస్పరం అభినందించుకొని కరచాలనం చేసుకొన్నారు. కాని ఆ సేవకుణ్ణి చూడ్డంతోనే, ఆ సహాయకోద్యోగి తన తలపాగతీసి, వంగి, అతనిపాదాలు స్పృశించాడు. ఆంగ్లేయు డాశ్చర్యపోయాడు. 'నీకన్న ఉన్నతాధికారినైనా నిటారుగా నిలచి కరచాలనం మాత్రమే చేశావు. కాని నా బంట్రోతు పాదాలకు, అందునా నడివీధిలో మ్రొక్కుతావేమిటి ?' అని కుతూహలంగా అడిగాడు. అప్పుడా సహాయకోద్యోగి 'మీరు అధికారే ఐనప్పటికీ, మీరుమ్లేచ్ఛులు; సేవకుడే కావచ్చు; అయినా శతాబ్దాల తరబడి మాదేశంలో ఎంతో గౌరవంగా చూడబడే కులానికి చెందినవాడు ఆయన. ఆయనకు మోకరిల్లటం నావిధ్యుక్త ధర్మం' అని సమాధానం చెప్పినాడు. ఆ ఆంగ్లేయుడు ఈ ఉదంతాన్ని వివరిస్తూ, 'బ్రాహ్మణుణ్ణి అట్టిస్థానంనుండి తొలగించి, ఆ స్థానాన్ని ఆంగ్లేయు డాక్రమించలేకపోతే,-అంటే, బ్రాహ్మణునికన్న గౌరవాన్నిగాని, అంతకంటే ఎక్కువ గౌరవాన్నిగాని, సంపాదించుకోలేకపోతే - ఆంగ్లసామ్రాజ్యం ఎక్కువకాలం ఇక్కడ కొనసాగలే'దని ఇంగ్లండులోని 'ఇండియా ఆఫీసు'కు వ్రాసిన జాబులు నేటికీ లభిస్తాయి.

దీన్ని దృష్టిలో ఉంచుకుని ఆంగ్లేయుడు ఒక క్రమపద్ధతిలో మనకు శిక్షణఇవ్వడం ప్రారంభించాడు. ఇది ఒక దేశంకాదు, ఒకపెద్దఖండం-అనేది మొదటిపాఠం. మనమొక సమాజంకాదు, రాష్ట్రంకాదు; ఇక్కడ తొలుతగా కొందరు ఆదిమవాసులు జీవించేవారు; వారిని కొండల్లోకీ కోనల్లోకీ తరిమివేశారు; ద్రావిడు లనబడే మరియొక ఆదిమవాసులతెగగూడా ఇచట ఉండేది; ఆర్యులు, ఉత్తరాదినుండి వచ్చి తమ ఆయుధసంపత్తిచేత

ఈ భూమిని జయించారు; ఇక్కడ వారందరినీ లొంగదీసుకొన్నారు – ఇట్లా నూరిపోసినారు. అంటే మనకొక మాతృభూమి అంటూలేదు. మనలో చాలామందిమి ఎక్కడినుండో ఇక్కడకు వచ్చాం. కనుక ఆంగ్లేయులవలెనే మనమూ ఈ దేశానికి కొత్తవారం, విదేశీయులం. మనకొక ధర్మంలేదు, తత్వశాస్త్రంలేదు, చెప్పుకోదగిన నీతినియమాలులేవు. మన గతమంతాగూడా గాఢాంధకారమే. ఆంగ్లేయులను భగవంతుడే ఇక్కడకు పంపినాడు. కనుక వారి పాదాల చెంగటజేరి, మతం, సంస్కృతి, సువ్యవస్థిత సాంఘిక, రాజకీయ జీవనాలనుగురించిన తొలిపాఠాలను నేర్చుకోగలిగాం అనుకొన్నారు మనవారు. ఇదంతా ఆంగ్లేయులు మనకు ఇచ్చిన శిక్షణఫలితం. ఆంగ్ల విద్యా విధానాన్ని రూపొందించిన మెకాలేయొక్క సామ్రాజ్యవాదకుతంత్రాలు "మనకు, కోట్లాది పాలితులకు మధ్య దుబాసీలుగా ఉంటూ రక్తంలోనూ, రంగులోనూ హిందువులే ఐనప్పటికీ అభిరుచులలో. అభిప్రాయాలలో నైతికతలో, మేధాసంపత్తిలో ఆంగ్లేయులైపోయిన ఒకవర్గాన్ని సృష్టించడానికి మనమిప్పుడు యథాశక్తి కృషిచేయాలి" అనే మాటల్లో ప్రకటితమైనాయి. 1836లో అతడు మళ్ళీ తన తండ్రికి లేఖవ్రాస్తూ "ఆంగ్లవిద్య అభ్యసించిన హిందువెవ్వడూ, తన మతానికి నిష్ఠతో అంటిపెట్టుకొని ఉండలేడు........ మన విద్యావిధాన పథకాలు పారినట్లైతే నేటికి 30 ఏళ్ళ తర్వాత బెంగాల్లోని కులీనవర్గాల్లో కనీసం ఒక్క విగ్రహారాధకుడైనా మిగలడు" అనివ్రాసినాడు. ఏసుక్రీస్తునుమించిన నిజమైన సంరక్షకుడులేడు; హిందూమతం కేవలం మూఢనమ్మకాలపుట్ట; క్రైస్తవమతం స్వీకరించకపోతే అందరూ శాశ్వత నరకానపడతారు–అంటూ క్రైస్తవపాఠశాలల్లో పసిమనస్సులను మోసగించే బోధనలు నేటికీ కొనసాగుతూనే ఉన్నాయి.

## చరిత్రకు వక్రభాష్యం

పాఠశాల విద్యార్థులకు ఒకప్పుడు 'టాంగిల్ ఉడ్ టేల్స్'– అంటే అయోమయం. అంధకారం అయిన యుగం అని అర్థం–అనే చరిత్రపుస్తకం

పాఠ్యంగా ఉండేది. ఆ చీకటి యుగంలో ఆర్యులు ప్రవేశించి పంజాబులో మొదట స్థిరపడినారనీ, అక్కడ 'మహాభారతం' జరిగిందనీ, తర్వాత వారు గంగా, యమునల దిశగా ముందుకు సాగిపోయి, చివరకు అయోధ్యలో స్థిరపడ్డారనీ ఆ 'చరిత్రకారుడు' వ్రాసి, 'మహాభారతకథ' జరిగిన అనేక శతాబ్దాలతర్వాత రామాయణకథ జరిగిందని నిర్ణయించాడు. నేనాచరిత్రకారుని మేధాసంపత్తిని అభినందించాను. కొడుకు పుట్టినపిదప తండ్రిపుట్టినాడని నిరూపించటానికి, నిజంగా, ఎంతో అసాధారణమైన ప్రజ్ఞ కావాలి. ఆవిధంగా మన చరిత్ర ప్రారంభంలో 'చీకటియుగం'గాను, తర్వాత ముస్లిం, బ్రిటిష్ యుగాలుగాను విభజింపబడింది. ఈ విషయాలన్నీ మనకు బాల్యంనుండే నేర్పినారు. ఇవి విన్నతర్వాత, మనకొక జాతీయ జీవనంగాని, సాధించిన గొప్పతనంగాని లేనేలేవని మనవారు అనేకులు విశ్వసించటంలో అబ్బురం లేదు.

ఆంగ్లేయులు వెళ్ళిపోయిన తర్వాతకూడ, మన పాఠ్యగ్రంథాల్లో ఈ దేశంలో ముస్లిములకు క్రైస్తవులకు ఉన్నస్థానమే హిందువులకూ ఉంది అనే ప్రాతకాలపు విషసిద్ధాంతాన్ని చెపుతూ, మన చరిత్రను, హిందూ యుగం, ముస్లిం యుగం, ఆంగ్లయుగం అనే మూడు భాగాలుగా విభజించారు. నిజానికి భారతదేశచరిత్ర అంటే ఒక సుదీర్ఘ హిందూయుగం మాత్రమే. ఒకప్పుడది స్వతంత్రము, సముజ్జ్వలమూ; మరియొకప్పుడు జాతీయగౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనేందుకు విదేశీదురాక్రమణ కారులతో సంఘర్షణ. దేశచరిత్రలోని కాలవిభజనను ఆ జాతీయుల పేరుతోనే వ్యవహరిస్తారు. విదేశీ దురాక్రమణదార్ల పేర్లతో రాజవేషం ధరించిన నియంతల పేర్లతో వ్యవహరించరు అని మనవారు ఈనాటికీ గుర్తించలేదు.

## రూపొందుతున్న రాష్ట్రం

పండితంమన్యుడైన హిందువు ఆంగ్లేయులవలలో చిక్కుకోవడం ఆశ్చర్యం కల్గించదు; వేషభాషల్లో ఆంగ్లేయుల్ని అనుకరించాడు; తమ

పూర్వీకులన్నా వారి వారసత్వం అన్నా సిగ్గుపడ నారంభించినాడు. ఆరోజుల్లో జరిగిన ఒక అద్భుత ఉదంతాన్ని ప్రముఖ హిందీ వారపత్రిక 'ధర్మయుగ' కొన్నాళ్ళక్రితం ప్రచురించింది. ఒక ఐరిష్ జాతీయుడు, ఒక స్కాట్ దేశీయుడు, ఒక ప్రముఖ హిందూనాయకుడు యూరప్‌లోని ఒక హోటల్లో బసచేసినారు. అతిథుల పుస్తకంలో తమతమ జాతీయతలను సూచిస్తూ ముగ్గురూ వ్రాసారు. మొదటివాడు "నేను ఐర్లండులో పుట్టినందుకు గర్విస్తున్నా"నని, రెండవవాడు "స్కాచ్ జాతీయుడుగా జన్మించటం తన అదృష్టం"అని వ్రాసినారు. కాని, హిందువుమాత్రం "గతంలో చేసికున్న పాపాల ఫలితంగా నేను హిందూబ్రాహ్మణ కుటుంబంలో జన్మించా"నని వ్రాశాడు.

ఇట్టి వాతావరణంలో, ఆంగ్లభాష అభ్యసించిన వారు మన గతజీవన మంతా అజ్ఞానపూర్ణమని, అంతఃకలహాలతో నిండినదనీ, ఇచట మనం క్రొత్తగా ఒక్క రాష్ట్రంగా రూపొందాలనీ విశ్వసించటం సహజమే. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా మనం జరిపిన స్వాతంత్ర్య సంగ్రామంయొక్క తొలిరోజుల్లో ఉన్నతస్థాయికి చెందిన అనేకమంది నాయకులు తమ ఉపన్యాసాల్లో మనది రూపొందుతూఉన్న జాతి అని చెప్పేవారు. అంటే ఆనాటికి మనమంతా ఒకజాతిగా ఏర్పడలేదనేదే దాని అర్థం. మనం ఇంకా మూసలోనే ఉన్నామని, అచ్చునబోసి మన జాతీయజీవనానికి ఒకక్రొత్త రూపాన్ని, క్రొత్తతత్వాన్నీ ఇంకా ఇయ్యవలసి ఉందని ఇప్పటికీ నాయకులు చెపుతూనే ఉంటారు.

ఈ దేశంలో నివసించేవారందరికీ విదేశీపాలన సమానవిపత్తు కనుక ఒకే ఆపద వీరందర్నీ ఒక నూతన రాష్ట్రంగా కూడగట్టిందనే మరొక సిద్ధాంతం మన వారికి నచ్చింది. జాతీయత కనీసం బీజరూపంలోనైనా ఉండిఉంటేనే, సమానవిపత్తు దాన్ని పోషించగలదేమోగాని అది నూతనంగా జాతిని సృష్టించలేదు అన్నది విదితమే. ఒకజాతిని అదికేవలం ఉత్తేజపరచి

దాన్ని శక్తిమంతం చేయగలదేగాని పూర్తిగా క్రొత్త జాతినిమాత్రం అది సృష్టించలేదు. విదేశీ దురాక్రమణదారులను నిలువరించి, ఎదురించే సంకల్ప బలంవల్ల జనించే త్యాగభావాన్ని, సమైక్యభావాన్ని అదిజాతిలో చొప్పిస్తుంది. సమానవిపత్తు సిద్ధాంతం అంటే, ఇంతే. అయినప్పటికీ పూర్తిగా క్రొత్తదైన రాష్ట్రీయతను సాధించేందుకు దీన్ని వాడుకోజూచారు.

## 'ప్రాదేశిక వాదం' అసంగతం

ఇచట హిందువుల సర్వాంగసంపూర్ణమైన ప్రాచీనరాష్ట్రం ఉండనే ఉంది. అతిథులుగనో - యూదులు, పార్శీలు; దురాక్రమణకారులుగనో - ముస్లింలు, క్రైస్తవులు - ఇచట వివిధవర్గాలు నివసిస్తున్నాయి అని వారు విస్మరించారు. అట్టి విజాతీయ సమూహాలు సమానశత్రువుయొక్క పాలనలో ఒక దేశంలో నివసించినంత మాత్రాన వారందరూ ఆభూమికి సంతానం ఎట్లా కాగలరనే ప్రశ్న వారికి తట్టలేదు.

ఆరోజుల్లో, ఒకచోట జరిగిన సమావేశంలో మాట్లాడుతూ, ఒక పెద్దమనిషి ఈదేశంలో నివసించే ఎవరైనాసరే మనం జాతీయుడుగానే భావించాలి అని నొక్కివక్కాణించినాడు. "అయితే, ఎంతకాలం నివసిస్తే' అని నేను అడిగినాను. "దానికి కాలపరిమితి లేద"ని అతను చెప్పినాడు. "ఒక్కరోజు నివసించినా చాలునా" అని నేనడిగితే 'అవున'ని అతడు బదులుచెప్పాడు. దానికి నేను "అయితే మనకు స్వరాజ్యం వచ్చేసిందని ఆనందించండి; మనమొక సామ్రాజ్యాన్నే జయించుకొన్నాము; స్వరాజ్యం కోసం కష్టపడనవసరంలేదు. ఎందుచేతనంటే, మీ నిర్వచనంప్రకారం ప్రస్తుతం ఇంగ్లండుకు ప్రధానమంత్రియైన రామ్సే మేక్డొనాల్డ్ కొన్ని రోజులపాటు ఈదేశంలో ఉన్నాడు కాబట్టి, అతడు ఈ భూమికి జాతీయుడే కావాలి. కనుక ఇంగ్లండును పాలిస్తోంది మనమే" అని అన్నాను. ఈ 'ధర్మసత్ర సిద్ధాంతం' - అంటే ప్రాదేశిక రాష్ట్రీయతావాదం, ఈవిధంగా అర్థంపర్థంలేని నిర్ణయాలకు దారితీస్తుంది.

రాష్ట్రీయత అంటే మనవారికున్న భావనకు ఆధారంగా ఉన్న ప్రాదేశిక రాష్ట్రీయత్వం, సమాన విపత్తు అనే సిద్ధాంతాలు మనయొక్క నిజమైన హిందూరాష్ట్రీయతకు భావాత్మకమైన ఉత్తేజమునీయక, మనం జరిపిన అనేక స్వాతంత్ర్యోద్యమాలను, కేవలం ఆంగ్లేయ వ్యతిరేకోద్య మాలుగా రూపొందించాయి. ఆంగ్ల వ్యతిరేకతయే దేశభక్తి, జాతీయ భావనలుగా, చెలామణి ఐంది. ఈ ప్రతిక్రియాత్మకదృష్టి స్వాతంత్ర్యసమరం అంతటిపైన, దాని నాయకులపైన, సామాన్య ప్రజానీకంపైనగూడ వినాశకర ప్రభావాలు కలిగించింది.

# 2 ప్రాదేశిక రాష్ట్రవాదం

## 2. ఫలితాలు

ఆంగ్ల పాలనకు వ్యతిరేకంగా, విజృంభించిన ఉద్యమాల్లో రెండు రకాలు ముఖ్యమైనవి. విప్లవకారులు స్వీకరించిన సాయుధవిప్లవమార్గం మొదటిది. రెండవది భారతజాతీయ కాంగ్రెసు నిర్వహించిన స్తబ్దనిరోధం. ఈ రెంటిపైన 'ఆంగ్లవ్యతిరేకత' యొక్క ప్రభావం ఎంతటిదో విడివిడిగా ఆలోచిద్దాం.

### దేశభక్తులు దేశద్రోహులు అయ్యారు

విప్లవోద్యమ నాయకులు దేశవ్యాప్తంగా రహస్యసంఘటనలను ఆయుధాగారాలను, ఆత్మాహుతికి సర్వసన్నద్ధులైన చిచ్చరపిడుగుల్లాంటి దేశభక్తులను సమకూర్చినారు. అయితేనేం ఎవడో ఒక దేశద్రోహి రహస్యాలను వెల్లడించి, ఎంతో జాగ్రత్తగా తయారుచేసిన పథకాలను గంగపాలు చేసేవాడు. ఎన్నోసార్లు ప్రయత్నించి, నెగ్గలేకపోయినవ్యక్తి తాననుసరించిన ఆ పద్ధతిలో విజయం సాధించిన వారెవరైనా ఉన్నారా అని నలుగడలా పరిశీలిస్తాడు. ఇది మానవ స్వభావం కాబట్టి విప్లవకారులందరూ విజయవంతమైన విప్లవోదాహరణ ఏదైనా ఉన్నదా అని వెదకినారు.

సావర్కర్, సుభాస్‌చంద్రబోస్‌లు శివాజీని ఆదర్శంగా స్వీకరించి ఉత్తేజాన్ని పొందినట్లుగానే, మన జాతీయజీవనాన్ని అవగాహనచేసికొన్న విప్లవవాదులు అట్టి విప్లవోత్తేజాన్ని మనదేశంనుండే, మన చరిత్రనుండే ఆశించినారు. దేశంనుండి అదృశ్యం అయ్యేముందు జరిగిన ఒక భేటీలో సుభాస్‌చంద్రబోసు, ఛత్రపతి శివాజీ ఘనతనుగూర్చి గొప్పగా ప్రశంసించి ఆయన ఆదర్శాన్ని, మార్గాలను అనుసరించటం ద్వారానే స్వరాజ్యం సంపాదించుకోగలమని ప్రకటించినారు.

కాని అట్టి భావాత్మకనిష్ఠ, దృఢవిశ్వాసంలేక ఆంగ్లేయులయెడ తీవ్రవ్యతిరేకత మాత్రమే ఉన్న కొందరు విప్లవవాదులు, తమ గతంలోకి తప్ప అన్నివైపులా చూపు సారించినారు. 1917 లో 'ప్రజాపరిపాలన' స్థాపించగలిగిన రష్యన్ విప్లవం, చాలామంది విప్లవవీరులను ఆకర్షించింది. సామ్యవాదసిద్ధాంతంపైనా, ఆ సిద్ధాంతపద్ధతులపైనా మాత్రమే ఆధారపడ్డ ఒక విప్లవం ఇక్కడ తీసుకురావాలని వారాశించారు. దాని ఫలితంగా, ఆ స్వాతంత్ర్య భక్తులు సామ్యవాదానికీ, రష్యాచైనాలకు భక్తులైపోయినారు. మనదేశాన్ని మననుంచి 'విముక్తంచేసి' రష్యాచైనాలకు కట్టపెడుదామని నేడు పోరాడుతున్నారు. ఒకనాడు మాతృభూమికోసం బలి కాగోరినవారే, ఈనాడు దేశాన్ని రష్యా చైనాలకు ఉపగ్రహం చేసేందుకు ప్రాణాలనివ్వడానికి సిద్ధంగా ఉన్నారు. నాటి తీవ్రస్వదేశభక్తులు నేడు తీవ్ర పరదేశభక్తులు అయిపోయారు. ఎంతటి అథఃపతనమిది!

## కాంగ్రెస్ వైఫల్యం

కాంగ్రెసు నిర్వహించిన రెండవవిధమైన ఉద్యమం, మరింత నాశనాన్ని తెచ్చిపెట్టింది. కొన్ని దశాబ్దాలపాటుగా మన రాష్ట్రీయజీవనాన్ని పట్టిపీడిస్తున్న అరిష్టాల్లో చాలాభాగం ఈ తరహా ఉద్యమంయొక్క ప్రత్యక్ష ఫలితమే.

ఆంగ్ల సామ్రాజ్యశక్తి నెదుర్కోటానికి తమశక్తి చాలదని కాంగ్రెసు నాయకులు భావించినారు. ఆ లోటును పూరించుకోవడానికి ఇతర దేశాలేమైనా ఆదుకుంటాయేమోనని నలుగడల చూడసాగినారు. విప్లవవాదులుకూడా ఇట్టి ప్రయత్నం చేసినవారే. తమ ప్రయోజనాలు నెరవేరగల వనుకొన్నప్పుడే విదేశీశక్తులు బలహీనులతోసహకరిస్తాయి. కొందరు కాంగ్రెసుఅగ్రనాయకులు ఆఫ్ఘన్‌రాజు అమానుల్లాను ఆశ్రయించినారు. మనమిచట ఉద్వేగ్త్నఆందోళన లేపిన సమయంలోనే అతడు మనదేశంపైకి దండెత్తివచ్చి ఆంగ్లేయులను తరిమివేయటానికి సహకరించాలనేది వారి పథకం. దానికి ప్రతిఫలంగా ఆంగ్లేయులస్థానంలో అతణ్ణి ప్రభువుగా చేసికొంటామని వీరి వాగ్దానం! కాని కాలాంతకులైన ఆంగ్లేయులు దీన్ని పసిగట్టి నాయకులను నిర్బంధించి చాతుర్యంతో ఆఫ్ఘనిస్తానులోనే అమానుల్లాకు దిక్కులేకుండా చేసినారు.

ఈ యత్నం విఫలంకాగానే, ఈ దేశవాసు లందరినీ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా కూడగట్టా లనుకొన్నారు కాంగ్రెసు నాయకులు. అది తామూహించుకొనే జాతీయతకు అనుకూలంగాకూడా ఉంది. అయితే హిందూ సమాజం మాత్రమేకాక ఈదేశంలో యూదులు, క్రైస్తవులు, ముస్లిములు అనే నాలుగుమతాలవారు నివసిస్తున్నారు.

హిందువుల విషయంలో ఎట్టి ఇబ్బందిలేదు. సహజంగా వారీదేశాన్ని తమ పవిత్రమాతృభూమిగా ప్రేమిస్తారు. అతిప్రాచీనకాలంనుంచి నారిచ్చట ఒక మహాసంస్కృతిని, పరంపరను నిర్మాణంచేశారు. దేశం అంతటా అన్నిరంగాలలోను ఆలోచనలు, ఆచరణలదృష్ట్యా చూస్తే శ్రేష్ఠులెందరో ఈ సమాజంలో పుట్టినారు. కాబట్టే ఆసేతుశీతనగం హిందువులకు పవిత్రమయింది. ఈదేశం స్వతంత్రంగా ఉండాలి అని వారు కోరుకొంటారు. శాస్త్రాలుకూడా స్వాతంత్ర్యేచ్ఛనే ప్రబోధిస్తున్నాయి; స్వాతంత్ర్యభావన రక్తంలోనే రంగరించుకపోయింది. కనుకనే ఏనాడూ విదేశీ ఆధిపత్యాన్ని

మనవారు అంగికరించలేదు; దాస్యశృంఖలాలు త్రెంచుకోవటానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. కొంతకొంత విజయం పొందుతూనే ఉన్నారు.

## యూదులు, పార్శీలు, క్రైస్తవులు

ఇక శరణార్థులై వచ్చిన యూదులు, పార్శీలసంగతి. యూదులసంఖ్య అతిస్వల్పం గనుక అంతగా లెక్కలోకి రాలేదు. సంఖ్యాబలంలో తక్కువైనప్పటికీ పార్శీలు చాలా మేధావులు, పరిశ్రమశీలురు, పురోభివృద్ధిని సాధించినవారు. ఈదేశంపట్ల ప్రగాఢమైన ప్రేమను పెంచుకున్నారు; ప్రధాన ప్రవాహమైన హిందూజీవనంలో చాలావరకు మిళితమైపోయినారు; స్వాతంత్ర్యసమరంలో అగ్రేసరులయ్యారు. దాదాభాయి నౌరోజీ, ఫిరోజ్‌షా మెహతా, మేడమ్ కామా వంటివారు స్వాతంత్ర్య యోధులందరకుకూడా స్ఫూర్తికేంద్రాలుగా రూపొందినారు.

ఇక, క్రైస్తవ సజ్జనుల విషయం. 1857 లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో, కొందరు బిషప్పులు ఆంగ్ల ప్రభుత్వానికి సహకరించేందుకై కొన్ని సైనికపటాలాలను సమీకరించినారు. నాటినుండి వారెల్లప్పుడూ ఆంగ్లేయుల పక్షాన్నే ఉంటూ వచ్చినారు; ఎంతయినా వారిదీ వారిదీ ఒకేమతం. ఆంగ్లేయులుకూడా క్రైస్తవప్రచారకుల కార్యకలాపాలకు అనేకవిధాల సహకరిస్తూ ఉండేవారు. ఛోటానాగపూరు, నాగ ప్రదేశముల వంటి విశాల అటవీ, పర్వత ప్రాంతాలకు క్రైస్తవ మత ప్రచారకులను పంపి, ఇతర మత ప్రచారకులెవ్వరూ అందు ప్రవేశించరాదని నిషేధించారు. స్థానిక క్రైస్తవులకు, క్రైస్తవ ప్రచారసంస్థలకు, ఆంగ్లప్రభుత్వానికి పరస్పర సహాయ సహకారాలు ఉండటంవల్ల సామాన్యంగా క్రైస్తవులు స్వాతంత్ర్యసమరానికి దూరంగా ఉన్నారు.

## నాయకత్వానికి అగ్నిపరీక్ష

ముస్లిములు దురాక్రమణకారులుగా ప్రవేశించినారు. తాము విజేతలమనీ పన్నెండువందల సంవత్సరాలపాటు ప్రభువులమనీ భావించుకొంటున్నారు.

అదే ప్రవృత్తి ఇంకా వారిలో ఉంది. వారి వ్యతిరేకత కేవలం రాజకీయమైనది కాదని చరిత్ర చెప్పుతోంది. అదే నిజమైతే వారిని కొద్దికాలంలోనే కలుపుకొనేవాళ్ళం. మనం నమ్మిన ప్రతిదాన్ని పూర్తిగా వ్యతిరేకించేటంత లోతుగా నాటుకుపోయింది వారి విద్వేషం. మనం దేవాలయాల్లో పూజలుచేస్తే వారు వాటిని అపవిత్రంచేస్తారు. మనం భజనలు చేసినా, రథోత్సవాలు జరిపినా వారికి కంపరమెత్తుతుంది. గోవును మనం పూజిస్తే, వారు భక్షిస్తారు. పవిత్రమాతృత్వానికి ప్రతీకంగా మనం స్త్రీని ఆరాధిస్తే వారు బలాత్కరిస్తారు. మతపరంగా, సాంస్కృతికంగా, సామాజికంగా, అన్నివిధాలా వారు మనకు పూర్తిగా వ్యతిరేకులు. ఆ విద్వేషం వారి నరనరాలకు పట్టింది. వారి సంఖ్య కూడ తక్కువగాదు. హిందువుల తర్వాత పెద్దజనాభా వారిదే.

అట్టి ముస్లిములను విద్వేషప్రవృత్తినుండి వెలికిలాగి, దేశభక్తుల కోవలోకి ఎట్లా చేర్చటమనే పెద్దప్రశ్న మన నాయకుల కెదురయింది. దీనికి దేశభక్తియుతము, తర్కసమ్మతమునైన పరిష్కారం ఒకటుంది. "మిత్రమా! పాతకాలపు మొగలాయి రాచరికపురోజులు పోయాయి. ఇప్పుడిక మేమూ మీరు అన్నదమ్ముల్లా, జాతీయజీవనంలో భాగస్వాములుగా జీవించకతప్పదు. మీరూ మా జాతివారే; మా రక్తానికి చెందినవారే: కాని మొగలులు, తురుష్కులవంటి విదేశీతెగలు కత్తిఝుళిపించి మిమ్మల్ని ముస్లిములుగా మార్చారు. మీరు అట్టి దురాక్రమణకారులతో మానసికంగా పెనవేసికొని, వారి అడుగుజాడల్లో నడవాలని ఇంకా ఆలోచించటంలో అర్థం లేదు. అటువంటి వేర్పాటు ధోరణులను మరచిపోయి ఈ రాష్ట్రజీవనంలో లీనం కావాలి. ఈ గడ్డపై పుట్టి స్వదేశ స్వసంస్కృతుల స్వేచ్ఛాగౌరవాలకొరకు నిరంతరం పోరాడిన మహాపురుషులను గౌరవించి, వారిని అనుసరించండి" అని కుండపగలేసి చెప్పటమే అది. అట్లాచేసి ఉంటే సమస్య ఉండేదికాదు. ఇట్టి ఘటనలు ప్రపంచంలో ఎన్నో జరిగాయి. ఉదాహరణకు; ఒకప్పుడు నార్మనులు దురాక్రమణదారులుగా ఇంగ్లండులో ప్రవేశించారు, స్థానికప్రజలు

స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకునేందుకై వారిని ప్రతిఘటించారు. కాల అరువాత కాలంలో, వాళ్లూవీళ్లూ ఏకమై తర్వాత వచ్చిన దురాక్రమణలనన్నిటినీ ఒకే సమైక్యజాతిగా ఎదిరించారు. ఈనాటికీ సమైక్యజీవనాన్ని కొనసాగిస్తున్నారు.

## ఆత్మవినాశానికి అంకురార్పణ

జగడాలమారి అయిన ముస్లిముతో అతని తాతముత్తాతలు హిందువులేననీ, స్వాభిమానంగల వ్యక్తిగా అతడు మరల హిందూసమాజం లోకి రావాలనీ, మొగలాయిలనాటి ఉద్ధతిని విడిచిపెట్టాలనీ, ఈ శతాబ్దపు యథార్థస్థితిని అర్థంచేసుకుని, ఈజాతీయజీవనప్రవాహంలో మిళితంకావాలనీ- ఇట్లా చెప్పాలంటే, సత్యంపట్ల విశ్వాసం, యథార్థస్థితిగతులను ఎదుర్కొ గలిగిన మొక్కవోని ధైర్యం కావాలి. దురదృష్టవశాత్తు సత్యప్రియత్వం నిర్భయత్వం అనేరెండుగుణాలు నేటిపెద్దనాయకులు చాలామందిలో లేనేలేవు.

మహాత్మాగాంధీకి, కుడిభుజమని ప్రసిద్ధికెక్కిన మౌలానామహమ్మదాలీకి సంబంధించిన ప్రసిద్ధ ఉదాహరణ ఒకటుంది. అతడు నైష్ఠికుడైన ముస్లిం. 1923 లో కాకినాడ కాంగ్రెసుకు అతడు అధ్యక్షుడు. ప్రఖ్యాతగాయకుడు దేశభక్తుడునైన పండిత విష్ణు దిగంబర్ పలూస్కర్ ఆ సభలో జాతీయగీతం 'వందేమాతరం' పాడటానికి ముందుకురాగానే 'ఆ పాట పాడటానికి వీల్లేదు. అది మా మతభావనలకు విరుద్ధం' అని మహమ్మదాలీ ఆయనను ఆటంక పరిచినాడు. కాని గుండెనిబ్బరంగల పలూస్కర్ లొంగలేదు. కేవలం ఆ పాట పాడేందుకే అచటకు వచ్చినాననీ, తనపని తాను చేసితీరుతాననీ చెప్పినాడు. వెంటనే మౌలానాగారు కోపంతో వేదికదిగి, జాతీయగీతం పాడుతుంటే దూరంగా ఉండిపోయినారు! ఆ సమయంలో అచట ఎంతోమంది మహా మహులైన నాయకులు కూర్చొనిఉన్నారు. 'సాయబుగారూ! ఇది మనజాతీయ గీతం; జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుమీరు. ఆ పాట పాడడానికి మీరు అభ్యంతరం చెప్పరాదు; దేశభక్తికి భంగకరమైన ఏ ఇతర ఆలోచనలకు

తావీయరాదు' అని ఆతనికి చెప్పగల గుండెలు ఏ ఒక్కరికీ లేకపోయాయి. పైగా ముస్లిముల మౌఢ్యాన్ని సంతృప్తిపరచేందుకు "వందేమాతరం" గీతంలోనుంచి కొన్నిభాగాలు తీసివేసినారు.

ముస్లిముల మొండివైఖరిని విశుద్ధ జాతీయభావనతో ఎదుర్కొనాలనే వాంఛగాని, కనీసం అదే సరైనదనే దృఢవిశ్వాసంగాని మన నాయకులలో లేని కారణంగా ముస్లింబుజ్జగింపు బీజాలు నాటబడ్డాయి. నూతన జాతీయతా మృగతృష్ణవెంట, 'హిందూముస్లిం సమైక్య మంత్రం' పఠిస్తూ పరువులు పెట్టినారు. ఆ ప్రయత్నానికి అడ్డుతగిలే ప్రతిదాన్ని త్రోసి రాజనాలని అన్నారు. వేర్పాటుధోరణిని విడిచిపెట్టుమని ముస్లిముకు చెప్పే ధైర్యంలేక మననాయకులు మెతకవాడైన హిందువుకు ఉపదేశాన్నివ్వడం మొదలుపెట్టినారు. మన జాతిని 'హిందు' అనకూడదు; ముస్లిములకు బాధకలుగవచ్చు; కాబట్టి పరంపరాగతమైన 'హిందూస్థానం' అన్నపేరెత్త కూడదు-ఇది వారి మొదటి ఉపదేశం. ఆంగ్లేయులు పెట్టిన 'ఇండియా' అన్నపేరు స్వీకరించి, దానినిబట్టే 'ఇండియన్ నేషన్' అన్నారు. హిందువు 'ఇండియన్' కావాలని బోధించారు.

## బలిపశువుగా మారిన హిందువు

మన నాయకుల ఉపదేశం అంతటితో ఆగలేదు. ముస్లిములుచేసే దురంతాలనుపట్టించుకోవద్దనీ, పచ్చిగా లొంగిపొమ్మనీ హిందువును కోరారు. ముస్లిములు నాడు చేసింది, నేడు చేస్తోంది మరచిపొండి. ముస్లిములకు కోపం తెప్పించేట్లయితే గుడిలోపూజచేసుకోవటం,వీధుల్లోఊరేగించటం మానుకోండి. భార్యాబిడ్డలను వారు ఎత్తుకపోతే చూస్తూఊరుకోండి. ప్రతిఘటించడం 'హింస' అవుతుంది అని చెప్పారు. ఆరోజుల్లో వాయవ్య సరిహద్దు ప్రాంతంలో ఒక హిందూయువతిని ఒక ముస్లిము అపహరించినాడు. ఈ సమస్య ఆనాటి కేంద్రశాసనసభలో చర్చకు వచ్చింది. అక్కడ మన

ప్రముఖ నాయకులంతా ఉన్నారు. అప్పుడు ఒకముస్లిం కాంగ్రెసు నాయకుడులేచి 'ఎన్నిచెప్పినా యువకులు యువకులే, యువతులు యువతులే' అని తేలికగా కొట్టిపారేశాడు. అవమానకరమైన అట్టి వ్యాఖ్యానంపట్ల అక్కడకూర్చున్న ఏఒక్క హిందూనాయకుడు పెదవికదపలేదు. 'అది నిజంగా ఏదో మగపిల్లలు, ఆడపిల్లల గొడవే ఐతే ముస్లింయువకులే ఎప్పుడూ హిందూయువతులను ఎందుకు ఎత్తుకుపోవాలి? హిందువులు ముస్లింబాలికల నెందుకు అపహరించరు?' అనేధైర్యం ఎవ్వరికీ లేకపోయింది. పైగా అతని వ్యాఖ్యను హాస్యోక్తి అనుకొన్నారు.

హిందువుల మనస్సు గాయపరచేందుకు ముస్లిములు ఆవులను చంపినపుడల్లా అది ముస్లిముల మతహక్కు అని, మత సహనంగల మనకు ఎట్టి అభ్యంతరం ఉండరాదనీ చెప్పేవారు. ముస్లిం మతవిశ్వాసాలదృష్ట్యా-ఖురాన్‌లో గోహత్యను అనుమతిస్తూ ఒక్కమాటైనా లేకపోయినప్పటికీ - ఈ దేశంలో గోహత్యానిషేధం జరుగదు అని, స్వరాజ్యం వచ్చిన వెంటనే, పండిత జవహర్‌లాల్ నెహ్రూ వ్రాతపూర్వకంగా హామీ ఇచ్చారు.

ఆనాటి ఒక ప్రముఖ హిందూనాయకుడు ఒక పెద్ద బహిరంగసభలో మాట్లాడుతూ 'హిందూ, ముస్లిముల సమైక్యం లేనిదే స్వరాజ్యంలేదు. దాన్ని సాధించడానికి చాలా చిన్న ఉపాయం; హిందువులు ముస్లిములైపోతే సరిపోతుంది' అని ప్రకటించాడు. అట్లాగే జరిగితే హిందువులు ఎవరూ మిగలరుకాబట్టి సాధించేది ముస్లిం సమైక్యమేగాని,/హిందూముస్లింసమైక్యం కాదని ఆయన గుర్తించలేకపోయినాడు.

హిందువుల్లో ఆత్మవిస్మృతి ఇంతవరకు కల్గించారు మన నేతలు. హిందువులు తమ ఉజ్జ్వలమైన చరిత్రను మరచిపోయేట్లు చేశారు. రాణాప్రతాప్, శివాజీ, గురుగోవింద్ వంటి స్ఫూర్తిప్రదాతలను మరచిపోవటం నేర్పినారు. ఒకవేళ జ్ఞప్తికివస్తే వారిని 'దారితప్పిన దేశభక్తులు'

అనుకోమన్నారు. 'హిందూ ముస్లిం సమైక్య' నినాదాని కనుగుణంగా చరిత్ర సృష్టించారు. ఒక ఉదాహరణ: హిందువులను బలవంతంగా ఇస్లాంలోకి మార్చారు అన్నదానికి చరిత్రలో మచ్చుకైనా ఉదంతంలేదని ఒక ప్రముఖ విద్వాంసుడు వ్రాశాడు. మౌలికతలో ఇది ఐన్‌స్టీన్ పరిశోధనను మించి పోలేదా? ఇదంతా హిందూ ముస్లిం సమైక్యం సాధించటంకోసం, తద్వారా స్వరాజ్యంకోసం అన్నమాట! అమాయకుడు, స్వాతంత్ర్యప్రియుడునైన హిందువు అవన్నీ నమ్మాడు. హిందుత్వాన్ని, తరతరాల ఆదర్శాలను పరంపరను, ఆకాంక్షలను అన్నిటినీ త్యజిస్తేనేగాని హిందూ ముస్లిం సమైక్యాన్ని సాధించలేమనీ, అది లేనిదే స్వరాజ్యం సిద్ధించదనీ, నాయకులు చెప్పగా నమ్మి, తనవాటి నన్నిటినీ వదలివేసుకోవడానికి సిద్ధమయ్యాడు. హిందూముస్లిం సఖ్యతలేని స్వరాజ్యం తనకక్కరలేదనేంతవరకు వెళ్ళినా డొక ప్రముఖ నాయకుడు.

మరోమాటలో చెప్పాలంటే హిందువుకు చేవలేదు, తానొక్కడే అయితే స్వాతంత్ర్యంకోసం పోరాడేశక్తిచాలదు; ముస్లింరక్తం ఎక్కిస్తేనే ఇవన్నీ కలుగుతాయి అని నమ్మించారు. ప్రాచీనము, అదమ్యము ఐన మన విశ్వాసంపై దెబ్బతీయటానికి జాతికి ఊపిరివంటి ఆత్మవిశ్వాస స్వావలంబనలను నాశనంచేయడానికి మననాయకులే ముందుకురావడం ఎంత సిగ్గుచేటు, ఎంతటి దౌర్భాగ్యం! 'హిందూ ముస్లిం సమైక్యంలేందే స్వరాజ్యం లేద'ని చెప్పి మన నాయకులు మన సమాజానికి పెద్దద్రోహం చేసినారు. ఆవిధంగా ఒకమహత్తరమైన ప్రాచీనసమాజంయొక్క ప్రాణాల్ని నిలువునాతీసి దారుణమైన మహాపాతకానికి ఒడిగట్టినారు. శివాజీని ప్రశంసిస్తూ ప్రఖ్యాత చరిత్రకారుడు, జదునాథ సర్కార్ "అమృతాన్ని ఆస్వాదించినాడు హిందువు అన్నదాన్ని ఆయన ఋజువు పర్చినాడు" అన్నారు. అట్టి ఛత్రపతి శివాజీని ప్రసవించిన జాతికి నపుంసకత్వాన్ని ఉపదేశించి వీర్యవంతమైన సమాజంయొక్క ఆత్మవిశ్వాసాన్ని, స్వాభిమానాన్ని త్రుంచి వేయడంకంటె విద్రోహం యావత్ప్రపంచచరిత్రలోనూ మరొకటి దొరకదు.

## విష ఫలితాలు

1947 లో ముస్లిముల చేతుల్లో హిందువులు ఓడిపోవటం దీనికి ప్రత్యక్షఫలం. అయితే ఈ ముస్లిములెవ్వరు? వారిలో అత్యధిక సంఖ్యాకులు కత్తికి భయపడియో లేక అధికార సంపదల వ్యామోహంచేతనో ఇస్లాంలోకి మారినవారే. అంటే స్వదేశ, స్వధర్మాలను సంరక్షించుకోవాలనే ఆత్మ గౌరవంగాని, ఆత్మబలంగాని లేక ఒళ్లు కాచుకొనేందుకు శత్రువులకొమ్ము కాచినట్టి కొందరు హిందువుల సంతానమే వారంతా. అలలు అలలుగా దురాక్రమణలను జరిపిన ముస్లిం దోపిడీముఠాలను, శతాబ్దాలతరబడి ధైర్యంగా ప్రతిఘటించి పోరాడిన సాటిలేని పరాక్రమవంతులు, వీరులునైన పుణ్యపూర్వజుల సంతానమైన మనం ఇటువంటివారిచేతుల్లో పరాజయాన్ని అంగీకరించాం !

ఎంతటి అవమానకరమైన ఓటమి ఇది ! దురాక్రమణదారులతో మనం సాగించిన గత వేయిసంవత్సరాల పోరాటకాలంలో, ఏ ప్రాంతంపైనా వారి సర్వసత్తాక ప్రభుత్వాన్ని ఏనాడూ మనంఅంగీకరించలేదు. ఈ దేశంలోని అధికభూభాగంపై తమ ఆధిపత్యం నెరపిన అక్బరు, ఔరంగజేబుల పరిపాలనాకాలంలోకూడా రాణాప్రతాప్, గురుగోవిందసింహ, ఛత్రపాల్, శివాజీ వంటివా రెవరో ఒకరు వారి ఆధిపత్యాన్ని సవాలుచేసి తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకొనేందుకు ప్రయత్నించని రోజు ఒక్కటికూడా లేదు. ఆంగ్లేయుల పాలనాకాలంలో గూడా స్ఫూర్తిప్రదమైన అదే స్వాతంత్ర్యసమర సంప్రదాయం నిరంతరాయంగా కొనసాగుతూనేఉండేది. ఐతే, మొట్టమొదటిసారిగా 1947లో వేయిసంవత్సరాల ఉజ్జ్వలస్వాతంత్ర్య సమరాన్ని అయోగ్యపద్ధతిలో ముగించాం; మాతృదేశంయొక్క విశాల భూభాగాలను అ దురాక్రమణదారులకు ఏకంగా అప్పగించాం.

'హిందూముస్లిం సమైక్యం లేనిదే స్వరాజ్యంలే'దనే ఆత్మహత్యా వినాదం ప్రచారం చేస్తూ మన నాయకులు హిందువుల ఆత్మవిశ్వాసభావనను నాశనం చేయడానికి చేసిన నిర్విరామకృషి విషఫలితమే ఇది.

## పాపం పండింది

ఈ విషయంలో మనవంటి నిర్భాగ్యులు ప్రపంచంలోనేలేరు. ఇతర సమాజాల నాయకులు, తమ జాతుల్లో ఆత్మవిశ్వాసాన్ని కలుగజేయడానికి. దిగజారిపోతున్న చైతన్యాన్ని నిలబెట్టటానికి, శత్రువులనెదుర్కొని నప్పుడు వీరత్వము, విజిగీష నిలపటానికి తమ సాయశక్తులా సర్వదా ప్రయత్నించారు. కాని ఇచటమాత్రం ఈ సమాజంలోని పౌరుషాన్ని దిగజార్చేందుకు ప్రతిన బూనినారా - అని అనిపించే నాయకులు మనకు లభించినారు, ఏమైనప్పటికి ఇది మాత్రం చారిత్రకంగా సంభవించిన హఠాత్సంఘటనమాత్రం కాదు. జాతీయ గౌరవస్వాతంత్ర్యాలను అమ్ముకొని పన్నెండుశతాబ్దాలుగా తమవ్యక్తిగత స్వార్థం, ద్వేషం, అహంకారాల సాధనకై చుట్టపక్కాల కుత్తుకలనే ఉత్తరించడానికి పాతపగవారితో చేతులు కలిపిన అనేక నీచపూర్వజుల శ్రేణికి ఈ నాయకులు అగ్రేసరులు మాత్రమే. సమాజం చేసికొన్న అట్టిపాపానికి ఇట్టి నాయకత్వం మనకు ప్రాప్తించిందంటే ఏమాత్రం ఆశ్చర్యంలేదు.

## అగ్నిలో ఆజ్యం

అంతటి భయంకరమైన మూల్యాన్ని చెల్లించినప్పటికీ, ఈ నాయకులు తాము కలలుగనే 'హిందూ ముస్లిం సమైక్యా'న్ని సాధించగలిగినారా? లేదు, ముస్లిములను సంతృప్తిపరచటానికి మనవారు ప్రయత్నించినకొద్దీ, వారిలోని వేర్పాటు ధోరణి, దురాక్రమణ వాంఛలు తీవ్రమవుతూనేవచ్చాయి జాతీయ శక్తులకు వ్యతిరేకంగా ఆంగ్లేయులుకూడా వాటికి మరింత పదునెక్కించారు. ఆ విధంగా ముస్లిములు అటు ఆంగ్లేయులకు, ఇటు జాతీయవాదులకు ఇద్దరికీ కావలసివచ్చారు. కనుకనే రోజురోజుకీ వారి గిరాకీ పెరిగిపోయింది.

కాంగ్రెసు కేవలం హిందూ సంస్థగా కనిపించకుండా ఉండటానికి ముస్లిములను చేర్చుకునేందుకు నాయకులు ఎంతో తాపత్రయపడ్డారనీ

కాంగ్రెసు మహాసభలలో పాల్గొనేందుకు దారిబత్తాలిచ్చి, ఎన్నో సదుపాయాలు సమకూరుస్తామన్నప్పటికీ చాలా కొద్దిమంది ముస్లిములే సభలకు హాజరైనారని, సురేంద్రనాథ్ బెనర్జీ 1887వ సంవత్సరములో తన దినచర్యలో వ్రాసికొన్నారు.

స్వాతంత్ర్యపోరాట సమయంలో నెహ్రూపండితుడు ఒకసారి తన సొంతప్రాంతంలో ముస్లిములను ఇటు త్రిప్పుకొనే ఉద్దేశ్యంతో 'ముస్లిం జనసంపర్క' ఉద్యమాన్ని పెద్దగా ప్రారంభించినారు. కాని ప్రతిఫలంగా ఉత్తరప్రదేశ్‌లో ముస్లింలీగు అనేకరెట్లు పెరిగింది. చివరకు వేర్పాటు ధోరణిగల ముస్లింఉద్యమానికి ఆ ప్రాంతమే నాయకత్వం వహించింది.

1917 నాటికే, కాంగ్రెసుసంస్థ లక్నో ఒప్పందంలో ముస్లిములకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండాలని అంగీకరించింది. తరువాత 1931 లో కమ్యూనల్ అవార్డు, ముస్లింజనసంఖ్య మొత్తం ప్రజలలో 24% ఉన్నప్పటికి కేంద్ర శాసనసభలో వారికి 33⅓% స్థానాలు కేటాయించింది. దీనికితోడు జనాభాలెక్కల్లో హిందువులకన్న ముస్లిములే అధికసంఖ్యలో ఉన్నట్లు చూపడానికి అంకెలను తారుమారుచేసిన బెంగాల్, పంజాబు ప్రాంతాల్లో ముస్లిములకు చట్టరీత్యా ఆధిక్యం కల్పించారు; అంతేకాక, హెచ్చుచేసి వ్రాయబడిన జనాభానుబట్టి రావలసినదానికంటెకూడా చాలా ఎక్కువ స్థానాలు ప్రత్యేకించారు. ముస్లిములు అల్పసంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాల్లో వారికి అదనపువిలువ(వెయిటేజ్) కల్పించారు. అట్లాచేయడంవల్ల జనసంఖ్యనుబట్టి రావలసినవాటికంటె బాగా ఎక్కువస్థానాలు వారికి లభించాయి. అయినా వారి కోరికలు ఇంకా పెరుగుతూనే వచ్చాయి. 1946 లో తాత్కాలిక కేంద్ర మంత్రివర్గం ఏర్పడినపుడు ముస్లిములకు 'అగ్రకులాల' హిందువులతో సమానస్థాయి కల్పించి హిందువులలో చీలికలు తెచ్చిపెట్టినారు. చివరకు వారి గిరాకీ ఎంతగా పెరిగిందంటే, రెండు పెద్ద భూభాగాలపై

సార్వభౌమాధికారం సంపాదించి మిగిలిన దేశాన్నికూడా కబళించడానికి పథకాలు వేసికోవటమేకాక ఇక్కడ పటిష్ఠమైన పంచమాంగదళంగా పనిచేయటానికి తగినంత సంఖ్యతో వారు నిలిచిపోగలిగారు.

## వీగిపోయిన నినాదం

ఆంగ్లేయుల నిష్క్రమణ, స్వరాజ్యావతరణ, —వీటితోబాటు జరిగిన దేశవిభజన, "హిందు ముస్లిం సమైక్యంలేనిదే స్వరాజ్యంలేదు" అన్న నినాదం పట్ల అబద్ధం అని ఋజువు పరచాయి. నిజానికి హిందూ ముస్లిం సంబంధాలు, 1946 - 1947 సంవత్సరాలలో ఉన్నంతకటువుగా మరెన్నడూలేవు. లక్షలాది కుటుంబాలను వారి తాతలనాటి గృహాలనుండి తరిమివేశారు. ప్రతి ప్రాంతంలోను రక్తపుటేరులు పారినాయి. ప్రాణ, మాన నష్టాలతో, మారణహోమాలతో కోట్లకొలది అమాయిక మానవుల ముఖాలు మ్లానమయ్యాయి తరతరాలుగా ఈ ఇద్దరి మధ్య ఉంటున్న సామాన్య సాంఘిక సహజీవనంకూడ ఆ సమయంలో భగ్నమై పోయింది. ఆంగ్లేయులు మనదేశం విడిచిపెట్టి పోయిన సమయం, సరిగ్గా ఇదే. "హిందూ ముస్లిం సమైక్యంలేనిదే స్వరాజ్యంలేదని" ప్రకటించిన నాటి నాయకులయొక్క "దూరదృష్టిని, రాజకీయ చతురతను" వర్ణించటానికి మాటలు చాలవు.

## సరిదిద్దే సాధనం

ప్రతిక్రియాత్మకము, వికృతమునైన జాతీయ భావనయొక్క విషఫలితాలను, ఆంగ్లేయులు నిష్క్రమించిన తర్వాతకూడా అనుభవిస్తూనే ఉన్నాం. ఆదిలో అడుగు కొంచెం ప్రక్కకు వేసినా, నడుస్తున్నకొలదీ గమ్యానికి దూరంఅయిపోతాం అన్నది అందరికీతెలిసిందే. అంతేగాక ఒకసారి తప్పుచేస్తే, తరువాతకూడ దాన్ని పట్టుక ప్రేలాడుతూనుంటాడు మానవుడు.

ఆ తప్పుత్రోవను విడిచిపెట్టుమని ఎవరైనా సలహాయిస్తే అతడు రెచ్చిపోయి మరింత మొండిగా దాన్నే అంటిపెట్టుకొని ఉంటాడు. తప్పు చేయటం మానవసైజమే; కాని ఘోరమైన తప్పిదమని ఋజువైనదాన్ని పట్టుకుని వేలాడటం మాత్రం అమానుషం. అది పశులక్షణమేకాని మానవ లక్షణంగాదు. తన తప్పు ఒప్పుకొని సవినయంగా దాన్ని సరిదిద్దుకొని అట్టి తప్పును మరెన్నడూ చేయనని దృఢసంకల్పం చేసుకోవడం ఆలోచనాపరుడైన మానవుని లక్షణం. కాని దురదృష్టవశాత్తు గతంలో ఎన్నడూ కనీవినీ ఎరుగనంతటి దారుణమైన మాతృదేశ విభజనకు, దాని పరిణామంగా నిత్యమూ పెరుగుతున్న ప్రమాదాలకు, రెండున్నర కోట్లమంది నిలువనీడ లేక అవమానాలపాలై అంతులేని అష్టకష్టాలకు గురికావడానికి దారితీసిన తమ ప్రాదేశిక జాతీయవాదాన్ని మాత్రం మార్చుకొనేందుకు, సరిచేసుకొనేందుకు మన నాయకులు సిద్ధంగాలేరు.

మనం అవలంబించిన అసహజము, దోషభూయిష్ఠమునైన ప్రాదేశిక జాతీయభావనకు తగిన ఫలితాన్నే అనుభవించినాం; ఈనాటికీ అనుభవిస్తూనే ఉన్నాం. అంతకన్న మంచిఫలితం లభిస్తుందనే ఆశకూడలేదు. ప్రాదేశిక జాతీయతావాదం పూర్తిగా జాతిని నిర్వీర్యం చేసివేసింది. జీవశక్తి లేని దేహంనుండి అంతకన్న ఎక్కువగా ఏమాశించగలం ?

ఒకసారి ఒక కళాశాలలో జంతుశాస్త్రవిద్యార్థులు తమ వృద్ధ ఆచార్యుణ్ణి ఆటలుపట్టిద్దామని ఒక పథకం వేశారు. వారొక నీటి కీటకం (వాటర్-బగ్)కాళ్లు పీకేసి, మరొకజాతి కీటకంయొక్క కాళ్లు దానికతికించినారు. దాన్ని ఆయనవద్దకు తీసుకుపోయి "ఆర్యా! ఇదేమిటో నిర్ణయించుకోలేకుండా ఉన్నాం. ఏజాతి కీటకం?" అని ఆశ్చర్యస్వరంలో అడిగినారు. ఆ ప్రొఫెసర్ దాన్ని సూక్ష్మదర్శినిలో పరిశీలించి గంభీరంగా ముఖంపెట్టి "ఇదేమిటి! ఇంతటి సామాన్యమైన కీటకాన్ని గుర్తించలేకపోయినారా? ఈ కీటకం పేరు "బూటకం" (హంబగ్) అన్నారు.

ఇట్టి 'బూటకం' జాతీయతకు జీవంపోయాలని ప్రయత్నం జరిగింది. ఏనుగు మొండెముకు ఎద్దుకాళ్ళు, కోతితల తగిలించి క్రొత్త జంతువును సృష్టించాలని యత్నించినట్లుంది. దానివల్ల జుగుప్సాకరమైన కంకాళం మాత్రమే ఏర్పడుతుంది; చైతన్యం మాత్రం పొందలేదు. ఒకవేళ దానిలో ఏదో ఒకచైతన్యంకనబడిందంటే అదికేవలం క్రుళ్ళిపోతున్న కళేబరంలో చేరిన సూక్ష్మక్రిముల సంచలనమే తప్ప మరేమీకాదు. అవినీతి, విచ్ఛిన్నతల విఘటనక్రిములు, జాతిని పీల్చి పిప్పిచేయటం మనం చూస్తున్నాం. సహజ సిద్ధమైన సజీవ జాతీయభావన విడిచిపెట్టి అసహజము, అశాస్త్రీయము జీవరహితము ఐన ప్రాదేశిక జాతీయవాదమనే సంకరసిద్ధాంతాన్ని పట్టుకొని ప్రాకులాడినందువల్ల వచ్చిన ఫలితం ఇది.

కాబట్టి, ఒకజాతిగా మళ్ళీ పైకిరావాలంటే: పూర్తిగా అసత్యము వినాశకరము అని స్వానుభవంలో నిరూపితమైన క్రొత్తరకపు కృత్రిమ జాతీయవాదాన్ని స్వీకరించడం ద్వారా చేసిన తొలితప్పిదాన్ని మనం సరిచేసుకోవాలి. స్వార్థపరుల విషప్రచారాలకు మనం మోసపోరాదు. మానవులంతా సోదరులనే గొప్పతత్త్వజ్ఞానం, విశాలభావం, ఇత్యాదులు కలిగిన మనవంటి హిందువులు 'హిందూరాష్ట్రీయత'వంటి 'మతతత్త్వపూరిత' 'మధ్యయుగ' 'ప్రతిక్రియాత్మ' భావనచే కుచించుకుపోరాదని వారుచేస్తున్న ప్రచారాలవలన ఇప్పటికే తగినంతగా మోసపోయినాము. వారి కుతంత్రాన్ని మనం సరిగా అర్థంచేసుకోవాలి. భారతదేశంలో హిందువులే జాతీయ సమాజమనే అతి ప్రాచీనసత్యాన్ని మనం గుర్తించాలి. పూజ్యులైన మన సంఘస్థాపకులు సంఘం పేరులో 'రాష్ట్రీయ' అన్నపదాన్ని నిర్ణయించటం ద్వారా ఇదే సత్యాన్ని సుస్పష్టంగా ప్రకటించారు. మనం మళ్ళీ మన వాస్తవిక సంపూర్ణ స్వరూపంతో లేచి నిలబడి భారతదేశంలోని హిందూ జాతీయజీవనాన్ని వైభవప్రతిష్ఠల శిఖరాగ్రానికి చేర్చాలి. అతి ప్రాచీన కాలంనుండి అది మన జాతికి జన్మసిద్ధమైన అధికారం.

# 13. సుదృఢ విశ్వాసం కావాలి

ఈనాడు దేశంలో ఒకవిచిత్రపరిస్థితిఉంది. సత్యము, భావాత్మకము నైన హిందూరాష్ట్రీయతను మతతత్త్వం, ప్రతిక్రియాత్మకం, సంకుచితం అని దూషిస్తూ, అశాస్త్రీయము, ప్రతిక్రియాత్మకము. ప్రమాదకరమునైన ప్రాదేశికరాష్ట్రవాదాన్ని మతనిరపేక్షం (సెక్యూలర్). ప్రగతిశీలం, విశాల దృక్పథయుతం అని ఆకాశాని కెత్తేస్తున్నారు. రాజకీయ దుమారం మాట అటుంచండి, 'మతనిరపేక్షవాదుల'కు అంతరాంతరాల్లో మనతో భేదం ఉన్నదా ?

## మనసా అంతా అంగీకరిస్తారు, కానీ...

ఈనాడు దేశంలోని గొప్పమేధావులు మన తత్త్వశాస్త్రం, కళలు మొదలైనవాటిని "ఇండియన్ ఫిలాసఫీ" అని "ఇండియన్ ఆర్టు" అని ప్రశంసిస్తూంటారు. 'భారతీయ తత్త్వశాస్త్రం' అత్యున్నతస్థాయి ఉపనిషత్తులలో కనిపిస్తుంది, 'భారతీయ సాహిత్యరంగం'లో మణిపూస వంటివాడు 'కాళిదాసు' అని పలుకుతుంటారు. భిన్నత్వంలో ఏకత్వాన్ని సందర్శించగలగటం, అన్నిసంప్రదాయాలను మతాలను గౌరవించటం

మానవజాతికి 'భారతీయమేధ' ప్రసాదించిన అమూల్యమైన కానుక అని వారు ఘోషిస్తారు. అయితే ఇట్టి ప్రకటనల నిజమైన అర్థమేమిటి? వాటన్నిటిలోను "హిందూ" కాకుండ "ఇండియన్" ఐన దేమన్నా ఉందా?

ఒకసారి ఒక ప్రముఖ నాయకుడు "హిందూరాష్ట్రం" ఇత్యాదిగా మీరు చెప్పేవాటన్నిటికి మాకెట్టి అభ్యంతరం లేదనుకోండి అయినా "హిందూ" పదం ఈ రోజుల్లో ఇబ్బంది కలిగించేదిగా ఉన్నది కాబట్టి ఆమాటకు బదులు "భారతీయ" పదాన్ని మీరెందుకు తెలివిగా ఉపయోగించరాదు అని సూచించారు. అంతేగాక ఆయన "నబ్రూయాత్ సత్యమప్రియమ్" (అప్రియమైన నిజమును పలుకరాదు) అనే ప్రసిద్ధ సంస్కృతోక్తిగూడా ఉదాహరించినారు, నిజాన్ని కప్పిపుచ్చటానికి ఎంత డొంకతిరుగుడు! పై సంస్కృతవాక్యానికి అసలర్థం వేరేఉంది. కటువైన నిజాన్ని కప్పిపుచ్చుమనికాదు దాని భావన. అట్లాచేస్తే అసత్యాన్ని సమ్మతించడమే ఔతుంది. నిజం చెప్పితీరాలి. అయితే ఆ చెప్పేది తియ్యగా చెప్పాలి. మనభావాలు సరిగ్గా, నిర్దుష్టంగా 'హిందూ' పదంలోనే వ్యక్తమవుతాయి. 'భారతీయ' అన్న పదంకూడా వ్యక్తం చేయవలసిన భావన అదే ఐనప్పటికీ, మన నాయకులు ఆ పదాన్ని ప్రయోగించినతీరు భ్రమకల్గించి పెడదారి పట్టిస్తుంది. కనుకనే ఎవర్నో తృప్తిపరచటానికో, ఒకరిమెప్పు పొందటానికో సత్యాన్ని చులకన చేయరాదని మనం నిర్ణయించుకొన్నాం. ఈసత్యాన్ని ప్రచారం చేయటంలో ఒకరిని దూషించేస్థితికి ఎన్నడూదిగజారం. విశుద్ధము, భావాత్మకము ఐన మన జాతీయజీవనాన్ని ఆధారం చేసుకొని దాని వెలుగులోనే మన జాతీయ సమస్యలనన్నిటినీ పరిశీలిస్తాం.

కొందరు ఇంతటి వివరంగా చెప్పకపోవచ్చుగాని, 'హిందూ రాష్ట్రీయత' అనే సత్యంయొక్క ప్రభావం అందరి మనస్సులపైన ఉంది. సోమనాథ దేవాలయపునరుద్ధరణ తర్వాత ప్రారంభోత్సవానికి అనేక

మహానాయకులు, విద్వాంసులు వెళ్ళారు. వారిలో మన ప్రథమ రాష్ట్రపతి చిరస్మరణీయులైన డాక్టర్ రాజేంద్రప్రసాదుకూడా ఉన్నారు. అక్కడ వారి ఉపన్యాససారమేమిటి? సోమనాథదేవాలయ పునర్నిర్మాణం ద్వారా పన్నెండువందల సంవత్సరాల దాస్యకళంకాన్ని కడిగివేసుకొంటున్నాం. అని అన్నారు వారు. ఎంతటి సత్యాన్ని ప్రకటిస్తున్న దావాక్యం! ఆ మాట అంటున్నప్పుడు మనలను అంతకాలం బానిసత్వంలో అణగద్రొక్కిన దెవరని వారిభావం? ఆ సోమనాథ దేవాలయాన్ని భగ్నం చేసిందెవరు? ముస్లిములే భగ్నంచేసినారన్నమాట సుస్పష్టం. సోమనాథదేవాలయం ఎవరి గౌరవానికి, భక్తికి పాత్రం? హిందువులకేనని కూడా సుస్పష్టమే. హిందువుల జ్యోతిర్లింగాల్లో అది ఒకటి. ఆ దేవాలయాన్ని భగ్నం చేయటం హిందూజాతి ప్రతిష్ఠకు అవమానం. దాన్ని పునర్నిర్మించటంద్వారా పోయిన గౌరవాన్ని పునః ప్రతిష్ఠించుకొన్నాం. తద్వారా విదేశీదురాక్రమణయొక్క-అంటే ముస్లిం దురాక్రమణ - అవశేషాలను తొలగించుకొన్నాం. అనాది కాలంనుండి ఈదేశంలో హిందువు నివసిస్తున్నాడని, అతని మనుగడయే ఇచట జాతీయజీవనమని, అతని ఆరాధ్య వస్తువులను పునరుద్ధరించటం ద్వారా మాత్రమే ఈ దేశంపై జరిగిన విదేశీ దురాక్రమణల కళంకాలు చెరిపివేయబడతాయని-ఇంతటి భావనను వారు స్పష్టంగా ఆ ఒక్కవాక్యంలో వ్యక్తం చేసినారు.

కాబట్టి 'విశాలదృష్టి' అని చెప్పేవారికిగూడా మనవిశ్వాసాలే ఉన్నప్పటికీ, వారు వాటిని సూటిగా ప్రకటించరన్నమాట. వారిదంతా డొంకతిరుగుడు వ్యవహారం. అయినా చివరకుమాత్రం వారుకూడా హిందూరాష్ట్రము అనే సత్యాన్నే అంగీకరిస్తారు. ఈ దేశంలోని హైందవేతరుల - తమ మనస్సులలో ప్రముఖంగా మెదిలే ముస్లిముల- మన స్తత్త్వంపట్లకూడా మన నిర్ణయానికే వస్తారు.

ఒకసారి ఒక ప్రముఖ కాంగ్రెసు కార్యకర్త "ఈ దేశంలో నాలుగు కోట్లముస్లిములున్నారు. పాకిస్తానేమైనా మనపై దుర్మార్గం చేస్తే వీరందరూ

వారితో చేతులుకలిపే అవకాశముంది. కాబట్టి ఇది హిందూరాష్ట్రమని సూటిగా చెప్పలేము"అని నాతో అన్నాడు. "అయితే హిందూముస్లిం భాయి భాయి అనే మీ నినాదం ఏమైనట్లు? ఈ నినాదాలన్నీ నిజమైన నమ్మిక నుండిగాక, ముస్లిములపట్ల భయంవల్ల పుట్టినవని ఇప్పుడు మీరు చెప్పే మాటలనుబట్టి స్పష్టమౌతోంది" అని నేనన్నాను. అది సత్యంకాబట్టి అతడింకేమీ మాట్లాడలేకపోయినాడు. మతనిరపేక్షులమని, విశాలదృష్టి కలవారమని చెప్పుకొనేవారి మనస్సుల్లో ఉన్న ఈ భావమే "ముస్లిములను కించపరచి, వారిని మనకు శత్రువులను చేసేటువంటి 'హిందూ' పదాన్ని మనం వాడవద్దు" అని వారనటానికి కారణం. వారు కోరుకొనేదేమంటే శత్రుత్వమైతే ఉందిగాని మనపట్ల వాళ్ళు శత్రువులుగా వ్యవహరించకుండా ఉండేందుకుగాను వాళ్ళను సంతుష్టిపరచాలి అని.

## నీతిప్రదమైన కథ

మహాభారతంలో ఒక చక్కని కథ ఉంది. ఒకప్పుడు పాండవులు తమ తల్లిని వెంటనిడుకుని, మారువేషాలతో తిరుగుతూ, ఏకచక్రపురమనే ఊరికి చేరుకున్నారు. ఆ నగరం బకుడనే భయంకరరాక్షసుని ఆధీనంలో ఉందని వారికి తెలిసింది. వాడొకసారి ఆ నగరాన్నంతనూ నాశనం చేయబోతుంటే, ఆ నగర ప్రజలు "మమ్మల్నందరిని ఒకేసారిగా చంపవద్దు. నీవీ ఉపకారంచేస్తే, ప్రతిరోజూ ఒక బండినిండా అన్నం, ఇతర తినుబండారాలతోబాటు, ఆ బండికి కట్టిన రెండుదున్నపోతులు, తోలుకువచ్చే మనిషి – ఇవన్నీకూడా నీకు ఆహారంగా మేం పంపుతాం" అని వాడితో ఒప్పందం చేసికొన్నారు.

తర్వాత కథ చాలా ముచ్చటగాను, నీతిబోధకంగానూ ఉంటుంది. తనకొడుకులైదుగురిలో ఒకణ్ణిపంపి, రాక్షసుడిపీడ విరగడయ్యేట్లు చేస్తానని కుంతి ప్రజలకు అభయమిచ్చింది. భీముడు బండిని తోలుకొని ఆ రాక్షసుడు

ఉండేచోటికి వెళ్ళినాడు. 'ఓరి బకా! ఎక్కడున్నావురా? నీ తిండి తెచ్చారా? అని బిగ్గరగా కేకవేసి, ఆ దున్నపోతులను విప్పేసి, బండెడు అన్నం తానే ఆరగించసాగాడు. అదిచూచి బకుడికి మతిపోయింది. ఆనాటివరకు తనను పేరుతో పిలిచే దమ్ములు ఎవరికీలేవు. వాళ్ళు గడగడ వణికేవారు. కాని ఇప్పుడో, తనకు ఆహారంగా వచ్చినవాడు తన ఆహారాన్నే తినేస్తున్నాడు! ఇక వాడు కోపంతో భీమునిపైబడి పిడిగ్రుద్దులు ప్రారంభించాడు. అయినా మనవాడు మాత్రం 'ఒక్కక్షణంఆగు, నాభోజనం పూర్తికానీ' అంటూ తీరిగ్గా తిని లేచాడు. 'ఎంతోకాలంగా ఈ అమాయిక ప్రజలను బాధిస్తున్నావు. నీసంగతి తేల్చేందుకే వచ్చానురా' అన్నాడు. మనకు తర్వాతసంగతి తెలుసు. మరునాటి ఉదయం తమ నగరద్వారం ముందు భయంకరుడైన ఆ బకాసురుని మృతకళేబరాన్ని చూచి ఆ నగర ప్రజలు 'అమ్మయ్యా' అనుకొన్నారు.

దురాక్రమణదారులతో ఈ రెండు పద్ధతుల్లోనూ వ్యవహరించవచ్చు. వాడొక దురాక్రమణదారుడనీ, వాడు మనకు విరోధి అనీ ఈ రెండుమార్గాల్లోను గుర్తింపు ఉండనే ఉంటుంది. అట్లాగే ఐదునుంచి పదిహేను శాతం వరకు స్థానాలు ఇస్తామని, సమాఽప్రతిపత్తినిస్తామని, దేశాన్ని ముక్కలుచేసి ఇస్తామని, ఇత్యాదిగా మనవారు బేరంఆడినా, తాడోపేడో తేల్చుకుందాం రమ్మని పిలిచినా – ఈ రెండు మార్గాల్లోనూకూడా ముస్లిములు మనకు విరోధులనే నిజంయొక్క గుర్తింపు ఉండనేఉంది;అందులోతేడాలేదు .

కొందరు మనల్ని మతతత్త్వవాదులంటూ ఏమేమో అన్నప్పటికీ వారి విశ్వాసాలు, మన విశ్వాసాలు ఒకటేనని దీన్నిబట్టి మనం గమనిస్తాం. మనకుమాత్రం ఆ నిజాన్ని వెలికిప్రకటించే ధైర్యంఉంది. వాళ్లు భయంచేత 'విశాల దృక్పథము' 'మతనిరపేక్షం' అన్న ముసుగులోదూరి, ఇతరులను సంతృప్తిపరచడానికి, చల్లబరచటానికి యత్నిస్తుంటారు. అంతేతేడా అంటే ఇక్కడ నివసిస్తున్న ఆ యా వర్గాలవారికి ఇక్కడి ఉప్పు తిన్నా

విశ్వాసంలేదు; ఈ సంస్కృతిని అలవర్చుకోలేదు; అనాదిగా ఈ దేశం ప్రసాదిస్తున్న జీవనాన్ని స్వీకరించలేదు; ఇచ్చటి జీవన దర్శనంలోనూ జాతీయ పురుషుల్లోనూ, జీవిత ఆదర్శాల్లోనూ వాళ్ళకు నమ్మకంలేదు - క్లుప్తంలో వాళ్ళు మన జాతీయ జీవనంలో కలవని విదేశీయులు అనే నిర్ణయానికి వస్తాం. కనుక ఈ పవిత్రభూమిపై కలకాలమూ విలసిల్లే వాస్తవము, వైభవోపేతము అయిన జాతీయజీవనం హిందువులది మాత్రమే అనికూడ స్పష్టమే.

## దృఢ విశ్వాసం నేటికీ ఉంది

జాతీయతను గురించిన దృఢవిశ్వాసం అనాదిగా మనరక్తంలో మిళితమై ఉంది. అదే విశ్వాసం ఈనాటికీ ప్రతిహిందూ హృదయంలోనూ ఉంది. అయితే అది ఒక్కొక్కసారి మరుగున పడవచ్చు; అంతే.

1920 - ఆ ప్రాంతాల్లో - డాక్టర్ మూంజే (నాటికి గొప్ప కాంగ్రెసు నాయకుడు) డాక్టర్‌జీని వెంటబెట్టుకుని అరవిందులను కలియటానికి పాండిచేరికి పోతూ, మద్రాసు చేరారు. డాక్టర్ మూంజే మొదటి తరగతిలో ప్రయాణం చేస్తుంటే, మన డాక్టర్‌జీ దాదాపు వారి అనుచరునివలె మూడవ తరగతిలో ప్రయాణం చేసినారు. ముందు స్టేషనులో రైలుబండి ఆగగానే సామానులన్నీ సర్దే నిమిత్తమై డాక్టర్‌జీ, డాక్టర్ మూంజేగారి పెట్టెలోకి వెళ్ళారు. ఆ పని ముగిసేలోగానే రైలు కదిలింది. రైలు మద్రాసు చేరగానే ఒక టికెట్‌కలెక్టర్ వచ్చి, మూడవతరగతిటిక్కెట్టుతో చట్టవిరుద్ధంగా మొదటితరగతిలో ప్రయాణం చేసినందుకుగాను డాక్టర్‌జీ డబ్బుకట్టాలని చెప్పినాడు. డా॥ మూంజే నచ్చచెప్పటానికి ప్రయత్నించినారు. కానీ టిక్కెట్టు ఇన్‌స్పెక్టరు మొండిపట్టుపట్టినాడు. "ఐతే నీవు నామాట నమ్మవన్న మాట? డబ్బుకట్టుతున్నాను కాబట్టి నేను ఈ రైల్వేకి యజమానిని. నువ్వు కేవలం ఒక సేవకుడివి, అంతే. ఇంక మాట్లాడక పో" అని వెంటనే కోపంతో

డా॥ మూంజే అరిచినారు. దాంతో టికెట్ ఇన్‌స్పెక్టరుగూడ రెచ్చిపోయినాడు. "నాకు చెప్పేందుకు నీవెవరవు? ఇదేమీ ముస్లిందేశంకాదు పోవయ్యా!" అని అన్నాడు. అదివిని డాక్టర్లిద్దరూ తనివితీర నవ్వుకున్నారు. ఆ ఉద్యోగి అలా ఎందుకన్నాడు? డాక్టర్ మూంజేగారికి పొడవైన గడ్డం ఉంది. అదిచూచి టికెట్ ఇన్‌స్పెక్టరు ఆయనను ఒక ముస్లిమనుకున్నాడు. అంటే ఒక అతిసామాన్యవ్యక్తి కూడా ఇది ముస్లిముల దేశంకాదని అప్రయత్నంగా భావిస్తాడన్నమాట.

చాలా యేండ్ల క్రిందట నిజాము దర్బారులో పీష్వాల రాయబారిగా గోవిందరావు కాళే ఉంటూ ఉండేవారు. పీష్వా సింధునదిని దాటి తన విజయఖడ్గాన్ని కాబూలువరకు సాచినట్లు ఆయనకు తెలిసింది. ఆ సందర్భంగా ఆయన పీష్వాకొక అభినందనలేఖ వ్రాసినారు. "మళ్ళీఒకసారి భగవాధ్వజం సింధునదిని దాటినందుకు, ముస్లిం శక్తి తుత్తునియలు అయినందుకు, నాకు చాలా ఆనందంగాఉంది హిమాలయాలనుండి కన్యాకుమారివరకు వ్యాపించిన ఈ భూమి హిందూస్థానమేనని, 'తురకస్థానం'కాదని మరొకసారి నిరూపితమైంది" అంటూ వ్రాసినాడు. 150 ఏండ్ల క్రితం ఒకగొప్ప హిందూ రాజ్యానికి చెందిన చతురుడైన రాయబారితోబాటు ఈనాటి ఒక అతిసామాన్య టిక్కెటుఇన్‌స్పెక్టరుకూడ ఇది ముస్లిం దేశంకాదనే ఒకదృఢ విశ్వాసాన్ని వ్యక్తం చేసినాడు. ఇదే సత్యం.

## నిజానికిగూడ ఋజువు ఉండాలి

దురదృష్టవశాత్తు, కొందరు ప్రముఖ వ్యక్తులు భ్రమలను, అసత్యాలను క్రుమ్మరించి ఈ సత్యాన్ని కప్పివేయాలని ప్రయత్నించినారు. 'మీజాతి అనే భావనను హిందువులు మరచిపోయేట్లుగా చేసేటందుకు వారు ప్రయత్నాలు చేస్తున్నారు. అసత్యమైనప్పటికి, పదేపదే యెడతెరిపిలేకుండా దాన్నే చెప్పితే అది బలహీన మనస్సులపై తప్పక ప్రభావం కలిగిస్తుంది. కథలో చెప్పినట్లుగా ఒకసారి ఒక పేదబ్రాహ్మణుడు మేకపిల్లను చంకన

పెట్టుకపోతున్నాడట. ముగ్గురు దొంగలు దాన్ని కాజేయాలని పథకం వేసికొని ఒకరితరువాత ఒకరుగా అతణ్ణికలిసి, అతనివంటి పవిత్రుడైన బ్రాహ్మణుడు కుక్కను మోసుకపోవడమేమిటని ఎగతాళిచేశారట. ఆ వెర్రి బాపడు మొదటివాడి మాటను త్రోసిపుచ్చినాడు. రెండోవాడూ అదే సూచించేసరికి కొద్దిగా సందేహించినాడు. చివరకు మూడోవాడుగూడ మళ్ళీ అదేచెప్పేసరికి పూర్తిగా నమ్మేసి ఆ మేకపిల్లను వదిలేశాడట; దాన్ని దొంగలు ఆనాడే సొమ్ము చేసుకొన్నారు.

కుటిలులైన ఆంగ్లేయులు మనదేశంపై తమ ఆధిపత్యాన్ని కలకాలం కొనసాగించేందుకుగాను, మన మనస్సులలో రాష్ట్రీయతను గురించిన వికృతభావనలను నాటారు. తమ పెత్తనానికి ఎసరుపెట్టేది హిందువులలోని మొక్కవోని స్వాభిమానమొక్కటే కాబట్టి దానిని దెబ్బ తీసేందుకు వారు యత్నించినారు. ఈ చారిత్రకసత్యాన్ని మనం విస్మరించ రాదు. ఇట్టి స్వచ్ఛము, ప్రగాఢమునైన జాతీయభావ చైతన్యమొక్కటే తమ కుయుక్తులన్నిటినీ నాశనం చేయగలదు కాబట్టి, దాన్ని రూపుమాపటం ద్వారా తమ స్వార్థప్రయోజనాలను సాధించుకోవాలని, మనదేశానికి ఇంటా బయటా కూడా ఈనాడు కొన్ని శక్తులు పనిచేయటం కనిపించటంలేదా? ఆత్మహత్యా సదృశమైన త్రోవపట్టించడానికి వారుచేసే కుటిలప్రచారాల ప్రవాహంలో, తెలిసో తెలియకో మనప్రజలు కొట్టుకపోతున్నారు. కనుకనే హిందూరాష్ట్రీయతాసత్యాన్ని పునఃప్రతిష్ఠించాలి; శ్రేష్ఠమైన ఈ హిందూ రాష్ట్రానికి తానొక చైతన్యవంతమైన అవయవం అనే స్వాభిమానపూర్ణమైన వారసత్వాన్ని ప్రతిహిందువు గుర్తించేట్లు చెయ్యాలి; ఇది మన పవిత్ర కర్తవ్యం.

అయితే ఇది ఏవిధంగా సాధ్యమవుతుంది? సత్యాన్నికూడా ఋజువు పర్చవలసి ఉంటుందనీ, దానికికూడా ప్రమాణీకరణశక్తి నమకూడాలనేది మన అనుభవంలోని విషయమే. దాన్నే మనశాస్త్రాలు 'నిగ్రహానుగ్రహ

క్షమా శక్తిః' అంటే మంచిని సంరక్షించి, చెడును నాశనం చేయగలది అని వర్ణించినవి. భగవద్గీతలోని మొదటి అధ్యాయంలో అర్జునుడు తన సంశయాలను కృష్ణునికి నివేదించుకొన్నాడు. రెండవ అధ్యాయమంతా అతని ప్రశ్నలకు సమాధానమే. రెండవ అధ్యాయంలో తాను చెప్పినదానిని తరువాత అధ్యాయాలలో శ్రీకృష్ణుడు వివరించినాడు. అయినా అర్జునుడు మాత్రం సంతృప్తిచెందలేదు. చివరకు శ్రీకృష్ణుడు మహోన్నతవిశ్వరూపాన్ని ప్రదర్శించినవెంటనే 'ఇప్పుడు నీవు చెప్పినదంతా అర్థమయిం' దన్నాడు. జీవితానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలేమీ అతడు ఆతరువాత అడుగలేదు. పదకొండవ అధ్యాయం తర్వాత అర్జునుడు అత్యధిక శ్రద్ధతో విషయాలు గ్రహించినట్లు మనం గుర్తిస్తాం. అట్లా ఎందుకు జరిగింది ? అంతవరకు శ్రీకృష్ణునినుండి విన్న దివ్యమైన ఉపదేశాలకు ప్రమాణీకరణశక్తిని సమకూర్చే ఒక అనంతశక్తి విశ్వరూపసందర్శనంవల్ల ప్రకటితమయింది కాబట్టే అది సాధ్యమయింది.

ఒకసారి ఢిల్లీలో మనసంఘఉత్సవానికి అధ్యక్షతవహించవలసిందిగా ఒక ప్రముఖ కాంగ్రెసు నాయకుని ఆహ్వానించినాము. ఆతరువాతకాలంలో ఆయన కేంద్రంలో ఒక ప్రముఖ కాబినెట్ స్థాయి మంత్రిగాకూడాపనిచేసినాడు. ఆయన మన ఆహ్వానాన్ని అంగీకరించినాడు. తానొక కాంగ్రెసు వాదియై ఉండి, రాష్ట్రీయ స్వయంసేవక సంఘం వంటి మతతత్వసంస్థతో సంబంధం ఉంచుకోరాదని తోడికాంగ్రెసు మిత్రులతణ్ణి వెనక్కులాగటానికి ప్రయత్నం చేసినారు. సిద్ధాంతాలవిషయంలో తానేమాత్రం రాజీపడనని వారికి వాగ్దానం చేసి మన ఉత్సవానికి వచ్చినాడాయన. పూర్ణగణవేషంతో ముచ్చటగా ఉన్న వేలాదిసంఘ స్వయంసేవకులను ఆయన అక్కడచూచినాడు. చక్కని పద్ధతిలో నిశ్శబ్దాన్ని పాటిస్తూ దాదాపు మూడులక్షలమంది శ్రోతలుకూడా అక్కడ ఉపస్థితులై ఉన్నారు. తొలిపలుకులయిన తర్వాత అధ్యక్షోపన్యాసం చేసేందుకు ఆయన లేచి నిలబడ్డాడు. 'ఈ హిందూస్థానం హిందువులదికాక మరెవ్వరిది ? హిందువులది కాక మరెవ్వరి జీవనం

ఇక్కడ రాష్ట్రీయజీవనం కొనసాగుతుంది" అని ఆయన ప్రసంగించినాడు. మరునాడు ఆయన ఉపన్యాసం పత్రికలలో ప్రచురింపబడింది. తోటికాంగ్రెసు వాదులనుండి అనేక అభ్యంతరాలు ఆయనకు ఎదురైనవి. "ఆ దృశ్యాన్ని చూచినట్లైతే మీలో ఎవరైనాసరే దానికి వ్యతిరేకంగా మాట్లాడి ఉండేవారు కారు" అని ఆయన వారికి చెప్పినట్లు తెలిసింది, ఆయన చెప్పినదే నిజం. వేలాది సుశిక్షితులు, శ్రద్ధావంతులునైన స్వయంసేవకులరూపంలో చైతన్యవంతమైన హిందూరాష్ట్రీయశక్తి కనులముందు నిలిచేసరికి నిజమైన మనరాష్ట్రీయతపట్ల ఆయన హృదయంలో మరుగున పడిఉన్న దృఢవిశ్వాసం ఒక్కసారిగా మేలుకొంది.

కాబట్టి హిందూ రాష్ట్రీయత అనే తరతరాల సత్యానికి ప్రోద్బలంగా పవిత్రము, ఉదాత్తము, అజేయమునైన హిందూసమాజశక్తిని నిర్మించే బాధ్యత ప్రతిహిందువుది. ఆత్మవిస్మృతియే అధర్మమని, ఆత్మసాక్షాత్కారమే ధర్మమని మన శాస్త్రాలు చెపుతున్నాయి ఆ విధంగా వైభవోపేతము ఉజ్జ్వలమునైన హిందూరాష్ట్రీయత అనే తమ జాతీయఆత్మను హిందూ సమాజం గుర్తించేటట్లు చేయటమే మన ప్రాచీన మహాపురుషులందరూ మనకు సూచించిన ధర్మ పునఃప్రతిష్ఠాపనామార్గం.

# 14. హిందూరాష్ట్ర వైశిష్ట్యం

## 1. హిందూ రాష్ట్రము – అల్పసంఖ్యాకులు

అల్పసంఖ్యాక మతవర్గాల సమస్యకు సరైన పరిష్కారం కావా లంటే హిందు రాష్ట్రచరిత్రను సమంగా అర్థం చేసుకోవాలి; విషయాన్ని హేతుబద్ధంగా సవ్యమైన పద్ధతిలో సమాలోచన చేయాలి. లేకపోతే– ఈ అల్పసంఖ్యాకులనేవారు తమ మత సంరక్షణ అనే ముసుగు చాటున మరింతగా కరుడు కట్టి జాతీయ జీవనానికే మరింత ప్రమాదకారులుగాఅయి తీరుతారు.

కాబట్టి అల్పసంఖ్యాక మతస్థులమనే భావనను విడిచిపెట్టడంతో పాటు, విదేశీ మానసిక ప్రవృత్తులను విడిచి, ఈ భూమికి చెందిన సర్వ సామాన్య జాతీయ జీవన స్రవంతిలో తమంతటాముగా లీనం అవటం– ఇదే సాటి పౌరులైన మన ముస్లిముల నుంచీ, క్రైస్తవులనుంచీ మనం ఆశిస్తాం. ఆరాధనా విధానం మారినంతమాత్రాన, ఈ గడ్డకు చెందిన ఒక వ్యక్తిని, ఈ తల్లికి బిడ్డడు కాదనటం, విదేశీయుడనుకోవటం ఈ దేశపు సంప్ర దాయం కాదు. భగవంతుని ఏ పేరుతో పిలిచినా మనకు అభ్యంతరం

లేదు. అన్ని విశ్వాసములపట్ల, మతనమ్మకాలపట్ల ఆదరాభిమానాలు మనలో అణువణువునా వ్యాపించి ఉన్నాయి. పరమత అసహిష్ణతగలవాడు ఈ భూమికి సంతానమే కాదు.

## పొరుగును చూచి నేర్చుకోండి

ఈ సందర్భంలో, ఇరాన్, టర్కీ, ఇండొనేషియాల్లోని తమ తోటి మతస్థులను చూచి ఇచటి ముస్లిం మిత్రులు నేర్చుకోవటం ఎంతో ఉపయోగం. పర్షియా ముస్లిం దేశంగా మారినా, అచటి ప్రజలు మాత్రం, తమ భాషా లిపిని మార్చుకొని అరబ్బీ లిపిని అనుసరించలేదు. అరబ్బీ జీవన విధానాన్ని స్వీకరించలేదు. తమ జీవన విధానానికే కట్టుబడి ఉన్నారు. వారు తమ పూర్వజులలో మహాపురుషులను విస్మరించలేదు. నేడు కూడా ఒక పర్షియా పౌరుడు తన జాతికి చెందిన పూర్వజులను స్మరిస్తుంటాడు. రుస్తుంపట్ల అతడు ఎనలేని శ్రద్ధతోనూ, సగౌరవంగానూ మాట్లాడుతాడు. మరి రుస్తుం ముస్లిం మతస్థుడు కాడు నవీన టర్కీ నిర్మాతయైన కెమాల్ పాషా, తరతరాల జాతీయ జీవన విధానాన్ని పునరుద్ధరించి ఇస్లాము యొక్క ప్రభావాన్ని, పాత్రనూ వ్యక్తిగత దైవారాధనకు మాత్రమే పరిమితం చేశాడు. ఇక ఇండోనేషియా యొక్క ఉదాహరణ చాలా చక్కని కనువిప్పు కలిగిస్తుంది. ఇండొనేషియాలో అత్యధిక ప్రజలు ఇస్లామును పాటిస్తారు. అయినా వాణీ వినాయకులే, వారి విద్యావిజ్ఞానాలకు అధిదేవతలు. బాలురు తమ అక్షరాభ్యాసాన్ని బొమ్మల రామాయణంతో ఆరంభిస్తారు. అక్కడకు వెళ్ళినప్పుడు ఇది చూచిన మన దేశస్థుడొకరు ఆశ్చర్యపడ్డాడు. "మీరు ముస్లములే అయినా మీ పిల్లలకు రామాయణం నేర్పుతారు. ఇదేమి"టని ఆతడొక ప్రముఖ ఇండొనేషియాపౌరుని ప్రశ్నించాడు. "శ్రీరామచంద్రుడు మాకు ఉత్తమోత్తముడైన జాతీయ నాయకుడు. అందుకనే మా పిల్లలు

అతని ఆదర్శ జీవితాన్ని అలవరుచుకోవాలని మేము ఎంతో కోరుకుంటాం. మేము ఇస్లాము మతవిశ్వాసాలకు చెందినవారమే; దానిలో సందేహం లేదు. అంత మాత్రంచేత మేము మా యొక్క ఉత్కృష్టమైన జాతీయ వారసత్వాన్ని, జీవన మూల్యాలను విడిచిపెట్టనక్కరలేదుగదా" అన్నాడు. ఇచటి మన ముస్లిము మిత్రులకు ఎంత చక్కని కనువిప్పిది! అచట పేర్లు గూడా నూటికి నూరుపాళ్లు హైందవంగా ఉంటాయి. వారి యొక్క మాజీ అధ్యక్షుడు సుకర్ణ. అతని కొడుకు కార్తికేయ. నేటి అధ్యక్షుడుసుహ్యాత్. (ఆంగ్లభాషలో దానిని వక్రీకరించి 'సుహార్తో' అంటున్నారు) అంటే అర్థం 'స్నేహితుడు' అని. అక్కడ స్త్రీలు కూడా సీతా, సావిత్రీ, ద్రౌపదీ, దమయంతీ వంటి పేర్లు సగర్వంగా పెట్టుకుంటారు. విష్ణుమూర్తికివాహనమైన గరుడుని పేరు వారి విమానయాన వ్యవస్థకు పెట్టుకున్నారు. వారి రాజ్యాంగం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న వాక్యప్రకటనతో ప్రారంభమవుతుంది.

ఇదియే, వాస్తవమూ, యోగ్యమూనైన జాతీయ సమగ్రతకూ, సామరస్యానికీ, సమైక్యతకూ కూడ పునాదిరాయి కాగలదు. వ్యక్తిగతమైన మత విశ్వాసాలకు అతీతమైన జాతీయ సామరస్యానికీ, ఏకాత్మతకీ ఇదే ఆధారం. మన దేశానికి అన్వయించినంతవరకూ ఈ సిద్ధాంతాన్నే మనం, తర్కబద్ధమూ, ఆచరణయోగ్యమూ, సవ్యమూనైన హిందు రాష్ట్ర భావనగా చెప్పుకుంటాం.

## సెమెటిక్ జాతులవారితో పోలికేలేదు

అల్పసంఖ్యాకులనబడే వారిపట్ల హిందు రాష్ట్రం యొక్క దృష్టి మిక్కిలి ఉదారమూ, హేతుబద్ధమూ, న్యాయసమ్మతమూనై ఉన్నప్పటికీ, కొందరు హిందు రాష్ట్రం తన కాళ్ళపై తాను నిలదొక్కుకుంటే అందులో

అల్పసంఖ్యాకులు పూర్తిగా నశించిపోతామనే బెంగతో జీవించవలసివస్తుం దనే భయపడటం చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. వారికా భయం నిజమే అయితే, సెమెటిక్ మతాలు ఇతర మతవర్గాల ఎడల ఎట్లా వ్యవహరిస్తాయో అలాగే హిందురాష్ట్రం కూడా వ్యవహరిస్తుందనే భ్రమ చేతనే వారికి ఆ భయం ఏర్పడి ఉండవచ్చు. మొదటి సెమెటిక్ మతం యూదు మతం. అది అసహనంతో కూడిన ఒక విశ్వాసం. ఈ అసహనంతోనే క్రీస్తును శిలువ ఎక్కించి మేకులు దిగగొట్టారు. తర్వాత వచ్చిన క్రైస్తవ మతం దాని బిడ్డే. అది కూడా అంతటి అసహనం కలిగినదే. క్రీస్తు ఒక ఉత్తముడైన సాధుమూర్తి. అందులో సందేహం లేదు. కానీ తర్వాతి కాలంలో క్రీస్తు పేరున కొనసాగిందానికీ, క్రీస్తుకూ ఏమీ సంబంధం లేదు. అది క్రైస్తవ మతం గాదు. కేవలం 'చర్చిమతం' మాత్రమే. "అసలైన సిసలైన క్రైస్తవుడు ఒకడే ఉండేవాడు. అతడు శిలువపైన బలైపోయాడు" అనే లోకోక్తిలోని ప్రతి అక్షరమూ యదార్థమే. యూదులనబడేవారికి 'క్రీస్తు శిలువకొయ్యలు' అని పేరుపెట్టి వారిపై క్రైస్తవులు అనేక అత్యాచారాలు చేసారు. హిట్లరును గురించి మాత్రమే మనం ప్రత్యేకంగా చెప్పుకోనక్కరలేదు. కానీ రెండువేలసంవత్సరాలపాటు క్రైస్తవులు యూదుల పట్ల జరిపిన దమనకాండకు ఆతడు పరాకాష్ఠ మాత్రమే. ఆపైన ఇస్లాం మతం వచ్చింది. లక్షలాది అమాయక మానవుల కన్నీటితో, రక్తంతో వ్రాయబడిన చరిత్ర గల ఖడ్గమూ, ఖొరానుల భయంకర కథే అది. దాని యొక్క చరమాధ్యాయంగా "ఇస్లామిక్ రాజ్యం" అని తనంత తానుగా ప్రకటించుకున్న పాకీస్తాన్ తన పశ్చిమ భాగం నుండి హిందువుల నందరినీ ఊచకోత కోసి తరిమివేయటంలో, అంతకన్న భిన్నంగా ప్రవర్తించలేదు. అలాగే తూర్పుభాగం (ఈనాటి బంగ్లాదేశ్)లో గూడా కొనసాగుతూ ఉంది. ఇతర మతాల పట్ల అసహనమనే దానిని అవి తమ రక్తంలో రంగరించుకుని పుట్టాయి. మతమౌఢ్యానికీ, పరపీడనకూ అపఖ్యాతిపాలైన సెమెటిక్ రాజ్యాల భావన వంటిదే మన హిందు రాష్ట్ర

భావన అనే, సెమెటిక్ కొలబద్దతో చూచినందుననే, హిందురాష్ట్రములో ఇతర మతవర్గాల యొక్క అస్తిత్వానికి ప్రమాదం కలుగుతుందనే భయం కలుగుతోంది.

## ఆచరణలో హిందురాష్ట్రం

నిజంగానే భ్రమ పడినవారికి, ఆ భ్రమ తొలగించటానికి గాను, మనం హిందు రాష్ట్రంయొక్క చారిత్రక పరంపరనూ, విదేశీ మతవర్గాల పట్ల దాని దృష్టినీ, మరల నొకసారి ఇప్పుడు జ్ఞప్తికి తీసికొని వద్దాం. మన జాతీయ జీవనంలోని ఏ రంగంలోనూ, మతం కారణంగా మనం ఏ ఒక్కని పట్ల విచక్షణను చూపలేదు. ఇది శిలాక్షరాలతో మన చరిత్ర చెప్పే సాక్ష్యం; విదేశీ చరిత్రకారులు, యాత్రికులచేత గూడా ధృవీకరింప బడినదిది.

మన హిందూ సామ్రాజ్యాలలో– అంటే అత్యంత బలిష్ఠమైన విజయనగర సామ్రాజ్యంలోనూ, శిఖువీరుల నాయకత్వంలోని పంజాబు లోనూ ముస్లిములు యదార్థమైన స్వేచ్ఛా సమానత్వాలను అనుభవించారు. మహావీరుడైన ఛత్రపతి నేతృత్వంలో వికసించిన నిన్నమొన్నటి హైందవ ప్రభుత్వంలో కూడా మతం ఆధారంగా ముస్లిముల ఎడ వ్యతిరేకతా, విచక్షణలను చూపలేదు.

కొన్ని ఉదాహరణలు చెప్పాలంటే,– ఛత్రపతి శివాజీ యొక్క నౌకాదళాధిపతి దర్యా సారంగ్ ముస్లిం. అలాగే శివాజీ యొక్క ఇద్దరు ప్రముఖ సేనానాయకులు ఇబ్రహీంఖాన్, దౌలత్‌ఖానులు ముస్లిములు. అఫ్‌జల్‌ఖాన్‌తో ఎదురైన భయంకర పోరాటంలో శివాజీ ననుసరించిన, విశ్వాసపాత్రులైన పదిమంది అంగరక్షకులలోనూ ముగ్గురు ముస్లిము

లున్నారు- తర్వాత- ఆగ్రానుంచి శివాజీ తప్పించుకురావటమనేది ఒక అత్యద్భుత ఉదంతం. ఆతనితోబాటు ఆగ్రాకువెళ్ళి, ఆనాటకంలో ప్రముఖపాత్ర నిర్వహించిన పద్దెనిమిదేళ్ళ యువకుడు మదారి మెహతర్ ముస్లిముడే. శివాజీ మసీదులకు, దర్గాలకూ, వార్షికాలేర్పరచి, భూదానాలను ఎంతగా చేసాడో లెక్కచెప్పలేం. ప్రతాపగడ్ కోటలో, అఫ్‌జుల్ ఖాన్ సమాధికి, ఇస్లాం సంప్రదాయం ప్రకారం ఆరాధన చేసేందుకు వ్యవస్థను కూడా ఆయన కల్పించాడు. ఆ రోజులకు చెందిన అతి మూఢ ముస్లిం చరిత్రకారులు కూడా, కోరాను మసీదులనూ, దర్గాలనూ, వారి పకీర్లనూ, వారి స్త్రీలనూ, శివాజీ అత్యంత గౌరవంతో చూచినట్లు ప్రశంసిస్తూ వ్రాసారు. ఆ రోజుల్లో సర్వత్రా ముస్లిములు హిందువులపై అత్యాచారాలు జరుపుతుంటే, శివాజీ ఇలా వ్యవహరించాడు.

ఆ తర్వాత గూడా 1761లో పానిపట్టుయుద్ధరంగంలో, స్వరాజ్యం యొక్క మనుగడ కోసం సాగిన అతిక్లిష్టమైన పోరాటంలో హిందువుల పక్షాన ఫిరంగుల దళానికి సేనాధిపతి, ఇబ్రహీం గర్దీ- చివర కాతడు ఆ యుద్ధరంగంలో పోరాడుతూ, పోరాడుతూ నేలకొరిగాడు.

మన హిందుస్థానం ఎనలేని గౌరవాధికారాలు గల ఉజ్వల జీవితాన్ని వేలకొలది సంవత్సరాలనుభవించింది. తన ఆధ్యాత్మిక, సాంస్కృతిక కీర్తికాంతులను, మెక్సికో నుండి జపాన్ వరకూ- భూవలయంలోని అనేక ప్రాంతాలకు ప్రసరింపచేసింది. క్రొత్త దేశాలకు వ్యాపించినప్పుడు ఇస్లాము, క్రైస్తవ మతములవలే మనం ప్రవర్తించలేదు. ఆయా జాతుల కన్నీటి కాలువల్లోగానీ, నెత్తుటి ఏరుల్లోగానీ మనం మన ధర్మధ్వజాన్నెగురవేయలేదు. హిందుజాతి విజయమెల్లప్పుడూ నైతికంగా, సాంస్కృతికంగానే కొనసాగింది. ఆ విజయాన్ని స్థానిక ప్రజానీకం ఆనందంగా స్వాగతించింది. వారిలో తిరుగుబాటు ధోరణిని గాక, కృతజ్ఞతా భావనను

రేకెత్తించింది. అది నిస్వార్థం యొక్క గెలుపు. శీలం యొక్క, ఉదారత యొక్క గెలుపు. అందుకే ఆ జాతులవారు మన విజయాన్ని ఆనందంతో స్వాగతించారు. అందుకే మన భూమిపట్ల వారి యొక్క గౌరవ భావన ఏ మాత్రం తగ్గలేదు. ఈ రోజుకు కూడా హిందూస్థానపు 'పవిత్రభూమి'కి రావాలనీ, గంగానదిలో ఒక సారైనా మునగాలనీ ఆయా దేశాలలోని ఎందరో పవిత్ర జీవుల అంతరాంతరాల ఆకాంక్ష. వారి దృష్టిలో, ఈ దేశానికి రావటమనేది, కేవలం ఒక 'సందర్శన' మాత్రమే కాదు- అది వారి కెల్లప్పుడూ ఒక 'తీర్థయాత్రే'. వీటన్నిటిని బట్టే ఈ జాతియొక్క, మౌలిక తత్వాన్నీ, అది రూపొందించిన ఉత్కృష్టమైన, సాటిలేని, జీవన మూల్యాలనూ, తేలికగా ప్రతి ఒక్కడూ అర్థం చేసుకోవచ్చు.

## అల్పసంఖ్యాకులకు నిజమయిన హామీ

అందుచేత ఇచటనివసిస్తున్న అల్పసంఖ్యాకులనబడేవారు కోల్పోయే దేమీ లేదు. పైగా, హిందురాష్ట్రం యొక్క పునరుజ్జీవనంద్వారా వారి కన్నివిధాలా లాభమే. మానవజాతి మొత్తంలో ఒకే పరమేశ్వర శక్తి వ్యాపించి ఉందని గుర్తించేదీ, అన్ని రకాల ఆరాధనా విధానాలూ, విశ్వాసాలూ, అభివృద్ధి చెంది తమదైన పరిపూర్ణ వికాసాన్ని సాధించుకునేట్లుగా ప్రోత్సహించేదీ, గౌరవించేదీ, సంరక్షించేదీ ఈ విశాల విశ్వంలో హిందూ భావన ఒక్కటే. ఈ మాతృభూమి సంతానం ఏ రకంగానైతే స్వాభిమానంతో, స్వేచ్ఛగా జీవిస్తున్నదో అలాగే అల్పసంఖ్యాకవర్గాలు కూడా జీవించగలగాలి. అందుకు శక్తిమంతమూ, పునరుజ్జీవితమూనైన హిందు రాష్ట్రం మాత్రమే హామీ కాగలదు.

# 4. హిందూరాష్ట్ర వైశిష్ట్యం

## 2. హిందూ రాష్ట్రము – లౌకికతత్వము

హిందు రాష్ట్ర భావన, లౌకికతత్వానికి వ్యతిరేకమైనదంటూ, పదే పదే ఒక అసత్య ప్రచారం, ఒక అభాండం వల్లెవేస్తున్నారు. ఆ మాట వింటే రోత పుడుతోంది. దీనిలో మొదటి విషయమేమిటంటే, – పాశ్చాత్య దేశాలలో పుట్టిన లౌకికతత్వ భావనకూ, మన దేశానికీ సంబంధం లేనే లేదు. అది మనకు సంబంధించినది కానే కాదు. శతాబ్దాల పూర్వం ఐరోపాలోని రాజులు, మతగురువులైన పోపుల నెదిరించి, తమ రాజ్యాల పైన, అతని మతపరమైన నిరంకుశాధికారాన్ని కూలద్రోసి స్వంత పరిపాలనను ప్రతిష్ఠించుకున్నారు. ఆ విధంగా మతతత్వ రాజ్యానికి వ్యతిరేకంగా లౌకిక రాజ్యమనే భావన ఆరంభమయింది. ఈనాడు మతతత్వ రాజ్యమంటే ఇతర విశ్వాసములన్నిటిపట్లా అసహ్యభావం కల్గిన ఒక మత రాజ్యమనే అర్థంచెప్పబడుతోంది. పూర్వకాలంలోగాని, ఆధునికయుగంలో కానీ మన దేశంలో అటువంటి సంఘర్షణకూ, అసహనానికీ ఏ విధమైన అవకాశం లేదు.

పైగా, మన దేశపు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు చెప్పినట్లుగా మన రాజ్యాంగంలో 'లౌకికము' అనే మాట ఎక్కడా అగుపడదు. అటువంటప్పుడు ఆ మాటను రాజ్యాంగంలో క్రొత్తగా ఇరికిస్తే ప్రక్షిప్తం క్రిందే లెక్క (ఆ పని అత్యవసర పరిస్థితి సమయంలో జరిగింది). రాజ్యాంగంపైన, అందులో లేనిదానిని ఆరోపించటమే.

## గందరగోళం నుంచి బయటపడాలి

లౌకికతత్వమును, జాతీయతనూ ఒకటిగా భావించే భ్రమ ఒకటున్నది. ఈ రెండూ ఎన్నడూ ఒకటి కాజాలవు. 'జాతి' అనేది సమగ్రమూ, సజీవమూనైన విషయం. దాని కనేక విధులు ఎప్పుడూ ఉంటుంటాయి. దానిలో రాజ్యవ్యవస్థ ఒకటి. "లౌకికతత్వ"మనేది రాజ్య వ్యవస్థ లక్షణాలలో ఒకటి మాత్రమే. ఆ విధంగా, అటువంటి లౌకిక తత్వమూ, జాతీయతను ఒకటే అనటం, శరీరంలోని ఒక అవయవం చేసే పనిని, యావత్తు శరీరంతో సమానమనటం వంటిదే అవుతుంది. అంతే గాదు 'జాతి'కి 'రాజ్యా'నికీ నడుమనున్న మౌలికమైన వ్యత్యాసం బొత్తిగా తెలియదని ప్రకటించుకోవటమే అవుతుంది.

ఇంతేగాదు, లౌకికతత్వమంటే, కేవలం జీవితంలోని భౌతిక విషయాలు మాత్రమే అయితే— అప్పుడప్పుడు చెప్పబడుతున్నట్లుగా, అది— ఆత్మయొక్క మహోన్నతమూ, ఉదాత్తమూనైన గుణాలకు సంబంధం లేని, వేరేదో విశేషమైనదే అయితే, అట్టి దాని వంక కన్నెత్తైనా మనం చూడం. దాని ఊసే మనకొద్దు. 'లౌకికం' అంటే మతవ్యతిరేకత కాకూడదు. ప్రతి మత సంప్రదాయం వికసించేందుకు, అనుకూలత, అవకాశం అందులో ఉండాలి. అంతేగాదు, అలాగే ఒక మతం వేరొక

మతంపై విరుచుకుపడకుండా కూడా అదుపు చేయాలి గూడా. ఇదే అలౌకికత అయితే, అప్పుడది నిస్సందేహంగా హిందు రాష్ట్ర భావనతో, శృతి కలుపుతుంది. సందేహం లేదు. అప్పుడటువంటి రాజ్యాన్ని వర్ణించటానికి బహుమతయుక్త రాజ్యం అన్న మాటే తగినదిగానీ, 'లౌకికం' అన్న పదం పనికిరాదు. ఈ దేశంలో రాజ్యం ఎన్నడూ ఒకే ఒక మత విశ్వాసంతో అంటిపెట్టుకొని లేదు. హైందవేతర విశ్వాసాల మనుజులను, రెండవ రకం పౌరులుగా, వెనుకకు నెట్టివేయటంగానీ, జిజియా వంటి పన్నులు, వారిపై విధించటంగానీ, మనకు తెలియదు. న్యాయం దృష్టిలో అందరూ పూర్తిగా సమానులే. ఎన్నడూ రాజు తన వ్యక్తిగత మత విశ్వాసాలను ప్రజలపై రుద్దడం కోసం రాజ్యాంగ వ్యవస్థను ఇచట భ్రష్టం చేయలేదు.

## నవ్యమయిన భావం

'ఒక మతం ఇంకొక మతవ్యవహారాలలో జోక్యం చేసుకోరాదు'— అనే కేవల వ్యతిరేకాత్మకమైన భావన దగ్గరే హిందూత్వం ఆగిపోలేదు, హిందూరాజుల హృదయాలలో అణువణువునా సహజంగా విశాలమూ, సర్వ సమగ్రమూనైన జీవనదృష్టి వికసించింది. వారు తదనుయాయులు చాలా కొద్ది మందే ఉన్నప్పటికీ, ప్రతి మతభావననూ గౌరవించేవారు దాని యొక్క సహజమైన చైతన్యానికి తగినట్లు పెరిగేందుకు ప్రోత్సాహం ఇచ్చేవారు. రాజు అంటే అన్ని మతవిశ్వాసాలకూ సంప్రదాయాలకూ ఆధార స్తంభం. ఏ మతానికీ అతడు విరోధి కాడు. ఈ లక్షణాన్నే లౌకికతత్వం అంటే అనుకోవచ్చును. వాస్తవానికి 'రాజ్యం' అంటే ఎప్పుడూ, మన భావన 'లౌకిక'మనే. లౌకికమనే విశేషణాన్ని చేర్చి రాజ్యం యొక్క లౌకిక తత్వమును ప్రత్యేకంగా వివరించి చెప్పటం మనదేశంలో కేవలం పునరుక్తే అవుతుంది.

ఈ రోజున గూడా, ఈ జాతీయ సంప్రదాయానుసారమే, ఇచట ఒక ముస్లిము అత్యున్నతమైన అధ్యక్ష స్థానాన్ని అలంకరించగలడు; అధిష్ఠించాడు కూడా. సర్వోచ్చ న్యాయస్థానంలో ప్రధాన న్యాయమూర్తి కాగలిగాడు. అలాగే కేంద్ర ప్రభుత్వ మంత్రివర్గంలో ప్రముఖ పదవులనూ, దేశీయ విదేశీయ శాఖలలో పదవులను వారు పొందగలుగుతున్నారు. సరిహద్దునఉన్న మతరాజ్యమైన పాకిస్తాన్‌తో పోల్చిచూచినపుడు నిజాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. వేరుగా చెప్పనేల?

కానీ దురదృష్టవశాత్తూ- ఆచరణలో భారతదేశంలో, లౌకిక తత్వము అంటే: హిందూవ్యతిరేకత అని అధినేతలు భావిస్తున్నారు. ఒక మసీదు ప్రారంభోత్సవానికి కీ॥ శే॥ డాక్టర్ జకీర్ హుస్సేన్ కేరళ వెడితే, ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. కానీ, రాష్ట్రపతిగా ఎన్నికయిన తర్వాత డాక్టర్ గిరి తిరుపతి వెడితే, అది మతతత్వంగా విమర్శించారు. ఇందుకు ప్రపంచం మనని చూచి ఫక్కున నవ్వుకుంది.

# 15. మౌలికసత్యాలను ధృవీకరించండి

## (1962లో జాతీయ సమైక్యతా సమితికి సమర్పించినది)

### స్వచ్ఛమయిన జాతీయజీవనం

1. భారత జాతీయ జీవనం అత్యంత ప్రాచీనమైనది. మన కొక సమగ్రమైన జీవనతత్వం ఉన్నది. దాని నుండి, సమానాదర్శాలు గల ఒక సాంస్కృతిక వారసత్వం ఉద్భవించింది. మన సమాజ జీవనం దానిని పెనవేసుకునే విలసిల్లింది. ముస్లిము, క్రైస్తవ దురాక్రమణదారులు ఈ భూమి మీద అడుగుపెట్టడానికి ఎంతో ముందు నుంచీ, యుగయుగాలుగా మనకు ఒక సజీవ సంప్రదాయం ఉన్నది. కులాలుగానీ, పంథలుగానీ, సంప్రదాయాలుగానీ, చివరకు రాజకీయ వ్యత్యాసాలు విభేదాలుగానీ, మనలో అంతర్లీనంగా ఉన్న ఈ సమైక్యతా సూత్రాన్ని మాత్రం ఎన్నడూ భగ్నం చేయలేకపోయాయి. ఇట్టి సమైక్య జీవనం గల మానవ సమూహం "హిందూ" అన్న పదం ద్వారా ప్రసిద్ధిపొందింది. అందుకనే భారతదేశం లోని జాతీయజీవనమంటే హిందూ జాతీయజీవనమేనని అర్థం.

## 'సమైక్యత' అంటే ఏమిటి ?

2. సరైన ఈ అవగాహన ఆధారంగానే జాతీయ సమైక్యత గురించి మనం చర్చించాలి. అసలు, 'సమైక్యత' అంటే వాస్తవమైన ప్రధాన జాతీయ జీవన ప్రవాహంతో, దాని పరంపరతో, ఆశయాకాంక్ష లతో తాదాత్మ్యం చెందేట్లు ప్రయత్నించటమే.

## 'జాతీయత' 'మతదురహంకారం' 'జాతి వ్యతిరేకత

3. ఈ జాతీయ మౌలిక తత్వాన్ని పోషించేందుకూ, బలపరి చేందుకు, సహకరించే కార్యాలన్నీ 'జాతీయము'లే. ఈ జాతీయ మౌలిక తత్వానికి, సంబంధించినవారం కామనుకుంటూ, జాతీయ వ్యతిరేకమైన కలలు కంటూ, తమకు ప్రత్యేకమైన హక్కులూ, సదుపాయాలూకావాలని ఒత్తిడి చేసే ముఠాలను,— వాళ్ళనే 'మత దురహంకారులు' అనాలి.

తమ ప్రత్యేక హక్కులూ మొదలైన వాటిని సాధించుకునే యత్నంలో మతం మార్పో, ఆరాధనా కేంద్రాలను ధ్వంసం చేసో, అప విత్రం చేసో, లేదా, ఈ దేశంలో పుట్టిన మహాపురుషుల స్మృతిని అవమాన పరచో, లేదా ఇతరత్రా ఇలాగే ప్రవర్తించిన జనసమూహాలను 'జాతి వ్యతిరేకములు' అని పరిగణించవలసి ఉంటుంది.

4. భారతదేశంలో హిందువులనెన్నడూ 'మతదురహంకారు'లన రాదు. అతనికి భారతదేశం పట్ల భక్తిప్రపత్తులెప్పుడూ ఉన్నాయి. అతడు ఈ దేశ అభివృద్ధికై ప్రయత్నించేందుకూ, దాని గౌరవాన్ని నిలబెట్టే టందుకూ, సర్వదా అంకితమై సంసిద్ధంగా ఉన్నాడు. నిజానికి, భారత జాతీయ జీవన మూల్యాలూ హిందువుల జీవితం నుంచే వికసించాయి.

అందుచేత హిందువుడే ఇచటి "జాతీయుడు"; అతడెన్నడూ 'మత దుర హంకారి' కాడు.

## అర్థం పర్థంలేని మాట

5. అధిక సంఖ్యాక జాతి యొక్క 'మతదురహంకారం' అనే పదప్రయోగం పూర్తిగా తప్పు. అదంతా ఒక తప్పుడు ఊహ. ప్రజా స్వామ్యంలో ప్రజల దైనందిన జీవితంలో అధిక సంఖ్యాకుల అభిప్రాయం వైపే మొగ్గు ఉండాలి. కాబట్టి అధిక సంఖ్యాకుల యొక్క ప్రత్యక్ష జీవన వ్యవహారమే ఇచటి జాతీయ జీవనం. ఈ దృష్ట్యా చూచినప్పటికీ గూడ హిందూ జీవన సమున్నతికై చేసే ప్రయత్నాలన్నీ జాతీయాలేగాని, మత దురహంకారపూరితాలు కావు. "అధిక సంఖ్యాకుల మతదురహంకారం" అనే పదప్రయోగం ప్రజాస్వామ్యసిద్ధాంతానికే వ్యతిరేకం. విదేశీయులు పాలించేటప్పుడు, మన సమాజాన్నంతనూ బానిసలనీ, వేరు వేరు కులాలు, తెగలుగా విడివడి ఉన్నారనీ ఎంచేవారు. కాబట్టి వారు "అధిక సంఖ్యాక, అల్పసంఖ్యాక మత దురహంకారం" వంటి పదజాలం ప్రయోగించారు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, పరిపాలన అధిక సంఖ్యాకులదే కాబట్టి 'అధిక సంఖ్యాకుల మతదురహంకారం' అనటం, తర్కానికీ, సత్యానికీ, న్యాయానికీ గూడ వ్యతిరేకం.

## జాగరూకతయే కర్తవ్యం

6. హిందువు ఎల్లప్పుడూ ఇతర మతవిశ్వాసములన్నిటిపట్లా సముచిత గౌరవాన్ని చూపుతూనేఉన్నాడు. ఆరాధనాపద్ధతులలోని వైవిధ్యమూ, జాతీయ సమైక్యతా, పొసగవని అతడు భావించటం లేదు. మతం పట్ల అధిక శ్రద్ధను చూపుతున్నామనే వంక పెట్టుకొని, భౌతిక జీవితంలో

వేర్పాటు విధానాల నవలంబించే మన స్తత్వాన్నీ, జాతీయ జీవనానికి హాని కలిగించేలా, ప్రత్యేక సదుపాయాల కోసమైన కోర్కెలను గూడా అప్పు డప్పుడు అతడు వ్యతిరేకిస్తుంటాడు. ఎల్లప్పుడూ జాగరూకతను వహించి, అలాగే అటువంటి ధోరణులను గట్టిగా వ్యతిరేకించటం నిజానికి అతని అతి ముఖ్యమైన, సహజ, కర్తవ్యంకూడా.

## బుజ్జగింపు ధోరణి ప్రమాదకరం

7. అట్టి ధోరణులను సమర్థించటం, జాతి వ్యతిరేకమైన వారి వాంఛలను తీరుస్తూ, అట్టివర్గాలను సంతుష్టిపరచే విధానాన్నవలంబించటం, తాత్కాలికావసరాల కోసం వారితో బేరసారాలు కుదుర్చుకోవటం, తుదకు వారిని సంతుష్టిపరచే దృష్టితో జాతీయ గౌరవ ప్రతిష్ఠలకూ, జాతీయ ప్రయోజనాలకూ, విశ్వాసాలకూ, హాని కలిగించుటవంటివి జాతీయ జీవ నానికి విరుద్ధ చర్యలు.

8. ఇటువంటి జాతి వ్యతిరేక, వికృత ధోరణులను వ్యతిరేకిస్తూ, కార్యోన్ముఖంగా కొనసాగేఆలోచనలను 'హిందూమత దురహంకారతత్వం' అనటం ఘోరమైన తప్పిదం. అది సత్యాన్ని తారుమారు చేయటమే; వక్ర బుద్ధికి అదొక నిదర్శనం. అట్టి వికృత భావాలను వ్యతిరేకించటం జాతీయ చైతన్యం గల ప్రతి పౌరునికీ నిజమైన కర్తవ్యం.

## సామూహిక దురహకారం : ఏడురకాలు

9. సామూహిక దురహంకారం, విద్వేషం అనేక రూపాల్లో కని పిస్తుంటాయి. భారతజాతి యొక్క సహజతత్వం తమ జీవితంలో కాన వస్తూండే, హిందువులకు వ్యతిరేకంగా గుంపు కడుతున్న హైందవేతర వర్గాలు ఒక రకంగా మతదురంకారులవుతారు. అసలు హిందు సమాజం

లోనే మతదురంహకారులు కొందరున్నారు. వారందరూ ముందుగా బహుముఖమైన హైందవ మేధయొక్క విభిన్న రూపాలైన సంప్రదాయాలకు చెందినవారే. తరువాత కాలంలో తమకు స్ఫూర్తినీ, జన్మనూ ఇచ్చిన హిందుత్వాన్ని మరచిపోయి, హిందూ సమాజమూ, ధర్మముల కంటే తామంతా వేరనుకుంటూ, తమకు మాత్రమే విడిగా రాజకీయ ఆర్థిక సదుపాయాలను కోరుకుంటూ, హిందూ సమాజంకన్న తమను వేరైనట్లుగా చెప్పుకొని వివిధ ఆందోళనలకు పాల్పడేవారు ఈ కోవకే చెందుతారు. నవ బౌద్ధులూ, శిఖులూ ఈ వర్గం క్రిందనే చేరుతారు. జాతులు వేరువేరని పొరబాటుగా ఊహించుకుంటూ, విడిపోవాలని కోరుతూ, దాని కోసం, మిగిలిన సమాజం పట్ల విద్వేషాన్నీ, శత్రుత్వాన్నీ, హింసనూ వ్యాపింపచేసేటువంటి ద్రవిడ కజగం, ద్రవిడ మున్నేట్ర కజగం వంటి వర్గాలు మూడవ రకం మతదురహంకారులు. 'స్పృశ్యత', 'అస్పృశ్యత'లనీ, 'బ్రాహ్మణులు', 'బ్రాహ్మణేతరులనీ', వివాదాలను రేపి, విద్వేషాన్నీ, శత్రుత్వాన్నీ స్వార్థాన్నీ రెచ్చగొట్టి, తమకు ప్రత్యేక సదుపాయాలు కోరేవారు నాలుగవ రకం మతదురహంకారులు. మాతృభాషలు వేరైనంతమాత్రాన, తమ కిరుగు పొరుగున ఉండే వారి పట్ల, విముఖతా, విరోధాలనూ,విద్వేషాలనూ వ్యాపింపచేస్తుండే భాషాదురహంకారులు కొందరున్నారు. వీరంతా అయిదవ రకం సామూహిక దురహంకారుల క్రిందకు చేరుతారు. ఇట్టి ధోరణుల నుండే "అల్పసంఖ్యాక భాషావర్గములు" అనే వాదం పుట్టింది. సంకుచితమైన ప్రాంతీయాభిమానాలు కలిగి, ఇతర ప్రాంతాలకు చెందిన ప్రజలపట్ల అనుచిత ధోరణు లవలంబించేటువంటి ఆరవ రకమైన సామూహిక దురహంకార మొకటున్నది. దక్షిణాదివారు, ఉత్తరాదివారూ, పంజాబీలు పంజాబీలు కానివారు, మరాఠీలు-కన్నడిగులు, గుజరాతీలూ,- మరాఠీలు, బెంగాలీలూ, బీహారీలు, ఒడియాలు- అన్న పేర్లనడుమ చెలరేగే విభేదాలు ఈ కోవకే చెందుతాయి. కులమూ, తెగ, భాషాపరమైన తేడాలను రెచ్చగొట్టి ఎన్నికల ప్రయోజనం కోసం, పరస్పర విద్వేషాలను వ్యాప్తి చేసే

ఏడవ రకం సామూహిక దురహంకారమొకటున్నది. ఇది అన్నిటి కంటే ప్రమాదకరంగా దేశమంతటా వ్యాపించి వుంది. అధికారంలో ఉన్న పక్షంతోసహా, అనేక రాజకీయపక్షాలు ఈ పాపంలో పాలు పంచుకుంటున్నాయి. ఇట్టి రాజకీయపరమైన దురహంకారం కొనసాగుతున్నంతకాలం ఇతరములైన ఏ మతదురహంకార ధోరణులనూ, నిర్మూలించటం సాధ్యం కాదు. దీనిని వదిలించుకుంటే ఆపైన మిగిలినవాటిని పరిష్కరించుకోవటం మనకు ఏమంత కష్టమనిపించదు. (చాలా ప్రముఖంగా కనిపించే రకాలు మాత్రమే ఇచట సూచించబడ్డాయి. చిన్నచిన్నవి ఇంకా ఉండే ఉంటాయి.)

## ఘర్షణకు ప్రారంభం

10. పైదాన్నిబట్టి చూచినపుడు, కొన్ని రకాలైన సామూహిక దురహంకారాలు, మత విశ్వాసాల కారణంగా పుడతాయనీ, ఇతరాలు, కేవలం, మతసంబంధం లేని స్వార్థప్రయోజనంపై మాత్రమే ఆధారపడి వృద్ధిచెందుతూ ఉంటాయనీ ప్రత్యక్షంగా తెలుస్తోంది. సామూహిక దురహంకారం, లౌకికవాదం- అనబడేదానికి, పూర్తిగా విరుద్ధ తత్వమని చెప్పటం నిజం కాదు. నిజానికి, కేవలం మతవిశ్వాసాలు విభేదించినంత మాత్రంచేత, ధార్మిక రంగంలో సామాన్యంగా, ఏ విధమైన సంఘర్షణా ఉండదు. తమ లౌకిక లాభాలను మూట కట్టుకోవాలనే పోటీ వల్లనే సంఘర్షణలు సంభవిస్తుంటాయి.

## 'ధర్మము' సువిశాలమయినది

11. చరిత్రను గమనించినా, తార్కికంగా పరిశీలించినా, ధార్మిక భావనలు సంకుచితములనిగానీ, ఆర్థిక ప్రయోజనాలు మరింత సమగ్రములనిగానీ అనిపించదు. క్రైస్తవ మతం వ్యాపించిన దేశాలలో, అమెరికా, యూరపు వంటి భూఖండాలలో సంకుచితమైన ఆర్థిక ప్రయోజనాలు కార

ఙంగా నిర్మించబడిన అనేక జాతి-రాజ్యాలు' ఉన్నాయి. ముస్లిం మతం వ్యాపించిన, సువిశాల భూభాగంలో, సంకుచిత ఆర్థిక జాతీయ ప్రయోజనాలపై ఆధారపడిన అనేక రాజ్యాలున్నాయి. సువిశాల సనాతన ధర్మ పరిధిలో (వైదికమూ, వైదికేతరమూనైన శాఖల క్రింద ఈ దేశంలో ఏర్పడిన మతవిశ్వాసాలతోసహా) ఆర్థిక కారణాలు ఆధారంగా, భారత్, నేపాల్ వంటి రాజ్యాలున్నాయి. కాబట్టి ధర్మసాధన, విశాల భూమికను కల్పిస్తుందనీ, ఆర్థిక ప్రయోజనాలు, పరస్పర సంబంధాలను సంకుచితం చేసివేస్తాయనీ నిరూపితమౌతోంది.

## వెఱ్ఱివ్యామోహం విడనాడాలి

12. 'ధర్మము' అంటే, సార్వకాలికమూ, సార్వజనీనమూనైన వ్యవస్థ నందించేటువంటి శాశ్వత జీవనసూత్రం. పైనిచ్చినఉదాహరణలను బట్టి 'ధర్మము' పరిధిలో, నిహిత స్వార్థంతో కూడిన, ఆర్థిక ప్రయోజనాలపై ఆధారపడిన ప్రత్యేక ఆరాధనా పద్ధతులు కూడా ఉండవచ్చుని స్పష్టంగా తెలుస్తోంది. చిన్నచిన్న పంథలపట్ల, విశ్వాసాలు, అవాంతర విశ్వాసాలపట్లా వెఱ్ఱి వ్యామోహాలు, పాక్షిక భావనలను సృష్టిస్తాయి. అవి ఆర్థిక, భౌతిక ప్రయోజనాల నడుమ, సామరస్యం, సమానత్వాలనుసాధించే మార్గంలో, ప్రాదేశిక విరోధాలనూ, ఘర్షణలనూ వ్యాప్తిచేస్తాయి. కాబట్టి అట్లాంటి వెఱ్ఱి వ్యామోహం ఉండరాదు.

13. ధర్మము, సమాజము, జాతి వంటివాటిని విడిచి ఎవరైనా, ఆర్థిక ప్రయోజనాలాధారంగానే, సమైక్యతను సాధించదలిస్తే, అట్టి సమైక్యత, విభిన్న రాజకీయ ప్రయోజనాలు గల మానవజాతి నంతనూ, దానిలోని అవాంతర తరగతులనన్నిటినీ కలుపుకుంటూ, ప్రపంచస్థాయిలో మాత్రమే సాధించబడగలదుగానీ, ఒకానొక ప్రత్యేక భూభాగంలో సాధించ

నలవిగాదు. అటువంటప్పుడు 'జాతీయ సమైక్యత' అన్న దానికి అర్థం, ప్రయోజనం కూడా ఉండవు.

## ఆశించిన దేమిటి ?

14. జాతీయ జీవనంలో సమైక్యత సాధించేందుకుగాను,విభిన్నము లైన ఆలోచనా పద్ధతులు వినాశమవటం మనం కోరం. వేర్పాటు మన స్తత్వం, అసహనాల వంటి అవాంఛనీయ ధోరణులకు స్వస్తి పలకటమే మన మాశించేది. భాషలను నాశనం చేయాలనిగాక, భాషామౌఢ్యం కార ణంగా, దేశంలో వేర్పాటు ధోరణులుండరాదనేదే మనం ఆశించేది.

# సాధన సంపత్తి

## ప్రగాఢభక్తి జాగృతం చేయాలి

1. కుల, మత, విశ్వాసాల ప్రసక్తి లేకుండా. భారతదేశం 'హిందు రాష్ట్ర'మనే సత్యాన్ని నిస్సంకోచంగా ప్రకటించటమూ, దానిని శక్తిమంతమూ, సమృద్ధమూ, చైతన్యపూర్ణమూ, సార్వభౌమంగానూ చేయటం, ఇచటి ప్రజలందరి ముఖ్య కర్తవ్యమని ఉద్ఘోషించాలి. ఈ రాష్ట్రం పట్ల ప్రగాఢ భక్తిని ప్రతి ఒక్కరిలోనూ జాగృతం చేయాలి.

2. హైందవేతరుల మతాలను గౌరవిస్తూ, సంరక్షిస్తూనే, వారికి ఈ రాష్ట్రం యొక్క ఆదర్శాల పట్ల, మూల్యములు, వారసత్వం, చరిత్ర, జీవనతత్త్వాల పట్ల ప్రేమను, గౌరవాన్ని, నేర్పేటందుకు తగిన ఏర్పాట్లు

చేయాలి. రాష్ట్రీయాకాంక్షలతో వారి ఆకాంక్షలను తాదాత్మ్యం చేసుకొనే సంస్కారాలను వారిలో అలవరచే ఏర్పాట్లు చేయాలి.

## వేర్పాటు మాటలు తగవు

3. లౌకిక జీవితంలో పౌరులందరూ సమానులే. ఈ సూత్రాన్ని ఖచ్చితంగా పాటించాలి. కుల, మత, విశ్వాసాలను బట్టి, సమూహాలుగా ఏర్పడుతుండే ప్రజలు— ఉద్యోగాలనూ, ఆర్థిక సహాయాలనూ కోరటం లోనూ, విద్యాసంస్థలలో ప్రవేశం కోరడంలోనూ, తదితర రంగాలన్నిటి లోనూ, తమకు మాత్రమే ప్రత్యేక హక్కులనూ, సదుపాయాలనూ కోరే పద్ధతికి మనం పూర్తిగా స్వస్తిచెప్పాలి. 'అల్పసంఖ్యాకులు' ''కులములు'' అంటూ మాట్లాట్టం, ఆలోచించటం పూర్తిగా మానెయ్యాలి.

## దుష్టమయిన భాషావిధానాన్ని సరిచేయాలి

4. నిత్యవ్యవహారం కోసం స్వతంత్ర జాతి తన స్వంత భాషనే ఉపయోగిస్తుంది. అనేకములైన జాతీయ భాషల్లో, దానికున్న సౌలభ్యాన్ని బట్టీ, వీలును బట్టీ హిందీ భాష అనుసంధాన భాషగా అంగీకరించబడింది. హిందీని సులభం చేస్తున్నామంటూ, దానిని ఉర్దూ భాషామయంగా చేసి, అయోమయంగా చేయటం, స్వతంత్ర జాతీయ సార్వభౌమత్వంలో, మత తత్వాన్నీ, మతతత్వవాదుల బుజ్జగింపు ధోరణినీ ప్రవేశపెట్టటమే. మన జాతి యొక్క రాజ్యభాష పట్ల ఇట్టి దృష్టిని కలిగి, దానికి ఒక విదేశీభాషకు తోకలాగా మన దేశాన్ని కట్టేసే ఆంగ్లంతో సమహోదా కల్పించటం మన ఉదాత్త జాతీయ జీవనతత్వపు పునాదులనే దెబ్బతీయటమవుతుంది. జాతిపట్ల ప్రగాఢమైన భక్తిశ్రద్ధలే సమైక్యతకు మూలాధారం. కాబట్టి ఇట్టి తప్పుల తడక భాషావిధానాలను తక్షణమే విడిచి వేయాలి.

## ఏకాత్మక రాజ్యవ్యవస్థ కావాలి

5. మనది ఒకే దేశం, ఒకే సంఘం, ఒకే జాతి. ఒకే విధమైన జీవనమూల్యాలూ, భౌతిక ఆకాంక్షలూ, ప్రయోజనాలూ మనకున్నాయి. అందుచేత సహజంగా, మన జాతీయ వ్యవహారాలన్నీ, ఏకాత్మక స్వభావం కలిగిన ఒకే రాజ్యవ్యవస్థ ద్వారానే నిర్వహింపబడాలి. ప్రస్తుతమున్న సమాఖ్యా స్వరూపవ్యవస్థ వేర్పాటు భావాలను కలిగిస్తుంది; పెంచి పెద్ద చేస్తుంది; ఒక రకంగా చూస్తే ఇది ఏకైక జాతి అన్న భావానికి అది వ్యతిరేకం. కాబట్టి అది విఘటనాత్మకమే; దాన్ని సరిచేయాలి. ఏకాత్మక వ్యవస్థ గల రాజ్యం ఏర్పరచేందుకు రాజ్యాంగాన్ని సరిదిద్దాలి.

## దురాక్రమణపుటలవాట్లను అరికట్టాలి

6. ఆరాధనా కేంద్రాలనూ, విగ్రహాలనూ విధ్వంసం చేయటం, గోహత్యా నిరోధ చట్టాన్ని వ్యతిరేకించటం, పీర్ల సమాధులనూ, దర్గాలనూ మక్బారాలనూ, శిలువలనూ, వ్యక్తిగత స్థలాల్లోనూ, ప్రభుత్వ భూభాగా ల్లోనూ నిర్మించటం, మతపరమైన ఊరేగింపులను నిరోధించటం, కల్లబొల్లి వంకలు పెట్టుకొని కల్లోలాలురేకెత్తించటం, బెదిరించటం వంటి చర్యలపట్ల ప్రభుత్వ ప్రస్తుత విధానం, సమైక్యతకు తీవ్రమైన ప్రతిబంధకం. ఇట్టి చర్యలను ముందే నిరోధించటానికి బదులు, లోపాయికారీగా వాటిని సమ ర్థించి, ప్రోత్సహించే విధానం మరింత వైమనస్యాన్ని కలిగిస్తుంది. అందుచేత వెంటనే దానిని విడచి, అట్టి దుర్మార్గాచరణలను అంతం చేసేం దుకు ఒక విధానాన్ని దీక్షతో, ఉత్సాహంతో కొనసాగించాలి.

## హిందువు : అనన్యశ్రద్ధ

7. భారతభూమి మాత్రమే హిందువుల ధార్మిక భావనలకు ఆలంబం. తీర్థయాత్రల పేరున ఈ సువిశాల భారతభూమిలో మాత్రమే

హిందువు సంచరిస్తాడు. ఆతని భౌతిక ప్రయోజనాలు కూడా భారతభూమి తోనే ముడివడిఉన్నాయి. ఆ విధంగా ఆతని భక్తిశ్రద్ధలు కేవలంపూర్తిగా భారతభూమిపైనే ఉంటాయి. అందువల్ల, స్వధర్మం, స్వదేశాల మధ్య అతని మనసులో ఏ విధమైన సంఘర్షణా, ఎన్నడూ ఉండజాలదు. ఈ రెంటి నడుమా ఎల్లప్పుడూ తాదాత్మ్యమే ఉంది. దేశం పట్ల, ధర్మం పట్ల ఆతని విధేయత విభక్తం కాదు; ధర్మం పట్ల ఆతని విధేయత, దేశంపట్ల ఆతని విధేయతకన్న విభిన్నంగాగానీ, విరుద్ధంగాగానీ, మన కగుపించదు. ఈ దేశంలో హిందువులు నూటికి నూరుపాళ్ళ జాతీయ సమాజమనటానికి సూటియైనఋజువిదే. వారిని 'మత దురహంకారవాదులు'గా పేర్కొనడం తమ విధేయతలు విభక్తంగానూ, ఒక్కొక్కప్పుడు సందేహాస్పదంగానూ ఉంటూ వుండే ప్రజలతో సమానంగా వారి నుంచటం, అన్యాయం మాత్రమే గాదు, అవివేకం కూడా అవుతుంది.

## మతం మార్పిడి విధేయతను తారుమారు చేస్తుంది

8. హిందువులను ఇతర మతాల్లోకి మార్చటమంటే, జాతి పట్ల అనన్యమైన వారి విధేయతకు బదులు, వారిలో విభక్త విధేయతను కల్పించటమే కాగలదు. అది మన జాతి యొక్క,. దేశం యొక్క భద్రతకు ప్రమాదకరం. అందుకని దానిని అరికట్టటం అవసరం. మతం మార్పిడనేది, ఒకడు స్వయంగా ఆయా మతతత్వ శాస్త్రాల తారతమ్యాలను శ్రద్ధగా అధ్యయనం చేసినమీదట జరగటం లేదు. బీదతనం, నిరక్షరాస్యత, అజ్ఞానం, రకరకాల ఎఱలను చూపటం, కుతంత్రాలను తమ కనువుగా ఉపయోగించుకొని, ప్రజల మతం మార్చటం జరుగుతోంది. ఇట్టి మార్పులో నిజమైన హృదయపరివర్తన అన్న ప్రశ్నేలేదు. ఈ విధమైన అక్రమాలనూ, కార్యకలాపాలనూ నిషేధించటం న్యాయం. అజ్ఞానం లోనూ, బీదరికంలోనూ మునిగిఉన్న మన సోదరులను సంరక్షించు కునేందుకు మనం చేయవలసిన కర్తవ్యమిది.

## సరయినమార్గం  నేటి వికృతి

9. హైందవ తత్వశాస్త్రం సర్వసమగ్రమైనది గనుక, హైందవేతరములైన తెగలను తనలో విలీనంచేసుకోగల అంతశ్శక్తి కలిగివుంది. పూర్వకాలంలో దురాక్రమణదారులైన శకులనూ, హూణులనూ విలీనం చేసుకున్నట్లే, ముస్లిములనూ, క్రైస్తవులనూ హిందూ సమాజంలో విలీనం చేసుకోవటం అవసరమని పండిత నెహ్రూ ఈ అభిప్రాయంతోనే అన్నాడు. పండిత నెహ్రూ అదే ఉపన్యాసంలో, జాతీయ సమైక్యతను సాధించేందుకు వివిధ ఆరాధనా విశ్వాసాలను సమైక్యపరచి, వారిలో ఒక శ్రద్ధాకేంద్రం పట్ల భక్తిని నింపేందుకు సరైన మార్గదర్శనం చేసాడు. అయినప్పటికీ, ప్రస్తుత ప్రయత్నాలు హిందువులను అప్రతిష్ఠపాలు చేసేవిగా ఉన్నాయి. అంతేగాదు హైందవేతరులను బుజ్జగిస్తూ, అట్టి వారనుసరిస్తున్న దురాక్రమణ తంత్రాలను మరింత ప్రోత్సహించేవిగా కూడా సాగుతున్నాయి. అవి హిందువులను, అకర్మణ్యులుగనూ, నిస్సహాయులుగనూ చేసి, హిందువుల పరంపర సంప్రదాయాలను అవమానంపాలు చేస్తున్నాయి. ఇట్టి వికృత విధానాన్ననుసరించటం పండిత నెహ్రూ చూపిన బాటను విడవటమేగాక, దానిని వ్యతిరేకించటం గూడా. ఇట్టి వికృతిని సరిచేయాలి. ఎల్లప్పుడూ జాతిపట్ల అచంచలమైన విధేయతకు కట్టుబడివున్న హిందువులకు గౌరవాస్పదమైన స్థానం కల్పించాలి. ఆ అచంచల విశ్వాసం ఆధారంగానే ఇతరులను హిందువులలో సమైక్యం చేయాలి.

## సమితిని రద్దుచేయండి !

10. జాతీయ సమైక్యత పేరున ఏర్పరుచబడిన సమితిలో, అనేకులైన అసంతృప్తివాదులకు తమ కోర్కెలనూ, ఫిర్యాదులనూ ప్రకటించుకునే అవకాశం దొరికి, ఆ విధంగా తమ వేర్పాటు వాంఛలు తీరతాయనే

ఆశ రేకెత్తింది. మతదురహంకారాన్ని నిర్మూలించే మార్గం కనుగొంటా మని ఆ సమితి హామీ ఇచ్చింది. మతదురహంకారాన్ని ముందుగా నిర్వ చించాలని వారన్న మాటల వలన, తమ వర్గపరమైన కోర్కెలు తీరుతా యనే ఆశ హైందవేతరులలో కలిగింది. ఇందువలన తమతమ అస్తిత్వా లను, వేరువేరుగా ఉంచుకోవాలనే కోరిక చాలా వర్గాల వారిలో మరింత తీవ్రమవటం మాత్రమే జరిగింది. అంతే.

"జాతీయ సమైక్యత" కావాలంటూ, పదే పదే ప్రకటించటంవలన, ప్రస్తుతం అది బొత్తిగా లేదనే అవాంఛనీయ భావన కలుగుతోంది. కాబట్టి ప్రస్తుతం ఈ సమితి యొక్క అస్తిత్వం, అది ప్రారంభించబడిన మౌలిక ప్రయోజనానికే హానికరమనిపిస్తోంది. అందుచేత వెనువెంటనే దీనిని రద్దు చేయటం అవసరం. జాతీయ సమైక్యతా సాధనకు అది మొదటి మెట్టు కాగలదు.

# భరతవాక్యం

## జీవనకార్యం

హిందూ ప్రజానీకంలోని ఈ జాతీయ లక్షణాన్ని రా. స్వ. సంఘం గుర్తించింది. అందుకనే హిందువులలో భారతదేశం పట్ల, దాని జాతీయ జీవనం పట్ల, జాజ్వల్యమానమైన శ్రద్ధాభక్తులనూ, పరిపూర్ణమైన ధ్యేయ నిష్ఠనూ, సద్గుణాలనూ సౌశీల్యాన్నీ రగిలించేందుకూ, వారందరి నడుమా, సామాజిక చైతన్యాన్నీ, పరస్పర సౌహార్ద, ప్రేమ సహకారాలనూ మేల్కొల్పటందుకూ, కులాలు, మతసంప్రదాయాలు, భాషలవంటివన్నీ అప్రధానాలనే గుర్తింపు వారిలో కలగచేసేందుకూ, సమాజసేవే అంతిమ

లక్ష్యమని చెప్పి వారి స్వభావాన్ని తదనుగుణంగా తీర్చిదిద్దేందుకూ, నిజమైన వినయం, క్రమశిక్షణా భావాలను వారిలో నింపేందుకూ, ఏ సామాజిక బాధ్యతనైనా సరే స్వీకరించతగినంతగా ఆరోగ్యవంతమూ, బలసంపన్నమూ అయ్యేటట్లు వారి దేహాలకు శిక్షణ నిచ్చేందుకూ, ఆ విధంగా వారిలో అన్ని జీవన గమ్యాల్లోనూ సర్వతోముఖమైన అనుశాసనాన్ని సృష్టించేందుకూ, హిమాలయం నుండి కన్యాకుమారివరకూ మన ప్రజలనందరినీ, సమరసమూ, సమగ్రమూనైన జాతిగా నిర్మాణం చేసేందుకూ కృతనిశ్చయంతో పనిచేస్తోంది.

## దృఢ విశ్వాసాలు

సంఘానికి ప్రత్యేకమైన కోర్కెలేమీ లేవు. అది ప్రత్యేక హక్కుల కొరకూ సదుపాయాల కొఱకూ పోరాడదు. ఎన్నికల రాజకీయంలో అది ఎన్నడూ పాల్గొనదు. అధికారంలో వాటా కావాలని కోరదు. దానికి అట్టి విధానం కూడా లేదు. మన జాతిని సుసంఘటితమూ, సమృద్ధమూ, కీర్తిమంతమూ చేయడంకన్నా, జాతీయ బలిపీఠంపై తమ సర్వస్వమూ సమర్పణ చేయడంకన్నా వేరే ఏ ఆశయాకాంక్షలు సంఘానికి లేవు. అందుకనే ఏ ఒక్క కులంపట్లా, సంప్రదాయం, పక్షాలపట్ల ద్వేషానికి దానిలో ఏ మాత్రం ఆస్కారం లేదు. తన దృష్టిలో సవ్యమైన హిందూ భావన కలిగి ఉన్నందున, అన్నిటిపట్లా, సమాన గౌరవం, ప్రేమ, సహనాలను సంఘం కలిగి వుంది. హిందూ భావన ప్రకారం, రాజ్యం యొక్క కర్తవ్యం లౌకిక వ్యవహారాలకు మాత్రమే పరిమితం, మతవిశ్వాసాలు, సంప్రదాయాలూ ఆధారంగా, వేరెవ్వరికీ లేని ప్రత్యేకమైన హక్కులను కల్పించాలని ఆలోచించటం హిందూ విశ్వాసాలకూ, సంప్రదాయానికీ పూర్తిగా వ్యతిరేకం.

## దిగలాగిన చేయి

అనాది నుంచీ ఇంతవరకూ కొనసాగుతూ వచ్చిన, ఒకే జాతీయ సమైక్యతా భావాన్ని పునఃప్రతిష్ఠించటమే సంఘ లక్ష్యమనేది స్పష్టంగా తెలుస్తుంది. ప్రభుత్వం, అధికార పక్షంలోని కొందరు ముఖ్య సభ్యులు, మరికొన్ని రాజకీయ పక్షాలూ, దుర్బుద్ధితో విద్రోహకార్యంగా దీనిని వర్ణించిన కారణం చేతనే సంఘం పట్ల కొన్ని సంశయాలు రేకెత్తాయి. లేకపోతే నేడు సర్వత్రా వ్యాపించియున్న ప్రాంతీయతత్వాన్నీ, భాషాపరమైన విరోధాలనూ, కులతత్వాన్ని తొలగించే కృషిలో ఈసరికి, సంఘం చాలా వరకూ విజయవంతమయ్యేది. ఆ ప్రయోజనం కోసమై మళ్ళీ ఏదో ఒక సమితిని ఏర్పరచవలసిన అవసరమే లేకపోయేది.

## పవిత్ర శపథం

సుదృఢమూ, పునఃసంఘటితమూ, సమైక్యమూనైన జాతీయ జీవితాన్ని నిర్మించటమనే, తన పవిత్ర కార్యంపై అచంచల విశ్వాసంతో ఇన్ని సంవత్సరాలుగా రా. స్వ. సంఘం కృషి చేస్తూ వుంది. ఈ మార్గాన్ని ఒక పవిత్ర కర్తవ్యదీక్షగా స్వీకరించింది. సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని కృపచే అది ఈ పనిని అలాగే కొనసాగిస్తుంది. ఈ కృషిలో అచిరకాలంలోనే విజయాన్ని కూడా పొంది తీరుతుంది.

## కొన్ని మౌలిక భావనలు

స్థూలంగా చెప్పాలంటే:-

1. దేశం పట్ల, దాని సంప్రదాయం పట్ల, శతాబ్దాల తరబడిగా ఇచట పుట్టిన వీరుల పట్ల, దేశం యొక్క యోగక్షేమాల పట్ల ఎవరి విధేయత అవిభక్తంగానూ, కల్తీలేకుండానూ ఉంటుందో వారు జాతీయులు.

2. అట్టి విధేయతను కలిగి వుంటూనే, తమ పంథా, కులము, భాషలపరంగాగానీ, లేదా, ఇతర ప్రజలకన్న విభిన్నంగా తామనుకొనే, తమ 'తెగ' పరంగాగానీ, ఆలోచించుకుంటూ, తమ పరిమిత ప్రయోజనం, రాజకీయాధికారానుభవాల కొరకు, ఇతర సామాన్య ప్రజానీకం కోరనట్టి లేదా అనుభవించనట్టి, ప్రత్యేక హక్కులనూ, సదుపాయాలనూ పొందటం కొఱకు ప్రయత్నిస్తూ, వీటి కొఱకై అసూయపడీ, ద్వేషించీ, వ్యతిరేకించీ, ఒకోసారి హింసా మార్గాలకు కూడా దిగజారేవారు— మతదురహంకార వాదులు.

3. (I) ఎవరి విధేయత విభక్తమో, అలాగే, ఎవరు ఒకటవ సూత్రంలో చెప్పబడిన దానికన్న అతీతంగా విధేయతలు కలిగి ఉంటారో, అలాగే, విధేయతల నడుమ సంఘర్షణ వచ్చినపుడు, దేశప్రయోజనాలను గౌరవించరో, లేక వాని పట్ల తూష్ణీభావం వహిస్తారో, అలాగే తమ తమ విశ్వాసాలకు చెందిన ఇతర విషయాలనే సేవించాలని అనుకుంటారో, అట్టి సమూహాలవారందరూ— విరోధులు.

(II) ఎవరు తమంత తాముగా విదేశీయులమనీ, ఆక్రమణదారుల మనీ, ఈ దేశంలో విజేతలమూ, ఒకనాటి యజమానులమూ, పాలకులమూ అనే నమ్మకాలను కొనసాగిస్తూ ఉన్నారో వారంతా విజాతీయులని తెలుస్తూనే వుంది. అయితే తమని మరల అటువంటి పరిపాలకులనుగా పునః ప్రతిష్ఠించుకోవాలనే కోరిక ఉన్నప్పుడు, అట్టి సమూహాలవారు కూడా శత్రువులే అవుతారు.

4. జాతీయులే అయినప్పటికీ, ఏవో కొన్ని వికృత భావాలు కారణంగా, ప్రజలందరి నుండీ, సమగ్ర సమాజం నుండీ విడిపోవాలని ప్రయత్నించి, తామొక ప్రత్యేకమైన, తరుచు విరోధ రాజ్యంగా రూపొందప్రయత్నించే వారందరూ జాతి వ్యతిరేకులు.

5. (I) నాలుగవ అంశంలో చెప్పబడినవారిలో, ఎవరు, తమ లక్ష్యాలను సాధించుకునే నిమిత్తమై, మూడవ అంశంలోని ఒకటి, రెండు విభాగాలలో చెప్పబడినవారితో, చేతులు కలపడానికి సంకోచింపరో; లేదా- ఈ లక్ష్యాల కొరకై, ఏ విదేశీశక్తితోనైనా సరే, కలవడానికి సిద్ధపడుతూ ఉంటారో, లేదా, కలయిక కోసం నిజంగా ప్రయత్నిస్తారో వారందరూ దేశద్రోహులు.

(II) ఏ రాజకీయపక్షాలు, అధికారాన్ని పొందటానికిగానీ, నిలబెట్టుకోవటానికిగానీ పైన చెప్పబడిన మూడవ అంశంలోని, ఒకటి రెండు విభాగాలలోనూ, నాలుగవ అంశంలో చెప్పబడినవారితోనూ, చేతులు కలుపుతూంటవో, లేక అట్టివారికి ప్రత్యేక గౌరవప్రతిపత్తులను కల్పిస్తూంటవో అవన్నీ గూడా అయిదవ అంశంలోని ఒకటవ విభాగంలో చేర్చబడవచ్చును.

(III) ఏవేవో విదేశీ శక్తులకు ఇచట ఆధారాన్ని కల్పించే సిద్ధాంతాన్ని విశ్వసిస్తూ దేశముకన్న మిన్నగా అట్టి విదేశీ శక్తుల పట్ల మొగ్గు చూపుతూ, మన దేశానికి వ్యతిరేకమైనప్పటికీ, వారు మన దేశం మీద దండయాత్రలు చేసిన సందర్భంలో గూడా సహించి, తంటాలు పడి వారి దండయాత్రను సమర్థించ యత్నించి, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వారికి సహకరిస్తుంటారో, వారందరూ దేశద్రోహులూ, శత్రువులుగా కూడా అవుతారు.

దురదృష్టవశాత్తూ మన పవిత్ర భూమిలో పై అన్నిరకాలవారూ ఉంటున్నారు. పటిష్ఠమైన సమైక్య జాతీయ జీవన నిర్మాణానికి, ఈ నిజాన్ని, సరిగా, ధైర్యంగా అర్థం చేసుకోగలగటం అత్యవసరం.

అటువంటి వర్గాలన్నిటిలోనూ మినహాయింపులు తప్పక ఉంటాయి. జాతీయులనబడే వారిలోనే, దేశద్రోహులైన, వ్యక్తులూ, ఇతర వర్గాల

వారిలో దేశభక్తులూ కూడ కనిపించవచ్చు. వ్యక్తిగత గుణాలకూ, మూకుమ్మడి మనస్తత్వానికీ నడుమ గల వ్యత్యాసం మనం గుర్తించాలి. మూకుమ్మడి ఉన్మాదం రెచ్చిపోయినపుడు ఆయా ఇతర వర్గాలలోని దేశభక్తులైన వ్యక్తులు, తమ కాళ్ళ క్రింద నేలే కరిగిపోయి ఆ వెల్లువలో కొట్టుకుపోతారు. ఈ విధమైన మూకుమ్మడి మనస్తత్వం గురించి, ఉమ్మడి మనస్తత్వంగానే ఆలోచించుకోవాలి. దేశప్రయోజనాల సాధనమే ముఖ్య లక్ష్యమనే సంగతి దృష్టిలో ఉంచుకొని, సాంఘిక, సాంస్కృతిక, చారిత్రక, రాజకీయ భూమికలపై దీన్ని గురించి ఒక్కటిగానే ఆలోచించి వ్యవహరించాలి. వ్యక్తిగతమైన వికృత ధోరణులనూ, వికృతకృత్యాలను గానీ అదుపు చేసేందుకు సాధారణ చట్టం చాలును.

మొదటి అంశంలోని వారి ప్రయోజనాలు అతిప్రముఖాలు. వాటికి తప్పక ప్రాధాన్యత నివ్వాలి. రెండవ అంశం, నాలుగవ అంశములలోని వారితో, జాగరూకతా, సామర్థ్యాలతోనూ, సానుభూతితోనూ, ప్రేమాభిమానాలతోనూ, అవగాహనతోనూ వ్యవహరించాలి. దేశమునకూ, జాతికీ, ప్రమాదకరములు, నష్టకరములూ కాగల, విచ్ఛిన్నకర కార్యకలాపాల నుండి వారిని బయటకు లాగేందుకై, ఇతరులను సాధ్యమైన అన్నిపద్ధతులలోనూ, గట్టి చర్యలను తీసుకొని అణచివేయాలి.

## కొన్ని భయాలు

జబల్‌పూర్‌లో జరిగిన ఉషాభార్గవా ఉదంతం తర్వాత, పండిత నెహ్రూతోసహా అనేకమంది నాయకులు "అధిక సంఖ్యాకుల మత దురహంకారం"అన్న పదజాలం విచ్చలవిడిగావాడటం మొదలుపెట్టి, హైందవులకు మత దురహంకారాన్నంటగట్టి, దానిని అణిచేస్తామని బెదిరించటం ఆరంభించారు. ఈ 'జాతీయ సమైక్యతా సమితి' గూడా, ఈ వాతావరణం లోనే ఏర్పరుచబడింది కాబట్టి అది ఒక సందేహానికి తావిస్తుంది. మందిరే

కదా అనిపించేటువంటి 'జాతీయ సమైక్యత' అనే ముసుగు క్రింద హిందువుల సంరక్షణకూ, సంక్షేమానికీ కృషి చేస్తున్నటువంటి సంస్థలకు, మతదురహంకార సంస్థలనే పేరు నంటకట్టేందుకూ, హిందూసమాజంలోని, ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాస భావనలను భగ్నం చేయటంద్వారా, దానిని దుర్బలం చేయటానికీ, హిందూ వ్యతిరేకవర్గాలను సంతుష్టి పరచి, వారిని మంచి చేసుకునేందుకూ ప్రయత్నించటం ద్వారా దురాక్రమణ పథకాలలో వారికి ప్రోత్సాహం ఇచ్చేందుకూ ఒక కుటిల ప్రయత్నం ఆరంభమైందని సందేహించేందుకు అవకాశం ఏర్పడుతోంది.

## సాక్ష్యాధారాలు

1. ఆలీఘర్‌లో జరిగిన సంఘటనలపై, నిష్పాక్షికమైనవిచారణను జరిపించకపోవటం, ఆలీఘర్ విశ్వవిద్యాలయాధికారులు నిర్దోషులనటం.

మన రాజ్యాంగపు టాశయాని కనుగుణంగానే గావచ్చు, ఆకాశ వాణిలో హిందీ భాషాప్రయోగాన్ని సులభతరం చేస్తున్నామనే ముసుగు క్రింద, దానిని ఉర్దూమయం చేయటం, ఆ విధంగా ఆ భాషను భ్రష్టం చేసి అయోమయంగా తయారుచేయటం;

మన జాతీయ వీరులకు సంబంధించిన అంశాలను పాఠ్యగ్రంథాల నుండి తొలగిస్తాననీ, హిందూ ఉత్సవాలను, పాఠశాలల్లో జరుపుట సషే ధిస్తాననీ, ఉత్తరప్రదేశ్ విద్యామంత్రిచేత ఇవ్వబడిన హామీలూ;

తూర్పు బెంగాలు నుండి వస్తున్న అక్రమ ముస్లిం ప్రవేశకు లను బహిష్కరించటం పూర్తిగా చట్టబద్ధమే అయినప్పటికీ, వారినివెనుకకు పంపివేయరాదనే విధానాన్నవలంబించటం, తూర్పుబెంగాల్లోని హిందువు లపై సాగుతున్న దురంతాలకు, నిరసన తెలుపవద్దని పశ్చిమ బెంగాలు ప్రభుత్వానికి సలహా ఇవ్వటం, అట్లా చేస్తే, ఈ దేశంలోని 'అల్ప

సంఖ్యాకులు' అంటే ముస్లిములు, తమకు భద్రత లేదని భావిస్తారని వింతగా వాదించటం— ఇవి మనలోని భయంకర సందేహాలను రూఢి చేస్తూ, ముస్లిముల బుజ్జగింపు కొనసాగుతోందనటానికి ఋజువులుకాగలవు. ఇలాంటివే మరికొన్ని ఉదాహరణలు గూడా చెప్పుకోవచ్చును.

2. ఇప్పుడేర్పరుపబడిన ఉపసంఘం, వివిధ 'మత దురహంకార సంస్థల' ప్రతినిధులను ఆహ్వానించి, వారి అభిప్రాయాలను అడిగి తెలుసు కుంటుందని కొద్దిరోజుల క్రితం పత్రికల్లో ఒక వార్త కనిపించింది. 'మత దురహంకారము'ను నిర్వచించటానికే ఆ ఉపసంఘం పుట్టింది. కాబట్టి 'మతదురహంకారము' అంటే ఏమిటో అది నిర్వచించాలి. అలా చేయక ముందే కొన్ని సంస్థలను 'మతదురహంకార సంస్థలు'గా అదిప్రకటించటం, విధి నిర్వహణలో అది ఏ మాత్రం నిజాయితీతో వ్యవహరించగలదోనని సందేహించే అవకాశం కల్పిస్తోంది.

3. ఆ ఉపసంఘంలోని గౌరవనీయులైన సభ్యులు కొందరు, అనేక సందర్భాల్లో అనేకమంది హిందూ వ్యక్తులనూ, సంస్థలనూ గూడ 'మత దురహంకారు'లుగా పేర్కొంటున్నారు. ఆ పదం యొక్క అర్థమేమిటో నిశ్చయింపబడకముందే, ఇలా నిందారోపణలకు దిగే మనస్తత్వం ఆ వ్యక్తుల యొక్క నిజాయితీ గురించే శంకించే అవకాశమిస్తోంది.

4. అట్టి వ్యక్తులతో కూడినదీ, అటువంటి వాతావరణంలోపుట్టినదీ అయిన ఒక ఉపసంఘం ద్వారా నిజాయితీతో కూడిన విచారణను ఆశింప గలమా?

5. "భారతదేశంలోంచి విడిపోయి, వేరే ప్రత్యేకరాజ్యం ఏర్పరుచు కోవాలనే ఉద్దేశ్యం ఉన్నదా" అని మహారాష్ట్ర ముఖ్యమంత్రిని (ఉప సంఘం) ప్రశ్నించటం జరిగింది. అట్టి ప్రశ్న వేయడం— అప్రతిష్టకరం,

అవమానకరం కూడా. ఉపసంఘంలోని సభ్యుల పాక్షిక మనస్తత్వానికి అది ఒక నిదర్శనం కూడా. పక్షపాతబుద్ధి గల వారి నుండి నిజాయితీతో కూడిన విచారణను ఊహించలేం గదా?

6. రాజకీయ పక్షాల అభిప్రాయాలను తెలుసుకోవడంలో ఈ సంఘానికి అభిలాష ఉన్నట్లు చెపుతున్నారు. అటువంటప్పుడు, రాజకీయా లతో ఏ సంబంధం లేని రా. స్వ. సంఘాన్ని దీని కాహ్వానించటంలో ఔచిత్య మెక్కడిది?

7. ఈ సమితి యొక్క అధికారాలేమిటి? పరస్పరం అభిప్రాయా లను ఇచ్చిపుచ్చుకునేందుకు తప్ప ఇతర ప్రయోజనం, ఉపయోగం లేక పోయినట్లయితే అట్టి వృథా ప్రయాసలలో పాల్గొనటం కాలాన్ని వృథా చేయటం మాత్రమే అవుతుంది గదా.

8. ఈ సమితిలో, ప్రభుత్వం, అధికారంలోని పక్షాలదే పైచేయిగా ఉన్నట్లగుపిస్తోంది. ఈ పరిస్థితుల్లో సమస్యల గురించిన, నిష్పాక్షిక పరి శీలన జరుగుతుందని ఊహించటం దండుగే కదా!

# 16. అంతర్గతప్రమాదాలు

## 1. ముస్లిములు

దేశం బయటినుంచి వచ్చే దురాక్రమణశక్తులకన్న, దేశంలోపలనే ఉన్న విరోధశక్తులు జాతీయ భద్రతకు మరింత ముప్పుకలిగిస్తాయనేదే ప్రపంచలోని అనేకదేశాలచరిత్ర చెప్పే విషాద గుణపాఠం. ఆంగ్లేయుల నిష్క్రమణ నాటినుండి జాతీయ భద్రతగురించిన ఈ ప్రథమపాఠాన్ని దురదృష్టవశాత్తు మనవాళ్ళు ఎల్లప్పుడూ విస్మరిస్తూనే వచ్చారు. వాస్తవాల నెదుర్కొనే ధైర్యంలేక, పగటికలలుకంటూ, మనపై విరుచుకుపడుతున్న దురంతాలపరంపరను కప్పిపుచ్చేందుకు అధికారంలో ఉన్నవాళ్ళు పెద్ద పెద్ద నినాదాలు వల్లిస్తున్నారు. రాజకీయపక్షాలు, మతాలు తమ తమ సంకుచిత స్వార్థ ప్రయోజనాలు సాధించుకొనేందుకు విరోధశక్తులతో అవకాశవాద ఒప్పందాలు చేసికొంటున్నాయి. మన జాతీయ స్వాతంత్ర్యానికి భద్రతకు లోలోపల ముంచుకువస్తున్న దేశ విద్రోహ ప్రమాదాన్ని మరింత తీవ్రమైనదిగాను, వాస్తవికమైనదిగాను చేయడానికి వీళ్ళంతా చేతులు కలుపుతున్నారు.

## మొదట ముస్లింల సంగతి పరిశీలిద్దాం

'ఈనాడిక ముస్లిముల సమస్య అనేది లేనేలేదు. పాకిస్తాన్‌ను సమర్థించిన దుష్టశక్తులన్నీ శాశ్వతంగా ఇక్కడినుండి వెళ్ళిపోయాయి. ఇచట మిగిలిఉన్న ముస్లిములందరూ దేశభక్తులే. వారికి మరొకదేశంలేదు గనుక ఈ దేశానికి విధేయులై ఉండకతప్పదు' అని ఈనాటికికూడా చెప్పేవా రనేకులు ఉన్నారు.

## వాస్తవం ఏమిటి ?

అయితే వాస్తవాలేమిటి? పాకిస్తాన్‌ను సమర్థించే వర్గాలన్నీ పాకిస్తానుకు వెళ్ళిపోయినవనటం నిజమా ? హిందువులు అధికసంఖ్యలో ఉన్న ప్రాంతాల ముస్లిములే, నాటి సంయుక్తపరగణాల(ఉత్తరప్రదేశ్) నాయకత్వం క్రింద పాకిస్తాన్ ఉద్యమంలో మొదటినుండి అగ్రేసరులుగా ఉన్నారు. దేశవిభజన తరువాత వాళ్ళంతా పూర్తిగా ఇక్కడే ఉండిపోయి నారు. నిజానికి పాకిస్తాన్‌లో భాగాలుగా జేరిన పంజాబు, బెంగాలు, సింధు వాయవ్య సరిహద్దు ప్రాంతాలలోని ముస్లిములే 1937 ఎన్నికల్లో ముస్లిము లీగును పూర్తిగా ఓడించినారు. ఆ తరువాత కాలంలోనే మన నాయకుల తప్పుడు విధానాలు అచ్చటి ముస్లిములను ముస్లిములీగు చేతులలోకి నెట్టివేశాయి.

దేశవిభజనకు ముందు రాజ్యాంగనిర్మాణసభకు ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికల్లో పాకిస్తాన్ నిర్మాణాన్ని ఎన్నికల సమస్యగా తీసికొని ముస్లింలీగు పోటీ చేసింది. కాంగ్రెసుకూడ కొందరు ముస్లిము అభ్యర్థులను దేశమంతట నిలబెట్టింది. అట్లాపోటీపెట్టిన దాదాపు అన్ని స్థానాలలోనూ లీగు అభ్యర్థులకే ముస్లిములు ఓట్లువేసినారు. కాంగ్రెసు నిలబెట్టిన ముస్లిము అభ్యర్థులు చిత్తుగా ఓడిపోయారు. వాయవ్యసరిహద్దు ప్రాంతమొక్కటే

అందుకు మినహాయింపు. అంటే ఇక్కడ ఉన్న కోట్లాది ముస్లిములు మూక ఉమ్మడిగా పాకిస్తాన్‌ను బలపరచినవారేనని దాని అర్థం.

కనీసం ఆ తరువాతైనా ఇక్కడ ఉండిపోయినవాళ్ళలో మార్పు వచ్చిందా? 1946-47 లో సంభవించిన దేశవ్యాప్తమైన కలహాలు దోపిడీలు, దహనకాండ, మానభంగాలు మొదలగు దురంతాలకు దారిదీసిన వారి పాతపగ, హత్యాప్రవృత్తి ఈనాటికైనా లేకుండా పోయాయా? పాకిస్తాన్ నిర్మాణం తర్వాత హఠాత్తుగా వాళ్ళు దేశభక్తులుగా అయిపోయి వారని నమ్మడం, ఆత్మహత్యాసదృశమే అవుతుంది. వాళ్ళుమారలేదు సరిగదా, పాకిస్తాన్ ఏర్పడిన తర్వాత ముస్లిం ప్రమాదం వందరెట్లయింది; పాకిస్తాన్ వీళ్ళ భవిష్యద్దురాక్రమణ పథకాలకు వత్తాసుగా నిలిచింది.

## పాకిస్తాన్ – నిరంతర దురాక్రమణ

వారి దురాక్రమణపథకం ఎప్పుడూ రెండువిధాలు. మొదటిది ప్రత్యక్ష దురాక్రమణ. స్వాతంత్ర్యంరావటానికి ముందురోజుల్లోదానిని, 'ప్రత్యక్షచర్య' అని జిన్నా వ్యవహరించినాడు. ఆ మొదటి దెబ్బలోనే వారు పాకిస్తాన్ సాధించుకొన్నారు. పాకిస్తాన్ నిర్మాణంలో భాగస్వాములైన మననాయకులు ఆ దురంతాన్ని కప్పిపుచ్చుకొనేందుకై అన్నదమ్ములు భాగాలు పంచుకొన్నట్లు దేశవిభజన జరిగిందంటూ ఏవేవో చెప్పవచ్చు. కాని మన మాతృభూమి ఖండింపబడి, దురాక్రమణ బుద్ధిగల ఒకముస్లింరాజ్యం నిర్మింపబడింది అనే పచ్చినిజంమాత్రం తెలుస్తూనే ఉంది. పాకిస్తాన్ అనబడేది ఏర్పడిన నాటి నుండి అది ముస్లింల నిరంతర దురాక్రమణకు ఒకస్పష్టమయిన నిదర్శనమని మనం చెప్పుతూనే ఉన్నాం. పన్నెండువందలఏండ్లకు పూర్వం తాము ఈ భూమిపై అడుగుపెట్టిననాటినుండి ఈదేశం మొత్తాన్ని, మతాంతరీకరణ చేయాలి, బానిస చేసికోవాలి అనే ముస్లిముల కోరిక అనేక శతాబ్దాలపాటు తమ రాజకీయ ఆధిపత్యం కొనసాగించినప్పటికీ సఫలంకాలేదు. జాతీయ

విజిగీష ప్రవృత్తివల్ల, మహామహులైన పరాక్రమవంతులు ఉద్భవించి, వారి రాజ్యాలకు గోరీలు కట్టారు; ఐనప్పటికీ వారి ఆక్రమణవాంఛ మాత్రం భగ్నం కాలేదు. ఆంగ్లేయులరాక, తమవాంఛను నెరవేర్చుకోటానికి అవకాశం ఇచ్చింది. వారు తెలివిగా పాచికలు ఆడినారు. అదనుచూచి భయోత్పాతాన్ని, కల్లోలాలను సృష్టించినారు. చివరకు బెదరగొట్టి తమ కుత్సితమైన దేశవిభజన వాంఛకు మన నాయకులను లొంగదీశారు.

సంఘానికి చెందిన మనంమాత్రం ఈ చారిత్రక సత్యాన్ని అనేక సంవత్సరాలుగా పదేపదే చెప్పుతూనే ఉన్నాం. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ప్రముఖ చరిత్రకారుడైన ఆర్నాల్డుటాయెన్‌బీ కూడ కొద్దికాలంక్రితం దాన్నే ఋజువుచేసినాడు. ఆయన మనదేశానికి రెండుసార్లువచ్చి, అతి సన్నిహితంగా పరిశీలించి, మన జాతీయ వికాసాన్ని అధ్యయనంచేసి, దేశవిభజనపట్ల సరియైన చారిత్రక దృక్కోణాన్ని వివరిస్తూ ఒకవ్యాసం వ్రాసినాడు ఈ దేశాన్నంతనూ పూర్తిగా స్వాధీనం చేసికోవాలని ముస్లిములు పండ్రెండు వందల ఏండ్లుగా కంటున్న కలలను ఇరువదియవ శతాబ్దంలో నిజంచేసికోవ టానికి, పాకిస్తాన్ నిర్మాణంతొలిమెట్టుమాత్రమే అని అసందిగ్ధంగా ఆవ్యాసంలో అతడు వ్రాసినాడు. తొలివిజయం వారి ప్రత్యక్షదురాక్రమణకు పదునుపెట్టింది; అది కాశ్మీరుపై విజృంభించింది. కొంతమేరకు అందులోగూడ వారికే విజయం లభించింది. కాశ్మీరులోని మూడింట ఒకవంతుభూమి ఈనాటికిగూడ వారి కబంధహస్తాల్లో చిక్కుకొనిఉంది. కాశ్మీరులోనేఉన్న శక్తిమంతమైన పాకిస్తానీ అనుకూలవర్గాల సహాయంతో మిగిలిన కాశ్మీరునంతనూ ఆక్రమించాలని ఈనాడు పాకిస్తాన్ ప్రయత్నిస్తోంది.

## జిన్నా కన్నకలలకు అనుకూలం

వారి దురాక్రమణ పథకంలోని రెండవపద్ధతి మనదేశంలోని కీలక ప్రాంతాల్లో ముస్లిముల సంఖ్యను అధికం చేసికోవటం. కాశ్మీరు తరువాత

అస్సాం మీద వారి చూపుపడింది. అస్సాం, త్రిపుర, మిగిలిన బెంగాలు ప్రాంతాలను వారు ఒక పథకం ప్రకారం తమ జనాభాతో చాలాకాలంగా నింపివేస్తున్నారు. తూర్పు పాకిస్తాన్‌లో కరువుకాటకాలు వచ్చాయి, కాబట్టి అచటి ప్రజలు అస్సాం, పశ్చిమబెంగాలు ప్రాంతాలలోకి వచ్చిపడుతున్నట్లుగా నమ్మించటానికి చెప్పేమాటలు ఏమాత్రం నిజంకావు. పాకిస్తాన్‌లోని ముస్లిములు పదిహేనేండ్లుగా అస్సాములోనికి చొరబడుతూనే ఉన్నారు. అంటే, ఈ పదిహేనేండ్లు తూర్పుపాకిస్తాన్‌లో కరువుకాటకాలు తిష్ఠవేసికొని కూర్చున్నాయని అర్థమా? వారుదొంగచాటుగా అస్సాములో ప్రవేశిస్తున్నారు. స్థానిక ముస్లిములు వారికి ఆశ్రయం కల్పిస్తున్నారు. తత్ఫలితం, అక్కడ 1950 లో 11% ఉన్న ముస్లిం జనాభా ఈనాడు 22% కన్న అధికమయింది. కాలక్రమంలో అతిసహజంగా పాకిస్తాన్‌లో అంతర్భాగంగా మారేందుకుగాను అస్సామును అధికసంఖ్యాక ముస్లింప్రాంతంగా మార్చేందుకు ఇదియొక కుట్రకాక మరేమవుతుంది ?

1960 లో అస్సామును నాశనంచేసిన బెంగాల్ వ్యతిరేక కల్లోలాల్లో ముస్లిం జనసామాన్యం, ముస్లిం మంత్రులుకూడా ఎప్పటివలెనే విద్రోహ నాటకమాడినారు. తమ పథకానికి అనువుగా ఒకచోట బెంగాలీ హిందువును అస్సామీ హిందువుపైకి, మరొకచోట అస్సామీ హిందువును బెంగాలీ హిందువుపైకి ఉసికొల్పుతూ, బెంగాలీ హిందువులను తుడిచిపెట్టే ఆ యత్నంలో కలహాలు ప్రతి హిందువు గృహంలోకీ గాఢంగా చొచ్చుకొని పోయేట్లు చేసినారు; దీనివల్ల, ఆప్రాంతంలో హిందువులశాతం తరిగింది; ముస్లింశాతం పెరిగింది; అచట జరిగిన కొన్ని సంఘటనలు అనేక రహస్యాలను వెల్లడిస్తాయి. ఒకబెంగాలీ ముస్లింపెద్దమనిషిఇల్లు సురక్షితంగా ఉండగా, దానికి అటూఇటూ ఉన్న బెంగాలీ హిందువుల ఇండ్లు తగులబెట్టిన ఉదంతాలు అనేకంగా కనిపిస్తాయి. ఆ కల్లోలాల్లో దోచుకొంచిన ఆస్తి తూర్పుపాకిస్తాన్‌కు తరలించటానికి ప్రయత్నిస్తుండగా కొందరు

పట్టుబడ్డారనికూడా పత్రికల్లో వార్తలు వచ్చాయి. తమ పథకాలు కొనసాగించేందుకు లారీలనిండుగా ముస్లిములు తూర్పుపాకిస్తాన్ నుండి అస్సాములో ప్రవేశించారనేది సువిదితమే. జిన్నా కలలుగన్న పాకిస్తాన్‌లో కాశ్మీరు, అస్సాములుగూడా భాగాలుగా అయిఉండవలసినదనే విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటే, వారి చర్యలలోని పథకాలన్నీ సుస్పష్టం ఔతాయి.

జిన్నా కన్నకలలన్నీ నిజంచేసికొనేందుకు వారు వేసేపథకాలన్ని పగటికలలవంటివని మనం కొట్టిపారవేస్తే అది నిజంగా ఆత్మహత్యా సదృశమే కాగలదు. పాకిస్తాన్ కావాలని జిన్నా అడిగినప్పుడు అది అభూతకల్పన అని మనం అట్లాగే కొట్టిపారేశాం. అయితే అదిమాత్రం నేడొక కఠోరసత్యం. ఆయుధాలను, మందుగుండు సామాగ్రిని సమకూర్చు కొనేందుకు వారుచేస్తున్నతీవ్రప్రయత్నాలు నిరంతరాయంగా కొనసాగుతూనే ఉన్నాయి. మసీదుల్లో వారి సమావేశాలు, హింసకు వారిచ్చే ప్రోత్సాహం అతిభయంకరస్థాయిలో పెచ్చుపెరుగుతున్నాయి. కొన్ని ఏండ్లక్రితం కలకత్తాలోని పోలీసుకమీషనరు, ఒక్క నఖోదా మసీదులోనే, కలకత్తాలో సగభాగం ప్రేల్చివేయటానికి సరిపోయినంత మందుగుండుసామాను, ఆయుధాలు దాచినారని, ఆ మసీదును గాలించి, అందులోని ప్రమాదకర వస్తువులను స్వాధీనం చేసికోకపోతే, కలకత్తానగరంలో శాంతిని నెలకొల్పటం సాధ్యంకాదని ఒక హెచ్చరికచేశాడు. ధైర్యంగా అతడుచేసిన ఆ హెచ్చరికకు ప్రతిఫలంగా అతణ్ణి వెంటనే కలకత్తానుండి బదిలీచేశారు. ముస్లిములయొక్క ప్రత్యక్షదురాక్రమణ ప్రవృత్తికి, గతవేయి సంవత్సరాల చరిత్ర చదివినతర్వాతకూడా, ఇంకా నిదర్శనాలు కావలసివస్తే, ఢిల్లీలోను, దేశంలోని అనేక ఇతర స్థలాల్లోను జరుగుతున్న బాంబుల ప్రేలుళ్ళు వారివిద్రోహ ప్రయత్నాలకు ప్రత్యక్ష సాక్ష్యాలుగా నిలుస్తాయి.

తమ విద్రోహచర్యలను గట్టిగా అదుపులోపెట్టజాలినంతశక్తి ఈనాటి నాయకత్వానికి లేదని తెలుసుకొన్నందునే, ముస్లిములు

విద్రోహ కార్యకలాపాల్లో మరింత ధైర్యంగా పాల్గొంటున్నారు. కలకత్తా నోఆకాళీ, త్రిపురల్లో తాము కొనసాగించిన హింస, రక్తపాతాలు మన నాయకులను భయభ్రాంతులను చేశాయని, మాతృదేశ సమైక్యాన్ని కుదువపెట్టేందుకు, దేశంలో ఒకభాగాన్ని వారి హస్తగతం చేసేందుకు ఆ రక్తపాతమే మన నాయకులను లొంగతీసిందని వారికి బాగాతెలుసు, నేటి నాయకత్వంవద్ద గూండాగిరీ మంచిలాభాలు సమకూరుస్తుందని ఈ నాటికీ వారు ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నారు.

1950 లో తూర్పుబెంగాల్లో మూకఉమ్మడి హత్యలు జరిపి, పెద్ద పెట్టున హిందువులను అచటనుండి గెంటివేస్తున్న సమయంలో ఒక విశేషం జరిగింది. బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ ప్రాంతాల్లో సరిగ్గా అదే సమయంలో అనేక కలహాలు, చెలరేగాయి. ఎక్కడ "మతకలహం" సంభవించినా, అందులో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ పాత్ర ఉండితీరాలనే ఒక వింతజాడ్యంతో మన ప్రభుత్వం బాధపడుతూ ఉంటుంది. దానికి తగ్గట్లుగానే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ఆ సమయంలో సంఘకార్యకర్తలు కొందరిని నిర్బంధించింది. అప్పట్లో వేరేపనిమీద నేనొకసారి సర్దార్ పటేలును కలిశాను. మావారినెందుకు నిర్బంధించారని వారిని నేనడిగాను. ఆ కల్లోలాలన్నిటికి సంఘ కార్యకర్తలే బాధ్యులు అని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వానికి వార్తలందినాయని వారి సమాధానం. 'ఈకల్లోలాలు సంభవించిన ప్రదేశాలను జాగ్రత్తగా పరిశీలించి ఉంటే, తూర్పు పశ్చిమ పాకిస్తానులను కలుపుతూ ఏయే ప్రాంతాలగుండా దారి జిన్నా కోరినాడో, ఆ ప్రాంతాల్లోనే ఇవి సంభవించాయి అని మీరుగుర్తించగలరు. పైగా తూర్పు బెంగాలునుండి మూకఉమ్మడిగా హిందువులను గెంటివేస్తున్న సమయంలోనే ఇవి సంభ వించాయి. ప్రభుత్వాన్ని బెదరగొట్టి ఆ త్రోవను సంపాదించుకునేందుకు వారు యత్నిస్తున్నారనే విషయం దీన్నిబట్టి స్పష్టం' అని వారితో చెప్పినాను. సర్దార్‌పటేల్ నిమిషంసేపు నిశ్శబ్దంగా ఉండి, 'అవును, మీరు

చెప్పినదానిలో నిజముంది' అన్నారు. వెంటనే మన కార్యకర్తలందర్నీ వదలిపెట్టారని వేరే చెప్పనక్కరలేదు. వాస్తవాలను యథాతథంగా ఎదుర్కొగలిగిన వజ్ర సంకల్పంగల సర్దార్ పటేల్ వంటి వ్యక్తి ఆరోజుల్లో అదృష్టవశాత్తు మనకున్నారు.

## టైమ్‌బాంబు

పూర్వంవలెనే ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమప్రాంతం శక్తిమంతమైన ముస్లింస్థావరంగా ఇంకా ఉంటూనే ఉందని సర్దార్ పటేలుకు తెలుసు. ముస్లిములున్న ప్రాంతాలగుండా రహదారి నేర్పరచి దానిని పశ్చిమ పాకిస్తాన్‌తో కలవ నివ్వటం వారికిష్టంలేదు. కనుకనే, విభజనానంతరం తూర్పుపంజాబునుండి గెంటివేసిన ముస్లిములు పశ్చిమపంజాబు దరిదాపులలో పునరావాసం ఏర్పరచుకోకుండా ఉండటానికి, తద్వారా పశ్చిమ పాకిస్తాన్‌నుండి, ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమభాగంవరకు ముస్లిములతో నిండిన ఒకరహదారి ఏర్పడకుండా చేయటానికి, వారు తగిన శ్రద్ధ వహించినారు. కాని ఆచార్యవినోబాభావే ఒత్తిడివల్ల ముస్లిములు మొదట గురుగాంజిల్లాలో వసతినేర్పరచుకోవటానికి అనుమతి ఇచ్చారు. ఆప్రాంతంలో దాదాపు నాలుగులక్షమందికిపైగా ముస్లిములు ఇప్పుడు పునరావాసం ఏర్పరచుకున్నారు.

1946-47 లో సంభవించినటువంటి ప్రమాదకరమైన పరిస్థితి ఈనాడు క్షణాలమీద ముంచుకువస్తూఉంది అని చెప్పటానికి సూచనలు కనబడుతున్నాయి. అయితే ఎప్పుడు సంభవిస్తుందో మాత్రం తెలియటంలేదు. ఢిల్లీనుండి రామ్‌పూర్, లక్నోలవరకు ముస్లిములు అతిప్రమాదకరమైన కుట్ర ఒకటి పన్నుతున్నారు; ఆయుధాలను సమకూర్చుకుంటున్నారు. తమ మనుష్యులను సంసిద్ధం చేసుకుంటున్నారు. పాకిస్తాన్ మనదేశంపై సాయుధ సంఘర్షణకు దిగినవెంటనే దేశంలోపలనుంచి తాము దెబ్బతీయటానికి

బహుశః వారెదురుచూస్తున్నారు. అట్లా వారు దెబ్బతీస్తే – మనంగనుక ముందుజాగ్రత్తతో అదనులో ఆ కుట్రను మొగ్గలోనే త్రుంచివేయకపోతే – పునాదులతోసహా ఢిల్లీ కదలిపోయే ప్రమాదంఉంది. ఇది మననాయకులకు తెలియకకాదు. రహస్యసమాచారశాఖనుండి వార్తలు వారికి అందుతూనే ఉంటాయి. ఐనా, ఎన్నికలొక్కటే వారిదృష్టిలో ఉన్నట్టున్నాయి. ఎన్నికలంటే ఓట్లు సంపాదించటం – అంటే కట్టకట్టి ఓట్లన్నీ గ్రుమ్మరించే కొన్నివర్గాల ప్రజలను సంతృప్తిపరచటం. మరి ముస్లిములు అటువంటి ఒకవర్గంగా ఉన్నారుకదా ! మన నాయకులుచూపే బుజ్జగింపు విధానానికీ, తత్ఫలితమైన దారుణ పరిణామాలకుకూడా కీలకం దాంట్లోనే ఉంది.

## మరచిపోయేదిలేదు, నేర్చుకొనేదిలేదు

ముస్లింలీగు దక్షిణాన మళ్ళీ తలఎత్తింది. పాకిస్తాన్ నిర్మాణం ఉత్తరాదిన ఉన్న హిందువులను, ముస్లింలీగువలన కలిగే ప్రమాదాలపట్ల తాత్కాలికంగానైనా మేల్కొల్పింది. కనుక లీగునాయకులు తమ కేంద్రాన్ని దక్షిణానికి తరలించినారు. తమ కార్యకలాపాలను ఇన్ని ఏండ్లుగా రహస్యంగా కొనసాగిస్తూనే ఉన్నామని ఇప్పుడు ప్రకటించినారు. కేరళలో కమ్యూనిష్టు ప్రభుత్వాన్ని గద్దెదించిన ప్రజాఉద్యమం, వారుబహిరంగంగా వెలికిరావటానికి ఒక మంచిఅవకాశం కల్పించింది. వెనువెంటనే జరిగిన ఎన్నికల్లో వారి రొట్టెవిరిగి నేతిలోపడింది. దేశవిభజన అనే భయంకర ప్రమాదం ముస్లింలీగును తాము నెత్తికెక్కించుకొన్నందుకు ఫలితమేనని గతానుభవ గుణపాఠం గుర్తించకుండా కాంగ్రెసుపార్టీ ఎన్నికలసమయంలో మళ్ళీ ఒకసారి వారితో చేతులు కలిపి ఆలింగనం చేసుకుంది. ప్రత్యక్షంగా ఋజువు అవుతున్న ఈ జాతీయ వ్యతిరేకచర్యను సమర్థించుకొనేందుకుగాను నెహ్రూపండితుడు ఈనాటి ముస్లింలీగు పాతకాలపు ముస్లింలీగుకాదనీ, ఇప్పుడది దేశభక్తికలిగి, తమ వర్గానికీ, మతానికీ, అంకితమైన ఒకక్రొత్త

పక్షమంటూ ముస్లింలీగుయొక్క దేశభక్తికొక ప్రశంసాపత్రాన్నిచ్చినారు. దేశభక్తి కెంతటి అద్భుతనిర్వచనమిది! అయితే ఆయన దురదృష్టంకొద్దీ ఆమరునాడే ముస్లింలీగుయొక్క అఖిలభారత అధ్యక్షుడు, మార్పుయొక్క ఛాయలైనా లేనట్టి పాతముస్లింలీగే తమపక్షమని ఒకపత్రికా ప్రకటన చేసినాడు. ఈనాడు కేరళలో ఒక స్వతంత్ర 'మోప్లానాడ్' కావాలని వారు బహిరంగంగా ప్రచారం చేస్తున్నారు.

ఈ పరిణామాలన్నిటినీ గమనించినప్పుడు, గత అర్ధశతాబ్దకాలం లోని సంఘటనలన్నీ మళ్ళీ ఒకసారి ప్రాణంపోసికొని ప్రత్యక్షం కాబోతున్నాయని ఎవరికైనా కనిపిస్తుంది. ముస్లిముల స్నేహాన్ని సంపాదించుకొనేందుకై మననాయకులు, 1920 ప్రాంతాల్లో టర్కీలో రాజును గద్దెదించినందుకు ప్రారంభమైన ఖిలాఫత్ ఉద్యమాన్ని – టర్కీ రాజును గద్దెదించిన బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా – తమ సొంతంగా భావించి అందులో పాల్గొనవలసిందిగా హిందువులను ఆదేశించినారు. ఆ ఉద్యమాన్ని బలపరుస్తూ కేరళలోకూడ ధనాన్నీ, ప్రజానీకాన్నీ సమకూర్చుకొని హిందువులు ముందుకు వచ్చినారు. కాని, ముస్లిములకు ఆంగ్లేయులపై ఉన్న కోపం, అంతలోనే 'కాఫిర్'లైనహిందువులపై 'జెహాద్'గా పరిణమించింది. దానితోబాటు హత్యలు, దహనాలు, మానభంగాలు, దోపిడీలు, బలవంతపు మతం మార్పిడులవంటి ముస్లిముల పాశవికదురంతాలు ఎప్పటివలెనే ఆరంభమైనాయి. ఒళ్ళు జలదరించే ఈ దురంతాలవార్తలు దేశంలోని ఇతర ప్రాంతాలకు అంది దిగ్భ్రాంతి కలిగిస్తే, నీచమైన ఆ ముస్లిము గూండాలను 'వీరమోప్లాలు' అని ఒక ప్రముఖ నాయకుడు బహిరంగంగా ప్రశంసించినాడు. ఆనాటి ఆ ప్రశంసావాక్యాలను, 'దేశభక్తియుతు'లని ముస్లిములను పొగడుతున్న ఈనాటి వాక్యాలను ఒక్కసారి పోల్చిచూస్తే జాతీయసంసిద్ధత, భద్రతల విషయంలో మన శక్తి సామర్థ్యాలను క్రుంగదీసిన ఆత్మహత్యాసదృశమైన చిరకాలమైకం ఎంతగా ఉందో అర్థమవుతుంది.

మనప్రభుత్వం, నాయకులు, రాజకీయపక్షాలుకూడ ప్రతిచోట ముస్లిములకు, వారియొక్క వేర్పాటు ధోరణులకు, విద్రోహచర్యలకు ప్రోత్సాహాన్ని కలిగిస్తున్నారు. 1963 లో తూర్పుపాకిస్తాన్‌లోని ఖుల్నా, నారాయణగంజ్, ఢక్కాప్రాంతాల్లో హిందువుల్ని మారణహోమం చేసినప్పుడు కలకత్తాలో జరిగిన కల్లోలాలను ఉదాహరణగా తీసుకుందాం. తూర్పుబెంగాల్లో జరిగిన కల్లోలాలకు అది ప్రతిక్రియ అని, అధికారంలో ఉన్న మనవారే నమ్మించటానికి ప్రయత్నంచేసినారు. అయితే యథార్థ మేమిటి? కలకత్తానగరంలో ప్రశాంతంగా సాగుతున్న విద్యార్థుల ఊరేగింపుపై ముస్లిములు దాడిచేయటంతో ఈ కలహాలారంభమైనాయి. వివేకానందస్వామియొక్క శతజయంత్యుత్సవ సందర్భంగా నిర్మించిన ఒక పెద్ద ప్రదర్శనశాలకు నిప్పుపెట్టి దానిలోని విలువైన ప్రదర్శన వస్తువులను వాళ్ళే భస్మంచేశారు. కలకత్తాలోని హిందువులు, వివేకానంద స్వామికి సంబంధించిన విశేషవస్తువులతో గూడిన ప్రదర్శనశాలను తగులబెట్టగలరని మతిస్థిమితం ఉన్న మనిషి నమ్ముతాడా? అటువంటి కిరాతకాలను ముస్లిములు చేయటానికారంభించిన పిదపనే, తమ్ముతాము సంరక్షించుకునేందుకు హిందువులు సంసిద్ధులైనారు. ఆ విధంగా కలకత్తా లోని కలహాలు, తూర్పుబెంగాలులోని కలహాల కొనసాగింపుగానే జరిగినవి గాని, ప్రతిక్రియగామాత్రం ప్రారంభంకాలేదని నిస్సందేహంగా తెలుస్తుంది.

మన ప్రభుత్వం ఎప్పటివలెనే, ఒకనాటి తమ ప్రభువులైన ఆంగ్లేయుల అడుగుజాడల్లో నడుస్తూ హిందువులపై విరుచుకపడి, ఆలోచనా రహితంగా వారిపై కాల్పులుజరిపింది. 'ప్రతి ఒక ముస్లింప్రాణం మనకు పవిత్రమైనది' అనికూడా కేంద్రమంత్రులలో ఒకరు ప్రకటించినారు. అసలు ప్రభుత్వమని చెప్పుకోదగిన ప్రతిదానికి, తనపాలనలోని ప్రతి ఒక్క ప్రాణమూ పవిత్రమైనదే కావలసిఉంది. కాని రక్షకభటులు జరిపిన కాల్పుల్లో ముస్లిములకన్న హిందువులే ఎక్కువగా చనిపోయారని ఆయన ఎంతో గర్వంగా చెప్పుకొన్నాడు.

ఈ ప్రకటనద్వారా, ప్రభుత్వంయొక్క నిజమైన ఆలోచన ఏమిటో ఆయన బయటపెట్టాడు. మనదేశంలో వ్యవహారాలు ఎట్లా నడుస్తున్నాయో ఇది చక్కగా సూచిస్తుంది.

## లెక్కలేనన్ని చిన్న పాకిస్తానులు

నిజానికి ఒక మసీదో, ఒక ముస్లిం నివాస ప్రాంతమో ఎక్కడఉంటే అక్కడంతా తమ స్వతంత్ర భూభాగంగా దేశవ్యాప్తంగా ముస్లిములు భావిస్తున్నారు. మేళతాళాలతో, పాటలతో హిందువుల ఊరేగింపు బయలు దేరితే చాలు, తమ మత విశ్వాసాలకు దెబ్బతగిలిందంటూ వారు రెచ్చి పోతుంటారు. తీయనిసంగీతం భరింపలెక వారి మతభావనలు, బాధపడేట్లయితే వారు తమ మసీదులను అడవుల్లోకి మార్చుకొని ప్రశాంతంగా అక్కడ ఎందుకు ప్రార్థనలు జరుపుకోరాదు? త్రోవప్రక్కన ఒక రాతినిపాతి, సున్నంవేసి, దానికొక ప్రార్థనప్రదేశమని పేరుపెట్టి, ఆ ప్రాంతంలో సంగీతం వినిపిస్తేచాలు, తమప్రార్థనలన్నీ పాడైపోతున్నాయని ఎందుకు గగ్గోలు పెట్టాలి?

కొంతకాలంక్రితం మనదేశాన్ని సందర్శిస్తున్న ఒక అరబ్బీమౌల్వీని వారిదేశంలో పఠించినరీతిగా, ఖురాను పఠించి వినిపించుమని కోరటం జరిగింది. అందుకు ఆయన "మేము మా దేశంలో హార్మోనియం; టాబర్ (తప్పెటవంటి ఒకవాద్యం) మొదలగు సంగీతవాద్యాలతో మేళవించి ఖురానును పఠిస్తాము. ఇక్కడ నేనావిధంగా చేస్తే స్థానికులైన మూర్ఖ ముస్లిములు నన్ను ముక్కలుగా నరికివేస్తార"ని సమాధానం చెప్పినాడు. ఈ దేశంలో ముస్లిములకు వారు భావించినట్లు సంగీతం గిట్టకపోవటానికి వారి మతానికి ప్రార్థనకు ఎట్టిసంబంధంలేదని, అది కేవలం హిందువులతో తగాదా పెట్టుకొని తమ చిన్న చిన్న స్వతంత్ర స్థావరాలను ఏర్పరచుకొనే కుతంత్రంతోనే ఏర్పడిందని దీన్నిబట్టి తెలియటంలేదా?

ఇటువంటి దౌర్జన్యపూరితము, జాతీయవ్యతిరేకమునైన చర్యలను ఇంత ధైర్యంగా వారెట్లా కొనసాగించగలుగుతున్నారు? మనప్రభుత్వంకూడ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, వారిని సమర్థిస్తోంది. కాబట్టే, వారు అట్లా చేయగలుగుతున్నారు. రహదారుల్లో మేళతాళాలతో ఊరేగేందుకు ప్రజలకు గల ప్రాథమికహక్కులను ఉన్నతన్యాయస్థానాలు బలపరచినప్పటికీ శాంతి సుస్థిరతలను కాపాడే నిమిత్తమై ఊరేగింపులను తమ ఇచ్ఛవచ్చినట్లు అదుపులో ఉంచవచ్చని ప్రశాసకులకు (ఎగ్జిక్యూటివ్) అప్పగించిన స్వతంత్ర నిర్ణయాధికారాన్ని (డిస్క్రిషనరీ పవర్స్) అడ్డుపెట్టుకొని, మన ప్రభుత్వం, మసీదులుఉన్న వీథులగుండా ఊరేగింపులు తీయటానికి తరచు హిందువులను పూర్తిగా అడ్డుపెడుతున్నది. శాంతిని భగ్నం చేయదలచిన వారికే అది ప్రయోజనకారిగా ఉంటుంది. అందువలన శాంతికాముకులైన ప్రజలు ఒకదేశపు పౌరులుగా తమకు సహజంగా లభించిన హక్కులు అనుభవించలేకపోతున్నారు; శాంతి విధ్వంసక చర్యలకు బలిఔతున్నారు. చట్టసమ్మతంగా జీవించే ప్రజలను అదుపులోఉంచి, ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తించేందుకై హింసాపరులైనవారికి స్వేచ్ఛ ఇస్తున్నారు. దీన్నిబట్టి చూచినప్పుడు, ముస్లింస్థావరాలు–అంటే "చిన్న చిన్న పాకిస్తాన్‌లు" – చాలా ఉన్నాయనీ, అక్కడ ఈదేశపు చట్టాలు, కొన్నిసవరణలతోనే అమలుజరుగుతాయనీ, అక్కడ తుంటరులదే ఇష్టారాజ్యం అనీ, ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా, అంగీకరించటమే కాగలదు. పరోక్షంగానైనా ఈమాటను అంగీకరిస్తే అందులో మన జాతీయజీవనాన్నే పూర్తిగా భగ్నంచేసేందుకుకూడా అవకాశాలు కల్పించే సిద్ధాంతం ఇమిడి ఉన్నదని తెలుస్తుంది. అటువంటి 'స్థావరాలు' ఈదేశంలోని పాకిస్తానీ అనుకూల వర్గాల కార్యకలాపజాలానికి కేంద్రాలుగా ఉన్నాయి.

## ఉదాహరణ పరంపర

1963 లో మహారాష్ట్రలోని మాలేగాంవ్‌లో జరిగిన కల్లోలాన్ని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చును. జలనిమజ్జనానికి గణపతి

విగ్రహం ఊరేగింపుగా వెళ్ళుతోంది. ముస్లిములు ఆ ఊరేగింపుపై దాడి చేశారు. దాంతో గలాటా చెలరేగింది. ఎప్పటివలెనే ప్రభుత్వం శాంతి భద్రతలను ఏర్పరచేందుకు సిద్ధమై, కల్లోలానికి బాధ్యులని భావించి కజన్లకొద్దీ మర్యాదస్తులైన హిందువులను నిర్బంధించింది. ఆ తరువాత ఆ రాష్ట్రప్రభుత్వంలోని ఒక ఉన్నతాధికారిని నేనొకసారి కలవటం జరిగింది. అప్పుడు ఆయనతో "ఈ సంఘటన రాత్రిపూట 9, 10 గంటల ప్రాంతంలో జరిగింది. ఆ నగరంలో పెద్దపెట్టున ముస్లిములను హత్యచేయటం జరిగిందంటూ పాకిస్తాన్ రేడియో ఆ మరునాటి ఉదయమే ప్రసారం చేసింది. కొద్ది గంటలవ్యవధిలో ఈ సంగతి పాకిస్తానుకు ఎట్లా తెలిసింది ? తనవద్ద ప్రసారిక (ట్రాన్సుమిటర్) గల ఒక పాకిస్తానీ ఏజెంట్ ఎవరో ఒకరచట ఉండితీరాలి. అతడు పాకిస్తాన్‌తో సర్వదా సంబంధాలు కలిగి ఉండి ఉండాలి" అని అన్నాను. 'అవును అట్లా జరగటానికి అది ఒకటే అవకాశంగా కనిపిస్తోంది'అన్నాడాయన. 'ప్రధానమంత్రిగృహంలో రహస్య సమావేశాల్లో చర్చించిన ఎంతో రహస్యాలనుకొన్న విషయాలుకూడా రాత్రికిరాత్రే పెకింగుకు, రావల్పిండికి చేరుతున్నాయన్న వార్తలు మీరు విన్నారా?' అని మళ్ళీ నేనడిగినాను. 'అవును ఆ విషయం నాకు తెలుసు' అన్నాడాయన.

దీని సారాంశం : ఈ దేశంలో దాదాపు ప్రతిచోటా, పాకిస్తాన్‌తో నిత్య సంబంధాలు ప్రసారికద్వారా కలిగిఉంటూ, ఒక సామాన్య పౌరుడు అనుభవించే హక్కులుమాత్రమేగాక, 'అల్పసంఖ్యాకవర్గా'లన్న పేరున కల్పించిన ప్రత్యేక సదుపాయాలను, సానుభూతినిగూడ అనుభవిస్తూన్న ముస్లిములున్నారని తేలింది. మనజాతియొక్క మనుగడనే దెబ్బతీయటానికి యత్నించే ఆ యా వర్గాల విషయంలోకన్న, దేశభక్తులైన వ్యక్తుల విషయంలోనే మన రహస్య సమాచారశాఖ అధికశ్రద్ధను చూపుతున్నట్లు అనిపిస్తుంది.

కొంతకాలం క్రిందట, ఉత్తరప్రదేశ్ శాసనసభలోని ఒక సభ్యుడు ఒక్క లక్నోనగరంలోనే అనేక ట్రాన్స్‌మిటర్లు చురుకుగా పనిచేస్తున్నాయనీ, వాటిని వెలికిలాగే దమ్ములు రక్షక (పోలీసు) శాఖకు ఉంటే తానందుకు ఆచూకీ ఇస్తాననీ సభాముఖంగా ఒకసవాలు విసిరినాడు. ఇంతవరకు ఆ మాటలను ప్రభుత్వం వినిపించుకొన్నట్లు కనబడలేదు! ప్రభుత్వమే తమ పక్షాన ఉన్నదన్నట్లుగా శత్రువుల తొత్తులు, తమయొక్క కుతంత్రాలను ఎంతో ఉత్సాహంగా ఇచట కొనసాగిస్తున్నారంటే ఆశ్చర్యంలేదు. అటువంటివారు అత్యున్నత పదవుల్లోనూ, కీలక స్థానాల్లోకూడా ఉండి ఉండవచ్చు. ఐతే మనంమాత్రం ఒక అగ్నిపర్వతశిఖరాన కూర్చుండికూడా 'సెక్యులర్' ఊహాలోకంలో.అంతా చాలా బాగా ఉందని కలలు గంటున్నాం.

## ఘనులైన "జాతీయ ముస్లిములు"

కాబట్టి ఇప్పటికైనా మనం మేల్కొని, మనచుట్టూ కలయచూచికొని అతిముఖ్యులైన ముస్లింనాయకుల మాటలయొక్క, చేతలయొక్క నిజమైన అర్థాన్నికూడా పరిశీలిద్దాం. 'జాతీయముస్లిము'ల్లో మహామహు లనబడేవారి నిజస్వరూపాన్ని వారిమాటలే ఈనాడు బట్టబయలు చేస్తున్నాయి.

స్వాతంత్ర్య పోరాటంయొక్క తొలిరోజులలో మహాత్మగాంధీకి కుడిభుజమైన మౌలానా మహమ్మదాలీ "ముస్లిముల్లో పరమపాపి, వ్యభిచారి అయినవాడుకూడ నా దృష్టిలో మహాత్మాగాంధీకంటె ఉత్తముడు" అంటూ ఒకసారి కాదు, అనేకపర్యాయాలు బహిరంగంగా ప్రకటించినాడు.

మనదేశంలోని సూఫీతెగకు చెందిన ఒక మహావిద్వాంసుని నేనొక సారి కలసి మాట్లాడే అవకాశం ఏర్పడింది. దేవుడు లేడని చెప్పే సామ్య వాద సిద్ధాంతపు సవాలు నెదుర్కొనేందుకుగాను, భగవంతునిపై విశ్వాస మున్న వ్యక్తులందరనూ ఏ సంప్రదాయానికి, ఏ మతానికి చెందిన వారైనప్పటికీ - ఒకచోట చేర్చటమొక్కటే మార్గమని అంటున్నాను. 'ఏ వేదికపైన అట్టివారందరూ ఒకటిగా కలవగలరు' అని ఆయనను అడిగాను.

క్షణమైన తరబాటులేకుండా 'ఇస్లాం' అట్టి వేదిక కాగలదని అతడు వెంటనే సమాధానం చెప్పినాడు. వారిలోని పెద్దవిద్వాంసులు, తత్త్వవేత్తలు అనబడేవారి ఆలోచనలుకూడ ఆవిధంగా పనిచేస్తుంటాయన్నమాట!

ఈ మధ్యకాలంలో, అతిఘనుడని భావింపబడిన జాతీయముస్లిమ్ మౌలానా అజాద్‌కూడ తన చివరిరోజుల్లో 'ఇండియా విన్స్ ఫ్రీడమ్' అన్న పుస్తకంలో సుస్పష్టంగా తన మనోభావాలను వ్యక్తంచేసినాడు. మొదటినుంచి చివరిదాకా ఆ పుస్తకం మోమోటమిలేని ఆత్మస్తుతితో నిండిఉంది. గాంధీ నెహ్రూలవంటి ఇతర నాయకుల్ని వెఱ్ఱిబాగులవాళ్ళగాను, పటేల్‌ను మతతత్త్వవాదిగానూ వర్ణించటం అందులోని మొదటి విషయం. కలకత్తా నౌఆఖాలీ వంటి అనేకచోట్ల హిందువులపై ముస్లిములు కొనసాగించిన దురంతాలను, మారణహోమాన్ని విమర్శిస్తూ ఒక్కమాటైనా ఆ పుస్తకంలో వ్రాయకపోవటం రెండవ విషయం. వీటన్నిటికన్నా ముఖ్యంగా చెప్పవలసిందేమంటే, పాకిస్తాన్ ఏర్పాటు ముస్లిముల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉంటుందన్నదే పాకిస్థాన్ నిర్మాణానికి ఆయన పదేపదే అడ్డుచూపిన ముఖ్యకారణం. దీనిసారాన్ని అజాద్ మాటల్లో చెప్పాలంటే ముస్లిములు మూర్ఖులై జిన్నా అడుగుజాడల్లో నడచినారనీ, అందువల్ల వారు ఈ భూమిలో ఒక చిన్నభాగం మాత్రమే సాధించుకోగలిగారనీ, అట్లాకాకుండా వారు తన సలహాను పాటించి ఉండినట్లయితే పాకిస్తాన్ స్థాపనవలన వారు పొందిన ప్రయోజనాలన్నిటితోబాటు మొత్తం దేశ వ్యవహారాల్లో వారిమాట ఎట్టి నిర్ణయాన్నైనా నిష్కర్షచేయగలిగిన స్థితిలో ఉండిఉండేదన్నమాట. సర్వోచ్చన్యాయస్థానం (సుప్రీం కోర్టు) యొక్క భూతపూర్వ ప్రధాన న్యాయాధిపతి శ్రీ మెహర్‌చంద్ మహాజన్ మహోదయుడుకూడ, ఆ పుస్తకం గురించి ఇటువంటి అభిప్రాయాన్నే వ్యక్తంచేసినారు. ఉదాహరణకు చెప్పాలంటే "మౌలానాఅజాద్, జిన్నాకన్న చాలా మాయావి; అతనికి బాధ్యత అప్పగింపబడిఉంటె భారతదేశం ఈనాటికి ముస్లిముల అధీనమై ఉండేది" అన్నారాయన.

## సత్యాన్ని గుర్తించాలి

ప్రభుత్వంలోగాని, బయటగాని ఉన్నతస్థానాల్లో ఉన్న ముస్లిములు ఈనాటికికూడా, పూర్తిగా జాతీయవ్యతిరేకమైన సమావేశాల్లో బహిరంగంగా పాల్గొంటున్నారు. వారి ఉపన్యాసాలుకూడా ప్రత్యక్షమైన వ్యతిరేకత, తిరుగుబాట్లను గురించి ప్రబోధిస్తున్నాయి. కేంద్రంలోని ఒక ముస్లిం మంత్రి అటువంటి ఒక సమావేశంలో మాట్లాడుతూ, ముస్లిముల ప్రయోజనాలను చక్కగా సంరక్షించకపోతే ఈదేశంలోగూడ, స్పెయిన్‌లో జరిగిన కథ మళ్ళీ జరుగుతుందని హెచ్చరించినాడు. అంటే ఇక్కడకూడా సాయుధ విప్లవం లేవదీస్తామని ఆతని భావం.

అనేక ప్రాంతాల్లో ముస్లింలీగు పేరుమీదనే ఎన్నికలలో పోటీ చేయటమేకాక తమ బహిరంగసభల్లోను, ఊరేగింపుల్లోను తప్పనిసరిగా 'పాకిస్తాన్ జిందాబాద్' అనే నినాదాలుగూడా చేసేటంతటి ధైర్యాన్ని ఈనాడు వారు పుంజుకున్నారు. ఏ ప్రదేశంలో వారి విశృంఖలమైన అధికారం స్థిరంగా ఏర్పడిందో ఆ ప్రదేశాలు మాత్రమే వారిదృష్టిలో 'పాక్'గా అంటే పవిత్రంగా కన్పిస్తాయి. భారతదేశంలోని మిగిలిన ఏ భూభాగాల్లో వారు జీవిస్తూ వికాసం చెందుతున్నారో అట్టి ప్రాంతాలన్నీ వారిదృష్టిలో 'నాపాక్'–అంటే అపవిత్రమైనవి. ఎంతటి పతనస్థితికి దిగజారిపోయిన పుత్రుడైనాసరే కన్నతల్లిని అపవిత్ర అనీ, పాపాత్మురాలనీ అనగలడా? ఐనప్పటికి అటువంటి వర్గాలవారుకూడ ఈభూమికి సంతానమే అని నమ్మం, అంటారు.

పాకిస్థాన్ నిర్మాతలు 'పాకిస్తాన్' అనే పేరు పెట్టుకోవటమే వింత. పాకిస్తాన్‌కంటే మక్కా మదీనాలు కూడా తక్కువ పవిత్రమైనవని గూడా అంగీకరించినట్లే. పాకిస్తాన్‌తో పోలిస్తే అవి 'నా–పాక్' అవుతాయి.

ఆత్మహత్యాసదృశమైన ఇట్టి ఊహాలోక విహారాలు పరిస్థితి అదుపు తప్పకముందే అరికట్టాలి. జాతీయభద్రత నమైక్యాలు ఒక్కటే పరమ లక్ష్యంగా పెట్టుకొని, కఠోరమైన యథార్థ స్థితిగతులను ఎదుర్కొందాం.

# 6. అంతర్గత ప్రమాదాలు

## 2. క్రైస్తవులు

పైపైన ఆలోచించేవారికి క్రైస్తవులవలన ఏ ప్రమాదం లేదు అనిపిస్తుంది. అంతేగాదు, మానవజాతిపట్ల మూర్తీభవించిన ప్రేమాభిమానులవలె వారు కనపడతారు. మానవజాతిని ఉద్ధరించేందుకు ప్రత్యేకం భగవంతునిచే పంపబడినట్లుగా, వారి ఉపన్యాసాల్లో 'సేవ' 'మానవ మోక్షము' వంటి మాటలు కొల్లలుగా ఉంటాయి. ప్రతిచోట వారు పాఠశాలలు, కళాశాలలు, వైద్యశాలలు, అనాథశరణాలయాలు నడుపుతూ ఉంటారు. మన అమాయక ప్రజను ఇవన్నీ ఆకర్షిస్తున్నాయి. ఈకార్యకలాపాలన్నిటిలోనూ, కోట్లకొలది రూపాయలు మంచినీళ్ళలాగా ఖర్చుపెట్టడంలో క్రైస్తవుల దురుద్దేశం అసలేమిటి ?

### కోరలు, గోళ్ళు బయటపడ్డాయి

మన మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఒకసారి అస్సాం వెళ్ళారు. అచట కొండ ప్రదేశాల్లో క్రైస్తవ మతప్రచారకులు స్థాపించిన పాఠశాలల్ని, వైద్యశాలల్ని సందర్శించి వాటిని ఎంతో మెచ్చుకున్నారు.

కాని చివరకు వాళ్ళకొక సలహాకూడా ఇచ్చినారు. 'మీరు ఎంతో మంచి కృషిచేశారు. ఏమాత్రం సందేహంలేదు; అయితే ఈపనుల్ని మతంమార్పిడికై వినియోగించుకోకండి' అన్నారు. కాని తర్వాత ఉపన్యసించిన క్రైస్తవ మత ప్రచారకుడు 'కేవలం మానవతపై అభిమానంతోనే ఈ పనులన్నీ చేసేట్లయితే, మేము ఇంతదూరమెందుకు రావాలి ? ఇంత ధనాన్ని ఇక్కడ ఎందుకు క్రుమ్మరించాలి ? మా ప్రభువైన ఏసుక్రీస్తుయొక్క అనుయాయుల సంఖ్యను పెంచటంకోసమే మేము ఇక్కడ ఉన్నాం" అని మోమోటమి లేకుండా చెప్పినారు. ఆ విషయంలో వారు చాలా స్పష్టంగా ఉన్నారు.

ఈ లక్ష్యసిద్ధి కొరకు ఎంతటి నీచమైన పథకం ప్రయోగించినప్పటికీ న్యాయమేనని వారు భావిస్తారు. మతంమార్పిడికై వారువేసే ఎత్తులు, జిత్తులు అందరికి బాగాతెలిసినవే. గత జనాభాలెక్కల్లో క్రైస్తవ ప్రచారకులు ఒక గ్రామంలోని ప్రజలందరినీ క్రైస్తవుల పేరున నమోదు చేయించిన ఉదాహరణ ఒకటి ఉంది. ఈ మోసంతెలిసికొన్న తర్వాత, అచటిప్రజలు అభ్యంతరం చెప్పగా, "ఇప్పుడింక చేయగలిగిందేమీలేదు. ప్రభుత్వపు లెక్కల్లో మీరు క్రైస్తవులుగా నమోదు అయ్యారు; కాబట్టి ఇకనుంచి మీరు క్రైస్తవులుగానే నడుచుకోవాలి" అని క్రైస్తవప్రచారకులు వారికి చెప్పినారు. తమతోటివారిగురించి పట్టించుకొనని హిందూసమాజంయొక్క సహాయానికి నోచుకోని ఆ అమాయక హిందూగ్రామీణులు, వారి మాటలను నమ్మి క్రైస్తవమతాన్ని స్వీకరించినారు. ఇటువంటి మోసాలద్వారా క్రైస్తవులు తమ జనసంఖ్యను రోజురోజుకీ పెంచుకొంటున్నారు.

ఈ దేశాన్ని 'క్రీస్తుయొక్క సామ్రాజ్యంలో ఒక ప్రాంతంగా చేయటం' ఒక్కటే తమ ఏకైక లక్ష్యమని, అనేక ప్రముఖ క్రైస్తవ ప్రచారకులు సుస్పష్టంగా ఎన్నోసార్లు ప్రకటించినారు. భారత్‌మొత్తంపై క్రైస్తవ ధ్వజాన్నెగురవేయటమొక్కటే తమ ఏకైకలక్ష్యమని, మధురై ఆర్చిబిషప్పు చెప్పినట్లుగా, మద్రాసునుంచి ప్రచురింపబడే 'వేదాంతకేసరి'లో వార్త.

ఈమధ్య బొంబాయిలో జరిగిన ప్రపంచక్రైస్తవ మహాసభలో (యూకరిష్టు కాంగ్రెసు) కార్డినల్ గ్రేషస్ "భారతదేశంలో వందలాది ఏండ్లు మతాంతరీకరణ ప్రయత్నం చేసినతరువాతకూడ 60 లక్షల కాథలిక్కులే ఉన్నారని, అధికసంఖ్యాకులు ఇంకా హిందువులుగానేమిగిలిపోయినారు" అని వాపోయినాడు. ఇటుపైన మతాంతరీకరణ ఉద్యమంలో ప్రతిఒక్కరు తానొకప్రచారకుడుగా భావించుకోవాలని ఆయన తన అనుచరులందరికీ ఉద్బోధించినాడు. ఇదంతా దేన్ని సూచిస్తుంది? ఈదేశంలో ఉన్నవారందరినీ క్రైస్తవమతంలోకి మార్చాలని దాని అర్థం. అంటే తరతరాల వారసత్వంగా తమకుసంక్రమించిన ధర్మాన్ని, తత్త్వజ్ఞానాన్ని, సంస్కృతిని, జీవనపద్ధతిని నాశనంచేసికొని యిక్కడిప్రజలంతా ప్రపంచక్రైస్తవసమాఖ్యలో విలీనమయి పోవాలని దాని అర్థం.

## మతమా ? రాజకీయమా ?

నవీనకాలంలో మతాంతరీకరణకు ఉద్యమించిన మతాల్లో నిజమైన మతమంటూ ఏదీలేదని ఇతరులపట్ల వారు ప్రవర్తించే తీరునుబట్టి తప్పక నిర్ధారణచేసికోవలసివస్తుంది. దేవుడు, ప్రవక్త, మతము అనేపేర్లుచెప్పుకొని తమ రాజకీయదురాశలను తీర్చుకొనేందుకు వారు యత్నిస్తున్నారు. నిజమైన మతంప్రకారం మతాలమార్పిడికి స్థానంలేదు; ఆరాధనాపద్ధతిని మార్చుకోవలసిన అవసరం లేదు. ప్రాచీనకాలంలో సుదూరదేశాలకు ప్రయాణంచేసిన మన ధర్మప్రచారకులు ఇతర ప్రజలమీద తమధర్మాన్ని బలవంతంగా రుద్దలేదు. పైగా, వారు అచటి ఆరాధనాపద్ధతిని కాదనకుండా, మన సమగ్రమైన దర్శనాన్ని దానికి జోడించి, మరింత పటిష్ఠంగా, ఉదాత్తంగా మలచి, వారి హృదయంలోనూ, ఆలోచనలలోనూ, ఉదారతను స్వచ్ఛతను కలుగజేశారు; అచటి ఆరాధనాపద్ధతిలోనే వారిని మరింత చక్కని ఆరాధకులను చేయటానికి యత్నించినారు. నిజమైన 'ధర్మం' అదీ.

క్రైస్తవులు ప్రచారంచేస్తున్న మతభావన ఎంతో ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఒకసారి నేనొక క్రైస్తవ ప్రచారకుణ్ణి కలిసినాను. ఇంగ్లండులోని ఒక ఆర్చిబిషప్పు వ్రాసిన ఒక పుస్తకాన్ని ఆయన నాకిచ్చి అది తమ కార్యకలాపాల స్వభావాన్నంతటినీ స్పష్టంచేస్తుందని చెప్పినాడు. నేను దాన్ని చదివినాను. నేనాపుస్తకాన్ని ఆయనకు తిరిగిఇచ్చివేసినప్పుడు 'పుస్తకమెట్లా ఉన్నద'ని ఎంతో కుతూహలంతో అతడు నన్నడిగినాడు. 'మీ ఆర్చిబిషప్పే అటువంటివాడయితే, ఇంక మీగతేమిటి?' అని అన్నాను. నా సమాధానం ఆయన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. అప్పుడు ఆ పుస్తకంలో నుంచి కొన్ని భాగాలను ఆయనకు చూపించినాను. దానిలో దేవుణ్ణి చేరుకునేందుకు రోజుకు రెండుసార్లు ప్రార్థనచేస్తూ, ఆదివారంనాడు చర్చికి వెళ్ళివస్తూఉంటేచాలు; ఇతర సమయాల్లో, ఎటువంటి భౌతిక సుఖానుభూతులలో మునిగితేలినా ప్రమాదంలేదని వ్రాసి ఉంది. ఒక మహాద్రష్టయైన ఏసుక్రీస్తు చేసిన ప్రబోధానికి, ఈ వాక్యాలు పూర్తిగా విరుద్ధంగా ఉన్నాయి.

"నీ ప్రతిష్ఠకు దోహదంచేసేటప్పుడు, నే ననసత్యమాడితే అది తప్పు ఎలా అవుతుంది" అని క్రీస్తుయొక్క ప్రముఖ శిష్యుల్లో ఒకడైన సెయింట్‌పాల్ భగవంతుణ్ణి ఉద్దేశించి చెప్పినట్లుగా "గీతా రహస్యం'' అన్న గ్రంథంలో లోకమాన్య తిలక్ ఉదాహరించినారు. ఈనాటి క్రైస్తవప్రచారకులు తమ కుతంత్రాలను ఇంకా కొనసాగించుకొనేందుకు గాను, పైవాక్యాన్నే బాగా ఉపయోగించుకొంటున్నారనడంలో ఆశ్చర్య మేమీలేదు. "నిజమైన క్రైస్తవుడు ఒకడే ఒకడున్నాడు. అతడు శిలువ మీద చనిపోయినాడు'' అని చెప్పబడినవాక్యంలో ఎంతో సత్యం ఉంది.

## నిష్పక్షపాత నిర్ణయం

వారి కార్యకలాపాలు ధర్మవిరుద్ధాలు మాత్రమేకాదు; జాతీయతకు వ్యతిరేకమైనవికూడా. మన పవిత్రగ్రంథాలను, దేవతలను, ఎందుకు

నిందిస్తున్నారో చెప్పమని నేనొకసారి ఒక క్రైస్తవప్రచారకుని ప్రశ్నించినాను. "హిందువుల హృదయంలోని విశ్వాసాన్ని ధ్వంసం చేయాలి; అప్పుడు అతని జాతీయతకూడ భ్రష్టమౌతుంది. దానితో అతని మనస్సులో శూన్యం ఏర్పడుతుంది. అప్పుడు ఆశూన్యంలో క్రైస్తవం ప్రవేశపెట్టటం మాకు సులువవుతుంది" అని అతడు మేమోటమి లేకుండ చెప్పినాడు.

కొన్ని ఏండ్లక్రితం ఈ క్రైస్తవ ప్రచారకుల కార్యకలాపాలను పరిశీలించేందుకుగాను, మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఒకసంఘాన్ని నియమించింది. ఏ పార్టీకి, ఏ వర్గానికి చెందనివాడు, గౌరవ మర్యాదలు కలిగినవాడు, పదవీ విరమణ చేసిన ఉన్నతన్యాయస్థాన న్యాయాధికారి అయిన శ్రీ నియోగి ఆ సంఘానికి అధ్యక్షుడు. ఆ సంఘం మధ్యప్రదేశ్ అంతటా పర్యటించి మతాంతరులైన క్రైస్తవులను, మతప్రచారకులను, ఇతర ప్రజలనుగూడ కలిసి ముచ్చటించి, అనేక 'చర్చి' లను కూడా సందర్శించింది. తాను స్వయంగా కొనసాగించిన ఈ పరిశీలనలు ఆధారంగా ఆ సంఘం ఒక పెద్ద నివేదికను తయారుచేసింది. "క్రైస్తవ ప్రచారకులయొక్క ఔదార్యమంతా, తమయొక్క మతాంతరీకరణపద్ధతిని కొనసాగించుకోవటానికి కేవలం ముసుగువంటిది మాత్రమే. ఒకసారి భయపెట్టి, మరొకసారి ఆశ చూపి అమాయకప్రజలను మార్చేందుకే ఇది ఉపయోగపడుతున్నది, తమ సంఖ్యాబలాన్ని పెంచుకొని దాన్ని ఆధారంగాచేసుకొని తమకొక స్వతంత్ర క్రైస్తవరాజ్యాన్ని ఏర్పరచుకోవాలనే కోర్కెయే వారి కార్యకలాపాలన్నిటికీ అసలుకారణం. ఆ ఏకైకలక్ష్యంకోసం వారు లెక్కలేనన్ని కోట్ల రూపాయలు వ్యయంచేస్తున్నారు". ఇది ఆ నివేదికయొక్క సారాంశం.

## 'ఫాదరీస్తాన్' కోసం

అస్సాంలో నాగాలాండ్ ఏర్పాటు ఇందుకొక ప్రత్యక్షనిదర్శనం. క్రైస్తవప్రచారకులే నాగాకొండలలో కొనసాగుతున్న బహిరంగ విప్లవాన్ని

నడిపిస్తున్నారని పండిత నెహ్రూకూడ అంగీకరించారు. అక్కడ ప్రశాంతత ఏర్పడిందంటూ మన ప్రభుత్వం విసుగు విరామం లేకుండా పదేపదే ప్రకటన చేస్తూఉంటుంది. ఆమరునాడే ఒకరైలు దోచుకున్నారనో, ఒక వంతెన కూల్చివేశారనో, మన సైనికులను దొంగపోటు పొడిచారనో, చంపేశారనో వార్తలు వస్తూనేఉన్నాయి. అంతటి భారీయెత్తున ఆయుధాలు, మందుగుండు సామాగ్రి తిరుగుబాటుదార్లకెలా లభించినవని లోకసభలో ప్రశ్నలువేస్తే గడచిన ప్రపంచయుద్ధ కాలంలో పారిపోతున్న జపానీయులు ఆయుధాలను వెంటమోసికొనిపోలేక వాటినన్నిటిని అడవులలో పారవేసినారని, వాటిని నాగాలు స్వాధీనం చేసికొన్నారని ఒక సమాధానం ఇచ్చారు. కాని తరువాత ఒకవార్త పత్రికల్లో వచ్చింది. దానిప్రకారం తిరుగుబాటుదారులు మన సైనికులతో ఒకసారి తలబడినపుడు కొందఱు తిరుగుబాటుదారులు చనిపోయారని, వారి ఆయుధాలు పట్టుబడ్డాయని తెలిసింది. అవి సరిక్రొత్త అమెరికా సరుకు. అవి 1955-56 సం॥రంలో ఉత్పత్తి చేయబడినట్లు వాటిపై ముద్రలున్నాయి. 1955-56 లలో ఉత్పత్తి చేయబడిన ఆయుధాలు 1944 ప్రాంతంలో నాగాలు సంపాదించుకొన్నారని నమ్మండి అని మన నాయకులు మనకు చెపుతున్నారు. అధునాతనమైన విమానవిధ్వంసక తుపాకులుకూడ నాగాలవద్ద ఉన్నాయని అంటున్నారు. ఈ ఆయుధాలు వారికి ఎట్లా చేరినవనే విషయంకూడ స్పష్టమే. పాకిస్తాన్‌కు చేరిన అమెరికా ఆయుధాలు అస్సాంలోని క్రైస్తవ మిషనరీలకు అందినాయి.

ఆ విధంగా వారి తిరుగుబాటు కొనసాగింది. మననాయకులు ప్రస్తుతానికి వారి కోర్కెను కొంతవరకు అంగీకరించి నాగాల్యాండ్‌ను ఏర్పాటుచేసినారు. దేశంలోని అన్ని ప్రాంతాలనూ పర్యవేక్షించే దేశీయాంగ మంత్రిత్వశాఖ అధీనంలోకాకుండా కేవలం విదేశాంగశాఖ అధీనంలో ఈ నాగాల్యాండ్ ఉండటం ఒక దుశ్శకునం. ఏ ఒత్తిడిచేత ఇట్టి ప్రత్యేక సదుపాయం నాగాలాండ్‌కు కల్పించారోగాని అదిమాత్రం ఇంకా ఈనాటికీ

అట్లాగేఉంది. ఆ ఒత్తిడి రెండువిధాలుగా వచ్చింది. ఆంతరంగికంగా ఇంకా కొనసాగుతూ, తాము పొందిన సగం విజయంవలన క్రమంగా వేగాన్ని తీవ్రతను పుంజుకొంటున్న తిరుగుబాటుయొక్క ఒత్తిడి వాటిలో మొదటిది - నాగాల్యాండ్‌ను ఏర్పాటుచేయాలనే నిర్ణయం తీసికొన్న తరువాతకూడ మన విమానాల్లో ఒకటి కూల్చివేశారు. రెండవ ఒత్తిడి అంతర్జాతీయమైనది. తిరుగుబాటు నాగానాయకుడైన ఫిజో పాకిస్తాన్‌యొక్క, తదితరులయొక్క సహకారంతో మనదేశంనుండి మాయమై ఇంగ్లండు చేరినాడు. మైకేల్‌స్కాట్ అను సుప్రసిద్ధ క్రైస్తవ ప్రచారకుడు అతనికి ఆశ్రయమిచ్చినాడు. మన ప్రతిష్ఠకు భంగకరమైన అనేక ప్రకటనలు అతనిచేత ఉద్దేశపూర్వకంగా స్కాట్ చేయించినాడు. అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులుంటేచాలు అని, వాటికై ప్రాకులాడే మననాయకులు ప్రపంచంలో శాంతిదూతలమనే పేరు పోయేదానికన్న నాగాలాండ్‌ను ఇచ్చివేయటమే మంచిదని భావించినారు. ఆవిధంగానే వారికి మరింత స్వతంత్రప్రతిపత్తినిచ్చే యోచనతో ఇప్పుడు నాగావిద్రోహులతో శాంతి సంభాషణలు ప్రారంభించినారు. ఆ మైకేల్ స్కాట్ అనే పెద్దమనిషినికూడ శాంతి సంఘంలో సభ్యుడుగా చేర్చుకొన్నారు. శాంతిదూతలని తమ్ముప్రచారం చేసుకొనేందుకుగాను దేశ విభజన ఒక అల్పమూల్యంగానే తోచింది మననాయకులకు. అంతర్జాతీయ మైన ఒత్తిడికూడ పెరుగుతూంది. కాబట్టి అచిరకాలంలోనే నాగాల్యాండ్ క్రైస్తవ దురహంకారులతో నిండి, వారి అధీనంలో ఒక స్వతంత్రరాజ్యంగా ఏర్పడినా ఆశ్చర్యంలేదు.

## ప్రపంచ క్రైస్తవ వ్యూహానికి ప్రతినిధులు

అస్సాంలోని షిల్లాంగ్ పరిసరాలలో మరో ప్రత్యేకపర్వతరాజ్యం కోసం అచటి క్రైస్తవ ప్రచారకుల ప్రోత్సాహంతో అప్పుడే ఒక కోరిక తలయెత్తింది. ప్రత్యేక ఝార్కండ్ కావాలి అంటూ బీహారులోనివా రప్పుడే ఒక ఆందోళన కొనసాగిస్తున్నారు. అయితే వారి కోర్కెలన్నీ

అసందర్భమైనవనిన్నీ, వాటిని తీర్చే ప్రసక్తేలేదని మన నాయకులు స్పష్టంగా ప్రకటించినారు. మన నాయకులు ఒక కోర్కెను అర్థరహితమని, జాతీయ వ్యతిరేకమని ఎంతోగట్టిగా చెప్పినారంటే, అప్పటికే వారు దాన్ని అంగీకరించాలి అని మనసులో నిర్ణయించుకొనే ఉంటారని మన అనుభవం చెప్తున్నది. కనుక మనం భవిష్యత్తులో ఏమి జరుగబోతుందో కచ్చితంగా చెప్పలేం. దేశవిభజన విషయంనుంచి నాగాలాండ్ ఏర్పాటువరకు మనకు కలిగిన అనుభవం ఒకేతీరుగా ఉంది.

సామ్యవాదప్రభుత్వానికి వ్యతిరేకంగా కేరళలో ప్రజాఉద్యమం లేచినసమయంలో అది కేరళలోని క్రైస్తవమతప్రచారసంస్థలకు జీవన్మరణ సమస్య అని క్రైస్తవనాయకులు అంటూఉండేవారు. 'కేరళను కేథలిక్కులైనా పాలించాలి; లేదా సామ్యవాదులైనా పాలించాలి; కాని మేమే పాలించ దలచినాము' అనికూడ వారు ప్రకటించినారు.

కొన్ని ఏండ్లక్రితం ఐరోపాలో ఒక అంతర్జాతీయ క్రైస్తవ ఫాదరీ సమ్మేళనం జరిగింది. అందులో పంచిపెట్టిన ఒక కరపత్రం, మనదేశంలోని సముద్రతీరం పొడవునా, మధ్యభాగంలో అడ్డంగా వింధ్య, సాత్పురా పర్వతశ్రేణుల్లోను, క్రైస్తవ ప్రాభవంకల కేంద్రాలను నెలకొల్పేందుకు ఒక సమగ్రపథకం వివరించింది. ఆవిధంగా దక్షిణద్వీపకల్పాన్ని చుట్టుముట్టి దాన్ని క్రైస్తవుల ఆధిపత్యంలోనికి లాగాలనేది మొదటిదశ; రెండవ కూపులో హిమాలయ పర్వతప్రాంతమంతా స్వాధీనం చేసుకోవాలి.

మన దేశంలోని క్రైస్తవమతప్రచారక సంస్థలకు, ముస్లింలీగుకు మధ్య ఒకఒప్పందం కుదిరిందనీ, దానిప్రకారం వారిద్దరూకలసి పనిచేయాలనీ పంజాబునకు మణిపూరుకు మధ్యఉన్న గంగా మైదానమంతా ముస్లింలకు చెందేట్లు, దక్షిణభారత ద్వీపకల్పం, హిమాలయాలు క్రైస్తవులకు చెందేట్లున్ను దేశంమొత్తాన్ని వారిద్దరూ పంచుకోవాలని నిర్ణయించుకొన్నారనే వార్త కొద్దికాలంక్రితం పత్రికల్లో పొక్కింది.

కొద్ది ఏండ్లక్రితం అఖిలభారత క్రైస్తవసమ్మేళనం ఒకటి జరిగింది. భారత్‌లో క్రైస్తవ సామ్రాజ్యం స్థాపిస్తామని ప్రతిజ్ఞ తీసుకోవలసిందని అచట సమావేశమైన వారందరినీ ఉద్బోధించారు. అచటజరిగే కార్యకలాపాలన్నిటినీ ఆశీర్వదించేందుకు మన కేంద్రమంత్రులలో ఒకరు ఆనాడు సమావేశంలో ఉపస్థితులై ఉన్నారు.

ఈనాడు మనదేశంలో నివసిస్తున్న క్రైస్తవ పెద్దమనుష్యులపాత్ర ఆవిధంగా ఉంది. వారు మన ధార్మిక, సాంఘిక వ్యవస్థలను భగ్నం చేయటానికి సిద్ధంగా ఉండడమేగాక తమ రాజకీయ ఆధిపత్యాన్ని అనేక స్థావరాల్లోనూ, వీలైతే దేశమందంతటనూ స్థాపించుకోవటానికిగూడ సంసిద్ధమవుతున్నారు. ఏసుక్రీస్తుయొక్క దివ్యమైన రెక్కల నీడలలో మానవజాతికంతకూ శాంతి, సౌభ్రాత్రాలనుసమకూరుస్తామనే ఆకర్షకమైన ముసుగుమాటున వారు అడుగుపెట్టిన ప్రతిచోట వారి ప్రవర్తన ఇదేవిధంగా ఉంది. దరిద్రులకు, అజ్ఞానులకు, పతితులకు తమకున్నదంతా ఇయ్యి, అని ఏసుక్రీస్తు తన అనుయాయులకు బోధించినాడు. అయితే అతని అనుచరులు ఆచరణలో అనుసరించిన దేమిటి ? వారెక్కడ ప్రవేశిస్తే అక్కడ తమ రక్తాన్ని అచటివారికి అర్పించేవారుగా గాక, అచటి వారి రక్తాన్ని పీల్చే వారుగా ఋజువుచేసుకొన్నారు. ఏసుక్రీస్తు శిష్యులనబడేవారు వలసలుగా ఏర్పరచుకొన్న ఆ యా దేశాలన్నిటిగతి ఏమయింది ? వారు ఎక్కడ అడుగుపెట్టితే అక్కడ స్థానికుల రక్తంతోనూ, కన్నీటితోనూ ఆ యా భూములను తడిపివేసి, తెగలకు తెగలనే వారు సర్వనాశనం చేసినారు. అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికాల్లోని స్థానికులను వారు నిర్మూలించిన తీరును తెలిపే హృదయవిదారకమైన కథలు మనకు తెలియనివా? అంత దూరమెందుకు? మన దేశంలో క్రైస్తవమత ప్రచారకులయొక్క దారుణ చరిత్ర ఎట్టిదో మనకు తెలియదా? గోవాలోనూ, ఇతరచోట్ల కత్తిని చూపి అగ్నినిరేపి వారేవిధంగా మతప్రచారం చేసినారో మనకు తెలియనిదా ?

సెయింట్ జేవియర్‌కు సంబంధించిన కథ ఉండనే ఉన్నదికదా క్రొత్త క్రైస్తవులు పాతదేవతల విగ్రహాలను కాళ్ళతో మట్టితే, పాత దేవాలయాల్ని నేలమట్టంచేస్తే, మతం మార్చుకొని తల్లిదండ్రులను అవమానిస్తే – అతని సంతోషానికి అంతు ఉండేదిగాదట. కాంగ్రెసుపాలన (న్యాయానికదీ క్రైస్తవపాలన) ఆంగ్లేయులు వెళ్ళిపోయినవెంటనే కేరళ ప్రాంతంలో ఏర్పడినప్పుడు ప్రసిద్ధ శబరిమలై దేవాలయంతోసహా వందలాది ప్రాచీన పవిత్ర హిందూదేవాలయాలను క్రైస్తవ కిరాతకులు అపవిత్రం చేశారు; నాశనంచేశారు; విగ్రహాలు పగులగొట్టినారు. కన్యాకుమారిలోని వివేకానందశిలపై ప్రతిష్ఠించిన వివేకానంద స్మారకఫలకాన్ని ఈ క్రైస్తవ మత దురహంకారులే పగులగొట్టినారు. క్రైస్తవమతం మానవజాతిపై సుఖశాంతులను, దయారసాన్ని వర్షిస్తుందని బోధిస్తూ ఇటువంటివారు మనదగ్గరకు వస్తూఉన్నారు.

క్రైస్తవులు ఇటువంటి కార్యకలాపాల్లో నిమగ్నులై ఉంటూన్నంత కాలం, అంతర్జాతీయ క్రైస్తవోద్యమానికి తాము ప్రతినిధులమని భావించు కుంటూ ఉన్నంతకాలం, తాము పుట్టిన ఈ భూమికి విధేయులుగా ఉండనంతకాలం, తమ పూర్వీకుల సంస్కృతీ సంప్రదాయాలకు నిజమైన పుత్రులుగా, వారసులుగా ప్రవర్తించనంతకాలం, వారిచ్చట శత్రువులుగానే ఉంటారు. అట్లాగే వారిని పరిగణించవలసి ఉంటుందికూడ.

# 16. అంతర్గత ప్రమాదాలు

## 3. సామ్యవాదులు

ఆంగ్లేయులు వైదొలగినతర్వాత మనంతట మనం జాతీయ వ్యవస్థను రూపొందించుకొనేటప్పుడు వివిధసిద్ధాంతాలు, 'వాదా'లు గురించిన చర్చ ఒక ప్రముఖవిషయమైపోయింది. పాశ్చాత్య ప్రజాస్వామ్యవ్యవస్థనే మనం ఎంచుకొన్నాం. కాని ఇన్నిసంవత్సరాల ప్రయోగానంతరం సత్ఫలితాలు పొందగలిగామా ? ప్రజలయొక్క సమష్టిభావనకు ప్రతీకం కాకపోగా అది అన్నివిధాలైన అవాంఛనీయస్పర్థలకు దారితీసింది. స్వార్థపూరితములు, విఘటనాత్మకములు ఐన శక్తులకు బలం చేకూర్చింది.

### సామ్యవాదానికి పునాది

ప్రజాస్వామ్యానికి బద్ధశత్రువైన సామ్యవాదం పెరిగిపోతూ ఉండడం మనదేశ ప్రజాస్వామ్య వైఫల్యాలలో తీవ్రమైనది. ఆర్థిక ప్రయోజనాల ఆశ చూపడంలో సామ్యవాదులకు తీసిపోకూడదని, వాళ్ళ పరిభాషను, కార్యక్రమాన్ని తామే స్వీకరించి, మననాయకులు సామ్యవాదానికి లేనిగౌరవాన్ని తెచ్చిపెడ్తున్నారు. ఇటువంటి ఎత్తులద్వారా సామ్యవాదుల జోరు తగ్గించగలం అని అనుకోవటం శుద్ధ పొరపాటు.

ఆర్థికాభివృద్ధి ఒక్కటే సామ్యవాదాన్ని అడ్డుకోగలదు అని వారనుకొంటున్నారు. సామాన్య ప్రజానీకానికి "ఉన్నత జీవనస్థాయి"ని గురించి పదేపదే వాగ్దానాలుచేస్తున్నారు. 'ఉన్నత జీవనస్థాయి' కలుగజేయ లేనప్పుడు దాన్ని గురించి పదేపదే వాగ్దానం చేయటంవల్ల ప్రజల్లో నిస్పృహ కల్గి, కల్లోలానికి దారితీస్తుంది. శీలం, జ్ఞానం, దేశభక్తివంటి ఉన్నత భావాలనుగూర్చిగాని, సాంస్కృతిక, మానసిక, నైతికాభివృద్ధులనుగూర్చి గాని ఎవరూ మాట్లాడటంలేదు. నిర్వీర్యం, నిరాశాపూరితం ఐన మనస్సుల్లో సామ్యవాదం చోటుచేసికొంటుంది.

## అగ్నిలో ఆజ్యం

సామ్యవాద ప్రమాదంపట్ల పాశ్చాత్యదేశాల వైఖరికూడ మనదేశంలో సామ్యవాదం పెరుగుదలకు తోడ్పడుతోంది. సామ్యవాదానికి విరుగుడు 'డాలర్' అని అమెరికా నమ్మకం. దానితోబాటు జాతీయ శీలం, ఆత్మ విశ్వాసం లేకపోయినట్లయితే కేవల ధనసహాయం నిరుపయోగమని చైనా, వియత్నాముల్లోని అనుభవం చెప్తుతోంది. తాము చేసిన ప్రతిఒక్క ఆర్థిక సహాయాన్ని గురించి దేశవ్యాప్తంగా వారు చేస్తున్న ప్రచారంవల్ల, స్వతంత్రప్రజాస్వామ్యానికి వెన్నెముకవంటి భావాలు సామాన్యప్రజల్లో తొలగిపోతాయి; అది ఆర్థికమైన ఆలోచనలను, హడావుడిని మాత్రమే రెచ్చగొడుతోంది.

సామ్యవాదంబారినుండి మన దేశాన్ని కాపాడాలంటే ప్రాచీన హిందుత్వం ఇచటినుండి పోవాలనే ఒక విచిత్రమైన భ్రమ పాశ్చాత్యులను పట్టిపీడిస్తున్నది. విరుచుక పడుతున్న సామ్యవాద ప్రవాహాన్ని క్రైస్తవ మొక్కటే అడ్డుకొనగలదని వారు భావిస్తున్నారు. ఒకప్పుడు సామ్యవాదాన్ని క్రైస్తవఘాతనము అని సమంగా వర్ణించిన అర్నాల్డు టాయన్‌బీ సామ్య వాదానికి క్రైస్తవమొక్కటే సరియైన విరుగుడు అని చెప్పనారంభించినాడు.

అది చాలా విచిత్రమైన విషయమే. తనలోని లోపాలకు ప్రతిక్రియగా పుట్టి పెరిగిన సమస్యను క్రైస్తవం తానే ఎట్లా పరిష్కరించగలుగుతుంది? 'విగ్రహారాధన'లో మునిగితేలే ఈదేశాన్ని క్రైస్తవమొక్కటే కాపాడగలదని భావించేవారు, పూర్తిగా సంప్రదాయబద్ధమైన క్రైస్తవాన్ని పాటించిన రష్యా క్రీస్తును ఎందుకు విడిచిపెట్టిందో కాసేపు నిలకడగా ఆలోచించుకోవాలి. మనదేశంలోకూడ క్రైస్తవ జనసంఖ్య ప్రభావం అత్యంత అధికంగా ఉన్న కేరళ ప్రాంతమే మిక్కిలిపెద్ద సామ్యవాదస్థావరంగా ఉండటం ఆశ్చర్యమే గదా! హిందువులను క్రైస్తవులుగా మార్చేందుకు జనాన్ని, ధనాన్ని గుప్పించటం ద్వారా ఈ దేశాన్ని సామ్యవాదంబారినుండి కాపాడగలమని పాశ్చాత్యులు భావిస్తున్నట్లైతే వారు ఆత్మహత్యాసదృశమైన భ్రాంతిలో కొట్టుమిట్టాడుతున్నారన్నమాట. ఎందువల్లనంటే, క్రైస్తవమత వ్యాప్తి ప్రజల్లోని విశ్వాసాన్ని, దేశభక్తిని భగ్నం చేస్తుంది. విశ్వాసాన్ని కోల్పోయినట్టి వ్యక్తుల్లోనే సామ్యవాదం వేళ్ళూనుతుంది. ఇదే సామ్యవాదం పెరగటానికి మన స్తత్త్వశాస్త్రదృష్ట్యా పెద్దకారణం.

## విశ్వాసం నశిస్తే సామ్యవాదం జనిస్తుంది

మనిషికి తిండి ఉన్నంతమాత్రాన చాలదు. అతనికి కొన్ని విశ్వాసాలుంటాయి. వాటివల్లనే అతడు జీవిస్తాడు; వాటికొరకే అతడు మరణిస్తాడు. అట్టివిశ్వాసం లేకపోతే జీవితానికి ఒకమార్గంకాని, ప్రయోజనం గాని ఉండవు; మనిషి అటూఇటూ కొట్టుకపోతాడు; ఆశ కోల్పోయినవాడై పోతాడు. అది ఒక సంకటపరిస్థితి. శాస్త్రీయవిజ్ఞానం వికసించనంతకాలం ఐరోపాలోని మానవుల జీవనానికి అటువంటి విశ్వాసాన్ని క్రైస్తవమతం కల్పించింది. అయితే శాస్త్రీయవిజ్ఞానం దాన్ని తునాతునకలుచేసి దిగ్భ్రమింగి వేసింది. కాలం, అంతరిక్షం, జీవితం, ప్రపంచం వీటిపట్ల ఉన్న క్రైస్తవవిశ్వాసాల నన్నిటినీ అది పటాపంచలు చేసింది. అయినప్పటికి యూరపునకు ఒక లంగరుపోతే వేరొక లంగరు దొరికింది. మతంపట్ల

విశ్వాసాన్ని అది కోల్పోయింది, కాని శాస్త్రీయవిజ్ఞానంపట్ల ఒక సరిక్రొత్త విశ్వాసాన్ని కలుగజేసుకొంది. నిజానికి శాస్త్రీయవిజ్ఞానమే యూరపులో ఒక క్రొత్తమతంగా ఏర్పడింది. అన్నిమతాలు సర్వజ్ఞునిగాను, సర్వశక్తిమంతునిగాను దేవుణ్ణి భావించినట్లే, అప్పటినుంచి ఐరోపా ప్రజలు శాస్త్రీయవిజ్ఞానాన్నే సర్వజ్ఞమని, సర్వశక్తిమంతమని భావించసాగినారు.

ఐతే, కొద్ది శతాబ్దాల కాలగమనంలోనే శాస్త్రీయవిజ్ఞానం స్వీయ ప్రామాణికతను కోల్పోయింది. విశ్వాన్నిగురించి తమ అజ్ఞానాన్ని శాస్త్రజ్ఞులు అంగీకరించనారంభించినారు. ఆధునికకాలంతోని శాస్త్రజ్ఞులందరికంటె ఘనుడైన ఐన్‌స్టీన్ భౌతికశాస్త్రాలకు అతీతమైన ఒక 'సత్యం' ఉన్నదని అంగీకరించినాడు. విక్టోరియా యుగంలో తమలోఉండిన సర్వజ్ఞత్వభావనను విడిచిపెట్టి ఇంకనూ పరిశోధింపబడని అనంతమైన విజ్ఞానరత్నాకరం తమముందువిలసిల్లుతూఉంటేదాని ఒడ్డునగులకరాళ్ళను ప్రోగుచేస్తున్నామనే భావనలోకి వారు దిగివచ్చినారు. శాస్త్రీయవిజ్ఞానంపట్ల విశ్వాసం భగ్నం కావటంతోనే, పాశ్చాత్యమానవుడు అపరిచితమైన సముద్రంలో చుక్కాని కోల్పోయిన నావ అయ్యాడు. ప్రాచీన విశ్వాసాలు నశించిపోయాయి; క్రొత్తవిశ్వాసాలు కనుచూపుమేరలో కనించటంలేదు. ఇటువంటి విశ్వాసశూన్య వాతారణంలో పూతమెరుగువిశ్వాసాలు ఆ శూన్యాన్ని పూరించటానికి ముందుకు వచ్చాయి. అటువంటి విశ్వాసాల్లో సామ్యవాదమొకటి.

కాబట్టి మహోత్కృష్ట మానవ సంస్కృతీకుసుమాలను వికసింపచేస్తూ మన మనుగడకే ఆధారమైఉన్న ప్రాచీనము, జీవనప్రదమునైన మన విశ్వాసాన్ని పెకలించివేయటానికి ఏ ప్రయత్నం ఎటునుంచి జరిగినప్పటికీ దాన్ని హర్షిస్తే, అది జాతిగా ఆత్మహత్యను చేసికోవటమే అవుతుంది.

## ప్రతిక్రియాత్మక దృష్టివల్ల ప్రమాదం

సామ్యవాద భావప్రచారాలను మనదేశంలో విఫలం చేయటానికి ప్రయాత్నాలనేకం జరుగుతున్నాయి. వినోబాజీ ప్రారంభించిన భూదాన

ఉద్యమం సామ్యవాద ప్రభావాన్ని పోగొడుతుందని కొందరు భావిస్తున్నారు. దానిలో ఉన్నటువంటి, 'దున్నేవానికే భూమి' అనే సామ్యవాద నినాదం వల్లను, ఆయన అనుచరుల్లో దూరదృష్టిలేని కొందరు "మీ అంతట మీరు భూమినివ్వకపోతే సామ్యవాదులు వచ్చితీరుతారు; మీకు చెందినదంతా బలవంతంగా లాక్కుంటారు' అని బెదిరించటంవల్లను సామ్యవాదమే సరియైన దనీ, అది వచ్చితీరుతుందిఅనీ – ఈ భావనమాత్రమే ప్రజల్లో ఏర్పడుతుంది. సామ్యవాదానికి ఇది పరోక్షమైన ఒక ఆమోదముద్రయే. అంతేగాక తమ ఉన్నతికోసమని ఆరంభించే అటువంటి ఉద్యమాలన్నీగూడ ఏదో మొక్కుబడి కోసమనీ, దగా అని సామాన్యప్రజలు అనుమానిస్తారు. "ఈనాడు సామ్య వాదులు ముందడుగువేస్తున్నారు కాబట్టి మీరు ఇటువంటి సంస్కరణలు, వాగ్దానాలతో ముందుకు రావాలని కోరుతున్నారు. మోమోటమెరుగని సామ్య వాదులే మాకు కావాలి. ఎందుకంటే కనీసం వారిలో నిజాయితీ, ధైర్యమూ ఉన్నాయి. తాము చెప్పేదాన్ని వారెంతోదృఢవిశ్వాసంతో చేస్తారు. అట్టి వారిని మేము నమ్మవచ్చును" అనికూడా ప్రజలు అనవచ్చును. ఆ విధంగా ఈ ఉద్యమం సామ్యవాదానికే దారితీయవచ్చు. నిజానికి సామ్యవాదాన్ని అడ్డుకోవాలనే ఒకేఒక ఆలోచనతో పనిచేయటం ఎప్పటికైనా ప్రమాదమే ఔతుంది. సత్యమూ, నిర్మాణాత్మకమూనైన విశ్వాసాన్ని అలవరచటం ఒక్కటే, సామాన్య ప్రజానీకాన్ని సామ్యవాదంయొక్క నీచప్రభావాన్నుంచి బయటపడవేయగలదు.

ఆర్థికమైన వ్యత్యాసాలున్నంతకాలం సామ్యవాదం తప్పక పెరుగు తూనే ఉంటుందని చెప్పేవారుకూడ కొందరున్నారు. అయితే వాస్తవ మేమంటే, సామ్యవాదంయొక్క అభివృద్ధికి మూలం పరస్పర విద్వేషం. దానికి ఆర్థిక అసమానత నిజమైన కారణంకాదు. శ్రమగౌరవాన్ని గురించి మన ప్రజల్లో సరైన భావన ఇంకా రాలేదు. ఉదాహరణకు చెప్పాలంటే రోజుకు మూడు నాలుగు రూపాయలు సంపాదించుకునే 'రిక్షావాలా'ను

'ఒరేయ్' అని పిలుస్తారు. కాని నెలకు అరవై రూపాయలు సంపాదించుకునే గుమాస్తాను 'బాబుగారు' అని పిలుస్తారుకదా! మన జీవనంలోని అన్ని రంగాలలోనూ వ్యాపించిఉన్న ఇటువంటి తరతమ దృష్టియే వ్యక్తులమధ్య విద్వేషానికి హేతువు. ఈ వికృతి మనజీవనంలో క్రొత్తగా ప్రవేశించింది. కర్తవ్య నిర్వహణ విషయంలో మన ధర్మశాస్త్రాలు తరతమ భేదాలను గుర్తించలేదు. ప్రతిపనీకూడా సమాజరూపంలో ఉన్న సర్వశక్తిమంతుడైన ఒకేఒక పరమాత్మను సేవించటమే ఔతుంది. ఇట్టిభావనను పునరుజ్జీవింప చేయాలి.

## ఓట్లద్వారా సమాజవాదం

మరొక విధంగాకూడా మనకు సామ్యవాద ప్రమాదం తప్పక ఎదురవుతుంది. 'సమాజ వాదం' (లోపలి విషయాన్ని బట్టి చూస్తే ఇదీ సామ్యవాదమే; దాన్ని సాధించేపద్ధతిలో మాత్రమే తేడా) తమ లక్ష్యంగా ప్రకటించి మన ప్రభుత్వం ఈనాడు స్వీకరించిన సిద్ధాంతంవల్ల అది సంభవిస్తున్నది. చైనా, రష్యాల్లోవలె తుపాకిగుండుతోగాక 'ఓట్ల'తోనే తాము 'సమాజవాదం' సాధిస్తామని మన నాయకులు అంటున్నారు. అంటే దీనికర్థం చైనా రష్యాల్లోని ప్రజలకు మన దేశంలోని ప్రజలకు తేడా ఉందని మాత్రమే అది సూచిస్తుంది. చైనా రష్యాల్లో బహుశః ప్రజలు ఎంతో జవం, జీవం కలిగి ఉండి ఉండాలి. అందుచేతనే అట్టివారిని తుపాకి గుండుద్వారా అదుపులో ఉంచాల్సివచ్చింది. ఇచటి మనప్రజలు మెతకవాళ్ళు. వ్యక్తిపూజకలవాటుపడినవారు, ఒకనాయకుడు ముందుకువచ్చి 'నా ప్రియ మిత్రమా! రా! తలవంచు; నేను నీతల నరుకుతాను' అంటే మన ప్రజలు తప్పక తలవంచి సిద్ధంగా నిలబడతారు. అటువంటి మెతక మనుషులకు 'తుపాకి గుండు' ఎందుకు? ఒక ఓట్ల పెట్టెచాలు. ఆ నాయకుడు "సమాజ వాదానికి ఓటు చేయండి" అని చెప్పితే, ప్రజలు దానికి ఓటు చేస్తారు. తాము సమాజవాదానికి ఓటు వేసినందున తమ స్వాతంత్ర్యం పోయిందని, వ్యక్తులుగా తాము ఒక యంత్రంలోని నిర్జీవభాగాలు అయిపోయినామని

గుర్తించిన ఆ మరునాడు దానిని దైవవిధిగా భావించి దానికి వారు లొంగి పోతుంటారు.

వేయిసంవత్సరాలకుపైగా ముస్లింలకుమనప్రజలు లొంగిజీవించినారు. తత్ఫలితంగా ఈనాటికిగూడ ముస్లిములను ఘనులనీ, దైవభక్తిగలవారనీ చెప్పేవాళ్ళను మనం చూస్తాం. తనను పరిపాలించే హిందూరాజును బంధించి ఆతని సింహాసనాన్ని ఆక్రమించుకున్న హైదరు, అగణిత ప్రజానీకాన్ని బలవంతంగా ఇస్లాములోనికి మార్చి, అనేక దేవాలయాలను నేలమట్టంచేసి, అనేక స్త్రీల మానభంగాలు జరిపిన హైదరుకొడుకు టిప్పుల విగ్రహాలను ప్రతిష్ఠించితీరాలని చెప్పేవారుకూడా కొందరున్నారు. ఆ వ్యామోహం ఇంతగా దిగజారింది. ఆంగ్లేయులు ఈ దేశానికి వచ్చినపుడు 'భగవంతుడు వారిని పంపినాడు' అని కొందరన్నారు. "మనదేశాన్ని 'వికటేశ్వరి' అనే రాణి పాలింపగలదని భవిష్యపురాణం జోస్యంచెప్పింది. విక్టోరియారాణియే వికటేశ్వరి" అనికూడా కొందరన్నారు. అటువంటి మెతక మనుషులకు కొద్దిపాటి ప్రచారంచాలు.

జాన్ బన్యన్ వ్రాసిన 'పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్' అన్న పుస్తకంలో యాత్రికుడు ఒక రాక్షసుని చేతుల్లో చిక్కుపడ్డాడు. ఆ రాక్షసుడు అతణ్ణి వెంటనే చంపివేద్దామని భావించినాడు; కాని తన భార్యసలహాను పాటించి ఆత్మహత్య చేసుకొనేటట్లుగా వాణ్ణి ప్రోత్సహించడానికి ప్రయత్నించినాడు. 'జీవితంలో ఈ కష్టాలన్నిటినీ ఎందుకు అనుభవిస్తున్నావు? ఆత్మహత్యకన్న తీయనైనదిలేదు. కత్తి, ఉరిత్రాడు, విషము వీటిలో నీకిష్టమైంది కోరుకొని దుఃఖమయమైన ఈ జీవితంనుండి శాశ్వతంగా విముక్తుడవుకమ్ము' అని చెప్పినాడు. ఆత్మహత్య చేసికొనేందుకు సంసిద్ధమయేటంతగా యాత్రికుణ్ణి ఒప్పించినాడతడు. సరిగ్గా ఆ సమయానికి ఒక స్నేహితుడు నచ్చచెప్పి అతణ్ణి ఆ వల్లో పడకుండా ఆపినాడు. అమాయకులైన మెతక మనుష్యులకు

కొద్ది ప్రోత్సాహం ఇస్తేచాలు, తుపాకిగుండు చేసినంతపని సాధ్యమవుతుందనే నీతి దీనివల్ల మనకు బోధపడుతుంది.

## శిలాశాసనం

సమాజవాదం బురఖాలో నిజంగా జరుగుతున్నదేమిటి? వీళ్ళ ప్రతి చర్యకూడ, చైనాలో జరిగినదానికి నమూనాగా-అంతకంటె కొద్దిమెరుగుగా ఉంటుందని మనం గమనిస్తాం. ఈరెంటికీ మధ్య ఒకేఒక తేడా ఉంది. చైనాలో ఈ పరిణామాలన్నీ పాశవికమైన హింసతో సాధించారు. అవే పనులు మనదేశంలోమాత్రం రాజకీయమైన ప్రచారంద్వారా జరిగాయి. అంతే. ఈరెండు దేశాల్లోని ప్రభుత్వచర్యలను పోల్చిచూస్తే, ఇది మనకు స్పష్టంగా తెలుస్తుంది. చైనాలో ఈనాడున్న సామ్యవాద ప్రభుత్వం అధికారంలోనికి వచ్చిన తొలిదినాల్లో తమ నిరంకుశాధికారానికి ఏవిధమైన ఎదురుసవాలు ఉండరాదని అనుకొన్నారు .కనుకనే పాతకాలపు ప్రభువులను, నాయకులను, పారిశ్రామిక యజమానులను నాశనంచేసి, పరిశ్రమలనన్నిటినీ వారు జాతీయం చేసినారు. పెద్ద భూస్వాములను నాశనం చేసినారు. చివరకు చిన్నచిన్న జమీందారులను, రైతులనుగూడ వారు నాశనం చేసినారు.

మనదేశంలోకూడా భూస్వాములు నిర్మూలింపబడ్డారు. ఈనాడు రాజ్యాంగపు 17వ సవరణకూడా వచ్చింది. దీనివల్ల అరఎకరం భూమి కలిగిఉన్న చిన్న రైతుకూడ 'భూస్వామి'గా లెక్కింపబడతాడు. అతని ఆస్తిని దాదాపుగా ఏ పరిహారం చెల్లించకుండానే స్వాధీనం చేసికొనేందుకు ప్రభుత్వానికి అధికారం ఉంది. సహకారవ్యవసాయం, సమష్టివ్యవసాయం, బ్యాంకులను, పరిశ్రమలను జాతీయం చేయటం మొదలైన సమాజవాద సిద్ధాంతాలు దేశవాతావరణంలో కనిపిస్తున్నాయి. ఇదంతాకూడ ఒకవిధంగా చైనీయుల పద్ధతిని అంచెలంచెలుగా అనుకరించటమే. ఈ రెంటిమధ్య నున్న సన్నిహితమైన పోలికను పరిశీలించుకొని ఏవిధమైన భవిష్యత్తు

మన ముఖాన శిలాశాసనంవలె చెక్కబడి ఉందో దానిని గమనిద్దాం. కేవలం బానిసలుగానో, పశువుల్లాగానో అయ్యే ముందే మనం జాగ్రత్తపడదాం.

అంతేగాక సమాజవాదం ఈ దేశానికి చెందినదికాదు. అది మన రక్తంలోను, సంప్రదాయంలోనూకూడా ఇమిడిలేదు. వేలాదిసంవత్సరాల మన జాతీయజీవనంలోని సంప్రదాయాలతో, ఆదర్శాలతో దానికెట్టి సంబంధమూ లేదు.ఇక్కడున్న కోట్లకొలది ప్రజలకు అది పరిచయని భావం కాబట్టి మన హృదయాలను ఉత్తేజపరిచేశక్తి దానికిలేదు. త్యాగమయమైన జీవితాన్ని, శీలాన్ని అది మనలో ప్రోత్సహించలేదు. దీన్నిబట్టి మన జాతీయజీవనానికి ఆదర్శంగా ఉండదగిన ప్రాథమిక అర్హతలుగూడ దీనిలో లేవని గమనించవలసిఉంది.

## ఏవిధానంగానూ తగనిది

ఇంతకుముందే మనం గమనించినట్లు సమాజవాదం (రష్యాకూడ తనను సమాజవాదరాజ్యంగా చెప్పుకుంటున్నది కాబట్టి సామ్యవాదానికీ దీనికి నిజమైన వ్యత్యాసంలేదు) వర్గపోరాట సిద్ధాంతంలోనుండి పుట్టిందని, రష్యాలోకూడా సరియైన ఫలితాలు అది ఇవ్వలేకపోయిందని మనకుతెలుసు. ఒక సిద్ధాంతంగా అది ఎన్నడో వీగిపోయింది; ఇప్పుడు ఆచరణలోకూడా అంతేఅయింది.

వ్యక్తిని ఒక చైతన్యమూర్తిగా అంగీకరించక పోవటమనేది సమాజవాదంలో ఉన్న భయంకరలోపం. 'సమాజవాద ప్రజాస్వామ్యం' వంటి అనేక క్రొత్తవివాదాలు సృష్టించి వాటిమాటున దీన్ని కప్పిపుచ్చాలని ఈనాడు మననాయకులు యత్నిస్తున్నారు. వాస్తవానికి ప్రజాస్వామ్యం, సమాజవాదం అనే సిద్ధాంతాలు పరస్పర విరుద్ధాలు. సమాజవాదం ప్రజాస్వామ్య మెన్నటికీ కానేరదు. ప్రజాస్వామ్యం సమాజవాదం కానేరదు. ఎందుచేతనంటే వ్యక్తి స్వాతంత్ర్యమే ప్రజాస్వామ్యంలోని మొదటిసూత్రం; కాని సమాజవాదంలో

ముందుగా బలిఅయిపోయేది అదే. ప్రజాస్వామ్యంలో వ్యక్తి గౌరవానికి ఉన్నతస్థానం ఇవ్వబడుతుంది. మరి సమాజవాదంలో వ్యక్తి వండ్లచక్రంలోని ఒకపన్ను; ప్రభుత్వమనే పెద్ద యంత్రంలో ప్రాణంలేని ఒక చీలం.

## జాతీయ ప్రతిభను పునరుజ్జీవింపచేయాలి

ఆవిధంగా ఆంగ్లేయులు వెళ్ళిపోయినతర్వాత మన వ్యవహారాలన్నీ ఒక గందరగోళంలోపడి, విదేశీసిద్ధాంతాలమంది, "వాధాల"మంది తలకొకకాస్త పుణికిపుచ్చుకుందామని మనం యత్నిస్తున్నాం. ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాల్లో, తదితర విషయాలన్నిటిలోనూకూడ జాతీయ జీవనాన్ని పునర్నిర్మించుకోవటానికి సరియైన పునాది ఏర్పరచగల సర్వ సమగ్రమైన తత్త్వజ్ఞానానికి పుట్టినిల్లయిన మనదేశానికి ఇది చాలా అవమానకరం. ఈనాడు పాశ్చాత్యులు ప్రవచించిన సిద్ధాంతాలతో, వాదాలతో మానవమేధ పరాకాష్ఠనందుకున్నదని మనం విశ్వసించినట్లయితే, అది మన సృజనాత్మకశక్తియొక్క, మేధయొక్క దివాళాకోరుతనాన్నే తెలియచేస్తుంది. కనుక మన ప్రాచీనఋషులు కనుగొన్న శాశ్వతసత్యాలను ఆధారం చేసుకొని హేతువాదం, అనుభవం, చరిత్ర అనే గీటురాళ్ళపై పరీక్షించబడిన తెగ్గిన మన సొంత జీవనవిధానాన్ని మనం రూపొందించుకొందాం.

# 17. చారిత్రక ఆవశ్యకతను పూర్తి చేయాలి

"ప్రపంచంలోని ఏశక్తి కన్నెత్తిచూడజాలనంతటి శక్తికలిగా మన హిందూ సమాజాన్ని మనం సంఘటిత పరచాలి" అని సూత్రప్రాయమైన చిన్నవాక్యంలో మన సంఘ ఆదర్శాన్ని సంఘ సంస్థాపకులు చెప్పేవారు. అన్నింటినీ మించిన ప్రముఖ కర్తవ్యం ఇది; మహత్తరమైన ఈ సమాజసంతానం అంతటిమీదా ఈ బాధ్యత ఉంది.

## కృతజ్ఞతా ఋణం

సమాజాన్ని సంఘటితంచేసే ఈ కార్యంలో స్వయంగా అంకితం కావలసిన విధి మనకున్నదని ఎట్లా చెప్పగలం? మనమంతా ఈ సమాజంలో పుట్టి పెరిగామనేది అందుకు మొదటికారణం. మన వ్యక్తిగత, కౌటుంబిక జీవనాల్లో భద్రత, సుఖసంతోషాలు ఈ సమాజంలో మనం జన్మించినందువల్లనే సాధ్యమయాయి.

దీనికి మరొక ముఖ్యకారణంకూడా ఉంది. మనది అతిప్రాచీనము, అమరమునైన సమాజం. మానవజీవనంలోని అన్నిరంగాల్లోనూ

ప్రయత్నాలు ఇట్టివేనా ? మన సమాజంయొక్క శాశ్వతసంక్షేమానికి అవి దోహదం చేస్తాయా ? రక్తం కలుషితమై కురుపులు పుడుతూఉంటే పైపైన మందులువేసి కట్లుకట్టడం వృథాశ్రమే అవుతుంది. మూలకారణాన్ని సరిచేస్తే రోగం నయమవుతుంది. అయితే అటువంటి మూలకారణం ఏమిటి ?

## సమాజచిత్రం : నాడు-నేడు

ఈనాడు మనకు కనిపిస్తున్న దారిద్ర్యం, దుఃఖం, గతంలోకూడ మన సమాజంలో ఇట్లాగే ఉండేవి అనేమాట నిజమా? చరిత్రచెప్పే కథమాత్రం దీనికి భిన్నంగాఉంది. గతంలో ఈదేశం చూడవచ్చిన కొందరు విదేశీ యాత్రికులు తామిక్కడ చూచిన విషయాలనుగురించి ప్రత్యక్షసాక్ష్యాలను వివరంగా ఇచ్చి ఉన్నారు. ఈనాటికీ లభ్యమవుతున్న వారి వ్రాతలప్రకారం "ఇచటి ప్రజలు సుఖము, సంతృప్తి కలవారు. ఇచట అనాథులు, బిచ్చగాండ్రు లేరు. యాత్రలకు వెళ్ళేప్రజలు దొంగతనం జరుగుతుందేమోఅన్న భయం ఛాయామాత్రమైనా లేక ఏండ్లతరబడి తాళాలు వేయకుండా ఇండ్లను విడచి పోతారు. ప్రజలు నీతినితప్పి ప్రవర్తించిన ఉదాహరణలు చాలా అరుదు. వ్యవహారాలలో అందరూ కడు ధార్మికులు, ఉదారులు, విశ్వాసపాత్రులు. పరాక్రమోపేతమై, శక్తిసంపన్నమైన జాతి వారిది. వారు ధనవంతులు, మేధావంతులు" అని తెలుస్తోంది. ఇటువంటి దేదీప్యమానమైన వర్ణనలు విదేశీ యాత్రికులు చెయ్యడంలో వేరే ఉద్దేశ్యాలేమీ ఉండే అవకాశంలేదు. ఈనాడు రష్యా చైనాల్లో ఉన్నటువంటి ఇనుపతెఱలాంటిది ఆనాడు మన దేశంలో లేదు. ఈ దేశమందంతటా తమ ఇచ్చవచ్చినట్లే వారు అనేక ఏండ్లపాటు తిరిగారు. అటువంటప్పుడు వారు వ్రాసినవ్రాతలు సంశయాతీత మైన సత్యాలుగా మనం విశ్వసింపక తప్పదు.

దైనందిన జీవితంలోని ఇతర అంశాలన్నిటినీ వదిలివేసి, కేవలం ఆధ్యాత్మికరంగంలో మాత్రమే మనవారు ఉన్నతిని సాధించారని కొందరు

తరచు పొరబడుతూ ఉంటారు. కాని అది సత్యంకాదు. విజ్ఞానశాస్త్ర విషయాలు, కళలు – అన్నింటిలోనూకూడా మనవారు అనేక శతాబ్దులు ముందంజవేసినట్లు ప్రామాణికమైన ప్రాచీన ఆలేఖాలు తెలుపుతున్నాయి. ఏమాత్రం త్రుప్పుపట్టకుండా మెరుస్తున్న రెండువేల ఏళ్ళనాటి అశోక స్తంభం ఈనాటికికూడ లోహవిజ్ఞానశాస్త్రానికి ఒక తిరుగులేని సవాలుగా నిలిచి ఉంది.

మన ప్రాచీన గ్రంథాల్లోనూ, విదేశీ పుస్తకాల్లోనూ ఒక కథ ఉంది. రోమను రాజుల్లో ఒకడు ఒక వింతరోగంతో బాధపడు తూండేవాడు. దాన్ని ఆయన రాజ్యంలోని ఎవ్వరూ బాగుచేయలేకపోయారు. అతను మన దేశీయుల సహాయాన్ని కోరాడు. నాడు మనదేశం వైద్య శాస్త్రంలో దిట్ట. మన రాజవైద్యుల్లో ఒకడు అక్కడకు పోయి ఆ రాజుయొక్క పుఱ్ఱెను విడదీసి మెదడుకు శస్త్రచికిత్స చేశాడు. ఆ రాజుకు రోగం నయమయింది. ఆ వైద్యుడు ఆ శాస్త్రాన్ని అచటి ప్రజలకు నేర్పే నిమిత్తమై మరొక మూడేండ్లు అక్కడే గడిపి, ఘనమైన గౌరవ సత్కారాలతో తిరిగి వచ్చాడు. శస్త్రచికిత్స ఎంతో ముందడుగువేసిన ఈనాడుకూడ మెదడుకు శస్త్రచికిత్స చేయడమంటే చాల ప్రమాదంతోకూడిన సాహసమే అని మనం తప్పక గుర్తుంచుకోవాలి.

మన ప్రాచీన ఆయుర్వేదాచార్యులు బాహ్యప్రపంచానికి ప్లాస్టిక్ సర్జరీ నేర్పారు. 'సున్న' అనే గణిత శాస్త్రాంశాన్ని మన తత్వశాస్త్రం మంచి తీపికాని ప్రపంచాని కందించాం. సృష్టి అంతా 'సున్న' అనీ, భగవంతుడు 'ఒకటి' అనీ మన భావన. ఈ భగవంతుడు అనే అంకె తర్వాత 'సున్న' వచ్చినపుడు మాత్రమే దానికి విలువ. లేకపోతే దాని విలువ సున్నే. 'దశాంశ పద్ధతి' భారతీయుల మేధాజన్యమే. గణితశాస్త్ర అత్యద్భుత వికా సానికి పునాదులు వేసింది మనమే.

మనమెన్నడూ ఇంటిపట్టు విడిచిపెట్టనివారం కాదు. 'కృణ్వంతో విశ్వమార్యమ్' (విశ్వమంతనూ శ్రేష్ఠముగా చేయుదముగాక) అని మేఘ గంభీర నినాదంతో, మన మహాపురుషులు, మునులు నేల నాలుగుచెరగులకు పయనించారు. మన సత్ప్రభావం భూమండలంలోని అనేక ప్రాంతాలపై ప్రసరించింది. మన ధ్వజం అనేకభూములపై ఎగిరింది. మన వైభవ ప్రాభవాన్ని దర్శించేనిమిత్తమై సుదూరభూములనుండి యాత్రికులు వచ్చారు. ఇచ్చటి స్వచ్ఛము, శాశ్వతమునైన మానవవిజ్ఞానస్రోతస్సులనుండి తమ దాహం తీర్చుకునేందుకై దగ్గరనుండి, దూరంనుండికూడా అనేక విద్యార్థులు వచ్చారు, సర్వవ్యాపియైన ఆనాటి మన సాంస్కృతిక సామర్థ్యాన్ని ఋజువు చేస్తూ ఈనాటికికూడా ఆ యా దేశాలన్నింటిలోనూ దేవాలయాలు, విగ్రహాలు, చిత్రాలు, శిల్పాలు, భాషలు, ఆచారాలు, కావ్యాలు, జానపదగేయాలు, సాహిత్యము, కళలు మొదలైన లెక్కలేనన్ని సజీవ సాక్ష్యాధారాలు ఉద్ఘోషిస్తున్నాయి. ముస్లిములయొక్క 'చంద్రవంక, నక్షత్రం' గుర్తుకూడా మన 'ॐ' లోని ఒక భాగం మాత్రమే. బుద్ధుడు అవతరించిన పిదపనే మన పూర్వీకులు ఈదేశందాటి బయటికి కదిలారనడం సత్యం కాదు. చాలాకాలం క్రిందటనే మనయొక్క ధర్మప్రచారకులు అమెరికా తీరాలను చేరారు. వీరి అడుగుజాడల్లోనే బౌద్ధభిక్షువులు ఈసంప్రదాయాన్నే కొనసాగించారు. దేశ విదేశాల్లో పరాక్రమవంతులుగాను,ఉదారులుగాను మనంపరాకాష్ఠనందుకున్నాము.

ఐతే ఈనాడిట్టి గర్హనీయమైన స్థితి మనదేశంలో ఎందుకు ఏర్పడింది? సర్వసమృద్ధము, సంస్కృతీపూర్ణమునైన ఈ భూమిని దుఃఖము, అధర్మము అనే పిశాచాలు పట్టిపీడించట మెలాసంభవించింది? భారతదేశం ఒకప్పుడు ప్రపంచానికంతకూ తల్లియై, శరణార్థులై వచ్చిన అనేకజాతులకు ఆశ్రయాధారాలను కల్పించి, ఈనాడు విశ్వవీథుల్లో ఎందుకు తిరిపె మెత్తుతున్నది? ఈనాడు మనం విదేశీయుల గుమ్మాలపద్ద అర్థమూ, ఆహారాలనేగాక, ఆదర్శాలు, జీవనమూల్యాలనుకూడా బిచ్చమడుగుతూ పోతున్నాము. దానివలన మన మేధా, సృజనశక్తులు పూర్తిగా దివాలా

తీశాయని ప్రపంచానికి చాటుకొంటున్నాము. ఇటువంటి దైన్యము, అధోగతి కలగటానికి మూలకారణం ఏమిటి ?

## విదేశీయులు బాధ్యులా ?

కొన్నిదశాబ్దాలుగా ఈ విషయాన్ని గురించి ఆలోచన చేసినవారు ఈ అధోగతికి గత వేయిసంవత్సరాల బానిసత్వమే ముఖ్యకారణమని నిర్ధారణ చేశారు. ఈ దేశంలో పాలకులుగా స్థిరపడిపోయిన ముస్లిం దురాక్రమణదారులు, మన జాతీయశ్రద్ధాకేంద్రాలను ఒక పథకం ప్రకారం నాశనం చేశారని వారు చరిత్రలో చదివారు. ముస్లిములు మన స్త్రీలను అపవిత్రలను చేశారు. దేవాలయాలను, యాత్రాస్థలాలను నాశనం చేశారు. కత్తికి గురిచేసిగాని, భౌతికసుఖాల ఆశచూపిగాని మనవారి ననేకమందిని మతంమార్చారు. క్రొత్తగా ఆ మతంలోకి మారినవారుకూడా జాతీయ భావనలను విస్మరించి, విదేశీ దురాక్రమణదారుల అడుగుజాడల్లో అదేవిధమైన మతమౌఢ్యంగల పరిపాలనను, దారుణకృత్యాలను కొనసాగించారు.

వారి అనంతరం వచ్చిన ఆంగ్లేయులు చాలా చతురులు, సభ్యత నెరిగినవారు. వారు ప్రత్యక్షంగా విధ్వంసకాండమ, భ్రష్టీకరణాన్ని ప్రారంభించలేదు. తమయొక్క కుటిల ప్రచారంద్వారా జాతిలోని తరతరాల విశ్వాసాన్ని, సమైక్యతను నాశనంచేయటానికి ప్రయత్నించారు. మనప్రజల జాతీయతను, సంస్కృతిని, చైతన్యశక్తిని నాశనంచేసేందుకే ఒకవిధమైన ప్రత్యేకవిద్యావిధానాన్ని వారు ప్రవేశపెట్టారు. ఆవిధంగా తమ సామ్రాజ్యాన్ని పటిష్ఠం చేసుకోవాలనుకున్నారు. విద్యావంతులనబడే మనవారు తేలికగా వారి వలలో పడి తెల్లవారియొక్క ఆచారాలను, ఆలోచనలను గ్రుడ్డిగా అనుకరిస్తూ, మనవి అన్నవాటినన్నిటినీ చీదరింపసాగారు. మన ప్రాచీన వారసత్వం అనే భూమినుండి పెకలించివేసిన మనజాతి శుష్కించి, నీరసించి అధర్మం, అన్యాయాలను మాత్రమే మిగుల్చుకుంది.

ఆవిధంగా గత వేయిసంవత్సరాల విదేశీ ఆధిపత్యపు ఘోర చిత్రాన్ని పరికించి, ఈనాటి దోషాలన్నిటికీ విదేశీ పరిపాలన ఒక్కటే మూలకారణమనే నిర్ణయానికి వచ్చి, అట్టి విదేశీ శృంఖలాలను తెగ త్రెంపులు చేయటానికి అనుగుణంగా ఆ యా మేధావులు ప్రయత్నా లారంభించారు. అది సహజంకూడాను.

అయితే విషయం అంతటితో పూర్తికాలేదు. విదేశీయులు ఏవిధంగా ఈదేశంలో స్థిరపడగల్గార,నే ప్రశ్న ఉండనే ఉంది. ఆ విదేశీ దురాక్రమణ దారులు కేవలం తమయొక్క ఆధిక్యయోగ్యతలచేతనే ఇంతటి పెద్ద దేశాన్ని స్వాధీనంచేసికొని పరిపాలించగలిగారనడం నిజమా? కాదు. ఒకజాతికి విజయం తప్పక సమకూర్చిపెట్టగల్గిన జనసంఖ్య, సైనికశక్తి, రాజకీయ చతురత, పరాక్రమం, సంపద, విజ్ఞానం ఇత్యాదులన్నింటిలోను మనవారు దురాక్రమణదారులకన్న ఎన్నోరెట్లు అధికులని, మనచరిత్రలోని ప్రతిపుటలోనూ స్పష్టంగా, స్ఫుటంగా వ్రాసి ఉంది.

## అన్నిటిలోనూ శ్రేష్ఠులమే

ఈ మాతృభూమిలో వైభవశాలియైన స్వతంత్రజీవనమొకటి మనకు ఉండేది. సాటిలేని ఒక సాంఘిక వ్యవస్థా, బాగా పరిణతిచెందిన రాజకీయ వ్యవస్థా ఉండేవి. ఆనాడు మన రాజనీతిజ్ఞులు రాజ్యపాలనా సూత్రాలన్నింటి లోను దక్షులు. ప్రపంచంలోని రాజనైతిక సాహిత్యమంతటిలోను కౌటిల్యుని అర్థశాస్త్రంతో సమానమైన గ్రంథాలు చాల అరుదుగా ఉన్నాయి. దేశకాలాతీతాలై, శాశ్వతాలైన ఆలోచనలకు ఆ చిన్నపుస్తక మొక నిధి. అది పుస్తకరూపంలో కూర్చిన శుష్కవిజ్ఞానంకాక, ఆనాటి వాస్తవిక రాజకీయాల్లో ఆచరణయోగ్యమైనది; మార్గదర్శకమైనది. ఆనాడు విదేశీదురాక్రమణదారులకు మనయొక్క ప్రతిఘటనాశక్తి తయో

త్పాతం కలిగించేది. వాస్తవానికి ప్రాచీనకాలంలో ముష్కరశకహూణ సమూహాలను మనం నిర్మూలించివేశాం. అట్టివారిలో ఎవరైనా ఇచట మిగిలిఉంటే అందరినీ ఆకట్టుకోగలిగిన శక్తిగల మన సంస్కృతిలో వారిని జీర్ణం చేసుకొన్నాం.

గ్రీసుదేశరాజు, 'ప్రపంచ విజేత' అలెగ్జాండరుకుకూడ ఇక్కడ ఇటువంటిగతే పట్టింది. "ఘనుడైన అలెగ్జాండరు, మనదేశంలో తాను జయించిన రాజ్యాన్ని తన ఔదార్యానికి చిహ్నంగా తిరిగి ఇచ్చివేశా"డని పాశ్చాత్యులు వ్రాసిన చరిత్రపుస్తకాలు మనకు బోధిస్తున్నాయి. పర్షియాలో తాను కొనసాగించిన దురంతాలకు గర్వపడుతూ, తాను అడుగుపెట్టిన చోటనెల్ల విజయగర్వంతో కన్నుగానక, అన్నివిధాల కిరాతకకృత్యాలను కొనసాగించిన ఆ అలెగ్జాండరే భారతభూమిలో అడుగుపెట్టిన వెంటనే ఉదారుడైపోయాడని చెప్పే చరిత్రను మనం విశ్వసించాలన్నమాట! పాశ్చాత్యుల్లో ఉదారుడైన విజేతను ఇంతవరకు ప్రపంచం చూచిఎరుగదు. ఎంతో గొప్పలు చెప్పుకునే 'క్రైస్తవమతశిక్షణ'ను రెండువేలసంవత్సరాల పాటు పొందినతరువాతగూడ, పాశ్చాత్యదేశాలు తాము జయించిన పాశ్చాత్యదేశాల్లోని సోదర క్రైస్తవులపట్ల చూపిన 'ఉదారత'ను చదువు తుంటే ఒళ్ళు జలదరిస్తుంది. చరిత్ర వెలువరించిన సత్యాలప్రకారం చూస్తే, మనదేశంలోని చిన్నచిన్నపర్వతరాజుల భయంకరమైన తాకిడులకు తట్టుకోలేక తనప్రాణాలమీది తీపితో అలెగ్జాండరు పారిపోవలసివచ్చిందని తెలుస్తుంది. ఐనప్పటికీగూడ ఒక భారతీయవీరుని ప్రాణాంతకమైన బాణపుదెబ్బనుండి అతడు తప్పించుకోలేకపోయాడు. చావుదెబ్బతిని, తాను వచ్చినత్రోవనే వెళ్ళే సాహసంచేయలేక, అతడు వేరొకమార్గానపయనించాడు. ఐనా అతడు ఇరాన్ వరకే వెళ్ళగలిగాడు. అక్కడాతడు మరణించాడు. సెల్యూకస్ ద్వారా వచ్చిన మరొక గ్రీకు దండయాత్రనుకూడ, మగధనేలిన మహాచక్రవర్తియైన చంద్రగుప్తుడు భగ్నం చేశాడు.

కాని, పొంతన కుదురని సంసారం

ఐతే ఆనాటికి మనజాతీయ సమైక్యతలో క్రమంగా శిథిలత ప్రవేశించింది. మహాభారతయుద్ధానంతరం ఏర్పడిన సుదీర్ఘ శాంతి సమయంలో, మనజాతి అంతా, భద్రతాభావంలో ఊయలలూగుతూ ఒక విధమైన మైకంలో పడిపోయింది. ఒకే ప్రమాదం అందరిపైకి ముంచుకొని వస్తుందన్న గుర్తింపువల్ల, సమైక్యతకు దోహదంచేసే ఆలోచన కలుగుతుంది. అట్టి ప్రమాదం శతాబ్దుల తరబడి లేకపోవటంచేత ఒకే జాతికి చెందినవారమనే సజీవచైతన్యం క్రమంగా గుర్తించనలవికాని రీతిగా లుప్తమయిపోయి; జాతి చిన్నచిన్న స్వతంత్రరాజ్యాలుగా విడివడిపోయి బలహీనమయిపోయింది. జాతీయభావనను త్రోసిరాజని, రాచరికం ప్రజల విధేయతకు కేంద్రమయింది. విభిన్నరాజ్యాలమధ్య ఏర్పడిన పరస్పర అసూయా విద్వేషాలు, వాటిసంబంధాలను విషపూరితం చేశాయి. ఆ విధంగా మనజాతి ఒండొరులపట్ల విద్వేషంతో, కట్టులేని కుటుంబంలా తయారయింది. తమ వ్యక్తిగత కీర్తిప్రతిష్ఠలతో మత్తెక్కిన రాజులు శత్రుమిత్రవిచక్షణా జ్ఞానం కోల్పోయారు. మన భూమిలో ఒకభాగాన్ని దోచుకున్న శత్రువు ఏదో ఒకనాడు ఈభూమినంతనూ దోచుకుంటాడు; జాతీయస్వాతంత్ర్యమనేది అవిభాజ్యము — దేశరక్షణకు సంబంధించిన ఈ తొలిపాఠాన్నిగూడా మనం మరచిపోయాం. దానివల్ల కలిగే ఫలితం మనకందరకూ వినాశకరంగా ఉంటుందని, మనకు ప్రియము, పవిత్రమునైన అన్నివస్తువులు, మన సమస్త సంపదా, సమృద్ధీ బూడిదపాలై పోతాయనికూడా మరచిపోయాం. ఆ విధంగా ఒకనాడు మనశక్తినిచూచి గజగజవణికి, మన కాళ్ళకుమ్రొక్కిన శత్రువులే తరువాత రోజుల్లో 'గౌరవనీయులైన అతిథు'ల్లా ఇచట ప్రవేశించి క్రమంగా మనను జయించి పరిపాలకులు ఐనారు.

ముస్లిముల దాడికి మనదేశం ఏవిధంగా లొంగిపోయిందీ తెలిపే విషాదగాథ మన కండ్లముందు కనిపిస్తూనేఉంది. మహమ్మద్ ప్రవక్త

చనిపోయిన తర్వాత ఒక్క నూరుసంవత్సరాల కాలంలో ముస్లింలు దాదాపు దక్షిణ ఐరోపానంతనూ, స్పెయిను, పోర్చుగల్ లను, ఆసియాలోని కొన్ని భాగాలను జయించి పసిఫిక్ సముద్రం వరకు తమ పరిపాలనను సురక్షితంగా ప్రతిష్ఠించుకున్నారు. అట్లాంటిక్ నుండి పసిఫిక్ వరకు వ్యాపించిన సువిశాల సామ్రాజ్యంయొక్క అండ చూచుకొని, తమ దురాశాపూరితదృష్టిని మన దేశంపై ప్రసరించారు. వారు రెండు మార్గాలగుండా మనదేశంలోనికి చొచ్చు కొనిరావటానికి యత్నించారు. ఒకవైపు ఆఫ్ఘనిస్తాన్ గుండా హిమాలయాలను దాటి పంజాబులోనికి రావాలని, మరోవైపు సింధుగుండా ప్రవేశించాలని వారు యత్నించారు. అంతటి విశాలసామ్రాజ్యమూ, అంతటి అధికసైనికశక్తి తమకున్నప్పటికీ, తరంగానుతరంగా వారు కొనసాగించిన దండయాత్రలను రెండు శతాబ్దాలపాటు మనదేశం వాయవ్యసరిహద్దుల్లో ఉన్న చిన్నచిన్న హిందూరాజ్యాలు త్రిప్పికొట్టి మన సరిహద్దులనుకాపాడినాయి. దండెత్తివచ్చిన ముస్లింమూకల ఆక్రమణశక్తికన్న హిందువుల సైనికచతురత, పరాక్రమం పోలికకందనంత అధికమయినవని అది నిరూపించింది. అయినప్పటికీ హిందువుల్లో ఏర్పడ్డ స్పర్థలు, విద్రోహము వారి శక్తిని క్రుంగదీశాయి. దానికితోడు మాతృదేశ సంరక్షణార్థమై వారు చేస్తున్న పోరాటానికి అవసర మైన సాహాయ్యాన్ని దేశంలోని మిగిలినభాగాలు అందచేయలేదు. ఈ రెండు కారణాలవల్ల చివరకు హిందువుల ప్రతిఘటన వీగిపోయింది.

ముస్లిముల మొదటి దండయాత్రవల్ల దెబ్బతిన్న తర్వాతనైనా కనీసం మనదేశం నిద్రమేల్కొలేదు; సమైక్యంగా నిలువలేదు. ఆత్మహత్యా సదృశమైన పరస్పర స్పర్థలు, విద్రోహాల కథ కొనసాగుతూనేవచ్చాయి. పవిత్రసోమనాథదేవాలయాన్ని దోచుకొని భగ్నంచేయటానికి బయలుదేరిన ఘజినీ మహమ్మదుకు మనదేశరాజులే మార్గదర్శకులుగాను, సహాయకులు గాను పనిచేశారు. తదనంతర కాలంలో మహమ్మదు ఘోరీని ఇచట కాహ్వానించినవాడు జయచంద్. ఆ విధంగా పవిత్ర ఇంద్రప్రస్థ రాజధానిలో తొలిసారిగా, విదేశీపరిపాలనను ప్రతిష్ఠించేందుకు శత్రువుకు సహాయం చేసిన

వారు ఒక హిందూరాజు. జయచంద్రుని తెగత్వర గావర్ధిల్లింది. అక్బరుయొక్క విశాలసామ్రాజ్యానికి రాజా మానసింహుడు ఉపకరించాడు. ఆరోజుల్లో స్వాతంత్ర్యజ్యోతిని ఆరిపోనీయకుండా నిలబెట్టుతున్న ఏకైకవీరుడగు రాణాప్రతాప్‌పైకి అతడు దండెత్తివచ్చాడు. మీర్జారాజా జయసింహ్, జస్వంతసింహ్ మొదలైన హిందూ సేనాధిపతులందరూ ప్రబల హిందూ విరోధియైన ఔరంగజేబుకు బలిష్ఠబాహువుల్లా ఉపకరించారు; ఔరంగజేబు పక్షాన శివాజీని నాశనం చేసేందుకు వచ్చినవారు వారే.

ఢిల్లీనుంచి తూర్పుదిశగా కేవలం పదునెనిమిదిమంది మనుష్యులతో బయలుదేరిన బఖ్త్యార్ ఖిల్జీ, బెంగాలువరకు తనకత్తి కెదురులేకుండా పయనించాడనీ,త్రోవపొడవున భయంకర మారణహోమం, మతాంతరీకరణం, స్త్రీల అపహరణ, దేవాలయ విధ్వంసం, రాజ్యాలు కొల్లగొట్టడాలు అపరిమితంగా కొనసాగించాడనీ చరిత్ర చెప్పుతోంది. అంటే మనలోని విఘటన అంత తక్కువ స్థాయికి దిగజారిందన్నమాట. ప్రపంచప్రఖ్యాతి చెందిన నలందా విశ్వవిద్యాలయంలోని వేలాదివిద్యార్థులు, ఆచార్యులు పూర్తిగా నిర్దాక్షిణ్యంగా అతని చేతుల్లో చచ్చారు. ఆనగరంలోని ప్రజలనందరినీకూడ అతడు తన కత్తికెరచేశాడు. వేలాది సంవత్సరాలుగా ఒకచోటికి చేర్చిన విజ్ఞానఖనియైన గ్రంథాలయాన్ని భస్మం చేశాడు. చివరకు బెంగాలులో తన పరిపాలనను స్థాపించాడు.

ఔరంగజేబుయొక్క సైన్యంలో అధికారి మనుచ్చి అనే ఇటలీదేశపు వాడు ఒకడుండేవాడు. అతడు దేశమంతా పర్యటించి తన దినచర్యపుస్తకంలో "ఎవడైనా ఒక ముప్పైవేల సైన్యంతో ఖైబరుకనుమగుండా ఈనాడు దండెత్తివస్తే మొత్తం హిందూస్థానాన్ని తేలికగా గెలిచి తన పరిపాలనను ఏర్పాటుచేసుకోవచ్చు" అని వ్రాశాడు. అటువంటి ఋజువులు, ఉదాహరణలు ఆనాటి చరిత్రలోని ప్రతిపుటలోనూ చెరగనంతగా చెక్కి ఉన్నాయి. ఆనాడున్న అంతఃకలహాలు, విద్రోహాలు శతృవులతో చేతులు కలిపి దేశాన్ని బానిసగా చేయుటవంటి హృదయవిదారకమైన కథలు అనేకంగా నాటి చరిత్రలో కనిపిస్తాయి.

ఆంగ్లేయులు వచ్చిన తర్వాతకూడా ఆత్మహత్యాసదృశమైన అదే విద్రోహ కథ నిరంతరాయంగా ఇక్కడ కొనసాగుతూనే వచ్చింది. ముస్లిముల దండయాత్రలవల్ల కలిగిన గుణపాఠాలను మనం విస్మరించాము. హిందూ సేనాధిపతులు, సైనికులు ఆంగ్ల సామ్రాజ్య భద్రతకొరకు తమ రక్తాన్ని ధారవోసి, స్వాతంత్ర్యయోధుల రక్తాన్నిగూడా చిందించారు. ధనవంతులైన మన వ్యాపారులు, అంగ్లేయులకు ధనసహాయం చేశారు. మన అంగబలం, అర్థబలం, మేధాశక్తి–మన సాధనసంపత్తి అంతా–వారిపాదాల చెంత సమర్పించారు. మనకు వారువేసిన బానిసత్వపు సంకెళ్ళను పటిష్ఠం చేసేందుకు అవన్నీ వినియోగించాయి. ఒక ఇంగ్లీషు చరిత్రకారుడు ఈవిధంగా వ్రాసినాడు; 'ఇంగ్లండులో ఉన్న దేహదార్ఢ్యంగల వ్యక్తులందరికీ ఆయుధాలిచ్చి సైన్యంగా రూపొందించినప్పటికీ, సొంతశక్తితో వారు భారతదేశాన్ని జయించలేరు; శాంతియుతంగా పరిపాలన చేయడం మరింత అసంభవం. నిజానికి ఆదేశీయులే తమ అంతఃకలహాలమూలంగా మన కొక రాజ్యాన్ని సృష్టించారు. ఈనాటికీ ఇంగ్లాండుకు బడితొత్తులుగా పడిఉండడమె వాళ్ళకుతృప్తి".

## చరిత్రచేస్తున్న హెచ్చరిక

కాబట్టి చరిత్రయొక్క తీర్పు పొరబడటానికి అవకాశం లేనంత స్పష్టంగా ఉంది. మనలో జాతీయచైతన్యం లేకపోవడం, ఒకే జాతిలోని సజీవ అవయవాలవంటివారమనే భావన మనకు లేకపోవటం, ఆ లేమివల్ల కలిగే అన్యోన్య విద్వేషం, విషమత, అసూయ, స్వార్థ ప్రయోజనాలను పొందేనిమిత్తమై మనమధ్య జరిగిన అంతఃకలహాలు, ఇవన్నీ గత వేయి సంవత్సరాలుగా మన జాతియొక్క నరనరాన్ని నమిలివేస్తున్నాయి.

మనకు శత్రువులు ముస్లిములు కాదు; ఆంగ్లేయులూ కాదు. మనకు మనమే శత్రువులం.

*ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥*
(తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు)

అని బోధిస్తూంది భగవద్గీత. మనవిషయంలో రెండవభాగంలోని సత్యం మాత్రం ఋజువైంది. అందుకనే మన పతనానికీ, మన వినాశనానికి విదేశీ దురాక్రమణదారులను నిందించడంవల్ల ప్రయోజనంలేదని మనం చెప్పుతాం. దోపిడీ చెయ్యడాని కలవాటుపడిన జగత్తుకు, బలహీనమైన ఇతర దేశాలను జయించటం, దోచుకొనటం, నాశనంచేయటం సహజలక్షణమే. పాము మనిషిని కరిస్తే అందులో దోషమేమీలేదు. అది దాని స్వభావంలోనే ఉంది. దోషమల్లా, పాముకాటునుండి తనను కాపాడుకోడానికి జాగ్రత్త వహించని వ్యక్తిదే. గత వేయిసంవత్సరాల చరిత్రలో అనేక అవమానాలు, ప్రమాదాలు మాటిమాటికీ అనుభవిస్తున్నప్పటికి, మన పతనానికి మనమే బాధ్యులమనీ, అటువంటి ప్రమాదకరమైన బలహీనతలు తొలగించుకోకపోతే ఒకజాతిగా మనం జీవించలేము – ఈ ముఖ్యమైన ప్రాథమికపాఠాన్నైనా గ్రహించకపోవడం మన దురదృష్టం.

ఇప్పటికైనా మనం ఆ పాఠాన్ని గ్రహించగలిగామా ? మనం స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాం; సర్వత్ర ఒక జాగృతి వచ్చింది; కాబట్టి గతంలో మనలోఉన్న లోపాలు మొదలైనవాటిని గురించి, మనం బాధ పడనక్కరలేదని ఈ రోజుల్లో కొందరనటం వింటూ ఉంటాం. ఐతే మన త్యాగంవల్ల, పరాక్రమంవల్ల మాత్రమే మనం సాధించుకోగలిగామనడం నిజమా ? అదే నిజమైతే మరి స్వాతంత్ర్యపోరాటం సలుపనట్టి బర్మా సింహళాలనుకూడ ఆంగ్లేయులు ఎందుకు విడిచిపెట్టిపోయారు ? వీసమెత్తు త్యాగమయినా ముస్లిములు చేయకుండానే 'పాకిస్తాన్' అనే ఒక క్రొత్త స్వతంత్రరాజ్యంఏవిధంగా ఏర్పడింది ? అవిభాజ్య భారత స్వాతంత్ర్యాన్ని కోరుతూ తాముచేసిన ప్రకటనలకు, వాగ్దానాలకు వ్యతిరేకంగా మన నాయకులు గూడ విభజనను ఎందుకు అంగీకరించినారు ? అసలు విషయమేమంటే

రక్తపుటేరులలో ముంచెత్తిన గత ప్రపంచయుద్ధానంతరం ఇంతటి సువిశాలమైన సామ్రాజ్యాన్ని నిర్వహించగల సామర్థ్యం ఆంగ్లేయులకు లేకపోయింది. భారతదేశంలోని సైన్యాలు తమకు విధేయంగా ఉంటాయనే విశ్వాసం వారికి లేదు. అయినప్పటికీ చతురులైన ఆంగ్లేయులు తమ సత్సంబంధాలను కాపాడుకొంటూనే, పాకిస్తాన్ రూపంలో తమకొక శాశ్వతమైన స్థావరాన్ని ఏర్పరచుకొని ఈ దేశాలన్నిటినీ విడిచిపోయారు. ఒక అర్ధశతాబ్దం ముందే సర్ జాన్ స్ట్రాచీ "ఆంగ్లేయులు ఒకవేళ తప్పనిసరిగా భారతదేశాన్ని విడిచి వెళ్ళవలసివస్తే వారు 'హిందూ ఇండియా', 'ముస్లిం ఇండియా'లుగా దీన్ని విడగొట్టిన తర్వాతనే వెడతారు" అని ఒక పుస్తకంలో వ్రాశాడు. ఆ వాక్యాలకూ ఈనాడు జరిగినదానికీ తేడా ఒక్కటే. మన నాయకులు ఆంగ్లేయుల నిర్ణయాన్ని అమలుచేయటానికి సహకరించటమేగాక అంతకన్నకూడా ఒక అడుగు ముందుకువేసి, ఈదేశాన్ని 'ముస్లిం ఇండియా'గాను 'ముస్లిమేతర ఇండియా'గాను విభజించారు.

## కార్యకారణ సిద్ధాంతం

చరిత్రనేర్పిన పాఠాలు గ్రహించైనా, మృత్యుసదృశాలైన లోపాలను తొలగించుకోలేదు, అని పాకిస్తాన్‌యొక్క నిర్మాణం నిరూపించింది.

ఆంగ్లేయులు వెళ్లిపోతున్న సమయంలో, హిందువులు బొత్తిగా అనైక్యంగాఉన్నారు. జాతీయనాయకత్వంకూడా బొత్తిగా గుండెచెదిరిపోయిఉంది. ఆంగ్లేయులయొక్క కుతంత్రాలను, ముస్లిములు చెదురుమదురుగా చేసే చిన్నచిన్న దాడులనుగూడ ఎదుర్కొనేశక్తి ఆ నాయకత్వానికి లేకపోయింది. దానిఫలితంగానే దేశవిభజన జరిగింది. చరిత్ర పునరావృతమైంది. అది మన దురదృష్టం. 'చరిత్రనుంచి గుణపాఠాన్ని గ్రహించము' అనే సత్యాన్ని మాత్రమే గతచరిత్రనుంచి మనం గుణపాఠంగా గ్రహించాం. మన మాతృభూమిలోని పెద్దపెద్ద భూభాగాలు - అంటే పంజాబులో సగం,

బెంగాలులో నగం, సింధు, సరిహద్దు ప్రాంతాలు, మన దేశచరిత్రలో మరొకసారి శత్రువుల చేతుల్లో పడ్డాయి.

ఈ ప్రాంతాలు ఒకప్పుడు హిందూజాతి కీర్తిప్రతిష్ఠలకు నిలయాలు. మన పవిత్రపరంపరలోని పవిత్రాతిపవిత్రములైన వేదాలు పుట్టిన భూమి పంజాబు. మన మహాఋషులు సింధునదీతీరాల్లో తపస్సు ఆచరించారు. మహాత్ములకు, కవులకు, విప్లవకారులకు పుట్టినిల్లు బెంగాలు, సరిహద్దు ప్రాంతం వేలాది సంవత్సరాలుగా సజీవదుర్గంగా మనకు రక్షణ కల్పిస్తూ ఉండేది. స్వతంత్ర హిందూసామ్రాజ్య ప్రాభవం అక్కడ నిరాఘాటంగా కొనసాగింది. కాని కొన్ని శతాబ్దులక్రిందట ఆ యా భాగాలు ముస్లిముల దండయాత్రకు లోనయ్యాయి. తరువాత అవి తమ బానిసత్వ శృంఖలాలను త్రెంచుకొని బయటపడ్డాయి. అయితే వెంటనే మరొక శత్రువైన ఆంగ్లేయుల పాలనలోకి వచ్చినాయి. ఈనాడు అవి మళ్ళీ ముస్లిములకు పాదాక్రాంతం అయినాయి.

1947లో ముస్లిములకు ధారాదత్తం చేసినతర్వాత ఆప్రాంతాల్లో లక్షలాది హిందూ సోదరీ సోదరులు దారుణమైన ఊచకోతకు గురి అయ్యారు. వారు మన స్త్రీల గౌరవాన్ని కాలరాచివేశారు. కత్తిమొనచూపి పెద్దపెట్టున అక్కడ మతాంతరీకరణం జరిగింది. వేయి సంవత్సరాల క్రితం ముస్లిందోపిడీదారులు హిందువులపై జరిపిన అమానుషమైన దురంతాలు మళ్ళీ కొనసాగాయి. అదేస్థాయిలో, అంతటి కిరాతకంగానూ క్రూరత్వం అక్కడ ఇంకా కొనసాగుతూనే ఉంది. సర్వనాశనమయి, జీవచ్ఛవాల్లా వేలసంఖ్యలో ఎడతెరపిలేని ఒక ప్రవాహంలా రోజురోజుకూ అక్కడినుంచి పశ్చిమబెంగాలుకు రావటంకన్న స్పష్టమయిన ఉదాహరణ దీనికి వేరొకటి ఉంటుందా ?

ఈ భూమికి సంతానమయిన హిందువుల్లో సుసంఘటితము, సమైక్యమునైన జీవితం లేకపోవటమొక్కటే-ఆనాడు ఒక వేయిసంవత్సరాల

క్రిందట, ఈనాడు వేయిసంవత్సరాల తర్వాతకూడ – మన జాతీయదురవస్థకు మూలకారణం. కార్యకారణనియమానికి దేశకాలనిబంధనలు లేవు. మన జాతీయ జీవనంలో సంభవిస్తున్న ఇట్టి కఠోరసత్యానికి గత వేయి సంవత్సరాల చరిత్రలోని ప్రతిపుటకూడ మూగసాక్షిగా నిలిచిఉన్నది.

ఇక, ఆంగ్లేయులు వెడలిపోయినతర్వాత మన హస్తగతమైన ప్రాంతాల్లోని స్థితిగతులను పరిశీలిద్దాం. మన స్వాతంత్ర్యం, మన గౌరవ ప్రతిష్ఠలు అధమపక్షం ఇక్కడైనా భద్రంగా ఉన్నాయా ?

## జయచంద్రుల పరంపర

మొదటి విభజన జరిగినతర్వాత, కాశ్మీరును మళ్ళా విభజించారు. వ్యగ్రస్థులైన మన పండిత నెహ్రూ కాశ్మీరు సమస్య అనబడేదాన్ని పరిష్కరించివేసే ఉద్దేశ్యంతో ఆక్రమిత కాశ్మీరు భూభాగాన్ని పాకిస్తానుకు ఇచ్చివేయటానికికూడ ఒకప్పుడు తన సుముఖత వెలిబుచ్చారు. కాశ్మీరు విషయంలో జనాభిప్రాయసేకరణ ప్రతిపాదనకూడ మన నాయకులు చేశారు. ఇది దేన్ని సూచిస్తుంది? దేహంలోని ఒకభాగానికి గాయం తగిలితే నీ గతి నువ్వు చూచుకొమ్మని దానితో చెపుతామా ? ఆ విషయమై దేహమంతా ఒకటిగా నిర్ణయం తీసుకోనక్కరలేదా ? అట్లాగే, జనాభిప్రాయసేకరణే గనుక జరుపవలసివస్తే, మనదేశం మొత్తంలో అది జరగాలి. కాశ్మీర్‌లో మాత్రం జనాభిప్రాయసేకరణ అన్నామంటే, మాతృభూమియొక్క సమైక్యతాభావన మన మనస్సుల్లోంచి మాయమైందనే అర్థం.

వీటికితోడు మన ప్రజల్లో, ప్రతి చిన్నవిషయం గురించి – అంటే భాష, కులం, తెగ, పక్షం మొదలైనవాటి నాధారంచేసుకొని తీవ్రమైన అభిప్రాయభేదాలు పెరుగుతున్నాయి. ప్రతివాడు తనభాష కొకరాజ్యం, తన తెగ కొకరాజ్యం కావాలని కోరుతున్నాడు. ఒకవేళ ఒకే కేంద్రంక్రింద

ఉండటానికి సంసిద్ధుడైతే, అది సడలుగానున్న ఒక సమాఖ్యగా ఉండాలనీ, దానిలో కేంద్రంయొక్క అధికారం నామమాత్రంగా ఉంటూ, తనరాజ్యానికి అధికాధికంగా అధికారం రాబట్టాలనీ చూస్తున్నాడు.

గత వేయి సంవత్సరాలుగా శాపంపెట్టినట్లు పరస్పర విద్వేషం, అసూయలు మన జాతీయజీవనాన్ని ఛిన్నాభిన్నంచేసినాయి. అవే ఈనాటికి గూడ ప్రాంతం, పక్షం, భాష, కులం, పంథ అనే సరిక్రొత్త ముసుగుల్లో పైశాచిక నృత్యంకొనసాగిస్తూనే ఉన్నాయి. ఒకప్పుడు ఆంధ్ర ప్రాంతంలోని ఒక ప్రముఖనాయకుడు ప్రత్యేక ఆంధ్రప్రాంతం ఏర్పాటు చేయకపోతే, దాన్ని సాధించేందుకు రష్యా సహాయాన్ని కోరుతానని బహిరంగంగా ప్రకటించాడు. పంజాబీ సుబాను ఏర్పాటుచేయకపోతే సిక్కులందరూ సామ్యవాదులుగా మారిపోతారని ఒక ప్రముఖ సిక్కు నాయకుడు బెదిరించాడు. సరిహద్దుల్లో చైనాసైన్యాలు మాటువేసి కూర్చున్నప్పుడు ఇటువంటి ప్రకటనలు చేయడంలో ఒకేఒక ఆంతర్యం ఇమిడిఉంది. తాము ఒక ప్రత్యేక ప్రాంతంగా ఏర్పడేందుకు, విదేశీ దురాక్రమణదారులు చేసే సహకారానికి ప్రత్యుపకారంగా వారికి స్వాగతం పలికి లోపలినుండి సహాయాన్ని వాగ్దానం చేయటమే అందలి ఆంతర్యం. పాకిస్తానునుండి ఏదోసహాయం పొందేకోర్కెతో కొన్ని ఏండ్లక్రితం ఆ నాయకుడు దానితో మంతనాలారంభించాడు. అటువంటప్పుడు జయచంద్‌ల, రాజా మానసింహుల తెగ ఈ దేశంలో అంతరించిపోయిందని చెప్పగలమా?

## చరిత్ర పునరావృతం ఔతోంది

శత్రు మిత్ర విచక్షణాశక్తిని మనం కోల్పోయేట్లు చేసిన మహా ప్రమాదకరమైన రోగం జాతీయభావనావిస్మరణ. అది మునుపటివలె కొనసాగుతూనే ఉన్నది. ఒకసారి నాగపూర్‌లో బ్రాహ్మణేతరులమని

చెప్పుకుంటూండేవారి సమావేశం జరిగింది. అందులో ముస్లిము, క్రైస్తవ ఉపన్యాసకులుకూడా మాట్లాడటం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆ సమావేశనిర్వాహకులలో ఒకరిని పిలిచి ఇదేమిటని నేనడిగేసరికి "అవును; వారుకూడా బ్రాహ్మణేతరులుగదా" అని అతడు సమాధానం చెప్పాడు. ఏకులానికి, ఏతెగకు చెందినవారైనా హిందువులంతా ఒకేజాతి అవుతారు; ముస్లిములు, క్రైస్తవులు పూర్తిగా విరుద్ధమైన ఒక వర్గానికి చెందినవారు అనే ఈచిన్న సత్యాన్ని హిందువులు గుర్తించలేకపోవటం ఎంతో విచిత్రంగా ఉంటుంది. పంజాబులోని అంబాలా నియోజకవర్గంలో ఉన్న ఒక్కగానొక్క ముస్లిం ఓటరు 1957 ఎన్నికల్లో పోటీచేశాడు. నియోజకవర్గంలోని ఇతరులందరూ హిందువులే; పదిసంవత్సరాలక్రితం ముస్లిముల చేతుల్లో చెప్పరాని దురంతాలకు గురిఅయినవారే. అయినా ఆ ముస్లిం గెలుపొందినాడు. ఇది నమ్మశక్యం గాకపోయినాగాని, నిష్ఠుర సత్యం. మన జాతియొక్క ఆత్మహత్యాసదృశమైన ఆత్మవిస్మృతియొక్క స్థాయి ఇట్టిది.

అంతఃకలహాలు లేనిప్రాంతం అంటూ దేశంలో ఏదీ లేదు. శత్రువులు ప్రవేశించి, తమస్థితిని పటిష్ఠం చేసికొనేందుకు అవసరమైన భూమికను ప్రతిచోట మన ప్రజలే తయారుచేస్తున్నారు. 1960 జూలైలో అస్సాములో జరిగిన బెంగాలీ వ్యతిరేక కలహాలవల్ల బెంగాలీహిందువులు అధికసంఖ్యలో నిర్వాసులై ఆప్రాంతం విడిచిపోవలసివచ్చింది. కీలక ప్రాంతమైన అస్సాములో హిందువుల శాతం తగ్గించేందుకు దోహదం చేసినందువల్ల, ఆ కలహాలు ముస్లిములకు మరింత ప్రయోజనకరంగా ఉన్నాయి. అస్సామీలకు, బెంగాలీలకు మధ్య ఏర్పడిన పరస్పర విద్వేషమూ, విషమతా ఆప్రాంతంలో హిందువులపై ముస్లిములు తరచు జరుపుతున్న దురంతాలు మరింత తీవ్రంకావటానికి తోడ్పడ్డాయి.

అస్సామీల, బెంగాలీల మధ్యనున్న వైషమ్యం కారణంగానే నిజానికి మన శ్రీహట్ (సిల్‌హట్) జిల్లాను పాకిస్తానుకు కోల్పోయాం.

శ్రీహట్ జిల్లా భారత్‌లో ఉండాలా? పాకిస్తాన్‌లో చెరాలా? అనే విషయం నిర్ణయం చేసేందుకుగాను 1947 లో ఆ జిల్లాలో జనాభిప్రాయసేకరణ జరిగింది. అస్సామీ బెంగాలీ తగాదాలతోను, ఈర్ష్యాసూయలతోను చీలిపోయిన హిందువులు అందులో ఓటు చేయటానికే శ్రద్ధచూపలేదు. రాజకీయంగా జాగరూకులై ఉన్న ముస్లింలు తమవారిని అన్నిచోట్లనుండి అధికంగా ప్రోగుచేసికొని మూక ఉమ్మడిగా పాకిస్తానుకు ఓటుచేశారు. అధిక సంఖ్యాకులు హిందువులై ఉన్నప్పటికీ శ్రీహట్ పాకిస్తానువశం అయిన గాథ అట్లాంటిది.

## విదేశీయుల వల

ఒకేదేశానికీ, ఒకేసంస్కృతికీ చెందినవారం అనేభావం మనప్రజల్లో పూర్తిగా లోపించడంచేత, కుటిలుడైన ఏ విదేశీయుడైనాసరే విఘటన బీజాలను నాటడానికి తగిన సారవంతమైన భూమిగా ఈజాతి తయారయింది. అటువంటి కపటప్రచార ప్రవాహంలో మేధావులనబడేవారుగూడ కొట్టుకొని పోతున్నారు. ఉదాహరణకు చెప్పాలంటే ప్రత్యేకతమిళనాడు ఉద్యమం విదేశీయుల కుటిలబుద్ధివల్ల జన్మించినదే. 80 ఏండ్లక్రితం ఒక క్రైస్తవ ప్రచారకుడు ప్రథమంగా ప్రతి నగరం, ప్రతి గ్రామం తిరిగి, తమిళ సంస్కృతి, తమిళభాష–తమిళులకు చెందిన ప్రతిదీ, మిగిలిన భారతీయ సంస్కృతి, భాషలు మొదలైనవాటితో మౌలికంగా భేదిస్తాయనీ, అసలు తమిళులు ఒక స్వతంత్రజాతి అనీ దుష్ప్రచారం ఎడతెరపిలేకుండా చేశాడు. విషపూరితమైన ఈ సిద్ధాంతం సామాన్యమానవులకు రుచికరంగా ఉండే నిమిత్తమై "తిరుక్కురల్" గ్రంథానికి అతడొక అసంగతమైన వ్యాఖ్యానం చేశాడు. అయితే ఇందులో ఆశ్చర్యమేమంటే మేధావులనబడేవారుకూడ తమకోసం పన్నిన ఈ వలను గుర్తించలేకపోతున్నారు. పైగా వారిలో కొందరు శత్రువుల ఆటకు తాళం వేయటం గర్వకారణమనికూడా భావిస్తున్నట్లున్నది. ఈనాడు ఈఉద్యమానికి ఆలోచనాబలాన్ని సమకూరు

స్తున్నారని చెప్పబడేవారు చెప్పతూఉండే కారణాలుకూడా ఆనాటి విదేశీ మతప్రచారకుని మాటలకు చిలుకపలుకులవంటివి మాత్రమే.

'ప్రాచీనకాలంలోకూడా, సాంస్కృతికంగా భారతదేశం ఒకటిగానే ఉన్నప్పటికీ, ఎప్పుడూ అనేక రాజ్యాలు ఇచట ఉంటూనే ఉండేవి. ఇప్పుడు కూడ భౌతికసంక్షేమదృష్ట్యా ప్రత్యేకరాజ్యాలు ఏర్పరుచుకొన్నా, ఇదివరకు మాదిరిగానే మన ప్రజలు దేశమంతా తీర్థయాత్రలు చేస్తుంటారు. మనం దేశాన్ని సాంస్కృతికంగానూ, ఆధ్యాత్మికంగానూ ఒకటిగానే భావిస్తుంటాము. అప్పుడు ప్రమాదమేమున్నది' అని ప్రత్యేక ద్రవిడనాడు ఉద్యమాన్ని బలపరుస్తూ ఒకవాదం గట్టిగా ప్రతిపాదింపబడుతోంది. సర్వదా సాంస్కృతికంగా మనం ఒకటిగా ఉంటున్నప్పటికీ పూర్వం చిన్నచిన్న రాజ్యాలు అనేకం ఉన్నమాట నిజమే. అయితే ఈ దేశంలోని ప్రముఖ చక్రవర్తులలో దేశాన్నంతనూ ఒకే పరిపాలనక్రిందకు తీసుకురావలెననే తహతహకూడ ఎల్లప్పుడుఉన్నదనేదికూడ సత్యమే. రాజసూయ, అశ్వమేధయాగాల లక్ష్యం భారతదేశాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యంక్రిందికి తీసికొనిరావడమే. ఈయజ్ఞాలు చేసేవారిలో ఇతర రాజ్యాల్లోని ప్రజలను అణగద్రొక్కాలనిగాని, దోచుకోవాలనిగాని, మరే స్వార్థప్రయోజనాలుగాని లేవు. సర్వోచ్ఛమైన ఒకే కేంద్రీయ అధికారానికి, చిన్నచిన్న రాజ్యాలన్నీ విధేయమై ఉండాలని మాత్రమే ఆతడు వాంఛించేది. ఇతర విషయాల్లో పూర్వంలాగానే చిన్న చిన్న రాజ్యాలు స్వతంత్రంగా జీవించేందుకు ఆతడు అంగీకరించేవాడు.

గతంలో ఇక్కడ అనేక చిన్నరాజ్యాలున్నాయి అనిమాత్రమేగాక చరిత్ర మరొక కటుసత్యాన్నిగూడ చెప్పతోంది: అనేక చిన్నచిన్న రాజ్యాలుండటంవల్ల, అవి కాలక్రమంలో ఒకదానికొకటి దూరమై పరస్పర విద్వేషానికి లోనయ్యాయని, వాటిమధ్య ఏర్పడినట్టి విద్వేషమే వాటితోబాటు దేశాన్నంతనూ ఆక్రమించడానికి వేయి ఏండ్లకుపైగా విదేశీ దురాక్రమణ కారులకు దోహదంచేసింది అని, దేశంలోని ఒకప్రాంతంయొక్క బాగోగు

లకు యావత్తు దేశంతోను విడదీయరాని అనుబంధం ఉన్నదని చరిత్ర తగినంత ఋజువు ఇచ్చింది. ప్రత్యేక ద్రవిడనాడు కావాలని కొనసాగే ఉద్యమంలోవలెనే అట్టి ఉద్యమాలకు భౌతికసంక్షేమమే ప్రేరకమైతే ఏదో ఒక విదేశీశక్తి కొన్ని భౌతికములైన ఎఱలను గుప్పించి, వాళ్ళను తనచేతిలో పాచికగా చేసుకోవడం తప్పదు. అటువంటిదే జరిగితే, అది మిగిలిన భారతదేశమంతటితోబాటు, చివరకు ద్రావిడనాడుకు కూడ, సర్వనాశనం తెచ్చిపెడుతుంది. గతంలో ఇదే జరిగింది.

## విషబీజం

మన ప్రస్తుత రాజ్యాంగాన్ని తయారుచేసినవారికిగూడ ఏకాత్మకమైన రాష్ట్రీయభావనపట్ల దృఢవిశ్వాసం లేదని, రాజ్యాంగంయొక్క 'సమాఖ్య' స్వరూపాన్ని చూచినప్పుడు అర్థమవుతుంది. కొన్నిరాజ్యాలయొక్క సమాఖ్య అని దీన్ని ఈనాడు అంటున్నారు. పూర్వవ్యవస్థలో కేవలం ప్రాంతాలుగా ఉన్నవాటికి ఇప్పుడు కొన్ని ప్రత్యేకాధికారాలుగల రాజ్యాల ప్రతిపత్తి కల్పించారు. నిజానికి ఏకైకమైన మన జాతీయజీవనాన్ని గతంలో వేర్వేరు రాజ్యాధికారాలుగల అనేకభాగాలుగా విడగొట్టటమే జాతీయ విఘటనకు, పరాజయానికి బీజాలను నాటింది. ఈనాటి సమాఖ్య స్వరూపంలోనున్న రాజ్యాంగంలోకూడ, అదేవిధమయిన విఘటనబీజాలు ఇమిడిఉన్నాయి. అవి ప్రాంతాలమధ్య సరిహద్దు తగాదాలుగాను, నదీజలాల పంపిణీ సమస్యలుగాను రూపొందుతున్నాయి. ఆ తగాదాలన్నింటికీ ఈనాడు ఒక 'గౌరవస్థాయి' కల్పించి, రెండు స్వతంత్ర దేశాలమధ్య ఉన్న తగాదాలవలె 'సరిహద్దు తగాదాలు' 'నదీజలాల వివాదం' ఇత్యాది నామాలతో అధికారికంగా పరిగణిస్తున్నారు. తనకు నచ్చేవిధంగా మైసూరు, మహారాష్ట్ర ప్రాంతాల మధ్యగల సరిహద్దు తగాదా తీర్చనంతవరకు మనదేశ సరిహద్దులపై చైనా జరుపుతున్న దాడిని గురించి ఆలోచించటానికి సమయంగాని, కోరికగాని తనకు లేవని మహారాష్ట్ర ప్రాంత నాయకుడు ఒకడు ఒకసారి అన్నారు.

ఆహారసమస్య తీవ్రంగా ఉన్న ఈ రోజుల్లో లక్షలాది జనం ఆకలి బాధలతో అలమటించిపోతుంటేకూడ ప్రాంతీయతత్త్వమనే విషదంష్ట్రలు మాటునబడలేదు సరిగదా సమాజదేహంలో మరింత విషాన్ని ఎక్కించాయి. 1963-64 లో మధ్యప్రదేశ్, పంజాబుల్లో గోధుమనిలువలు అధికాధికంగా ఉండేవి. అయినా ఆ ప్రాంతప్రభుత్వాలు వాటిని ఇరుగుపొరుగు ప్రాంతాలకు ఇవ్వడానికి ఇష్టపడలేదు. పంజాబు ప్రాంతంలోని మిగులు గోధుమలు పాడైపోతుంటే చివరకు వాటిని పశుగ్రాసంగా ఉపయోగించవలసివచ్చిందని పత్రికలు వార్తలు ప్రకటించాయి. అయినా పంజాబు ప్రభుత్వం దానిలో ఒక్క గింజనయినా, ఆహారపదార్థాలు చాలక బాధపడుతున్న తమ పొరుగు ప్రాంతమైన ఉత్తరప్రదేశ్‌కు మాత్రం ఇవ్వటాని కిష్టపడలేదు. చివరకు కేంద్రప్రభుత్వం ఒత్తిడి చేసిన తర్వాత మాత్రమే ఉత్తరప్రదేశ్ కోరినదానిలో ఐదవవంతును ఇవ్వటానికి అంగీకరించింది. అదికూడా బాధపడుతున్న పొరుగుప్రాంతానికి సహాయంగాకాదు, తాము గోధుమ లివ్వనందుకు ప్రతిచర్యగా లోగడ ఉత్తరప్రదేశ్ సరఫరా చేయటానికి నిరాకరించి, ఆనాడు మరల సరఫరా చేస్తున్న సారాయి, పంచదారలకు ప్రత్యామ్నాయంగానే ఈ సరఫరాచేసింది. దాదాపు పదివేల మైళ్ళ దూరంలో, సముద్రానికవతల ఉన్న అమెరికానుండి గోధుమలు మనగుమ్మంలో దిగడం సాధ్యమవుతుందిగాని, మన దేశంలోనే పండిన గోధుమలు దేశంలోని మిగులుప్రాంతాలనుండి కరవులో బాధపడుతున్న పొరుగుప్రాంతాలకు మాత్రం చేరవు ఎంత సిగ్గుచేటు!

రాజకీయపక్షాలకు గుర్తింపు నిచ్చే నిమిత్తమై ఎన్నికల సంఘం ఈ మధ్య ఒక క్రొత్తసూత్రాన్ని రూపొందించింది. యావద్భారతస్థాయిలో గుర్తింపునిచ్చే పద్ధతిని విడిచిపెట్టి, ప్రాంతస్థాయిలో గుర్తించే పద్ధతి స్వీకరించింది. దేశవ్యవహారాలను నిర్వహించేవారి మనస్సు పనిచేస్తున్న తీరును అది సూచిస్తుంది. అవిభాజ్యమైన సంపూర్ణ జాతీయసమైక్యతకన్న ప్రాంతాల ప్రత్యేక అస్తిత్వంయొక్క ఆలోచనాధోరణియే వారికి ఎక్కువగా

ఉందని తెలుస్తున్నది. వారు ఒకప్రక్క జాతీయసమైక్యతను గురించి తీర్మానం చేస్తూఉంటారు; నిర్వహణలో మాత్రం జాతీయసమైక్యతాభావనను కూకటివేళ్ళతో పెల్లగించివేసే సిద్ధాంతాలను రూపొందిస్తూ ఉంటారు.

ఇవన్నీ దుశ్శకునాలే; ఇంకా ముందుంది ముసళ్ళ పండుగ. భాషా ప్రయుక్తరాష్ట్రాలు అనేవిషపూరితసిద్ధాంతం 'స్వయంనిర్ణయాధికారం' 'విడిపడి పోయే అధికారం' మొదలైన కోర్కెలను రెచ్చగొట్టింది. ప్రస్తుత రాజ్యాంగం 'విడిపడిపోయే హక్కు'ను అంగీకరించకపోవచ్చునుగాక, కాని అధికారంలోనున్న కాంగ్రెసుపక్షం ఈ సిద్ధాంతాన్ని చాలాకాలం క్రిందటనే ఆమోదించిందనీ, నిజానికి మన మాతృదేశ విభజనకు అంకురార్పణ ఆనాడే చేసిందనీ మరచిపోరాదు. ఈనాటికిగూడా కాంగ్రెసు పక్షం తన పాతతీర్మానాన్ని రద్దుచేసికోలేదనేదికూడ గమనించాలి. ఆ కాంగ్రెసు నాయకత్వం కొనసాగుతూ ఉండగా, ప్రాంతము, భాషలయొక్క ఈర్ష్యాసూయలప్రకోపం రోజురోజుకూ పెరుగుతూండగా, దేశంనుండి విడివడిపోయే అధికారాన్ని అంగీకరిస్తూ దానికనుగుణంగా మనరాజ్యాంగాన్నే సవరించే రోజు రావచ్చును. ఇప్పటికే బెరుబరీ విషయంలో రాజ్యాంగం సవరించి, మన మాతృదేశంలోని భాగాలను విదేశాలకు ధారాదత్తంచేసే 'అధికారం' లోకసభకు – అంటే అధికారంలోని రాజకీయపక్షానికి ఇచ్చారు అని మనకు తెలుసు.

రాజ్యాంగ హృదయాన్నే బ్రద్దలుచేసే సవరణలు తరచు చేస్తూనే రాజ్యాంగంయొక్క పవిత్రతను, దేశంయొక్క సమైక్యతను సంరక్షించేందుకు ప్రతిజ్ఞను స్వీకరించవలసిందిగా ప్రజలను మాత్రం ప్రబోధిస్తున్నారు. ఆ ప్రతిజ్ఞలను ప్రజలచేత చేయిస్తున్న దెవరు? రాజ్యాంగాన్ని ధ్వంసం చేయడానికి కృతనిశ్చయులైన "విభజన నిపుణులు." ఇంతకన్న అప హాస్యం వేరే ఉంటుందా?

ఈనాటికీ విభజనశక్తులు, జాతి జీవశక్తిని హరిస్తున్నాయి. నాటి దుఃఖానికీ, దుర్భరదారిద్ర్యానికీ కారణాలైన ఇవి, ఈనాడు మితిమీరినాయి. జీర్ణించిపోయిన ఈ రోగం, మన స్వాతంత్ర్యాన్ని మింగివేయదని నమ్మక మేమిటి ?

## మౌలిక చికిత్స

ఈ పరిస్థితుల్లో సమాజానికి మనం చేయగల ఉత్తమమైన సేవ ఏమిటి ? జాతీయాత్మవిస్మరణ అనే మూలరోగాన్ని నిర్మూలించి సుదృఢము, సువ్యవస్థితము, చైతన్యవంతము, ఆత్మనిర్భరమునైన జాతీయజీవనాన్ని నిర్మించటమే నిజమైనసేవ కాగలదు. అప్పుడుమాత్రమే మన స్వాతంత్ర్యం సుదృఢంగాను, భద్రంగాను ఉండగలదు. చెట్టు వేళ్ళను నిర్లక్ష్యంచేసి కలకాలం ఫలాలను అనుభవించగలమని భావించటం నిష్ప్రయోజనం. పురుగుపట్టినప్పటికీ, కొంతకాలంపాటు చెట్టుకు పండ్లు కాస్తాయి; సందేహంలేదు. అయితే ఆపండ్లు నిస్సారములై, అనారోగ్యం, అరుచి కలుగజేసేవిగా ఉంటాయి. ఈనాడు మనం సాధించుకొన్న స్వాతంత్ర్యమనే పండుకూడా వివిధజాడ్యాలు కలది. జాతీయతయొక్క వేళ్ళు మన ప్రజలమనస్సుల్లోకి, హృదయాల్లోకి లోతుగా నాటుకోకపోవటమే అందుకు కారణం. వేళ్ళను అశ్రద్ధచేస్తే కొంతకాలం తర్వాత ఈ పండ్లుకూడ అదృశ్యమయి ఎండిన బోదె మాత్రమే మోడులా నిలుస్తుంది. మనం వేళ్ళను గురించి శ్రద్ధవహిస్తే పండ్లు వాటంతట అవే లభిస్తాయి. ఎక్కడ నుంచో పండ్లనుతెచ్చి, చెట్టుకు అతికించవలసిన అవసరంలేదు. కాబట్టి మనం మన జాతీయతయొక్క వేళ్ళు లోతుగాను, దృఢంగాను నాటుకొనేట్లుచూస్తే స్వతంత్రులమై తలెత్తుకొని ప్రపంచంలో వీచే తుఫానుగాలులమధ్య నిటారుగా నిలువగలం.

ఈ పని సాధించడం ఎట్లా? కేవలం కొత్త పరిశ్రమలు ప్రారంభించటం వల్లను ఆర్థిక ప్రణాళికలవల్లను ఇదిసాధ్యమౌతుందా? కాదు. రోగియొక్క మూల జాడ్యాన్ని తొలగించాలంటె అతనికి ఇవ్వవలసినది రుచికరమైన ఆహారం కాదు, ఇవ్వవలసినది ఔషధం. మిక్కిలి బలహీనస్థితిలోనున్న రోగి తనకొరకు సమకూర్చే ఆహారపదార్థాలు తినటానికి వచ్చే కుక్కను కూడ తరిమికొట్టలేడు. మనదేశంయొక్క స్థితికూడా దీనికి భిన్నంగా లేదు. దేశంలోని అనైక్యత, ఆత్మవిస్మృతి అనే ఆంతరికజాడ్యాలు తొలగి జాగృతమై సుసంఘటితం కానిదే, ప్రపంచంలో ఏవిధమైన పురోభివృద్ధినైనా అనుభవించటానికి సమాజం సమర్థంకాదు. ఈ ప్రాథమికావసరం తీరకుండా కేవలం భౌతికసమృద్ధిని సాధించేందుకు చేసే ఏ ప్రయత్నమైనా సరే సమాజానికి సేవచేయటానికి బదులు ఒక శాపంగా రూపొందవచ్చును. అనంతమైన సంపదయే కిరాతకులైన దోపిడీ ముఠాలను మనదేశంపైకి ఆకర్షించిందని చరిత్ర మనకు చాటుతుంది. అట్టి సంపదను సంరక్షించుకొనే సంఘటితశక్తి మనకు లేకపోవటంవల్లనే, ఆనాటి వైభవాన్నంతనూ ఆ దోపిడీ ముఠాలకు కోల్పోయి, ఈనాడు ఇంతటి దుఃఖానికీ, దారిద్ర్యానికీ - దౌర్భాగ్యానికి గురిఅయ్యాం.

కాబట్టి మన మాతృసమాజాన్ని ప్రగాఢమైన జాతీయ చైతన్య భావనతోను, సమన్వయంతోను ఉప్పొంగజేసి మరొకసారి సమైక్యము, సుసంఘటితము, జాగరూకము చేయడం ద్వారా, జాతికి పట్టిన మౌలిక జాడ్యాన్ని నిర్మూలించటానికి కృతనిశ్చయులం కావాలి. ఈలక్ష్యపూర్తికై మాతృభూమి సంతానమైన ప్రతిఒక్కనికి సమైక్య జాతీయతాసందేశాన్ని అందించి వారందరినీ పరస్పర ప్రేమానుశాసనాల సూత్రాలతో బంధించి, ఒక మహత్తరమైన సుసంఘటితరూపంగా తీర్చిదిద్దుదాం. అటువంటి జాగరూకము, సువ్యస్థితము, అజేయశక్తి సంపన్నమునైన జాతీయజీవన మొక్కటే యుద్ధప్రమాదాల్లో మునిగితేలే నేటి కల్లోలితప్రపంచంలో మనం తలెత్తుకొని జీవించేట్లు చేయగలదు.

# 18. ఏకాత్మక శాసనం కావాలి

1956 ప్రాంతంలో పునర్వ్యవస్థీకరణ సంఘం యొక్క నివేదిక వెలువడిన వెంటనే పూజ్యశ్రీ గురూజీ వ్రాసిన వ్యాసం)

ప్రాంత పునర్వ్యవస్థీకరణ సంఘం నివేదిక వెలికి వచ్చి దాదాపు పదిహేను దినాలయింది. అధికారికంగా ఆ నివేదిక వెలువడకముందే రాజకీయ రంగంలోని ప్రముఖ వ్యక్తులు ఆ సంఘం చేసిన సూచనల పట్ల తమలో కలిగిన ప్రతిక్రియలను బాహాటంగా ప్రకటించటం ప్రారంభించారు. ఎవ్వరికీ ఆ నివేదిక సంతృప్తి కలిగించినట్లు లేదు. వాతావరణమంతా ఆ నివేదికకు వ్యతిరేకతతో నిండి ఉంది. భావాలు ఉద్రేకంతో రెచ్చిపోతున్నాయి. శాసనసభా వర్గాలన్నీ ఒకదాని పట్ల ఒకటి తమ వ్యతిరేక భావనలను స్వేచ్ఛగా వ్యక్తం చేస్తున్నాయి. ఒక సామాన్య పరిపాలనా వ్యవస్థ క్రింద కలసి మెలసి జీవించటానికీ, పరస్పరం సహకరించటానికి ఏ ఒక్క వర్గం కూడా సంసిద్ధంగా ఉన్నట్లు కనబడడం లేదు. ఈ వ్యతిరేకత ప్రగాఢమై, తీవ్రమై, పాత పగ ఐపోతోంది.

## ఆంగ్లేయ ప్రచారం

ఈసందర్భంలో ఈదేశంగురించి, ఇందలి ప్రజలగురించి ఆంగ్లేయ పరిపాలకులు చేసిన ప్రచారాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనితీరాలి. అధునాతన

యూరపుఖండం మాదిరిగానే ఇక్కడకూడ, తమతమ ప్రత్యేక జాతీయ సాంస్కృతిక, భాషాగత విశిష్టలక్షణాలుకల అనేకదేశాలు, జనసమూహాలు, అనేకజాతులు ఉన్నాయని-ఇది ఒక సువిశాల ఖండంఅనీ, ఇది ఒక దేశం కాదనీ – ప్రపంచం అంతటా ఆంగ్లేయులు నొక్కి వక్కాణించేవారు. ఇచ్చటి సామాజిక స్వరూపాన్ని చూచి మోసపోవద్దనీ, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ సమాజాల్లో కనిపించే ఏకతవంటి ఏకత ఈ ప్రజల్లో ఏమాత్రమూ లేదనీ; యూరపుఖండంలోని వివిధ దేశాల్లో నివసించే వివిధజాతుల మధ్య నున్న విభిన్నతలకన్న ఎక్కువ విభిన్నతలు ఇక్కడ ఉన్నాయనీ; పరస్పర సమైక్యతాలక్షణాలకన్న, పరస్పర విభిన్నతాలక్షణాలే అధికంగా ఉన్న అనేక జాతులయొక్క కలగూరగంప ఇది అనీ అందరినీ ఆంగ్లేయులు హెచ్చరించేవారు. మానవశరీరనిర్మాణ శాస్త్రప్రకారం వారందరూ విభిన్న గణాలకు చెందినవారనీ; చారిత్రకంగా చూస్తే వారు ఎక్కడినుంచో కొట్టుక వచ్చి ఇక్కడ నిలబడ్డారనీ; రాజకీయంగా చూస్తే వారు దురాక్రమణదారులు, దోపిడీదారులు అనీ; చివరకు సారవంతమైన ఈ ప్రదేశంలో స్థిరపడ్డారనీ, తత్ఫలితంగా ఒకరిపట్ల ఒకరికి అగరభశత్రుత్వం ఉందనీ; కాలక్రమంలో అది ప్రచ్ఛన్నమైపోయి బాహాటమైన హింసగా మారేశక్తి దానిలో తగ్గి పోయిందనీ, భాషరీత్యా ఒకరికొకరు అపరిచితులేననీ; సాంస్కృతికంగా విభిన్న ప్రమాణాలకు చెందినవారనీ; మతధర్మాలరీత్యా ఒకరి పీకలు ఒకరు కోసుకొనేందుకు సర్వదా సంసిద్ధంగా ఉండేటంతగా విడివడిపోయిన ప్రజలు వీరనీ కూడ వారు ప్రచారం చేయసాగారు.

హిందూ ముస్లిముల మధ్య, 'ద్రావిడులు' 'ఆర్యుల' మధ్య, జైనులు శిక్కులవంటి సంప్రదాయాలకు మిగిలిన హిందువులకు మధ్య, వివిధ కులాల్లో ఒకదానికి మరొకదానికి మధ్య – ముఖ్యంగా బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల మధ్య విభేదాలను మరింత ప్రధానంగా వారు ప్రదర్శించి, వాటిని చాలవరకు రెచ్చగొట్టారు. ఈ దేశంలో తమ సార్వభౌమాధికారం

భగవద్దత్తమనీ, అది ఇట్టి విఘటనాత్మక శక్తులనన్నిటినీ అదుపులోపెట్టి దేశాన్ని నిరంతర హింసా రక్తపాతాలనుండి, ఎడతెరిపిలేనట్టి ఆంతరిక యుద్ధాలనుంచి, అడపాతడపావచ్చిన అంతఃకలహాలనుంచి రక్షించి, మాన ప్రాణాలకు, ఆస్తిపాస్తులకు భద్రతలేని దౌర్భాగ్యస్థితినుంచి ఈ దేశాన్ని కాపాడిందనీ, ప్రపంచాని కంతకూ, ముఖ్యంగా మన ప్రజలకు విసుగు, విరామం లేకుండ నూరిపోశారు. తామే సుస్థిర, న్యాయసహిత, దయాభరిత, ప్రగతిశీల ప్రభుత్వాన్ని ఇక్కడ సమకూర్చామనీ, తమవల్లనే-అంటే తాము అధికారంలో కొనసాగుతూ ఉండగానే, విభిన్న, విరుద్ధ జాతులైన ఈ ప్రజా సమూహాల్లో మన దొకేమాతృభూమి అనేభావన, దేశభక్తిభావన, ఒకేజాతికి చెందినవారమనే భావన, క్రమంగా ఇచట రూపొందాయనీ కూడ వారు చెప్పు కున్నారు.

## నాయకులకు పరీక్ష

ఒకానొక సమయంలో మాతృభూమిపట్ల ఒకేవిధమైన సమానప్రేమ ఈ సువిశాల భారతదేశమంతటా ప్రజల్లో జీవంపోసుకున్నట్లు, లేదా పునరుద్ధరింపబడినట్లు, ఆ ప్రేమ నాధారంచేసుకుని మనదంతా ఒకసమాజం, ఒకేజాతి, అనేభావన ఇచ్చట రూపొందింపబడింది అన్నట్లు కనిపించింది. ప్రజానాయకులందరూ ఒకేజాతిగా దీనిని వ్యవహరిస్తూ, దానిపట్ల నిజమైన శ్రద్ధాభక్తులను పెంపొందించుకున్నవారివలె తోచారు. మహత్తరమైన ఈ భావనలనే ప్రతిఒక్కరూ ప్రకటిస్తూ, ఆంగ్లేయుల ఆధిపత్యంనుండి ఈ దేశాన్ని స్వతంత్రం చేసేందుకు పోరాడేట్లుగా ప్రజలను మేల్కొల్పారు. సామాన్య ప్రజాసమూహమంతాకూడ ఈ భావననే అలవరుచుకున్న ధనిపించింది.

కానీ తానూహించి, అలవరచటానికి ప్రయత్నించిన విభేధాలను గూర్చి పదేపదే ప్రచారం చేయటానికి, ఆంగ్లేయుడికి విసుగులేదు. తాను వెళ్ళిపోగానే ఈదేశం అన్నివిధములైన అంతఃకలహాలకు లోనౌతుందనీ,

క్రమబద్ధమైన వ్యవస్థ అంతా భస్మమవుతుందనీ, పూర్తిగా అస్తవ్యస్తత మాత్రమే ఇచట మిగులుతుందనీ అతడు జోస్యంచెప్పాడు. ఈ దేశమంతటా సాటిలేని సార్వభౌమాధికారాన్ని తామింకా కొనసాగించటం సమంజసమేనని, ఈ విధమైన వాదనాబలంతో సమర్థించుకోచూచాడు. ఆంగ్లేయులకు దురుద్దేశ్యం ఉన్నా లేకపోయినా అది ప్రచారమనీ, అసత్యమనీ మాత్రమే మన నాయకులు తల్చారు. నిజానికి ఇదంతా ఒకరాష్ట్రమనే ఆదర్శం తమవల్లనే ఏర్పడిందనీ, తమ అడుగుజాడల్లోనే నడుస్తూ ఈ దేశంలో పుట్టిన ప్రజలందరూ దీన్ని సాక్షాత్కరించుకున్నారనీ విశ్వసిస్తూ వారు స్వాతంత్ర్యం కొరకు తమ పోరాటాన్ని తీవ్రతరంచేశారు. చివరకు పరిస్థితుల యొక్క ఒత్తిడివల్ల ప్రపంచయుద్ధానంతరం దెబ్బతిన్న ఆంగ్లేయులు అంతర్జాతీయ పరిణామాలకు లోనై, ఈదేశంపై తమ ఆధిపత్యాన్ని వదలుకొని, స్వపరిపాలన కావాలని నిరంతరం తీవ్రంగా కోరుతున్న మన నాయకులకు దాన్ని తప్పక అప్పగించవలసిన స్థితి ఏర్పడింది. మన నాయకులు రూపొందించుకొన్న ఏకైక జాతీయ జీవనం పరీక్షకు గురికావలసిన సమయం అప్పుడాసన్నమయింది.

## వైఫల్యాలు

ఆ పరీక్షయొక్క ఫలితమేమిటి? నిజాయితీతో చెప్పాలంటే ఆ పరీక్షలో విజయవంతులమైనామని అనలేం. "ఒకేదేశం, ఒకేజాతి" అని మనం చెప్పుకొన్న సిద్ధాంతానికి మన తల్లిని, భారతభూమిని విభజించటాని కంగీకరించిన నిర్ణయంవల్ల మొదటి చావుదెబ్బ తగిలింది. దానివల్ల హిందూజాతితోబాటు, దానికి విరుద్ధమైన ఒక జాతీయ సమాజంగా ముస్లిములు ఈదేశంలో నివసిస్తూ ఉన్నారని, విజేతలుగా స్థిర పడేటందుకు ఇంత కాలంగా ప్రయత్నం చేస్తూ, ఈనాడు దేశ విభజన ద్వారా వారొక ప్రత్యేక రాజ్యాన్ని సాధించుకోగలిగారని

మనం అంగీకరించడమే అవుతుంది. అట్లా కానేరదని కొందరు – వారిని విచక్షణారహితులు అనవచ్చునేమో? – ఎన్నో కారణాలు చెప్పారు. ద్విజాతి సిద్ధాంతాన్ని ఎంత తీవ్రంగా వ్యతిరేకించినా, చివరకు విభజనకు వారు అంగీకరించటం, ఇప్పుడు దాన్ని న్యాయ సమ్మతమని సమర్థించటం, తత్ఫలితంగా మాతృశరీరంనుండి ఒక భాగం ఖండితమై ఒక ముస్లిం రాజ్యంగా ఏర్పడటం – ఇవన్నీ చూస్తుంటే, వారు ఒకనాడు చెప్పిన అభ్యంతరాలన్నీ అబద్ధాలని ఋజువవుతోంది. వారి నోటిమాటలకు, హృదయపూర్వక విశ్వాసాలకు ఎక్కడా పొంతనలేదనీ; ఇక్కడ ఒక ముస్లింజాతి ప్రత్యేకంగా ఉండనే ఉంది గనుక, ఒకటిగా అందరూ భావించుకున్న ఈ మాతృభూమియొక్క సరిహద్దులమధ్య న్యాయసమ్మతంగానే అది ఒక భూభాగాన్ని కోరుతూ ఉంది, అనే దృఢవిశ్వాసం ఈ ప్రముఖనాయకుల యొక్క ఆలోచనాసరళికి పునాదిగా ఉందనీ ఋజువవుతోంది. మాతృభూమిని ముక్కలుచేయటంవల్ల, దీని ఏకత్వంపట్ల వారి అంతరాంతరాల్లో విశ్వాసమే లేదనికూడ వ్యక్తమౌతుంది.

'స్వయం నిర్ణయాధికారం' నినాదాన్ని కాశ్మీరు విషయంలోను, ఇపుడు గోవాలోగూడ దురుపయోగం చేయటం జరిగింది. కాశ్మీర్ ప్రజలే తమ భవిష్యత్తును నిర్ణయించుకుంటారని చెప్పడం ఈ భారతదేశంయొక్క ఇందలి ప్రజలయొక్క ఏకత్వాన్ని నిరాకరించటమే అవుతుంది. మన దేశాన్నంతనూ అనేక ప్రత్యేక ప్రాంతాలుగాను, ప్రతి ఒక్కదానికి ఒక సొంత 'రాజ్యం' (స్టేట్), అవన్నీ కలిసి ఒక సమాఖ్యా (ఫెడరేషన్) స్వభావంతో, కూటమి (యూనియన్) స్వరూపాన్ని పొందినట్లు చెప్పుతుంది మన రాజ్యాంగం. మన రాజ్యాంగ నిర్మాతలు ఈ రాజ్యాంగాన్ని రచించేనాటి పరిస్థితులను గురించి ఎవరైనా క్షణంసేపు నిలకడగా ఆలోచించినప్పుడు, అప్పటి వాతావరణం ఏకాత్మకరాజ్యాన్ని–అంటే ఒకేదేశం, ఒకేశాసనసభ, యావద్దేశానికి ఒకే కార్యనిర్వాహక కేంద్రం – అంటే భారత్‌లో, లేదా

పోయిందిపోగా ఆ పేరుతో మిగిలిన భూభాగంలో - సజాతీయమైన సుదృఢ జాతిని ఏర్పరచేందుకు అనుకూలంగా ఉందని తెలుస్తుంది. కాని భాషాపరమైన ప్రతిఒక్కవర్గం, ఒక ప్రత్యేక 'ప్రజ'గా, ప్రత్యేకమైన సొంత భాషాసంస్కృతులతో, 'విస్తృత స్వాయత్తత'ను అనుభవించేవిధంగా 'రాజ్యాల సమాఖ్య' (ఫెడరేషన్ ఆఫ్ స్టేట్స్) ఏర్పడాలనే వ్యామోహం వారి మనస్సును, తార్కికశక్తిని ప్రభావితంచేశాయి.

## సమాఖ్యకు మూలకారణం

ఎన్నడో, 1923 నాటికే-ఆనాటి దేశంలోని ప్రజలందరకూ తానే ప్రాతినిథ్యం వహిస్తున్నానని చెప్పుకునే ఏకైక రాజకీయపక్షం, ఇండియన్ నేషనల్ కాంగ్రెసు, అటువంటి సమాఖ్య స్వరూప రాజ్యాంగాన్నే మన దేశానికి ఆకాంక్షించి, అట్టిసమాఖ్య ఏర్పరచడానికి భాషాప్రయుక్తరాజ్యాలు ఏర్పడాలని వాంఛించింది. తమకృషి దీనికొరకేనని వారు ప్రకటించుకోవటానికి కారణమేమిటో స్పష్టంగా తెలియదు. ఆనాడు బ్రిటిష్‌పార్లమెంటులోని మితవాదపక్ష సభ్యుడొకడు, ఆంగ్లేయులు దేశం విడిచి వెడలిపోవలసి వస్తే, ఈదేశంలో పరస్పర విభిన్నము, వ్యతిరేకమునైన అయిదారు భాషాప్రయుక్తరాజ్యా లేర్పడేపరిస్థితి వస్తుంది; కాబట్టి, ప్రాంతీయ శాసనసభలు ఏర్పరచటం అవసరం-అని వక్తవ్యమొకటి ఇచ్చిఉన్నాడు. ఈదేశంలో భాషాప్రయుక్త రాజ్యాలను, వాటి కలగలుపుగా ఒకసమాఖ్యను, ఏర్పరచాలి అని ప్రకటించటానికి, కాంగ్రెసుకు బహుశః ఆ వక్తవ్యమే స్ఫూర్తి ఇచ్చి ఉండవచ్చు.

మొదట్లోనే ఆవిధంగా భాషాప్రయుక్త ప్రాంతాలతో సమాఖ్య ఏర్పరచడానికి అంగీకరించినతర్వాత, ఈ రాజ్యాంగం, సమాఖ్యస్వరూపం కన్న విభిన్నంగా ఏర్పడడాని కవకాశం లేదుగదా! అది ఇంతకుముందున్న ప్రాంతాలనే దాదాపు 'స్వాయత్తరాజ్యాలు'గా మన్నించి అప్పటికి ఉన్న

సరిహద్దులనే తాత్కాలికంగా అంగీకరించింది. ప్రాంతాల సరిహద్దులను పునర్వ్యవస్థీకరించే ప్రశ్న, భాషాప్రయుక్త ప్రాంతాల ఏర్పాటుకై చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోవల్సిన అవసరం తరువాత ఏర్పడింది; ప్రాంత పునర్విభజనసంఘం ఏర్పడి దాదాపు అన్నివర్గాలవారికీ అసంతృప్తికరంగా తోచే ప్రతిపాదనలు చేసింది. పరస్పర అవిశ్వాసంతో, మరింతభూభాగాన్ని కబళించే దురాశతో, కల్లోలాలతో వాతావరణమంతా కలుషితమైంది. ఈస్థితి పీనుగును పీక్కుతినేందుకు వచ్చిన తోడేళ్ళు ఒకదాన్నొకటి గుర్రుగా చూస్తున్నట్లుగా ఉంది. ఈదృశ్యం చాలా బాధాజనకమైంది. తాను సుదృఢమైన అధికారహస్తాన్ని ఉపయోగించకపోయినట్లైతే ప్రజలు ఒకళ్ళనొకళ్ళు చీల్చుకతింటారనీ, దేశమంతా అల్లకల్లోలంలో మునిగిపోతుందనీ ఆంగ్ల సామ్రాజ్యవాదులు చెప్పుకొన్న గొప్పలను ఋజువుచేసేందుకుగాను, నాయకులు ఒకరితో ఒకరు పోటీపడుతున్నట్లు తోస్తుంది.

## ప్రమాదానికి గురైన మనభవిష్యత్తు

ఇదంతా ఎందుకు జరుగుతోంది? మాతృభూమియొక్క, మనజాతి యొక్క సమైక్యాన్ని గురించిన ప్రవచనాలన్నీ ఎందుకు గాలికికొట్టుకు పోతున్నాయి? ఈ ప్రవచనాలన్నీ సత్యాలేనా? నేటి విచారకరమైన పరిస్థితి చూస్తే, ఆంగ్లేయుల ఆధిపత్యంనుంచి స్వాతంత్ర్యం పొందేటందుకు కొన సాగించిన పోరాటాన్ని నిర్వహించినవారు, ఇదంతా ఒకేదేశం, ఒకేరాష్ట్రం, ఒకేప్రజ అన్న భావనను ఎన్నడూ తను హృదయాల్లో సాక్షాత్కరించుకోనే లేదు అన్న నిర్ణయానికి తప్పక రావలసివస్తోంది. తాత్కాలికంగా ఏర్పడిన దేశవ్యాప్తమైన సమైక్యం, తరతరాల మన జాతీయ అస్తిత్వంయొక్క భావాత్మకమైన అవగాహననుండి జనించిందికాదు; క్రొత్తవారికి దిగ్భ్రాంతి కలిగించే వైవిధ్యం – సమరస, ఏకాత్మక జాతీయతకు భంగంరాకుండా అందరువ్యక్తులకూ, అన్నివర్గాలకూ, తమ ఆత్మాభివ్యక్తికి, క్రమవికాసానికి

ప్రారంభింపబడి, తమకు తెలియకుండానే మన నాయకులు విశ్వసించిన కుటిల ప్రచారాలను, ఆవిధంగా అసత్యాలని ఋజువుచేయాలి. ప్రస్తుత రాజ్యాంగాన్ని రచించినవారికి, ప్రాంత పునర్వ్యవస్థీకరణ సంఘంలోని ఘనులైన సభ్యులకుగూడ, వారు చేసిన సేవలనిమిత్తమై, మనం కృతజ్ఞులుగా ఉందాం. కాని ముక్కలుగా విడివడిపోయి అంతఃకలహాలతో జాతి వినాశనం చెందడానికి మనం అనుమతించరాదు.

ప్రభుత్వ వ్యవహారాలను నిర్వహించే మన నాయకులు వాస్తవాలు గ్రహించి, మనపై ముంచుకొనివస్తున్న ప్రమాదాలను గమనించి, యథార్థం తెలియక పెడత్రోవపట్టి దీనిని వ్యతిరేకించేందుకు దిగజారే వ్యక్తుల ప్రతిఘటనను ధైర్యంగా ఎదుర్కొని, నేటి వికృత సమాఖ్యాస్వరూపాన్ని దృఢహస్తంతో మార్చి, నవ్యమైన ఏకైకపద్ధతియగు ఏకాత్మకశాసనం నిర్మించాలి.

## శంకరాచార్యుడు, అబ్రహాం లింకన్‌లు

## నేటినాయకత్వానికి స్ఫూర్తినివ్వాలి

ఈ ఒక్కచర్యతో, ఈ దేశాన్ని ముక్కలుచెయ్యాలనే మాటలు నమసిపోతాయి. ఉవ్వెత్తున లేచివస్తున్న అనైక్యత, అవిశ్వాసం, పరస్పర విరోధాలు అణగారిపోతాయి. సమరసమైన సమాజం క్రమవికాసంచెందేందుకు అనుకూల పరిస్థితులు ప్రతిష్ఠితమౌతాయి. గోలపెట్టేందు కలవాటుపడ్డ కొద్ది మందిని మినహాయించి, మిగతా ప్రజలంతా అట్టి పథకాన్ని సమర్థిస్తారనటంలో సందేహంలేదు. భారతదేశంలోని సుదృఢమైన జాతీయతను విజయవంతంగా నిర్మించినవారుగా నేటి మన నాయకులను భావితరాలు శ్లాఘిస్తాయి. శంకరాచార్యునియొక్క అధునాతన స్వరూపాలుగాను, అబ్రహాంలింకన్‌కు భారతీయమైన ప్రతిరూపాలుగాను ఈ నాయకులు ముందుతరాలవారికి ఆరాధనీయులౌతారు.

మన తరానికి చెందిన నాయకులకు భారతజాతియందు గల భక్తి విశ్వాసాలు నేడు పరీక్షకు గురి అయ్యాయి. ప్రాచీనము, అమరమూనైన మనజాతిపట్ల ప్రగాఢప్రేమను, దృఢనిశ్చయాన్ని, ధైర్యాన్ని చూపవలసిన వేళ ఈ చారిత్రక సమయంలో వారు ప్రదర్శించే ధైర్యాన్నిబట్టి, వారు తీసుకునే చర్యలనుబట్టి, వారు పదహారువన్నెల బంగారమో లేక నకిలీ బంగారమో తెలిసిపోతుంది. ప్రేమపూర్ణమైన ఏకత్వంలో ప్రజలందరనూ కలిపి ఉంచే నవ్యమైన ధర్మపథంలో సర్వదా ఈ హిందూరాష్ట్రానికి తన దివ్యమైన జ్ఞానప్రబోధంచేత మార్గదర్శనం చేస్తున్నటువంటి సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుడు, ఈ సంతమన సమయంలో మన నాయకులకు మార్గదర్శనంచేసి, వారికి సవ్యమైన అవగాహనలతోకూడిన స్ఫూర్తినొసగి, మహత్తరమైన మన సమాజంయొక్క మహోజ్జ్వల పునరుజ్జీవనంకొరకు సరియైన మార్గం అనుసరించజాలిన ధైర్యాన్ని కలుగజేయునుగాక !!

# 19. శాశ్వత భూమిక

రాష్ట్రీయ స్వయంసేవక సంఘకార్యం ఏమాత్రం పటాటోపంలేని పద్ధతిలో ప్రారంభమయింది. ఏండ్లు గడుస్తున్నకొద్ది అది నిలకడగా నానాటికి పెరుగుతోంది. ఈనాడు సంఘశాఖలు దేశంలోని అన్ని ప్రాంతాల్లోను ఎంతో ఉత్సాహంగా పనిచేస్తున్నాయి. బాహ్యప్రతికూల పరిస్థితులవల్ల కలిగే ఒడుదుడుకులను, పరీక్షలను ఎదుర్కొంటూకూడ నిరంతరాభివృద్ధిని, సుస్థిరమైన వ్యాప్తిని సాధించగల్గడం సంఘకార్యంయొక్క విశిష్టత.

## వృద్ధిపొందాలనే ఆకాంక్ష

సంఘం పుట్టి పదిహేనేండ్లు కాకముందే సంఘ ప్రారంభకులైన డాక్టర్ హెడ్గెవార్‌యొక్క అనూహ్యమైన హఠాన్మరణంతో, తొలిగా ఒక పెద్ద పరీక్షకు గురయింది. డాక్టర్‌జీ సంఘానికి ప్రాణంవంటివారని వేరే చెప్పనక్కరలేదు. సంఘమనే లేతమొక్కకు వారు తమ స్వేదరక్తాలను నీరుగా పోసి పెంచారు. తమ జీవితాన్నంతనూ వారు ఒక ఉజ్జ్వల దీపంగా రూపొందించుకున్నారు. చివరి నూనెబొట్టువరకు అది చక్కగా వెలిగింది. అపరిహార్యుడు, అసామాన్యనాయకుడు అకస్మాత్తుగా మరణించాడు. సంఘం అప్పటికింకా బాల్యావస్థలోనే ఉంది. అందుచేత

సంఘశ్రేయోభిలాషులెందరో దాని భవిష్యత్తును గురించి తీవ్రమైన ఆందోళన వ్యక్తంచేశారు. అయితే అట్టివారందరికీ ఆశ్చర్యకరంగా సంఘం రెట్టింపు వేగంతో ఉత్సాహంగా పెరిగింది. నిండుగా, నిలకడగా ఏర్పడిన దాని ప్రగతి ఆంగ్లేయులు వీడిపోయిన తర్వాతకూడ ఏమాత్రం తరిగిపోలేదు. కొందరికి ఇదంతా ఆశ్చర్యకరమైన విషయంగా తోస్తూంది. దిగ్భ్రమచెంది, "ఇప్పుడు ఆంగ్లేయులు వెళ్ళిపోయారుకదా ! మనం స్వతంత్రులమయ్యాంకదా ! ఇంక సంఘంవంటి ప్రత్యేకసంస్థయొక్క అవసరమేముంది? ఈ స్థితిలోగూడ ఇంకా సంఘం నిర్వహించవలసిన పాత్ర ఏముంది?" అని మనల్ని అడుగుతూ ఉంటారు.

కేవలం రాజకీయస్వాతంత్ర్యంవంటి బాహ్య పరిస్థితులవల్ల సుసంఘటిత సమాజస్థితియొక్క ఆవశ్యకత తగ్గదని మన సమాధానం. వాస్తవానికి సుసంఘటితము, శక్తిమంతమునైన సమాజం మాత్రమే స్వతంత్రము, శాంతియుతము, సమృద్ధిమంతమునైన జీవితంయొక్క ఫలితాలను చక్కగా అనుభవించగలదు. సంఘటితజీవనం అనేది ఒకానొక బానిసజాతికి తన సంకెళ్ళను త్రెంచుకొనేందుకు ఎంతటి శక్తిమంతమైన ఆయుధమో, స్వతంత్రజాతికి తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనేందుకు కూడా, అంతటి శక్తిమంతమైన ఆయుధమూ ఔతుంది. జాగృతము, సుసంఘటితమునైన సమాజం మాత్రమే ఆంతరికమైన ప్రమాదాలను విద్రోహాలను నివారించి బయటినుంచి వచ్చే దురాక్రమణలను త్రిప్పికొట్టి తనయొక్క సమైక్యతా, స్వాతంత్ర్యాలను సురక్షితంగా ఉంచుకోగలుగు తుంది.

## మౌలికదృష్టి

సంఘ ప్రారంభదశ నుంచీ ఈ మౌలికమైన దృక్పథాన్ని కలగ చేయటానికే డాక్టర్‌జీ విశేషమైన శ్రద్ధ వహించేవారు. అసలు ప్రతి సామా

జిక సమస్యనీ వారు ఈ దృష్టితోనే చూచేవారు. వారొకసారి బొంబాయి వెళ్ళినప్పుడు ఒక అనాథ శరణాలయాన్ని సందర్శించవలసిందిగా కొందరాహ్వానించారు. శరణాలయాన్నంతనూ చూపించి, శరణాలయంఅభివృద్ధికి ఏదైనా సూచన లివ్వవలసిందని, దాని కార్యకర్తలు కోరారు. డాక్టర్‌జీ అన్నారు "అనాథాశ్రమాలు పెంచుకొనే దానికంటే, మానవ సమాజంలో అనాథులే లేని పరిస్థితిని కలుగజేయటం ఉత్తమం కదా! మన సమాజంలో నేను నిస్సహాయుణ్ణి, నన్ను పట్టించుకొనే వాళ్ళెవరూ లేరు అనేస్థితి ఎవరికీ కలుగని సామాజిక జీవనం మనకు కావాలి. ఎవరికైనా ఒక దురదృష్టం హఠాత్తుగా వచ్చిపడితే పొరుగువారు వాళ్ళని వెంటనే ఆదుకోవాలి. సాంఘిక సామరస్యపూరితమైన సమాజాన్ని నిర్మించినప్పుడే అది సాధ్యపడుతుంది. అటువంటి సమాజంలో పరస్పర అనురాగం, సహానుభూతీ తొణికిసలాడుతూ ఉంటాయి. ఈ పని చేయలేకపోతే సామాజిక దోషాలు ఒకదాని తర్వాత ఒకటిగా, అంతు లేకుండా పొడసూపుతూనే ఉంటాయి. మన నెత్తురు చెడి పోయినప్పుడు ఒళ్ళంతా కురుపులు లేస్తాయి. ఒకచోట కురుపుకి మందు వేసి కట్టుకడితే, మరొకచోట కురుపుకు మొనతేలుతూ ఉంటుంది. అసలు చేయాల్సినది రక్తశుద్ధి; అలాగే సామాజిక వ్యవస్థ కూడా".

## ఆదర్శసమాజమే ఆరాధ్యదైవం

సర్వశక్తిమంతుడగు శ్రీ పరమేశ్వరుని సజీవ సాక్షాత్కారమే సమాజం. సర్వజీవరాసుల పోషణభారమూ, ఆ సర్వశక్తిమంతునిదే. అందుకనే అతన్ని మనం విశ్వంభరుడూ అంటున్నాం. హరిదాసొకడు ఒక పురాణకథ చెప్పగా విన్నాను. శ్రీ మన్మహావిష్ణువునే పరీక్షించాలని నారదుని కొకసారి అనిపించింది. నారదుడు, కొన్ని చీమల్ని పట్టుకొని, చిన్న భరిణలో పెట్టి, తనవద్ద దాన్ని భద్రంగా వుంచుకున్నాడు. తర్వాత హరి నామ సంకీర్తనం చేసికొంటూ లోకసంచారానికి వెళ్ళాడు. కొంత కాలమైన తర్వాత, విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి "తాతగారూ! తమ భోజనమయిందా"

అని అడిగాడు. విష్ణుమూర్తి "అందరికీ ఆహారం అందజేసి ఇప్పుడే భోం చేసాన్నాయనా" అన్నాడు. నారదుడు తన దగ్గరున్న భరిణె తీసి, "పాపం ఇందులో ఉన్న జీవుల దౌర్భాగ్యమేమిటోగానీ, ప్రభువుల దృష్టికివి తగ లేదు" అన్నాడు. విష్ణువు ఆశ్చర్యపడినట్లు కనపడ్డాడు. "క్షమించు నాయనా!" అని భరిణె తెరవమన్నాడు. నారదుడు భరిణె తెరిచాడు. ఓహ్! అందులోని ప్రతి చీమ నోట్లోనూ ఒక చక్కెర కణముంది.

ఈ కధ ఉట్టి ఊహా కల్పితం. కానీ ఇది ఒక ఆదర్శ సమాజం యొక్క స్థితిని అందంగా చిత్రిస్తోంది. సమాజం తన పరిధిలో ఉన్న అందరి బాగోగుల్నీ చూచుకోవాలి. న్యాయానికి మన ప్రాచీన సమాజం యొక్క వర్ణన దీనికి సరిపోతుంది. సమాజంలో ఏ వ్యక్తి గూడా, అతడు ఎంత చిన్నవాడైనా, తక్కువవాడైనా అతని ఆకలిదప్పులు తీరకపోలేదు. అతణ్ణి అందరూ వదిలేయలేదు. తమ చుట్టుప్రక్కల నున్న, పశుపక్ష్యాదుల సంరక్షణ కూడా మనవారు స్వీకరించారు. కొందరైతే చీమలకు బలి వేస్తే గాని తాము అన్నం ముట్టము అని శపథం చేసుకున్నవారు కూడా ఉన్నారు.

## సుస్థిర భూమిక కావాలి

పరులపై ద్వేషంమీదనే ఆధారపడి, స్థిరము, జాగరూకము నిర్మాణాత్మకము, సుసంఘటితమునైన సమాజస్థితిని నిర్మించలేము. దానికి కారణం సామాన్యమైనదే. బాహ్యపరిస్థితులకు ప్రతిక్రియగా ప్రారంభించిన ఉద్యమాలన్నీ, వ్యతిరేకశక్తులు తొలిగిపోవటంతోనే భగ్నమై పోతున్నాయి. ముఖ్యంగా ఆలోచించవలసింది ఇంకొకటున్నదిందులో. విరోధభావం మనస్సులో తీవ్రంగా ఉన్నప్పుడు, మనం ఆ విరోధినిగురించే నిరంతరం ఆలోచిస్తూ ఉంటాము. ముఖ్యంగా వారి దుష్టచర్యలను, దుష్ట గుణాలను గురించి పదేపదే తలచుకొంటూ ఉంటాము. వ్యక్తి తాను దేన్ని గురించి ఆలోచిస్తాడో దానివలె మారిపోతాడని మన శాస్త్రాలు చెపుతున్నాయి. నిరంతరము కొనసాగే ఈ ఆలోచనలు ఒక వ్యక్తియొక్క మానసికస్థితిని,

తద్వారా అతనివ్యక్తిత్వాన్ని రూపొందిస్తాయి, కాబట్టే ఆంగ్లేయులపైనగాని ముస్లిములపైనగాని ద్వేషాన్ని ఆధారంగా చేసుకొని మన సమాజాన్ని పునర్వ్యవస్థీకరించటానికి ప్రయత్నించడం అవివేకాన్ని, వినాశాన్ని కోరి తెచ్చుకోవటమే అవుతుంది. నిరంతరం వారి నేరాలనే గుర్తుచేసుకోవడంవల్ల మన మనస్సులు కలుషితంకావటం మాత్రమే జరుగుతుంది. దుష్టులైన దురాక్రమణదారులను గురించి మనం ఎందుకు ధ్యానం చేయాలి? మన జీవితాలను మలచుకోదగిన భావాత్మకము, ప్రాణప్రదము, ఉదాత్తమునైన ఆదర్శాలేవీ మనకు లేనేలేవా ?

మన సంఘకార్యకర్తలుకూడా ఒక్కొక్కసారి ముస్లిములకు, ఆంగ్లేయులకు సంబంధించిన ఘట్టాలను ఉదాహరిస్తూండడం యథార్థమే. అయితే చరిత్ర నేర్పేపాఠాన్ని గ్రహించేందుకు, మన పతనానికి మనమే కారణమని చూపించేందుకు మాత్రమే వారావిధంగా చేస్తారు. ఇంగ్లండువంటి చిన్నదేశం ఆరువేలమైళ్ళదూరాన్నుండి, ఇంతపెద్దదేశాన్ని పరిపాలించడం అనే విచిత్రఘటన ఎనిమిది సంవత్సరాల వయస్సులోనే పూజనీయులైన మన సంఘస్థాపకులకు ఆశ్చర్యం కలిగించి, వారిలో ఎన్నో ఆలోచనలను రేకెత్తించింది. మన దాస్యానికి మూలకారణాన్ని నిర్మూలించటానికి సవ్యము, భావాత్మకమునైన మార్గమేమిటో, గంభీరంగాను పరిణతినందిన జ్ఞానంతోను ఆలోచించిన మీదటనే వారు సంఘాన్ని స్థాపించారు.

## ప్రతిక్రియాత్మక దృష్టివల్ల పరిణామాలు

అయితే ఎందుకనోగాని మన నాయకుల్లో చాలామంది ఆంగ్లేయులనో ముస్లిములనో ద్వేషించటాని కలవాటుపడి, తత్ఫలితంగా క్రమంగా ఆంగ్లేయ మనస్తత్వం గలవారుగానో, ముస్లింమనస్తత్వం గలవారుగానో మారిపోయారు. ఉదాహరణకు చెప్పాలంటే, పెరిగిపోతున్న ముస్లిముల

యొక్క హింసాకాండను. దోపిడీలను నివారించేందుకు, రాజకీయంగా వారిపట్ల కొనసాగుతున్న సంతుష్టీకరణ విధానాన్ని అదుపుచేసేందుకు మన దేశంలో కొన్ని అతివాదహిందూసంస్థలు ప్రారంభమయాయి. ఈనేలపై అడుగుపెట్టిన తొలినాటినుండి నేటివరకు ముస్లిములుచేసిన హృదయ విదారకములై, నెత్తుటిని వండలిపిండుచేసే దారుణహత్యాకాండలు, బలవంతపు మతాంతరీకరణలు, స్త్రీల మానభంగాలు, దేవాలయ విధ్వంసాలవంటి దురంతాలను పదేపదే వాళ్ళు మననం చేస్తారు.

గోహత్యా నిషేధోద్యమం రోజుల్లో కనువిప్పుకలిగించే ఒక ఉదంతం నా అనుభవంలో సంభవించింది. ఉజ్జ్వలదేశభక్తుడుగాను, విద్వాంసుడుగాను బాగా ప్రసిద్ధిచెందిన ఒక గొప్ప హిందూనాయకుణ్ణి కలిశాను. మాటల మధ్యలో "హిందువు గోమాంసాన్ని భక్షిస్తే వచ్చిన ప్రమాదమేమిటి ?" అన్నాడాయన. నేనెంతో గౌరవంగాచూచే ఆయన నోటివెంట ఆమాటలు రావటం విని స్తంభించిపోయాను. ఎంతో పతితుడైన హిందువుకూడ అట్టి ఆలోచన చేయటానికైనా గడగడవణకుతాడుగదా! అటువంటప్పుడు ఆయన ఆవిధంగా మాట్లాడడానికి కారణమేమిటయి ఉంటుంది? ముస్లిముల గురించి, వారి దుర్మార్గాలగురించి నిరంతరంగా ఆలోచించినందున, అదే తలంపు అతని మెదడుపై చెరగనిముద్ర వేయడమే దానికి కారణం. ఆవిధంగా అతడు రాజకీయంగా హిందువుడుగానే జీవిస్తూకూడా సాంస్కృతికంగా ముస్లిముగా మారిపోయాడు.

ప్రతిక్రియాత్మకమైన దృష్టితో ప్రజలు సంఘాన్నికూడా చూడటానికి ఇట్టి వాతావరణమే కారణం. మన సంఘకార్యాన్ని ప్రారంభించేందుకు ఒకచోటికి వెళ్ళినప్పుడు అచటి ప్రజలు 'మా ఊరిలో ముస్లిములు లేరుకదా!' అని నన్ను అడిగారు. 'హిందువులను సంఘటితపరచటానికి మేము వచ్చాం గాని ముస్లిములకోసం గాదు. మీరంతా హిందువులేనని భావిస్తున్నాను. ఇచట ముస్లిములు ఉన్నారా లేదా అన్న విషయం మనకెందుకు' అని నేను సమాధానం చెప్పాను.

## సజీవ సమాజ లక్షణం

ఈనాడు ఆంగ్లేయులు మన దేశం విడిచి వెళ్ళిపోయారుకాబట్టి పరిస్థితులు మారిపోయాయనీ, కనుక ఇటువంటి సంఘటనయొక్క ఆవశ్యకత లేదనీ కొందరనడానికికూడా ఇదేకారణం. మనం మాత్రం ఈ సమస్యను మరొక విధంగా చూస్తాము. మనం చెప్పేది- ఈ దేశంలో హిందువులు ఉన్నారు; ఇకముందుకూడా ఉంటారు. గతంలోను, ఇప్పుడుకూడా అనైక్యంగానే ఉంటూఉన్నారు. హిందూ సమాజం విఘటితం కావటంవల్ల దాన్ని ఇతరులు అణగద్రొక్కుతున్నారు; కాని నిరసనగా పెదవైనా కదపక సమాజంమూగవోయింది. అదిఎప్పుడైనా నోరెత్తితే అందులో అనేకగొంతుకలు విడివిడిగా పలికినందున అసందర్భ ప్రలాపనగా వినిపిస్తూ ఉంటుంది. అందుచేత పరిస్థితిలో ఏ విధమైనమార్పు కనిపించటంలేదు. సన్నిపాతజ్వరం అంటువ్యాధిగా విజృంభించిన రోజుల్లో ఒకవ్యక్తి దానికి లోనయ్యాడనుకుందాం. అంటువ్యాధి సోకటం ఆగిపోయిందని ఆ ఊరి ఆరోగ్యాధికారి ప్రకటించినంతమాత్రాన ఆ రోగికి వైద్యంచేసే వైద్యుడు తన వైద్యం మానివేస్తాడా ? అతిప్రాచీనము, మహత్తరమునైన ఈ సమాజదేహాన్ని అనైక్యత అనే రోగం ఇంకా పట్టి పీడిస్తూనే ఉండడం కనబడటంలేదా ? అటువంటప్పుడు సరియైన మందు వేయకుండా ఏవిధంగా ఊరుకొనగలం ?

కాబట్టే మన సమాజాన్ని సమైక్యంగాను, సుసంఘటితంగాను, శక్తిశాలిగాను ఉంచవలసిన బాధ్యత ఎప్పటివలెనే ఈనాడుకూడా మన మీదున్నది. మాతృదేవతగా మనం భావించే ఈ సమాజాన్ని శక్తిమంతము, శ్రేష్ఠము, సౌఖ్యయుతముగా చేయడం మన ధర్మం. మన ప్రజలపట్ల మన హృదయాల్లో నిండిఉన్న ఈ ప్రేమ, భక్తి భావనలు, మనజాతిమీద మనకుండే విశ్వాసాలే మనకార్యానికి నిరంతర ప్రేరణనిస్తున్నాయి. అటువంటి వాస్తవమైన ప్రేమ బాహ్యపరిస్థితులపై ఆధారపడిఉండదు; వాటివల్ల జనించదు. అది మన హృదయాల్లో గాఢంగా వేళ్లూని, జీవితంలో అనుక్షణమూ మన సమాజంపట్ల మనం నెరవేర్చవలసిన కర్తవ్యాన్ని

గుర్తుచేస్తూ ఉంటుంది. మనం ఈ పవిత్రము, శ్రేష్ఠమునైన మాతృభూమికి చెందిఉన్నామనీ, ఆమెకు మనమెంతో ఋణపడి ఉన్నామనీ, మనంచేసే ప్రతిపని ఆమెకు అంకితం కావాలనీ మనం గుర్తించేట్లుగా చేస్తుంది.

మనకు ఆధారశిలఐన హిందుత్వం ప్రతిక్రియాభావన లేనట్టి, స్వచ్ఛము, సర్వగ్రాహకమునైన ప్రేమను మనలో పెంపొందిస్తుంది. ఇట్టి పరంపరలో పుట్టి పెరిగిన సంఘస్వయంసేవకులమైన మనం క్రియచేస్తామే గాని, ప్రతిక్రియగాదు. క్షణికమైన శీతోష్ణాలకు ప్రతిక్రియను ప్రదర్శించడం అల్పవస్తువులకు సహజం. కాని ఆరోగ్యంగా జీవించేమనుష్యులు వాతావరణం యొక్క వెర్రివికారాలకు చలించరు. ఒకే విధమైనఉష్ణోగ్రతవారిశరీరాల్లో ఉంటుంది. వాతావరణంలో కలిగే పెద్దమార్పులుకూడా ఆ ఉష్ణోగ్రతను మార్చలేవు. తమశరీరాలు అట్టి సామాన్య ఉష్ణోగ్రతను నిలుపుకొనలేనప్పుడు వారు ప్రాణాలను కోల్పోతారు. అందుకే బాహ్యపరిస్థితుల్లో వచ్చిన మార్పుల వల్ల తన నిర్దిష్టమార్గం గురించి ఏమాత్రం అడుగు ప్రక్కకు వేయని ఒక సుసంఘటిత సమాజదృశ్యాన్ని మన మనోనేత్రాలముందు నిలుపు కొంటున్నాము.

## కలలను ఆచరణలో నిజం చేసికోవాలి

మన జాతీయ అస్తిత్వంపట్ల, ప్రతిక్రియారహితమూ, భావాత్మకము నైన సుదృఢవిశ్వాసం ఉన్నందువల్లనే సంఘం, బాహ్యవాతావరణంలో ఏర్పడే తాత్కాలికమునైన మార్పులకు చలించక, ప్రశాంతంగా క్రమ క్రమంగా తనశక్తిని వృద్ధిచేసుకొంటున్నది. స్వార్థచ్ఛాయైనా సోకకుండా సంఘకార్యాన్ని తన జీవనకార్యంగా స్వయంసేవక్ చేపట్టేందుకు శాశ్వత మైన స్ఫూర్తిస్రోతస్సు కాదగినది ఏది? శాశ్వతము, శక్తిమంతమూనైన సంఘటిత సామాజికజీవనస్థితి మాత్రమే అట్లాంటిది కాగలదు. నిజానికి తాను కన్న కలలు కనీసం స్వల్పంగానైనా సాక్షాత్కరించేటువంటి దైవందిన సంఘకార్యంలో స్వయంసేవక్ ఆనందానుభూతిని, ఉత్తేజాన్ని పొందుతాడు;

తన జీవనకార్యాన్ని సఫలం చేసుకొనేందుకుగాను తీవ్రపరిశ్రమ చేయ డానికి ఉద్యుక్తుడవుతాడు.

సాధ్యము, సాధనము ఒకటిగా పరిణమించడం మన సంఘకార్యం యొక్క విశిష్టత. సంఘటితసమాజం మన సాధ్యం; సంఘటన మన సాధనం. అనగా వ్యక్తులను ప్రతిరోజు ఒకచోటచేర్చి, వారిని సంఘటితజీవనంలో ఒకటిగా మలచే సాధనంద్వారా సంఘటితస్థితిని పొందడం. భక్తుల విషయంలో మన దర్శనశాస్త్రం చేసే ప్రబోధానికి ఇది సరిపోతుంది. భక్తి అనేది భక్తులకు 'సాధ్యం'గాను 'సాధనం'గానుకూడ అవుతుంది. 'స్వయం ఫలరూపతా' అంటే అదే. అదేవిధంగా సమాజంపట్ల ప్రగాఢమైన భక్తిభావనసుండి జనించిన మన సంఘకార్యం స్వయం ప్రేరకము, స్వయంపోషకముకూడ. స్వయంపోషకము, శాశ్వత శక్తి భరితమునయిన జాతీయజీవనానికి వేళ్ళవంటి మూలసూత్రాలను సరిగా అవగాహనచేసుకొనడం ద్వారా, స్వీకరించిన మార్గంపై ఇట్టి నిర్దుష్టమైన ఏకాగ్రతతో ఉండటంవల్లనే మన సంఘటన అజేయంగాను, దినదిన ప్రవర్ధమానంగాను ఐంది.

## ప్రత్యుదాహరణ

ఇందుకు పూర్తిగా వ్యతిరేకమైన ఒక ఉదాహరణ పరిశీలిద్దాం. అది ఈవిషయాన్ని సరిగా అవగాహనచేసుకొనేందుకు బాగా సహాయపడ వచ్చును. తాత్కాలికమైన ఒక లక్ష్యాన్ని చేపట్టిన ఒక సంస్థయొక్క ఉదాహరణ ఇది. మనదేశంలో నేడు అన్నింటికన్న ప్రాత రాజకీయపక్షమైన 'ఇండియన్ నేషనల్ కాంగ్రెసు' ఆంగ్లేయులను తరిమివేయడం తన లక్ష్యంగా స్వీకరించింది. ఆంగ్లేయులు వెళ్ళిపోయారు కాబట్టి కాంగ్రెసుయొక్క లక్ష్యం సిద్ధించినట్లే. ఆ సంస్థకు దాదాపు ఇరువదిఐదు సంవత్సరాలు వెన్నెముకగా పనిచేసి, దాని కార్యకలాపాలపట్ల మంచి అవగాహనకలిగిన గాంధీమహాత్ముడు, ఆంగ్లేయులు వెళ్ళిపోయిన వెంటనే, ఆసంస్థను రద్దుచేయు

మని ఈఉద్దేశ్యంతోనే సలహాఇచ్చారు. కాని పేరుపట్ల, స్వరూపంపట్ల మనిషి ఒక అనుబంధాన్ని పెంపొందించుకుంటాడని మనకు తెలుసుకదా! అందు చేతనే వారి అనుచరుల్లో చాలామందికి కాంగ్రెసును రద్దుచేసే ఉద్దేశ్యం రుచించలేదు. కాని వాళ్ళు ఆ పేరును, సంస్థను పట్టుకొని వ్రేలాడుతూ, తమ నాయకుని ఆదేశాన్నికూడా త్రోసి పుచ్చడానికి వాళ్ళు చవిచూచిన రాజకీయాధికారంకూడా కొంతకారణం అయిఉంటుంది.

తత్ఫలితంగా ఒకలక్ష్యం తనముందు లేకపోవడంవల్ల కాంగ్రెసు త్వరలోనే దారితప్పి ఆంగ్లేయులతో పోరాడే రోజులలో ప్రకటించిన ఆదర్శాలన్నిటినుంచి పతనమైంది. సత్యం, అహింస, శీలం, దేశభక్తి అన్నీ మాయమైపోయాయి. ఆ పేరూ, వల్లించే ఆదర్శమూ అట్లాగేఉన్నా, లోపలితత్త్వం మాత్రం పూర్తిగా అదృశ్యమైపోయింది.

సత్యాన్ని త్రోసిరాజని, అసత్యం గద్దెనెక్కింది. మన ఉత్తర సరిహద్దులమీద, 1954 నుండీకూడా చైనా దురాక్రమణ జరుపుతోందని తనకు తెలుసునని ప్రభుత్వమే ఒప్పుకున్నది. కాని వారా నిజాన్ని అణచి వేశారు. అది జరగలేదన్నారు. దాన్నిగురించి మాట్లాడినవారందరినీ నిందించారు. అంతేగాక 'హిందీ,చీనీ,భాయీ భాయీ'అంటూ గొప్పప్రచారం చేశారు. ఇంతకు మించిన మోసం ఉంటుందా ?

ఇంక అహింసను గురించి చెప్పాలంటే, మన నాయకులు ప్రపంచాని కంతకూ శాంతి, అహింసలను ప్రబోధిస్తారు. కాని మనదేశంలో మాత్రం ఆంగ్లేయుల పరిపాలనలోకంటె ఎక్కువగా ఈనాడే రాజకీయంగా తమకు వ్యతిరేకులని భావించిన మన దేశీయులపైన నిర్బంధాలు, లాఠీదెబ్బలు, తుపాకికాల్పుల రూపంలో మరింత హింసను జరుపుతున్నారు. ఇక వ్యాగ్రూప మైన హింసకు హద్దే ఉన్నట్లులేదు. విమర్శల్లో సంయమనం చూపండి

అని దేశంలోని రాజకీయనాయకులందరికీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి బహిరంగవిజ్ఞప్తి చేశారు. తమ రాజకీయభావాలతో ఏకీభవించని వారందరినీ 'గద్దార్' - అంటే దేశద్రోహులు - అనిమళ్ళీవిమర్శించేదివారే.

శీలభ్రష్టత ఈనాడొక సామాన్యవిషయమైపోయింది. లంచగొండితనం, ఆశ్రితపక్షపాతం స్వేచ్ఛావిహారం చేస్తున్నాయి. వివిధ పరిపాలనా శాఖల్లోని అవినీతిని నిర్మూలించటానికి వేరొక ప్రత్యేక పరిపాలనా విభాగం ప్రారంభింపబడింది. కాని ఆ అవినీతినిరోధకశాఖలోని అవినీతిని నిర్మూలించేందుకు మరొక పరిపాలనా విభాగం అవసరం; ఇట్లా ఇది అంతులేకుండా సాగేట్లున్నది. కాంగ్రెసులో ప్రముఖ కార్యకర్తగా పనిచేసిన ఒక పరిచితవ్యక్తి ఒకసారి నన్ను చూడటానికి వచ్చాడు. చీకటిబజారు, దొంగవ్యాపారం, లంచగొండితనం మొదలైనవాటిని నిర్మూలించేందుకు ఏర్పరచిన అనేక పరిపాలనా విభాగాలవల్ల ప్రభుత్వకోశానికి తీవ్రమయిన నష్టం కలుగుతున్నదని అతడు వాపోయాడు. ఇటువంటి దురాచారాలకు బాధ్యులైనవారందరినీ పవిత్రులుగాచేసే బాధ్యతను సంఘం స్వీకరించాలని ఆయన సూచించాడు. 'మీ సలహా నాకు సమ్మతమే. కాని నేనెవరినుండి ఈపని ప్రారంభించాలో వివరిస్తారా' అని అడిగాను. అత్యున్నత స్థాయిలో నున్న వారి నరనరాల్లోకూడా ఈ భ్రష్టత ప్రవేశించిందని ఆయనకుకూడా తెలుసు. కాబట్టి నే నన్నమాటలోని ఆంతర్యాన్ని ఆయనకూడ అర్థం చేసుకోగలిగాడు.

## క్రొత్తపిచ్చి

మన నాయకులకు ఆంగ్లేయవ్యతిరేకోద్యమదినాల్లో ప్రేరణ ఇచ్చిన దేశభక్తి, స్వార్థత్యాగం వంటి భావనలకు పట్టిన దుర్గతిని చూస్తే ఆ పదాలకు అర్థాలు పూర్తిగా ఈనాడు మారిపోయాయని మనకు తెలుస్తుంది. మన

మాతృభూమియొక్క అఖండత్వం వారికి అర్థవంతమైన భావనగా తోచటంలేదు. మన దేశాన్ని ముక్కచెక్కలు చేసేందుకుద్దేశించిన ఉద్యమాలను ప్రముఖనాయకులుగూడ ఆశీర్వదించి, ప్రోత్సహిస్తున్నారు. 'హిందీని నెత్తిన రుద్దించుకోవడం' కంటె దేశవిభజనయే మంచిదని శ్రీ సి. రాజగోపాలాచారి ప్రకటించారు. త్యాగభావనస్థానంలో త్యాగాలను సొమ్ముచేసికోవాలి అనే కోరికవచ్చింది. త్యాగం చేయడంకంటె, దాన్ని ప్రదర్శించాలనే మోజు ఎక్కువైంది. సత్యనారాయణవ్రతాన్ని జరిపించేందుకు పోయిన ఒక పురోహితునికథవలె ఉంది ఈ వ్యవహారం. పూజా సమయంలో అతడు రహస్యంగా ఒక విలువైన నగను కాజేసి, ఇంటికిపోయి, పనిగట్టుకొని తిరిగివచ్చి ఒకదారంముక్కను ఆయింటివారికి తిరిగిఇచ్చివేసి, తన నిజాయితీకి, వారందరినుండి ప్రశంసపొందినాడు.

త్యాగం చేయకుండానే చేస్తున్నట్లు ప్రదర్శించుకోవాలనే మోజు మన పెద్దపెద్ద ప్రణాళికలన్నిటినీ నవ్వులపాలు చేసింది. పేరు ప్రఖ్యాతుల పట్ల వాంఛ సేవాభావంగా చెలామణి ఔతున్నది. హాస్యాస్పదమైన ఉదంతం ఒకటి లోగడ జరిగింది. కొన్నిఏండ్లక్రితం గంగానదికి వరదలు వచ్చి కాశీనగరంలోని కొన్ని ప్రాంతాలు జలమయమైనవి. ఆ సమయంలో అక్కడ ఉన్న ఒక మంత్రివర్యుడు ప్రమాదానికి గురియైన ప్రాంతాలను సందర్శిద్దామనుకొన్నాడు. వరద తాకిడి అంచువరకు ఆయన కారుమీద వెళ్ళాడు. అక్కడ ఆగిపోయి తన కార్యదర్శిని పిల్చి, ఛాయాచిత్రగ్రాహకుడు ఏడని ప్రశ్నించాడు. ఆ సమయంలో ఎందుకో అటువంటి " ముఖ్యవిషయం " మరచిపోవడం జరిగింది. వృత్తిచ్ఛాయాచిత్రగ్రాహకుణ్ణి తీసుకవచ్చేందుకు కారును వెంటనే వెనుకకుపంపారు. అతను వచ్చి 'వరదబాధితులసహాయం నిమిత్తమై మోకాలిలోతునీళ్ళలో నిలచిఉన్న' మంత్రిగారిఛాయాచిత్రాలురెండు తీసిన తర్వాతనే వరదబాధితులకు తాము చేయగలిగినంతమేరకు సహాయం చేశామని సంతృప్తితో ఆయన కారులో ఉత్సాహంగా తిరిగిపోయాడు.

## నిలకడలేని విధేయతలు

సమాజకార్యంలో అంకితంకావాలని ఒకప్పుడు చెప్పినవారే ఈనాడు పేరుప్రతిష్ఠలకై ప్రాకులాడుతున్నారు. ఆత్మార్పణకు బదులు అహంకారం నెలకొన్నది, వారి ఆలోచనలు, మాటలు, చేతలు – అన్నీగూడ అహంకార మయమై పోయాయి. కొన్ని ఏండ్ల క్రితం పండిత నెహ్రూ నాగాకొండలను సందర్శించినప్పుడు, ఒక ప్రత్యేక స్వతంత్రనాగారాజ్యం కావాలంటూ ఒక విజ్ఞాపనను బహిరంగసభలో వారికి సమర్పిద్దామని కొందరనుకున్నారు. కాని స్థానిక అధికారులు అందుకు అనుమతించలేదు. అందుకు నిరసనగా సరిగ్గా నెహ్రూ ఉపన్యసించటం ప్రారంభించబోయేముందు దాదాపు మూడు వేలమంది నాగాలు ఆ సభ విడిచి వెళ్ళిపోయారు. దాన్ని పండిత నెహ్రూ తనకు జరిగిన వ్యక్తిగతమైన అవమానంగా భావించి, ఈదేశంలోని క్రైస్తవ ప్రచారకులు తుచ్ఛమైన దేశవిద్రోహకార్యాలు జరుపుతున్నారంటూ చాలాచాలా మాట్లాడారు. ఆనాటివరకు వారు వాళ్ళ 'మానవతాపూర్ణ కార్యాకలాపాల'ను ఎంతో పొగడుతూ ఉండేవారు. అంతేగాక దేశీయుడైన ఒక మతప్రచారకుని 'కార్డినల్'గా నియమించడం మనదేశానికి జరిగిన సన్మానంగాగూడ ప్రశంసించేవారు.

సంపూర్ణ సమాజంపట్ల మహోత్కృష్టము, ప్రబలమునైన నిస్వార్థ భక్తిభావన కోల్పోయినందువల్ల అల్పములు, నీచములునైన భావనలు హృదయాల్లో చోటు చేసుకొన్నాయి. ఒక రాజకీయపక్షానికి, ఒకభాషకు, ఒక ప్రాంతానికి, ఒక కులానికి, ఒక సంప్రదాయానికి ముడిపడిన అపశ్రుతులు మన జాతీయ జీవనాన్ని ముక్కలుచేశాయి, తమ స్వార్థ ప్రయోజనాలను సాధించుకొనేందుకు 'గొప్ప నాయకులే' అటువంటి విఘటనాత్మకమైన కుతంత్రాలకు నాయకత్వం వహించడం విషాదకరం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికను సిద్ధంచేయటానికి నియమింపబడిన నిపుణులసంఘంవారు తమపై వచ్చిన రాజకీయపు ఒత్తిడివల్ల తమ అభిప్రాయాలకు భిన్నంగా దాన్ని

ఆవిధంగా వ్రాయవలసివచ్చిందంటూ దానియొక్క నిజస్వరూపాన్ని బట్టబయలుచేశారు.

## ఒకటే కొట్టుకపోవడం

అభివృద్ధిని సాధిస్తున్నామని పెద్దపెద్ద మాటలు చెపుతూ మనవారు ఈ విధంగా ఎక్కడకో కొట్టుకపోతున్నారు. మన మెక్కడకు పోతున్నామో మనకు తెలియదు. మన జాతీయజీవనంయొక్క సారమిది అని చెప్పదగినది ఈనాదేమైనా ఉందా ? మన జీవనపద్ధతి, మన విద్యావిధానం, మన నడవడి, మన వస్త్రధారణ, మన ఇండ్లు, ఊళ్లు, నగరాలు నిర్మించుకొనేపద్ధతి–ఇటువంటి మన జాతీయజీవనతత్త్వానికి చెందిన విషయాలన్నీ దారుణంగా మారిపోయాయి. ఈ అంధానుకరణ మన జాతీయప్రతిష్ఠకు అవమానమనిగాని, మన జాతీయవ్యక్తిత్వాన్ని కోల్పోవటమేననిగాని, భావదాస్యంలో కొట్టుకొనిపోవటమేననిగాని, కనీసం ఒక్క క్షణమైనా ఆగి మనం ఆలోచించుకోవటంలేదు.

దీనికి ఒక ఉదాహరణ చూడవచ్చును. మన నాయకులు దేశానికొక కొత్తధ్వజాన్ని ఏర్పరచారుగదా ! ఎందుకట్లా చేశారు ? గమ్యంలేని పయనానికి, అనుకరణకు అది ఒక నిదర్శనం మాత్రమే. అయితే ఈధ్వజం ఏవిధంగా ఏర్పడింది ? ఫ్రెంచి విప్లవం రోజుల్లో 'సమానత్వం' 'సౌభ్రాత్రం' 'స్వాతంత్ర్యం' అనే మూడుభావనలకు ప్రతీకంగా మూడు చారలు వారు తమధ్వజంలో ఏర్పరచుకొన్నారు. ఆ భావనలచేతనే ఉత్తేజితమయిన అమెరికా విప్లవంకూడ, వాటినే కొద్దిమార్పులతో స్వీకరించింది. మూడుచారలపై మన స్వాతంత్ర్యయోధులకుకూడ ఒకవిధమైన మోజు కలిగింది. కాబట్టి కాంగ్రెసు దాన్ని స్వీకరించింది. ఆతరువాత వాటికి క్రొత్తక్రొత్త వ్యాఖ్యానాలు చేసినారు. ఆ ధ్వజం వివిధ జాతులమధ్య సమైక్యతను సూచిస్తుందని, కాషాయవర్ణం హిందువులకు, ఆకుపచ్చ ముస్లిములకు, తెలుపు మిగిలినజాతులన్నిటికీ ప్రతీకాలని ఒక క్రొత్త

వ్యాఖ్యానం చేశారు. హిందువులుకానివాళ్ళలో ముస్లిములు ప్రబలులనీ, వారిని ప్రత్యేకంగా పేరుపెట్టిచెప్పకపోతే మనజాతీయత పరిపూర్ణంకాదనీ, ఆనాటి ప్రముఖనాయకుల మనస్సుల్లో ఉంది కాబట్టే ప్రత్యేకంగా ముస్లిముల కొకరంగును వారు సూచించడం జరిగింది. దీనిలో మతతత్వపు వాసన వేస్తున్నదని కొందర నేనరికి, కాషాయవర్ణం త్యాగానికి, తెలుపు పవిత్రతకు, అకుపచ్చ శాంతికి చిహ్నాలని ఏవేవో పరిక్రొత్తవివరణలు మళ్ళీ చేసినారు. కాంగ్రెసుసభల్లో ఈ వ్యాఖ్యానాలన్నీ ఆరోజుల్లో పూర్తిగా చర్చించినవే. ఇది విశుద్ధము, శ్రేయోదాయకమునైన జాతీయ దృక్పథమని ఎవరు చెప్ప గలరు ? రాజకీయావసరాలను తీర్చుకునేందుకు ఇది రాజకీయవాది కూర్చిన అతుకులబొంత మాత్రమే. ఇది జాతీయదృష్టితో, జాతీయ పరంపరల పునాదిపై ఆధారపడి చేసిన నిర్ణయం కాదు. అదేధ్వజాన్ని కొద్ది మార్పులతో ఈనాడు మన రాజ్యధ్వజంగా స్వీకరించటం జరిగింది. వైభవోపేతమైన చరిత్రగలిగిన అతిశ్రేష్ఠ ప్రాచీనజాతిమనది. అటువంటప్పుడు మనకొక సొంతధ్వజం లేనేలేదా ? ఇన్ని వేలసంవత్సరాల కాలంలోనూ మనకొక జాతీయచిహ్నం లేనేలేదా ? నిస్సందేహంగా ఉన్నది. ఐతే మన మనస్సులలో ఈశూన్యత ఎందుకు ఏర్పడింది ?

మన రాజ్యాంగంకూడా, పాశ్చాత్యదేశాలయొక్క వివిధ రాజ్యాంగాల లోని విభిన్న సూత్రాలతో గజిబిజియైన కలగూరగంపయే. మనం అనుకోతగినదేదీ దానిలో లేశమైనా లేదు. మన జాతియొక్క లక్ష్యాన్ని గురించి వివరించే ఒక్క అక్షరమైనా నిర్దేశకసూత్రాల్లో ఉన్నదా ? లేదు. ఐక్యరాజ్యసమితి ఘోషణపత్రంలోనివో, నానాజాతిసమితి ఘోషణపత్రం లోనివో, అమెరికా, బ్రిటన్‌ల రాజ్యాంగాలలోనివో కొన్ని అంశాలు కేవలం అతుకులబొంతవలె ఒకచోట చేర్చారు. 'ది లెగసీ ఆఫ్ ది లోకమాన్య' అనే గ్రంథంలో థియోడర్‌షే ఇదే అన్నాడు. 'స్వరాజ్యం, ధర్మరాజ్యం అనేవిగాని, మానవజీవన లక్ష్యానికీ, రాజ్యంయొక్క ఉద్దేశ్యానికీ సమన్వయం

గాని ఈ రాజ్యాంగం భూమికలో కనిపించకపోవటం పెద్ద విచిత్రం. మరో మాటలో చెప్పాలంటే భారతీయ ఉపదేశాలుగాని, భారతీయ రాజనీతి తత్త్వంగాని భారత రాజ్యాంగంలో ఛాయామాత్రంగానైనా లేవు.'

ప్రతి ఎన్నికలకు ముందు, ప్రతిసంవత్సరముకూడా కాలదోషంపట్టిన విదేశీసిద్ధాంతాలనుండి క్రొత్తక్రొత్త నినాదాలు సృష్టించడం చూస్తూనే ఉన్నాం. మన మీనాడు సమాజవాద సిద్ధాంతంకోసం పోరాడుచున్నామని అంటున్నారు. ఒక చిన్న కాంగ్రెసుకార్యకర్తకూడ తమ కాంగ్రెసు నాయకుడు వల్లించే "సమాజవాదం", "సమాజవాద సరళిగల సమాజం" (సోషలిష్టిక్ పేటర్న్ ఆఫ్ సొసైటీ) 'ప్రజాస్వామిక సమాజవాదం' ఇట్లాంటి మాటలకు వంతపాడుతున్నాడు. ఐరోపాభావాలకు దాస్యం ఇందులో కనపడుతోంది. ఇవన్నీ 1885 నుండే కాంగ్రెసు నిర్ణయించుకొన్న విధానాలేనని చెప్పుకొనేటంతవరకూ పోయిందీవ్యవహారం.

మనం ఒకసారి అమెరికావైపు, మరొకసారి రష్యావైపు మొగ్గు చూపుతున్నాం. ఈపద్ధతి మనలను నైతికంగాను, మానసికంగాను నాశనం చేయటంకన్న మరెక్కడికి చేర్చగలదు? ఈవిధంగా మనం ఎందుకు నిలకడ లేకుండా కొట్టుకపోతున్నాం ? మనకాళ్ళమీద మనం నిలబడలేదు కాబట్టే ఇలా కొట్టుకపోతున్నాం. కాలిక్రింది ఆధారాన్ని పోగొట్టుకొన్నవాడు ఒక ప్రక్కకు కొట్టుకపోక తప్పదు. వరదకు సమూలంగా పెళ్ళగించుక పోయి, కొట్టుకపోతున్న చెట్టును ప్రతి అలా అటూ ఇటూ త్రోసిపారేస్తుంది. మన జాతీయజీవనాన్ని సమూలంగా పెకలించివేశారు. అందుచేతనే గమ్యంలేకుండా కొట్టుకపోవటంకన్న దానికి వేరుమార్గం లేదు. కొట్టుక పోవటమనేది ఎల్లప్పుడూ ఉన్నతస్థాయినుండి క్రిందిస్థాయికే. చివరకు అగాధంలోనికి జారిపోవడమే జరుగుతుంది. ఈనాడు మనమట్టి దురదృష్ట కరమైన స్థితిలో ఉన్నాము.

## చరిత్ర నేర్పే గుణపాఠం

గాలివాలుకు కొట్టుకపోయే ఈ లక్షణాన్ని నిర్మూలించటానికి ఒకే ఒక పరిష్కారమార్గమున్నది; భావాత్మకము, స్వతంత్రము అయిన భూమిక మనకొకటున్నదనీ, జాతీయాశయాలు, ఆకాంక్షలు, చరిత్ర, పరంపర – ఇవే మనకు సుదృఢమైన ఆధారభూమి అనే స్ఫురణను మనలో జాగృతం చేయడం ఒక్కటే దీనికి మార్గం. అనురాగపూర్ణము, శాశ్వతమునైన భ్రాతృత్వభావనతో మన ప్రజలనందరినీ గాఢాలింగనం చేసుకొని, వారిలో జాతీయ భవితవ్యంపట్ల తమ కర్తవ్యాన్ని గుర్తింపచేసే మన సంఘంవంటి సంస్థమాత్రమే, గాలివాలున పయనించే పద్ధతివలన జాతిలో జనించిన స్వార్థం, విభేదాలు, నీచమైన పరానుకరణలు అనే కుళ్ళను సమర్థంగా నిర్మూలించగలదు.

కాబట్టి మన సంఘంయొక్క ఆవశ్యకత, అది ప్రారంభమైన నాటికంటే ఈనాడు మరింత ఎక్కువ అని చెప్పవచ్చును. నేటి పరిస్థితుల్లో ఉదాసీనతకు అవకాశం లేదు. దేశంలోని పరిస్థితులూ, చుట్టు ప్రక్కల పరిస్థితులూ చూస్తే, ఇదంతా ఎప్పుడు బ్రద్దలవుతుందో అని అనిపిస్తోంది. 'నిరంతర జాగరూకతయే స్వాతంత్ర్యానికి రక్ష' అని విన్నాం. ఇప్పటికైనా మనం చరిత్రనుండి ఈ పాఠాన్ని నేర్చుకొందాం. మహమ్మదు ఘోరీయొక్క దురాక్రమణ పరంపరను అనేకపర్యాయాలు పూర్తిగా త్రిప్పికొట్టినాడు పృథ్వీరాజు; కాని ఢిల్లీ నగరద్వారాలపై శత్రుసైన్యాలు విరుచుకపడుతుంటే, క్రొత్తపెండ్లికూతురు సంయుక్తతో కులుకుతూ ఉండి ఓడిపోయాడు.

## ప్రమాద సూచిక

స్వేచ్ఛగా, వైభవోపేతంగా మనం జీవించటానికి అడ్డుతగిలే ప్రమాదాలన్నిటినీ అచంచలవిశ్వాసంతో ఎదుర్కొనగలిగినంతగా దృఢమైన సంకల్పశక్తి, సుసంఘటితస్థితి మన జాతికి ఉన్నాయని నిజానికి చెప్పగలమా? ఉదాహరణకు ఈనాడు మన యువకుల కండ్లలో పురుషత్వం, ఆదర్శవాదాల వెలుగు చూడగలుగుతున్నామా? అది లేదు సరిగదా, మన యువకులు నీచ విదేశీ విలాసాల మోజులో పడి ఇంద్రియసుఖాల్లో మునిగితేలుతూ ఉండడమే కనిపించడంలేదా? కాంగ్రెసుసంస్థ నిర్వహించిన ఒక వ్యాయామ శిక్షణశిబిరాన్ని నేనొకసారి చూడటం సంభవించింది. యువతీయువకులు కలిసి వాటిల్లో పాల్గొంటున్నారు. ఈ శిబిరంలో బాలికలకు ప్రవేశం ఉండకపోయినట్లైతే బాగుండేదికదా అని ఆ శిబిర నిర్వాహకుని అడిగాను. అట్లాఅయితే చాలా కొద్దిమంది యువకులు మాత్రమే శిక్షణలో పాల్గొనేందుకు వచ్చేవారని మొహమాటమిలేకుండా అతడు ఒప్పుకొన్నాడు. లక్నోలో యువజన సమ్మేళనమొకటి జరిగింది. అచటి మన మిత్రులు ఇచ్చిన ప్రత్యక్షసాక్ష్యాన్నిబట్టి, ఆసమావేశంలో ప్రబోధాత్మకమైన విలువలేవీ లేవనీ, అది కేవలం దారుణమైన అవినీతికి ఆటపట్టు అనీ నాకనిపించింది.

ఇంద్రియసుఖాలకు, ఆడంగిరేకులతనానికీ లోనైన యువకులుగల జాతి, జీవించగలదని ఆశించలేము. తాత్కాలికంగా అట్టిజాతి ఎంతటి వైభవోపేతమైన దైనప్పటికీ, శక్తిమంతమైనప్పటికీ కుళ్ళిపోయి నాశనం కావటానికి అది గట్టిగుర్తు. అమెరికా, రష్యాలమధ్య నేడున్న పోటీలో మన సంఘంయొక్క అభిమానం ఎవరిపక్షాన ఉంటుందో తెలుసుకునే ఉద్దేశ్యంతో ఒక అమెరికాదేశ పత్రికావిలేఖరి నన్ను కలిశాడు. మన కాళ్ళమీద మనం సుస్థిరంగా నిలబడతామేగాని ఏప్రక్కకు లాగబడటానికీ అవకాశమీయం. 'ఈనాటి అమెరికాను గురించి మీ అభిప్రాయమేమిటి?' అని అతడు నన్ను

అడిగాడు. 'ఆత్మ వినాశకరమైన మార్గంలో అమెరికా త్వరితగతివి పయనిస్తున్నది. మీదుస్తులనొకసారి చూచుకొండి. మీరు ధరించిన వదులైన విలాసవస్త్రాలు, మీ జేబులోని దువ్వెనలు ఈనాటి ఒక సర్వసామాన్య అమెరికాదేశీయుని ఆడంగితనాన్ని నిరూపిస్తున్నాయి. మొదటి ప్రపంచ యుద్ధసమయంలో మిత్రరాజ్య సైన్యాలకు 'మార్షల్ ఫోష్' అనే ఫ్రెంచి దేశీయుడు సర్వసైన్యాధిపతి. ఆ ఫ్రెంచిజాతియొక్క పౌరష మటువంటిది కాబట్టే ఆనాడు వారు జర్మనీని దృఢసంకల్పంతో ప్రతిఘటించారు. చివరకు యుద్ధాన్ని గెల్చుకున్నారు. జర్మనీలోని కొంత భూభాగాన్నికూడ వారు స్వాధీనం చేసికొన్నారు. కాని ఆ విజయానంతరం ఫ్రెంచివారు ఇంద్రియలోలతకు, సుఖాలకు దాసులై త్రాగి తందనాలాడుతూ, ఒళ్ళు మరచిపోయారు. తత్ఫలితంగా తమవద్ద ఎంతో అధికమైన సైనికశక్తి, అభేద్యమైన 'మాయినోరేఖ' ఉన్నప్పటికీ రెండవ ప్రపంచయుద్ధకాలంలో జర్మనీ దాడి ఆరంభించిన పదిహేను రోజుల్లోపునే ఫ్రాన్సు కుప్పకూలి పోయింది. ఫ్రాన్సుదేశపు సాహసోపేతమైన మగసిరిని, ఆడంగితనం లోలోపల తొలచివేసినందుననే ఫ్రాన్సు అకస్మాత్తుగా పూర్తిగా కూలి పోయింది. యుద్ధానంతరం మార్షల్ పెటేన్ అనే ఒక వృద్ధఫ్రెంచిజనరల్ ఫ్రాన్సు ఓడినది రణరంగంలో కాదని, పారిస్‌నగరంలోని బాల్‌రూమ్సు లోపని-విందులు కుడిచి, తాగి తైతక్కలాడేచోటు-ప్రకటించినాడు. అమెరికా సమయం మించిపోకముందే మేల్కొని లోలోపల తమ యువకశక్తి పొందుతూఉన్న పతనాన్ని ఆపుకోగలుగుతుందని నేను హృదయపూర్వకంగా విశ్వసిస్తున్నాను' అని అతనితో చెప్పాను.

మన దేశపరిస్థితులకు వీటికి పెద్దతేడా లేదు. వీలున్నంత ఆడంగితనాన్ని కలిగి ఉండటం ఈనాటి యువకులకొక కొత్తమోజు. దుస్తుల్లో అలవాట్లలో, సాహిత్యంలో, ఇంకా మన జీవితంలోని ప్రతిఅంశంలోనూ 'అధునాతనత్వ'మంటే ఆడంగితనం అని అర్థమయింది. మననవీనసాహిత్యం అంతటా 'లైంగికత' ప్రధానవిషయం అయిపోయింది. లైంగికభావ

ప్రధానమైన సాహిత్యం, జాతులయొక్క, నాగరికతలయొక్క వినాశనానికి తప్పనిసరిగా త్రోవతీస్తుందనే సత్యాన్ని ప్రపంచవ్యాప్తంగా వివిధదేశాల చరిత్ర అనేకపర్యాయాలు ఋజువుచేసింది.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మన జాతీయజీవనంయొక్క ఆంతరిక స్వరూపం ఈవిధంగా ఉంది. ఇది ఒక ప్రమాదచిహ్నం. దీన్ని మనం విస్మరిస్తే మనకు సర్వనాశనం తప్పదు. ఈ పరిస్థితుల్లో అతిప్రాచీనము, వైభవోపేతమునైన రాష్ట్రీయతయొక్క భావాత్మకమైన పునాదిపై ఆధారపడి త్యాగపౌరుషభావాలు అనే ఊపిరి నింపుకొని స్వచ్ఛము, పరమపవిత్రము, కళ్యాణప్రదము, సుసంఘటితమునైన జీవితాన్ని మన ప్రజల్లో నిర్మించటానికి అంకితమయిన సంఘంవంటి సంస్థమాత్రమే మన జాతిని సంరక్షించి పునరుజ్జీవింప చేయడానికి ఏకైకాధారం. నేటివరకు నెరవేరని ఈజీవనలక్ష్యం ఒక్కటే, దినదిన ప్రవర్ధమానమై సర్వత్ర వ్యాపిస్తున్న రాష్ట్రీయ స్వయం సేవక సంఘకార్యానికి మూలాధారమైన ప్రేరణశక్తిగా ఉంటోంది.

# 20. వేళ్ళకు నీళ్ళుపోయండి

విద్యారంగంలో అధ్యాపకులదే కీలకపాత్రయని వేరుగా చెప్ప నక్కరలేదు. ఈ సందర్భంలో కొన్ని మౌలికాంశాలను గురించి సంక్షిప్తంగా సమాలోచన చేయటం సముచితం.

## మన మౌలిక భావన

నవీన భావనలో 'విద్య' అనే పదానికి గల సంకేతార్థం ఏమిటి? అన్న ప్రశ్నతో మన ఆలోచన ప్రారంభిద్దాం. మానవునిలో అంతర్నిహితంగా ఉన్న శక్తిసామర్థ్యాలను వెలికి తీయడం విద్య యొక్క పరమార్థం. కేవలం విషయ పరిజ్ఞానాన్ని, కాస్తకాస్తగా మెదడులో నింపడం విద్య కానేరదు. మానవుని మెదడు ఒక సామానుల గది కారాదు. మానవునిలోని వివిధ శక్తులను, ప్రతిభనూ గుర్తించి వెలికి తీసుకురావటమే విద్య యొక్క మౌలిక లక్ష్యం అని సర్వత్రా భావిస్తున్నారు. అట్టి విద్య గణనీయమైన ఫలితాల నిచ్చింది కూడా. వివిధ దేశాలలో, కళా, శాస్త్రీయ, విజ్ఞాన రంగాలలో ఘనమైన విజయాలను సాధించిన పురుషుల నెందరినో మనం చూస్తున్నాం.

కానీ హిందువులమైన మనం మరింత ముందడుగు వేసాం. మాన వునిలోని అంతర వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించటమే మన దృష్టిలో విద్య యొక్క పరమ ప్రయోజనం. జీవితం కేవలం కొన్ని కోరికల మూట గాదు. మనలోనే ఒక పరమసత్యం ఇమిడి ఉన్నదని మనమంటాం. అట్టి పరమ సత్యాన్ని సాక్షాత్కరించుకొని సాకారం చేయటమే మన విద్యా విధానం యొక్క మౌలిక లక్ష్యం. అట్లా చేయటానికి, తగిన విధివిధానా లను గురించిన వివరణలతో కూడిన ఉపదేశాలను మన మహామునులూ, తపస్వులూ మన కందించారు. వాటిని అమలు చేయటంలో అధ్యాపకునికి ఒక ముఖ్యపాత్ర వుంది.

## అక్షయ నిధులను వెలికి తీయండి

అతడు ముందుగా విద్యార్థులలో, యమనియమాలనబడే పది సూత్రాలనూ అలవరచాలి. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవైదూ యమాలు. శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం— ఈ అయిదున్నూ నియమాలు. నిజానికి బైబిలులో చెప్పబడిన పది ఆదేశాలూ— ఈ ఐదు యమాలు, ఐదు నియమాల కన్న భిన్నాలు గావు. ఒక పాఠశాలలోని కొద్దిమంది విద్యార్థులైనా యమనియమాలలోని స్ఫూర్తినలవరుచుకోగలిగితే, తద్వారా కాలక్రమంలో ఇతరులు గూడా వారిని అనుసరింపగల సముచితమైన వాతావరణాన్ని వారు వ్యాపింపచేయగలరు.

యువకులకు రుచించే పద్ధతిలో ఈ సూత్రాలను చెప్పవలసిన అవ సరం ఉంది. నేను మాధ్యమిక పాఠశాలలో ఉన్నప్పుడు, మాకొక అధ్యాప కులుండేవారు. మామూలు పాఠాలేగాక, ఆయన మన ప్రాచీన పురాణాల నుంచి, అనేక కథలు, ఎంతో మనోహరంగానూ, సుబోధకంగానూ మాకు చెబుతూ ఉండేవారు. మా తల్లిగారి నుండి కూడా నేనెంతో నేర్చుకున్నాను.

మా అమ్మగారు "విద్యావంతురాలు" కాదు. ధార్మిక సాహిత్యంలోని రామాయణ, భారతాలవంటివి నేను ఆమెకు చదివి వినిపిస్తూండేవాడిని. అట్లా చేయడంవల్ల నేను ఎంత ప్రయోజనం పొందానో!

అటువంటి కథలే, శతాబ్దాల తరబడి, ఒక సమాజంగా మన యొక్క సంప్రదాయాన్నీ, తీరుతెన్నులీన్నీ నిర్మించుకుంటూ వస్తున్నాయి. వాటి నుంచి నేర్చుకోవలసింది చాలా వుంది. ఉదాహరణగా చెప్పాలంటే, జాబాలి కథ వుంది— ఏ పరిస్థితుల్లోనైనా సరే సత్యం చెప్పటానికే కట్టు బడిన బాలుడతడు. తనను విద్యార్థిగా చేర్చుకోమని కోరుతూ అతడు ఒక సారి ఒక గురువు దగ్గరకు వెళ్ళినపుడు, ఆ గురువు మీదేగోత్రమని అడి గాడు. ఆ బాలుడు ఇంటికి పోయి తన తల్లి జాబాల నడిగాడు. "చూడు బాబూ! ఒక యజమాని ఇంట్లో దాసీగా ఉన్నప్పుడు నీవు నా కడుపున బడ్డావు. నీ తండ్రి ఎవరో గుర్తించలేను. ఈ విషయమే మీ గురువుగారికి చెప్పుమని ఆమె అన్నది. బాలుడు తిరిగి వెళ్ళి తన తల్లి చెప్పిన సమా ధానాన్ని అక్షరశః గురువుగారివద్ద వల్లించాడు. గురువు అది విని "విద్య నేర్చుకునేందుకు నీ వంటివాడే తగినవాడు. సత్యాన్ని చెప్పటాని కవసర మైన ధైర్యం, సౌశీల్యం నీలో ఉన్నాయి" అన్నాడు. అప్పటినుంచీ ఆ బాలుడు సత్యకామ జాబాలిగా ప్రసిద్ధి పొందాడు

## వికృత ధోరణులను విడనాడండి

కానీ ఈనాడు మనలో చాలామంది అట్టి పూర్వగాథా సంపదలను మరచిపోయే ఉంటారు. జీవితంలోని అన్ని రంగాల్లోనూ, శ్రేష్ఠమైన, ప్రాచీన చరిత్ర మనకున్నదని కూడా మన యువజనుల్లో చాలామంది ఎరుగరు. విద్యలో ఇటువంటి సవ్యమూ, శుభప్రదమూనైన విషయం లేనప్పుడు మన విద్యార్థులు అసభ్యమైన, చౌకబారు పత్రికలను చదువు తున్నారంటే వింత కాదు. బోధనాంశాలను వారు చదువుకునే పద్ధతిలో

గూడ, శ్రద్ధా, పరిశ్రమ, సత్యాన్వేషణ, మానసిక సంసిద్ధత కరవై పోయాయి. పాఠ్య గ్రంథాలనూ, ప్రామాణికులైన రచయితలు వ్రాసినట్టి గ్రంథాలనూ సంప్రదించే అలవాటుకు స్వస్తి చెప్పారు. "సంక్షిప్త వివరణలు" "ప్రశ్నోత్తరాలు" అనేవి ఈనాటి మోజులు. పరీక్షల్లో ఉత్తీర్ణతకు 'ప్రైవేట్ ట్యూషన్లు' మరొక సులభమైన మార్గంగా విద్యార్థుల కగుపిస్తోంది. తన విద్యార్థులు ఇతరుల వద్ద 'ప్రైవేట్' పెట్టించుకోవలసిన అవసరమేర్పడితే, అది తన సామర్థ్యానికీ, కర్తవ్యనిష్ఠకూ గూడ అవమానమని అధ్యాపకుడు భావించాలి. విద్యార్థి మనస్సు మీద అడ్డదారుల ప్రభావం వల్లనే అతనిలోని చొరవ చచ్చిపోతుంది. అవగాహన చేసుకునే అభిరుచీ, సామర్థ్యం కూడా నశించిపోతాయి. అట్టి అడ్డు త్రోవలను ఉపాధ్యాయులు గూడా ప్రోత్సహిస్తున్నట్లు తరచు కనబడుతుంది కూడా. కొందరు అధ్యాపకులు 'ప్రైవేటు' చదువుకై తమ వద్దకే రావలసిందిగా తమ విద్యార్థులను ఒత్తిడి చేస్తున్నారు. విద్యార్థులయొక్క నైతికస్థాయిని ఇది ఎంతో దెబ్బ తీస్తుంది. ఒకరు తన విధిని నిజాయితీతో చేయవలసిన అవసరం లేదనీ, సంపాదనకు ఇతర వక్రమార్గాలు వెతుక్కోవచ్చుననీ, వారి మనసులలో ఒక ముద్ర పడిపోతుంది. ఈ విధంగా నైతిక పతనమే, ఇతర అడ్డుదారులేవీ కుదరకపోతే తాము పరీక్షలో ఉత్తీర్ణత సాధించే టందుకు విద్యార్థులు అవినీతికి పాల్పడేట్లు చేస్తుంది.

## అసలైన సిసలయిన హిందువులుగా జీవించండి

ఇట్టి వికృత ధోరణులన్నింటినీ మొగ్గలోనే త్రుంచివేయాలి. ప్రాథమిక పాఠశాల స్థాయి నుండీ కూడ మెదడుకూ, హృదయానికీ, చెందిన గొప్ప గుణాలను యువకుల మనస్సులలో నాటాలి. మన ఉదాత్త జాతీయ జీవనతత్వాన్నీ, శక్తిమంతములైన మన జాతీయ నాయకులనూ, సంఘటనలనూ, ప్రతిబింబించేటువంటి అనంతమైన మన ప్రాచీన, నవీన

సాహిత్య సంపదను వాడుకోవటం ద్వారా మాత్రమే ఇది సాధ్యమౌతుంది. ముఖ్యంగా మహామునుల, ఋషుల వంశపరంపరలో జన్మించినందుకు గర్వపడేట్లుగా మన యువకులను మనం తీర్చుకోవాలి. ఋషి వారసత్వానికి చెందినవారుగా జీవించాలంటే, మనం తప్పనిసరిగా హిందువులుగా జీవించాలి. హిందువులుగానే కన్పించాలి. అంతేగాక, ప్రపంచమంతా మనలను హిందువులుగానే గుర్తించగలిగేటంతగా మనల్ని మనం తీర్చి దిద్దుకోవాలి. మనల్ని, మన జాతీయ, ఆచార వ్యవహారాలనూ మనం గౌరవించుకోవటం నేర్చుకోగలిగినప్పుడు మాత్రమే, బాహ్యప్రపంచం నుంచి గూడా మనం గౌరవాన్ని పొందగలం. వాస్తవానికి మనపట్ల మనం నిజాయితీగా ఉండాలనీ, ఎవరో అనామకులకు నకిలీలుగా మనం ఎన్నటికీ కారాదనీ, ప్రపంచం మన నుంచి ఆశిస్తోంది.

## మనం మనంగా జీవించాలి

ఒకప్పుడు ఫ్రెంచి పౌరుడొకడు నా వద్దకు వచ్చాడు. అతనిని భోజనానికి ఆహ్వానించటం జరిగింది. మనందరిలాగానే, నేలపైనే కూర్చుని చేత్తో భోంచేస్తూ అతడు సంతోషించాడు. చెంచాలూ, కత్తులూ, బల్లలూ ఏమీ లేవు. అట్లా తింటుంటే మరింత రుచికరంగా వుందంటూ, "మేం మీ వద్దకు వచ్చినప్పుడు మీ పద్ధతులనూ, మీ ఆచార వ్యవహారాలలోని ప్రత్యేక లక్షణాలనూ తప్పక తెలుసుకోవాలి; అనుభవించాలి. లేకుంటే అంత దూరం నుంచి ఈ విదేశానికి రావటంలోని వేడుకేమిటి?" అని గూడా అన్నాడు.

ఒకప్పుడు అఖిల భారతీయ విద్యార్థి పరిషత్, నేఫా ప్రాంతంనుంచి విద్యార్థులను తెచ్చి, పుణేలోనూ, మహారాష్ట్రలోని మరికొన్ని ఇతర స్థలాల్లోనూ ఉంచి, వారికి విద్యాబోధన గరపాలనే ఒక పథకాన్ని చేపట్టింది.

వారు మన సంస్కృతిని అలవరుచుకొని, మన మాతృభూమితో, మన ప్రజలతోనూ హృదయపూర్వకమైన భావనా బంధాలను పెంపొందించుకునే లాగా వారిని ఇక్కడి కుటుంబాలలో ఉంచాలి అని పరిషత్ పథకం రూపొందించింది. ఈ పథక నిర్వాహకులు నా వద్దకు వచ్చినప్పుడు ఆ విద్యార్థులను, పాశ్చాత్యానుకరణకు లోనైన ఇళ్ళల్లో ఉంచవలదని నేను సలహా ఇచ్చాను. ఏ గృహాల్లో దైవసాన్నిధ్యంలో ఉదయం సాయంత్రం కూడా దీపారాధన జరుగుతూ ఉంటుందో, ఎక్కడ మన ఉత్సవాలూ, ఆచారాలూ సజీవంగా ఉన్నాయో, ఎక్కడైతే వారు మన సాంస్కృతిక మర్యాదలను అలవరుచుకోగలరో, అట్టి ఇళ్ళల్లో మాత్రమే వారు నివసించాలి. అటువంటి సంస్కారాల ద్వారానే ఈ విశాల భూఖండంలో అనేక భాగాలలో వ్యాపించి ఉన్న మన సువిశాల సమాజం ఒకే జాతిగా అమరమై తన కొచ్చిన కష్టాల నెదుర్కొంటూనే తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోగలిగింది.

"ఈ భూతలంపైన హైందవజాతి అతి ప్రాచీనం, సంస్కృతీ సభ్యతల్లో సంస్కారాల్లో సాటిలేనిది కూడా" అని ఎప్పుడో 1872లోనే 'ఎడింబరో రివ్యూ' వ్రాసింది. కానీ దురదృష్టవశాత్తూ అటువంటి ప్రాచీనమూ, మహోన్నతమూనైన జాతి సంతానమే, విదేశీ ప్రచారాని కెరయై, తమ ప్రాచీన చరిత్రనూ, సంప్రదాయాన్నీ మరచిపోయారు. వ్రేళ్ళు తెగి, తన గతం నుంచి, స్ఫూర్తిని పొందలేని సమాజం ఊహలలో నైనా ఉజ్వలమైన భవిష్యత్తును నిర్మించుకోజాలదు.

## ముఖ్య ప్రతిబంధకం

ఢిల్లీకి వెళ్ళినప్పుడు నేనొకసారి శ్రీ ఎం. సి. చాగ్లాను కలవటం తటస్థించింది. కేంద్రంలో అప్పుడాయన విద్యామంత్రిగా ఉన్నారు. రష్యా సందర్శించి అప్పుడే తిరిగి వచ్చారాయన. అక్కడి విద్యార్థులు ఎంత

శ్రద్ధగా చదువుకుంటున్నారో, జీవితంలోని అన్ని రంగాల్లోనూ, తమ ఔన్నత్యాన్ని స్థాపించుకోవాలనే, ఎంతటి మహత్వాకాంక్షతో వున్నారో! అని, తన మనస్సుకు హత్తుకొనిన విషయాన్ని ఆయన చెప్పారు. అటు పైన ఆయన, "మరి మన యువకుల్లో లోపమెక్కడున్నదో నా కర్థం కావటం లేదు. మన విద్యార్థులు, సమ్మెలకూ, క్రమశిక్షణారాహిత్యానికీ, అవ్యవస్థకూ, ఎందుకు లోనౌతున్నారో తెలియటం లేదు. అయితే మీ సంఘంలోని యువకులు క్రమశిక్షణతో, నిష్ఠావంతులుగా ఉంటున్నారు. కాబట్టి మన యువజన సమస్యకు మీరొక పరిష్కారమార్గ మేదైనా సూచించగలరా?" అని నన్నడిగారు.

"బాగున్నది. మన విద్యార్థుల ముందు మీరేదైనా మహోన్నత లక్ష్యాన్ని పెట్టారా? అని అడిగాను. "లేదు. తప్పను ఒప్పుకోవాలి గదా!" అని జవాబు చెప్పారాయన. అప్పుడు నేను "ఒక ఉదాత్తమైన లక్ష్యం తమని ఉత్తేజపరచనప్పుడు జీవితంలోని ఉన్నత విలువల కోసం, క్రమశిక్షణా, ఏకాగ్రతా నిష్ఠలను మన విద్యార్థులు అలవరుచుకోవాలని ఏలా మనం ఆశించగలం? అట్టి మహోన్నత లక్ష్యమే వారు తమ మహోద్వేగాలను అదుపు చేసుకొని, పొంగులు వారే శక్త్యుత్సాహాలను, నిర్మాణాత్మకంగా, జాతీయ పునర్నిర్మాణంలో పాలు పంచుకొనేట్లు చేయగలుగుతుంది. జాతీయతాదర్శవాదాన్ని అలవరచడం అనేది పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ సరైన చరిత్రను ప్రబోధించటంతో ప్రారంభం కావాలి. వారు మహోజ్వల వారసత్వం గల దేశంలో జన్మించారనీ, వారిపూర్వజులు భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ, కూడా మహోన్నత ప్రమాణాలను సాధించారనీ, మన బాలురకు బోధించాలి. అప్పుడు మాత్రమే వారు కూడా, ఆ స్థాయినిగానీ, అంతకన్న మరింత ఉన్నతస్థాయినిగానీ చేరుకునేందుకు శ్రమించాలనే స్ఫూర్తిని పొందగలుగుతారు.

"మన పాఠశాలల్లో దీనికి పూర్తిగా విరుద్ధమైన దానిని మనం బోధిస్తూంటాం. మన చరిత్రలోని మహోజ్వలమైన కాలం అంధకార యుగంగా చెప్పుతూ ఉన్నాం. బానిసకాలాలు గొప్పగా వర్ణిస్తున్నాం. దురాక్రమణకారుల దుస్సాహసాలు పొగడుతాం. అంతేగాని, మన స్వాతంత్ర్యవీరుల కర్తృత్వం ఎంత స్ఫూర్తిప్రదమైనదైనా పొగడ్తకు నోచుకోదు. మన చరిత్రలో అధికభాగం, మొగలాయి కాలం క్రింద, తదనంతరం, బ్రిటిష్ కాలం క్రింద చెప్పుతున్నాం. ఇలాగే కనుక, మనం మన గతంలో, ఘనమైనదేదీ లేదనీ, మనదెల్లప్పుడూ, పరాజితమైన జాతేననీ, మొగలులు వచ్చింతర్వాతనూ, ఆపైన ఆంగ్లేయులు రాకపిదప మాత్రమే, ఈ జాతి ప్రగతిపై దృష్టిని ప్రసరించిందనీ, క్లుప్తంగా చెప్పాలంటే– గర్వించదగిన గతము మనకు లేదనీ, అనుకరింపదగిన పూర్వులు మనకు లేరనీ, వారికి బోధించింతర్వాత అట్టి విద్యార్థుల నుండి చెప్పుకోదగిన విలువలేమైనా మనం ఆశించగలమా?"

"ఒక వేళ గతంలోని హిందువుల యొక్క విజయ సాధనలను పొగడుతూ, విదేశీయులకు,– గ్రీకులైనా, ముస్లిములైనా, ఆంగ్లేయులైనా– వ్యతిరేకంగా, వారు చూపిన పౌరుషాన్నీ, ఆత్మసమర్పణోత్సాహాన్నీ గురించి మాట్లాడితే నిన్ను తక్షణమే మతదురహంకారివిగా ముద్ర వేస్తారు. ఇందులోనే ఈ సమస్య కొచ్చిన అసలు చిక్కు" అన్నాను. శ్రీ చాగ్లా ఒక నిముషంసేపు మౌనంగా వుండి, ఆ పైన అదంతా నిజమేనని ఒప్పుకున్నారు.

## తారతమ్యం

మనని మనం కించపరచుకుంటూ, మన మూర్ఖత్వాన్ని ప్రకటించుకునేటువంటి ఇట్టి విద్య వలన వచ్చిన లాభమేమిటి? కొన్నిఏళ్ళ క్రిందట–

డాక్టర్ చతుర్వేది అనే ఆయన జర్మనీ వెళ్ళాడు. అక్కడున్న భారత-జర్మనీ మిత్రమండలి ఆయనకు ఆహ్వానం పంపింది. ఆయన ఐరోపా వానిలా దుస్తులు ధరించి, విమానాశ్రయంలో దిగ్గానే అచటి ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. అయితే చలివల్లనే అట్టి దుస్తులు ధరించాడని భ్రమ పడి వారు సరిపెట్టుకున్నారు. అతడు 'చతుర్వేది' కాబట్టి నాలుగు వేదాల లోనూ నిష్ణాతుడని భావిస్తూ, నాలుగు వేదాల పేరున, 'నాలుగు స్వాగత ద్వారాలతో అలంకరింపబడిన వీధుల గుండా అతన్ని తీసుకువెళ్ళారు. ఆ సంస్థ యొక్క కార్యదర్శియైన ఒక యువతి, స్వచ్ఛమైన సంస్కృతంలో అతనికి స్వాగత వచనాలు పలికింది. ఆనాడు ఇంకొక ప్రసంగం కూడా జరిగింది. అది కూడా సంస్కృతంలోనే కొనసాగింది. దానికి సమాధానంగా 'పండితుడైన' ఆ డాక్టరుగారు, స్వాగతోపన్యాసంలోని అంశంలో ఏమీ సంబంధంలేని మరొక విషయం మీద ఆంగ్లంలో ప్రసంగించారు. వేదాల మాట అటుంచి, కనీసం ఒక సంస్కృతం మాటైనా తెలియకపోవటమే అందుక్కారణం. గుట్టు కాస్తా రట్టయింది. అటుపైన, ముందుగా ఏర్పాటు చేయబడిన కార్యక్రమాలన్నీ రద్దుచేయబడ్డాయి. 'విద్వాంసుడైన' ఆ డాక్టరును గప్‌చిప్‌గా తిరుగు విమానంలోనే తిరిగి వెళ్ళిపొమ్మని వారు కోరారు.

మన మహాపురుషుల ప్రవర్తనతో ఈ ఉదాహరణను పోల్చి చూద్దాం. స్వామీ రామతీర్థ, అమెరికా తీరాన్ని చేరగానే ఒక సంఘటన జరిగింది. తోటి ప్రయాణీకులందరూ వారి వారి సామాన్లు తీసుకొని వెళ్ళి పోవాలనే హడావుడిలో ఉన్నారు. కాషాయవస్త్రం కట్టిన ఆ సన్యాసి (రామతీర్థ) మాత్రం నిశ్చలంగా, ప్రశాంతంగా కూర్చుని చుట్టూ వున్న ప్రకృతి దృశ్యాన్ని చూస్తూ ఆనందిస్తున్నాడు. నౌకాశ్రయంలో ఉంటూ వుండే అమెరికా దేశానికి చెందిన ఒక పౌరుడు, అతణ్ణి పలకరించి, ఆయన ఎక్కడకు వెళ్ళాలనీ, ఆయన సామాను ఎక్కడున్నదనీ, పరిచయ

పత్రమేదైనా ఉన్నదా అనీ, ఎన్నో ప్రశ్నలు వేసాడు. సామాను గాని, ధనంగాని, చివరకు పరిచయపత్రంగానీ తన వద్ద లేవని రామతీర్థ బదులు చెప్పాడు. అమెరికా దేశీయుడు ఆశ్చర్యంతో మూగవోయినట్లయి ఆయనను చూచి, "అయితే, ఈ విదేశంలో నీవెలా నెట్టుకురాగలవు? ఒక స్నేహితుడు గాని, కనీసం ఒక పరిచయస్థుడుగానీ నీ కిక్కడ లేరా?" అని అడిగాడు. అది విని రామతీర్థ చిరునవ్వుతో తన చేతులను ఆప్యాయంగా ఆ అమెరికా దేశీయుని భుజాలపైన వేసి, "ఒకరున్నారనుకోండి,— వారు మీరే" అన్నాడు. అది విన్నంతనే అమెరికా పౌరుని హృదయం ఎంతో ద్రవించిపోయింది. వాస్తవానికి అతడే ఆయనకు నిజమైన స్నేహితుడై, సహృదయతతో ఆయన్ను అభినందించేవాడై, ఆ తర్వాత అమెరికాలో స్వామిజీ పర్యటనకు అద్భుతమైన ఏర్పాట్లను చేసాడు.

## పునాదిని మఱువరాదు

అయితే పసితనం నుంచీ తగిన శిక్షణను పొందితేనే అటువంటి ప్రగాఢ ప్రేమతత్వాన్నీ, విజ్ఞానాన్నీ మనం అందుకోగలుగుతాం. అందు కొఱకై ప్రాథమిక పాఠశాల దశ నుంచే, సవ్యమైన వాతావరణాన్ని మనం నిర్మించుకోవాలి. ఒకసారి నేను నాసిక్‌లోని ఒక పాఠశాలకు వెళ్ళాను. భవనంలోని నడవ కిరుప్రక్కలా వున్న గోడలపై వందలకొలది చిత్ర పటాలు వ్రేలాడుతున్నాయి. అయితే, అవన్నీ కూడా, యూరపువనూ, తదితర దేశాలకూ సంబంధించిన యుద్ధదృశ్యములు, తదితరములు మాత్రమే. ఒక్కటైనా మన చరిత్రలోనీ, మన ఇతిహాసాలలోనీ, విశేషాలను సూచించటం లేదు. ఇట్టి చిత్రపటాలు, మన యువతరంలో సరైన భావస్ఫూర్తిని ఏలా కలిగించగలవు? హల్దిఘాట్, పానిపట్‌వంటి యుద్ధ దృశ్యాల నెందుకు పెట్టకూడదని నేను ప్రధానోపాధ్యాయుని ప్రశ్నించాను. అది విని– తన దేశపు సరిహద్దులకే, తన దృష్టిని పరిమితం చేసుకునే

సంకుచిత భావం వ్యక్తిలో ఉండరాదని ఆయన బదులు చెప్పాడు. అటు వంటి వికృతమైన అంతర్జాతీయ తత్వం, అటువంటి శ్రీ రంగనీతులు మన యువకులపై దుష్టభావాలను మాత్రమే కలిగిస్తాయి.

జాతీయత గురించి సుదృఢమైన పునాది లేకుండా మానవత్వం, అంతర్జాతీయతత్వం, వంటివి మాట్లాడటం రెంటిలోనూ వైఫల్యాన్నే కలిగిస్తుంది, మన జాతీయతత్వం, వారసత్వాలలో సర్వమానవాళి యొక్క అత్యుత్తమ సంక్షేమభావన ఎల్లప్పుడూ ఇమిడే వుంది. కాబట్టి మన జాతీయభావాన్ని, ఎంతటి తీవ్రస్థాయిలో బోధించినప్పటికీ, అవి మనపిల్లల మనసులను మానవ సంక్షేమ మహత్వ ప్రమాణాల నుండి ఎన్నడూ పెడ త్రోవ పట్టించదు. పైగా ఇట్టి మానవతా మూల్యాలను అది బలపరుస్తుంది కూడా.

పసిమనసులను తీర్చిదిద్దే శిల్పులైన అధ్యాపకులు, ఉపయోగ ప్రదములుగా తమ మనస్సులలో ఉంచుకోదగిన సాధారణ సూచనలలో ఇవి కొన్ని మాత్రమే.

# 21. సమస్యలన్నింటికీ పరిష్కారం ఒక్కటే

మన హిందూ సమాజాన్ని, సువ్యవస్థితం, సుసంఘటితం చేయాలన్నే ఏకైక లక్ష్యంతోనే రా. స్వ. సంఘ కార్యం ప్రారంభమయింది. వాస్తవానికి అదొక కష్టతరమైన కార్యమే. ఈ లక్ష్యాన్ని చేరుకొనే త్రోవలో మనం ఎదుర్కొనవలసిన అవరోధాలూ, సమస్యలూ ఏమిటని ముందుగా పరిశీలించుకోవాలి.

## బిడియమెందుకు

ముందుగా, మన హిందూ సోదరుల్లోని చాలామంది— వారిలో చదువుకున్నవారితో సహా– తమని తాము హిందువులుగా పిలుచుకునేందుకు సిగ్గుపడటం మనకు కానవస్తుంది. తమని తాము హిందువులుగా చెప్పుకోనక్కర్లేదంటూ, వినసొంపుగా ఉండే వాదనలు చేసి సమర్థించుకుంటూ ఉంటారు. ఇలాగే స్వామి వివేకానందను ఉదాహరిస్తూ, సమాజవాదాన్నీ, లౌకికవాదాన్నీ తీసుకురావటం కోసమే ఆయన విశ్వమతాన్ని గురించి చెప్పారని ఒక పెద్దమనిషి అనడం నాకు గుర్తు. కానీ యదా

ర్థంగా చూస్తే, హిందువులుగా సగర్వంగా తలెత్తుకు నిలబడండని చెప్పిన వాక్యాలు ఆయన రచనల్లో ఎన్నో కనబడతాయి. "నేను హిందువుడను" అని ఎలుగెత్తి ప్రకటించమని ఆయన మనకు పిలుపు నిచ్చాడు. సనాతన ధర్మం, హిందురాష్ట్రం యొక్క సారభూతమని మహాయోగి అరవిందులు చెప్పారు. కాబట్టి మనలను హిందువులుగా పిలుచుకోవడానికి సిగ్గుపడే నేటి మనస్థితి ఇట్టి మహర్షుల, మేధావుల వాక్కులకు వ్యతిరేకమని మనం గుర్తించగలం.

## భగ్నమైన అభూతకల్పన

మన హిందు సమాజం అనేక చీలికలూ వాలికలై పోయి వుండటం మనకు కనిపించే రెండో విషయం. కులాలు, సంప్రదాయాలు, విశ్వాసాలు, భాషలుగా లెక్కకు మించి విడివడిపోయి వున్న నేటి స్థితి పూర్తిగా విచ్ఛిన్నమైన ఒక విషాదకర దృశ్యంగా ఉన్నది.

ఇరవై ఏళ్ళ క్రితం 'భాష' అనేది సమైక్యపరచగల ఒక మహా సాధనంగా ఉండేది. కానీ ఇప్పుడది కల్ల అని తేలిపోయింది. ఒకే భాషకు చెందిన ప్రజలు విడివడిపోయి, తమకో రాష్ట్రము (State) అనే ప్రత్యేక రాజకీయ విభాగం ఏర్పరుచుకోవాలని కోరుకుంటున్నారు. మరాఠీ భాష మాట్లాడేవారిలో ఇప్పటికీ ఈ ధోరణి ఉంటూ వున్నది. ఆంధ్ర ప్రాంతంలో ప్రత్యేక తెలంగాణా కొరకై పెల్లుబికిన ప్రస్తుతపు (ఆనాటి) వెల్లువ కూడా ఈ ధోరణిలోదే.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి నుంచీ కూడ, తీరప్రాంతపు ఆంధ్ర ప్రజలు, అన్ని ఉద్యోగాలనూ, ఆర్థిక అవకాశాలన్నింటినీ గూడ, తమ గుత్తాధిపత్యంలో ఉంచుకుంటున్నారనీ, "ఆ గడ్డమీద పుట్టిన బిడ్డలు"

ఒక్కడే తిరస్కరింపబడుతున్నారనే, ఒక నింద తెలంగాణా ప్రాంతంలో బలపడసాగింది. 'గడ్డను పుట్టిన బిడ్డలు' అన్న పదజాలం ఏ అర్థాన్ని సూచిస్తుందో ఇపుడు ఆలోచిద్దాం. మన ప్రజలు, తమను యావద్దేశానికి చెందిన పుత్రులుగా కాక, ఒక చిన్న భూభాగానికి మాత్రమే చెందిన బిడ్డలుగా భావించుకోవడం ఆరంభించారనేదే దీని అర్థం. ఇది ఇలాగే కొనసాగితే, ప్రతి జిల్లా కూడా, అచటి ప్రజల ప్రత్యేక విధేయతకు కేంద్రమవుతుంది. ప్రస్తుతం (ఆనాడు) తెలుగు భాష మాటాడే ప్రజలు, ఇపుడున్న ఆంధ్ర ప్రదేశాన్ని రెండో, బహుశః మూడో భాగాలుగా విడగొట్టు టనేందుకై, కేంద్రంతో ఒక విధమైన యుద్ధాన్ని నడుపుతున్నారు. భాష ఒకటైనంతమాత్రాన మనుషులంతా కలిసి వుంటారనే మాట అసత్యమని ఋజువైంది.

## ఒకే పరిష్కార మార్గం

రాజ్యాంగాన్ని తగురీతిగా సవరించుకొని ఏకాత్మక స్వరూపమైన ప్రభుత్వాన్ని ప్రకటించేందుకు తగిన ధైర్యం పుంజుకోవటమొక్కటే దీనికి పరిష్కార మార్గం. ఈ దేశమంతా ఒక్కటే. ఇచ్చటి ప్రజలందరూ ఒక్కటే. అందుచేత ఒకే ఒక ప్రభుత్వాన్ని, ఒకే చట్ట నిర్మాణాధికార వ్యవస్థను మనం కలిగి వుండాలి. పరిపాలనా సౌలభ్యం దృష్ట్యా దేశమంతా వివిధ విభాగాలుగా వ్యవస్థీకరించబడవచ్చు. ఆ విభాగాలు ఎన్ని ఉండాలన్నది పెద్ద పట్టింపు కాదు.

కార్యనిర్వహణాధికారాన్ని తగురీతిగా పంచి పెట్టవచ్చు. కానీ చట్ట నిర్మాణాధికారం మాత్రం ఒకటే ఉండాలి. ప్రజాస్వామిక నియమాలను సమాధానపరిచే నిమిత్తమై అనేక ప్రాంతాలూ, ప్రాంతీయ శాసనసభలూ తప్పనిసరియని కొందరు చెపుతుంటారు. ప్రజాస్వామ్యానికీ, అనేక శాసన

సభలు కలిగి వుండడానికీ సంబంధం ఏమిటో నా కర్థం కావటంలేదు. దేశానికంతటికీ ఒకే కేంద్ర శాసనసభ ప్రజాస్వామ్యం యొక్క ఉద్దేశా లన్నిటినీ సంతృప్తిపరచగలగాలి.

## గుడ్డిలో మెల్ల

ఏది ఏమైనా, ప్రస్తుత ప్రభుత్వాధినేతలకు ఏకాత్మ స్వభావ రాజ్యాన్ని ఏర్పరిచే ధైర్యం చాలటంలేదనిపిస్తుంది. ఈనాటి సమాఖ్య స్వరూపమే కొనసాగాల్సొస్తే, అవసరమైన, కొన్ని నిర్దిష్టమైన సిద్ధాంతాలు రూపొందించుకుని, వాటికి అందరూ కట్టుబడి ఉండాలి.

కేవలం భాష ఒక్కటే నిర్ణాయక సూత్రం కాకుండా, మౌలికమైన నిర్ణాయకాంశాల్లో భాష కూడా ఒకటిగా వుండే చిన్న చిన్న విభాగాలను మనం అంగీకరించవచ్చు. ఒక్కొక్క దానిలోనూ ఒకటి కంటే అధిక భాషలు గల రాష్ట్రంగాగానీ, లేదా ఒకే భాషకు ఒకటి కంటే ఎక్కువ రాష్ట్రాలనుగానీ, కేవలం జాతీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని మాత్రమే ఏర్పాటు చేయవచ్చు. చిన్న విభాగాలు ప్రమాదకరాలని ఎల్లప్పుడూ భావించ వీలులేదు.

## ఈ ప్రమాదం మళ్ళీ జరుగరాదు

యదార్థంగా ఆలోచిస్తే, ఖచ్చితంగా ప్రమాదకరాలని తెలుస్తున్నప్పటికీ ఒకనాటి అస్సాం ప్రాంతంలో నేడు చిన్న రాష్ట్రాలు అనేకంగా ఏర్పాటు చేయబడ్డాయి. ఈశాన్య సరిహద్దు రాష్ట్రం (N E F A) అనబడే దాన్ని ఆంగ్లేయులు మిగిలిన అస్సాంలో కలుపక విడిగా ఉంచారు. మన ప్రభుత్వం కూడా అదే సంప్రదాయం కొనసాగిస్తోంది. ఇప్పుడు 'నేఫా'ను

ప్రత్యేక అస్తిత్వం కల్పించి వేరొక పేరు పెట్టారు. అదీగాక, ఒత్తిడి వల్లనో, మరెందుచేతనో నాకు తెలియదుగానీ, షిల్లాంగ్ చుట్టుప్రక్కలలో మేఘాలయ అన్న చిన్న ప్రాంతం, మిజోరాం అన్న మరొక ప్రాంతం కూడా ఏర్పాటు చేయబడ్డాయి. ఆర్థికంగా చూస్తే అవి దారిద్ర్యదశలోనే ఉన్నాయి. జనాభా బాగా తక్కువ కాబట్టి అవి అలా ఉండక తప్పదు. 1962 మొదలుకొని, చైనా దాడికి గురైన సమస్యకు నిలయమైన ఆ సరిహద్దు ప్రాంతాన్ని అనేక చిన్న భాగాలుగా విడగొట్టటం వల్ల ఒక రకంగా అచట మనస్థితి బలహీనం అయింది.

## బాధాకరమైన దృశ్యం

ఏదో వంక పెట్టుకొని కొనసాగుతున్న ఈ ఆందోళనలూ, హింసాయుత ప్రదర్శనల దృశ్యం ఎంతటి బాధ కలిగిస్తోంది! వివిధములైన విఘటనాత్మక శక్తులవల్ల ఎంతటి వినాశనం జరుగుతోంది! ఒకే దేశానికి చెందినవారమనే అభిప్రాయం అదృశ్యమైపోతున్నట్లుంది. దక్షిణాదివారికీ, ఉత్తరాదివారికీ, సమానాంశాలే లేవనే అభిప్రాయం ప్రబలుతోంది. 'తూర్పు తూర్పే, పశ్చిమం పశ్చిమమే! ఈ జంట ఎన్నడూ కలువవు'అని రూడ్యార్డ్ కిప్లింగ్ వ్రాసాడు. అయితే ఇప్పుడు ప్రాక్పశ్చిమాలు, సాంస్కృతిక, వైజ్ఞానిక భూమికలపై కలుస్తున్నాయి. కానీ వేల సంవత్సరాలుగా, ఒకే సమాజంగా మనమంతా ఉంటున్నా, మన స్వదేశంలో 'ఉత్తరం ఉత్తరమే, దక్షిణం దక్షిణమే, ఈ రెండూ ఎన్నడూ కలువజాలవు' అని చెప్పడం ఎంతటి తీవ్రమైన దురదృష్టం.

## బహుముఖమైన సమస్య

ఇట్టి విఘటన శక్తులకు తోడు, సర్వభక్షకమైన భ్రష్టాచారమనే 'దోషం' ప్రతి చోటా విలయతాండవం చేస్తోంది. శీలరాహిత్యం సమస్యే

కూర్చుంది. ఇది ప్రతి ఒక్కరికీ తెలుసు. ప్రతి ఒక్కరూ' దీన్ని గురించి మాట్లాడుతూనే ఉంటారు. వాస్తవానికి భ్రష్టాచారం అని, అనీ అనీ, వినీ వినీ మనం మొద్దుబారిపోయాం. కళ్ళారా చూచినప్పటికీ కూడా దాని పట్ల మనం అసహ్యతను వ్యక్తం చేయలేకపోతున్నాం; మన అంతరాత్మ నిద్రలో మునిగిపోయింది.

దేశంలో శీలరాహిత్య మేర్పడితే గౌరవపూర్ణమైన స్వతంత్రజాతిగా మన మనుగడే ప్రమాదభరితమవుతుంది. ఈ రోజున ఆ పరిస్థితులు మన దేశంలో ఏర్పడ్డాయి. ప్రభుత్వాధినేతల్లో కొందరు, సి. ఐ. ఏ. అనే అమెరికా దేశపు గూఢచారి సంస్థ మన జాతీయ జీవనాన్ని విధ్వంసం చేయటానికి కృషి చేస్తోందని అన్నారు. అది నిజమే అనుకుందాం. అట్టిసంస్థలు అమెరికాకు చెందినవైనా, రష్యాకు చెందినవైనా మన స్వంత పౌరులు కొందరు వారిచేతుల్లో పావులుగా ఉంటేనే కదా అలా జరిగేది! అట్టివారు ఆయా విదేశీ సంస్థల జీతగాళ్ళుగానో లేదా మరో విధంగానో ఆయా దేశాల ప్రభావానికి లోనయ్యే ఉండి వుండాలి.

## తీయని విషం

ఆ విధంగా ప్రజలను ప్రభావితం చేసేవానిలో పొగడ్త కూడా ఒకటి. పొగడ్తల్లో కూడా చాలా మెళకువలున్నాయి. ఫ్రాన్సులోని ఒకానొక నగరవాస్తు సంస్థ, యావత్ప్రపంచంలోనూ చండీగర్ ఉత్తమమైన నగరమని ప్రకటించినట్లుగా ఒక వార్త ఈమధ్య పత్రికల్లో కానవచ్చింది. వారు దానికి ఒక ప్రశంసాపత్రం కూడా ఇచ్చారు. అంతవరకే వాళ్ళు చెప్పి వుంటే, మనకే అభ్యంతరం ఉండేది కాదు. ఎందువల్లనంటే, చండీఘర్ నగర నిర్మాణ పథకం ఫ్రాన్సుదేశపు వాస్తుశిల్పిచేత, నగర నిర్మాణ విద్యానిపుణులతో మాత్రమే తయారుచేసారు. వాళ్ళు నగరనిర్మాణం ఉత్త

మంగా ఉందని భావించటం అతిసహజమే. కానీ అదే క్షణంలో ఆ నగర నిర్మాణమంతా పండిత జవహర్‌లాల్ నెహ్రూ యొక్క చైతన్యవంతమైన వ్యక్తిత్వం, దూరదృష్టుల వల్లనే జరిగిందనీ, ఆ గుణాలన్నీ ప్రస్తుతం ప్రధానమంత్రిగా ఉన్న ఆయన కుమార్తెలో మూర్తీభవించి ఉన్నాయని గూడా వారు ప్రకటించారు. ఎంతటి, తీయని, కమ్మని పొగడ్త ఇది. మన ప్రధానమంత్రి ఇట్టి పొగడ్తలకు లోనుకారని ఆశిద్దాం. అట్లా చేస్తేనే, ఇచ్ఛకాలకుగానీ, ముఖస్తుతులకుగానీ ఎర కాకుండా సుదృఢము, సమరసమూనైన మనస్సును కలిగి ఉండటమనే మహోన్నత సంప్రదాయానికి తగి ఉంటుంది. ఇతరుల చేత మన ప్రజల మీాద ఇటువంటి ఎన్నెన్ని రకాల పొగడ్తలు ప్రయోగింపబడుతున్నాయో మనకు తెలియదు. మానవుని మనస్సు చాలా బలహీనమైనది. ఉన్నతాధికారంలోని వ్యక్తులు అట్టి దానికి లోనైతే, ప్రమాదం మనకందరికీ, ముంచుకురాక తప్పదు. పొగడ్తలకు లొంగిపోయే లక్షణం గూడా శీలరాహిత్యం క్రిందకే వస్తుందని మనం గుర్తుంచుకోవాలి.

## ఇంతకంటె అథమస్థాయి ఉంటుందా ?

విభిన్న సమయాల్లో, మన దేశంలోని అనేక ప్రాంతాల్లో కరువు బాధితులకు సహాయం అందించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. నేడు మనం శీలరాహిత్యంలో ఎంతటి అధః పాతాళానికి దిగజారిపోయామో తెలిపేందుకు ప్రత్యక్ష నిదర్శనాలు వాటిల్లో మన కగుపిస్తాయి. కఱువుబాధితులైన ప్రజల కోసం, ప్రభుత్వంకానీ, ఇతర సంస్థలుగానీ ఎంతసహాయాన్ని సమకూర్చినా, అదంతా వారికే అందదు. మధ్యనున్న దళారులు దానిలో పెద్ద మొత్తాన్నే దిగమింగేస్తారు. గత సంవత్సరం తూర్పు బెంగాల్ నుంచి వచ్చిన శరణార్థుల కొఱకు, మందుల రూపంలో, ఉన్ని రగ్గుల రూపంలో, దుప్పట్ల రూపంలో ఎంతో సహాయం విదేశాల నుంచి గూడా

లభించింది. కానీ వాటిలో చాలాభాగం శరణార్థులకు చేరనేలేదు. కం కత్తా బజారుల్లో అవి అమ్మినారు. అయినప్పటికీ, అటువంటి నీచ వ్యాపారానికి ఒడిగట్టి, తుదకు బాధితులైన సోదరులను కూడా మోసం చేసి, వారి నోరు గొట్టి ధనవంతులైనవారిని పట్టుకునేందుకు అధికారులు ప్రయత్నం చేయలేదు. విచారణే జరిగుంటే బహుశః మన రాజకీయాల భండారం బయటపడి ఉండేది. కొందరు తిండి లేక చచ్చిపోతుంటే వారి నోరు కొట్టి, మరికొందరు కొవ్వు పట్టేట్లుగా బలుస్తున్నారు. నిజంగా ఎంతటి నీచ స్థాయికి మనం దిగజారిపోయాం! భ్రష్టులైన ఇట్టి ప్రజలుంటే ఏ జాతిగాని పైకి రాగలదని ఆశించలేం. శీలరాహిత్యమనేదే ఇపుడు మన కొక పెద్ద సమస్య.

## రోగం తిరగబెట్టింది

ఒకనాటి సమస్య నేడు మళ్ళీ తలెత్తింది. స్వాతంత్ర్య సమరంలో జాతి విముక్తి కొఱకు తమ సర్వస్వాన్నీ త్యాగం చేసేట్లుగా మన వీరులను ఉత్తేజపరచిన గీతం వందేమాతరం. హిందూ విశ్వాసాలకు చెందని ఒకానొక మతం వారు దానిని పాడటానికి ఒకప్పుడు అభ్యంతరం తెలిపారని మనకు తెలుసు. తత్ఫలితంగా, మన నాయకులు మధురమైన ఆ గీతాన్ని ఖండితం చేసి మొదటి పంక్తులు మాత్రమే పాడుకునేట్లుగా చేసారు. ఇప్పుడు కూడా విశ్వజనని యొక్క పవిత్ర రూపంగా భారత మాతను భావించే శ్రద్ధానిష్ఠలు కలిగిన వ్యక్తులు నిర్వహించే సమావేశాల్లో మినహాయిస్తే ఇతరత్రా అదే పద్ధతి కొనసాగుతోంది. ఈమధ్యనే, కొందరు ముస్లిములు– వారిలో కొందరు అధికార పక్షానికి చెందినవారున్నారు— బొంబాయి పురపాలక సంస్థలోని ఉర్దూ పాఠశాలల్లో, నామమాత్రంగా మిగిలిన ప్రస్తుతపు వందేమాతరం గీతాన్ని కూడా పాడటానికిఅభ్యంతరం తెలిపారు. ఇన్నేళ్ళుగా ఉర్దూ, హిందీ, బెంగాలీ, మరాఠీ విద్యాలయాల్లో ఈ పాటను పాడుతూనే ఉన్నారు.

## ఆత్మహత్యవంటి ప్రోద్బలం

అధికారపక్షమైన కాంగ్రెస్ యొక్క ప్రధాన కార్యదర్శి గూడా ముస్లింల యొక్క ఈ అభ్యంతరాన్ని సమర్థించాడని ఒక వార్త వచ్చింది. ఆ వార్తే నిజమయితే, అధికారంలోనివారే కనుక వందేమాతరం గీతం పాడటం ఐచ్ఛికమనే ఆదేశాన్ని జారీ చేసి వుంటే, అప్పుడది ప్రజలలోని దేశభక్తిని ఉద్దేశ్యపూర్వకంగా అణగద్రొక్కే ప్రయత్నమే కాగలదు. అట్టి అణచివేత దేశానికి తప్పక హాని చేస్తుంది. ఇదే ఉదంతాన్ని, అంత ముఖ్యమైనదిగా భావించక, అలాగే కొనసాగిస్తే, దేశవ్యాప్తంగా హైందవేతరుల్లోని మతతత్వ భావనలను, పెంపొందించిన వాళ్ళమవుతాం. నేటి ఈ సంఘటనను, వందేమాతరం గీతం పట్ల కలిగిన ఈ వ్యతిరేకతను, ఏ కేంద్ర నాయకుడూ ఖండించలేదు; దురదృష్టం! ఈనాడు ముస్లిం సమాజాన్ని సంస్కరించటానికి పూనుకున్నవారు కూడా, నిర్ద్వందంగా ఇట్టి ప్రకటన చేయడానికి, ముందుకు రాలేకపోయారు. వందేమాతరం గీతాన్ని పాడటానికి నిరాకరించేవారికి తమ రాజకీయ పక్షంలో స్థానం లేదని అధికార పక్షంతోసహా అన్ని రాజకీయ పక్షాలూ ధృఢమైన వైఖరితో తప్పక ప్రకటించాలని నా తలంపు. మన దేశమూ, అందులో నివసించే అన్ని వర్గాల ప్రజలకూ నడుమ తల్లీబిడ్డల అనుబంధం ఏర్పడే వాతావరణానికి అది తప్పక సహకరిస్తుంది.

## మన స్వభావానికి రూపుదిద్దండి

ప్రస్తుత పరిస్థితులను బట్టి చూచినప్పుడు హిందువు మాత్రమే ఈ దేశం తన పవిత్ర మాతృభూమిగా భావిస్తాడనేది సుస్పష్టమవుతోంది. ఇట్టి భావన అతని రక్తంలోనే ఉంది. తరతరాలుగా, మాతృభూమిలోని, కణకణమునూ అతడు ఆరాధిస్తూనే ఉన్నాడు. ఏ పవిత్ర కార్యం చేయ తల

పెట్టినా అతడు భూమి పూజతోనే ప్రారంభిస్తాడు. మనలో అణువణువునా వ్యాపించిన ఆంతరికమైన ఈ శ్రద్ధాభక్తులను మరొకసారి మేల్కొల్పాలి. తామంతా ఒకే భూమి యొక్క సంతానమేననీ, అందుచే ఒకరి కొకరు సోదరులమనే, అనుభూతిని హిందూ ప్రజానీకమందరూ అనుభవించేట్లు చేయాలి.

ఈ రోజుల్లో మనం సౌభ్రాతృత్వ సంబంధాలను ప్రపంచంలోని అన్ని రకాల ప్రజలతోనూ, అంటే రష్యా వారితో, చైనా వారితో, అరబ్బులతో, అమెరికావారితో ఒకరేమిటి? అందరితోనూ ఏర్పరుచుకునేం దుకు యత్నిస్తున్నాం. కానీ మనలో మనం మాత్రం ఒకరి కుత్తుకలొకరు ఉత్తరించటానికి తత్తరపడుతున్నాం. ఇది చాలా అసంగతమైన పరిస్థితి. దీన్ని సరిదిద్దితీరాలి. ఉత్తరం నుంచి దక్షిణం వరకూ, తూర్పు నుంచి పడమటి వరకూ, ఈ దేశంలో ఏ సంప్రదాయానికి, ఏ పంథకు, ఏ కులానికి, ఏ భాషకు మనం చెంది ఉన్నప్పటికీ, మనదంతా ఒకే ఒక భ్రాతృత్వ భావన; ఒకే తల్లి యొక్క బిడ్డలం మనం; ఒకే మాతృరక్తం మన నరనరాల్లో ప్రవహిస్తూ వున్నది,- అనే గుణపాఠాన్ని మనం తప్పక నేర్చుకోవాలి. ఇట్టి ఏకాత్మతను గుర్తించిన ఫలితంగా మాత్రమే మన ప్రజల్లో సమైక్యత సాకారమవుతుంది. కేవలం ఆర్థికమైన, లేక రాజకీయ మైన సర్దుబాట్లు అక్కడక్కడ ఎన్ని చేసికొన్నా ఆ అతుకుల బొంత సిద్ధాంతాలు, ఆ విధమైన ఏకత్వాన్ని సృష్టించలేవు.

## ఉన్నతుల సాక్ష్యం

మన వారసత్వం, సంప్రదాయాల వంటి ప్రాచీన విషయాలన్నీ నేటి కాలానికి తగనివనీ, వాటిని చెత్తబుట్టలోకి విసిరి, మరచిపోవాలనీ మన వాళ్ళే కొందరు మన దేశంలో చెప్పతూ ఉంటారు. అట్టివారు కూడా

పరిస్థితుల ఒత్తిడికి లోనైనప్పుడు మన గత వైభవ గాథను గానం చేయక తప్పదు. బంగ్లాదేశంతో యుద్ధ సమయంలో, సమాజవాదిననీ, లౌకికవాదిననీ, తనకు తానుగా చెప్పుకుంటూ, ఇతరులు కూడ తన నట్లాగే ప్రశంసించాలని కోరుకుంటున్న మనప్రధానమంత్రి "5000 సంవత్సరాలఉజ్వల వారసత్వం మనకున్నదనీ, మనం ఎవరిచేతనూ పరాజితుల మవడానికి సిద్ధంగా లేమనీ" చెప్పక తప్పలేదు. ఇన్నేళ్ళుగా రా. స్వ. సంఘం ప్రచారం చేస్తున్న భావాలనే మన ప్రధాన మంత్రి– ఆమె కూడా సంఘ సభ్యురాలే అయినట్లు– ప్రకటించినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను.

## సత్యాన్ని కాదంటే వచ్చిన ఫలితం

ఈ దేశంలో హిందువులే రాష్ట్రీయులు. ఇది ఒక చారిత్రక సత్యం. ఈ సత్యాన్ని కాదంటే మన కీ ప్రపంచంలో ఏ మేలూ కలుగదు. అయినప్పటికీ, వివిధ హైందవేతర వర్గాలను జాతీయ జీవన ప్రవాహంలో విలీనం చేయాలనే మహాయత్నంలో గడచిన అనేక దశాబ్దాల తరబడి ఈ సత్యాన్ని మనం నిరాకరిస్తూనే వున్నాం. అంత మాత్రమేగాదు; అట్టి సత్య ప్రకటన మన దేశప్రయోజనాలకు వ్యతిరేకమని కూడా భావిస్తున్నాం. నిజం పలకటం జాతీయ ప్రయోజనాలకు ఏలా వ్యతిరేకమో అర్థం కావటం లేదు. నిజమెప్పుడూ నిజమే. అది చెప్పబడాలి. బాహాటంగా ప్రకటింపబడాలి; అనుభవంలోకి రావాలి గూడా. దాని ప్రకారం తప్పక జీవించాలి కూడ. ఈ పని మనం చేయకపోతే ప్రజలందరిలోనూ, కనీసం హిందువులందైనా జాతీయ సమైక్యత ఎన్నటికీ అనుభవంలోకి రాదు. వాస్తవం చెప్పాలంటే, ముస్లిముల్లో, క్రైస్తవుల్లో, మంచి మనసు కలిగి, సజ్జనులైన వారూ, హృదయపూర్వకంగా దేశభక్తులైనవారూ, తాము ఒకనాటి ప్రభువులమంటూ కలలు కననివారంతా కూడా ఈ భూమి గతవేల సంవత్సరాలుగా, హిందుభూమి అనీ, హైందవ జీవనతత్వమే దీనిరొుక్క జాతీయ తత్వమనీ అంగీకరిస్తారు.

ఇట్టి జాతీయ జీవనతత్వం ఏ విధంగా చూచినప్పటికీ, తమ వ్యక్తి గత మతాలకు వ్యతిరేకం కాదనీ కూడ వారు గుర్తిస్తారు. అయితే దుర దృష్టవశాత్తూ అట్టి వ్యక్తులు చాలా కొద్దిమందే ఉన్నారు. బహుశః వారి మాటలను, వారి తోటి మతస్థులు వినిపించుకోరు. అందుకే బహుశః వారు ఈ విషయంలో నోరెత్తరు.

## మనదే బాధ్యత

తమ రాజకీయమైన, తదితరములైన వర్గాలేమైనప్పటికీ, హిమాలయాల నుండి, కన్యాకుమారి వరకూ, అలాగే ద్వారక నుండి మణిపూర్ వరకూ, హిందువులందరూ ఒక్కసారి, ఒకే జాతిగా, సమైక్యమై కలసి కట్టుగా నిలబడాలి. అప్పుడు మాత్రమే ఈ దేశంలో నివసిస్తున్న ఇతరు లందరూ కూడ భరతమాతనూ, మన జాతీయ అస్తిత్వాన్నీ గూడా గౌర వించటం నేర్చుకుంటారు. తమ తమ మతవిశ్వాసాలను చక్కగా నిలబెట్టు కుంటూనే, ఈ మహోన్నత జాతికి సహకరించే సభ్యులుగా వారు కాగలరు.

అందుచేతనే, మన జాతీయ అస్తిత్వం యొక్క యదార్థతను, మరల చైతన్యవంతం చేయటమొక్కటే జాతీయ సమైక్యతా కృషికి అంకితమయ్యేట్లుగా మన ప్రజల నుత్తేజపరచగలదని రా. స్వ. సంఘం యొక్క దృఢ విశ్వాసం. నేడు ప్రపంచంలో మన చుట్టూ ఉన్న అల్ల కల్లోలాలు, సంఘర్షణల నడుమ, తలెత్తుకుని, సామర్థ్యంతోనూ, విశ్వా సంతోనూ, మన జాతి ముందుకు అడుగువేసేట్లుగా అది మాత్రమే చేయ గలదు.

# 22. జాతీయ జీవామృతం

## 1. వాస్తవ ప్రపంచం

ప్రపంచంలో మన జాతి ఎల్లప్పుడు సమృద్ధిని కలిగి వైభవ ప్రతిష్ఠలయొక్క ఉన్నతోన్నతశిఖరాలను అందుకొంటూనే ఉండాలని ఈ ప్రాచీనజాతిపుత్రులమైన మనం కోర్కుకోవటం సహజం. అట్టికోరిక పూర్తిగా న్యాయసమ్మతమైనది; దాన్ని ఎవరూ కాదనలేరు. ఐనా ఈ కఠోరప్రపంచంలో జీవితం సరళంగా సాగిపోవటంలేదు. సముచితము, న్యాయసమ్మతమునైన కోర్కెలను తీర్చుకోవటానికికూడ బాహ్యప్రపంచం నుండి అనేక అవరోధాలకు, ప్రతిస్పర్ధలకు గురికావలసి వస్తున్నది. మన జాతీయ వైభవస్వప్నాలను యథార్థంచేసుకోవాలంటే, ఈ ప్రతిస్పర్ధలను సరిగా అవగాహనచేసుకొని, వాటిశక్తిని అంచనావేసికొని, వాటిని సమర్థంగా ఎదుర్కొనేందుకు సంసిద్ధం కావాలి.

### ఒక మహాసత్యం

ప్రస్తుతపరిస్థితినిబట్టి చూచినప్పుడు, మరింత అధికారాన్ని, మరింత సమృద్ధిని, ప్రపంచంలో అధికాధిక భూభాగంపై మరింత ఆధిపత్యాన్ని పొందేనిమిత్తమే నిరంతరం ఒకదానితో నొకటి పోటీ పడుతున్న 'జాతులు' అని పిలువబడే మానవసమూహాలుగా ఈప్రపంచమంతా విడివడిపోయింది

అనిపిస్తుంది. తొలినాటినుండి నేటివరకు మానవచరిత్రలో ఈ లక్షణం తప్పనిసరిగా ఉంటూవస్తున్నది. ఇన్నివేలసంవత్సరాల్లోను వివాదాలు మారాయిగాని వాటిలోని ఈ మౌలికసత్యంమాత్రం మారలేదు; పైముసుగు మారిందిగాని లోనితత్వం మారలేదు.

తొలి రోజుల్లో సామ్రాజ్యవాదం సిగ్గువిడచి, నగ్నంగా తన రాజకీయ కబంధహస్తాలను ఇతరులపై చాపటానికి ప్రయత్నించింది. ఆధిపత్యం పొందాలనే భావన ఈనాడు లోగడకన్న మరింత ఆకర్షణీయము, ప్రమాదకరమునైన ఎన్నో ముసుగులను దాల్చివస్తున్నది. అవి ఒక్కొక్కసారి అర్థసంబంధమైనవిగాను కనిపిస్తాయి; కాని ప్రపంచాన్ని స్వాధీనం చేసికోవాలనే భావనమాత్రం ఎప్పటివలెనే తీవ్రంగా ఉంది. ఒక సమాజం మరొక సమాజాన్ని స్వాధీనం చేసుకోవాలని తలంచినప్పుడు సంఘర్షణ తప్పదు. కాబట్టి నిజమైన శాంతిని ఈ విశాల ప్రపంచంలో ఎన్నడూ చూడలేకపోతున్నాం. నిజానికి ఆదినుండీ యుద్ధాలు చాలాసార్లు జరుగుతూనే ఉన్నాయి. రెండుయుద్ధాల మధ్య వ్యవధిమాత్రమే శాంతి. ఈనాటి పరిస్థితిని బట్టి చూచినప్పుడు, ఘర్షణఅనేది మానవజాతిస్వభావంలోనే ఉందనిచెప్పాలి.

శ్రీకృష్ణుడంతటి మహాపురుషుడు కురుపాండవులమధ్య అంతఃకలహాన్ని నివారించటానికి వారిమధ్య న్యాయసమ్మతము, శాంతియుతమునైన సంధిని కుదురుద్దామని అన్నివిధాల కృషిచేసి చివరకు తనయత్నంలో విఫలుడు అయ్యాడు. యుద్ధం తప్పలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో—

*కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో*
*లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః*
*ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే*
*యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥*

(నాశనకర్తయైనవాడను నేనే. వీరిని సంహరించుటకు ఇచటకు వచ్చితిని. నీవు లేకపోయినప్పటికి శత్రుపక్షంలో నిలిచిఉన్న ఈ యోధులందరూ తప్పక సంహరింపబడుతారు.)

అన్నాడు. ఈ ప్రపంచస్వభావంలోనే మృత్యువు, నాశనం అనేవి ఉన్నవని దీన్నిబట్టి తెలుస్తుంది. ఇదియే మానవజీవితంలోని మహాసత్యం. దీని విషయమై కండ్లుమూసుకుని కూర్చున్నంతమాత్రాన లాభంలేదు.

ఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. ఒక్కొక్కసారి ఆయుధాలతో రక్తపాతాలు సంభవిస్తూ ఉంటాయి. ఇతర సమయాల్లో 'ప్రచ్ఛన్నయుద్ధం' కొనసాగుతూ ఉంటుంది. ఒక దేశానికి చెందిన దౌత్యవర్గాల ప్రతినిధులు ఇతరదేశాలను బుట్టలోపెట్టటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. తంత్ర మేదైనప్పటికీ, బలహీనులను దిగమ్రింగి బలవంతులు మరింత బలం పుంజు కోవడం అనే ఆటవికన్యాయమే రెండుజాతులమధ్య సంబంధాలలో ప్రాథమిక సూత్ర మయిపోయింది; ఒక ప్రాణికి మరొకప్రాణి ఆహారం (జీవో జీవస్య జీవనం) అనే చిన్నచేపను మ్రింగి పెద్దదయ్యే మాత్స్యన్యాయం మాత్రమే అమలులోఉన్నది.

## వాస్తవ ప్రపంచం

ఐరోపా చరిత్రను ఒక్కసారి పరిశీలించండి. పారిశ్రామిక విప్లవం వచ్చిన క్రొత్తలో, ఐరోపాలోని దేశాలన్నీ, శక్తిమంతాలై తమతమ కబంధహస్తాలనుచాచి ఇతరదేశాలను బంధించాలని ప్రయత్నించాయి. స్పెయిన్ బలపడినవెంటనే అమెరికాపై కత్తి ఝుళిపించింది. తాను అధికారంలో ఉన్న రోజుల్లో పోర్చుగల్ తన విధ్వంసక హస్తాలను మన దేశంలోని గోవావరకు చాచింది. ఫ్రాన్సు శక్తిమంతమైనప్పుడల్లా యూరపులోని చిన్న రాజ్యాలను తన పాదాలక్రింద త్రొక్కిపట్టింది. భూగోళంలోని మారుమూలలకుగూడ తన సామ్రాజ్యాన్ని విస్తరింపచేసిన ఇంగ్లండుయొక్క చరిత్ర అందరికీ తెలిసినదే. జర్మనీ చరిత్ర దీనికి భిన్నంగా లేదు. తనయొక్క దురాక్రమణ తత్త్వాన్ని సంతృప్తిపరచుకొనేందుకుగాను

అది ప్రపంచాన్ని రెండు మహాయుద్ధాలకు గురిచేసింది. చాలినంత బలం పుంజుకోగానే ఇటలీ అబిసీనియాను కబళించింది. రెండవ ప్రపంచయుద్ధం తరువాత శక్తిమంతంగా రూపొందిన రష్యా ఈనాడు, ఫిన్‌లాండు, పోలెండు, చెకొస్లోవేకియా, బాల్కన్ రాజ్యాలను, చివరకు జర్మనీలోని సగ భాగందాక దిగమ్రింగింది. ఐక్యరాజ్యసమితి కనుల ఎదుటనే రష్యా వేలాది హంగేరీ స్వాతంత్ర్యయోధులను హతమార్చి తన యినుపపాదాలక్రింద హంగేరీని తుత్తునియలుచేసింది; క్రొత్తఎర ఇక ఏమిదొరుకుతుందా అని వెతుక్కుంటూ ప్రపంచమంతటా తిరుగుతూఉంది. చైనా తనయొక్క అధికారం పెరుగుతూ ఉన్న దశలోనే, కొరియా, ఇండోచైనాల్లో తన పంజాను చాచింది. అది అప్పుడే టిబెట్టుపై స్థిరనివాస మేర్పరచుకొన్నది; లడఖ్‌లోను, నేఫాలోను కొన్ని భాగాలను కబళించింది; అంతేగాక హిమాలయ రాజ్యాలపై మరల దండయాత్ర చేయటానికి సంసిద్ధమవుతూ ఉంది.

ప్రతిసారి యుద్ధం ప్రారంభంకాగానే ఇదే చివరియుద్ధమనీ, మళ్ళా యుద్ధం రానీయకుండా చేసేందుకే ఈ యుద్ధమనీ అతిరథ మహారథులు చెపుతూఉంటారు. మొదటి ప్రపంచయుద్ధంయొక్క బీభత్సాలను చూచిన తర్వాత ప్రపంచవ్యాప్తంగా మానవులందరూ యుద్ధాలకు స్వస్తిచెప్పాలనీ, శాంతి నెలకొనాలనీ ప్రార్థనలు చేశారు. కానీ ఆతరువాత ఇరువదిఏండ్లైనా దాటకముందే యావత్ప్రపంచమూ, మరింత భయంకరమైన మరొక రక్త ప్రవాహంలో మునకలు వేసింది. రెండవప్రపంచయుద్ధం తర్వాతగూర శాంతి నెలకొనాలని ఆశించి, భగవంతుణ్ణి మానవజాతి ప్రార్థించింది. అయినా ఈనాడు వాస్తవపరిస్థితులేమిటి ? ప్రతిచోట సంఘర్షణలే. ఒక్కోసారి అవి యుద్ధాలుగా పరిణమిస్తున్నాయి. చీటికీమాటికీ విరుచుకపడే సంఘర్షణల్లో ఆఫ్రికా అంతా లోలోపల ఉడికిపోతూన్న అగ్నిపర్వతంలా ఉంది. క్యూబాను తన అస్త్రస్థావరం చేసికోవాలనే కుతంత్రంతో రష్యా ప్రపంచాన్నంతనూ దాదాపు యుద్ధంలోకి నెట్టినంతపని చేసింది.

## నినాదాలు మారుతాయి 'నిజం' మాత్రం నిలచి ఉంటుంది

ఈ ఘర్షణలు, రక్తపాతాలు అనేకమిషలతో కొనసాగుతున్నాయి. ఉదాహరణకు ఈనాడు సామ్యవాదమనే ముసుగులో అతి భయంకర దురాక్రమణ పథకాలు వేస్తున్నారు. అన్నిరకాల ఆధిపత్యాలకు వ్యతిరేకంగా విప్లవంలేపాలనే నినాదంతో సామ్యవాదంపుట్టిందని జ్ఞప్తియందుంచుకోవాలి. తమతమ దేశాల్లోని రాజులకు, జమీందారులకు వ్యతిరేకంగా విప్లవం రెచ్చగొట్టి వాళ్ళనుతుడిచిపెట్టి, రష్యా, చైనాల్లోని సామ్యవాదులు అధికారం స్వాధీనం చేసికొన్నారు. కాని అనతికాలంలో 'సామ్రాజ్యవాదుల, పెట్టుబడి దారుల పిడికిళ్ళనుండి ప్రపంచమానవులను విముక్తులను చేస్తా'మనే సరిక్రొత్త నినాదం పేరున, వారుకూడ అదే సామ్రాజ్యవాదపంథాను అనుసరించారు. దురాక్రమణజరిపే తమ సైన్యాలను వారు 'విమోచన సైన్యాల'ని గూడ వ్యవహరించడం మొదలుపెట్టారు.

రష్యాచే 'విముక్తం' చేయబడిన హంగేరి, పోలెండు మొదలైన తూర్పు యూరపుదేశాలు, చైనాల విషయం ఏమిటి? ఆ తరువాత రోజుల్లో చైనాను సందర్శించినవారిలో - కుండపగలేసినట్టు చెప్పగలధైర్యమూ, మానసికస్థిమితమూ కలిగినవారు- ఆ దేశంలోని సామాన్యమానవుడు తన చుట్టూ ఏదో ఆపద ఆవరించి ఉన్నట్లుంటాడని, అతని ప్రవర్తనలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్నట్లు తోచదనీ స్పష్టంగా ప్రకటించారు. ఆ దేశీయుల జాతీయజీవనం, దాని సైన్యం, నౌకాదళం, వ్యవసాయరంగం మొదలైన సర్వరంగాలను స్వాధీనంచేసుకొని, ప్రతివిభాగంలోను, కీలకస్థానాలన్నిటి లోను రష్యాదేశీయులు, వారి స్థానిక తాబేదారులు రహస్యంగా నిఘావేసి ఉంటూ, పైకి కనపడకపోయినా పూర్తిగా తమ ఆధిపత్యంక్రింద అన్నిటినీ బిగించి ఉంచుతూ ఉన్నదానియొక్క ఫలితమే ఈ పరిస్థితి.

'నవచైనా'యని, 'గొప్పదూకు' అనీ 'మన శ్రేష్ఠభ్రాత రష్యా' అనీ స్తుతిగీతాలను ఆలాపించేవారు చైనాలో కొందరుండేవారు. మన దేశంలో

కూడ ఆంగ్లేయులు పాలించేరోజుల్లో, ఆంగ్లపరిపాలన దైవదత్తమని, ఒక వరమని అంటూ ఆంగ్లేయు లేదో భగవంతునిదూతలైనట్లు, మనలనుద్ధరించ టానికే వారు వచ్చినట్లు చెప్పుకుంటూ ప్రపంచమంతా తిరిగి చాటేవారు కొందరుండేవారు. తమ యజమానులను పొగడ్తలతో ఆకాశాని కెత్తేసే బానిసలు ఎల్లప్పుడు కనిపిస్తూనే ఉంటారు. యజమాని కొరడాతో కొట్టితే "ఎంతచక్కనిదెబ్బ కొట్టారు! ఎంతబాగా కొట్టగలరో కదా!!" అంటూ తమ యజమానులశక్తిని ప్రశంసిస్తూ ఉంటారు వారు. ఇప్పుడు టిబెట్టు విషయంలో చైనా అదే "విమోచనగాథను" వల్లిస్తున్నది.

అమెరికాకూడ బ్రిటనుయొక్క సామ్రాజ్యవాద నిరంకుశత్వాన్ని ఎదిరించి పోరాడి, దాని ఆధిపత్యాన్ని కూలద్రోసి, స్వీయస్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంది. ఆదే అమెరికా బహుశః పెరిగిపోతున్న సామ్రాజ్యవాద ప్రమాదాన్ని అరికట్టేందుకే కావచ్చును, ఈనాడు అనేకదేశాలకు ఆర్థిక సహాయము, ఒక్కొక్కసారి సైన్యసహాయాన్నిగూడ అందజేస్తూ, వాటిని తనపక్షంలో చేర్చుకొనేందుకు ప్రయత్నిస్తున్నది. అయితే "అర్థస్య పురుషో దాసః" (ధనానికి మనిషి దాసుడు) అన్నట్లు ఆర్థిక సహాయం పొందిన చోటనెల్ల దానితోబాటు ఏదో ఒకవిధమైన మానసికదాస్యం తప్పనిసరిగా ఏర్పడుతూనే ఉంటుందని మనకు తెలుసు. ఆవిధంగా అమెరికా ఆర్థికసహాయాన్ని అందుకుంటూన్న బీదదేశాలన్నిటిలోను అమెరికాదేశ సంస్కృతీముద్ర పడి ఆ యా ప్రజల జాతీయ ఆదర్శాల మీదా, సంప్రదాయాలమీదా, జీవితంయొక్క ప్రతిరంగంలోని సృజనాత్మక శక్తిమీదా అది దెబ్బతీస్తున్నదని మనకు తెలుసు.

## పరస్పర స్నేహమనే ఎండమావి

అయితే సంఘర్షణమయమైన నేటి ప్రపంచంలో మన జాతీయ సమైక్యతా వైభవాల్ని సంరక్షించుకొనేందుకు మార్గమేమిటి? ఇతరదేశాల

స్నేహాలు, ఒప్పందాలపై మనం ఆధారపడగలమా? ఈ విషయంలోకూడ ప్రపంచచరిత్ర చెప్పే గుణపాఠం వీసమెత్తు ఆశాకిరణాన్నైనా ప్రసరింప చేయటంలేదు. స్నేహంగాని, విరోధంగాని ఏ రెండుదేశాలమధ్య ఎన్నడూ శాశ్వతంగా నిలవలేదు. తమ జాతీయప్రయోజనాలకు తగినవిధంగా దేశాలు తమ మిత్రులను, శత్రువులను మార్చుకుంటూ ఉంటాయి.

గడచిన కొద్దిశతాబ్దాలకాలంలో యూరపులోని దేశాలమధ్య సంబంధ బాంధవ్యాల మార్పులు కూర్పులు ఎంతో చమత్కారజనకంగా ఉండేవి. ఇంగ్లండు, ఫ్రాన్సుదేశాలు శతాబ్దాలతరబడి పరమవిరోధులు. నెపోలియన్ నాయకత్వంలో ఫ్రాన్సు ఇంగ్లండుపై విరుచుకపడి ప్రమాదం తెచ్చిపెట్టి నప్పుడు ఇంగ్లండ్ జర్మనీతో స్నేహసంబంధాలు పెంచుకొని ఫ్రాన్సును అణగద్రొక్కింది. తరువాతకాలంలో, జర్మనీ మహాశక్తిమంతమయినప్పుడు రెండు ప్రపంచయుద్ధాల్లోను ఇంగ్లండు, ఫ్రాన్సులు ఏకమై జర్మనీని నాశనం చేశాయి. రెండవప్రపంచయుద్ధ ప్రారంభసమయంలో రష్యా తటస్థంగా ఉండిపోయింది. కాని తరువాత ఆ యుద్ధంలో లభించిన దోపిడీలో భాగంకోసం అది జర్మనీతో చేతులుకలిపింది. కాని తదనంతరం ఇంగ్లండు మంత్రాంగం నెఱపి రష్యాను జర్మనీనుంచి దూరంచేసింది. రష్యా అప్పుడు అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సులతో కలిసింది. అమెరికా గూడ తన స్వాతంత్ర్య సంగ్రామసమయంలో ఇంగ్లండుకు వ్యతిరేకంగా ఉంటూ ఫ్రాన్సుతో స్నేహంగా ఉంది. కొద్ది సంవత్సరాల తరువాత పరిస్థితిమారి, ఇంగ్లండు దానికి మిత్రదేశమయింది. ఈ భూతలంపైన జాతులమధ్య ఏర్పడిన 'పరస్పర మిత్రత్వ' చరిత్ర ఈ విధంగా ఉంది. ఆత్మోత్కర్ష, అధికారదాహాలు, దేశాల ఆలోచనల్లో తిష్ఠవేసికొని పరిపాలించినంతకాలం ఇంతకన్న భిన్నమయిన ఫలితాన్ని మనం ఆశించలేము. కాబట్టి ఇతర దేశాలతో గల స్నేహరూపంలో శాశ్వతమైన భద్రతను ఆశించటం కేవలం భ్రమమాత్రమే కాగలదు.

## మహా రాక్షసుడు–మరుగుజ్జుల మైత్రి

ఈనాడు ప్రపంచం రెండు శక్తికూటముల క్రింద చీలిపోయినట్లుగా కనిపిస్తుంది. వాటియొక్క శక్తి వైభవాలతో పోల్చినప్పుడు మనలోని బలహీనత గుర్తుకువచ్చి మనం ఏదో ఒక కూటమిలో చేరాలని, ఆవిధంగా ఒక కూటమియొక్క ఛత్రచ్ఛాయల్లో స్వేచ్ఛావాయువులను పీల్చుకోవచ్చునని వాదించేవారు కొందరున్నారు. అయితే తాను స్వయంగా బలహీనుడుగానే ఉంటూ, ఒక బలవంతునికి మిత్రుడుగా ఉండటంలోకూడ విపరీతమైన ప్రమాదాలు లేకపోలేదు.

ఒకసారి ఒకమహాకాయుడు,ఒక మరుగుజ్జు మిత్రులయ్యారు. ఏదైనా ఒక సాహసకృత్యం చేద్దామని వారు అడవికి పోయారు. చాలా పెద్ద ధనరాశి దోచుకొనివచ్చి పంచుకుంటున్న దొంగలు అక్కడ వారికంటబడ్డారు. మహాకాయుడు ఆదొంగలందరినీ పారద్రోలి, ఆ ధనాన్నంతనూ తీసికొని తిరిగివచ్చాడు. దురదృష్టవశాత్తు యుద్ధతీవ్రతలో మరుగుజ్జువాడికి ఒక చేయి తెగిపోయింది. కొంతకాలంతర్వాత వారిద్దరూ మళ్ళీ ఒక సాహసకృత్యం చేయ బయలుదేరారు. ఈసారి వారి కొక కోట కనపడింది. అక్కడ క్రూరుడైన ఒక నిరంకుశప్రభువు ప్రజలందరనూ బందీచేసి పీడిస్తున్నాడు. మహాకాయుడు నిరంకుశుడైనఆ రాజునుచంపాడు. అప్పుడు అచటిప్రజలు కృతజ్ఞతాపూర్వకంగా ఆ రాక్షసుని తమకు రాజుగా ఎన్నుకున్నారు. ఈసారి మరుగుజ్జుకు ఒక కాలు తెగిపోయింది. మహాకాయుడికిమాత్రం ఒక కోట, విధేయులైన అనేకమంది పరిచారకులు లభించారు.

మరుగుజ్జువాడు తన దురదృష్టాన్నినిందించుకుంటూ, మహాకాయుని అదృష్టానికి అసూయపడి, తనకుకూడ లాభం కలిగేట్టుగా ఏదో ఒకపని చేయాలని భావించాడు.అందుకని ఊతకర్రలతో మళ్ళీ ఒకసారి మహాకాయుడి

వెంట బయలుదేరాడు. విధివశాన అదే సమయానికి ఒక రాజకుమార్తెను కొందరు దుర్మార్గులు బంధించి, గుఱ్ఱంపై తీసుకుపోతూ వాళ్ళకు కనిపించారు. మహాకాయుడామెనుకాపాడితండ్రివద్దకుచేర్చాడు.కృతజ్ఞతాపూర్వకంగాఆరాజు తనకుమార్తెను, రాజ్యంతోబాటు ఆమహాకాయుడికిచ్చివివాహం చేశాడు. 'జాలి'తో చేసిన ఆ సాహసకార్యంలో మరుగుజ్జువాడికిమాత్రం ఒక కన్ను పోయింది. చివరకు జరిగిందేమంటే, మహాకాయుడికిరెండురాజ్యాలు,భార్యగా ఒక రాజకుమార్తె, చాలా పెద్ద ధనసంపత్తి లభించాయి. అతని మిత్రుడైన మరుగుజ్జువాడుమాత్రం ఒకచేయి, ఒకకాలు, ఒకకన్ను పోగొట్టుకొన్నాడు.

బలవంతుడితో బలహీనుడు స్నేహంచేస్తే, లాభాలన్నీ బలవంతుడికి, నష్టాలన్నీ బలహీనుడికి కలిగితీరుతాయనే నీతి ఈ కథనుబట్టి తెలుస్తూనే ఉందికదా! అంతర్జాతీయరంగంలోకూడ ఇదే చూస్తున్నాం. శక్తిమంతమైన దేశాలు, వ్యూహ సరిహద్దులను తమ దేశసరిహద్దులకు దూరంగా ఉంచుకొని, శత్రువులతో యుద్ధమే చేయవలసివస్తే, అది తమ భూమిమీదగాక, ఇతరుల భూమిపై జరగాలనే ఆలోచనతో ఆ విధంగా ప్రవర్తిస్తున్నాయి. రష్యా సైన్యాలు సుదూర దేశాలలో విస్తరించి ఉండటం చూస్తూనేఉన్నాం. అమెరికా సైన్యాలు కొరియాలోను, వియత్నాంలోను పోరాడటం చూచాము. పెద్దదేశాలు తమతమ బలాబలాలను తేల్చుకొనే యుద్ధరంగాలుగా చిన్న దేశాలు మారుతున్నాయి. వాటిలోని ప్రజలను పెద్దదేశాలవారు తమ ఫిరంగిమేతగా ఉపయోగించుకుంటున్నారు.

## శాంతికిగూడ శక్తి అవసరం

ప్రపంచాన్ని మనం సరిగా అర్థంచేసుకొంటే, మనయొక్క స్వతంత్రము వైభవపూర్ణమునైన జాతీయజీవనానికి అజేయమైన జాతీయశక్తి ఒక్కటే నిజమైన ఆధారం కాగలదనే సామాన్య నిర్ణయానికి వచ్చితీరుతాం.

దురాక్రమణశక్తుల గుండెల్లో బెదురుపుట్టించి, ఇతర దేశాలు మనమిత్రత్వాన్ని ఆశించేట్లు చేయగల శక్తి మనకుండాలని మనం గుర్తిస్తాం. శక్తియే జాతీయజీవనానికి అమృతంవంటిది.

అసలు బలహీనంగా ఉండటమంటే బలవంతులైన విదేశీశక్తులను దురాక్రమణ చేయుమని, దోచుకొమ్మని ఆహ్వానించటమే ఔతుంది. ఆవిధంగా ప్రపంచంలో శాంతి భంగంకావడానికి బలహీనులే బాధ్యులవుతున్నారు. రెండవ ప్రపంచయుద్ధాన్ని విన్‌స్టన్ చర్చిల్ ఒక 'అనవసరమైన యుద్ధ' మని వర్ణించాడు. ఎందుకంటే ఇంగ్లండు, ఫ్రాన్సులు తగినంత శక్తినీ, సాహసాన్నీ ప్రదర్శించి ఉన్నట్లయితే జర్మనీని తేలికగా యుద్ధపు తొలిదశ లోనే అదుపులో పెట్టగలిగేవారనీ, ఆవిధంగా యుద్ధాన్నికూడా నివారించగలిగే వారనీ అత డభిప్రాయపడ్డాడు. కాని వారుమాత్రం అజాగరూకులై బల హీనంగా ఉండిపోయారు; ఆవిధంగా జర్మనీయొక్క యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టారు. శక్తిమంతంగా ఉండటమొక్కటే శాంతికి సరైనమార్గం.

ఈనాడుకూడ అమెరికా రష్యాలు రెండూ సమానశక్తి కలవయి నందుననే ప్రపంచయుద్ధానికి ఎవ్వరూ కాలుదువ్వటంలేదని మనకు తెలుసు. ప్రపంచాన్ని నాశనంచేయగల అస్త్రాలు ఇద్దరివద్దఉన్నాయనీ, అణుయుద్ధం వస్తే ఏఒక్కరూ దానినుండి బయటపడలేరనీ ఇద్దరికీతెలుసు. క్యూబా ఉదంతం మనకొక చక్కనిపాఠాన్ని నేర్పుతున్నది. క్యూబాను రహస్యంగా తన అస్త్రప్రయోగస్థావరం చేసుకోవాలనీ, తద్వారా అమెరికాయొక్క భద్రతను భంగపరచాలనీ రష్యా యత్నించింది. అయితే సరైనసమయంలో సాహసించి అమెరికా తగుచర్యలు తీసుకొన్నది. కాబట్టి రష్యాయొక్క దుస్సాహసాను కుంటుపడి, ప్రపంచాన్ని మరొక మహాయుద్ధప్రమాదంనుండి కాపాడింది.

అంటే బలహీనదేశాలు క్షేమంగా ఉన్నాయనికాని, యుద్ధభీతి తొలగిపోయిందనికాని అర్థంకాదు. అణ్వాయుధ బలాబలాల అంతిమ

ప్రదర్శన ప్రస్తుతానికి ఆగిపోయి భవిష్యత్తులో మరోతేదీకి వాయిదా పడింది; అంతే. మిగిలిన విషయాలన్నీ యథాతథంగా కొనసాగుతూనే ఉన్నాయి. మనతో యుద్ధంచేయటానికి సాహసిస్తే మానవజాతిఅంతా అణు యుద్ధంలో మునిగిపోయే ప్రమాదం ఉందికాబట్టి ఏ విదేశీశక్తి మనతో యుద్ధానికి సాహసించదు; కాబట్టి అట్టి ఆందోళన మనకక్కరలేదని మన దేశంలోని కొందరు 'వేత్తలు' హామీ ఇస్తుంటారు. కాని ఇతరులుకూడ మనలాగే యుద్ధాన్ని గురించి భయపడుతున్నారని అనుకోవడం మన అమాయకత ఔతుంది. యుద్ధప్రకటనసైనా చేయకుండానే శత్రువులు దురాక్రమణచేసి ఇతరుల భూభాగాలను ఆక్రమిస్తూ ఉంటారు. కాశ్మీరు, కచ్ ప్రాంతాల్లోని భూభాగాలను పాకిస్తానుకు, లడఖ్, నేఫాల్లోని భూభాగాలను చైనాకు, ఏవిధమైన యుద్ధప్రకటన లేకుండానే మనదేశం కోల్పోయిన ఉదాహరణ కండ్లకుగట్టినట్లు కనిపిస్తూనే ఉందికదా ! ఇటువంటి కథే ఇండో చైనాలోనూ, ఇతర దేశాల్లోనూ ఈనాడు జరుగుతూఉంది.

# 22. జాతీయ జీవామృతం

## 2. పరమాధికారం

ఈ రోజుల్లో 'అలీన విధానం' 'ప్రగతిశీల తటస్థవిధానం' మొదలైనవి మన నేదో రక్షిస్తాయన్నట్లుగా, అనేకం వింటున్నాం. కాని అవి బలహీనులను కాపాడగలవా? రక్షణకోసం ఏదో ఒక శక్తికూటమిలో మనం చేరక తప్పుతుందా? బలహీనుల ప్రగతిశీల తటస్థవిధానమనేది కాలితోతన్నే బంతివలె ఉంటుంది. కాలిబంతినిష్పక్షపాతంగాను, తటస్థంగానూ ఉంటుంది. ఒక ప్రక్కనుంచి వేరొక ప్రక్కకు తన్నినప్పుడు 'ప్రగతిశీలంగా' గూడ ఉంటుంది. ఇక, పెద్ద సంఘర్షణే ప్రారంభమయితే, పెద్ద పెద్ద రాజ్యాలు బలహీనదేశాల తటస్థతకు చిల్లిగవ్వ విలువకూడా ఇవ్వవు.

### నిజమయిన తటస్థ విధానం

మొదటి ప్రపంచయుద్ధసమయంలో జర్మనీ తనకు, ఫ్రాన్సుకు మధ్యఉన్న పర్వతపరిహద్దులను దాటవలసిన ఇబ్బంది లేకుండా చేసుకునే నిమిత్తమై, అప్పట్లో తటస్థంగాఉండిన నెదర్‌లాండ్స్‌లోని మైదానంగుండా

తన సైన్యాలను ఫ్రాన్సులోనికి పంప నిశ్చయించింది. నెదర్లాండు దేశాలైన బెల్జియం, హాలెండులు తాము తటస్థులమని ఎన్ని అభ్యంతరాలు చెప్పినప్పటికీ, జర్మనీ వాటిని పట్టించుకోక, ఆ దేశాలగుండా తన సైన్యాలను నడపి, తన సైనికపాదాలక్రింద వాటి తటస్థతను అణగద్రొక్కింది. ఆ దేశాలుగూడా, సైనికంగా పూర్తిసన్నద్ధంగా ఉండిఉంటే వాటిని నొప్పించటానికి జర్మనీ సాహసం చేసిఉండేదికాదు.

స్విట్జర్లాండు ఉదాహరణ దీనికి పూర్తిగా భిన్నమైనది. గత ప్రపంచయుద్ధసమయంలో స్విట్జర్లాండు పూర్తిగా తటస్థవిధానాన్ని అవలంబించింది. ఇతర దేశాలతోపోలిస్తే స్విట్జర్లాండు బీదదేశము. కాని అక్కడి ప్రజాహృదయంమాత్రం ప్రగాఢమైన దేశభక్తిభావన, జాతీయ స్వాభిమానం, మొక్కవోని స్వాతంత్ర్యభావనలతో నిండినది. యుద్ధ సమయంలో విదేశీ సైన్యాలుగాని, ఆయుధాలుగాని రవాణాచేయటానికి తటస్థదేశాలను రహదారులుగా ఉపయోగించరాదనేది అంతర్జాతీయ నియమం. యుద్ధసమయంలో ఒకసారి జర్మనీపై బాంబులు వేయటానికి వెళ్ళుతున్న ఇంగ్లండు విమానాలు స్విట్జర్లాండు భూభాగంపై ఎగురుతూ కనబడ్డాయి. వెంటనే తన వాయుమండలాన్ని విడిచిపోవలసిందని స్విట్జర్లాండు ఆ విమానాలకు హెచ్చరికచేసింది. అయితే తమ శక్తినిగురించి, ఎంతో అధికంగా ఊహించుకొన్న ఆంగ్లేయులు, ఆ హెచ్చరికలను లక్ష్యపెట్టలేదు. వెంటనే మీనమేషాలు లెక్కించకుండా, స్విట్జర్లాండు ఆ విమానాలను కూల్చివేసింది. ఆ తరువాత ఇంగ్లాండు స్విట్జర్లాండుకు ఒక పెద్ద నిరసనపత్రాన్ని పంపింది. తమ దొక స్వతంత్రదేశమనీ, తాము తటస్థతను కాపాడుకోవాలని నిశ్చయించుకొన్నామనీ, తమ సార్వభౌమత్వంపై మళ్ళా ఇటువంటి సాహసం చేస్తే వాటిఫలితం మరోసారికూడా ఇదే అనీ స్విట్జర్లాండు అందుకు సమాధానం చెప్పింది.

## అసత్యం కోసం సత్యాన్ని విడిచిపెడితే

కాని, బలంలేకపోయినప్పటికీ ఈ ప్రపంచంలో మనం సర్వసౌఖ్యాలతోను, గౌరవప్రతిష్ఠలతోను జీవించగలమనీ, పంచశీలవంటి ఉదాత్త ఉన్నత భావాలను మానవాళికి ప్రబోధించడం, ఐక్యరాజ్యసమితికి నివేదించడం వంటిపనులు మానవసంఘర్షణల కన్నిటికీ పరిష్కారమార్గాలు కాగలవు అనే ఒక వింతభావన ఈనాడు మన దేశంలో క్రమంగా బలపడింది. అట్టి వికృత భావనలన్నిటినీ, సార్వకాలిక సత్యాలుగా ప్రదర్శించడం జరుగుతున్నది.

మన దేశంలోని ప్రముఖవ్యక్తులు 'అంతర్జాతీయత' 'విశ్వమానవ సౌభ్రాత్రము' వంటి సద్భావనలను మనసైన్యాలకుగూడ ప్రబోధిస్తున్నారు. ఒకసారి ఒక సైన్యాధికారీ, మరొక పెద్దమనిషీ మాతోపాటు రైల్లో ప్రయాణం చేస్తున్నారు. వారు ఉర్దుభాషలో మాట్లాడుకుంటున్నారు. ఓహో! మీరు చక్కని ఉర్దూభాష మాట్లాడుతున్నారని సైనికాధికారి తోటివ్యక్తితో అన్నాడు. అందుకు ఆ పెద్దమనిషి 'అవును, పాఠశాలలో చదువుకొనేరోజుల్లో నేను ఉర్దూ నేర్చుకొన్నాను. కాని పెద్దవాణ్ణయిన తర్వాత, ఇప్పుడు నాకు ఉర్దూపై ప్రేమ అడుగంటింది' అన్నాడు. కారణమేమిటని ఆ సైనికాధికారి అడిగాడు. 'ఉర్దూగాని, పర్షియన్ సాహిత్యంగాని చదువుతున్నంత సేపు బుల్‌బుల్, పర్షియా, యూఫ్రటిస్, టైగ్రిస్ వంటివే కండ్లముందు బొమ్మల్లా కనిపిస్తూ ఉంటాయి; దేశాన్ని గురించి మాత్రం ఏమీ జ్ఞప్తికిరాదు' అని సమాధానం చెప్పాడతడు. వెంటనే ఆ సైనికాధికారి ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ, 'ఎంత సంకుచితభావన మీది! నిజంగా మీరు మధ్యయుగ మానవుల్లా ఉన్నారు. దేశం, జాతి మొదలైన సంకుచిత అవధులకు అంటిపెట్టుకొని ఆలోచించరాదు. ఆరోజులుపోయాయి. ఈనాడు మనం ఏమి ఆలోచించినా అది వసుధైకభావనతో కూడిఉండాలి' అన్నాడు. అటువంటి సైనికాధికారి యుద్ధానికి వెళ్ళాడనుకుందాం. తన దేశాన్ని సంరక్షించుకోవాలనే దృఢవిశ్వాసంతో అతడు యుద్ధం చేయ

గలుగుతాడా? ఏక్షణంలోనైనా, అతనిలోని 'వసుధైకభావన' అతని కెదురు తిరగవచ్చు. "ఈనాటక మేమిటి ? నేనెందుకు పోరాడాలి ? వారుగెలిస్తే మాత్రం నష్టమేమిటి? వారుకూడా మనవంటి మానవులేకదా!' అని అత డను కోవచ్చును. అప్పుడింక మన గతేమిటి ? ఇట్టి 'వసుధైకభావన' సర్వ నాశనం కాకుండా మనల్ని కాపాడుతుందా ?

ఈ ప్రపంచం ఎప్పుడూ సమస్యలతోనే సతమతమవుతూ ఉంటుందని మనకు తెలిసినదేకదా ! ఈ ప్రపంచాన్నిచూచి ఒక జ్యోతిష్కుడు కలత చెందాడు. ప్రపంచ భవిష్యత్తు ఎలాఉంటుందో తెలుసుకోవాలనే కుతూహలంతో ఈ భూమిపై తమప్రభావాన్ని చూపుతున్న వివిధగ్రహాలు ఏఏస్థానాల్లో ఉన్నాయో గుర్తించటానికి ప్రారంభించాడు అతను. ఒక గ్రహంతర్వాత మరొక గ్రహస్థితిని గుర్తిస్తూ, దానివల్ల కలుగబోయే మంచిచెడులను గురించి ఊహలల్లుకుంటూ, తనగ్రామం వెలుపలికి నడచివచ్చి, అతను అక్కడున్న నూతిలో పడ్డాడు. అతని అదృష్టంకొద్ది ఆ నుయ్యి చాలాకాలంగా పాడుపడి, ఎండిపోయి ఉంది. తనను కాపాడుమని అందులో నుంచి కేకలుపెట్టాడు. ఎవరో బాటసారు లాదారివెంట పోతూ, ఆ కేకలు విని అతణ్ణి నూతిలోనుంచి వెలికితీసి, "పండిత్ జీ! త్రోవకెంతో దూరంగా ఉన్న ఈ బావిలో మీా రెట్లాపడ్డారు?" అని ఆశ్చర్యంగా అతన్నడిగారు. ప్రపంచ పరిస్థితిని చూచినపుడు తనకు కలిగిన వ్యథ, గ్రహాల ఉనికి నిర్ణయించడానికి తానుచేసినయత్నం, వాళ్ళకు వివరించిచెప్పి, తాను నూతిలో పడినందు కతను దుఃఖించాడు. ప్రపంచ జాతకాన్ని చూచేముందు, మీా జాతకాన్ని గుణించుకొని ఉన్నట్లయితే ఈ నూతిలో పడకుండా ఉండే వారేమో అని వారు వ్యాఖ్యానించారు.

బలహీనతను, అజ్ఞానాన్ని అంతర్జాతీయత అనే ఒక గొప్ప నినాదం పేరున ఈనాడు చలామణీ చేసుకొంటున్న పెద్దమనుషులకు, ఆ జ్యోతిష్కునికి కలిగిన నష్టాలను విని గుణపాఠం నేర్చుకొమ్మని, తమ స్వాధీనంలో లేని

అంతర్జాతీయ వ్యవహారాలను గురించి ఆలోచించబోయేముందుగా తమ సంసారాన్ని చక్కదిద్దుకొమ్మని సలహాఇవ్వాలి. ప్రపంచ వ్యవహారమంతా శక్తియొక్క రాజకీయాలతో ముడిపడి, సామర్థ్యమొక్కటే సర్వోన్నతంగా ఉన్న ఈ రోజుల్లో 'ప్రపంచసమైక్యత' వంటి మాటలను చెప్పేవారికి అసలు తామేమి మాట్లాడుతున్నారో తెలిసినట్లులేదు. స్వార్థప్రయోజన స్వోత్కర్షలే ప్రధానంగాగల, రాజ్యాల మనుగడయే ఈనాటి ప్రపంచ రాజకీయాల్లోని ఒకేఒక యథార్థం. దీనిని గమనించనివారు అసత్యమైన దానికోసం సత్యాన్ని విడిచిపెట్టినట్లే అవుతుంది.

ఒకసారి నేనొక పెద్దల సమావేశంలో మాట్లాడుతూ, దేశపరిస్థితి నంతనూ సింహావలోకనంచేసి, ఆంతరికమైన కుళ్ళును కడిగివేసి, శక్తిమంతులంకాకపోతే మనమొకజాతిగా మనలేమంటూ నా భావాన్ని వ్యక్తం చేశాను. 'మనమొకజాతిగా బ్రతుకకపోతేనేమి ? మనం బ్రతికే ఉంటాం. విభేదాల్లేని ఒక మానవజాతిగా జీవిస్తాం.' అని వెనువెంటనే ఒక అతి తెలివైన వ్యాఖ్య వచ్చింది. "అదిమాత్రం ఎందుకు ? మనం చనిపోయిన తర్వాతకూడా మనం జీవించేఉంటాము. పదార్థం నాశనంకాదని విజ్ఞానశాస్త్రం నిరూపించిందిగదా ! కాబట్టి మన బూడిదగాని, గోరీల్లో మన కళేబరాలుగాని ఉండనే ఉంటాయి" అని నేను సమాధానం చెప్పాను.

## ఆత్మవ్యామోహపు పరిణామాలు

'అంతర్జాతీయ', 'ప్రపంచసమైక్యత'లవంటి నేటి మోజులు మన సమాజాన్ని ఇంతటి హాస్యాస్పదము, ప్రమాదకరమునైనస్థితికి తెచ్చాయి. అట్టివినాదాల మత్తులో పూర్తిగా పడిపోయాం. 'ప్రపంచశాంతి' 'అంతర్జాతీయత' మొదలైన ముసుగులను దాల్చిన విదేశీశక్తుల దురాక్రమణపథకాలను గుర్తించలేనంత అశక్తత మనలో ప్రవేశించింది. ఈ శక్తులు మనదేశంలో అంతర్జాతీయ శాంతిసమ్మేళనాలు ఏర్పాటు చేస్తూ

ఉంటాయి; తమదేశంలోమాత్రం ప్రపంచవినాశకరములైన అణ్వాయుధాలను తయారుచేస్తూనే ఉంటాయి. మనలను తమకూటంలోకి చేర్చుకొని, తాము ముమ్ముందు చేయబోయే యుద్ధంలో మనలను ఫిరంగిమేత చేసుకోవాలనేదే వారి ఈ ప్రయత్నాలన్నిటిలోని ఒకే ఒక ఆంతర్యం. వారుకూడ 'శాంతి'నే కోరుతున్నారు. అది ఎటువంటి శాంతి? తాము యజమానులుగాను, ఇతరులు బానిసలుగాను ఉండగా, తాము సుఖశాంతులలో నిద్రించాలని, బానిసలు మాత్రం తమలోతాము పోరాడుకొని తమయజమానికి నిద్రాభంగం చేయరాదని వారు కోరుతున్నారు. ఇంకా అటువంటి వెఱ్ఱి వ్యామోహాలకు లొంగిపోయి మనలను మనం 'మోసం' చేసుకొంటూ, మనయొక్క 'ప్రగతిశీల' 'అంతర్జాతీయ' దృక్పథాలను గురించి గొప్పలు చెప్పుకొంటున్నాం. సామ్యవాదులు నిర్వహించే అంతర్జాతీయ శాంతిసమ్మేళనాలనబడే ఈ కుతంత్రాలన్నీ సామ్యవాదవిస్తరణపథకంలో 'సూచీ ప్రవేశే ముసల ప్రవేశః' వంటివని పూర్తిగా తెలిసికూడా మనవారు వాటిలో పాల్గొంటున్నారు.

ఈనాడు మన నాయకులు ప్రకటించే 'శాంతియుతసహజీవనం' 'పంచశీల' వంటి నినాదాలు, కాగితపుఒప్పందాలు స్వార్థపరులకు, దురాక్రమణకారులైన దేశాలకు మనదేశంపట్ల ఉన్న దుష్టవాంఛలు తీర్చుకొనేందుకు పైపై ముసుగులుగా ఉపకరిస్తున్నాయి. పంచశీలపట్ల తన విశ్వాసాన్ని ప్రకటించటంలో చైనా తన వాచాలత్వాన్ని చూపిందని మనకు తెలుసు. బౌద్ధమతాన్ని స్వీకరించిననాటినుండి, అంటే సుమారు రెండువేల సంవత్సరాలనుండి చైనా మనకు మిత్రదేశమనీ, శ్రేష్ఠమైన పొరుగు దేశమనీ ప్రశంసించటం జరిగింది. చైనాతో స్నేహాన్ని ఎట్లాగో అట్లాగా నిలబెట్టుకొనేందుకు దృఢనిశ్చయం చేసుకొన్నామని మన నాయకులు ప్రకటించారు. ఎట్లాగైనాసరే ముస్లిముల స్నేహాన్ని పొందాలని ఒకప్పుడు మనదేశంలో ఇదేవిధంగా తీర్మానం చేసుకొన్నాం. అది మన జాతీయ సమైక్యత, గౌరవ ప్రతిష్ఠలకు ఎంతటినష్టం కలిగించిందో మనకు బాగా తెలిసినదే. ఇక్కడ కూడా చరిత్ర పునరావృతమైంది.

## దుశ్శకునాలను ఉపేక్షించాం

బౌద్ధమతానుయాయి అయిన ప్రాచీనచైనా కొద్ది సంవత్సరాలక్రింద పూర్తిగా మారిపోయిందని మనం మరచిపోయాం. రష్యాయొక్క మంత్ర దండం, చైనా శవంలో ఒక భూతాన్ని ప్రవేశపెట్టి, దానినొక రాక్షసిగా తయారుచేసింది. ఈనాడు మన సరిహద్దుల్లో దానియొక్క పైశాచిక నృత్యం చూస్తూనే ఉన్నాం. అది 'టిబెట్'ను కబళించినప్పుడు, పండిట్ నెహ్రూ సున్నితంగా తన నిరసనను తెలియజేస్తే, తమ ఆంతరంగిక వ్యవహారంలో జోక్యం చేసుకోవద్దని చైనా మోమోటమిలేకుండా నెహ్రూను మందలించింది. కీర్తిశేషులైన మన ప్రధానమంత్రి కిక్కురుమనకుండా ఆ జాతీయ అవమానాన్ని దిగమ్రింగారు. అప్పటినుంచి చైనాతో స్నేహాన్ని, 'పంచశీల'యొక్క ప్రతిష్ఠను నిలబెట్టుకొనేందుకై రోజురోజుకీ పెరిగి పోతూన్న వెల చెల్లిస్తూనే ఉన్నాం. రెండు గొప్ప దేశాలమధ్య 'శాశ్వతమైన స్నేహ సౌభ్రాత్రా'లను నిలుపుకొనేందుకు చేసుకొన్న చారిత్రాత్మక సంధిఐన ఈ పంచశీలపై ఈ మహామహులైన ఇద్దరు ప్రధానమంత్రులు సంతకాలు చేస్తున్న సమయంలోనే. చైనా సైనిక శకటాలు లద్ధాఖ్‌లో తాము నిర్మించుకొన్న సైనిక రహదారులగుండా చొచ్చుకువచ్చాయి; మన హిమాలయప్రాంతాల్లోని పెద్దపెద్ద భూభాగాలను చైనా ఆక్రమించుకొన్నది.

ప్రఖ్యాత ఆర్థికశాస్త్రవేత్త, గాంధీజీ ప్రథమశిష్యుడునైన డాక్టర్ జె. సి. కుమారప్ప రష్యా, చైనా దేశాలను సందర్శించి వచ్చిన తర్వాత, వాళ్ళదృష్టిలో పంచశీలకు, దాన్ని వ్రాసిన కాగితానికున్నంత విలువగూడా లేదని, ఆనాడే ప్రకటించాడు. ఐనా నలుప్రక్కల క్రమ్ముకువచ్చే సామ్యవాద దురాక్రమణ ప్రమాదాన్ని గమనించకుండా గ్రుడ్డిగా మన నాయకులు తమ ఊహాలోకాల్లో విహరించారు. హిమాలయ ప్రాంతా లయిన లద్ధాఖ్, నేపాల్, సిక్కిం, భూటాన్, నేఫాలను (టిబెట్

నుండి ముందుకు పొడుచుకువచ్చిన ఉద్ధతచైనాపిడికిలియొక్క ఐదు వ్రేళ్ళులా) బర్మాను, చైనా అంతర్భాగాలుగా చిత్రించిన దేశపటాలను మన దేశంలోని సామ్యవాదులు ఇక్కడ పంచిపెట్టారు. ఇట్టి దేశపటాలను మన ప్రభుత్వం కనీసం స్వాధీనమైనా చేసుకోలేదు.

కృశ్చేవ్ మనదేశాన్ని సందర్శిస్తూ, కాశ్మీరువెళ్ళి "మీరు కష్టంలో ఉన్నప్పుడు, ఈపర్వతశిఖరాలకెక్కి సహాయంకోసం కేకపెట్టండి. మీకు సహాయం చేసేందుకై మేము అటుప్రక్కన ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటా"మని ప్రకటించాడు. వారియొక్క అనుయాయులు ఈ దేశంలో ఉన్నారనీ, వా రేసమయంలోనైనాసరే అట్టి సహాయంకొరకు గోలపెట్టవచ్చనీ మాత్రం మనం మరచిపోరాదు.

కృశ్చేవ్, బుల్గానిన్‌లకు గతంలో ఎన్నడూ ఎరుగనంతగా దేశం మొత్తంలో ప్రశంసలు, స్వాగతాలు పలుకుతూ, ప్రపంచశాంతికి అగ్రేసరులుగా వారిని పొగడుతూ ఉన్నరోజుల్లోనే రష్యాదేశ చలనచిత్రమొకటి మన దేశంలో ప్రదర్శించారు, ఆ చలనచిత్రం మాస్కోనగర దృశ్యంతో ప్రారంభం అవుతుంది, ఆ చిత్రవ్యాఖ్యాత "భవిష్యత్ప్రపంచ రాజధానియైన మాస్కో" అంటూ వ్యాఖ్యానిస్తాడు. మాస్కో భవిష్యత్ప్రపంచరాజధాని కావలెనంటే, ప్రపంచమంతా రష్యాస్వాధీనంలోనికి ముందుగా వచ్చి తీరాలిగదా !

## రజకుని గాడిద

ఇట్టి వట్టిధర్మపన్నాలను ప్రవచించటంద్వారా మనయొక్క అంతర్జాతీయ ప్రతిష్ఠ పెరిగిపోతుందనే భ్రమనుండి మనం ఇంకా బయటపడలేక పోతున్నాం. కాని సత్యమేమిటి ? పాకిస్తాన్ ఉదాహరణ తీసుకుందాం. మనతో పేగుసంబంధంగల పాకిస్తాన్ దురహంకారంతో మనలను అవమానించడానికి, మన జవానులను, అధికారులను కాల్చివేయడానికి, దొంగిలించ

డానికి, మన విమానాలను కూల్చివేయడానికి, అక్కడి హిందువులను మూకఉమ్మడిగా హత్యచేయడానికి వచ్చే ఏ అవకాశాన్నీ పోగొట్టుకోవడం లేదు. ఇప్పుడది మనదేశంపై దండయాత్ర చేసిందికూడ. సింహళంవంటి చిన్నదేశం, తరతరాలుగా అచ్చట నివసిస్తూన్న లక్షలాది మనసోదరులను వెలికి నెట్టివేస్తోంది. బర్మాగూడా అదేపద్ధతి మొదలుపెట్టింది. కాశ్మీరు సమస్యను ఐక్యరాజ్యసమితికి నివేదించాం. మన 'ఘనమైన అంతర్జాతీయ ప్రతిష్ఠ' మనకున్నా ఆ ప్రపంచసంస్థ మనలను దురాక్రమణదారుతోపాటు ఒకేగాటను కట్టినది. చైనా బంధించిన పదకొండుమంది అమెరికా దేశపు విమానచోదకులను విడిపించటంలో మన పలుకుబడి పనిచేసిందనీ, కొరియాలోనూ ఇతరత్రాకూడా మనం ఎంతో ప్రముఖపాత్రను నిర్వహించామనీ చెప్పుకుంటున్నాం. అటువంటప్పుడు మన జాతీయ గౌరవ సమైక్యతలు దెబ్బతింటున్నసమయంలో, మన ఈ 'ఘనమైన అంతర్జాతీయ ప్రతిష్ఠ ఎందుకు అక్కరకు రాలేదు ? దినమంతా తన యజమానికోసం కష్టపడి సేవచేసిన తర్వాత, పొట్టనింపుకోవటానికి, బయటకు తరిమివేసిన రజకుని గాడిదవంటిదా మన ప్రతిష్ఠ ?

మనయొక్క శాంతిప్రియత, తటస్థవిధానాలమూలంగా, పెద్ద దేశాలన్నీ మనతో మైత్రిని నెరపుతూ గౌరవిస్తున్నాయని మన నాయకులు తరచు ప్రకటిస్తూ ఉంటారు. అమెరికా రష్యాలనుండి మనం పొందుతున్న ఆర్థికసహాయాన్ని వారు చూపిస్తారు. అయితే ఆ అమెరికాదేశమే మన శత్రువైన పాకీస్తాన్‌కు అత్యంత ఆధునిక ఆయుధాలను సరఫరా చేస్తున్నది. ఒకప్రక్క బలిపశువును మేపినట్లు మనల్ని ఆర్థికసహాయంతో బలపరుస్తూ మరొకప్రక్క మనపై దురాక్రమణ జరిపేవారికి ఆయుధాలు అందజేయటం మనపట్ల వారికున్న స్నేహానికి చిహ్నమా ? విడివడని భ్రాతృత్వబంధనాలను చైనాతోను, స్నేహాన్ని భారతదేశంతోను కలిగిఉన్నట్లు ప్రకటిస్తూ, చైనా యొక్క దురాక్రమణపథకాలకు ప్రోత్సాహకశక్తిగా ఉంటున్న రష్యాను

గురించి ఎక్కువగా చెప్పనక్కరలేదు. ప్రపంచరాజ్యాలయొక్క ముఖప్రీతి మాటలను, రాజకీయపుఎత్తులను, అమాయకంగా నమ్ముతూ ప్రపంచ రాజకీయాల్లో మనకు చాలా గొప్పస్థానం ఉంది, అని మనలను మనం పొగుడుకుంటూ ఉన్నాము. ఉదాహరణకు, కొన్నిఏండ్ల క్రితం శ్రీమతి విజయ లక్ష్మీపండిట్‌ను ఐక్యరాజ్యసమితియొక్క సర్వసభ్యసమితికి అధ్యక్షురాలుగా ఎన్నుకొన్నారు. ఐతే అంతటి 'గొప్ప గౌరవాన్ని' మనదేశానికి కలిగించడానికి వెనుకఉన్న కుత్సితమేమిటి? సరిగా, అప్పుడే, కాశ్మీరును ఒక స్వతంత్రరాజ్యంగా మార్చేందుకు షేక్ అబ్దుల్లా పన్నిన విద్రోహ పూర్ణమైన కుట్ర బట్టబయలైంది. అతణ్ణి పదవినుంచి తొలగించి బందీచేశారు. ఆ కుట్రతో ఐక్యరాజ్యసమితి తాబేదారులకు గల కుత్సితసంబంధాలుకూడ వెలుగులోకి వచ్చాయి. ఐక్యరాజ్యసమితికి చెందిన ఆ కుట్రదారులను తమ పనిముట్లుగా ఉపయోగించుకొన్న ఇంగ్లండు, అమెరికా దేశాలవారు తమ పరువు ప్రతిష్ఠలను కాపాడుకొనేందుకు, కాశ్మీరులో తమస్థానం నిలుపు కొనేందుకు, ఏదోవిధంగా మనదేశాన్ని మంచిచేసుకొని తమ ఎత్తులను నిరాఘాటంగా కొనసాగించేందుకు, అవసరమైన మార్గాలనన్నిటినీ వెతుక సాగారు. కీ॥ శే॥ మన ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారి చెల్లెలికి ఐక్యరాజ్యసమితి అధ్యక్షపదవివంటి గొప్ప గౌరవస్థానం ఇవ్వడంకన్న తగిన సాధనం వేరేముంటుంది? ఇది చాల చతురతతో కూడిన పొగడ్త మాత్రమే; అంతకన్న మరేమీకాదు. కాని మనం మాత్రం అమాయకంగా ఈ చర్యను మనకు నిజంగా జరిగిన గౌరవంగా భావించాం.

## ఈనాటి కొంక గుణపాఠం

మన జాతీయప్రతిష్ఠకు, ప్రగతికి పునాదిరాళ్ళుగా మనం స్వీకరించిన గొప్ప గొప్ప సిద్ధాంతాలకు ఈ కఠోర వాస్తవిక ప్రపంచంలో విలువలేదని మనకు దీన్నిబట్టి తెలుస్తున్నది. చేతులు పదే పదే కాలిన తర్వాతగూడా ఊహాలోకాల్లో విహరించే వ్యామోహంనుండి వెలువడలేకపోవటం మన

దురదృష్టం. ఈ పరిస్థితి ఈనాడేకాక గత అనేక శతాబ్దాలనుండి కూడ మన ప్రజలకు ఒక శాపంలా దాపురించింది. చెంగెజ్‌ఖాన్ ఈదేశంపై దండయాత్ర చేయటానికి సన్నాహమవుతున్న సమయంలో, ఇచట అనేకమంది బౌద్ధ మతాన్ని స్వీకరించినవా రున్నారని అతనికి తెలిసింది. అందుచేత తానొక బౌద్ధుడుగా మారుతున్నట్లు నటించి, అటుపైన దండయాత్ర చేశాడు. ఇక్కడ ఉన్న అనేకమంది బౌద్ధులు, అతడు తమ మతంవాడని భావించి, అతణ్ణి స్వాగతించటానికి ఎదురేగారు. దీని ఫలితమేమిటి? బౌద్ధమతంయొక్క అహింస అనే ముసుగుతోనే చెంగెజ్‌ఖాన్, మనుష్యుల పుర్రెప్రోగుల రాసులు పేర్చాడు.

## ప్రపంచం శక్తి నారాధిస్తుంది

నిజమైన శాంతి, గౌరవ ప్రతిష్ఠలను పొందడానికి అజేయమైన జాతీయశక్తిని నిర్మించటమే ఏకైకమార్గమని ఇప్పటికైనా మనం గుర్తించాలి. అప్పుడు మాత్రమే మనం ప్రపంచానికి ప్రబోధించే గొప్ప సిద్ధాంతాలకు విలువా, ప్రతిష్ఠా ఏర్పడుతాయి. బలహీనునియొక్క తత్త్వబోధన ఎంతటి ఉదాత్తమైనదైనా ప్రపంచం వినదు. ప్రముఖ వార్తాపత్రికల్లో వెలువడిన పాతఉదంతం ఒకటుంది. మన ప్రముఖ జాతీయకవియైన రవీంద్రనాథ్ టాగూర్ ఒకసారి జపాను వెళ్ళారు. హిందూ తత్త్వశాస్త్రంయొక్క శ్రేష్ఠత్వం గురించి, వారు విశ్వవిద్యాలయ విద్యార్థుల సభలో ప్రసంగించవలసి ఉంది . కాని కొద్దిమంది ఆచార్యులను మినహాయించి, ఆ సభాభవనమంతా శూన్యంగా ఉంది. శ్రోతలు అంత తక్కువ సంఖ్యలో ఉండటం గౌరవ పాత్రుడైన అతిథికి అవమానకరమౌతుందని భావించి ఆ సభలోని ఒక ఆచార్యుడు దూరాన నిలిచిఉన్న విద్యార్థులను ఆ ఉపన్యాసం వినేందుకు రంతని ఆహ్వానించాడు. 'ఒక బానిసజాతియొక్క తత్త్వశాస్త్రాన్నిగురించి మేము వినదలచలేదని' ఆ విద్యార్థులు నిష్కర్షగా చెప్పి ఆ సభకు రావటానికి నిరాకరించారు.

ప్రపంచం శక్తిమంతులనే ఆరాధిస్తుంది. రెండవ ప్రపంచయుద్ధానికి ముందురోజుల్లో ఇంగ్లండు శక్తిమంతమై ఉన్నప్పుడు, మన ప్రజలు ఆంగ్లేయులను ప్రశంసించేవారు; అనుకరించేవారు. కాని యుద్ధం జరుగుతూ ఉండగా, ఒకదశలో జర్మనీ గెలుస్తుందేమోననిపించిన వెంటనే హిట్లరును, నాజీ సిద్ధాంతాన్నిగూడ వారే గౌరవించ నారంభించినారు. హిట్లరును, నాజీ సిద్ధాంతాన్ని ఈనాడు గొంతు చించుకొని తీవ్రంగా నిందించే వ్యక్తులు ఆరోజుల్లో వాళ్ళను ఎంతో ప్రశంసిస్తూ, రహస్యంగా జర్మనీ రేడియో వార్తలను వింటూ ఉండేవాళ్ళని మనకు తెలుసు. జర్మనీ దండయాత్రను ప్రారంభించి రెండువారాలైనా కాకముందే, ఫ్రాన్సు లొంగిపోయిందని విన్నప్పుడు ఎంతగానో ఉప్పొంగిపోయిన వ్యక్తులే, జర్మనీయొక్క సైనికశక్తిని తుత్తునియలుచేసి ప్రపంచంలో ప్రముఖ శక్తులుగా నిలచిన అమెరికానో, రష్యానో ఈనాడు ఆరాధిస్తున్నారు. సామ్యవాదాన్ని స్వీకరించిన రష్యా, చైనాల పాశవిక శక్తి ప్రదర్శనవల్లనే ఈనాడు సామ్యవాదం అనేకమందిని ఆకర్షించగలుగుతూ ఉంది. ప్రపంచపు తీరు అట్టిది. బల హీనుని మాటకు ఎవ్వడూ గడ్డిపరక కిచ్చిన విలువయినా ఇవ్వడు.

*ఉత్పద్యన్తే విలీయన్తే దరిద్రాణాం మనోరథాః ॥*

(దరిద్రుల కోర్కెలు పుడుతూ ఉంటాయి, గిడుతూ ఉంటాయి)

అని మన పూర్వీకులు ఏనాడో చెప్పారు.

## బలమే పుణ్యం, బలహీనతే పాపం

ఏ పరిస్థితిలోనైనసప్పటికీ, బలహీనుడే బాధలు పొందుతాడు. స్వత ఃసిద్ధంగా బలహీనమైన జాతిని, ఏ ఒప్పందాలు, మైత్రీసంబంధాలు కాపాడ లేవు. బలహీనత ఆత్మనాశనకారియేగాక ఇతరుల్లోని హింసాప్రవృత్తిని గూడ రెచ్చగొడుతుంది. కాబట్టి, అది ప్రపంచంలో ఒక దారుణమైన మహా

పాపం. భౌతికమైన మనుగడ మహోన్నతమైన 'ధర్మం'లోని ఒక అంశమని, అట్టి భౌతికమైన అస్తిత్వానికి శక్తి ఒక్కటే ఆధారమని మన పూర్వీకులు చెప్పారు. ఒకప్పుడు తీవ్రమైన కరువుఏర్పడి, విశ్వామిత్ర మహర్షికి అనేక దినాలతరబడి తినటానికి ఆహారమేమీ దొరకలేదు. ఒకనాడు ఒక చండాలుని ఇంటిలో చచ్చిన కుక్కయొక్క కుళ్ళిపోతున్న కాలు ఒకటి అతని కంట్లబడింది. వెంటనే విశ్వామిత్రుడు దాన్ని చేతబట్టి ముందుగా దాన్ని భగవంతునికి నైవేద్యమిడి తినబోతుంటే ఆ చండాలుడు 'ఓ మహర్షీ! మీరు! కుక్కకాలు తినడమేమిటి?' అని అడిగాడు. "తపస్సు చేయటానికిగాని, ప్రపంచంలో ఏ పుణ్యకార్యాలు చేయటానికిగాని ముందుగా నేను జీవించాలి, బలంగా ఉండాలి" అని ఆయన బదులు చెప్పాడు.

శక్తి అనగానే అదేదో పాపమన్నట్లు, నింద్యమన్నట్లు దాన్ని తక్కువచూపు చూచే ఆలోచన ఒకటి కొన్నిదశబ్దాలుగా ఇక్కడ ఏర్పడింది. 'అహింస' అనే పదానికి చేయబడిన వక్రభాష్యం, జాతీయమేధలో విచక్షణా శక్తిని నాశనంచేసింది; బలం కలిగి ఉండడం 'హింస'గా భావిస్తూ మనలోని బలహీనతను ఘనంగా చెప్పుకోనారంభించాం.

అహింస అనేది ఒక నకారాత్మక భావమని, హింస అనే భావాత్మక పదానికి ముందు 'అ' చేర్చటంవల్ల అహింస అనే పదం ఏర్పడుతుందని ఒక సాధువు అన్నాడు. 'హింస' చేయటానికి తగినంత బలముండి నిగ్రహం, విచక్షణ, కరుణలవలన 'హింస'ను చేయనివాడే నిజమైన 'అహింస'ను పాటించేవాడు,

ఒక బలవంతుణ్ణి ఎవరైన ఢీకొన్నాడనుకొందాం. 'ఫరవాలేదు మిత్రమా!నువ్వు నాపట్ల జరిపినదోషాన్ని నేను క్షమిస్తున్నా'నని బలవంతుడు జాలితో చెప్పితే, అతడు 'అహింస'ను పాటిస్తున్నాడని చెప్పగలం. తోటి

వ్యక్తి బుద్ధి బ్రద్దలుకొట్టగలశక్తి ఉండికూడా నిగ్రహాన్ని చూపాడతడు. ఒక సన్నని, బలహీనుడైనవ్యక్తి - కేవలం ఒక దోమవంటివాడు త్రోప వెంట వెళ్ళుతూఉండగా, ఒకవ్యక్తి వాడి చెవులు మెలిపెట్టాడనుకుందాం. అప్పుడా దోమ, నఖ శిఖ పర్యంతం గడగడ వణుకుతూ, 'అయ్యా! నిన్ను నేను క్షమించా'నని అంటే ఆ మాటకు విలువేమిటి? అతడు అహింసను పాటిస్తున్నాడని ఎవరంటారు? దొంగలు తన ఇంటిని దోచుకుంటూఉంటే వాళ్ళను ఆపలేక 'వసుధైకకుటుంబకమ్' (ప్రపంచమంతా ఒకే కుటుంబం) అని పెద్దగా ప్రవచించేవాడివంటివాడే ఇతడు. పిరికివాడని, ఆత్మవంచకుడని, పెద్దపెద్ద ధర్మపన్నాలచాటున తన పిరికితనాన్ని దాచుకొనేందుకు మాత్రమే యత్నిస్తున్నాడనీ, అంతకన్న ఏంచేయటానికీ అతనికి ధైర్యంలేదనీ లోకులు భావిస్తారు. ఇట్టి పొరపాటు ఆలోచనలతోను, ఆత్మవంచన కలిగించే ధర్మపన్నాలతోను మనదేశవాతావరణం నిండింది. తెచ్చికోలు నైతికాధారంతో 'శాంతి' 'అహింస'ల ధర్మపన్నాల దుమారంలేపి దానిచాటున మన చేతకాని తనాన్ని దాచుకొంటున్నాము.

## బలహీనుని అహింస

ఇటువంటి వికృతమైన భావనల మూలంగానే మనం అన్నిచోట్లా దెబ్బ తింటున్నాం; మన సరిహద్దులు కుంచించుకపోవటం చూస్తున్నాం. మాతృభూమియొక్క సమైక్యతను, గౌరవప్రతిష్ఠలను సంరక్షించే తలంపులో ఎవరూ లేరు. రోజురోజుకూ మనపై అవమాన పరంపర వచ్చిపడుతున్నది. మన ప్రజలను శత్రువులు కాల్చిచంపుతూనే ఉన్నారు. పండితనెహ్రూ పుట్టినరోజున మన సైనికుల మృతకళేబరాలను పదకొండింటిని చైనా మనకు బహూకరించింది! మేము 'శాంతి' కాముకుల మని చెప్పుకుంటూ మనం వీటన్నిటినీ దిగమ్రింగుతున్నాం. అవమానాలను పదేపదే సహిస్తూ ఊరుకున్నవాడు ఆడదీకాదు, మగవాడూకాదని మహాభారతం చెప్తున్నది.

ఏతావానేవ పురుషో యదమర్షీ యదక్షమీ ।
క్షమావాన్ నిరమర్షశ్చ నైవ స్త్రీ న పునః పుమాన్ ॥

(అవమానమును సహించనివాడే నిజమైన పురుషుడు, అవమానము జరిగినపుడు రోషమునందక సహించి ఊరకుండువాడు పురుషుడుకాని స్త్రీగాని కానేరడు.)

## గొప్ప ఉదాహరణలు

ఇతరులను వినమ్రులుగా చేయగల సామర్థ్యమున్నప్పుడే మనిషి తాను వినమ్రుడై ఉండాలని మన తత్త్వశాస్త్రం చెపుతున్నది. ఎప్పుడు ఒకవ్యక్తి ఇతరులను క్షమించగలడు? తనను అవమానం చేసినవాళ్ళను దెబ్బతీయగల శక్తి ఉన్నప్పుడే ఆ పని చేయగలడు. ఎప్పుడు ఒకవ్యక్తి ఇతరులను సేవించగలడు? యావత్ప్రపంచంయొక్క వినయపూర్వకమైన సేవను పొందటానికి అర్హత తాను సంపాదించుకొన్నప్పుడే అది సాధ్యం. ఆదర్శప్రాయమైన ఈస్థితినే మనం శ్రీకృష్ణునిలో చూడగలం. చిన్నతనం నుంచి గూడ అనేకమంది దుష్టరాక్షసులను వరుసపెట్టి మట్టుపెట్టిన పిదపనే భగవద్గీతలో 'అహింస' ప్రబోధించాడాయన. కంసుణ్ణి సంహరించి ఉగ్రసేనుణ్ణి సింహాసనంపై పునఃప్రతిష్ఠించినవాడతడే. అయినా తానుమాత్రం ఆ సభలో ఒక ద్వారపాలకునిలా నిలిచి, అతిథులుగా విచ్చేసిన రాజులందరికీ స్వాగతాలు చెప్పాడు. రాజసూయయాగంలో అగ్రపూజనందిన ఆతడే యాగంలో భోజనంచేసినవారందరి ఎంగిలిఆకులను ఎత్తిపారవేసేసేవ స్వీకరించాడు. మన తత్త్వం చెప్పే సందేశమిది.

మన జాతీయ శీలానికి ప్రమాణాలను సృష్టించిన శ్రేష్ఠ గురువర్యులందరూ ఆదర్శవాదంతో వాస్తవికతనుగూడ మేళవించారు. మానవ సంక్షేమంయొక్క మహోన్నత సిద్ధాంతాలను వ్యవహారంతో సమన్వయించారు. రామాయణంలో ఒక ఉదంతం ఉన్నది. రామ రావణ యుద్ధం

ముమ్మరంగా సాగుతున్న సమయంలో జరిగిన సంఘటన ఇది. రావణుని కుమారుడైన మేఘనాదుని సంహరించినతర్వాత, లక్ష్మణుడు అతని శిరస్సును తన శిబిరానికి తీసుకొని వచ్చాడు. మేఘనాదుని భార్యయైన సులోచన, తన భర్తకళేబరంతోపాటు అగ్నిప్రవేశం చేయదలచినదై తన భర్త శిరస్సును తనకిచ్చివేయమని ప్రార్థించేందుకు రాముని శిబిరానికి బయలుదేరి వస్తున్నది. రావణుని శిబిరదిశనుండి ఒక అందమైన స్త్రీ తమ దిశగా రావటం చూచిన శ్రీరామచంద్రుని సైనికులు ఆమె తప్పనిసరిగా సీతయే అయిఉంటుందని భావించారు. ఆనందోత్సాహాలతో ఉప్పొంగి పోతూ తమ ఆయుధాలను విసర్జించటానికి సంసిద్ధులయ్యారు. వీరి సంభ్రమ కారణాన్ని విన్న శ్రీరాముడు మాత్రం "పది తలలు, ఇరవై చేతులతో రావణుడు ఇంకా బ్రతికే ఉన్నాడని మరచిపోకండి, రావణుని శవంమీద నడచివెళ్ళిన పిదపనే మనం లంకలో ప్రవేశించగలం; సీతను విడిపించగలం; అంతవరకు సీతను చూడగలమని కలలోనైన అనుకోవద్దు. అటువంటి భ్రమలో పడకండి" అని ప్రశాంతంగా వారికి నచ్చచెప్పాడు. మన స్తత్వ శాస్త్రంలో దిట్టగాబట్టి, అతడు రావణుని స్వభావాన్ని సరిగా గుర్తించ గలిగాడు. అతనిలోని రాక్షసత్వం అంతటి లోతుగా పాతుకొని ఉన్నదనీ, ఎట్టిపరిస్థితుల్లోనూ, అది అతణ్ణి మారనియ్యదని, అమోఘమైన రామ బాణంవల్ల మాత్రమే, వాడి పీడ విరగడ ఔతుందని శ్రీరాముడు విశ్వయించాడు. మానవజీవితంలోని మహోన్నతప్రమాణాలను నిలబెట్టటం, శక్తియే అన్నిటికన్న ప్రధానవిషయమని దృఢంగా విశ్వసించడం – ఆయన స్వభావంలో ఈరెండు ఇమిడిఉన్నందువనే 'మర్యాదాపురుషోత్తముడు' కాగలిగాడు.

మహాభారతంలోకూడ శ్రీకృష్ణుడు కురుక్షేత్ర రణరంగంలో అర్జునుడి లోని పౌరుషాన్ని ఆవాహనచేస్తూ

*క్లైబ్యమ్ మా స్మ గమః పార్థ !*

(అర్జునా ! అకర్మణ్యతకు లోనుకావద్దు) –అని హెచ్చరించాడు.

గీతలో ఉపదేశం మాత్రమేనా ముఖ్యం? ఏ సందర్భంలో ఆ సందేశం వెలువడింది? సందేశం ఎవరిచ్చారు? శిష్యుడెవరు?– ఇవన్నీ ముఖ్యమే. ఇదంతా ఒక వీరోచితమైన నేపథ్యంలో సమకూడింది. ఉపదేశకుడైన శ్రీ కృష్ణుడు ఆ యుగానికే మహావీరుడని అందరూ అంగీకరిస్తారు. ఆతని శిష్యుడైన అర్జునుడు కూడా సాటిలేని మేటివీరుడు. శ్రీకృష్ణుని తర్వాత లెక్కించదగినవాడతడే. యుద్ధభూమిలో ఇద్దరు మహావీరులమధ్య నడచిన సంవాదం 'గీత' అనేది; అది ఎనలేని ఆధ్యాత్మిక విజ్ఞానభండారం. నిర్భీకత, వీరత్వం లేకపోతే ఈ సంఘర్షణమయ జగత్తులో, ధర్మాన్నీ, న్యాయాన్నీ స్థాపించలేమనే జీవన సత్యాన్ని ఇదంతా ప్రస్ఫుటం చేస్తోంది. అర్జునుడు పిరికివాడు కాదు. కాని పెద్దలు, గురువులు తన ప్రతిపక్షంలో నిలచి ఉండడం చూచి, తాను చేసేపని సముచితమైనదేనా అని అతనికి సంశయం కలిగింది. అతడు యుద్ధరంగమునుండి పారిపోదలచలేదు: వైరాగ్యభావంతో తన ఆయుధాలను విసర్జించి తన ప్రతిపక్షులచేతిలో చనిపోవాలని తలచాడు.

*యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః !*
*ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥*

(నేను ప్రతీకారం చేయకుండా అశస్త్రుడనై యుండగా, రణరంగంలో ధృతరాష్ట్రుని పుత్రులు శస్త్రధారులై నన్ను సంహరిస్తే నాకదే మేలు.)

ఈనాడు అదేవిధమైన తికమక మన నాయకుల హృదయాలను పట్టిపీడిస్తున్నట్లుంది; 'అప్రతీకారం' 'శాంతి' అనే మాటలు, పదేపదే గొంతుచించుకొని అరుస్తున్నారు. అయితే అర్జునునకు, నేటి నాయకులకు మానసికస్థాయిలో ఎంతో తేడా ఉంది. అర్జునుడు ప్రత్యేకమువున ఒక మహావీరుడు. మరి ప్రతీకారం చేయము అంటూ ఈనాడు మనకు వినిపించే దాబునరిమాటలు మనలోని బలహీనతను కప్పిపుచ్చుకొనే పైపై ముసుగులు మాత్రమే !

## సరియైన తత్త్వదర్శనం

కోరినా, కోరకపోయినా ఈనాటి ప్రపంచంలో సంఘర్షణలు వచ్చి తీరుతాయి. మనం సదాచారులుగా ఉన్నంతమాత్రాన ఇతరులుకూడ తమ కుటిలబుద్ధిని విడిచిపెడతారని ఏముంది? అటువంటి బొత్తిగా బుద్ధితక్కువ అంధవిశ్వాసంతో ఉండటంకన్న ఆత్మవంచన వేరే ఉంటుందా? బలివేదిక వద్దకు మెల్లగా తీసికొనిపోతూన్న 'యజ్ఞపశువు' 'అప్రతీకారానికి' మూర్తీభవించిన ఉదాహరణ కాగలదు ఏమాత్రం గొణుగుడైనా లేకుండా అది తన మెడను కసాయివాని కత్తికెలగా చాపుతుంది. అటువంటి అమాయకము, 'అహింసావాది' యైన ప్రాణిని చంపరాదని క్షణమైనా కసాయివాడు ఆలోచించడు. మరి పులిని యజ్ఞపశువుగా బలి ఇద్దామనే ఊహనైనా చేయటానికి ఎవ్వరూ సాహసం చేయరు. బలహీనము, సాధువు, అహింసాజీవి అయిన మేకయే యజ్ఞపశువుగా అంగీకరింపబడింది.

*అశ్వం నైవ గజం నైవ వ్యాఘ్రం నైవ చ నైవ చ ।*
*అజాపుత్రం బలిం దద్యాత్ దేవో దుర్బలఘాతకః ॥*

(గుర్రాన్ని, ఏనుగునూ బలి ఇవ్వం. ఇక పులిమాట ఎత్తనేకూడదు. మరి బలివేసేది మేకపిల్లనే. దేవుడుగూడా బలహీనులనే భక్షిస్తాడు.)

అనే సుభాషితం ఒకటున్నది.

ప్రతీకారం చేయరాదనే మనఃప్రవృత్తికి ప్రతిఫలమది. అయితే అకారణంగా మనం హింస కుపక్రమింపరాదు. ఇతరులు మనలను హింసించే అవకాశం కల్పించరాదు. తనపట్ల హింస జరగడానికి అవకాశం కల్పించటం కూడ హింసయే అవుతుంది. ఆవిధంగా అది అధర్మమే! ఒకసారి ఒక జైన సాధువు అహింసయొక్క ప్రాముఖ్యం వ్యాఖ్యానిస్తూ "విమ్న సర్వనాశనం చేయ సంసిద్ధమైన పాశవికశక్తి ఎదురైనప్పుడు ఆత్మరక్షణ ప్రయత్నం అహింస' పేరట చేయకపోతే, ఆ దుష్టశక్తి చేసే హింసకు ప్రోత్సాహ

మిచ్చినవాడవే అవుతావు. ఆవిధంగా నీవు ఆ నేరాన్ని ప్రోత్సహించిన వాడవే అవుతావు. నేరంచేసినవా డెంతటి దోషియో, అందుకు ప్రోత్స హించినవాడుగూడ అంతటి దోషియే. ఒక పనిని 'హింస' అనిగాని, 'అహింస' అనిగాని నిర్ణయించడానికి, 'ఉద్దేశ్యమే' చేసిన పనికంటె ప్రముఖమైన అంశమవుతుంది" అని అన్నాడు.

ఇటువంటి విషయంలో నిజమైన మహాపురుషులయొక్క ప్రబోధాలు ఎల్లప్పుడూ మనకు సరియైన మార్గాన్నే చూపెడుతున్నాయి. పరమ దయాళువైన సంత్ తుకారామ్ కూడా

*"దయా తిచేఁ నాఁవ్ భూతాఁచేఁ పాళన ఆణిక నిర్దళన కంటకాఁచేఁ"*

(ప్రాణులన్నిటిని సంరక్షించుట దుష్టశక్తులను శిక్షించుట)

అని దయాస్వభావాన్ని నిర్వచించాడు.

'అహింస' అనే పదం ఉచ్చరించగానే, మహాపురుషులు బుద్ధ భగ వానుడూ, మహాత్మాగాంధీ- వీరిద్దరి పేర్లూ మనసులో మెదలుతాయి. బుద్ధ భగవానుని జీవితంలో జరిగిన ఒక ఉదంతం ఈ సందర్భంలో ముఖ్య మయింది కాగలదు. ఒకానొక రాజ్యంలోని సర్వసైన్యాధిపతి, వారి నుండి దీక్ష పొంది శిష్యత్వాన్ని స్వీకరించడానికి, బుద్ధుని దగ్గర కొచ్చాడు. భిక్షువుగా మారాలనే ప్రేరణ మీ కెలా కలిగిందని బుద్ధుడాయన్నడిగాడు. ఆ సేనాధిపతి ఇలా అన్నాడు: "శత్రువులు మా రాజ్యం మీదికి దండెత్తి వచ్చారు. నేను వారి నెదిరించినట్లయితే అది హింసకూ, రక్తపాతానికీ దారి తీస్తుంది. అది మహాపాపం కనుక ఈ సైనిక బాధ్యతను వదులుకుందా మని నిశ్చయించుకున్నాను. మీ శాంతి, అహింసల మార్గంలో పయనింప దలచుకున్నాను." బుద్ధుడిలా బోధించాడు "నీవు ఈ మాదిరిగా ఇక్కడ కొచ్చేయడం వల్ల శత్రువులు దురాక్రమణ నాపబోరు. మారణహోమం

కావించి సర్వనాశనం చేసి తీరుతారు. నీవు నీ బాధ్యతను విస్మరించి, నువ్వు రక్షించవలసిన అమాయికుల్ని గాలికి విడిచి పెట్టేస్తే, వారి మీద జరిగిన దౌర్జన్యం యొక్క పాపఫలమంతా నీదే అవుతుంది. మంచివారిని కాపాడ వలసిన బాధ్యత నీ ధర్మం. ఈ విధి నిర్వహించటం వల్ల నీకే పాపం అంటదు. కనుక వెనక్కు వెళ్ళి నీ విధిని నిర్వహించు"– అహింసకు అసలైన అర్థాన్ని బుద్ధుడీ ప్రకారంగా చెప్పాడు.

గాంధీజీ గూడా ఇదే ధోరణిలో ఉద్బోధించారు. అహమ్మదాబాద్‌లో ఒకసారి, ముస్లిములు హిందువులపై దాడి చేసి, ఘాతుకకృత్యాలుచేస్తుంటే హిందువులు ఇళ్ళూ వాకిళ్ళూ విడిచి పారిపోవటం మొదలుపెట్టారు. గాంధీజీ వారితో పరుషంగా ఇట్లా అన్నారు "ఏమిటంత పిరికివాళ్ళుగా ప్రవర్తిస్తున్నారు? నా పేరెత్తి, చిలుకల్లాగా, అహింసా నామాన్ని జపిస్తూ, ఆ ముసుగులో ప్రాణాలు కాపాడుకోవటానికి పారిపోతున్నారు. నా అహింస ధైర్యవంతులది. పిరికివాళ్ళది కాదు. పిరికివాళ్ళలాగా ఇలా పారిపోయే కంటే, పోరాడుతూ, చంపటంగానీ, చావటంగానీ, మెఱుగు"

శ్రీకృష్ణుడు కూడా ధర్మసంస్థాపనలో 'వినాశాయ చ దుష్కృతాం' (దుష్టులను నాశనం చేయుట) కూడా ఇమిడిఉందని సుస్పష్టంగా తరతరాలవారికి ప్రకటించాడు. ఆ సిద్ధాంతానికి మూర్తీభవించిన ప్రతీక శ్రీకృష్ణుడే! యుద్ధాన్ని నివారించి, శాంతిని నెలకొల్పేందుకు తనశక్తినంతా ధారవోసి ఆతడు ప్రబోధించాడు, ప్రయత్నించాడు. కాని అప్రతిహతశక్తియే చివరకు సమస్యను పరిష్కరిస్తుందని, దూరదృష్టితో స్పష్టంగా గ్రహించాడాయన. సంధిరాయబారాలు జరపటానికి ఆతడు దుర్యోధనునివద్దకు వెళ్ళబోతుంటే, దుష్టస్వభావంగల దుర్యోధనుడు శ్రీకృష్ణునికేమైనా అపకారం తలపెడతాడేమో అని, శ్రీకృష్ణుడు క్షేమంగా రాగలడో లేడో అని ధర్మరాజు ఆదుర్దాపడ్డాడు. అట్లాగే జరిగినట్లయితే

తానేదుర్యోధనుణ్ణి, అతని అనుచరబృందాన్నంతనూ నాశనంచేస్తాడు కాబట్టి యుద్ధంచేయనవసరంలేకుండానే రాజ్యం ధర్మారాజుకు లభిస్తుందని శ్రీకృష్ణుడు హామీ యిచ్చాడు. కష్టాల నెదుర్కొనే సమయంలో శక్తిమంతున కుండవలసిన సరియైన దృక్పథమదే. అవసరం లేకపోయినప్పటికీ, న్యాయసమ్మతము గౌరవప్రదమునైన సంధికి అవకాశమున్నప్పటికీ, ఎప్పుడూ బలప్రయోగాన్ని గురించే మాట్లాడుతూ ఉండటం, ప్రయోగించటం అమానుషము, పాశవికము. అయితే ఎప్పుడూ సంధినిగురించి మాట్లాడటం, అన్యాయాన్ని, అవమానాన్ని తొలగించేందుకు మరేమార్గమూ లేనప్పుడుకూడ శక్తి నుపయోగించకపోవడం కేవలం పిరికితనము, చేతకానితనము మాత్రమే కాగలదు.

కాబట్టి కఠోరవాస్తవాలతో కూడిన ఈ ప్రపంచంలో ఆ మహాపురుషుల జీవితాలు మనకొసంగిన నిజమైన సందేశాన్ని సరిగా అర్థం చేసికోవలసిఉంది. నేటి ప్రపంచంతీరును చూస్తే, శక్తియొక్క భాష ఒక్కటి మాత్రమే దానికి అవగాహన అవుతుంది అనేదే అందులోని కఠోరసత్యం. అనంతశక్తియొక్క అచంచలమైన పునాదిపైన మాత్రమే జాతి అభివృద్ధిచెంది, వైభవోపేతమైన స్థితిలో తననుతాను నిలుపుకో గలుగుతుంది.

## అజేయ జాతీయ సంకల్పశక్తి కావాలి

అటువంటిశక్తి ఎక్కడ లభిస్తుంది? అట్టి జాతీయశక్తికి, నిజమైన అక్షయస్రోతస్సు ఏది ? జాతిలోని ప్రజలందరియొక్క సుసంఘటితము, సమర్పితము, అనుశాసితమూనైన జీవితమే అందుకు ఆధారం కాగలదు. ప్రజల్లో అంతర్నిహితంగా ఉన్న శక్తియొక్క ఆవిష్కారణలు మాత్రమే జాతీయజీవనానికి సంబంధించిన వివిధ రంగాలు. అట్టి ఆవిష్కారణల్లో

రాజకీయశక్తి ఒకటి, సైనికశక్తి మరొకటి. కానీ సుశిక్షితము, ప్రగాఢ దేశభక్తియుతము, పౌరుషయుక్తమూనైన ప్రజల అస్తిత్వమే శక్తికంతకూ పుట్టినిల్లు.

యుద్ధంచేసేది తుపాకీకాదు; దానివెనుకనున్న హృదయం మాత్రమే అని చెప్పినమాట యదార్థమే. దేశభక్తియుతమైన సుదృఢహృదయం లేనిదే ఎన్ని ఆయుధాలు, ఎంతటి మందుగుండుసామగ్రి ఉన్నప్పటికీ అవి దేశాన్ని కాపాడలేవు. ఇందుకు నిదర్శనంగా నాగపూర్‌లో ఒక ఉదంతం జరిగింది. హిందూ ముస్లిం కలహాలని వ్యవహరించే ప్రతి పోరాటంలోనూ, కొట్టేది ముందు ముస్లిములూ, పడేది హిందువులూ. కనుక అటువంటి కలహాలను ముస్లిం దౌర్జన్యాలు అనేవ్యవహరించాలి. అటువంటిసమయంలో ఒకసంఘటన జరిగింది. ఒకహిందువు, మందుతో దట్టించిన తుపాకినిచేతదాల్చి, తనయింటిలో పైఅంతస్తులోకూర్చున్నాడు. కొందరు ముస్లిమ్‌గూండాలు అతని యింటిపై దాడిచేశారు. తలుపులు గట్టిగా బిగించి ఉన్నాయి కాబట్టి, వారు లోనికి పోలేకపోయారు. అప్పుడు క్రిందనున్న దుర్మార్గుల్లో ఒకడు తన చేతిలో ఉన్న ఒకచిన్న గొడ్డలిని చూపుతూ పైనకూర్చున్నవాడివంకకు చూచి కేకలుపెడుతూ, "చేతిలో తుపాకీ పారెయ్, లేకపోతే ముక్కలు ముక్కలుగా నరికిపారేస్తా" అని అరిచాడు. అదివిని భయంతో గడగడ వణుకుతూన్న హిందూ సజ్జనుడు, తన చేతిలోని తుపాకీ జారవిడిచాడు. అదే తుపాకీకి చివరకాతడు ఆహుతయ్యాడు. కాబట్టి నిర్భీకుడై, ఉక్కు లాంటి సంకల్పబలంగల మనిషిమాత్రమే ఆయుధాలను ఉపయోగించగలడు; తనను రక్షించుకొనగలడు. జాతివిషయంగూడ అటువంటిదే.

ఆచరణయోగ్యంగా, వాస్తవంగా ఉండేట్టు జాతియొక్క ప్రవర్తనను నిర్దేశించేమార్గాన నడచినప్పుడే, మహత్తరజాతిగా మళ్ళీ మనం నిలబడ గలుగుతాం. అందుచేత మన ప్రయత్నాలన్నీ ఒక అజేయమైన జాతీయ

శక్తి నిర్మాణమార్గంలో జరగాలి. దానికిగాను జాతీయచైతన్యం పొంది, అనుశాసనబద్ధంగాను, సమన్వయభావంతోను జీవిస్తూ, అజేయము, ప్రబలమునైన ఒక జాతిగా రూపొందడానికి కావలసిన శిక్షణ మన ప్రజలకు ఇవ్వాలి. ఈ ప్రపంచంలో వైభవసంపన్నమైన స్వతంత్రజాతిగా జీవించే పరమాధికారం పొందడానికి మార్గం అదొక్కటే.

# 23. విజయోపాసన

మన జాతీయ జీవనలక్ష్య, వైభవాల సాధనమార్గంలో దీపస్తంభాల వలె దారిచూపుతూ మన మహాపురుషులు ప్రకాశిస్తూ నిలిచి ఉన్నారు. అదే మార్గాన్ని భావితరాలవారు విజయవంతంగా అనుసరించేందుకుగాను ఆ మహాపురుషులయొక్క ఉత్తేజప్రదాలైన స్మృతులు, ఉదాహరణలు జాతియొక్క మనఃఫలకంపై స్వచ్ఛంగా నిలిచి ఉండాలి. మేధావులు, కర్మఠులునైన ఆ పురుషుల చర్యలను, సంపూర్ణ జీవితాలను సరియైన దృష్టికోణంలో ప్రదర్శించాలి. సరిగా ఈ ఉద్దేశ్యంతోనే మన ప్రాచీన వీరవరులయొక్క జయంతులు, వర్ధంతులు, ప్రాచీనకాలంనుండి మన జాతీయ సంప్రదాయంలో గౌరవస్థానం వహిస్తున్నాయి.

## మహాపురుషులకు దైవత్వాన్ని అంటగట్టడం

అయితే అటువంటి ప్రాచీన మహాపురుషులు రూపొందించిన ఆదర్శాలను మననంచేసుకొనే సంప్రదాయంలో ఒక తీవ్రమైన వికృతి దురదృష్టవశాత్తు ప్రవేశించింది.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవం ॥

(మహత్వము, అందము, సామర్థ్యము వీటిలో ఏ ఒక్కటి ఉన్నప్రాణి అయినా, నా తేజస్సులోని అంశనుండియే పుట్టినదని తెలుసుకొనుము.)

అనే భగవద్గీతాశ్లోకంపై పరిపూర్ణవిశ్వాసముంచి మన ప్రజలు అటువంటి శ్రేష్ఠులైన మహాత్ములయొక్క అసామాన్యశక్తినిచూచి దానియందు దివ్యత్వావిష్కృతిని, దివ్యతేజస్సులోని ఒక విస్ఫులింగాన్ని చూస్తున్నారు. అంతమేరకు అది బాగానే ఉంది.

కాని అటువంటి మహాపురుషులందరూ మానవాతీతులు, సామాన్య మానవునకు అందుబాటులో ఉండేవారుకారు అనే భ్రమమయ విశ్వాసానికి అది దారితీసింది. సామాన్యమానవుడు తాను పరిస్థితులప్రాబల్యానికి లొంగిపోయే బలహీనప్రాణి ననుకొంటూ వారందరినీ దివ్యత్వపరిధిలోకి త్రోసి బాధ్యత నుండి తప్పించుకోటానికి ఒక సురక్షితమార్గాన్ని వెతుక్కుంటాడు. దానివల్ల తన నిత్యజీవితంలో అనేక కష్టనష్టాలకు గురి అవుతూ వారిని అనుసరించ వలసిన బాధ్యతనుండి బయటపడ్తాడు. తాను బలహీనత, నిస్సహాయతలకు లోనై ఆపదల నెదుర్కొనవలసిన శ్రమనుండి తనను ఆదుకొని కాపాడుమని భగవంతుని ప్రార్థిస్తాడు. తానుమాత్రం ఇంటివద్ద సుఖంగ కూర్చోవాలనీ, మిగిలిన విషయాలన్నీ భగవంతుని అనుగ్రహంచేతనే చక్కబడాలనీ భావిస్తాడు.

దీనికితోడు అతితక్కువ బరువు బాధ్యతలతో అత్యధిక లాభము, సుఖం కలగాలనే మోజు దాదాపు అన్నిరంగాల్లోనూ ప్రవేశించింది. 'నేను పురుషుణ్ణి; పురుషప్రయత్నంతో సుఖదుఃఖాలను లెక్కించకుండా అధికశ్రమచేసి నా కర్తవ్యాన్ని నిర్వహిస్తాను' అనే పౌరుషస్వభావం మృగ్యమైపోయింది. సంపన్నకుటుంబంలో పుట్టిన వ్యక్తి ఏ ప్రయత్నమూ

లేకుండానే వైభవ విలాసాలకు అధిపతి అవుతున్నాడు. కాబట్టి అదృష్ట వంతుడుగా పరిగణింపబడుతున్నాడు. అన్నపానాదులకు అతడు బాధపడ నక్కరలేదు. క్షుద్రమైన సుఖాల్లో అతడు మునిగితేలేందుకు అవకాశం కల్పిస్తూ, పిలిస్తేచాలు పరుగునవచ్చి అతనికోసం ప్రతిచిన్నపనీ చేసిపెట్టే అనేకమంది సేవకు లతనికున్నారు. ఆ విధంగా నిస్సహాయతచేతనో లేక సుఖానుభూతిపైన మోజుచేతనో కాని తాను పనిచేయవలసిన అవసరం జీవితంలో కలుగరాదని సామాన్యమానవుడు సహజంగా కోరుతాడు. భగవంతుడు భూమికి దిగివచ్చి, కష్టాల సుడిగుండంనుండి తనను దరికి చేర్చాలనీ, ఆతడే తనపై సౌఖ్యపరంపరను వర్షించి, ఆ తర్వాత తన అవతారాన్ని చాలించి మళ్ళీ తన దివ్యధామానికి చేరుకోవాలనీ అతడు భావిస్తాడు.

అటువంటి ఆశతోనే సామాన్యమానవుడు తనకు కష్టాలు కలిగి నప్పుడు భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. తన ప్రార్థనలకు సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు కరిగిపోతాడనీ, తనవంటి 'సాధువులను' రక్షించేందుకు భూమిపై అవతరించి

*పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం ।*
*ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥*

(సాధుపురుషులను పరరక్షించేందుకు, దుర్మార్గులను శిక్షించేందుకు, ధర్మాన్ని ప్రతిష్ఠించేందుకు నేను మళ్ళీ మళ్ళీ అవిర్భవిస్తాను)

అని తాను భగవద్గీతలో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చుకుంటాడనీ భావించి ఆయనను శరణుకోరుతాడు.

ఈ విషయంలో, మన సంఘస్థాపకులు చతురోక్తులు ఆడుతుండేవారు. "ఈనాడు మాత్రం అవతరించవద్దని భగవంతుని నేను ప్రార్థిస్తాను. అట్లా

జన్మిస్తే, అకర్మణ్యతా, స్వార్థాల్లో – అంటే అధర్మంలో ఈ సమాజమంతా మునిగిఉండటం చూచి, అధర్మాన్ని నాశనం చేస్తానని తాను చేసిన వాగ్దానం ప్రకారం ఈ సమాజాన్నంతటినీ నాశనం చేసితీరుతాడు. కాబట్టి సమాజ కార్యంలో త్యాగభావన, నిరంతరపరిశ్రమలు కలిగిన జీవితం గడపడమే పరమార్థంగా పెట్టుకొన్న సాధువులుగా మొట్టమొదట మనం మారాలి. అప్పుడు భగవంతుని ఆహ్వానిస్తే అతడు దుర్మార్గులను నాశనంచేసి, మనలను రక్షిస్తాడు".

కాని సామాన్యమానవులు 'అవతారపురుషు'లను తరచు స్మరించుకొంటూ, మూర్తీభవించిన దివ్యత్వంగా వారిని ఆరాధిస్తే చాలు, తమ కర్తవ్యం నెరవేరినట్లేనని భావించుకొంటారు. అంతకన్న వేరేపని చేసే కోరిక వారికి లేదు. ఉదాహరణకు మనప్రజలు శ్రీరామచంద్రుని విష్ణుమూర్తి యొక్క అవతారంగా భావిస్తూ శతాబ్దాలతరబడి ఆయనను పూజిస్తూనే ఉన్నారు. కానీ, ఆ శ్రీరాముని పౌరుషగుణాలను అలవరచుకోవాలనిగాని, అతని జీవితాన్ని మూర్తీభవింపచేసుకోవాలనిగాని, మనలో చాలామంది ఆయనను పూజించటంలేదు. దీనికి సంబంధించిన ఒక చక్కని ఉదంతం మన సంఘస్థాపకులు చెపుతూ ఉండేవారు. నిత్యమూ క్రమం తప్పకుండా ఇంటిలో అధ్యాత్మరామాయణాన్ని పారాయణచేసే అలవాటున్న ఒక వయోవృద్ధునితో ఒకప్పుడు మాట్లాడుతూ, శ్రీరామునిలోని ఏగుణం మీకునచ్చింది? దేన్ని మీజీవితంలో ఆచరణలో పెట్టాలనిపిస్తున్నదని ఆయనను అడిగారు. ఈ మాటలు వింటూనే ఆయన కోపంతో రెచ్చిపోయి, 'ఏమిటీ ఈ అర్థంలేని మాటలు! మానవమాత్రులమైన మనం భగవంతునియొక్క గుణాలను అలవరచుకోగలమా? ఈ పారాయణవల్ల పుణ్యం వస్తుంది. దానివల్ల మోక్షం వస్తుంది. అంతకన్న మనకు కావలసిందేమిటి?' అని అరిచాడు.

శ్రీకృష్ణునిపట్ల గూడ ఇదేదృష్టి ఉంది. భగవద్గీతను, దివ్యమైన ధార్మికగ్రంథంగా భావించి, దానిలోని శ్లోకాలన్నిటినీ కంఠస్థం చేసి

పారాయణచేస్తూ, సర్వశ్రేష్ఠంగా దానిని ప్రశంసిస్తే చాలు - అనేది ఒక విచిత్రభావన. ఇది మన సమాజంలోని అన్నిరంగాల్లోను, అన్నిస్థాయుల మనుష్యుల్లోనూ గూడుకట్టుకొని ఉన్నదని మనకు తెలుసు. కాని భగవద్గీత మానవ కర్తవ్యబోధనలో పరమోత్కృష్ట గ్రంథమనీ, నిత్యజీవితంలో ఆచరణలో పెట్టదగినదనీ - మన ఊహకే తట్టదు.

నిన్న మొన్నటి ఉదాహరణ ఒకటి పరిశీలిద్దాం. లోకమాన్య తిలక్ మహాశయుడు గొప్ప కర్మయోగి, ప్రముఖ జాతీయనాయకుడు. కాని వారి మరణానంతరం వారి అనుచరులుగాని, సామాన్యప్రజలుగాని వారి శ్రేష్ఠజీవితాన్ని, ఉదాత్త సద్గుణాలను తమ జీవితాల్లో అలవరచుకోవటం గురించి పట్టించుకొనలేదు సరిగదా, కనీసం వారు ఏర్పరచిన రాజకీయ సంప్రదాయానైనా కొనసాగించటానికి యత్నించలేదు. దానికి బదులు వారాతని శిలావిగ్రహాలు ప్రతిష్ఠించారు. కొన్ని పాఠశాలలు ప్రారంభించారు. వారి పేరున నిధులు ప్రోగుచేశారు. జయంత్యుత్సవాలు జరిపించి, నోటి మాటలతో వారిపై శ్రద్ధాంజలిని, ప్రశంసల వర్షాన్ని కురిపించారు. ఇవన్నీ చేయటంతో లోకమాన్యునిపట్ల కర్తవ్యం నెరవేరిందని వారు సంతృప్తి చెందారు. అమాయక భక్తాగ్రేసరులు కొందరు తిలక్‌ను ఒక చతుర్భుజునిగా చేసి ఆరాధించసాగారు. ఆయన భగవంతునియొక్క అవతారమని, తాము సామాన్యమానవులమని వారి భావన. మరి సామాన్యులైన తాము, అట్టి మహోన్నత దివ్యత్వాన్ని చేరగలమని ఎట్లా ఆశించగలరు ? తమజీవితం కేవలం తిని తిరగడానికి, ధనం సంపాదించటానికి, సంతానాన్ని కని పెంచటానికి, చివరకు ఏదో ఒకనాడు చనిపోవటానికి మాత్రమే ఉద్దేశింప బడింది.

## పురుషాకారమే పరమేశ్వరుడు

మహాపురుషులను దేవతలకోవలోకి నెట్టివేయడానికి ఎందుకు చూస్తున్నాం ? ఒక్కుదాచుకొనే మన స్తత్వమే దానికి కారణం. సామాన్య

మానవుడు కష్టాలమధ్య చిక్కుకొన్నపుడు ఆందోళన చెందుతాడు, భయకంపితుడౌతాడు. వేరే ఏమి చేయటానికి తోచక భగవంతుని శరణు కోరుతాడు. దుఃఖిస్తూ, మరొకసారి అవతరించుమని భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. అట్టి నిరాశాంధకారంలో భగవంతునికన్న వేరే ఆశాకిరణం అతనికి కనపడదు. మహాత్ములు, విద్వాంసులుగూడ ఒక్కొక్కసారి ఆవిధంగా తపించటం చూస్తాము. అట్టిస్థితిలో, ఎవరైనా ఒక మహాపురుషుడు ప్రత్యక్షమై పరిస్థితిని తారుమారుచేస్తే – పౌరుషం, ధైర్యం, బుద్ధి ఉపయోగించి దాన్ని మార్చివేస్తే–వెంటనే అతణ్ణి దేవతలకోవలో చేర్చుతారు. కాని అట్టి మహాపురుషులను మానవుల పరిధినుండి బయటకి త్రోసివేయటం కేవలం బలహీనతయే అవుతుంది.

మన ప్రజల్లోని ఇట్టి వికృత మనస్తత్వాన్ని తొలగించి దాని స్థానంలో పౌరుషాన్ని, ప్రయత్నశీలతను నెలకొల్పాలి. "యత్నతో దేవ జాణావా" (ప్రయత్నమే పరమేశ్వరుడు) అని సమర్థరామదాసు చెప్పాడు. మానవ ప్రయత్నరూపంలో మూర్తీభవించిన భగవంతుని మనం శరణుపొందాలి. ఇది కర్మభూమి, అంటే పురుషప్రయత్నమే ప్రధానమైన భూమి ఇది. అసామాన్య శక్తిసామర్థ్యాలు కల అనేకమంది మహాపురుషుల చెమటతోనూ, రక్తంతోనూ తడిసిన పవిత్రమైన భూమి ఇది. మనలో అంతర్నిహితమై ఉన్న శక్తులు, సద్గుణాలు, ఇక్కడే వికసిస్తాయి. అంతర్నిహితమైన దివ్యత్వం ఉద్బుద్ధమయ్యేది ఈ భూమిమీదే. సవ్యమైన ఇట్టి విశ్వాసం పురుషప్రయత్నపథంలో మనలను ముందడుగు వేయించుగాక! ఆ మహాత్ములను దేవతలుగా గాక, సామాన్యమానవులయ్యుండికూడా తమ ప్రయత్నంద్వారా మహోన్నతిని సాధించినవారిగా పూజిద్దాం; గౌరవిద్దాం. మన కుటుంబజీవనంలో ఏదైనా దురదృష్టం సంభవిస్తే, మనలో ప్రతిఒక్కడు కంటితడిపెట్టినట్లే, రావణుడు సీతనెత్తుకొనిపోయినప్పుడు శ్రీరామచంద్రుడు విలపించి కన్నీరుపెట్టాడు. అందరివలెనే తానుకూడా ఒక సామాన్య

మానవుడనే అని ఇందుమూలంగా ప్రపంచానికి చాటిచెప్పాడు. మనందరివలెనే తింటూ, తిరుగుతూ, నిద్రిస్తూ, పయనిస్తూ, మానవసహజమైన సామాన్య భావోద్వేగాలను అనుభవిస్తూనేఉన్నప్పటికీ, ఆయన జీవితంలోని ప్రతిక్షణం, పరమోత్కృష్టమైన ప్రయత్నంతో, మహోన్నత పురుషకార ఆదర్శాన్ని చేరుకునేందుకు మనను స్వాగతిస్తుంది.

మన మహాత్ములు, భక్తులు పరమేశ్వరుని ప్రార్థనకు ప్రాముఖ్యమిచ్చిన మాట నిజమే. అయితే వారుమాత్రం ఎన్నడూ జీవితంలో అకర్మణ్యతను బోధించలేదు. భగవంతుని పేరున అకర్మణ్యులై, దుఃఖించినట్టి భక్తులు నవ్వులపాలయ్యారు. మన మహాపురుషులందరూ సమాజంలో కర్తృత్వ భావనను, పురుషకారాన్ని ఉద్బుద్ధం చేయటానికి నిర్విరామంగా కృషిచేశారు. జీవితంలోని వివిధ రంగాల్లో ప్రయత్నానికి, సాఫల్యానికి ఉజ్జ్వలమైన ఉదాహరణలుగా వారు మన కన్నులముందు నిలిచిఉన్నారు. అట్టి కర్మ వీరుల యొక్క సంతానం మనం. వారి రక్తం మన నరనరాల్లో ప్రవహిస్తున్నది. వారెవరూ పుట్టుకతో మహాపురుషులై స్వర్గంనుండి ఊడి పడలేదు. ప్రయత్నం, మేధ, ధైర్యం, త్యాగం, మొదలైన పురుషోచిత మైన సద్గుణాల సామర్థ్యంచేత అట్టి ఉన్నతశిఖరాలను వారందుకున్నారు. కనీసం కొంతమేరకైనా, అట్టి సుగుణాలను మన జీవితంలో సాక్షాత్క రించుకోగలమని ఎందుకు విశ్వసించరాదు? మనమొక శ్రేష్ఠమైన జాతిగా ఉన్నతిని పొందాలంటే ప్రాచీన మహాపురుషుల జీవితాలను, కార్యాలను పరికించినప్పుడల్లా యిటువంటి సరియైన దృష్టిని పెంచుకోవటం అత్యవసరం.

## విజేతల నారాధించటం

ఈదేశం ఎట్టి మహాత్ములను ఆరాధిస్తోందో చూద్దాం. జీవనగమ్యం చేరడంలో విఫలులైనవారిని ఎన్నడైనా మనం ఆదర్శంగా స్వీకరించామా?

జీవనకార్యంలో పరిపూర్ణవిజయం సాధించినవారిని మాత్రమే ఆరాధించటం మన సంప్రదాయం ఎల్లప్పుడూ నేర్పింది. పరిస్థితులకు దాసుడైన ఏ వ్యక్తినీ మనం ఆదర్శంగా స్వీకరించలేదు. పరిస్థితులను అదుపులోనికి తెచ్చుకొని తన సామర్థ్య సౌశీల్యాల ప్రభావంతో వాటిని మార్చివేసి, తన జీవిత ఆకాంక్షల సాధనలో పూర్తిగా సఫలత నందిన వీరులే మనకు ఆదర్శ వంతులు. మనకాదర్శాలుగా, ఆరాధ్యాలుగా మన సంస్కృతి ప్రబోధించే సఫలతా, ఉత్తేజాల సజీవదృశ్యాన్ని మహోన్నతంగా నిలిపిన ఆ మహాత్ములు తమచుట్టూ ఆవరించిఉన్న గాఢాంధకారాన్ని ఆత్మతేజంతో పటాపంచలు చేశారు; నిరాశాపూరిత హృదయాల్లో విశ్వాసం నింపారు; మృత్యుముఖంలో ఉన్నవారికిగూడ జీవంపోశారు.

'ముప్పదిమూడుకోట్ల దేవతలను' బందీలనుగా చేసిన క్రూరుడు, శక్తిమంతుడునైన రావణుడంతవాణ్ణి, తన ధైర్య పరాక్రమాలతోను, లౌకిక ప్రజ్ఞతోను, సంకల్పశక్తితోనూ జయించిన శ్రీరాముడు మనకాదర్శం. సాటిలేని శారీరకశక్తివల్ల, మేధాసంపత్తివల్ల ఏకచ్ఛత్రాధిపత్యం వహించడం తనకు సులభమే అయినప్పటికీ, దాన్ని నిరాకరించిన శ్రీకృష్ణుని యొక్క సంపూర్ణ సఫలజీవితం ఉజ్జ్వల ఆదర్శంగా మన కండ్లముందు మెదలుతుంది. అట్టి విజయవంతాలైన జీవితాలే మనకెల్లప్పుడు ఆరాధనా కేంద్రాలుగా ఉంటున్నాయి. జీవితంలో ఓటమిపొందినవారిలో ఏదో ఒక లోపం ఉండితీరుతుందనేది స్పష్టం. ఓటమినందినవాడు, తన తోటివారికి ఏవిధంగా వెలుగు చూపగలడు? ఏవిధంగా మార్గదర్శనం చేయగలడు ? గాలివీచినప్పుడల్లా ఆరిపోతుందేమో అనిపించే జ్యోతి, మన మార్గాన్నెలా వెలుగుతో నింపగలదు? మహోన్నతంగా, నిటారుగా నిలచి, పెనుతుఫానుల్లో గూడ వీసమెత్తైనా మసకబారక నిరంతరం చీకటిని దూరంచేస్తూన్న దీపస్తంభంలాంటి జీవితం మాత్రమే మన జీవితనౌకను విజయతీరాలకు చేర్చగలదు.

## బలిదానం గొప్పదే కాని, ఆదర్శం మాత్రం కాదు

ఒక సమాజం నిరంతరం అనేక కష్టాలకులోనై ఘోర నిరాశలో మునిగినపుడు అనేక మానసిక పరిణామాలకు లోనవుతుంది. కొందరు కష్టాలబరువుకు క్రుంగిపోయి నిస్సహాయులై దైవీశక్తియొక్క సహాయం కోసం అఱ్ఱులు చాస్తూఉంటారు. కాని భగవంతుడు వారి మొర ఆలకించినట్లు కనబడక కష్టాలు మరింతగా క్రమ్ముకవస్తే కొందరు కోపంతో తెగింపుచేసి అట్టినిరాశామయపరిస్థితిని తామే మార్చటానికి యత్నిస్తారు. కాని కోరిన మార్పును తెచ్చేందుకు వారికి చాలినంతశక్తి ఉండదు; ఐనా అసంతృప్తి మాత్రం వారిలో రగులుతూనే ఉంటుంది. పరిస్థితుల నెదుర్కొనే ఓపిక వారికి ఉండదు.

అయితే అసంతృప్తి అనేఅగ్ని వాళ్ళను నిస్సహాయులైన ప్రేక్షకులుగా నిశ్శబ్దంగా, తమ కర్మనుగూర్చి నిందించుకుంటూ కూర్చోనివ్వదు. దుర్భర పరిస్థితుల్లో అణగారిపోయేదానికంటె పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ చనిపోవడమే మేలని వారు భావిస్తారు. వారి చుట్టూ కటికచీకటి, నిరాశ, అజ్ఞానం, నిందలు నగ్నతాండవం చేస్తూఉంటాయి. ఒక ఆశాకిరణంగాని, పిలిస్తే పలికే వ్యక్తిగాని ఉండని పరిస్థితి. అట్టిస్థితిలో దుర్బలహృదయులు ధైర్యాన్ని కోల్పోతారు. దిక్కుతోచక కుప్పకూలిపోతారు. కాని హృదయంలో అగ్నిరగులుతూన్నవారుమాత్రం దాన్ని అంగీకరించక, త్యాగభావనతో తమ జీవితాలను బలిచేయడానికే సిద్ధమవుతారు. మెరుపులాంటి ఈ బలిదానాలు సామాన్యమానవుని కనులను మిరుమిట్లు గొల్పుతాయి. 'ఆహా, చిచ్చర పిడుగు! ప్రాణంపోయినా తలవంచలేదు' అని అబ్బురంగా చెప్పుకొంటారు; హుతాత్ముడు అంటూ శ్రద్ధాంజలి ఘటిస్తారు.

భారతీయ సంస్కృతి మినహా మిగతా సంస్కృతులన్నీ ఆత్మాహుతిని ఆదర్శప్రాయంగా ఆరాధించాయి. ఆవిధంగా బలిదానంచేసినవారిని వీరులుగా

వారు భావించారు. ఏసుక్రీస్తును వారు ఎందుకు మహాత్ముడన్నారు? అతడు తన జీవితాన్ని బలిచేసిన మహాత్ముడుకాబట్టి మన భారతీయ సంస్కృతిలో బలిదానం శ్రేష్ఠతమ ఆదర్శంగా పరిగణించబడలేదు. హుతాత్ములు పరాక్రమవంతులనేది నిస్సందేహం. వాళ్ళ దృక్పథంకూడా పౌరుషంతో కూడినట్టిదే. విధివ్రాతకు సులువుగా లొంగిపోయి భయంతోనూ, అకర్మణ్యత తోనూ ఉండే సామాన్యమానవునికన్న వారు ఎన్నోరెట్లు పైస్థాయిలో ఉన్నవారే. అయినా అట్టివాళ్ళను సమాజానికి ఆదర్శంగా మనం స్వీకరించ లేదు. మానవుడు కాంక్షించదగిన మహోత్కృష్టమైన విషయంగా, వారి బలిదానాన్ని మనం భావించలేదు. ఎందుకంటే, వారు తమ లక్ష్యసాధనలో విఫలులైనారు. విఫలులయ్యారంటే, వారిలో ఏదో ఒక తీవ్రమైన లోపం ఉన్నదన్నమాటేకదా!

## అవతారా'ల సందేశం

నిరాశతో భగ్నహృదయుడైన ఒక వ్యక్తియొక్క ఆత్మహత్యను ఆదర్శప్రాయమైన విషయంగా మనం స్వీకరించం. అట్లాగే జాతీయ స్థాయిలోకూడా ఈవిధమైన ఆత్మాహుతిని మనం ప్రశంసించలేము. పరిపూర్ణవిజయాన్ని సాధించటంలోనే నిజమైన గౌరవమున్నది. తమ అసామాన్య శక్తిసామర్థ్యాలతో అతిభయంకరాలైన సాగరాలను, తుఫానులనుగూడ ఎదిరించి నిలచి, చివరకు ప్రతికూలపరిస్థితులన్నిటినీ తమ కనుకూలంగా మలచుకోవటంలో విజయవంతులైనవారినే మన సంస్కృతి ఆరాధించింది. వారంతా పరిస్థితులను ప్రభావితంచేసినవారేగాని, వాటిచే ప్రభావితులైనవారుమాత్రం కాదు. మన జాతీయ పరంపరలో అవతార మూర్తులుగా స్వీకరించిన మహాపురుషులందరూ ఇట్టివారే. ఉదాహరణకు దశావతారాలవిషయంపరిశీలించండి. మన సమాజం కష్టాలకు, భయంకర దుర్ఘటనలకూ లోనైనప్పుడు, ప్రజలు వ్యామోహగ్రస్తులై, అసమర్థులై, భగవన్నామస్మరణ చేస్తూ, దుఃఖిస్తూఉంటే, ఒక అసామాన్యమైన వ్యక్తిత్వం

అవతరించి తనయొక్క అనంతమైన త్యాగభావన, తపస్సు, మేధ, క్రియా శక్తులతో ప్రతికూలశక్తులన్నిటినీ లొంగదీసి విజయానికి ప్రతీకఅయి నిలిచింది. మత్స్యం, వరాహం, వటువు – ఇత్యాదిగా ఏ రూపం దాల్చి వచ్చినప్పటికీ, ఆ అవతారాలన్నీ తమ పవిత్ర జీవనకార్యంలో విజయాన్ని సాధించినవే.

మన వీరులందరూ ఆవిధంగా మూర్తీభవించిన విజయస్వరూపులే. మనంచేసే వీరపూజకు ఈ వి జి గీ ష యే ప్రాణం వంటిది. అట్టి మహాత్ములు అంతిమవిజయ సాధనను తమ జీవితంలో ఒక క్షణకాలమైనా మరచిపోరు. కష్టాలెదురైనప్పుడు తమ మార్గంలో తడబడరు. ముందుకు పోతూనేఉంటారు. ఆపని సాధించటానికి తగినంత శక్తిసామర్థ్యాలను పుంజుకుంటూనే ఉంటారు. చివరకు వైభవోపేతమైన విజయాన్ని తమ జీవితంలో సాధిస్తారు.

## రాజపుత్రుల బలిదానాలు చెప్పే గుణపాఠం

ఏమయినప్పటికీ, జాతీయ పునరుజ్జీవన కార్యంలో హుతాత్ములకు సహితము గౌరవనీయము, ప్రముఖమునైన స్థానమున్నది. వారి బలిదానం వృథా అయిందని ఎవరూ అనలేరు. మాతృదేశ స్వాతంత్ర్యంకోసం ఆహుతి అయిన వీరులసంఖ్య తక్కువేమీకాదు. గెలుపొందటానికి కావలసిన సామర్థ్యం వారివద్ద లేకపోవచ్చును. కానీ స్వధర్మాన్ని, స్వసమాజాన్ని సంరక్షించేందుకుగాను, చిరునవ్వుతో మృత్యువు నాలింగనం చేసుకోగల త్యాగమూ, పౌరుషమూ వారిలో ఉన్నాయన్న విషయం మాత్రం స్పష్టం. ఈ విధమైన వ్యక్తిగత బలిదానంతోపాటు మన సమాజంలో అనేక వీర బృందాలు మూకఉమ్మడిగా ఆహుతి అయ్యాయి. దాన్ని క్షాత్రధర్మంగా భావించారు. హృదయాన్ని ఉత్తేజితలూపే ఇటువంటి అనేక ఉదంతాలతో రాజపుత్రులచరిత్ర కనులు మిరుమిట్లు గొలుపుతూ ఉంటుంది. ఎడతెరపి లేకుండా అన్నిప్రక్కలనుంచి శత్రువులు చుట్టుముట్టి వస్తూంటే వీసమెత్తు

ఆశాకిరణమైనా లేనప్పుడు తమ తల్లులు, అక్కచెల్లెళ్లు, భార్యలు, కుమార్తెలు అగ్నిజ్వాలల్లో దూకి 'జోహరు' చేస్తూంటే నిశ్శబ్దంగా తిలకించి, ఆ హైందవ వీరవతంసాలు అరుణవస్త్రాలుధరించి మిలమిలమెరిసే కత్తులతో, మరల వెనుకకు తిరిగిరానిరీతిగా శత్రుసైన్యాలలో చొరబడిపోయిన ఉదంతాలనేకం ఉన్నాయి. ఓటమి, అవమానాలతో నీచంగా బ్రతికేకన్న గౌరవప్రదమైన ఆత్మబలిదానాన్నే వారు కోరుకున్నారు. అట్టి మహోజ్వలమైన పరాక్రమ కృత్యాలద్వారా, ఆత్మబలిదానాలద్వారా కనులకు మిరుమిట్లు గొలుపుతూ భయభ్రాంతులను కల్గించగల పుటలను మన చరిత్రలో రాజపుత్రులు రచించారు. అంతటి అసమానపౌరుష పరాక్రమాలు, చిరునవ్వులు చిందిస్తూ మృత్యువుతో చెలగాటాలాడగల ప్రవృత్తి సామాన్యంగా ప్రపంచచరిత్రలోనే చాలా అరుదుగా కనిపిస్తాయి. పరాక్రమోపేతులైన అట్టి మహాత్ములపట్ల గౌరవాన్ని, గర్వభావాన్నీ మనం పెంపొందించుకోవటం సముచితమే. కానీ ఆ మహావీరులు చనిపోవాలనే ఏకైక ఆకాంక్షతో ఎల్లప్పుడూ రణరంగంలో ప్రవేశించారేగాని, గెలుచుకొని రావాలనే విజిగీషతోమాత్రం కాదు. వీరమరణంపొందాలనే ఏకైక ఆదర్శంతో వారు ఉత్తేజితులయ్యారు.

*ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ।*
*పరివ్రాడ్ యోగయుక్తశ్చ రణేచాభిముఖో హతః॥*

(సర్వసంగపరిత్యాగులైన యోగులు. రణరంగంలో యుద్ధంచేస్తూమరణించిన వారు-ఈ ఇద్దరుమాత్రమే సూర్యమండలాన్ని భేదించుకొని వెళ్తారు.)

ఇట్టి దృఢవిశ్వాసంతో, సాహసోపేతులైన రాజపుత్రయోధులు యుద్ధాహ్వానం రాగానే, చావుకు వెరువకుండా, సంతోషంగా ముందుకు చొచ్చుకుపోయి శత్రుసైన్యాలతో తలపడేవారు.

కోరికనుబట్టే ఫలితముంటుంది. గెలిచితీరాలనే భావన తీవ్రంగా ఉంటే గెలుపు వచ్చితీరుతుంది. మృత్యువునే కోరుకునేవారికి మృత్యువు

రావటం తథ్యం. మరణాన్ని కోరుకునేవాడిని మనం అమృతకాసారంలో దించినా అతడు దానిలో మునిగిపోయి చచ్చిపోవటం తప్పదు. అతణ్ణి ఎవరూ కాపాడలేరు. కల్పవృక్షంక్రింద కూర్చొని ఏది కోరుకొంటే అదే లభిస్తుంది. అట్లాగే యోధుడుగా తన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్న వీరుడు ఏది తీవ్రంగా కోరితే అదే లభించేట్లు భగవంతుడు అనుగ్రహిస్తాడు. రాజపుత్రులు చేసిన ఆత్మబలిదానం వారి అసాధారణ పరాక్రమాన్ని, పరులకు తలవంచని వారి స్వాభిమానాన్ని ప్రతిబింబిస్తుంది. దానితోబాటు ఆత్మహత్యాసదృశమైన ఆకాంక్షగూడ దానిలో కనిపిస్తుంది. భారతీయ పరాక్రమచరిత్రలో చిరస్మరణీయమైన ఘట్టమే అయినప్పటికీ అది అత్యంత దుఃఖజనకమైన విషయంకూడా.

## ప్రతిక్రియ కాదు; క్రియకావాలి

క్షాత్రధరాన్ని అపార్థం చేసుకొన్నందువల్లనే ఆత్మ బలిదానం కోరుకుంటూ ఆ వీరులంతా తమను తాము నాశనం చేసుకొన్నారు. అదికూడ ఒకవిధమైన బలహీనతయే. పరిస్థితుల తీవ్రతను తట్టుకొని నిలువలేక మూకఉమ్మడిగా కోపోద్రిక్తులై దాని ఒత్తిడికి నలిగిపోవటం మన ఆదర్శం కానేరదు. పెడత్రోవపట్టించే పరిస్థితుల్లో చలించనీయక, అంతిమవిజయం సమకూర్చగల ప్రశాంతము, సమీకృతమునైన ఇచ్ఛాశక్తి ఉన్నప్పుడే అంతిమవిజయం సాధ్యమౌతుంది. అట్టిది తీవ్రఉద్రేకాలకు లోనయ్యే వాళ్ళలో ఉండజాలదు.

మేధావులు అనుభవశాలులు అయిన మానవులు కేవలం పరిస్థితులకులోనై ప్రతిక్రియకు తలపడరు; పరిస్థితులను తమకు అనువులుగా చేసుకొనేందుకు దృఢనిశ్చయంతో వ్యవహరిస్తారు. పరిపక్వత చెందిన వ్యక్తికి చంపడం లేక చంపబడడం ఎన్నటికి ఆదర్శం కాజాలవు. అతని దృక్పథం నిరాడాత్మకంగా ఉంటుంది:

బాగా ఆలోచించుకొని అంతిమవిజయం చేకూర్చే మార్గంలో ప్రశాంతంగా పురోగమిస్తాడు. విజయోపాసకులై తమ జీవనకార్యాన్ని సఫలం చేసుకొన్నట్టివారే మన కాదర్శప్రాయులు.

## నిజమయిన ధర్మం

అతి శ్రేష్ఠులైన ఆదర్శపురుషుల్లో ఒకరైన శ్రీరాముడు ఇట్టి విజయభావనకు ఒక సజీవమైన ఉదాహరణ. స్త్రీహత్య క్షాత్రధర్మ విరుద్ధమని చెప్పారు. ధర్మశాస్త్ర ప్రకారం శత్రువుతో ముఖాముఖి పోరాడాలి. అయినప్పటికి శ్రీరాముడు, తాటకను చంపాడు. వాలిని చెట్టుచాటునుండి సంహరించాడు. దుష్టులను నిర్మూలించి ధర్మరాజ్యాన్ని స్థాపించడం తన ప్రముఖ కర్తవ్యమని శ్రీరాముడికి తెలుసు. కనుకనే ఆ విధంగా చేశాడు. అమాయకురాలైన ఒక ఆడదాన్ని చంపటం పాపమే ఐనా, ఆ ధర్మాన్ని ఒక రాక్షసి విషయంలో అన్వయించరాదు. శత్రువుయొక్క స్వభావాన్ని బట్టి యుద్ధం చేసే తీరులోకూడా వ్యత్యాసం ఉంటుంది, క్షాత్రధర్మాన్ని సరిగా అర్థంచేసుకోవటం అంటే ఇదే. దాన్నే శ్రీరాముడు అనుష్ఠించాడు. ఆరోజుల్లో ధర్మాన్ని సరిగా బోధించే మహామహులైన గురువులుండేవారు. అట్టివారి ఉపదేశాలను ఆచరణలో పెట్టిన వీరులైన శిష్యులుగూడ ఆరోజుల్లో ఉండేవారు.

శ్రీకృష్ణార్జునులుగూడా అంతే. మహాభారతయుద్ధం ప్రారంభమయే ముందు అర్జునుడు యుద్ధరంగంలో తనకు ప్రత్యర్థులు భీష్మద్రోణాదులైన పెద్దలను, గురువులను చూచి నీళ్లకారిపోయి ధనుర్బాణాలను పరిత్యజించాడు. దిగ్భ్రాంతి చెందిన అర్జునుణ్ణి చూచి శ్రీకృష్ణుడు అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తిస్తూ 'నీపేరే విజయుడు కాదా? యుద్ధభూమిలో విజయాన్ని సాధించటం నీకర్తవ్యం. అటువంటప్పుడు ఎందుకు ఇట్టి భ్రమకు లోనవుతున్నావు? అధర్మాన్ని బలపరచేవారినీ - వాళ్ళెవరైతే నేమి-

అధర్మాన్నీగూడ నాశనం చేసి, శిష్టులను, న్యాయమార్గ ప్రవర్తకులను పైకిలేవటం నీయొక్క ప్రథమ కర్తవ్యం' అని చెప్పాడు.

మరొకసారి యుద్ధరంగంలో ఉండగా బురదలో దిగబడిన రథ చక్రాలను పైకి లేవనెత్తడానికి కర్ణుడు రథం నుంచి దిగినప్పుడు, అతనిపై బాణప్రయోగం చేయమని శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఆజ్ఞాపించాడు. విరథుడై విరాయుధుడైన ప్రత్యర్థిపై బాణప్రయోగం అధర్మమని చెప్పుతూ కర్ణుడు తనను కొట్టవద్దని 'ధర్మంపేరున' అర్జునుణ్ణి అర్థించాడు. అప్పుడు మహా యోగి అయిన శ్రీకృష్ణుడు 'కర్ణా! ఈనాటివరకు నీవు అనుష్ఠించిన ధర్మ శాస్త్ర నియమాలు ఏమున్నాయని ఈనాడు మాకు ధర్మాన్ని బోధిస్తున్నావు? నిరాయుధుడు, పసివాడునైన అభిమన్యుని చుట్టుముట్టి, మీరందరూ సిగ్గు విడిచి, సంహరించినపుడు నీవు చెప్పే ఈ ధర్మం ఏమయింది? నిస్సహాయు రాలు, అబల ఐన ద్రౌపదిని నిండుసభలో బహిరంగంగా మీరు అవమా నించినప్పుడు ఈ నీ ధర్మం ఎటుమాయమయింది? నేను రక్షించవలసినది ఒక్కధర్మమే. అదే ధర్మరాజు' అని గర్జించాడు. శ్రీకృష్ణుడు ఇట్టి సరియైన దృష్టికోణాన్ని నిరూపించి తద్వారా అర్జునుని సంకల్పశక్తిని, వజ్రసదృశం చేశాడు కాబట్టే అర్జునుడు యుద్ధం చేయగలిగాడు; ధార్మికశక్తుల విజయ పతాకాన్ని ఎగురవేశాడు.

## విజిగీష

అధర్మశక్తులపై, ధార్మికశక్తుల విజయమే మన తత్త్వజ్ఞానం. అది ఇక్కడ వేలాది సంవత్సరాలుగా ప్రబోధింపబడుతున్నది; ఆచరింప బడుతున్నది. ఈనాడుకూడ అధార్మికాలైన దానవశక్తులు, ప్రపంచ రంగస్థలంపై, సర్వనాశకాలైన ఆయుధాలను సమకూర్చుకొని, మానవజాతి భవిష్యత్తునే భయపెడుతూ, స్వైరవిహారం చేస్తున్నాయి. ఈనాడు అధర్మం చేస్తున్న పరిక్రాంతసవాలును ఎదుర్కొనేందుకుగాను మన విజయాకాంక్షను

వజ్రకఠోరంచేసే ఈ తత్త్వజ్ఞానంతో మానవజాతిని ఉత్తేజపరచవచ్చును. ప్రసిద్ధికెక్కిన పాశ్చాత్యమేధావులుకూడ భవిష్యత్తునుగురించి అనేకసార్లు నిరాశ చెందుతుంటారు. ఉదాహరణకు బెర్ట్రాండ్ రస్సెల్ పాశ్చాత్యలోకంలో ఒకగొప్ప తత్వవేత్తగా భావింపబడుతున్నాడు. అతడు కూడ, సామ్యవాద శక్తులతో సంఘర్షణ చెలరేగి అణు ఆయుధాలతో మారణహోమం సంభవమయినపుడు "చావడంకంటె సామ్యవాదులమవడం మేలు" అన్నాడు. పౌరుషాన్నికాక నిస్పృహను ప్రబోధించే అతడెట్టి తత్వవేత్త? సామ్యవాదులు నిజంగా కోరుకొనేదికూడ అదే. తమయొక్క తాకిడికి ప్రజ మానసికంగా మెతకపడిపోవాలని వారు వాంఛిస్తారు. అధార్మిక శక్తులతో కొనసాగించే పోరాటంలో మనయొక్క తత్వశాస్త్రంగాని, తత్వవేత్తలుగాని ఎన్నడూ నిరాశను, నిస్పృహను ప్రబోధించలేదు. అధార్మిక శక్తులపై ధార్మికశక్తులు అంతిమవిజయం పొందితీరుతాయి అనే విశ్వాసం మనరక్తంలో ఇమిడిఉంది. రాక్షసులను నిర్మూలించి, మానవధర్మానికి పట్టాభిషేకం చేయటం మన సంప్రదాయంగా తరతరాలనుంచి వస్తూఉంది.

వాస్తవానికి రాక్షసునిపై తన ఆధిక్యతను ప్రతిష్ఠించుకోవటంలోనే నరుని యొక్క నిజమైన పురుషత్వం ప్రకటితమవుతుంది. క్రూరమృగాలు తనకన్న శారీరకంగా ఎంతో భయంకరాలు, శక్తివంతాలు అయినప్పటికి మానవుడు తొలిదినాల్లోగూడ వాటికి లొంగలేదు. అతడు వాటిని జయించి తన ఆధిక్యాన్ని నిరూపించుకొన్నాడు. సామ్యవాదులుకూడ ప్రస్తుతంలో అటువంటి భయంకరమైన వినాశకశక్తులతో ఉన్నట్లే కనిపించవచ్చు. కాని మనిషిలో అంతర్నిహితమై ఉన్న మంచితనంయొక్క శక్తి చాలఅధికం. అది కాలక్రమంలో అధార్మికశక్తులన్నిటినీ అధిగమించగలదు. సరిగా అధ్యయనం చేసినవారికి మానవచరిత్ర చెప్పే పాఠం ఇదే. మన ప్రాచీన తత్త్వవేత్తలు మనకు నేర్పినదిగూడ ఇదే!

అధార్మికశక్తులన్నిటిపై అంతిమవిజయాన్ని సాధించేందుకుగాను మన శ్రద్ధను, శక్తినీ ఏకీకృతంచేసి, ఆ మార్గంలోనే పయనించేందుకు దృఢనిశ్చయం చేసుకుందాం. పైపైకి మంచిగా కనపడ్డా, చెడ్డగాతోచినా ప్రతి పనినీ ధార్మికశక్తుల విజయం అనే గీటురాయిపైనే పరీక్షచేసి చూసుకోవాలి. సజ్జనులయొక్క, ధర్మాత్ములయొక్క విజయానికి దోహదం చేసేదే ధర్మం. అదే యోగ్యమైనది. విజయాన్ని సాధించిన మన ఉత్తమ పూర్వజుల జీవితాల్లోని అచ్చుపువెలుగు మనలో జ్ఞానజ్యోతిని వెలిగించాలి. దానివల్ల మనలో విజిగీష ఏర్పడి, మనం యుక్తాయుక్త విచక్షణ జ్ఞానాన్ని పొంది, అంతిమవిజయసాధకమార్గాన్ని-ధర్మసంస్థాపన మార్గాన్ని-మెట్టగలుగుతాం; ధర్మాన్ని విశ్వమంతటా వ్యాపింపచేయ గలుగుతాం. ఇదే యుగయుగాలుగా వచ్చే మన జాతీయ జీవన పరమార్థం.

# 24. విజయంకొరకు పోరాటం*

## 1. సముచిత చర్యలు

1962 అక్టోబరు 20 వ తేదీ నాటినుండీ చైనా మన దేశంపై దండయాత్ర చేస్తున్నది. అకస్మాత్తుగా వచ్చిపడిన ప్రమాదం అంటూ ప్రభుత్వం ఆశ్చర్యం వ్యక్తంచేసినప్పటికీ, ఈదండయాత్ర అనుకోకుండా వచ్చిపడినదేమీకాదు. టిబెట్‌పై దండయాత్రచేసి కబళించిన నాడే, చైనాకు మనపట్ల సమాదరదృష్టి లేదని స్పష్టమయింది. ఒకప్రక్కన రష్యాచేత, మరొకప్రక్కన సముద్రంచేత చుట్టబడిఉన్న చైనాకు, తన సామ్రాజ్యాన్ని పెంచుకొనేందుకు బలహీనమైన టిబెట్ ఉన్న దిక్కున మాత్రమే అనుకూలత, అవకాశాలున్నాయి. భారత్, చైనాలమధ్య సంఘర్షణ నివారక రాజ్యంగా (బఫర్) పనిచేస్తుందనే ఉద్దేశ్యంతో ఆంగ్లేయులు టిబెట్‌యొక్క స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెడుతూ వచ్చారు. ఆంగ్లేయులు చేసినదాన్ని చెడగొట్టాలనే ఉత్సాహంలో, నేటి మనపరిపాలకులు టిబెట్‌పై చైనా సార్వభౌమత్వాన్ని అంగీకరించారు. అయితే చైనీయులు ముందుకు

* (1962 అక్టోబరులో జరిగిన దురాక్రమణానంతరం)

పొరబడి అన్యాయంగా 12,000 చ॥ మై॥ మన భూభాగాన్ని ఆక్రమించారని మన ప్రభుత్వమే అంగీకరించింది. ఈ యథార్థాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచించినపుడు, ఈ విషయంలో చైనా నమ్మకద్రోహం చేసిందని మనం నిందించలేము. అనేక సంవత్సరాలుగా మన దేశంపట్ల వారికి ప్రత్యక్ష విరోధం ఉండనే ఉంది.

ఈనాడెదురైన ఈ ప్రమాదాన్నెదుర్కొనేందుకు సమర్థాలైన చర్యలనుగూర్చి ఆలోచించేముందు, మన మనస్సుల్లో మతంవేసుకొని కూర్చున్న ఆలోచనలను అంతమొందించి, శత్రువుయొక్క నిజస్వభావము, అతని సన్నద్ధతలను గురించి సరిగ్గా విశ్లేషణచేసి అంచనావేయవలసి ఉంటుంది.

## హెచ్చరికల విస్మరణ

చైనా ఎల్లప్పుడూ తన రాజ్యాన్ని విస్తరింపచేసుకొనే స్వభావంతోనే ఉందని మనం జ్ఞాపకముంచుకోవాలి. అది దాని రక్తంలోనే ఉంది. ఈ పసుపుపచ్చ రాకాసిని లేవగొట్టవద్దు. లేచినట్లయితే అది మానవత్వానికే ఒక మహామారిగా తయారవుతుందని నూటయాభై సంవత్సరాల క్రితమే నెపోలియన్ హెచ్చరికచేశాడు. ఆంగ్లేయులు విడిచిపోయిన వెంటనే భారత దేశంపై చైనా దండయాత్ర చేస్తుందని స్వామి వివేకానంద డెబ్బది ఏండ్ల క్రితమే స్పష్టంగా హెచ్చరిక చేశాడు.

చైనా మన భూభాగంలోని అనేక కీలక ప్రాంతాలపై దురాక్రమణ జరిపిందని గత ఎనిమిది ఏండ్లుగా సుస్పష్టంగా సంఘం హెచ్చరిక చేస్తూనే ఉంది. అప్పట్లో ఆమాటలను విశ్వసించటానికి ఎవ్వరూ సిద్ధంగాలేరు. ఒక ప్రముఖ ఆంగ్ల దినపత్రిక సంపాదకుడు వాటిని పిచ్చివాని మాటలని అన్నాడు. ఈనాడు మాత్రం మన నాయకులు, ఈదండయాత్ర ఊహించని రీతిగా, అకస్మాత్తుగా సంభవించిందని అంటున్నారు!

ఇక, చైనారక్తంలోని రాజ్యవిస్తరణాకాంక్షకు, తీవ్రమైన దురాక్రమణ వాది, విస్తరణవాది, సామ్రాజ్యవాది ఐన సామ్యవాదమనే మద్యం కూడ తోడైంది. అంటే రెండు దురాక్రమణ తత్వాలు సామ్యవాదియైన చైనాలో కలగలసి, అగ్నిగోళంలా బ్రద్దలవటానికి సంసిద్ధంగా ఉన్నాయి.

"అపి చ కపిః కాపిశాయన మదమత్తః"
(అసలే కోతి, అందులో కల్లు త్రాగింది.)

ఇది దాని స్థితి. సామ్యవాద చైనాయొక్క దురాక్రమణ తత్వం కేవలం దానియొక్క జాతీయ స్వభావం మాత్రమే అని, ఈనాడక్కడున్న సామ్యవాదం అందుకు కారణం కాదని పొరపాటున తావిస్తే, మనలను మనం మోసం చేసికొన్నట్లే. తద్వారా ఆ ప్రమాదా న్నెదుర్కొనే యత్నాలలో మనం తప్పటడుగువేస్తాం.

## చైనా స్వభావం ప్రమాదం

ఈ ప్రమాదం మన ప్రజలను మేల్కొల్పి, ఒకే జాతిగా సమైక్య పరిచింది కాబట్టి, ఇది నిజంగా, 'దైవదత్త' మని, 'మారువేషంలో వచ్చిన మహావరమని' కొందరంటారు. సమయంయొక్క సవాలునందుకొని ఉవ్వెత్తునలేచి, శత్రువును తరిమికొట్టేందుకు దృఢనిశ్చయంతో జాతిమొత్తం ఒకే వ్యక్తిగా నిలబడినమాట నిజమే; ఆ దృఢనిశ్చయాన్ని ఏ విధంగా వ్యక్తంచేయాలో, తమ కర్తవ్యమేమిటో మాత్రం వారికి తెలియదు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో అలవడిన పద్ధతిప్రకారం ఊరేగింపులను, ప్రదర్శనలను జరిపారు; గడ్డిబొమ్మలు తగులబెట్టారు; తీర్మానాలు చేశారు; ఐతే మనం ఈనాడు ఎదుర్కొంటున్న శత్రువు ఇతరులకన్న పూర్తిగా భిన్నమైనవాడని అర్థంచేసుకోవాలి. ఆంగ్లేయులు సాధారణంగా న్యాయసూత్రాలను పాటించే నాగరికసమాజానికి చెందినవారు. చైనీయులుమాత్రం అందుకు పూర్తిగా విభిన్నులు. అతిసామాన్య మానవత్వ

గుణాలైన దయ, దాక్షిణ్యం, మానవజీవితంపట్ల గౌరవాభిమానాలుకూడా వారికి లేవు. నిజానికి నవీన అణ్వాయుధాలన్నిటినీ పూర్తిగా వినియోగిస్తూ, మళ్ళీ ఒక ప్రపంచయుద్ధం వస్తే చూడాలని ఉందని మావ్‌సేటుంగ్ బహిరంగంగా ఒకసారి ప్రకటించాడు. అట్లా జరిగితే అమెరికా, రష్యా దేశాల్లోను, తదితర ఐరోపాదేశాల్లోను అధికసంఖ్యాకులు నాశనమయి పోతారు. ఆ మహాప్రళయంలో 40 కోట్లమంది చైనీయులు నశించిపోయి నప్పటికి, ఇంకా 25 కోట్ల చైనీయులు ఈ ప్రపంచాన్నంతనూ పాలించటానికి మిగిలిఉంటారనేది, అతని ఈ కోర్కెవెనుకనున్న తర్కం. వారి దృష్టిలో అది ఒక అతిసామాన్యతర్కం. మారణహోమంగురించి వారికి పట్టలేదు. వారి దృష్టిలో అది గడ్డినికోసి మళ్ళీ పాతినట్లే! కొరియాలో కలిగిన అనుభవం అటువంటిదే. దండయాత్రచేసినపుడు వారు అలలుఅలలుగా చొచ్చుకవస్తారు. ఒకపటాలం నాశనమయితే దానిస్థానంలో మరొకటి వచ్చేస్తుంది; అంతే.

కాబట్టి నాగరిక సమాజమైన ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అమలు జరిపిన చర్యలను, చైనీయులతో వ్యవహరించవలసినప్పుడు ఉపయోగించటంవల్ల ప్రయోజనంలేదు. వారు నమ్మకద్రోహులు, తుచ్ఛులు అని దూషించీ ప్రయోజనంలేదు. అటువంటి దూషణలు, దెబ్బకుదెబ్బ తీయటం చేతకాని బలహీనుడు ఆత్మసంతృప్తి కోసం శత్రువును శాపనార్థాలు పెట్టినట్లుగానే ఉంటాయి. అటువంటి నీచమైన మనస్తత్వానికి మనం దిగజారకూడదు.

దీనికితోడు ఇంకొకవిషయంకూడా మనం గుర్తుంచుకోవాలి. ఈనాడు చైనామొత్తం ఒకసైనికశిబిరంగా తయారయింది. అక్కడ ప్రతివయోజనుడు ఆయుధశిక్షణపొందాడు. అధునాతనము, శక్తిమంతమునైన ఆయుధ సామగ్రి విషయంలోకూడ వారు మనకంటే మెరుగే. పైగా గత అనేక దశాబ్దాలుగా నెత్తుడు వరదలుగట్టిన యుద్ధపరిస్థితుల్లో పుట్టి పెరిగినవారు, వారి నాయకులు.

అయినప్పటికీ సరియైనపద్ధతిలో, దృఢమైన నిష్ఠతో మన ప్రయత్నాలను మరింత పెంపొందించుకొంటే, ఇటువంటి ప్రతికూలవిషయాలన్నిటినీ మనం అధిగమించగలం.

## ప్రజాసంకల్పం వజ్రసమం కావాలి

యావత్తుజాతి దృఢనిశ్చయంతో సంఘటనాత్మకంగా పనిచేయాలనే సంకల్పశక్తిని వజ్రకఠోరంచేయడం ఈనాటి మొదటి అవసరం. పోరాటం మరింతతీవ్రమై చాలాకాలం కొనసాగేట్లున్నది. మనమందరంకూడ బాధలు పడటానికి, త్యాగాలుచేయటానికి అవసరం ఏర్పడవచ్చు. ఈ కష్టాలన్నీ దృఢనిశ్చయంతోనూ, మంచహనంతోనూ ఎదుర్కొందాం. ఇంతవరకూ మన హృదయాల్లో మరుగునపడిఉన్న మాతృదేశభక్తి ఈనాడు దేదీప్యమానంగా ప్రజ్వరిల్లి, స్వార్థం, పరస్పర ఈర్ష్యాసూయలు అనే అంధకారఛ్ఛాయలను దూరంచేస్తుందనటంలో సందేహం ఏమీలేదు. ఇంతమంది ముందడుగువేసి దేశరక్షణనిధికి ధనాన్ని సమర్పించటం నిజంగా ఎంతో ఉత్సాహజనకంగా ఉంది. ఇంకా అనేకమంది, మరింత ధనాన్ని రక్షణనిధికి ఇస్తారని విశ్వసిస్తున్నాను. దేహదార్ఢ్యం కలిగినవారంతా సైనికులుగా సేవ చేయటానికి సంసిద్ధంకావాలి. ఇట్టి పరీక్షాసమయంలో తల్లులు తమపిల్లలను ఆశీర్వదించి ముందుకు పంపాలి. మహాభారతయుద్ధం ప్రారంభంకాబోయే ముందు పంచపాండవులు తమ తల్లియైన కుంతి ఆశీస్సులుపొందటానికి వెళ్ళితే, ఆమె వారిని ఆశీర్వదించి "మీరంతా యుద్ధభూమికి వెళ్ళండి. క్షత్రియస్త్రీ కుమారులను కనేది అందుకే. ధర్మయుద్ధంలో పాల్గొని మీ పరాక్రమాన్నంతనీ వినియోగించండి" అని చెప్పింది. ఇప్పుడుకూడ ప్రతితల్లి తన కుమారులకు ఇదే విధమైన వీరవచనాలతో వీడ్కోలు చెప్పాలి.

ఆధునిక యుద్ధాలు సంపూర్ణయుద్ధాలు; ఒకదేశసైన్యం మరొకదేశం సైన్యంతో రణరంగంలో చేసే యుద్ధాలుగాదు. జాతిమొత్తం యుద్ధంలో దిగవలసి ఉంటుంది. శాస్త్రజ్ఞులు, పారిశ్రామికులనుండి రైతు, కూలీలవరకు ప్రతిఒక్కరూ దేశకార్యాని కంకితమై, మరింతకష్టించి, మరింతకాలాన్ని వెచ్చించి, స్వార్థప్రయోజనాలనూ, సంకుచిత మతా ప్రయోజనాలనూ, తగాదాలనూ, హక్కులకై కీచులాటలనూ తాత్కాలికంగానైనా ప్రక్కకు పెట్టి కృషి చేయవలసి ఉంటుంది.

## నేతృత్వానికి పరీక్ష

నేటి క్లిష్టపరిస్థితిని చూచి భయపడి, శాంతి సంభాషణలకు దిగజారి పోకుండా ఉండేటువంటి వజ్రతుల్యమైన సంకల్పశక్తిగల నాయకత్వం సమకూరడం రెండవ ముఖ్యావసరం. కాని నేటి మన ప్రముఖ నాయకులు శాంతిభావనపై ఎంతో వ్యామోహపడుతున్నారు. ఈనాడు చైనా ప్రకటించిన యుద్ధవిరమణవార్త విని, వారప్పుడే శాంతి ఎడ వ్యామోహంతో కొట్టుక పోతున్నారు; ఎట్లాగైనాసరే శాంతిని సంపాదించుకోవాలని తహతహలాడు తున్నారు. ఈ తహతహవల్లనే పదిహేనేండ్లనాడు, మన మాతృభూమి ఖండింపబడింది; ఈవిధంగానే మూడవవంతు కాశ్మీరును మనం కోల్పోయాం. ఈనాడు బెరుబరీకూడ మననుండి విడివడి పోబోతున్నది; గతంలో జరిగిన ఇట్టి విషాదఘట్టాల గుణపాఠం నేటి ఈ క్లిష్టసమయంలోనైనా మనకు కనువిప్పు కలిగించాలి.

కాబట్టి ప్రజలకు ఈవిషయము నచ్చచెప్పి, ప్రజాభిప్రాయాన్ని రూపొందించడం ద్వారా దురాక్రమణదారులతో అవమానకరమైన ఏ ఒప్పందాన్ని మన నాయకులు చేసుకోవడానికి అవకాశమివ్వనిరీతిగా ప్రజల సామూహికసంకల్పబలాన్ని మేల్కొల్పటం మన కర్తవ్యం. టిబెట్టు

నుండి శత్రువును తరిమికొట్టకముందే, యుద్ధవిరమణకు అంగీకరించటం రాజ్యతంత్రరీత్యా మహాదోషం. కాశ్మీరులో అంగీకరింపబడిన యుద్ధవిరమణ ఒప్పందంయొక్క గుణపాఠం మన కొక హెచ్చరిక కావాలి. తొందరపడి యుద్ధవిరమణకు అంగీకరిస్తే మన సైనికులయొక్క, ప్రజలయొక్క ఉత్సాహానికి అది వెన్నుపోటవుతుంది. దానివల్ల వారి అత్యద్భుతత్యాగాలన్నీ బూడిదలోపోసిన పన్నీరవుతాయి. నేటి మన నాయకులు తగినంత ఉధృత స్థాయిలో జాతీయసమరాన్ని నిర్వహించలేకపోతే, శక్తిసామర్థ్యాలు కలవారికి అవకాశమిచ్చి తాము ప్రక్కకు తప్పుకోవాలి. తెలివి తేటలు, శక్తి సామర్థ్యాలు ఏ కొద్దిమందిసొత్తూ కాదు. నేడు కొందరు వ్యక్తుల అధికారం, పేరు ప్రఖ్యాతులు ఎంతటివైనా అమరవీరపరంపరను ప్రసవించిన భారతదేశంలో పరాక్రమవంతులు,సమర్థులు అయిన నాయకులకు ఏనాడూ కొరతలేదు.

వెనుకడుగు వేయటంగాని, ప్రయత్నాలను బలహీనపరచటంగాని, మనం సహించలేం. మన భూమిపై పీఠంవేసుకొని కూర్చొనిస్తే చైనా నిల ద్రొక్కుకొని, ఊపిరి పీల్చుకొని, మరింత దురాక్రమణకు అవకాశం లభించింది గదా అని ఎగిరి గంతేస్తుంది. అట్టి అవకాశం చైనాకు కల్పించకూడదు. దానివల్ల మన జాతీయభద్రత శాశ్వతంగా ప్రమాదంలో పడుతుంది. అందుచేత, సువిశాలమైన మన మాతృభూమియొక్క సార్వభౌమత్వానికి, గౌరవానికి తగినట్లుగా పరాక్రమంలో ప్రవర్తించే ధైర్యాన్ని, హెచ్చరికను వారికి ఇవ్వాలి. మన నాయకులు, ఈ క్లిష్టసమయంలో తప్పటడుగు వేయకుండా చూచుకొనవలసిన కర్తవ్యం మనందరిమీాద ఉంది.

## శత్రువుల పన్నాగాలపట్ల సావధానత కావాలి

చైనీయులు ప్రకటించిన యుద్ధవిరమణవార్తవల్ల మన ప్రజల్లో కలిగిన విస్మృతి దృష్ట్యా ఇట్టి జాగ్రత్త మరింత అవసరమవుతుంది. అంతా

సురక్షితంగానే ఉందనే మిథ్యాభావనలో మనలను జోకొట్టటానికి, మన ఉత్సాహాన్ని దెబ్బతీయటానికి, మన యుద్ధసన్నాహాలను మందగింప చేయటానికి, ఆ తర్వాత మనం అగ్రత్తగా ఉండటం చూచుకొని మరింత శక్తితో మనపై మరొక దెబ్బతీసి, దేశం మొత్తాన్ని స్వాధీనం చేసుకోవటానికి-మన శత్రువులు పన్నిన ఎత్తుగడయే ఈ యుద్ధవిరమణ ప్రకటన.

ప్రజల మనోధైర్యంపై విపరీతపరిణామాలను కలిగించే మరొక విషయమున్నది. రక్షణ ప్రయత్నంక్రింద ఇంతవరకూ మనం చేస్తున్నది నిధులను సేకరించడం మాత్రమే. మొదట్లో ప్రజలు తమంతటతామే ఉత్సాహంగా ధనం సమర్పించారు. అది సముచితమైనదే. ప్రజల్లో జాగృతమైన దేశభక్తిభావనకు ధనసేకరణ ఒక ప్రతీక. తరువాత ప్రభుత్వమే ధనాన్ని వసూలుచేసే బాధ్యతను స్వీకరించింది. ప్రజల ఉత్సాహపు తొలిఊపు క్రమంగా తరిగిపోతున్నది. ప్రజలనుండి ధనాన్ని సేకరించేందుకు ప్రభుత్వయంత్రాంగం పలురకాల ఒత్తిడులు తెస్తోందనీ, నిర్దుష్టము, విశ్వసనీయమునైన వార్తలు దేశమంతటా వినవస్తున్నాయి. అది బలవంతంగా డబ్బును పిండటమే అవుతుంది. ప్రభుత్వమే అటువంటి ఒత్తిడులను కల్పించటానికి సిద్ధమయినపుడు ప్రజలు 'మన కిటువంటి భయోత్పాతం కలుగుతున్నప్పుడు స్వపరిపాలనకు పరపరిపాలనకు తేడా ఏముంది' అని మనస్సుల్లో బాధపడే అవకాశముంది. ఇది ప్రజల్లోని స్వయంస్ఫూర్తిని భగ్నంచేసి, వారియొక్క మనోధైర్యాన్ని వికలం చేస్తుంది.

## పొదుపుచేయండి – అదే తారకమంత్రం

మనయొక్క ఆర్థికమైన వనరులను సమీకరించడమే ముఖ్యమని ఃజంగా భావించినట్లయితే, హితప్రదమైన అనేక ఇతరమార్గాలు అందుబాటులో ఉన్నాయి. ఈనాడు 'అత్యవసరపరిస్థితి' ఏర్పడినట్లు

ప్రకటించారు కాబట్టి ప్రాంతీయ శాసనసభలను తాత్కాలికంగా రద్దుచేయటం ప్రథమ కర్తవ్యం. ఆ పనివల్ల ప్రతిసంవత్సరం కోట్లరూపాయలు పొదుపు అవుతుంది. ప్రజాస్వామ్య అవసరాలను ప్రజలే ఎన్నుకొన్న పార్లమెంటు తీర్చగలదు. మద్యపాననిషేధాన్ని తొలగించటం రెండవచర్య. అంటే మద్యపానదోషాలను తక్కువగా అంచనావేయటంకాదు. మద్యపాన పిశాచాన్ని నిలువునా పాతిపెట్టితీరాలనే విషయంలో భిన్నాభిప్రాయాలకు తావులేదు. ఐతే ఈనాడు అమలులోఉన్న మద్యపాననిషేధవిధానం మున్నెన్నడూ చూచియెరుగని ప్రమాదకరమైన అనేక సామాజిక దురా చారాలను సృష్టిస్తున్నది. త్రాగుడుకలవాటుపడినవారు త్రాగుతూనే ఉన్నారు. కాని అనేక దొంగమార్గాల్లో అది వారికి లభిస్తున్నది. దానివల్ల దొంగ వ్యాపారంచేసే అనేకమంది వ్యక్తులు, స్వలాభాలను పెంపొందించుకొనే లంచగొండులైన అనేకమంది ఉద్యోగులు తయారవుతున్నారు. ఇటువంటి స్వలాభపరులే, నిజానికి మద్యపాననిషేధాన్ని కొనసాగించాలని కోరు కుంటున్నారు. ఇది ప్రజల్లోని నైతికతను దెబ్బతీస్తున్నది. ఇట్టి 'మద్యపాన నిషేధాన్ని ఎత్తివేయండి' అనడానికి ఇట్టి నైతికదృష్టియే కారణం. త్రాగుడువల్ల కలిగే దోషాన్ని క్రమంగా, సరియైన విద్యాబోధనద్వారాను, సముచిత వినోదాలవల్లను తొలగింపవచ్చును; చట్టాలవల్ల ఆ దోషం పోదు. ఈచర్యకూడ ప్రభుత్వానికి మంచి ఆదాయాన్ని సమకూర్చిపెడుతుంది.

ఈనాటి అత్యవసరపరిస్థితిని తట్టుకొని నిలిచేందుకు అవసరమైన అనేక సాధనాలను, వనరులను ఎక్కువ పొదుపరితనంవల్ల మాత్రమే సమకూర్చుకోవచ్చు. కాని దురదృష్టవశాత్తు పొదుపరితనమనేది ఈనాడు మనదేశంలో బాధ్యత వహిస్తున్న వ్యక్తుల్లో బొత్తిగా లేదు. అయినా పొదుపుచేయండని సామాన్యప్రజలకుమాత్రం సలహా ఇస్తూఉంటారు. స్వయంగా వారు చేస్తున్న దుబారాఖర్చును చూస్తే, అసలు మన దేశానికొక తీవ్రమైన ప్రమాదం ఎదురైనట్టు వారు గుర్తించలేదని ఎవరికైనా

అనిపిస్తుంది. తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవడం, అంతఃకలహాల్లో మునిగిపోవటం, తమకనిష్టులైన సహచరులను ఏరివేయడం-ఇంకా ఇటువంటి అతిస్వల్పవిషయాల్లో తలమునకలై పోతున్న పెద్దలకు శత్రుదుర్భేద్యమైన రక్షణశక్తిని నిర్మించేటువంటి ప్రముఖవిషయాలపై మనస్సు లగ్నం చేయడానికి తీరికలేకుండా ఉంది.

## విమర్శను స్వాగతించండి

ఈ విషయాలన్నీ మనం చెపుతుంటే, క్లిష్టసమయంలో విమర్శలు చేయవద్దని మన మహానాయకులు హెచ్చరిస్తూ ఉంటారు. నిజాయితీతో, దేశభక్తితో చేసిన విమర్శ అంటే వారెందుకు ముఖం ముడుచుకొంటున్నారో మనకర్థంకాదు. వాళ్లుచేసే ప్రతిపనినీ నూటికినూరుపాళ్లు మనం ఆమోదించాలని వాళ్లాశిస్తున్నారా? అట్టిపొగడ్త దేశప్రయోజనాలకు దోహదం చేస్తుందా? తమ విధానాల్లోను, ఆచరణలోనూ నిజంగా వారు సవ్యంగా ప్రవర్తిస్తే ఇతరులు వారిని విమర్శించేందుకు అవకాశమే లభించదు. అట్లాగాక వాళ్లు నిజంగా పొరపాటునే చేస్తే, వాళ్ళను విమర్శించి, సరిచేయడం మన బాధ్యత. వారుకూడా ప్రజాభిప్రాయాన్ని శ్రద్ధగా ఆలకించాలి. వినయపూర్వకంగా దాన్ని గౌరవించి, పాటించాలి. విమర్శంటేనే మన నాయకులు కంపరమెత్తి పోతున్నారంటే, దానిఅర్థం విమర్శించటానికి వాళ్ళ విషయంలో చాలా అవకాశం ఉందన్నమాట!

నిజాయితీతోకూడిన విమర్శను అణచిపెట్టటం, ప్రజలనోళ్లునొక్కి వేయడమే అవుతుంది. అది హిట్లర్, స్టాలిన్‌లయొక్క నిరంకుశప్రభుత్వాన్ని జ్ఞప్తికి తెస్తూఉంటుంది. అట్టి నిరంకుశపరిపాలనల ఆయుర్దాయం తక్కువనీ, వారు వైదొలగగానే చరిత్ర వారిని క్షమించలేదనీ, ప్రపంచం వారిని దుయ్యబట్టిందనీ మనం మరువరాదు. మరొక విషయం ఉంది. వ్యక్తుల అధికారం, హోదా పెరుగుతూఉంటే పదిమంది కళ్ళు వాళ్ళమీదే ఉంటాయి.

వాళ్ళలో ఏ చిన్నలోపమున్నా, ఏ చిన్న పొరపాటు జరిగినా దాన్ని విమర్శిస్తారు. ఇంగ్లండునుండి మననాయకులు ఒకగుణపాఠాన్ని గ్రహించాలి. అది రెండు ప్రపంచయుద్ధాలను ఎదుర్కొన్నప్పుడుకూడ ప్రజలనోళ్ళను కట్టివేసే పనేదీ చేయలేదు; పౌరహక్కులకు భంగం వాటిల్లనివ్వలేదు.

మన దేశవ్యవహారాల మంత్రిమహాశయుడు ఈ మధ్యనే రాజకీయ పక్షాలను గురించి ప్రసంగించాడు; తర్వాత పండితనెహ్రూను, ప్రభుత్వాన్ని విమర్శించేవారందరినీ దేశద్రోహులుగా పరిగణించాలని కాంగ్రెసుసంస్థ ఒక రహస్యపత్రాన్ని పంపింది. దానికి నిరసనగా ఆచార్యరంగా వ్రాసిన లేఖకు పండితనెహ్రూ సమాధానమిస్తూ పదజాలం అనుచితంగా ఉందని అన్నారు. పదజాలం 'అనుచితంగా' ఉందన్నారేకాని, 'అసత్యమ'ని అనకపోవటం గమనించండి. దేశంలో సమైక్య ప్రజాసంకల్ప శక్తిని నిర్మించే పద్ధతి ఇదేనా? ప్రజల్లో విభేదాలను సృష్టించటానికి – అంటే కాంగ్రెసు ఒక ప్రక్క, మిగిలినవాళ్ళందరూ ఒకప్రక్క చేరేందుకు ఇది దోహదం చేయదా? అయితే ఇతరులెవ్వరూ విమర్శించరాదనీ, కలసికట్టుగా అందరూ సమైక్యతకొరకు పాటుపడాలనీ మాత్రం వారు ప్రబోధిస్తుంటారు! ఇతర రాజకీయపక్షాలన్నిటినీ గట్టిగా అదుపులో ఉంచాలనీ, లేకుంటే అవన్నీ ప్రజల్లో తమ పలుకుబడిని పెంచుకొనవచ్చుననీ, అది జరిగితే రాబోయే ఎన్నికల్లో కాంగ్రెసు గెలవడం కష్టం కావచ్చుననీ, ఈ మధ్యనే ఒక ప్రముఖ కాంగ్రెసునాయకుడు చెప్పాడు. ఈ మాటలు విని సహించలేని ఒక స్థానిక కాంగ్రెసువాది బహిరంగంగా ఎదురుతిరిగి "చైనావాళ్ళువస్తే ఎన్నికలు ఎక్కడ ఉంటాయి?" అని అంటించాడు.

అధికారంలోఉన్న వ్యక్తులు ప్రజాస్వామ్యవిరుద్ధమైన ఇట్టి మాటలను కట్టిపెట్టాలి. యుద్ధాన్ని నిర్వహిస్తున్న నాయకత్వానికి ఇది తగదు. ఒక రాజకీయపక్షానికి మాత్రమే నాయకులమనిగాక, సమాజాని కంతకూ నాయకులమని వారు భావించాలి. మనందరకూ ఏకైకశత్రువు

చైనాయే అని మనమంతా గుర్తుంచుకోవాలి. పరస్పర విద్వేష, సంశయ విరోధాలకు దిగజారటం మనకు తగదని గుర్తించాలి. ప్రజల మనోధైర్యాన్ని పెంపొందించే విషయాలన్నిటిలోనూ, మన నాయకులు ఆదర్శప్రాయులుగా వ్యవహరిస్తారని ఆశిద్దాం.

## వ్యక్తిపూజలోని ప్రమాదం

మోమోటమిలేని స్నేహభావంతో మన ప్రధానమంత్రిమహోదయునికి చేసిన హెచ్చరికలను ఆయనపట్ల ఆదరాభిమానాలు లేకపోవడంగా కొందరు పొరపడుచున్నారు; పూర్తిగా పొరపడుతున్నారు. గౌరవం అంటే పొగడ్తయే అని భావిస్తున్నట్లున్నారు. మనం ప్రధానమంత్రిని గౌరవిస్తాం; ఒక ప్రపంచ ప్రఖ్యాతవ్యక్తిగా ఆదరిస్తాం; కాని ఊరికే పొగడడం, పొరపాటుల కతీతుడుగా అంగీకరించడం మాత్రం చేయలేం. ఆవిధంగా భావించడం వారికికూడ మంచిదికాదు. సామ్యవాదులు మొదలగువారు నెహ్రూపండితుని చేతులకు బలం చేకూర్చాలని గొంతులు చించుక అరుస్తారు. వారిని పొగడి, తద్వారా తమయొక్క స్వార్థప్రయోజనాలను సాధించుకోవటానికి వారు ఇదంతా చేస్తున్నారని తెలిసిందే. నెహ్రూ హృదయాన్ని బలపరుద్దామని మనమంటాం. అది మనం చేస్తే దానితోబాటే వారి చేతులనుగూడ బలపరచి నట్లు అవుతుంది.

'వ్యక్తిపూజ' మన సంస్కృతికి, సంప్రదాయానికి వ్యతిరేకమైనది మాత్రమేకాదు, జాతీయ ప్రయోజనాలకుగూడ అది అంతులేనినష్టం కల్గిస్తుంది. మూడవ పానిపట్టుయుద్ధం జరుగుతూఉండగా, హిందూసైన్యాల ప్రధాననాయకుడైన సదాశివరావుభవు ఏనుగుమీదనుండి గుఱ్ఱంమీదకు మారాడు. అతడు కనపడకపోయేసరికి అతడు మరణించాడేమో అనుకొని మనోధైర్యం కోల్పోయి సైనికులు చెల్లాచెదరైపోయారు. సదాశివరావు యొక్క వ్యక్తిత్వమొక్కటే సైన్యానికంతటికి స్ఫూర్తిని, మార్గదర్శనాన్ని

చేసేదికావడం దానికి ముఖ్యకారణం. మరి శివాజీ అనంతరం ఇరువదిఏండ్ల దాకా మహారాష్ట్రప్రాంతంలో చెప్పుకోదగ్గ నాయకుడు లేడు. శంభాజీ పట్టుబడ్డాడు; నానాహింసలూ పెట్టి అతణ్ణి చంపారు. సాహూ మొగలుల నిర్బంధంలో ఉండిపోయాడు; రాజారాం జింజీ కోటలో చిక్కుకొని బాహ్య ప్రపంచంతో సంబంధాలు కోల్పోయాడు. ఐనప్పటికి తమలో స్వరాజ్య భావన మూర్తీభవించినట్లు, శివాజీ తమ్మావేశించినట్లు ప్రతిఒక్కరు యుద్ధం కొనసాగించారు. నిజానికి యిరవై ఏండ్లు పోరాడిన తర్వాత, ఔరంగజేబు ఓడిపోయి, నిస్పృహతో, భగ్నహృదయుడై మరణించాడు. వ్యక్తిపూజకు, ఒక ఆదర్శాని కంకితం కావడానికి పోలిక లేనేలేదు; అదొక లోకం; ఇదొక లోకం.

## ఎఱ్ఱ ఉచ్చు

అంతరంగికంగా ఎదురయ్యే ప్రమాదంపట్ల మనం చాలా జాగరూకతతో మెలగటం మూడవచర్య. మన మధ్యనే నివసిస్తూ చైనా దురాక్రమణకు స్వాగతంపలికేవారు చాలామంది ఉన్నారని మనకు తెలుసు. వాళ్ళకు చైనీయులు పితృదేవతలు; చైనాసైన్యాలు విముక్తిసైన్యాలు. వాళ్ళలోని కొందరు ప్రముఖనాయకులు అసలు భారతదేశమే దురాక్రమణకారి, చైనా కాదు అని బహిరంగంగా ప్రకటించారు. ఇక్కడ ధర్మరాజ్యాన్ని స్థాపించేందుకై శ్రీకృష్ణభగవానుడే చౌఎన్‌లై రూపంలో అవతరించాడనే విష ప్రచారాన్ని చాలా తీవ్రంగా, ఈనాటికిగూడ సరిహద్దుప్రాంతాల్లో సామ్యవాదులు కొనసాగిస్తున్నారు. వారక్కడ ప్రజలనుండి ధనం వసూలుచేసి, తామిచ్చిన రసీదులను జాగ్రత్తగా దాచిఉంచి, చైనీయులు వచ్చినపుడు చూపెడితే వాళ్ళను మిత్రులుగా పరిగణిస్తారనిగూడ ప్రచారం చేస్తున్నారు. అట్టి ఒక రాజకీయపక్షం నూటికి నూరుపాళ్ళు దేశభక్తియుతమైన పక్షమని, మన ప్రధానమంత్రి స్పష్టమయిన ఒక ప్రశంసాపత్రాన్నిచ్చారు !

అస్సాములో సామ్యవాదులు విద్రోహం తలపెట్టారని వార్తవచ్చింది. దేశంలోని ఇతర ప్రాంతాల్లోకూడ వాళ్లు ఆ దేపని చేయవచ్చు. అట్టివారిపై గట్టి

నిఘాకాని, అదుపుగాని ఏమీలేకపోవటం ఆశ్చర్యం. అంతేగాదు, మన ప్రభుత్వము, ప్రజలుకూడ వారి పన్నాగంలో చిక్కుకున్నా రనిపిస్తోంది. చైనా అనుకూలవర్గమని, రష్యా అనుకూలవర్గమని, సామ్యవాదపక్షం రెండుగా చీలిపోయిందని, (భారత్ అనుకూలవర్గం ఏదీ లేకపోవడం గమనార్హం) అవి ఒకదానికొకటి చుక్కెదురు అని అంటున్నారు. సామ్యవాద కార్యపద్ధతినిగూర్చి ఏ కొంచెం తెలిసినవాళ్లైనాసరే ఈ మోసాన్ని నమ్మరు. ఈ చీలిక అనబడేది ప్రజలను దగాచేసేందుకు వేసిన జిత్తుమాత్రమే. వారి పథకం ప్రకారం ఒకవర్గం ప్రధానమంత్రిని. ఆయన విధానాలనూ ప్రశంసిస్తూ తద్వారా సామాన్యప్రజల విశ్వాసాన్ని పొందాలి. రెండవవర్గం, దేశం మొత్తంలో .. ముఖ్యంగా అస్సాం, బెంగాల్ ప్రాంతాల్లో – కొద్దినెలల్లో విప్లవం రెచ్చగొట్టి, పరిపాలనాయంత్రాంగాన్ని భగ్నంచేసి, దేశంమొత్తం చైనీయుల ఆధీనంలోకి సులువుగా వచ్చేట్లు చేయడంకోసం రహస్యంగా ఆయుధాలను సేకరిస్తూ, వృకయుద్ధపద్ధతిలో (గెరిల్లా) శిక్షణపొందుతూ ఉండాలి; నిజానికి వృకయుద్ధపద్ధతి శిక్షణ పొందుతున్నారుకూడ.

## చైనా చిక్కు ప్రశ్న

ఊహించని రీతిగా అకస్మాత్తుగా చైనా యుద్ధవిరమణ చేయడంలో గల కీలకం గూడ దీనివల్ల తెలుస్తుంది. తాము విజయం పొందినతర్వాతనే చైనీయులు ఈ యుద్ధవిరమణప్రకటనచేసి ప్రపంచాన్నంతనూ ఆశ్చర్యచకితం చేశారు. విజేత తనంతతానుగా యుద్ధాన్ని విరమించి, శాంతికోసం ఉదాత్త ప్రయత్నం ఆరంభించడం నిజానికి ఆశ్చర్యకరమైన విషయం. ఈ ఇంద్రజాలాన్ని వివరించేందుకు ఎన్నోవిధాల ప్రయత్నించారు. అంతఃకలహాలకై ఆరాటపడే ఈ ప్రజలు ఇంకా కలహించుకొంటూనే ఉంటారనీ, అది అవకాశంగాతీసుకొని ఈదేశాన్ని తేలికగా జయించగలమనీ, చైనీయులు అనుకున్నారు. కాని యావత్తుదేశం దురాక్రమణకారుణ్ణి నెట్టిపారవేయటానికి ఒక్కమనిషిగా లేచి నిలబడటం వాళ్ళకు ఆశ్చర్యం

కల్గించింది. వాళ్ళు దీన్ని ఊహించనైనాలేదు. కనుకనే తమదాడిని విరమించుకున్నారు, ఇది ఒక ఊహ.

శస్త్రాస్త్రాలు, తదితర సైనిక సాహాయ్యం అమెరికానుండి, ఇతర మిత్రదేశాలనుండి, ఇంత తక్కువ వ్యవధిలో భారత్‌కు అందగలవని చైనా అనుకోలేదు. నిజానికి అమెరికా ఎంతో నేర్పుతో, తక్షణమే మనకు సాహాయ్యం అందించింది. దాన్ని ఎంతగానో అభినందించాలి. ఇది కూడ చైనీయులను దిగ్భ్రాంతులను చేసింది; అడుగు ముందుకు వేస్తే, వెన్ను విరుగుతుంది అని భయపడి వెనుకాడారు. ఇది రెండవ ఊహ.

తమ భూభాగమని తాము అనుకొన్నంతమేరకు తమ హక్కును స్థాపించుకొనేందుకు మాత్రమే చైనీయులు దండెత్తివచ్చారు. వారు మెక్‌మెహన్ రేఖను అంగీకరించలేదు. నిజమైన సరిహద్దురేఖ ఇంకా దక్షిణాన ఎక్కడో ఉంది. నిజమైన సరిహద్దుగా తాము భావించిన భూభాగంవరకు మాత్రమే వారు చొచ్చుకువచ్చారు. ఒకవిధంగా తమ హక్కును తాము నిరూపించుకుని, వాళ్ళు వెనక్కి వెళ్ళిపోయారు. ఇది, చైనా రష్యాలు ఏంచేస్తే అది ఘనకార్యం అనే వందిమాగధుల వాదం ఇది మూడవది. ఇది చైనాకు లేనిపోని ఘనత ఆపాదించటమే.

## పెద్దకుట్ర

ఏది ఏమైనప్పటికి ఒక విషయం మరచిపోరాదు. సరిగ్గా చైనీయుల దురాక్రమణ సమయానికే బెంగాల్లో విప్లవం రెచ్చకొట్టటానికి సామ్యవాద పక్షం ఒక పథకం వేసింది. కల్లోలాలను రేపి, పరిపాలనను భగ్నంచేస్తే, అస్తవ్యస్తత ఏర్పడుతుంది; అది వినియోగించుకొని హిమాలయాల నుండి కలకత్తావరకు చైనీయులు త్రిష్ఠవేయగలుగుతారు అని దాని ఉద్దేశం.

ఎందుకోగాని ఆ పాచిక పారలేదు. సామ్యవాదులు సంసిద్ధంగాలేకనో, వేళకు గుండెలు దడదడలాడటంవల్లనో, లేక బహుశః ప్రజలు జాగరూకులై వ్యతిరేకించటంచేతనోగాని వారు తమ పథకాన్ని అమలుచేయ సాహసించ లేదు. కారణమేదైనప్పటికి దురాక్రమణ చేస్తున్న చైనాబలాలు తాము ఆశించినమేరకు చెయ్యలేక, ఊరుకున్నాయన్నమాట మాత్రం నిజం. తమ పథకం విఫలమైంది కాబట్టి మరొక అనుకూలమైన గడియకోసం వేచి చూడటం అవసరమని చైనీయులు భావించారు. కనుకనే వారు తాత్కాలికంగా దురాక్రమణ విరమించుకొన్నారు. నేడు ఇక్కడి సామ్యవాదుల పథకాలను, చైనీయుల ఉద్దేశ్యాలను జోడించి పరిశీలిస్తే, చైనా అమలుపరచిన యుద్ధ విరమణ అనే ప్రశాంతతమాటున లోలోన రాజుకొంటున్న అగ్నిపర్వతం వంటి ప్రమాదంయొక్క తీవ్రత చాలవరకు స్పష్టంగా గోచరిస్తోంది.

## ఆకుపచ్చ ప్రమాదం

దేశమంతటా వివిధకీలకస్థానాల్లో పాతుకుపోయి ఉన్న, శక్తిమంతమైన పాకిస్తానీ పంచమాంగదళం, మన ఆంతరంగిక వ్యవస్థలో దాగిఉన్న మరొక ప్రమాదం. సరిహద్దు ప్రాంతాల్లోని ముస్లిములకు రకరకాల మారణాయుధాలు పంపిణీ అవుతున్నాయి. విప్లవాన్ని రెచ్చగొట్టటానికి ఇది మంచి సమయం; నాయకులు మరొక భూభాగాన్ని ధారాదత్తంచేయక ఏంచేస్తారు అని బహుశః వారు భావించిఉండవచ్చు. నిజానికి, నేఫాలో మన సైనికస్థావరాన్ని ఒక్కొక్కదాన్నే చైనా హస్తగతం చేసుకుంటూ ఉంటే, ఈ పాకిస్తానీశక్తులన్నీ ఎంతో ఆనందించాయి. 'మీకు తగినశాస్తి జరిగింది' అని అంటూండేవారు! చైనా, పాకిస్తానులు ఈమధ్య తోడు దొంగలు కావటంవల్ల, వారికి మరింతధైర్యం వచ్చింది. ప్రజలేగాక, ప్రభుత్వోద్యోగులుకూడ తేజపూర్‌ను, తదితర ప్రదేశాలను ఖాళీచేసి సురక్షిత ప్రాంతాలకు చేరుతుంటే అక్కడి ముస్లిములుమాత్రం చైనా, పాకిస్తానుల మధ్య అస్సాముని పంచుకొనేందుకు ఒక ఒప్పందం కుదిరిందనీ, దాని

ప్రకారం అస్సాములోని ఉత్తరభాగం చైనాకు, దక్షిణభాగం పాకిస్తానుకు చెందుతుందనీ, కనుక తమకు భయంలేదనీ, తాము సురక్షితంగానే ఉన్నామనీ చెప్పినారు; 1946-47 నాటి చిందులు త్రొక్కారు. వాళ్ళు 'పాకిస్తాన్ జిందాబాద్' అని, 'హస్ కే లియా పాకిస్తాన్, లడకే లేంగే హిందుస్తాన్' (నవ్వుతూ నవ్వుతూ పాకిస్తాన్ సాధించుకొన్నాం. పోరాడి హిందుస్థాన్ గెలుచుకుంటాం) అని నినాదాలు చేశారు. హిందువులు ఖాళీ చేసివచ్చిన ఇళ్ళను, దుకాణాలను దోచుకొని ధ్వంసం చేశారు. కాబట్టి ఇటువంటి పంచమాంగదళాలను ముందుగానే అదుపులో ఉంచవలసిన బాధ్యత ప్రజలందరిది; ముఖ్యంగా సద్బుద్ధిగల ముస్లిములది. మన రక్షణ సన్నాహాలకు అత్యంతావశ్యకమైనది ఆంతరంగిక శాంతి భద్రతలు. వాటిని భంగపరిచే అవకాశం వాళ్ళకు కలుగనీయరాదు.

అటువంటి విద్రోహకర వర్గాలను శత్రువులే అనుకొని, దృఢ హస్తంతో అణచివేయటం ఒక్కటే వారితో వ్యవహరించవలసినతీరు. మహాభారతంలోని ఉదంతం ఒకటి ఈ విషయంలో చక్కని సందేశం ఇస్తుంది. తన తండ్రిని చంపిన తక్షకునిపై పగతీర్చుకునేందుకు జనమేజయుడు సర్పయాగం చేస్తున్నప్పుడు, ఆ తక్షకుడు పారిపోయి ఇంద్రుణ్ణి శరణువేడాడు. అపుడు జనమేజయుడు ఆతక్షకునితోబాటు ఇంద్రుణ్ణి కూడ సర్వభక్షకుడైన అగ్నికి ఆహుతిచేయటానికి 'సేంద్రాయ తక్షకాయ స్వాహా' అన్నాడు.

మోమోటమిలేని ఇటువంటి చర్యమాత్రమే శత్రువుయొక్క ప్రచ్ఛన్న ప్రతినిధులను, వారిమిత్రులను భయకంపితులను చేసి వాళ్ళనుకూడ విశ్వసనీయులైన పౌరులుగా మారుస్తుంది.

## ఎరవేసినకొలదీ కోరిక పదునెక్కుతుంది

మన ఇరుగుపొరుగు దేశాలతో సంబంధాలు ఎట్లాఉండాలో ఈనాడు మరింత ముఖ్యంగా ఆలోచించుకోవాలి. ఇక్కడ మనమొక విషయంపట్ల

మెలకువతో ఉండాలి. మనమిటువంటి క్లిష్టపరిస్థితుల్లో ఉన్నప్పుడు మన పొరుగునఉన్న పాకిస్తాన్-ద్వేషంలోంచి, రక్తపాతంలోంచి జనించింది అని పండితనెహ్రూ అన్నారు-మనల్ని బెదిరించే అవకాశముంది. దాన్ని బుజ్జగించే ఉద్దేశ్యంతో మన నాయకులు మరింత భూభాగానికి నీళ్లొదులుకోవటానికి, కాశ్మీర్ విషయంలో రాజీపడటానికికూడా అవకాశం ఉంది. ఏవిధంగా అయినాసరే, అవసరమైతే చివరకు కాశ్మీరును ధారాదత్తం చేయటంద్వారా నైనాసరే, పాకిస్తాన్‌తో శాంతిసంబంధాలు ఏర్పడాలనీ, ఆ విధంగానైనా మన మిర్వురం కలిసికట్టుగా చైనాను ఎదుర్కొనాలనీ రాజాజీ, జయప్రకాష్ నారాయణలు ప్రచారంకూడ చేశారు. ఐతే అది సమస్యను పరిష్కరించగలదా? ఆ వర్గాలయొక్క గతచరిత్ర ఏమి చెప్పుతోంది? వారి హృదయాలను ఆకట్టుకోవటానికి ఎన్నో ప్రయోగాలు జరిగాయి. వారి వెన్నుతట్టి అనేక సదుపాయాలను కల్పించాం; చివరకు మన మాతృభూమిలోని భాగాలనుకూడ ధారాదత్తంచేశాం. అప్పటికికూడా వారుసంతృప్తిచెందలేదు. వారు కాశ్మీరుపై దాడిచేశారు. వారిని సంతృప్తిపరిచే నిమిత్తమై మూడవవంతు కాశ్మీరును వారికే ఇచ్చివేశాం; మనవ్యయంతో నిర్మింపబడిన కాలువలను, నీటినిగూడ వారికి ఇచ్చాం; వీటన్నిటికిమించి, దాదాపు ఎనభైయెదుకోట్ల రూపాయలను కూడ వారికి అర్పించుకొన్నాం.

వీటికి ప్రతిఫలంగా వారు మనకిచ్చిందేమిటి ? విభజన సమయంలో జరిగిన ఒప్పందాల ప్రకారం హిందువులు ఆ భూభాగంలో విడిచివచ్చిన స్థిరాస్తులకు నష్టపరిహారం ఇవ్వవలసి ఉంది. ఆ ఆస్తుల విలువ కొన్నివందల కోట్ల రూపాయలుంటుంది. కాని ఈనాటివరకు మనకు ఆదాపతు సొమ్ము ఒక్కపైసఐనా ముట్టలేదు. వారడిగిన ప్రతిదాన్ని మనంఇస్తూనేఉన్నాం. కాని వారినుంచి ఏ ఒక్కటైనా పొందగలిగామా ? వారికి దానంమీద దానం చేసి ఇంక ఊరుకొమ్మంటే వారు ఆగుతారా ? ఇప్పుడు మనం కాశ్మీరు ఇచ్చేస్తే, తర్వాత అస్సామును ఆపైన బెంగాలునుకూడ వారడుగవచ్చు. మనం

ఇచ్చినకొద్ది వారి దాహం పెరుగుతూనే ఉంటుంది. కాబట్టి ఈ వ్యవహారం 'మాయింటికి వచ్చినప్పుడు ఏంతెస్తావ్ ? మీయింటికి వచ్చినప్పుడు ఏం పెడతావ్ ?' అనే పద్ధతి కారాదు. అట్టిపద్ధతి కొనసాగరాదు. 'భారత్ పాకీస్తాన్‌లు రెంటికి చైనా సమానప్రమాదమే; ఈ పోరాటంలో చైనా గెలిస్తే, మన ఇద్దరిలో ఏ ఒక్కరమూ మిగులం కాబట్టి, ఇద్దరికీ కూడా శత్రువే అయిన చైనాను కలిసి ఎదుర్కొందాం' అనేమాటను వివరించి చెప్పటమొక్కటే పాకిస్తాన్‌తో మన సంబంధాలకు ప్రాతిపదిక కావాలి. మనం వారిని సంతుష్టిపరచనారంభిస్తే ఇంక దాని కంతముండదు.

## మిత్రులెవరో గుర్తించాలి

ఇంక పాశ్చాత్యదేశాలతో మన సంబంధాలను గురించి ఆలోచించుకోవాలి. అలీనవిధానంలో వాస్తవానికి ఏ విధమైన దోషం లేదు. కాని ఈ విషయంలో చేస్తున్న పొరబాటేమిటంటే మనం నిర్దుష్టంగా అలీనవిధానాన్ని పాటించటంలేదు; సామ్యవాదకూటమివైపుకు మొగ్గు చూపుతున్నాం. సూయజ్ సమస్యలో ఇంగ్లండు, ఫ్రాన్సులు ఈజిప్టు నెదుర్కొన్నప్పుడు అతితీవ్రమైన పదజాలంతో వాళ్ళను మనమే అందరికన్న ముందుగా దుయ్యబట్టాం. కాని చైనా, టిబెట్‌ను కత్తికెరజేసినప్పుడు, కనీసం పల్లెత్తుమాట అనలేకపోయాం. మళ్ళీ రష్యా శతఘ్ని శకటాలు హంగెరీపైకి విజృంభించి, దాని స్వాతంత్ర్యవిప్లవాన్ని అణగద్రొక్కుతూంటే మనం రష్యాను సమర్థించటానికికూడా యత్నించాము. మనం నిజంగా తటస్థంగా ఉంటూ, ప్రజాస్వామ్యంపట్ల మనకు ఉన్న శ్రద్ధను చూపి ఉన్నట్లయితే, పాశ్చాత్యదేశాలు మనలను ఒక నమ్మదగిన మిత్రునివలె భావించి ఉండేవి. ఏమైనప్పటికీ, మనం ఇబ్బందిలో చిక్కుకొని ఉన్నప్పుడు, వారిని అర్థించాం; మనకు సహాయం చేయటానికి వారు పరుగున వచ్చారు. మనపట్ల తన స్నేహంగురించి, పెద్ద పెద్ద ప్రవచనాలు చెప్పే రష్యా, ప్రాత ఒప్పందం ప్రకారం ఎప్పుడో పంపించవలసిన నాలుగు

మిగ్ విమానాలను, క్లిష్టగడియలు దాటిపోయినతర్వాత ఎన్నో నెలలకు పంపించింది. మరో విచిత్రమేమిటంటే ఆ విమానాలు ఆకాశమార్గానకాక ఓడలపై వచ్చాయి. ఈనాటివరకు అవి ఎగిరినట్లు మనం వినలేదు. ఈ పరిణామాలన్నిటిని, మన ప్రభుత్వం అలీనవిధానమంటుందో, సంలీన విధానమంటుందో మనకు తెలియదు.

ఈ సమస్యను వాస్తవికమైన దృష్టితో ప్రభుత్వం పరిశీలిస్తుందని, మనజాతిని సంపూర్ణంగా శస్త్రాస్త్రసంపన్నం చేయటానికి, డాబుసరి మాటలు, ధర్మపన్నాలు అడ్డురాకుండా చూస్తుందని మాత్రం ఆశిద్దాం. ఎక్కడ దొరికితే అక్కడనుంచి మనం ఆయుధాలను సంపాదించుకోవాలి. మొదటి ప్రపంచయుద్ధానికిముందు ఇంగ్లండునుండి జర్మనీ ఆయుధాలుకొనుక్కుంది. రెండవ ప్రపంచయుద్ధానికిముందు ఫ్రాన్సు జర్మనీకి శతఘ్నిశకటాలను అమ్మింది. జర్మనీకి వ్యతిరేకమైన దేశాలన్నీ – రష్యాతోసహా – అదే యుద్ధంలో, అమెరికానుండి సైన్యసహాయాన్ని పొందాయి. అటువంటప్పుడు ఆయుధాలను సరఫరా చేయటానికి అంగీకరించిన దేశాలనుంచి – ఇవా అవా అనేప్రశ్న లేకుండా – ఆయుధాలను స్వీకరించటానికి మనమెందుకు మొహమాటపడాలి.

## నమ్మకస్తులయిన రక్షకులను గట్టిపర్చుకోవాలి

మన ఉత్తరసరిహద్దుల్లో ఒక ప్రముఖమైన కీలకస్థానం ఉంది. దానిని మనం సుదృఢం చేసుకోవాలి. అదే నేపాల్. అనాదికాలంనుంచి మన జాతీయజీవనంతో నేపాల్ ఒకటిగా ఉంటూఉంది. అది ఒక సర్వతంత్ర స్వతంత్రదేశం కావడం మనకు ఆనందప్రదమైన విషయం. అది విస్తీర్ణంలో చాలా చిన్నది. దాని మనుగడకు ప్రమాదం రాకుండా చూడవలసిన బాధ్యత మనది. శక్తిమంతమైన చైనాదేశంయొక్క ఒత్తిడి కారణంగా ఒక బలహీనక్షణంలో చైనా ప్రారంభించిన లాసా–కాట్మాండూ రహదారి నిర్మాణానికి నేపాల్ అంగీకరించింది. నేపాల్యొక్క స్వాతంత్ర్యం, సార్వభౌమత్వం సంరక్షింపబడేట్లు చూడవలసిన కర్తవ్యం మనది. మన

ఇరుదేశాలు, ఒకే ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నాయి. మనం నేపాలుయొక్క సార్వభౌమత్వాన్ని గౌరవించి, మనయొక్క నిజాయితీపట్ల వారిమనస్సుల్లో విశ్వాసమేర్పడేట్లుగా ప్రవర్తించాలి. ఆ దేశపు తిరుగుబాటుదారులు మన దేశంలో ఆశ్రయం కోరారు. దీనివల్ల నేపాల్ మనస్సు ఎంతో గాయపడింది. అది ఆ దేశంలో తీవ్రమైన భారతవ్యతిరేకప్రచారానికి తావిచ్చింది. మనం ఆ తిరుగుబాటుదారులను అదుపుచేసి, మనయొక్క తరతరాల స్నేహ బంధాలను పునః ప్రస్థాపించుకోవాలి.

మన విధానాలన్నింటిలోనూ మొట్టమొదట చూచుకోవలసింది ఒక్కటే; పవిత్ర మాతృభూమియొక్క ఆంతరంగిక, బహిరంగ సంరక్షణలు. దానికి సరిహద్దులనుదాటి ముందుకు చొచ్చుకుపోవటమే అవసరమైతే, నిస్సంకోచంగా ఆ పని చేయాలి. ఈనాడు దలైలామా మనమధ్య ఉన్నాడు. టిబెట్ సైన్యాలు తమ దేశంలో ఉన్న చైనాసైన్యాలను, ఇంకా తీవ్రంగా ప్రతిఘటిస్తూనే ఉన్నాయి, టిబెట్‌ను విముక్తం చేయటానికి మనకు ఇది ఒక అనుకూలవిషయం. దలైలామా తమయొక్క ప్రవాసప్రభుత్వాన్ని ఇక్కడ స్థాపించి, టిబెట్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించేట్లు మనం చేయాలి. తనదేశ స్వాతంత్ర్యసమరాన్ని కొనసాగించుకొనేందుకు, వారికవసరమైన సహాయాన్నంతనూ మనం సమకూర్చాలి. స్వతంత్రము, స్నేహభరితము నైన టిబెట్‌రాజ్యం ఏర్పడనిదే మనదేశ ఉత్తరసరిహద్దుల భద్రత కేవలం హాస్యాస్పదమే అవుతుంది. అటువంటిచర్య 'స్పష్టమైన మూర్ఖత్వమే' కాగలదని మన ప్రధానమంత్రి అంటున్నారు. అటువంటి ఉదాత్తమైన విషయాన్ని ముఖ్యంగా, అణగత్రొక్కబడ్డ ఒక పీడిత సమాజంయొక్క స్వాతంత్ర్యాన్ని–అది మన జాతీయభద్రతకు ప్రాథమిక అవసరమైనప్పటికీ – వారు ఎందుకు వ్యతిరేకిస్తున్నారో అర్థంకావటం లేదు. శత్రుభూమిని యుద్ధరంగంగా మార్చకుండా మన సరిహద్దులను కాపాడుకోలేం; టిబెట్‌ను విముక్తం చేయటం, దానికి మొదటి సైనికచర్య కాగలదు అని కీర్తిశేషులు, సమ్మాన్యులు, మన మాజీ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ అన్నారు.

# 24. విజయంకొరకు పోరాటం

## 2. సముచిత తత్త్వజ్ఞానం

మన సాధనసంపత్తి నంతనూ సమీకరించి, ఆంతరిక విద్రోహ శక్తులన్నిటినీ నిర్మూలించి, శత్రుశేషం లేకుండా చేయటానికి పోరాటం కొనసాగించేందుకు, పసుపుపచ్చ ప్రమాదాన్ని నామరూపాలు లేకుండా తుడిచిపారెయ్యటానికి, తగినశక్తిని మనం నిర్మించుకోవాలి. ప్రజల విశుద్ధజాతీయ శీలసంపదయే అక్షయశక్తిభండారం. అది లేనిదే ఎంతటి బాహ్యసహాయం, సాధనసామగ్రి లభించినప్పటికి ప్రయోజనముండదు.

### నిజమయిన ప్రమాదం

చైనాలో ప్రజాస్వామ్యశక్తులు ఓడిపోవటానికి, తిరుగుబాటుదారులు గెలుపొందటానికి గల ముఖ్య కారణాల్లో ప్రజాస్వామ్యశక్తుల 'శీలరాహిత్యం' అత్యంత ప్రముఖమైనది. ప్రజాస్వామ్యాన్ని కాపాడేందుకు అమెరికా తన సాయశక్తులా ప్రయత్నించింది. లక్షలాది డాలర్లను,

అధునాతన ఆయుధసంపత్తిని చైనాసైన్యానికి సమకూర్చి, అది సామ్యవాదుల తిరుగుబాటును సమర్థంగా ఎదుర్కొంటుందని భావించింది. కాని సైన్యంలోని పెద్దఅధికారులు సైతం, చిన్నచిన్న మొత్తాలకు కక్కుర్తిపడి, అమెరికా ఆయుధాలను విప్లవకారులకు అందించారనీ, తత్ఫలితంగా తిరుగుబాటుదారులు జాతీయసైన్యాన్ని ఓడించినారనీ, చరిత్ర మనకు చెప్పుతున్నది.

అటువంటి శీలరాహిత్యానికి ఉదాహరణలు ఇక్కడ మనకు కోకొల్లలు. ఒక్కఉదాహరణ: పాకిస్తానీయులు అస్సాములో విద్రోహం తలపెట్టారన్నది అందరికీ తెలుసు. తూర్పుబెంగాల్‌నుండి ఇప్పటికే అనేక మంది పాకిస్తానీయులు అస్సాములో ప్రవేశించారు; ఈనాటికీ ప్రవేశిస్తూనే ఉన్నారు. వారంతా అక్కడే స్థిరనివాసాలేర్పరచుకొన్నారు. అస్సామును ముస్లిం ఆధిక్యతగల ప్రాంతంగా చేసి, తర్వాత దాన్ని పాకిస్తానులో చేర్చటానికి ఇది ఒక కుట్ర. కాని మన ప్రభుత్వం మాత్రం ఈనిజాన్ని ఒప్పుకోదు. 1950 నాటినుంచీకూడా మనం హెచ్చరిక చేస్తున్నప్పటికీ ప్రభుత్వం కళ్ళు తెరవలేదు. పైగా "ఈ పాకిస్తానీయులను గుర్తించడ మెలాగా ?" అని ప్రశ్నిస్తోంది ఇప్పుడు. కాని అక్కడిపౌరులు కొందరు ఒకజాబితా ప్రభుత్వానికి సమర్పించారు. ఈమధ్య అక్రమంగా అస్సాములోకి ప్రవేశించిన ముస్లిములందరిపేర్లు, చిరునామా వగైరాలు అందులోఉన్నాయి. ప్రభుత్వం ఒకఉద్యోగిని నియమించి జాబితాను పరిశీలించి దానిపై అతని నివేదికను సమర్పించుమంది. అతను విచారణ జరిపాడు. 'ఈజాబితా అంతా కల్పితమే; వారిలో చాలాకొద్దిమంది మాత్రమే పాకిస్తాన్‌నుంచి వచ్చారు.' అని అతడు నివేదించాడు. అత నావిధంగా ఎందుకు నివేదించాడు? పెద్దమొత్తాన్ని లంచంగా పుచ్చుకొని ఆ విధంగా వ్రాసి పంపాడని తరువాత వెల్లడయింది.

మన దేశంలోని ప్రభుత్వయంత్రాంగం నరనరాల చివికిపోయిందని ఇంగ్లండుదేశ లేబరుపార్టీ ప్రముఖనాయకుడు, లార్డ్ అట్లీ ఒకవ్యాసంలో

వ్రాశాడు. అటువంటి దేశాల్లోనే సామ్యవాదుల విద్రోహం విజయంపొందు తుందని ఆయన అన్నాడు. ఆసియాకుచెందిన ఒకదేశంలోని ప్రముఖవ్యక్తిని ఒకణ్ణి, అతని దేశంలో సామ్యవాదవిద్రోహప్రమాదం ఉందా అని ఆయన ప్రశ్నించాడు. 'మా పరిపాలనాయంత్రాంగం భ్రష్టంకాలేదు; కాబట్టి, మాకు అటువంటి భయమే లేదని' అతడు బదులు చెప్పాడు. ఇట్టి ఆంతరిక ప్రమాదాన్ని గురించి పరిణత జాతికి చెందిన ఒకప్రముఖ రాజనీతిజ్ఞుని హెచ్చరిక ఐనా మనకు కనువిప్పు కల్గించాలి.

## అసలు జబ్బు

శీలరాహిత్యం అత్యంతతీవ్రమైన విషయం. దీని మూలకారణాలను నిర్మూలించాలి. విమర్శలవల్ల ప్రయోజనం శూన్యం. ఒక ఎల్లయ్యనో, పుల్లయ్యనో, మల్లయ్యనో తిట్టినంతమాత్రాన మన ప్రవర్తన ఎట్లా మారుతుంది? మారకపోగా, మనం పరనిందాపరాయణుల మౌతాం. ఐతే, అవినీతిపిశాచాన్ని అంతమొందించలేమా?

జీవితంలో స్వార్థం ఎంత పెరిగితే అంతమేరకు వ్యక్తి నీతి బాహ్యుడు, భ్రష్టుడు ఔతాడు. స్వార్థం అధికమైనకొద్దీ స్వప్రయోజనాలను సాధించుకొనేందుకు ఎంతటి చెడుత్రోవ త్రొక్కటానికైనా వ్యక్తి సంసిద్ధుడవుతాడు. నిస్వార్థి ఐన వ్యక్తి చెడు తలపెట్టడు; భ్రష్టుడు కాడు. అతడు నిజాయితీపరుడుగానే ఉంటాడు.

ఈనాడు స్వార్థం పెరిగిపోయింది. ప్రతివాడు తనకున్నదానికన్న అధికంగా కావాలని కోరుతున్నాడు-అది ఎట్లావచ్చినాసరే. మార్గం మంచిదా చెడ్డదా అన్న ఆలోచనే అతనికి రాదు; ఆమార్గం తరచు చెడ్డదే అవుతూ ఉంటుంది. దీనివల్లనే శీలరాహిత్యం ఏర్పడుతోంది. కాబట్టి వ్యక్తిలోని స్వార్థాన్ని మనం అదుపుచేయాలి. ఇది చాలా కష్టమైనపని. నిజానికి మనలో కొంత స్వార్థం తప్పకుండా ఉండితీరుతుంది. మనమంతా బైరాగులంకాము.

కుటుంబాలు విడిచి, కౌపీనాలు ధరించినవారంగాము. అట్టిది మనకు సాధ్యం కాదు. సమాజాన్నంతను దృష్టిలో పెట్టుకొని చూచినపుడు, సమాజశ్రేయస్సుకు ఆ పద్ధతి అనుకూలమైనదికూడా కాదు. మన శరీరాన్ని, మన కుటుంబాన్ని పోషించుకునేందుకుగాను, నేటికాలానికి అనుగుణమైన, కొంత సౌఖ్యాన్ని కల్పించటానికిగాను, కొద్దిపాటి స్వార్థం మనలో ఉండితీరుతుంది. కాబట్టి సామాన్యంగా సుఖజీవితాన్ని గడపగోరిన ఏ వ్యక్తినిగురించి, మనం చెడుగా భావించవద్దు. కాని, స్వార్థానికి అదే హద్దు. ఏ వ్యక్తి ఐనా ఆ హద్దు దాటి సమాజప్రయోజనాలకు భంగకరంగా స్వార్థంలో మునిగిపోతే, అది దూష్యం అయితీరుతుంది.

## నైతికత పైనుంచి క్రిందకు ప్రాకాలి

ఇట్టి స్వప్రయోజనబుద్ధి బరితెగించకుండా అదుపుచేయడం ఎట్లా? ఉపదేశాలు, ఉపన్యాసాలు సరిపోతాయా? సదాచారసమితులు, బహిరంగ సమావేశాల్లో చేసే సామూహిక ప్రతిజ్ఞలవల్ల ఇట్టి అద్భుతమైనమార్పు వస్తుందా? ధర్మపన్నాలు, ప్రతిజ్ఞలు వ్యక్తిని ఎన్నడూ మార్చలేవు. ఇక శ్రీరంగనీతులు చెప్పి ఓట్లువేయించే వీళ్ళబ్రతుకులు మనం చూడనేకూడదు. ఒకసారి నేనొకసాధువును కలిశాను. ప్రభుత్వకార్యాలయాల్లోని గుమాస్తాలకు, తదితరచిన్న ఉద్యోగులకు, శీలవంతులై ఎట్లా జీవించాలో తాను ఉపన్యాసాలు ఇస్తున్నట్లుగా ఆయన చెప్పాడు. 'కాని, మీ ప్రయత్నం సఫలమౌతుందా? ఏదో నాలుగుపైసలు మాత్రమే లంచంపుచ్చుకునే చప్రాసీకి మీరుబోధిస్తారు. కాని, ఆ చప్రాసీ పూటగడవనివాడని మీకు తెలియదా? అట్టిపరిస్థితిలో నాలుగు చిల్లరరాళ్ళకు అతడు కక్కుర్తిపడితే, అతణ్ణి సమర్థించలేకపోయి నప్పటికీ జాలిపడవచ్చు. కనుక పైవారికి మీ ఉపదేశం ఇవ్వండి. వాళ్ళను పరిదిద్దగలరేమో చూడండి' అన్నాను. 'పై అధికారులు చాలామంచివా' రని ఆ సాధువు సమాధానం.

అప్పుడు నేనన్నాను. "ఒక ఉదాహరణ చెప్తాను. దేశమంతా అభిమానించి, ఆరాధించే రాజకీయనాయకు డొకడున్నాడు. ఎన్నికలనిధిని సమర్పించేందుకు అతణ్ణి ఒక నగరానికి ఆహ్వానించారు. అనేకమంది పెద్దపెద్ద వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు, ఒక సంఘంగా ఏర్పడి, పెద్ద మొత్తాన్ని సేకరించారు. బ్రహ్మాండమైన ఒక ఉత్సవంలో ఆ వ్యక్తిని, ఆ రాజకీయపక్షాన్ని ప్రశంసిస్తూ ఉపన్యాసాలిచ్చి వారాతనికి నిధిని బహూకరించారు. అతను తనకు జరిగిన ఆ సత్కారానికి బదులుచెప్పటానికి లేచినిలబడి, 'ఇచట సమావేశమైన ఈ పెద్దమనుషులందరూ చీకటిబజారు వాళ్ళేనని నాకు తెలుసు. వారు నాకిచ్చినధనం పాపంతో కూడబెట్టిందే. అట్టిధనాన్ని స్పృశించడంకూడ పాపమే. ఇట్లాంటివాళ్ళందరినీ బహిరంగంగా కొరడాదెబ్బలు కొట్టి ఉరితీయాలని నాఅభిప్రాయం' అని శ్రీరంగనీతులు చెప్పి, డబ్బుమాత్రం జేబులో వేసుకొని జారుకొన్నాడు." అదృష్టవశాత్తు ఈ ఉదంతం ఆ సాధువుకుకూడ తెలుసు. "అటువంటిపెద్దవాళ్ళను ముందు సరిదిద్దం"డని అతనితో అన్నాను.

పైస్థాయిలోఉన్నవారు నైతికంగా సరిగా ఉంటే, నీతి క్రమంగా సమాజంలోని అట్టడుగుపొరవరకు ప్రాకుతుంది. దానివల్ల సత్ప్రవర్తన అలవడుతుంది. నచ్చీలాన్ని క్రిందనుంచి పైకి నిర్మించుకుంటూ పోలేము. శీలాన్ని ఎల్లప్పుడు పైస్థాయిలోనే ముందుగా నిర్మించాలి. భౌతికసుఖాలను మాత్రం క్రిందనుండి సమకూర్చాలి. మనసమాజజీవనంలో అట్టడుగుమెట్టుపై ఉన్నవారు రాత్రింబవళ్ళు కాయకష్టం చేస్తూ, నికృష్టజీవితం గడుపుతున్నారు, వాళ్ళు అట్లా ఉండటం సమాజానికే తలవంపు. వాళ్ళను ముందు పోషించాలి. పైస్థాయిలోఉన్నవారికి ఒకపూట తిండి లేకపోయినా పరవాలేదు, నేనేమీ బాధపడను. భౌతికావసరాలు క్రిందినుంచి పైస్థాయికి, నీతి పైస్థాయినుంచి క్రిందికి వ్యాపించేట్లుగా మన సమాజాన్ని పునర్నిర్మించుకోవాలి; పునరుజ్జీవింపచేసికోవాలి.

## సజీవ ఆదర్శం

మన జాతీయజీవనంలోని అత్యున్నతస్థాయిలోకూడ నీతి, సౌశీల్యం కొరవడినాయి అనేది సర్వసామాన్యానుభవం. జీవితపు పైఅంతస్తులో ఉన్నవారు మేధావులు, చదువుకున్నవారు. ఏది నీతియో, ఏది అవినీతియో వాళ్ళకు తెలుసు. నీతినిగురించి వారు చక్కని ప్రబోధాలుగూడ చేయగలరు. అటువంటప్పుడు మన మాటలు వాళ్ళమీద ఏం పనిచేస్తాయి? అట్టి వ్యక్తులకు కేవలం ఉపదేశాలుచేసి మనం సాధించగలిగేదేమీలేదు.

చట్టాలద్వారా నైతికస్థాయిని మెరుగుపరచగలమా? మద్యపాన నిషేధం చూద్దాం. అది చాలాప్రాంతాల్లో అమలులో ఉంది. కాని ఆప్రాంతా లన్నిటిలోనూ దొంగసారాబట్టీవ్యాపారం ఒక లాభసాటి కుటీరపరిశ్రమ. కాబట్టి నైతికస్థాయిని పెంచటంలో వట్టి చట్టాలు నిరుపయోగాలు.

నిజానికి స్వార్థాన్ని అదుపులోపెట్టగలమార్గం ఒకటే ఉంది. దేనికొరకు వ్యక్తి శ్రమించాలో, జీవించాలో, మరణించాలో, అట్టి ఆదర్శానికి అతడు అంకితమయ్యేట్లు చేయాలి. అప్పు డావ్యక్తి ఆ ఆదర్శంపట్లగల శ్రద్ధవల్ల తనస్వార్థాన్ని అదుపులో పెట్టుకొని, సచ్ఛీలాన్ని నిర్మించుకో గలుగుతాడు. మరోమార్గంలేదు. పరంపరాగతము, పరమపవిత్రమునైన ఒక మహోన్నతలక్ష్యం ప్రజలముందుంచండి. అది వారిహృదయాల్లో సహజంగా ప్రతిస్పందించి, వారి రక్తాన్ని ఉరకలు వేయిస్తుంది. అప్పుడు అతిసామాన్యవ్యక్తికూడ తనలో శ్రద్ధాసౌశీల్యాలు పెరిగినట్లు గుర్తించ గలడు. పవిత్రహిందూరాష్ట్ర వైభవౌన్నత్యాల సాక్షాత్కారమే, అట్టి స్ఫూర్తిప్రదమైన లక్ష్యం.

"నేను ఈమహత్తర హిందూరాష్ట్రంయొక్క సంతానాన్ని. తరతరాలుగా మహామహులైన నాపూర్వికులు దాన్ని సర్వశ్రేష్ఠంగాను, మహోదాత్తం గానూ - ఆదర్శపురుషుల ఆదర్శరాష్ట్రంగా-ఈ భూమండలంపై తీర్చిదిద్ద

టానికి ఎంతో కృషిచేశారు. నేనూ అదే లక్ష్యసాధనకు అంకితమౌతాను." ఇదే మనకు సహజంగా సంక్రమించిన భావస్ఫూర్తి; ఇది మనరక్తంలో తొణికిసలాడుతోంది. సహజము, పవిత్రమునైన ఈ ప్రేరణను ప్రజల్లో కలిగించినప్పుడు వారు స్వార్థానికి లోనుకాకుండా, తమ నిత్యజీవితంలో విశుద్ధజాతీయశీలాన్ని రూపొందించుకోగలుగుతారు.

## స్ఫూర్తిప్రదమయిన భవ్యదృశ్యం

ఈనాటి క్లిష్టపరిస్థితిలోకూడ ఈఆదర్శవాదాన్ని మనం విస్మరించలేం. కురుక్షేత్ర రణరంగంలో, రణదుందుభులు, శంఖాలు మ్రోగుతూ ఉండగా ఇరుసైన్యాలకు మధ్య నిలచిన అర్జునుడికి శాశ్వతము, ఉత్తేజకరమునైన నిస్వార్థకర్మయోగాన్ని ధర్మంకొరకు ఆదరించాలని శ్రీకృష్ణుడు ప్రబోధించి, అతనిలో అసమానశౌర్యాగ్ని రగిల్చి, అఖండవిజయాన్ని అందించాడని మరచిపోరాదు. ఒక ఆదర్శంవల్ల ప్రేరితుడైనప్పుడే, వీరుడైనవాడు తనలోని శ్రేష్ఠతమ శక్తిసామర్థ్యాలను ప్రదర్శించ గలుగుతాడు. ఏ జీవిత ఆదర్శాలకోసం అతడు పోరాడాలో, అవసరమైతే మరణించాలో అవి అతని మనస్సులో సుస్పష్టంగా మెదులుతూ ఉండాలి, చెమటోడ్చేందుకు, త్యాగం చేసేందుకు ఆర్థికప్రణాళికలు, పారిశ్రామిక వైభవాల గురించి ప్రవచనాలు, వ్యక్తిని ప్రేరేపించలేవు. మంచుమయమని, మానవనివాసానికి అయోగ్యమని, అక్కడ గడ్డిపోచకూడ మొలవదని, అవమానకరమైన రీతిలో మాతృభూమిని వర్ణించటంవల్ల ప్రజలు చైతన్యాన్ని కోల్పోయి, దురాక్రమణ జరిగినప్పటికి, చీమైనా కుట్టనట్లుంటారు. కాబట్టి పవిత్ర మాతృభూమిపట్ల, జాతీయాదర్శాలపట్ల శాశ్వతము, స్ఫూర్తిప్రదమునైన శ్రద్ధను ఈ తల్లి యొక్క బిడ్డలందరి హృదయాల్లోనూ పాదుకొల్పాలి.

ప్రాచీనకాలంలోను, నవీనయుగంలోనుకూడ స్వాతంత్ర్యసమరవీరు లందరూ సజీవహిందూరాష్ట్రసాక్షాత్కారస్ఫురణచేత ఉత్తేజితులైనవారే.

ఈకొసనుండి ఆకొసదాకా, యావద్దేశంలోని సామాన్యప్రజానీకాన్ని కూడగట్టి క్రియాశీలురుగా ప్రేరేపింపగలపిలుపు అదొక్కటే. అట్టి దృశ్యం మనకబారి నప్పుడల్లా, కనిపించనప్పుడల్లా ప్రజలుకూడ అకర్మణ్యులై దాస్యానికి లోనయ్యారు.

1857 స్వాతంత్ర్యసంగ్రామ గుణపాఠం మన కండ్లముందు ఉంది. ఆవిప్లవమహారథులు తొలిదెబ్బలోనే ఢిల్లీని స్వాధీనం చేసుకొని ఆంగ్లేయుల చేతిలో కీలుబొమ్మ అయిన మొగలాయిపాదుషాను విముక్తం చేశారు. ఢిల్లీ సింహాసనంపట్ల ఇంకా విధేయులైనవారందరి సహకారాన్నీ సమకూర్చుకునేయత్నంలో వారతణ్ణి ఒక స్వతంత్రచక్రవర్తిగా ఢిల్లీ సింహాసనంపై కూర్చోపెట్టి, స్వాతంత్ర్యసంగ్రామనాయకుడుగా ప్రకటించారు. కానీ ఈచర్యవల్ల గురుగోవిందసింహ, ఛత్రసాల, శివాజీలవంటి అనేకుల అసమానత్యాగం, నిరంతరకృషి, మహాసాహసాలవల్ల ధ్వంసమైపోయిన మొగలాయీల రాక్షసపాలన పునరుద్ధరించి, తిరిగి నెత్తిన రుద్దుతారేమో అని ప్రజలు భయపడ్డారు. అట్టిది ఆంగ్లేయుల పరిపాలననుమించిన దురంతం కాగలదని సామాన్యహిందూప్రజానీకం భయపడింది. నానాసాహెబ్‌పీష్వా, తాత్యాతోపే, రాణీలక్ష్మీబాయి, రాణాకుంవర్‌సింహ్‌వంటి మహామహులైన హిందూసేనాపతులను చూచి హిందూస్వరాజ్యం ఏర్పడుతుందనే ఆశచే ఉత్తేజితమైన హిందూమానసం దీనివల్ల యుద్ధంచేయాలనే ఉత్సాహాన్నే కోల్పోయింది. ఆ విప్లవం విఫలంకావటానికి కారణమైన నిర్ణాయక అంశాలలో ఇదొకటని అంటారు చరిత్రకారులు.

తరతరాల జాతీయలక్ష్యస్ఫురణలో ప్రజలు ఉత్తేజితులైనప్పుడు మాత్రమే, వారిని త్యాగపరాక్రమాలశిఖరాగ్రాలకు కొనిపోవటం సాధ్య మవుతుంది; దేశం ఈమూలనుండి ఆమూలదాకా ప్రజలందరినీ ఒకే ఒక చైతన్యవంతమైన జాతీయవిరాట్‌స్వరూపంగా తీర్చిదిద్ది అజేయమైన

జాతీయశక్తిని నిర్మించటంకూడ దీనివల్లనే సాధ్యమవుతుంది. మన మాపని చేయగలిగిననాడు, ఒక చైనాకాదు, పది చైనాలువచ్చినా, ఓడించగలం.

## కలలుగనేవారు మేల్కొనాలి

మనం తొలగించుకోవలసిన ముఖ్యమైన అడ్డంకుల్లో ఒకటి - జాతీయశక్తినిర్మాణంపట్ల మన మనస్సుల్లో ఉన్న సంకోచం. ఇన్నాళ్ళూ మన నాయకులదృష్టిలో శక్తి అనేది ఒక అనరానిమాట; శక్తిసముపార్జన వారి మనస్సుకు గిట్టదు. వాళ్ళకు ధర్మపన్నాల్లో ఎక్కడలేని నమ్మకం. ఈమధ్య కూడ, బాధ్యతాయుతులైన నాయకుల్లో కొందరు ఏకపక్ష శస్త్రసన్యాస ప్రసంగాలు చేశారు. ఏకపక్షశస్త్రసన్యాసమంటే ఏకపక్ష ఆత్మ హత్యయే! కనీసం, 1954 నుంచైనా, మననాయకులు, చైనీయుల ప్రత్యక్ష దురాక్రమణను గురించి ఎరుగుదురని వాళ్ళమాటలనుబట్టే తెలుస్తోంది. అయినా వారు పంచశీల అనే స్వప్నజగత్తులో తేలియాడుతూఉండిపోయారు. ఈ ఎనిమిదిసంవత్సరాల్లో అభేద్యమైన రక్షణశక్తిని నిర్మించుకోగలిగే వారం. కాని, ఈనాడు మనకున్నవి కొద్దిపాటి సైన్యం; అంతకన్న తక్కువ ఆయుధాలు; వాటికన్న తక్కువ తుపాకీగుండ్లు. శతఘ్నివిమానాలు, యుద్ధవిమానాలు, శతఘ్నిశకటాలు, సైనికరవాణాశకటాలు మొదలైనవాటి ఉత్పత్తిని గురించి పట్టించుకోనేలేదు. తగినంతదూరం కొట్టగల విమాన విధ్వంసకశతఘ్ని ఒక్కటైనా మనవద్ద లేదు. ఇట్టి మనం శస్త్రసన్యాసం గురించి మాట్లాడుతున్నాం. శస్త్రాలే లేనప్పుడు శస్త్రసన్యాసం ఎట్లా సాధ్యం?

కాఫీపొడి మరలను, ప్లాస్టిక్ సంచులను మన ఆయుధనిర్మాణ కర్మాగారాలు ఉత్పత్తి చేశాయని మనం చదివే ఉంటాం. ఒక సాధారణ వస్తువాహనంకన్న తక్కువశక్తిగల ఒక శకటాన్ని తయారుచేసి 'శక్తిమాన్' అని పేరుపెట్టారు. ఆ'శక్తిమాన్'యొక్క మొదటి నమూనా తొలిప్రయోగంలోనే విరిగిపోయింది! ఐతే ఇంతమంది సైనికుల విలువైన

ప్రాణాలు పోయినతర్వాత మన నాయకులు ఒక గుణపాఠం గ్రహించినట్లు తోస్తున్నది; స్వయంనిర్మితమైన ఊహాలోకాన్నుంచి, మనలను వాస్తవ జగత్తులోకి చైనా తీసుకవచ్చిందని మన ప్రధానమంత్రి మొహమాటమి లేకుండా ఒప్పుకొన్నారు. "మనం శక్తి లేనిదే జీవించలేం. అవసరమైతే లాఠీలతో నైనా పోరాడుతాం" అంటూ, తనలో కల్గిన ఈ నూతనజాగృతిని వారు ఒకచోట వ్యక్తంచేశారు. "కునికిపాట్లు పడుతూ, ఇంకెన్నడూ దొరికిపోం" అని దేశవ్యవహారాల మంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి చెప్పారు. అంటే వారింతవరకు కునికిపాట్లు పడుతున్నారన్నమాట! సంఘర్షణమయమైన ఈప్రపంచంలో శక్తి ఒక్కటే పరిగణింపబడుతుందనీ, శక్తిమంతుడు చెప్పేమాటనే ప్రపంచం అర్థంచేసుకుంటుందనీ, ఆలస్యంగానైనా మనవారు గ్రహించారు. ఇది కొంతఊరట కల్గిస్తోంది. నేడు వారిలో కల్గిన ఈ జాగృతి క్షణికమైంది కాకూడదని భగవంతుణ్ణి ప్రార్థిద్దాం.

నిజానికి మనపూర్వీకులు ఎన్నడో గుర్తించిన ప్రాథమిక జీవన సూత్ర మిది.

*"దండస్య హి భయాత్ సర్వం జగత్ భోగాయ కల్పతే."*

[రాజదండమునకు (అధికార చిహ్నం) భయపడియే ప్రపంచం జీవించగల్గుతోంది]

అని మనుస్మృతి చెప్పుతోంది. వారంతా అట్టిమెలకువతోనే జీవించారు. సర్వమానవసౌభ్రాత్రం అనే మహోన్నతతత్త్వాన్ని వారుపదేశించి ఆచరణలో పెట్టినప్పటికీ, తాము బ్రతకవలసిన ఈ ప్రపంచంలోని కఠోరసత్యాలను వా రెన్నడూ విస్మరించలేదు. పరంపరాగతంగా, మన మెప్పుడూ శాంతిప్రియులం, అహింసావ్రతులం అని మన నాయకులు అంటూ ఉంటారు. నిజమే; కాని ఆ శాంతి గౌరవహాని కల్గించే శాంతికాదు; స్మశాన శాంతి అసలేకాదు. అవమానానికి స్తబ్ధుగా తలవంచటం మగతనం కాదని నిరసించాం. అత్యున్నతపరాక్రమప్రమాణాలను నెలకొల్పినాం. ధర్మానికి

సర్వోచ్చస్థానం ఇచ్చే శాంతిని సాధించటంకోసం భయంకరఖండనాల్లో పరిపంథుల పరిమార్చిన సాటిలేని మేటివీరులు, విజేతలు మనలో పుట్టారు.

## ఆత్మహత్యా తత్వము

ఇటువంటి క్లిష్టసమయంలోకూడ ప్రముఖవ్యక్తులుకొందరు పాతధోరణి లోనే ఆలోచిస్తూ, ఉపదేశాలిస్తూ ఉండటం ఆశ్చర్యం కలిగిస్తుంది. 'మనద ంతా శాంతీ, అహింసా. చైనీయులు దండెత్తివస్తే మన మొక శాంతిసైన్యంగా వారిముందు నిలబడతాం; ఇంక వాళ్లేంచేస్తారు? యుద్ధానికి ఇద్దరుండాలికదా! మనం పోరాడకపోతే వాళ్లెవరితోపోరాడుతారు?' అని ఇప్పటికీ వాళ్ళు వాదిస్తారు. చాలా చక్కనివాదమే ఇది! ముఖ్యంగా యుద్ధంచేయటానికి దమ్ములులేనివాళ్ళకు బాగా నచ్చుతుంది.

యుద్ధంచేయడానికి ఇద్దరుండటం అవసరమన్నమాట నిజమే. ఐతే వారిద్దరూ యోధులై ఉండవలసిన అవసరంమాత్రం లేదు; ఒకడు దెబ్బ కొట్టేవాడు, మరొకడు తినేవాడు చాలు! పైగా మనం శాంతియుతంగా ఇతరులతో మంచిగా ఉన్నంతమాత్రాన, ఇతరులుగూడా మనలాగే ఉండి తీరాలని ఉందా? ఇది లోకానుభవమేనా?

## ఏకపక్ష సౌజన్యానికి పట్టినగతి

మనఉదాహరణే తీసికొందాం. ఇస్లాం పుట్టిన కొత్తల్లో, ఒకనూతన మతం అరేబియాలో జనించిందని, వ్యాపారులద్వారా గుజరాత్‌రాజు విన్నాడు. అదేమిటో తెలుసుకోవాలని కుతూహలపడి, ఆ మతవిద్వాంసులను కొందరిని తన వ్యాపారులద్వారాఆహ్వానించాడు. కొందరు మౌల్వీలు గుజరాత్‌వచ్చారు. మన పండితులు వారితో శాస్త్రార్థాలు జరిపారు. దానికి ఒక దర్శనమంటూ లేకపోయినప్పటికీ, వ్యక్తిని దైవప్రార్థనకు ప్రేరేపించే ఒక విశ్వాసమది అని వారు గ్రహించారు. 'మీకు తత్త్వజ్ఞానం లేనంతమాత్రాన నష్టమేమీ లేదు. దైవప్రార్థన చేయటానికి వ్యక్తికి దారిచూపగలిగితే మీవిశ్వాసం

మంచిదే అవుతుంది. దానికి మాశుభాకాంక్షలు ఉంటాయి. మీపైగంబర్ ప్రచారంచేసే ఈ శ్రేష్ఠమైన నూతనమతం కారణంగా అరేబియాలోని ప్రజలందరూ దైవోన్ముఖులు అగుదురుగాక' అని ఆ విద్వాంసులు, ఆ రాజు వారితో చెప్పారు. అంటే మనం వారిమతాన్ని, గురువులను, ప్రవక్తను గౌరవించాం. అదంతా ఒకచెత్త అని, దాన్ని నాశనంచేయాలని మనం చెప్పలేదు. హిందువు ఎవ్వడూ ఎన్నడూ ఆమాట అనడు.

మరొక ఉదాహరణ : దక్షిణాదిని, మధురరాజ్యంలో ఒక అరబ్బీ ముస్లింవ్యాపారి ఉండేవాడు. సత్ప్రవర్తన, సమర్థత కలిగినవాడు కనుక అతణ్ణి రాజు తనమంత్రిగా నియమించాడు. ఈనాడుగూడ కొందరు ముస్లింలు మంత్రులయ్యారు; కాని వాళ్ళను మంత్రులు చేసింది ముస్లిముల ఓట్లకోసం. తను పైకిరావడానికి ముస్లిముఓట్లపై ఆధారపడలేదు కాబట్టి, ఆ రాజుకు ఓట్లఆలోచనే రాలేదు ! కేవలం అతని సద్గుణాలపట్ల గౌరవంవల్ల మాత్రమే అతణ్ణి మంత్రి చేశాడు. అవిధంగా మనం ముస్లిములతో గౌరవ పూర్వకంగాను, ప్రేమ సౌభ్రాత్రాలతోనూ ప్రవర్తించాం.

కాని, దీనికి వారు చేసిందేమిటి ? వారు కావించిన విధ్వంసం, దోపిడీ – సమస్త కిరాతకచర్యలతో నిండిన పన్నెండువందల సంవత్సరాల చరిత్ర మనకండ్లముందు ఉంది. మనదేశంలో ఈనాడున్న ఇంతటి ముస్లిం జనాభా, ఆనాడు వారు దేశవ్యాప్తంగా కొనసాగించిన మారణహోమం యొక్క ఫలితాల్లో ఒకటి. భగ్నభవనాలేకాదు, భగ్నసమాజంకూడా వారి కిరాతకాలకు సాక్ష్యమే. ముస్లిములవిశ్వాసాలపట్ల, ముస్లిములపట్ల మన సత్ప్రవర్తన మనకు తెచ్చిపెట్టిందేమిటి ? మన పవిత్రక్షేత్రాలకు అపవిత్రత, ప్రజలకు బానిసత్వం – ఇంతేగదా !

## వాస్తవాన్ని ఎదుర్కోవాలి

చైనావిషయం చూద్దాం. బౌద్ధమతప్రభావం చైనాలో ప్రవేశించిన నాటినుండి, అంటే, రెండువేలఏండ్లకు పైగా, వారికీ, మనకూ మధ్య

పండితుల రాకపోకలు, సంబంధాలు, ఒకవిధమైన సౌభ్రాత్రం ఏర్పడ్డాయి. నేటి మన నాయకులుకూడ, అదేభావంతో "హిందీ చీనీ భాయీ భాయీ" అన్ననినాదం చేశారు. టిబెట్టుపట్ల మన నైతికబాధ్యతను విస్మరించేంత గాఢంగా ఈవిధానాన్ని మనవారు కొనసాగించారు. మన బాధ్యతను మనం పరిత్యజించి, ఒకవిధంగా టిబెట్టును, సర్వభక్షకమైన చైనాకు పువ్వుల్లోపెట్టి, కానుకగా సమర్పించాం. నిజానికి మనం టిబెట్టుపట్ల విశ్వాసహీనులమయ్యాం. చైనాపై మనం విశ్వాసంఉంచే ప్రశ్నయే లేదుకనుక, నిజానికి అది మనపట్ల విశ్వాసఘాతుకం చేయలేదు. కాని, టిబెట్టుకు నమ్మకద్రోహం చేసింది మనమే. మనం చేసిం దొకమహాపాపం. దానికి ప్రాయశ్చిత్తమేమిటో ఆ భగవంతుడికే ఎరుక. కేవలం చైనాను 'సోదరుడు'గా చెప్పుకునేందుకు మాత్రమే మన మీపాపానికి ఒడిగట్టాం. ఇంతగా చైనాతో మనం సౌభ్రాత్రం నెరపాం. మనభ్రాతృభావనకు ప్రతిగా చైనా చేసిందేమిటి? మనసరిహద్దులను కబళించింది. వాస్తవిక ప్రపంచంలో, ఇట్టి ఏకపక్షసత్ప్రవర్తన సత్ఫలితాలను ఇవ్వజాలదు.

మనం కనుక మెదలకుండా ఊరుకుంటే చైనీయులు మనల్ని గడ్డికోసినట్లు కోసేస్తారా? అని కొందరు అంటారు. అట్టిది సాధ్యమేనా అనేది చైనీయుల స్వభావాన్నిబట్టి పరిశీలించి చూద్దాం. తమపరిపాలన కెదురుండ రాదనే ఉద్దేశ్యంతో ప్రస్తుత సామ్యవాదప్రభుత్వం, చైనాలో అధికారంలోకి వచ్చిననాడు అనేకమందిని ఊచకోతకోసింది; ఆ రోజుల్లో వినవచ్చిన వార్తలనుబట్టి, నాడు దాదాపు తొంబదిఆరులక్షలమందిని హతమార్చింది. తమ అధికార దాహాన్ని తీర్చుకునేందుకుగాను, స్వదేశీయులనే దాదాపు కోటిమందిని హతమార్చటానికి వెరవలేదే అక్కడి నాయకులు; అట్లాంటివాళ్లు నడిపేప్రభుత్వం తమసైన్యాలను మనదేశంపై దండయాత్రకుపంపితే, అవి కేవలం మనం యుద్ధంచేయనంతమాత్రాన మనలను సంహరించకుండా వెనుకకుపోతాయని మెదడున్నమనిషి ఎవడైనా ఊహించగలడా?

కాబట్టి, ప్రపంచంలోని పాశవికశక్తుల నన్నిటిని ఎదుర్కొని విజయంపొందడానికి సుదృఢము, అజేయమునైన జాతీయశక్తి ఒక్కటే మన కుపకరిస్తుందని గు ర్తించాలి.

## సైనికశక్తికి ఆధారం

అట్టి క్లిష్టసమయాలన్నిటిలోనూ, ధైర్యోత్సాహాలతో ప్రమాదాన్నెదుర్కొనేందుకుగాను అగ్రశ్రేణిలో మన సైన్యాలు సంసిద్ధంగా ఉండాలి. రణరంగంలో మన సైనికులు చూపే సాటిలేని ధైర్యపరాక్రమాలు, మన హృదయాలను విశ్వాస,గర్వ,సంతోషాలతో ముంచెత్తుతాయి.కాని అటువంటి సైనికుడు వెనుకకు తిరిగి చూచుకుంటే అతనికి కనిపించవలసిం దేమిటి ? విఘటితమై, దేశభక్తిరహితమై, స్వార్థంలో, పదవీవ్యామోహంలో కొట్టుమిట్టాడుతున్న ప్రజలా అతనికి కనిపించవలసింది ? ఇదే అయితే పోరాడటానికి, ఆత్మాహుతి చేసుకోటానికి అతనికి ప్రేరణ కల్గుతుందా ? సుసంఘటితమైన దేశభక్తియుత సమాజం అతనివెనుక ఉండాలి. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు వ్యాపించి, దృఢసంకల్పంకలిగి, సుసంఘటితమైన సమాజం, సైన్యం కోరినదల్లా సమకూర్చటానికి సర్వదా సంసిద్ధంగా ఉందనే విశ్వాసం అతనిలో కలగాలి. మనుష్యులు కావాలంటే, మనుష్యులు ముందుకు దూకాలి. ప్రజలకు ఎంత ఇబ్బందికలిగినా సరే, సైన్యానికి అవసరమైన వస్తుజాలం అంతటినీ అందించాల్సిందే. సమాజమంతా తనను బలపరుస్తోందనే విశ్వాసమేర్పడితే ప్రతిసైనికుడు తన ధైర్యస్థైర్యాలు, యుద్ధశక్తి వందరెట్లైనట్లు భావించుకొని విజయలక్ష్మిని చేపట్టుతాడు.

## శక్తి స్నేహితులను సమకూరుస్తుంది

కష్టాల్లో ధైర్యంగా నిలువగలశక్తిని సమకూర్చుకోగలిగినప్పుడే స్నేహితులు మనల్ని ఆదుకొంటారు. వాళ్ళు సహాయపడుదామనుకొన్నాగాని మనం అసమర్థులమై, నిలబడలేనప్పుడు వాళ్ళెందుకు సహాయపడాలి?

ఎవరికి సహాయపడాలి ? ఎట్లా సహాయపడాలి ? ప్రస్తుతస్థితిలోగూడ మన కాళ్ళపై మనం నిలిచేందుకు, స్వల్పప్రయత్నం చేసినప్పుడు మనకు అనేక దిక్కులనుండి సహాయం లభించింది. మన నాయకులు అమెరికానుగురించి ఏనాడు మంచిమాట మాట్లాడకపోయినప్పటికీ, అమెరికానుంచిగూడ మనకు సాహాయ్యం లభించింది. సూయజ్ వ్యవహారంలో మనం తీవ్రంగా విమర్శించినప్పటికీ బ్రిటన్ మనకు సాహాయ్యం చేసింది. పశ్చిమజర్మనీ మొదలైన అనేకదేశాలనుండి మనకు సాహాయ్యం వచ్చింది. ఈనాడైనా కనీసం ఒక కృతజ్ఞతావాక్యాన్ని పలుకుదాం.

## వరం, నిజానికి ఎప్పుడు వరమౌతుంది ?

చైనా దురాక్రమణవల్ల మన జాతీయజీవనంలో ఆరంభమైన అనేక మంచిధోరణులను చూచి అది మారువేషంలోవచ్చిన మహావరం అంటూ ఉంటారు. స్వార్థం, అంతఃకలహాలు, వేర్పాటుభావాలు మొదలైన వినాశకరమైన ధోరణులను మట్టుపెట్టి సమైక్యము, విశుద్ధమునైనరీతిలో తనను తాను రూపొందించుకొనే దివ్యమైన అవకాశాన్ని జాతికి విదేశీ దండయాత్ర కల్పిస్తుంది అన్నమాట సత్యమే. సంకుచితభావాలకు స్వస్తి చెప్పి, స్వార్థప్రయోజనాలను సర్వోన్నత సమాజశ్రేయస్సులో విలీన మొనర్చి, విరాట్‌పురుషునిలో సజీవఅవయవాలుగా వ్యక్తులు రూపొందేటట్లు, ముంచుకవస్తున్న ప్రమాదం ఉత్తేజపరుస్తుంది. దృఢసంకల్పం, లభించిన మహదవకాశాన్ని వినియోగించుకునే తెలివితేటలు, తద్వారా బలపడగలిగే సామర్థ్యం మనవద్ద ఉన్నప్పుడే ఇదంతా సాధ్యమవుతుంది. అట్టి సంసిద్ధత మనవద్ద లేకపోతే 'వరం'కూడా, కేవలం ఒక్కకుదుపు కుదిపి నిరుపయోగం మాత్రమే అయిపోతుంది. అంతకన్న ఏమీఉండదు.

ఒకప్పుడు భాగ్యదేవతయైన లక్ష్మి ఒకబిచ్చగానిఎదుట ప్రత్యక్షమై ఆశీర్వదించి బంగారం వర్షిస్తానని చెప్పింది. కాని ఆ బంగారం నేలమీద

పడితే వట్టి మట్టి అయిపోతుందనికూడా అతనికి చెప్పింది. ఆ బిచ్చగాడు ఆత్రంగా తనసంచిని రెండుచేతులతో చాచిపట్టుకున్నాడు. అతని కుటుంబాన్ని కొన్నితరాలపాటు సర్వసమృద్ధంగా ఉంచజాలినంత బంగారాన్ని ఆ దేవత ఆ సంచిలో నింపింది. కాని వాడు పేరాసకుపోయి మరొక దోసెడు బంగారాన్ని ఈయవలసిందని దేవిని కోరాడు. ఆమె ఆ కోరిక తీర్చి అంతర్ధానమయిపోయింది. ఆ బరువు భరించలేక సంచి చిరిగిపోయి బంగార మంతా నేలపాలై దుమ్ముగా మారిపోయింది. పరమేశ్వరుడిచ్చే వరాలను వినియోగించుకోటానికైనా అర్హత, శక్తిసామర్థ్యాలు ఉండాలి.

## వేళ్ళను బలపరచాలి

విదేశీ దండయాత్రవంటి 'వరం' పొందిన జాతులవిషయంకూడ ఇంతే. ఈ సంకటాన్ని సదవకాశంగా మలచుకోగల సంకల్ప, సామర్థ్యాల్ని సమాజంలో కలుగజేయటమే, రాష్ట్రీయ స్వయంసేవక సంఘం నిర్వహించే పాత్ర. భావాత్మకము, శక్తిమంతము, శాశ్వతము నైన జాతీయజీవనానికి ఆధారభూతములైనవి, జీవనప్రదములైన ఆదర్శం, సామర్థ్యం, సౌశీల్యం. వీటిని వ్యక్తుల్లో కలుగజేయటంద్వారా జనశక్తిని జాగృతపర్చి సమీకరించేందుకై సంఘం తీవ్రంగా పరిశ్రమిస్తోంది. ప్రజలయొక్క త్యాగం, పరిశ్రమా, అవసరమైన గడియలో మన సంఘటనలోని ప్రతి స్వయంసేవక్ కూడ అగ్రశ్రేణిలో నిలబడతాడని మన దృఢవిశ్వాసం. ఐతే యుద్ధసమయంలో ఒక వర్గంయొక్కగాని, ఒక రాజకీయపక్షంయొక్కగాని ఆచార్యత్వం అవసరం ఉండదు కాబట్టి, మన మొక సంస్థగా ముందుకు రాము. తన త్యాగాలను, కష్టాలను గొప్పగా చెప్పుకోవటంకూడా చాలా అనుచితం. తనకున్నదంతా – అత్యంత ప్రియతమములైనవాటిని సైతం – మాతృదేవి పాదపీఠివద్ద సమర్పించటం ఈ పుడమిబిడ్డలందరియొక్క ప్రథమ, ప్రముఖ కర్తవ్యం. ప్రారంభంనుంచీ సమాజంలో అట్టి జీవశక్తిని సంఘంద్వారా సమకూర్చటానికి కృషి చేస్తూనే ఉన్నాం.

# 25 రణరంగంలో రాష్ట్రం

## 1. నూతన యుగాహ్వానం

ఆంగ్లేయులు వెళ్ళిపోయినతరువాత ఈ పదునెనిమిదిసంవత్సరాల కాలంలోనూ, ఈమధ్య పాకిస్తాన్‌తో మనం చేసిన యుద్ధం అనితరసాధ్యమైనరీతిలో యావత్తుదేశాన్ని విద్యుద్దీప్తంచేసి, ఒక నూతనోత్సాహాన్ని, ఒక నూతనవిశ్వాసాన్ని కలిగించి, కోట్లకొలది దేశీయులను ఉర్రూతలూగించింది.

### స్వాభిమానమే జాతికి జీవం

ఆంగ్లేయులు వైదొలగిననాటినుండి అటు పాకిస్తాన్, ఇటు చైనా చేసే దోపిడీలు, దురాక్రమణలు రానురాను అధికమవుతున్నాయి. వారుచేసే అసంఖ్యాకమైన అవమానాలను మనం దిగమ్రింగి ఊటకొంటున్నాం. ముఖ్యంగా 1962 లో చైనా చేతుల్లో మనం పొందిన అత్యంత అవమానకరమైన ఓటమి మన ప్రజల మనోధైర్యాన్ని దెబ్బతీసింది. దురాక్రమణదారుల తాకిడులనుంచి మనదేశం, తన సమగ్రతా సార్వభౌమత్వాలను సంరక్షించుకోగలదా అనికూడా ప్రజల మనస్సుల్లో తీవ్రమైన సందేహం

ఏర్పడింది. మహత్తరమైన మన జాతిమీద యావత్ప్రపంచం జాలిపడటం, ఎగతాళిచేయటం చూచి ప్రజల హృదయాలు రంపపుకోతకు గురిఅయ్యాయి.

దురాక్రమణదారులను చావుదెబ్బ కొట్టి, వెనక్కునెట్టి, ఎదురుదెబ్బ కూడ కొట్టగల్గి నేడు మనం పొందిన ఈ విజయానుభూతి, దిగజారిపోతున్న జాతీయచైతన్యానికి క్రొత్తగా ప్రాణం పోసిందంటే ఆశ్చర్యంలేదు. దేశభక్తి, స్వాభిమానాలు పెల్లుబికి జాతీయ జీవనాడి వేగంగా స్పందింప సాగింది. ముఖ్యంగా యుద్ధం నేర్పిన ప్రథమ పాఠం ఇదే. జాతీయ గౌరవ స్వాభిమానాలే జాతీయ స్వాతంత్ర్యానికి ప్రాణం. జాతీయశక్తికి అక్షయ భండారం అదే. పవిత్ర మాతృభూమియొక్క స్వాతంత్ర్యాన్ని, ప్రతిష్ఠను సంరక్షించుకునేందుకు నిలబడ నిశ్చయించుకున్నాం కాబట్టే సర్వేసర్వత్ర ఒక నూతనోత్తేజం కనిపిస్తోంది. అది జాతి హృదయాంతరాలను స్పృశించి మన ప్రజల సహజసిద్ధమైన ఉజ్జ్వలతను అభివ్యక్తం చేసింది.

## వీర్యవంతులయిన పురుషులు – పాటన్ టాంకులు

మహత్తరమైన మనమాతృభూమిఒడిలో పుట్టిపెరిగిన వీరకుమారుల దుర్దమ్య పౌరుష ప్రతాపాలు మరొకసారి ఉజ్వల సాక్ష్యాలుగా నిలిచాయి. అభేద్యాలనుకున్న పాటన్‌టాంకులను ఖాళీ అగ్గిపెట్టెల్లాగా మన జవానులు చితకకొట్టినతీరు, డాంబికంగా చెప్పుకొనే వరూధమయ (ఆర్మర్డు) సైనిక పటాలాలను తుత్తునియలు చేసినతీరు, వాటి పాశ్చాత్య ప్రభువులతో సహా అనేకమంది కూర్చొని బుర్రలు పగులగొట్టుకునేట్టుగా చేసింది. తమ ఆయుధాలు భగ్నం కావటానికి (తమ ప్రతిష్ఠకూడా!) కారణాలు పరిశీలించేందుకై వారొక నిపుణులసంఘాన్నికూడా నియమించుకొన్నారు. ఐతే అంతిమవిశ్లేషణలో గణనకు వచ్చేది మనుష్యుడుగాని 'యంత్రం' కాదు అనే సత్యసూక్ష్మాన్ని వారు ఉపేక్షించారు. మన శ్రేష్ఠమైన మనిషి, శత్రువు యొక్క శ్రేష్ఠమైన 'యంత్రం' కంటె ఎంతో శ్రేష్ఠుడు అని ఋజువయింది.

మనవారి శ్రేష్ఠసుగుణసంపత్తిపట్ల నాకుమాత్రం ఎన్నడూ ఎట్టి సంశయం లేదు. ప్రాణంకన్న మానం మిన్న అని, జోహారుజ్వాలల్లో ఆత్మాహుతి కావించుకొన్న పవిత్రమాతృమూర్తుల పుత్రులు ఇంకెట్లా ప్రవర్తిస్తారు ?

## బట్టబయలయిన అభూతకల్పన

శౌర్యపరాక్రమాల్లోనేగాక, యుద్ధతంత్రకౌశలాల్లో సైతం మనసైన్యం తన పరంపరాగతమైన ఆధిక్యాన్ని ప్రదర్శించింది. శత్రువుల దురాక్రమణ వ్యూహాలన్నిటినీ వమ్ముచేసింది. మన సైన్యాలు యుద్ధవిరమణరేఖను, అంతర్జాతీయ సరిహద్దురేఖ అనబడేదాన్నికూడ అతిక్రమించి లాహోరు, తదితరరంగాల్లో శత్రువుల ఆధీనంలోఉన్న భూభాగంలోకి చొచ్చుకుపోవడం చూచి చాలామంది విస్తుపోయారు. మనసైన్యాలు మనసరిహద్దులకే కట్టుబడి ఉండి ప్రతిరక్షాయుద్ధం సాగిస్తాయని వారూహించారు. కాని యుద్ధతంత్రంలో ఓనమాలు మాత్రమే నేర్చినవాడైనాసరే, తన భూభాగాన్ని యుద్ధరంగం కానిచ్చి సర్వనాశనాన్ని కొనితెచ్చుకోడు. దేశస్వాతంత్ర్య సమైక్యాలను సంరక్షించుకొనేందుకు సలిపే సమరాన్ని శత్రుభూభాగంలోకి బాగా చొచ్చుకుపోయి జరపాలి. అదే యుద్ధతంత్రసారం. 'ప్రహారమే ప్రశస్త ప్రతిరక్షావిధానం' అన్నదే సరియైనది. ఈ సార్వకాలికసత్యాన్ని పాటించారు గనుకనే మన సైన్యాలు దేశానికి విజయప్రశంసలను సాధించిపెట్టి తమకు అపారమైన కీర్తిప్రతిష్ఠల నార్జించుకోగలిగాయి.

దండెత్తివచ్చిన ప్రతిఆక్రమణకారి, ప్రతిదోపిడీముఠాయొక్క దయా ధర్మాలపై ఎల్లప్పుడూ ఆధారపడ్డ బలహీనులమని, బ్రిటిష్‌వారు దుర్బుద్ధితో మనల్ని చిత్రిస్తే, ప్రపంచం నమ్మింది; మనలోనూ అనేకులు నమ్మారు. కాని ఆ అభూతకల్పనను ఈ కొద్దిరోజులయుద్ధంలోనే మన సైనికులు పటాపంచలు చేశారు. 'సాధారణ హిందువు పిరికివాడు, సాధారణ ముస్లిం బూచివాడు' అని గాంధీజీ అంతటివారు వ్యాఖ్యానించారంటే ఈ అభూత కల్పనయే కారణం.

అయితే సత్యం మాత్రం వేరుగా ఉంటుంది. ఈ 'బూచి' స్వతహాగా పిరికివాడు. అనుకూల పరిస్థితులేర్పడినప్పుడు మాత్రమే అత్యంత కిరాతకంగా వ్యవహరిస్తాడు. హిందువుకు "వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి" అన్నదాదర్శం. మిత్రుని విషయంలో పూరేకుకంటే మెత్తని వాడు స్నేహాన్ని కాలదన్నితే పిడుగు కంటే క్రూరుడు. నిజానికి శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, రాణా ప్రతాప్ శివాజీ, రంజిత్‌సింగ్ వంటివారిని ప్రసవించిన ఈ సమాజం, వీర్యవంతమైనదీ, పరాక్రమోపేతమైనదనీ చెప్పితీరాలి. అటువంటి జాతీయ మహావీరులనందరనూ పురాణపురుషులుగానో, లేదా స్థానికులైన చిన్న సామంతులుగానో వర్ణించడం, సమాజంలోని కొన్నివర్గాలనుమాత్రమే "వీర జాతు"లని వ్యవహరించడం, మనజాతియొక్క పరాక్రమాన్నిగూర్చి అపప్రచారం చేయడమే అవుతుంది. మన వీరజవాన్లు అట్టి అసత్యాన్ని, కుత్సితప్రచారాన్ని పటాపంచలుచేసి మేటిపూర్వజుల వీరరక్తమే ఈ భూమాతయొక్క ప్రతిపుత్రుని రక్తనాళాల్లో ప్రవహిస్తున్నదని నిరూపించారు; దుష్టశక్తులన్నిటినీ నిర్మూలించేందుకై తన కోట్లకొలది బాహువులనెత్తిన భారతమాతయొక్క మహోజ్జ్వల నిజస్వరూపాన్ని ప్రపంచానికి వ్యక్తీకరించారు.

తమ పరాక్రమ, ఆత్మాహుతులద్వారా మనదేశానికి ఇంతటి మహాపర్వదినాన్ని కల్పించిన మన సైన్యంలోని అన్నితరగతులకు చెందిన ఆ మహనీయ మృతవీరులకు కృతజ్ఞతాపూర్వక శ్రద్ధాంజలిని సమర్పిద్దాం. కేవలం వారి మరణానికి సంతాపం వ్యక్తంచేసే దినం మాత్రమే కారాదిది. యుద్ధరంగంలో పోరాడుతూ తమ జీవితాలను బలిదానం చేసినవారు మహోత్తమగతులను పొందితీరుతారు. అటువంటప్పుడు వైభవోపేతమైన అట్టి బలిదానానికి ఎవరుమాత్రం ఎందుకు దుఃఖించాలి? అంతేగాక, పవిత్ర మాతృదేశ స్వాతంత్ర్య సంరక్షణార్థం వారు పొందిన ఉజ్జ్వల దీక్షా

బలిదానభావనలను మనం అలవర్చుకొనేందుకు, వారి దివ్యస్మృతులు నిరంతర ప్రేరణనియ్యాలి.

## అజ్ఞాత వీరగాథ

సరిహద్దుప్రాంతాల్లో సామాన్యుడుగూడ శత్రువుల దురాక్రమణ నెదుర్కొన్నతీరు తక్కువ స్ఫూర్తిప్రదంకాదు. అక్కడిప్రజలు తమతమ స్థావరాల నంటిపెట్టుకొన్నారు; రాత్రింబవళ్ళు పరిశ్రమించి ద్వితీయశ్రేణిగా నిలబడ్డారు వీరయువకులు. ప్రాణాలకుకూడ తెగించి భారవాహకశకట చోదకులు జవానులకవసరమైన సామగ్రిని అగ్రశ్రేణికి అందజేశారు. వారుపడ్డ బాధ, కృషి-చివరకు మృతినైనా గుర్తించామా? ఏ యుద్ధ చరిత్రలోనైనా సువర్ణాక్షరాలతో లిఖించవలసినదిగదా అది. కాని వారు చస్తే ఏడ్చేదిక్కు లేదు; వారి త్యాగాన్నీ, వీరాన్నీ గానంచేయరు; వారిని గౌరవించరు. "మేం సైనికులం, మరణిస్తే హుతాత్ములుగా మాకు పేరు వస్తుంది; మా కుటుంబాలకు భరణం వస్తుంది. ఈ ఊరటైనా ఉంది మాకు. కాని మాలో ఒకరై శత్రువుల తుపాకిగుండ్లకు ఎదురునిల్చిన ఈ వీరపౌరులకు అట్టివేవీ లేవు. వారి బలిదానభావన మాదానికన్న ఎంతో మిన్న" అని ఒక సైనికాధికారి ఎంతో భావుకతతో అన్నాడు.

## నాయకత్వ నూతనవైఖరి

శత్రువులవిషయంలో శరణాగతి కాదు; స్వాభిమానసంరక్షణ మన విధానం-ప్రభుత్వంలో వచ్చిన హితప్రదమైన ఈ మార్పువల్లనే జాతి యొక్క గుండెనిబ్బరం అంతదిట్టంగా ఉంది. ప్రభుత్వావాహాన్ని, దృఢ సంకల్పాన్ని, పౌరుషాన్ని చూచి యావత్తు జాతి గర్వించింది; ఆనందించింది. ఐక్యరాజ్యసమితినుంచి, శక్తిమంతమైన ఇతరదేశాలనుండి వచ్చిన ఒత్తిడులకు తలవంచక, వాటికి మన జాతీయ స్వాతంత్ర్యాన్ని, ప్రతిష్ఠను తాకట్టుపెట్టక "మూడురోజులు గడువిస్తున్నా"మంటూ చైనా

చేసిన బెదరింపులకు లొంగబోమని, మా శక్తినంతా వినియోగించి పోరాడు తామని సమాధానం చెప్పిన మన ప్రధానమంత్రియొక్క దృఢవైఖరి జాతి హృదయాన్ని వజ్రసమం చేసింది.

## జాతీయ స్వప్రయోజనమే గీటురాయి

జాతీయ స్వాతంత్ర్యాన్ని, గౌరవాన్ని పరిరక్షించుకొనేందుకై మన ఆంతరిక, బాహ్య విధానాలన్నిటికీ ప్రబుద్ధ రాష్ట్రీయ స్వప్రయోజనం ఒక్కటే గీటురాయి కావాలని మనం నేర్చిన రెండవ పాఠం. డాబుసరి నినాదాలుగాని, ప్రపంచ సంస్థల 'సద్భావనలు'గాని, చివరకు ఇతర దేశాల 'స్నేహ సంబంధాలు' గాని మనల్ని ఆదుకోవనీ, మన స్వాతంత్ర్యాన్ని కాపాడుకునే బాధ్యత మనమే పూర్తిగా వహించవలసి ఉంటుందనీ నేటి అనుభవం మనకు నిస్సందేహంగా నిరూపించింది. ఇక మన విధానాలన్నింటినీ ఈ క్రొత్తవెలుగులోనే మలచుకోవాలి.

దీన్ని దృష్టిలో ఉంచుకొని, పాకిస్తాన్‌తో మన సంబంధాలను పరిశీలిద్దాం. మన పొరుగున ఉన్నది మొండిశత్రువైనప్పటికీ, గౌరవ పూర్ణమైన శాశ్వతపరిష్కారాన్నాశించి మన ప్రభుత్వం యుద్ధవిరమణకు అంగీకరించింది. ఇంతటి బలిదానాలను చేసి మన వీరసైనికులు చేరుకొన్న రేఖను అంటిపెట్టుకొని నిలబడాలని ప్రభుత్వం నిశ్చయించుకోవడం ముదావహం. నేటి వాస్తవాధీనరేఖయే యుద్ధవిరమణరేఖగా స్థిరపరుచు కోవాలి. 1947 లో కాశ్మీరుపై పాకిస్తాన్ దురాక్రమణచేసినపుడు ఐక్య రాజ్యసమితి కాల్పుల విరమణరేఖను నిర్ణయించిన పద్ధతి ఇదే. అప్పుడు ఉపయోగించిన కొలబద్దనే ఈనాడుకూడ ఉపయోగించండని ఐక్యరాజ్య సమితికి స్పష్టం చేయాలి. ఈనాడు మనమున్న స్థానంనుండి ఒక్క అంగుళ మైనా వెనుకకు తగ్గడమన్న ప్రశ్నేలేదు.

ఏదేమైనప్పటికి, ఉథాంట్ ఢిల్లీ చేరేలోపుగా, యుద్ధవిరమణ కంగీక రించేలోపుగా, తమజైత్రయాత్రలో రావల్పిండి, కరాచీలను పాదాక్రాంతం

చేసుకొని, కాశ్మీరును విముక్తం చేయడానికి మనసైన్యాలకు అనుమతి ఇచ్చి ఉండవలసిందని నాభావన. అప్పుడు మనస్థితి చాలా గట్టిగా ఉండిఉండేది; మన జాతీయప్రతిష్ఠ మరింత పెరిగిఉండేది.

## లక్ష్య సుద్ధి

ఈపోరాటసమయంలో కేంద్రంలోని మన విధాననిర్ణేతలు శత్రువుల యుద్ధశక్తిని నిర్మూలించటమేతప్ప, శత్రుభూమిని స్వాధీనం చేసుకోవటం మనలక్ష్యం కాదని ప్రకటిస్తున్నారు. నేడు మన సైన్యాలు పాకిస్తాన్‌యుద్ధ యంత్రాంగంపై చావుదెబ్బతీశాయనటంలో సందేహంలేదు. శత్రువుల శతఘ్ని శకటాలు, అతివేగవిమానాలు (జెట్), చలనవేధులు (రాడార్), నుగ్గు నుగ్గు ఐపోయాయి. ఐనా, పాకిస్తాన్ ఆయుధసంపత్తిని తిరిగి సమకూర్చుకోవడం ఖాయం. ఆయుధసామగ్రి ఉండటమే 'యుద్ధశక్తి' ఐతే, దాన్ని ఎన్నిసార్లైనా భర్తీచేసుకోవచ్చు. ఉదాహరణకు మొదటి ప్రపంచయుద్ధకాలంలో జర్మనీ యొక్క 'యుద్ధశక్తి' పూర్తిగా ధ్వంసం ఐంది. కానీ రెండు దశాబ్దాలైనా గడవకుండానే జర్మనీ భయంకరమైన 'యుద్ధశక్తిని' మరల నిర్మించుకొని రెండవ ప్రపంచయుద్ధకాలంలో ప్రపంచాన్నంతనూ ముంచెత్తింది.

విశ్వవ్యాప్తమైన తమ సైనికవ్యూహంలో తనంతతానుగా ఒకపావు కాదల్చుకొన్న పాకిస్తాన్‌కు అమెరికా ఇంగ్లండులు చేసినదానమే పాకిస్తాన్ యొక్క 'యుద్ధశక్తి'. పాకిస్తాన్‌కు ఆయుధాలను, మందుగుండు సామగ్రిని టర్కీ, ఇరాన్‌వంటి దేశాలద్వారా దొంగచాటుగా అమెరికా చేరవేస్తోందని పత్రికల్లో చదువుతూనే ఉన్నాం. ఇట్టి పరిస్థితిలో పాకిస్తానీ 'యుద్ధశక్తి' నిర్మూలనమంటే అమెరికా ఇంగ్లండుల సమైక్య 'యుద్ధశక్తిని' నిర్మూలించడమే కాగలదు. అది అసాధ్యమనే సంగతి తేటతెల్లమే.

## మూలచ్ఛేదం చేయాలి

'యుద్ధశక్తిని నిర్మూలించాలి' అనే విధానం మానవస్వభావంలోని ఒక మౌలికసత్యాన్ని ఉపేక్షిస్తోంది. తనవద్ద ఆయుధాలున్నంతమాత్రాన ఒక వ్యక్తి హింసకుగాని, దురాక్రమణకుగాని దిగడు; దుష్ప్రవృత్తిచే ప్రేరితుడైనప్పుడే వాటికి పాల్పడుతాడు. ఆ దుష్ప్రవృత్తి ఉన్నంతకాలం వాడు మళ్ళీమళ్ళీ ఆయుధశక్తిని తప్పక సమకూర్చుకుంటూనే ఉంటాడు; తోటివారి సంక్షేమానికి ప్రమాదం తెస్తూనే ఉంటాడు. దురాక్రమణచేసే జాతులచరిత్ర ప్రపంచమంతా ఇట్లానే ఉంది.

మరి, ఆ దుష్ప్రవృత్తిని రూపుమాపటమెట్లా? నేడు మననాయకులు 'చెడుతోనేగాని, చెడ్డవారితోకాదు మన విరోధం' అని పదేపదే అంటున్నారు. కాని దుష్టమనస్తత్వమనేది 'ఇదమిత్థం' అని పట్టి పల్లార్చడానికి అందని విషయం. దుష్టత అనేది ఒక దుష్టునిరూపంతోగాని, దుష్టుల సమూహ స్వరూపంతోగాని అభివ్యక్తమవుతుంది. కనుక చెడును నిర్మూలించాలంటే దానికి ఆధారభూతులైన చెడ్డవారిని రూపుమాపటం తప్పనిసరి. వ్యక్తినుండి అతని దుష్టస్వభావాన్ని వేరుచేయటం సాధ్యమయితే శ్రీరాముడు రావణుడి నుండి దుష్టతనుమాత్రము నిర్మూలించి-రావణుడి సుగుణాలంటే రామునికి ఎనలేని గౌరవం-అతణ్ణి మంచిజీవితం గడిపేట్లుగా చేసిఉండేవాడే! కంసుణ్ణి చంపటానికిగాని, పాండవులచే కౌరవులను చంపించడానికిగాని శ్రీకృష్ణుడు అవతరించి ఉండేవాడేకాదు.

దశకంఠుని తలల్ని, అతనిధనుస్సుల్ని-యుద్ధశక్తిని-ఒక్కొక్కటే రాముడు ఖండించివేస్తుంటే రావణుడికి తలలూ, విల్లంబులూ పుట్టుకవస్తూనే ఉన్నాయి. దుష్టస్వభావానికి నిలయమైన హృదయాన్ని ఛేదించిన పిదపే రావణుడు మరణించాడు; వాడి భయంకరపాలన అంతమైంది. దుష్టత్వాన్ని నిర్మూలించాలంటే దానికి ఆలంబనాలైన దుష్టులను రూపుమాపక తప్పదనే కఠోరసత్యాన్ని ఈ కథ చెప్పుతుంది.

# పూర్ణస్వరాజ్ ప్రతిజ్ఞను సార్థకం చేయాలి

ఐనా, ఇతరుల భూమిని మనం కాంక్షిస్తున్నామని దాని అర్థంకాదు. 'పాకిస్తాన్' మనకు విదేశం కానేకాదు. అది ఇటీవల రాజకీయకుతంత్రాల సృష్టి. ఆ యా ప్రాంతాలన్నీ అనాదిగా మన మాతృభూమిలోని భాగాలే. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన కాంగ్రెసు, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధిస్తామనే ప్రతిజ్ఞ చేసింది పవిత్రమైన రావీనది ఒడ్డునగల లాహోర్ నగరంలోనే. అటువంటప్పుడు మన ధ్వజాన్ని లాహోరులోను, పాకిస్తాన్‌లోని తదితర ప్రాంతాల్లోను ఎగురవేయటం ఇతరుల భూభాగాన్ని కాంక్షించట మవుతుందని ఎట్లా అనగలం? నిజానికి నేడు శత్రువుల ఆధీనంలో ఉన్న ప్రాంతాలన్నిటినీ మనం విముక్తి చేయగలిగినపుడే స్వాతంత్ర్యపోరాటం విజయవంతంగా ముగిసిందని భావించాలి.

ఈమాట అనగానే ''అక్కడి ముస్లిములేమైపోవాలి?'' అని అడిగేవారు చాలామంది ఉన్నారు. కాని ఇది హిందూ ముస్లిముల మధ్య జరిగే మత యుద్ధం కానేకాదన్న విషయం వారు మరచిపోతున్నారు. వాస్తవానికి అయూబ్‌ఖాన్ తన స్వీయమతస్థులనే, ముఖ్యంగా వాయవ్యసరిహద్దు ప్రాంతం, బెలూచిస్తాన్, తూర్పుబెంగాల్లోని వాళ్ళను నిరంకుశంగా పాలిస్తూ రెండవతరగతి పౌరులుగా చేస్తున్నాడు. వాయవ్యసరిహద్దు ప్రాంతం, దానికి నాయకుడైన ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్‌లు ఎప్పుడూ భారత్ పక్షాన్నే ఉన్నారు. వాళ్ళ అభీష్టానికి వ్యతిరేకంగా వాళ్ళను పాకిస్తాన్‌లో చేర్చారు. పాకిస్తాన్ పరిపాలనాయంత్రాంగాన్నంతనూ స్వాధీనంచేసికొన్న పంజాబీ ముస్లిముల కాళ్ళక్రిందపడి మూలుగుతున్న బెంగాలీ ముస్లిములు అప్పుడే తిరుగుబాటు ఆరంభించారు.

కాబట్టి ఆ ప్రాంతాలను భారత్‌లో విలీనం చేయటం ఆమోద యోగ్యంమాత్రమేకాదు, అది వారికి విముక్తి ప్రసాదించేదికూడ అవుతుంది.

సాటి ముస్లిములు ఇక్కడ – మతరీత్యా వాళ్ళు ముస్లిములే ఐనప్పటికీ– అనుభవిస్తున్న అన్నిహక్కులనూ, అవకాశాలనూ తామూ పౌరులుగా పొంది సమైక్య ప్రజాస్వామిక భారత్‌లో సుఖంగా, సగౌరవంగా జీవించ వచ్చును. మత సంబంధమైన ఉదారతకు పెట్టింది పేరు భారతదేశం; మనదేశం అన్ని మతవర్గాలకు స్వాగతం పలికి, వాటి భద్రతా, గౌరవ స్వాతంత్ర్యాలకు హామీఇచ్చిందని చరిత్ర సాక్ష్యంపలుకుతోంది. ముస్లిముల తాకిడులనుండి మన జాతీయస్వాతంత్ర్యాన్ని సంరక్షించేందుకు ఆవిర్భవించిన విజయనగర, మరాఠా సామ్రాజ్యాల్లో విశ్వాసం, బాధ్యత కావలసిన అత్యున్నతస్థానాల్లోకూడ ముస్లిములు ఉండేవారు.

## ఐక్యరాజ్య సమితి అసలురంగు

జాతీయలక్ష్యసాధనలో "ప్రపంచసంస్థల" మాటలకు లేనిపోని ప్రాధాన్యం ఇవ్వకూడదు. అటువంటి 'ప్రపంచసంస్థలు' 'ప్రపంచాభిప్రాయాల' అసలురంగు ఈనాడు పూర్తిగా బట్టబయలైంది. ఐక్యరాజ్యసమితి, కామన్ వెల్తులు పాకిస్తాన్‌ఎడ పక్షపాతం వహిస్తున్నాయని ప్రత్యక్షంగా నిరూపిత మైంది. 1948 లో మాదిరిగానే దురాక్రమణకారుని, ఆక్రమితుని ఒకేగాటను గట్టే నింద్యమైన పాత్రనే అవి మళ్ళీ నిర్వహించాయి. అగ్రరాజ్యాల రాజకీయచదరంగ క్రీడాస్థలం ఐక్యరాజ్యసమితి అని మరోసారి ఋజువు అయింది. పాకిస్తాన్ సాయుధవిద్రోహులను కాశ్మీరులోకి వేలసంఖ్యలో పంపినపుడుగాని, చాంబ్ – జౌరియన్ రంగంలో అంతర్జాతీయ సరిహద్దు నతిక్రమించి, భారత్‌లోకి తన సైన్యాలను నడిపినపుడుగాని, పెదవికదపని ఐక్యరాజ్యసమితి కేవలం ఒక ప్రతిరక్షాచర్యగా మన సైన్యాలు పాకిస్తాన్ లోని లాహోరు రంగంలో ప్రవేశించేసరికి "ప్రపంచశాంతికి ప్రమాదం" వచ్చిపడిందని తటాలున గుర్తించింది, కాని, పాకిస్తానే తన దురాక్రమణ పథకాల్లో విజయం పొందిఉన్నట్లైతే ఈనాడు ప్రపంచశాంతిని గురించి

పొలికేకలుపెట్టే ఐక్యరాజ్యసమితిగాని, తదితరశక్తులుగాని ఈ ఊసే ఎత్తి ఉండేవికావు. బహుశః తమ తొత్తు పాకిస్తాన్, అలవోకగా గెలుపొందు తుందనీ, కొద్దిరోజుల్లోనే ఢిల్లీనికూడ పట్టుకుంటుందనీ అమెరికా, ఇంగ్లండులు ఉవ్విళ్లూరిఉంటాయి.

ఇకముందుకూడ పాకిస్తాన్ అక్రమప్రవేశకులను పంపటానికి యత్నించవచ్చును. అప్పుడుకూడ ఐక్యరాజ్యసమితి ప్రవర్తన ఇంతకన్నా మెరుగుగా ఉంటుందా ? తనకున్న గొప్పపేరుకు తాను ఏమాత్రం తగదని నిరూపించుకొన్న ఐక్యరాజ్యసమితిపట్ల మన విధాననిర్ణేతలు మాత్రమే కాదు, మతిగలవాడెవ్వడూ వీసమెత్తు విశ్వాసమైనా ఉంచనక్కరలేదు. నిజమన్నా, న్యాయమన్నా చిన్నమెత్తు ఖాతరులేదు సరిగదా, దురాక్రమణ కారులతో ఈ సంస్థ లాలూచీపడ్డ తీరు దాని ప్రతిష్ఠకు ఏమాత్రం తగదు. పద్దెనిమిదిసంవత్సరాలుగా సాగుతున్న పాకిస్తాన్ ప్రత్యక్షదురాక్రమణను చూడనట్లుగా కండ్లుమూసుక కూర్చున్న ఐక్యరాజ్యసమితి శాంతి, న్యాయాలను గురించి మాట్లాడే అర్హతనే కోల్పోయింది.

## స్నేహనియమం

ప్రపంచంలోకల్లా అత్యంత శాంతిప్రియ, లౌకిక, బృహత్ప్రజా స్వామ్యం మనది. మనకు వ్యతిరేకంగా మతమూఢ, కిరాతక, సైనిక నియంతృత్వాన్ని బలపరుస్తూఉన్న అమెరికా విధానం అత్యంత గర్హనీయం. మన పాశ్చాత్య 'మిత్రులు' మనపట్ల ప్రవర్తించినతీరు, పాకిస్తాన్ దురాక్రమణకారి అని చెప్పటానికి నోరురాని రష్యాతీరు చూస్తే, మనం బలహీనంగా ఇంతకాలం ఉన్నందువల్లే మనకు స్నేహితులంటూ ఎవ్వరూ లేకపోయారని ఋజువు అవుతోంది. బలహీనులు తమ మిత్రులకు లేనిపోని బరువేగాని వారివల్ల మిత్రులకు కలిగే లాభం ఏమిటి ? తమ స్వార్థానికే తప్ప, బలవంతులు బలహీనులతో మైత్రిని ఎందుకు కోరుకొంటారు ?

ఒక్కసారి మనం గనుక శక్తిమంతులమై, ఏబదికోట్ల ప్రజల దృఢసంకల్ప శక్తి ఆధారంగా రాష్ట్రీయ స్వప్రయోజనాలకు అనువైన విధానాలను అనుసరించడానికి నిశ్చయించుకున్నట్లైతే, వాళ్ళ దృష్టే మారిపోతుంది. పాకిస్తాన్ సహాయంతో భారత్‌ను అణగద్రొక్కి ఉంచి, తద్వారా ఈ రెండు బలహీనదేశాల్లోను తమ ప్రాభవాన్ని నిలుపుకుందామన్న ఆశతో నేటి వరకు పాకిస్తానును సమర్థిస్తూఉన్న దేశాలన్నింటికీ, తమతమ అవసరాలకొద్దీ మనతో స్నేహం చేయవలసినగతి పడుతుంది.

## సత్యనిరూపణ

జాతీయ ప్రయోజనాల నంటిపెట్టుకొని ఈ సమయంలో మనం దృఢ సంకల్పాన్ని, శక్తినీ స్వల్పంగా ప్రదర్శించటంతోనే, అనుమానపిశాచాలకు లోనైన కుటిల సామ్రాజ్యవాదులు, కాశ్మీరు సమస్యనుగురించి పునరాలోచన మొదలుపెట్టారు. మనకు సంబంధించినంతవరకు రాజ్యాంగ అవసరాల దృష్ట్యా కాశ్మీర్ మహారాజు విలీనీకరణపత్రంపై సంతకం పెట్టగా, అచటి ప్రజలకు ప్రాతినిధ్యం వహించే నేషనల్ కాన్ఫరెన్సు సంపూర్ణంగా దాన్ని సమర్థించినతరువాత భారత్‌లో కాశ్మీరువిలీనం పూర్తయింది. ఇంక దానికి తిరుగులేదు. అయితే హైదరాబాద్, జునాగఢ్‌లను భారత్‌లో విలీనంచేసుకొనే విషయంలో పరిపాలకుల అంగీకారాలకు ఇదేవిధమైన రాజ్యాంగసంబంధమైన విలువ ఇవ్వలేదే అని, ఒక వాదం వినబడుతూ ఉంటుంది. ఈ రాజ్యాల ముస్లింనవాబులు అంగీకరించకపోయినప్పటికీ, అచటి ప్రజలు మాత్రం భారత్‌లో విలీనానికి పూర్తిగా సుముఖులు. నిజానికి వారు ఆ పరిపాలకులపై తిరుగుబాటు చేశారు. కాని కాశ్మీరువిషయంలో మాత్రం మహారాజొక్కడేకాదు తమ ప్రతినిధులసభద్వారా ప్రజలందరూకూడా తాము భారత్‌లో విలీనమవుతామని ముక్తకంఠంతో తమ కోర్కెను వ్యక్తం చేశారు. కాబట్టి ఏదృష్టితో చూచినప్పటికీ భారత్‌లో కాశ్మీరువిలీనం తిరుగతోడవలసిన అంశం కాదు; దానిపై చర్చించవలసిన అవసరమేలేదు.

కనుక 1947 లో అన్యాయంగా, బలప్రయోగంతో దురాక్రమణ చేసిన కాశ్మీర్‌లోని భూభాగాలనుండి పాకిస్తాన్ ఖాళీచేయటమొక్కటే నేటి ప్రశ్న అని, మధ్యస్థంచేసే ఈ రాజ్యాలవారికి మనం గట్టిగా చెప్పాలి. ఇతరమైన ఏ చర్చల్లోకి మనం దిగరాదు. పాకిస్తాన్ ఇక మరెన్నడూ దాడిచేయదని ఐక్యరాజ్యసమితినుంచి హామీ మనం కోరరాదు. అట్టి హామీలన్నీ కొరగానివి అని గతం చెప్పుతోంది. తాను ఎన్నెన్ని పెద్దపెద్ద హామీలను ఇచ్చిఉన్నప్పటికి, పాకిస్తాన్‌కు చెందిన సాయుధులైన అక్రమప్రవేశకులనుగాని, సైన్యాలనుగాని, కాశ్మీర్‌లో ప్రవేశించకుండా నేడు ఈ ఐక్యరాజ్యసమితి ఆపుచేయలేకపోయింది. తన హామీలను భవిష్యత్తులో అమలుపరిచేందుకు విదేశీసైన్యాలకు వసతికల్పించాలనే అంశం అందులో ఇమిడిఉన్నట్లైతే, సరిహద్దులను సంరక్షించుకునే నిమిత్తమై విదేశీసైన్యాలను మన భూభాగంపై ఉండనివ్వటంకన్న వేరే అవమానం ఉండబోదు. ఈ సమయంలో మన దృఢసంకల్పాన్ని సడలించే చిహ్నాలను ఏమాత్రం కనబర్చినా, మరొకసారి విదేశీశక్తుల రాజకీయకుతంత్రాలకు అవకాశం కల్పించినా, అది ప్రజల గుండెనిబ్బరాన్ని తీవ్రంగాక్రుంగదీస్తుంది. అంతేగాదు, యుద్ధరంగంలో మన సైనికులు చేసిన అనంతమైన ఆత్మబలిదానంవల్ల, వారు పడిన బాధలవల్ల మన దేశానికి సమకూరిన సత్ఫలితాలన్నిటినీ వమ్ము చేస్తుంది; సైనికులు సాధించిన దాన్ని రాజకీయ నాయకులు పోగొట్టుకోరాదు.

భారతదేశాన్ని, పాకిస్తాన్‌ను-రెండింటినీ-ఒక చోటికి ఆహ్వానించటం ద్వారా దురాక్రమణకారుణ్ణి, ఆక్రమితుణ్ణి ఒకే స్థాయిలో రష్యా ఉంచినందువల్ల సంప్రదింపుల నిమిత్తమై మన ప్రధానమంత్రి తాష్కెంట్ వెళ్ళటానికి అంగీకరించకుండా ఉండవలసిందని భావిస్తున్నాను. అసలు మాట్లాడటానికి మాత్రం ఏముంది? యుద్ధోన్మాదంతో ఊగిపోతూన్న పాకిస్తాన్ బలవంతంగా ఒక పరిష్కారాన్ని మనమీద రుద్దాలని ప్రయత్నిస్తుంటే వారితో

మాట్లాడి ప్రయోజనం ఏమిటి? కాశ్మీరు భారతదేశంలోని అంతర్భాగమే, అనే నిజాన్ని పాకిస్తాన్ అంగీకరించనంతవరకు ఇట్టి సంప్రదింపులవల్ల ఊడిపడే దేమీ ఉండదు. ఒకవేళ ఏ ఒప్పందమన్నా కుదిరితే అది మన ప్రయోజనాలకు విరుద్ధంగా ఉండితీరుతుంది.

## శాశ్వతంగా పరిష్కరించండి

మరొక పాకిస్తానీ దండయాత్రప్రమాదం ఇంకా ఉండనేఉంది. కాల్పులవిరమణ ముసుగులో నే దది సైన్యం పెంచుకోటానికి తీవ్రంగా కృషి చేస్తోంది. తానెంత నష్టపడినప్పటికీ, మన ఆయుధసామగ్రి, సైనిక వ్యూహరచన, మనశక్తి, మనబలహీనతలను అదికనిపెట్టింది. ఈఅనుభవం నుండి గుణపాఠాన్ని గ్రహించి తన లోటుపాటులన్నింటినీ సరిదిద్దుకొని తీరుతుంది; మరింతశక్తితో, చక్కని పథకంప్రకారం దాడిచేసితీరుతుంది. యుద్ధోన్మాదజాతులు యుద్ధానంతరశాంతిని, మరింత పెద్దయుద్ధానికి సంసిద్ధమయ్యేందుకే సర్వదా వినియోగించుకున్నాయి. నిజానికి తనకు గలిగిన ఆయుధనష్టాన్ని పాకిస్తాన్ ఈపాటికే వేగంగా భర్తీచేసుకుంటూఉంది. అది ఇంకా కయ్యానికి కాలుదువ్వుతూనేఉంది; యుద్ధవిరమణరేఖను దురహంకారంతో పదేపదే అతిక్రమిస్తూనేఉంది. యుద్ధవిరమణానంతరం మనభూమిని అనేకవందల చదరపుమైళ్ళు ఆక్రమించింది. మన ప్రజలను చంపటం, మన పశువుల నెత్తుకపోవటం, పంటలను కోసుకపోవటం, తుపాకికాల్పులు, అక్రమ స్వాధీనాలు ఇంకా నిరాఘాటంగా సాగుతూనేఉన్నాయి. ఈ పరిస్థితి మన కత్యంత అవమానకరం. ఇది సహించరానిది. ఈ పరిస్థితిని ఎక్కువకాలం కొనసాగనివ్వకూడదు. దీనికి ఒకఅంతం ఉండాలి. తాడోపేడో తేల్చేయాలి,

## మహాయుద్ధానికాహ్వానం

చైనా పాకిస్తానుల దుష్టకూటమివి గురించి మనం అనవసరంగా భయపడనక్కరలేదు. ఈ దురాక్రమణదారు్ని నిద్దరిని లొంగదీసి తీరుతాం.

మన సైన్యం అద్భుతమైన యుద్ధసన్నద్ధతతో ఉంది. వారి గుండెనిబ్బరం అత్యద్భుతం. చైనా తాను చేసిన హెచ్చరికప్రకారం మనదేశంపై దండయాత్ర జరిపిఉంటేనే బాగుండేది. దానివల్ల చైనాతో జరిగిన పోరాటంలో మనకేర్పడ్డ పరాజయావమానకళంకాన్ని తుడిచిపారేయడానికి, చైనాను మట్టి గరిపించేందుకు మన సైన్యాలకు ఒక దివ్యమైన అవకాశం కలిగి ఉండేది. పాకిస్తాన్‌వంటి చిన్నరాజ్యంతో యుద్ధం చేయడంలో విశేషమేముంది? చైనాతోకూడ యుద్ధం జరిగిఉంటే భారతీయవీరత్వంయొక్క మహోన్నతప్రమాణాలను యావత్ప్రపంచం దర్శించి ఉండేది.

సర్వతోముఖము, తీవ్రమూ ఐన యుద్ధాన్ని మనం చైనాతో చేసిఉంటే అది అంతర్జాతీయరంగంలోకూడ అత్యంత ప్రయోజనకరమైన ఫలితాలను ఇచ్చిఉండేది. భారత్‌వంటి విశాలదేశం చైనాఆధిపత్యంలోకి పోతూఉంటే, రష్యా తన ప్రయోజనాలదృష్ట్యా, చూస్తూఊరుకోలేదు. చైనా దురాక్రమణను నిలవరించడానికి రష్యా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భారతదేశానికి సహాయం చేసితీరవలసివచ్చేది. అమెరికాకూడ భారత్ పాకిస్తాన్‌లపట్ల తన విధానాన్ని పునఃపరిశీలించుకోవలసివచ్చేది. చైనా శిబిరంలోకి పూర్తిగా చేరిపోయిన పాకిస్తాన్‌కు తాను సహాయం చేయటానికి, ఆవిధంగా ఆసియారంగంలో చైనా తిరుగులేని ఒక మహాశక్తిగా రూపొందే అవకాశాన్ని చేతులారా కల్పించటానికి అమెరికా సాహసించి ఉండేదికాదని స్పష్టమే. తన ప్రయోజనా లేమిటో అమెరికాకు తెలుసు. గాలికొట్టి ఉబ్బించిన పాకీస్తానీ సైనిక నియంతృత్వంకన్న ప్రజాస్వామ్యాల్లోకల్లా పెద్దదైన భారత్ తనకు ఎక్కువ ప్రయోజనకారి అని అమెరికా నిర్ణయించుకొనిఉండేది. ఇంతవరకు అనుసరిస్తున్న దోషభూయిష్ఠ విదేశాంగ విధానాన్ని సరిదిద్దుకొనేందుకు దానికొక సదవకాశం లభించిఉండేది-నామమాత్రమైన పాకీస్తాన్‌వంటిదేశాలు ఎంత ఆయుధసంపత్తిని సమకూర్చుకొన్నప్పటికీ భారత్‌వంటి విశాలము పరాక్రమోపేతము ఐన దేశాలను జయించలేవని నేటియుద్ధం నేర్పిన నీతివల్ల

అమెరికా తనవిధానాలను మరొకలా రూపొందించుకొనిఉండేది. ఆవిధంగా మానవజాతికంతకూ ప్రమాదకారియైన చైనాకు వ్యతిరేకంగా, రెండు పెద్ద అణుశక్తి సంపన్న దేశాలు సంయుక్తకృషి సల్పటానికి, బలిష్ఠమైన, స్వేచ్ఛా ప్రేమియైన భారతదేశం ఒక భూమికను ఏర్పరచిఉండేది. విశ్వశాంతి దృష్ట్యా అదొక అత్యంత వాంఛనీయ పరిణామంగా రూపొంది ఉండేది.

నేటి ఈ పరిమితయుద్ధంకాక, అట్టి సంపూర్ణసంగ్రామమే వచ్చి ఉన్నట్లయితే, అది మనదేశంలోని ప్రతివ్యక్తినీ సర్వాంగీణయుద్ధకృషిలో నిమగ్నుణ్ణి చేసిఉండేది; జాతికి పట్టిన బుద్ధిజాడ్యాన్ని వదలించి ఉండేది. మనలో అలసత్వం, స్వార్థం, సంకుచితత్వం వంటి అనేక దుర్గుణాలను ఆంగ్లేయులక్రింద మనం అనుభవించిన దీర్ఘదాస్యం, అణిగిమణిగిన జీవితం కలిగించాయి. దీర్ఘకాలిక యుద్ధాగ్నిలో ఈ దుర్గుణాలు, బలహీనతలు అన్నీ పూర్తిగా భస్మమైపోయి సమైక్యము, పరాక్రమోపేతమునైన జాతీయతా సువర్ణం మరింత మిలమిలలాడి ఉండేది. కనుక తాత్కాలిక కష్టాలకు మనం గురి ఐనప్పటికీ, ఒక మహాయుద్ధం నేడు వాంఛనీయం. పరంపరాగతంగా మనం అత్యంత శాంతిప్రియులమైనప్పటికీ, యుద్ధోన్మాదులం కానప్పటికీ, నిజంగా అట్టి మహాయుద్ధంకోసం హృదయపూర్వకంగా ప్రార్థించాలి. స్వేచ్ఛాగౌరవాలతో గూడిన శాంతియుత జీవనంకొరకు మనం చెల్లించవలసిన వెల అది. దాన్ని ఎంతత్వరగా చెల్లించగలిగితే అంత మంచిది.

# 25. రణరంగంలో రాష్ట్రం

## 2. సవాలు నెదుర్కొనాలి

ఏ విధంగా చూచినా, ప్రస్తుతపరిస్థితి మనకొక సవాలు, సదవకాశం కూడా. జాతీయజీవనంలోని అన్నిరంగాల్లోనూ, స్వయంసమృద్ధిని సాధించుకోటమే మనం ఎదుర్కొనవలసిన ముఖ్యమైన సవాలు.

### స్వావలంబనమే స్వాతంత్ర్యానికి వెన్నెముక

సమృద్ధి, స్వాతంత్ర్యాలు కావాలంటె జాతికి స్వావలంబనమే వెన్నెముక అనే మహత్తర జీవనసత్యం మనకు నేడు స్పష్టమైనంతగా ఏనాడూ కాలేదు. మనం ఆత్మనిర్భరతను సాధించుకోవలసిన ప్రప్రథమ రంగం రక్షణ. మన యుద్ధశక్తిని మనమే నిర్మించుకోవాలి; విదేశీసహాయంపై ఆధారపడడం మానేయాలి. పారిశ్రామికవేత్తలు, శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు – అందరికీ ప్రభుత్వం పిలుపునిచ్చి, వారందరి సహకారంతో అతిత్వరలో శత్రువుల ఆయుధాలకన్న మిన్నయైన వాటిని తయారు చేసుకోవాలి. సామ్యవాదచైనావద్ద అణ్వాయుధం ఉన్నందున, మనంకూడ వాటిని తప్పనిసరిగా తయారుచేసుకోవలసిన అవసరం ఉంది. అణ్వాయుధం ఒక్కటే ప్రజల్లోను, సైన్యంలోను, అంతిమవిజయం మనదే

అనే ఆశను వెలిగించగలదు. సిద్ధాంతరాద్ధాంతాలు దీనికి ప్రతిబంధకం కారాదు.

## ప్రతికార్మికుడు, శాస్త్రజ్ఞుడు

అంతేగాదు, మనమంతా-రైతులు, కార్మికులు, పారిశ్రామికులు, ఇతర జీవితరంగాల్లో పనిచేసేవారందరూ - అత్యవసరవస్తువులన్నిటి ఉత్పత్తిని అధికంచేసేందుకు దృఢసంకల్పంతో కృషిచెయ్యాలి. తిండికికూడా ఇతర దేశాలపై ఆధారపడే నేటిదుస్థితినుంచి బయటపడాలి. ప్రతిపరిశ్రమ, ప్రతి వ్యవసాయక్షేత్రం అత్యధికఉత్పత్తిని సాధించాలి. అత్యవసర వస్తువుల విషయంలో కొరత ఏమాత్రం ఉండకూడదు.

ముఖ్యంగా శాస్త్రజ్ఞులకు యుద్ధం ఒక పెద్దసవాలు. శాస్త్రజ్ఞులు సృష్టించిన నూతనసాధనాల్లో గొప్పగొప్పవి చాలవరకు గడ్డయిన యుద్ధ కాలాల్లో కనిపెట్టినవే. 'నవసృజనకు నవసరంబు నాంది పలుకు' అంటారు. బ్రిటన్ చలనవేధిని (రాడార్) కనుగొన్నదీ, అణువిశ్లేషణ జరిగినదీ రెండవ ప్రపంచయుద్ధకాలంలోనే. మేధాశక్తిలోగాని, సృజనాత్మకశక్తిలో గాని మనశాస్త్రజ్ఞులు ప్రపంచంలో ఎవ్వరికీ తీసిపోరు. పరిస్థితుల సవాలును వారు స్వీకరించి, అటువంటి పరిశోధనలుచేసి, క్రొత్తవిశేషాలను కనిపెట్టాలి. ఈ వార్త విన్నంతనే శత్రువులగుండెలు దిగజారిపోవాలి. శాంతిసమయంలో వాటినే జాతీయాభివృద్ధికి మలచుకోవచ్చును.

## పొట్టకూటి సమస్య

ఇక శీఘ్రాతిశీఘ్రంగా మనదృష్టి మరల్చవలసింది ఆహారరంగం వైపు. దేశంలో ఆహారపుకొరత రోజురోజుకు పెరిగిపోతోందని అందరికీ తెలుసు. తగినంత ఆహారం సకాలంలో అందజేయాలని చేసే ఆందోళనలు ప్రదర్శనలు, దాదాపు ఒక నిత్యకృత్యం ఐపోయాయి. ఆందోళనలు

తరచు హింసాయుతంగా మారిపోతాయి. ప్రజల బాధలను వ్యక్తంచేయ టానికి ఆందోళన అంగీకృతమైన పద్ధతిగా నేడు ఒప్పుకొంటున్నాం. నిజమే. ప్రజలు మూగవారిలా నోరుమెదపక కూర్చుంటే ప్రభుత్వంకూడా నిద్రపోతూ ప్రజల బాధలను లక్ష్యపెట్టదు. అవాంఛనీయమైన ఆందోళనల నివారణకు తగిన చర్యలను మన ప్రభుత్వం సకాలంలో తీసికోదు. కొల్హాపూర్ సంఘటన దీనికి ప్రత్యక్ష నిదర్శనం. ఆనగరంలో తిండిగింజల ఆందోళన జరిగింది. ఆకలిగొన్న ప్రజ దొమ్మికి, దోపిడీకి దిగింది. ఆహారధాన్యాలు ఒక్కవారంముందు కొల్హాపూర్ చేరిఉంటే, ఈ అల్లరి జరిగిఉండేది కాదని అన్నారు. దొమ్మిలు, దోపిడీలు జరిగినతరువాతనే అక్కడికి ఆహారధాన్యాలు సరఫరా అయ్యాయి.

కాని ఆందోళనలు సమస్యల్ని శాశ్వతంగా పరిష్కరిస్తాయా ? ఉత్పత్తి, పంపిణీలు ఆహారసమస్యలోని రెండు అంశాలు. పంపిణీ అనే రెండవ అంశంపట్ల ప్రభుత్వందృష్టిని ఆకర్షించటానికి మాత్రమే ఈ ఆందోళనలు కొంతవరకు ఉపయోగపడతాయి. కాని అసలు సమస్య ఐన ఉత్పత్తిని గురించి స్థిమితంగా ఆలోచించి, శాశ్వత పరిష్కారం కనుగొనేట్లు ఈ ఆందోళనలు చేశాయా ?

## ఆత్మహత్యాసదృశ్యమయిన ధనవ్యామోహాన్ని ఛేదించండి

ఉదాహరణకు: సారవంతమైన లక్షలాది ఎకరాల్లో వాణిజ్యపంటలు పండిస్తున్నారు. ఉత్తరప్రదేశ్, బీహార్ల సంగతి చూడండి. గోధుమ వరి పండించవలసిన మంచిమంచి భూముల్లో చెరకుపండిస్తున్నారు. ఫలితంగా ఒకప్పుడు గోధుమను విరివిగా ఎగుమతిచేసే ఉత్తరప్రదేశ్ నేడు పంజాబ్ మొదలైన ప్రాంతాలనుంచి గోధుమ దిగుమతి చేసుకోందే బ్రతకలేదు. మహారాష్ట్రలో ద్రాక్షతోటలు పెంచటంలో (ముఖ్యంగా సారా తయారీ కోసం) పోటీ ఏర్పడింది. ఆంధ్రలో పొగాకు పంటను ప్రోత్సహించేందుకు

పొగాకు అభివృద్ధిశాఖ ఒకటి ఏర్పాటయింది. వేరుసెనగకూడ ఇట్లాంటిదే. ఈ ధోరణిని అరికట్టి ఆ యా భూములను ఆహారధాన్యం ఉత్పత్తికి మళ్ళీ వినియోగించాలి. మనం దిగుమతే చేసుకోవలసివస్తే, గోధుమకు బదులు పంచదారనే దిగుమతి చేసుకొందాము. ఈనాటివలె ఆత్యయికపరిస్థితి ఏర్పడినప్పుడు పంచదార దిగుమతి ఆగిపోయినా పర్వాలేదు. పంచదార లేకపోతే చచ్చిపోం. బియ్యం, గోధుమల కొఱత ఏర్పడితే మాత్రం బ్రతకలేం. పి. యల్. 480 క్రింద అమెరికా గోధుమల దిగుమతికొరకు మన నాయకులు ఎట్లా పరుగులు పెడుతున్నారో మనకు తెలుసు. ఈ అప్పు చేయందే – అది అప్పే; సాయంకాదు – మనం బ్రతకలేమని వారి నమ్మకం.

ఐతే వాణిజ్యపంటలను ఎందుకు పండిస్తారు? దైనందిన జీవితంలో డబ్బుకు అనవసరమైన ప్రాధాన్యం ఇచ్చాంకనుకనే. డబ్బు కేవలం ఒక వినిమయ మాధ్యమం; ఒక సాధనం. దురదృష్టవశాత్తు అట్టి సాధనానికి ఊడిగం చేస్తున్నాం. ధనప్రాధాన్యంగలదృష్టి మనజీవితంపై పెత్తనం చెలాయిస్తూ ఉంటే తమను, నగరవాసులనుకూడ పోషించడానికి కావలసిన ఆహారధాన్యాలు గ్రామీణులు ఉత్పత్తిచేయాలని మనం ఎట్లా ఆశించగలం? ఆహారధాన్యాలు లేకపోతే బ్రతికేదెట్లా? డబ్బు తిని బ్రతకగలమా?

ఆహారధాన్యాల స్వయంసమృద్ధి జాతీయరక్షణకు "తప్పనిసరి" అనే భావన దేశవ్యాప్తంగా మన రైతులందరిహృదయాల్లో హత్తుకపోయేట్లు చేయాలి. ప్రజలందరినీ పోషించజాలినంతగా ఆహారధాన్యాలను ఉత్పత్తి చేయటం, తమ పవిత్ర జాతీయకర్తవ్యం అని వారు భావించేట్లుచేయాలి. తర్వాతనే, కావాలనుకొంటే వాణిజ్యపంటలు పండించుకోవచ్చు. అత్యంత ప్రధానమైన ఈ రంగంలో స్వావలంబన సాధించగలిగే పద్ధతులను ప్రభుత్వమూ, ప్రజలూ రూపొందించుకోవాలి.

## పరావలంబన తెచ్చిన పీడ

రోజులు గడుస్తున్నకొద్దీ స్వావలంబన ఎంతత్వరగా సాధించాలో మరింతస్పష్టమవుతోంది. ఒక ఉదాహరణ : మనదేశంలోని పంటలు నీరు లేక ఎండిపోతూఉంటే, ఉదారంగా కాలువనీటిని పాకిస్తానుకు విడుదల చెయ్యాలి అనీ, ప్రతి ఒక పైసను రక్షణనిమిత్తం పొదుపు చేయవలసిన సమయంలో కోట్లాది రూపాయలు పాకిస్తాన్‌కు చెల్లించాలనీ ప్రభుత్వం నిర్ణయం చేసింది. ఆర్థికసహాయంకొరకు మనం ఆధారపడినట్టి ప్రపంచ బ్యాంకుయొక్క ఒత్తిడికి మనం లొంగిపోయాం అని దీనివల్ల తెలుస్తూనే ఉంది. "బిచ్చగాళ్ళకు ఎంచుకొనే హక్కులేదు"- ఋణగ్రస్తులూ అంతే - అన్నమాట మనవిషయంలో అక్షరాలా నిజమైంది. ఇన్నేండ్లుగా మన ఆర్థిక స్థితిని ఆత్మనిర్భరం చేసుకోవటంలో చూపిన అశ్రద్ధకు మనం చెల్లించిన వెల యిది. తిండి, డబ్బు - ఇంకా ప్రతిదీ అడుక్కుతినే అలవాటు పద్దెనిమిది సంవత్సరాలుగా ఏర్పడింది. అది మనలోని స్వయంకృషిని, మగటిమిని పూర్తిగా పిండివేసి, మనల్ని కేవలం బానిసలుగా మార్చేసింది. బయటి ఒత్తిడులకు తట్టుకనిలబడి పాకిస్తానుయొక్క దురాక్రమణదాహాన్ని ఇనుమడింపచేసేందుకు ఉపయోగపడే ఒక్కపైసగాని, ఒక్క నీటిబొట్టు గాని దానికి ఇవ్వం అనడానికి మన నాయకులకు ఇది ఒక చక్కని అవకాశం. పాకిస్తాన్ మనపై దండయాత్రచేసిన మరుక్షణమే కాలువనీటి ఒప్పందంక్రింద మన హామీ అనేది ఏదైనా ఉండిఉంటే అది తనంతట తానే రద్దయిపోయింది. కావాలని మనమీద దురాక్రమణ జరపటంవల్ల మనకు సంభవించిన నష్టాలన్నిటికీ పూర్తిపరిహారాన్నీ, దేశవిభజననాటి నుండి గత పద్దెనిమిది సంవత్సరాల్లో జరిగిన వివిధ ఒప్పందాలక్రింద ఏర్పడిన బకాయిలన్నిటినీ పూర్తిగా చెల్లించుమని మన నాయకులు పాకిస్తాన్‌ను అడిగిఉండవలసింది. అట్టి దృఢవిధానం తొలిదశలో కొన్ని కష్టాలను కల్గించినప్పటికీ, ఆర్థికంగా స్వయంపోషకం కావటానికి జాతి చేసుకొన్న నిశ్చయాన్ని వజ్రసదృశం చేసిఉండేది

జాతీయస్వాతంత్ర్య గౌరవాలను నిలబెట్టుకొనేందుకు అడ్డుదారులు లేవనే విషయం మనం అర్థం చేసుకోవాలి. ఆ లక్ష్యాన్ని చేరుకునేందుకుగాను ప్రతిజాతి ఆత్మనిర్భరత, ఆత్మసమర్పణల కఠోరమార్గాన పయనించి తీరాలి.

## మరువరాని నీతి

ఒక చిన్న నీతికథ వుంది. ఒక పక్షి ఒక పంటచేలో గూడు కట్టుకుంది. కోతల సమయంలో కొడుకులతో రైతు అక్కడకు వచ్చి, పంటను చూచుకొని, కోత కోయటానికి సహాయం రమ్మని బంధువులకు కబురు పెట్టమని ఒక కొడుకుతో చెప్పాడు. ఈ మాటలు విని బెంబేలు పడిపోయి పక్షిపిల్లలు సాయంత్రం గూటికి చేరిన తల్లితో 'అమ్మా! అమ్మా! మనం వెంటనే ఇక్కడ నుంచి వెళ్ళిపోవాలి" అని అన్నాయి. తల్లి మాత్రం "అప్పుడే ఏం తొందరలేదు" అని వాటితో చెప్పింది. రెండు రోజులైనా కోతల కెవ్వరూ రాలేదు. రైతు పొలానికి మళ్ళీ వచ్చి, కూలీలకు కబురు పంపమని కొడుకులతో చెప్పాడు. ఈ మాట విన్న పిల్లలు, మళ్ళీ తల్లికి చెపితే, పక్షి "మీరేమి కంగారు పడవద్ద"ంది. కానీ మూడోసారి పొలం ఆసామీ కొడుకులతో, "మనతో ఎవరూ కలిసొచ్చేట్టు లేరు. రేపు పొద్దున్నే మనమే కోత మొదలుపెట్టేద్దాం" అన్నాడు. ఈ మాటలు విన్న పక్షి పిల్లలు, ఆ విషయం తల్లికి చెప్పగానే "ఆ! ఇప్పుడు మనం తప్పక వెళ్ళిపోవాలి. ఇప్పటిదాకా తన పని గురించి ఇతరులపై ఆధారపడ్డాడీ రైతు. కనుక పని మొదలు కావటమే కష్టం. ఇప్పుడు తానే వచ్చి పని మొదలుపెడతానంటున్నాడు కనుక, పని తప్పక ప్రారంభమవుతుంది" అన్నది.

ఈ కథ వ్యక్తులకుగానీ, జాతులకుగానీ, ఒక నీతిని బోధిస్తుంది. మిగతా సమయాల్లో కంటే, ఈ క్షణంలో ఈ నీతిని మనం తప్పక గుర్తుంచుకోవాలి.

## ఉజ్జ్వల ఉదాహరణ

ఆచరణపూర్వకమైన ఇట్టి దేశభక్తి భావనలో ప్రజలకు శిక్షణ ఇవ్వవలసి ఉంది. దేశక్షేమం ఆశించినంత మాత్రాన చాలదు; జాతీయ సంక్షేమాన్ని గురించిన ఆకాంక్షలను మన ప్రవర్తనలో ఎంత ఉత్తమంగా వ్యక్తం చేయగలమో తెలుసుకోవాలి.

జన్మతః ఏర్పడిన దేశభక్తిని ఏవిధంగా ఆచరణలో చూపాలో వివరిస్తుంది ఇంగ్లండుయొక్క ఉజ్జ్వల ఉదాహరణ. మొదటి ప్రపంచ యుద్ధం చెలరేగగానే భారత్‌వంటి దేశాలనుండి ఆహారపదార్థాలను దిగుమతి చేసుకోవటం ఇంగ్లండుకు కష్టమైపోయింది. ఆహారపదార్థాలను తీసుకు పోతున్న బ్రిటిష్ నౌకలను జర్మనీ ముంచివేయసాగింది. యుద్ధ యోజనల నన్నిటినీ దెబ్బతీసేంతగా పొట్టకూటిసమస్య ఏర్పడింది. అప్పుడు వారు సాగుచేయదగిన ప్రతిచిన్న ముక్కను సాగుక్రింద తేవటానికి బృహత్పథకం వేసుకొన్నారు. ఏ పంట ఎంతపండించగలరో అంచనావేసుకొని, తదను గుణంగా వారు ఆహారరంగంలో క్రమబద్ధంగా ఒక సంవత్సరం తీవ్ర కృషి చేశారు. తత్ఫలితంగా వారు తమ కనీస అవసరాలు తీర్చుకునేందుకు తగినంత స్వయంసమృద్ధి సాధించుకున్నారు. యుద్ధంవల్ల ఏర్పడే గడ్డు సమస్యల్లో ఒక ప్రముఖమైనదానికి వారా విధంగా తట్టుకొని నిలబడగలిగారు. తక్కువశాతమే పంటభూమి కలిగిన ఇంగ్లండు ఈ అద్భుతాన్ని సాధించ గలిగింది. దానితో పోల్చిచూస్తే మనదేశం ఎంత విశాలమయింది! ఎంత సారవంతమైంది! నిజానికి మనదేశం భూసారానికి పెట్టింది పేరు. ఐనప్పటికీ ప్రముఖమైన ఈ రంగంలో ఆత్మనిర్భరతను సాధించలేక పోతున్నాం. ఈ సవాలు నెదుర్కొనేందుకు జాతీయసంకల్పశక్తిని జాగృతంచేసి, నిర్మాణాత్మకమైన మార్గాల్లో అన్వయించుకోవాలి.

## జాతీయ మనోబల నిర్మాణం

జాతియొక్క మనోబలాన్ని అత్యున్నతస్థాయిలో ఉంచగలగటం అత్యంత ప్రముఖసమస్య. ఎందుచేతనంటే రక్షణ, ఆహారం, పారిశ్రామిక ఉత్పత్తి మొదలైనవాటిలో స్వయంసమృద్ధిని, ఆత్మనిర్భరతను సాధించేందుకై అమలుచేసే పథకాల విజయం - తాత్కాలికాలూ, దీర్ఘకాలికాలూ కూడా-తమ నెత్తుటినీ, చెమటనూ, కన్నీటినీ ఏండ్లతరబడి సమర్పించటానికి ప్రతిఒక్కరూ సంసిద్ధంగా ఉండటంమీద పూర్తిగా ఆధారపడిఉంది. తీవ్రమైన జాతీయ చైతన్యప్రబోధం ఒక్కటే, ఆనందమయమైన ఆత్మసమర్పణభావముయొక్క శాశ్వత స్ఫూర్తిస్రోతస్సును ఉద్గమింపచేయగలదు. కాబట్టి ఈనాడు వ్యక్తమైన మహత్తర జాతీయ మనోబలాన్ని నిలిపి ఉంచటానికి, జాతీయకృషిలోని ప్రతిఅంశంలోను జాగరూకులమై ఉండటం అత్యంతావశ్యకం.

## వ్యతి వర్తకుడు

ఈ విషయంలో వర్తకవర్గం ఒక ప్రముఖపాత్రను నిర్వహించవలసి ఉంది. యుద్ధసమయంలో వస్తువులు అరుదవుతాయి, గిరాకీ పెరుగుతుంది; పెద్దపెద్ద లాభాలమీద చూపుపడుతుంది. ముఖ్యంగా శత్రువుల తాకిడికి గురియైన ప్రాంతాల్లో ఆస్తులు, ప్రాణాలు నష్టమైపోతూంటే సమాజ వ్యతిరేకులైన కొందరు ధూర్తవ్యాపారులు ప్రజలను గుప్పిట్లోపెట్టుకుని బేరమాడే అవకాశం ఏర్పడుతుంది. 1962 లో చైనీయుల దురాక్రమణ మేఘాలు క్రమ్ముకురాగా, ప్రజలు తేజ్‌పూర్‌నుండిపారిపోతూ బ్రహ్మపుత్రానదిని దాటడానికి ప్రయత్నించినపుడు, రిక్షావాలాలు, పడవలవాళ్లుకూడ తలఒకటికి

50 నుండి 100 రూపాయలవరకు వసూలుచేశారు! ఇటువంటి సంఘటనలే ఈమధ్య జామ్‌నగర్‌లో జరిగాయి. ప్రాణాలు అరచేత పెట్టుకొని పారిపోతున్న తోటిసోదరులను కాపాడటంలేదు సరిగదా, వాళ్ళ దుస్థితిని

ఆసరాచేసుకొని మరింత పీల్చి పిప్పిచేయటానికి ప్రయత్నించటం మానవ దుర్దశను వ్యాపారంగా వాడుకోవటమే అవుతుంది. అది నరమాంసభక్షణకన్న ఏమాత్రం తీసిపోదు. అత్యవసర వస్తువుల ధరలను పెంచటం ఇంతకన్న తక్కువ నిందార్హం ఏమాత్రం కాదు.

వర్తకవర్గం ఈ మన స్తత్వాన్ని దరిచేరనీయరాదు. ఇటువంటి క్లిష్టసమయాల్లో అతిప్రముఖమైన ఈ రంగం ప్రజల మనోబలంమీాద దెబ్బతీయకుండా ఉండేట్లుచూడాలి.

## ప్రతి గ్రామం

ప్రతిగ్రామం, ప్రతినగరంకూడ అన్నివిధాలా మనోబలాన్ని నిలబెట్టుకోవాలి. అలసత్వచ్ఛాయలనైనా కనపడనీయరాదు. యుద్ధ రంగంలోని మన సైనికులయొక్క మనోబలాన్ని దెబ్బతీసే సంఘటనలు ఎక్కడా జరుగరాదు, దేశంలో శాంతిభద్రతలను, వ్యవస్థను భగ్నంచేసి, సమర సన్నాహాలను బలహీనపరిచే శక్తులపైన నిశితమైన నిఘా, అదుపు ఉండాలి. భరోసావల్ల ఏమరుపాటు కలుగకూడదు. 'నిరంతర జాగరూకతయే స్వాతంత్ర్యానికి రక్ష'. పౌరరక్షణ కార్యక్రమాలన్నిటితోబాటు సమాజ వ్యతిరేక, జాతివ్యతిరేక వర్గాలపట్ల సంపూర్ణమైన జాగరూకత, సన్నద్ధతలు ఉండాలి. లేకపోతే దొంగచాటుగా దేశంలో చొరబడేవారూ, పంచమాంగ దళమూ కలిసిపోయి, ఆంతరంగిక భద్రతకు ముప్పుతెచ్చే అవకాశం ఏర్పడుతుంది.

## ప్రభుత్వం

ఈ సందర్భంలో ప్రభుత్వానికి ఒక ప్రత్యేకమైన బాధ్యత ఉంది. అట్టి విద్రోహకర వర్గాలపట్ల తీవ్రంగా వ్యవహరించేందుకు సర్వసన్నద్ధంగా ఉండటమేగాక, అటువంటి సంఘటనలు జరిగినప్పుడల్లా తాను తీసికొన్న కఠినచర్యలను బహిరంగంగా ప్రకటించాలి.

గుజరాత్ ముఖ్యమంత్రి, బల్వంతరాయ్ మెహతా, ప్రయాణం చేస్తున్న పౌరవిమానాన్ని పాకిస్తాన్ కూల్చివేసింది. అతను దివంగతు డయ్యాడు. మనసరిహద్దుల్లోనే ఉంటున్న పాకిస్తానీతొత్తులు ప్రసారణి (ట్రాన్స్‌మిటర్) ద్వారా ముందుగానే శత్రువులకు కీలక సమాచారాన్ని అందించారేమో అన్న గట్టి అనుమానం ప్రజలకు ఏర్పడింది. అటువంటి ప్రసారణులు దేశమంతటా పనిచేస్తున్నాయని ప్రజలకు రూఢిగా తెలుసు. అట్టిసంఘటనల్లో బాధ్యులైన విదేశీ ప్రతినిధులను శిక్షింపగలిగిందా, లేదా, అనే విషయంతో ప్రజలకు సంశయం ఏర్పడింది. ఈనాటికిగూడ ప్రభుత్వం ఆ అనుమానాన్ని తొలగించలేకపోయింది. అధికారపూర్వకమైన వార్తలు వెలువడకపోతే ఆంతరికశత్రువులతో వ్యవహరించేందుకు మనం చేపట్టే భద్రతాపథకాలు సమర్థమైనవేనా అని, ప్రజల్లో తీవ్రమైన సందేహాలు కలగటం సహజమే. అట్టిపరిస్థితివల్ల ప్రభుత్వంపట్ల ప్రజల విశ్వాసం తీవ్రంగా కదిలిపోతుంది. ప్రస్తుత పరిస్థితుల్లో అటువంటి స్థితి తీవ్ర ప్రమాదాలను కల్పిస్తుంది. దోషులను వెన్నాడి ప్రభుత్వం బంధించినట్లైతే, మన ఆంతరిక భద్రతాప్రయత్నాలు సమర్థమైనవేనని ప్రజలు విశ్వసించే రీతిగా ఆ వార్తను ప్రభుత్వం ప్రకటించాలి. అప్పుడు తాము ప్రభుత్వంతో సహకరించాలనే కోరిక ప్రజల్లో మరింతగట్టిపడుతుంది.

## జాతిముఖ్యం – ధనం కాదు

ప్రతివ్యక్తి తన కార్యకలాపాలన్నింటిలోనూ జాతీయ దృష్టినే ప్రధానంగా ఉంచుకొనేట్లు ప్రజలందరూ తయారు కావాలి. ఈ ప్రముఖ ఆలోచనే ప్రభుత్వం ఏపని చేపట్టినా ఎల్లప్పుడూ మనసులో ఉంచుకోవాలి. పాకిస్తానీ గాలిగుమ్మటంసైనికులను (పారాట్రూపర్లు) పట్టుకుని అప్ప గించినవారికి 500 రూపాయిల నగదు బహూకరిస్తామని ప్రభుత్వం ప్రకటన చేసింది. ఇట్టి క్లిష్టసమయాల్లో జాతులను ఉద్రూతలూగించివేయగల

భావోద్వేగాలను గురించి ప్రభుత్వానికి అర్థంకాలేదు అన్నవిషయం దీన్ని బట్టి స్పష్టపడుతోంది. ధనప్రలోభంకన్న దేశభక్తిభావనను ప్రభుత్వం ఆవాహనచేసి ఉండవలసింది; దొంగచాటుగా లోపలదూరి దేశాన్ని వెన్ను పోటు పొడిచే ఈ శత్రువులను వెదికిపట్టుకొమ్మని పిలుపు ఇచ్చిఉండ వలసింది. ధనమొక్కటే ప్రజలను ఆకట్టుకోగలిగితే తనతో సహకరించే వాళ్ళకు పాకిస్తాన్ వెయ్యిరూపాయిలు ఎరవేస్తే, అది మన ప్రభుత్వం చూపే ప్రలోభాన్ని వమ్ముచేసి దేశద్రోహులను సృష్టించవచ్చును. నిజానికి ఆ గాలిగుమ్మటం శత్రుసైనికులు తమ విద్రోహచర్యల్లో భాగస్వాములుగా మన ప్రజలను కొనెయ్యాలనే ఉద్దేశ్యంతోనే పెద్దపెద్ద మొత్తాలు తమవెంట తెచ్చారు. కాబట్టి ధనప్రధానమైన ప్రేరణవల్ల ప్రజల్లో జాతీయభావానికి బదులు ధనాశ మేల్కొని, ప్రభుత్వం తలపెట్టినదానికి పూర్తిగా విరుద్ధమైన పరిణామాలు సంభవించవచ్చును.

## విలీనానికి మార్గం

దేశమంతా అల్లుకపోయిన పాకిస్తానీవర్గాన్ని అదుపులోకితెచ్చి, కొంత మేరకు బలహీనపరిచినది జాతీయచైతన్య, పరాక్రమాల ప్రబోధమే అని నేటిస్థితిబుజువుపర్చింది. గతంలో ఆ వర్గం దేశాన్ని ముప్పుతిప్పలుపెట్టింది. నేటివరకూ అప్పుడప్పుడు సంభవిస్తున్న కల్లోలాలు, వాటిలో చెలరేగే హింసాకాండ, ప్రస్తుత క్లిష్టసమయంలోగూడ వారిలో కొందరి అనుమానా స్పదమైన ప్రవర్తన-ఇవన్నీ చూచినమీదట, వారు జాతీయ జీవనగంగా ప్రవాహంలో విలీనంకావటానికి సంసిద్ధంగా లేరని చెప్పవలసివస్తోంది.

టర్కీ, ఇరాన్‌లవంటి దేశాల్లోని తోటి మతస్థులను ఈవిషయంలో అనుకరించటం ఇక్కడి ముస్లిములకు శ్రేయస్కరం. అరేబియానుంచి ఇరుగుపొరుగు దేశాలకు ఇస్లాం వ్యాపించినప్పుడు స్థానికులు ఆ మతాన్ని స్వీకరించినప్పటికీ, తమ సంస్కృతిని, భాషను, జీవనవిధానాన్ని యథాతథంగా

నిలబెట్టుకున్నారు. ముస్లిందేశమైన ఇండొనిషియాలో బాలుడు సీతారాముల కథలతో తమ చదువు ప్రారంభిస్తాడు. ఈదేశంలోని ముస్లిములు మాత్రమే తమ జాతీయ వారసత్వాన్ని - పూర్వీకులను, భాషను, ఆచారాలను మన్నించటంలేదు. తమ పరంపరను వారు విస్మరించడమే దేశవిభజనకు దారితీసింది.

భారత్ తన పరాక్రమాన్ని, స్థైర్యాన్ని ప్రకటించి, కుటిలమతులను తా నెంతగట్టిగా మట్టుపెట్టగలదో యావత్ప్రపంచానికి వెల్లడిచేయటంవల్లనే ఈనాడు వారిలో కనపడుతున్న మార్పు ఏర్పడిఉండవచ్చును. ఏది ఏమైనప్పటికీ, నేడు వారిలో వచ్చిన ఈ మార్పు నిజమైన హృదయపరివర్తన వల్లనే సంభవించింది అనీ. తాముకూడ ఒకప్పుడు హిందువులే, ఈదేశాన్ని విశ్వాసపాత్రులుగా నిజాయితీతో సేవించటం, తోటివారితోపాటు కష్టసుఖాల్లో పాలుపంచుకొనటం, ఈదేశ సంప్రదాయాలను గౌరవించటం తమ విధి అనీ- ఈ విధంగా వారు కాలక్రమంలో గ్రహించగలరనీ ఆశిద్దాం. మనకు సంబంధించినంతవరకు జాగరూకులమై, దృఢసంకల్పులమై ఉంటే, ఊగిసలాడే ఇటువంటి వర్గాలన్నీ ప్రధాన జాతీయతాస్రవంతిలో విలీనం కావటం తమమంచికే అని గుర్తించగలవు.

## చక్కబరచటానికి సాధనం

జాతీయచైతన్యాన్ని, మనోధైర్యాన్ని జాజ్వల్యమానంగా ఉంచాలి. దానికి ఎంత జాగరూకత అవసరమో అర్థమౌతోంది. నిన్నటి వరకు స్వార్థం, పార్టీ కక్షలు, అధికారంకోసం కీచులాట, అంతఃకలహాలు మన జాతీయజీవనాన్ని కలుషితంచేసి, సమైక్యతను ఛిన్నాభిన్నం చేస్తుండేవి. వేర్పాటుధోరణి శతానేకరూపాల్లో తలెత్తుతూ ఉండేది. మన వీరజవానులు చేసిన ఆత్మాహుతిలో ప్రజ్వరిల్లే పవిత్ర చితాజ్వాలల్లో ఈనా

దవన్నీ భస్మమైపోతున్నాయి. కేరళ, మద్రాసులనుండి బెంగాలు పంజాబులవరకు గల అన్నిప్రాంతాలనుండీ ఏకత్రితులైన మన వీర జవానులు యుద్ధరంగంలో భుజంభుజం కలిపి, కష్టసుఖాలు కలిసి పంచు కుంటూ, మాతృదేశ రక్షణకొరకు కలిసికట్టుగా పోరాడుతూ, మరణిస్తూ ఏకైక అఖండమాతృభూమియొక్క - భారతమాత - దివ్యమూర్తిని ప్రతిష్ఠించారు. ఆంతరిక జాతీయ సమైక్య అమృత స్రోతస్సులు ఈనాడు మరొక్కసారి ఉద్బుద్ధమయ్యాయి. మన జీవనంలోని విశిష్టమైన అల్లికను గ్రహించలేనివాళ్ళకు దిగ్భ్రాంతిని గొల్పేటంతటి వైవిధ్యం ఉన్న ఈ దేశ మంతా సమైక్యమై, విరాట్‌పురుషునివలె వెలుగొందింది.

## ఏకత, తాత్కాలికం, శాశ్వతం

ఇదంతా కలకాలం ఉంటుందనీ, రాష్ట్రాన్ని నరనరం నమిలివేస్తున్న విఘటన ధోరణులు, అవగుణాలు అన్నీ వెనుకటిమాటలనీ గట్టిగా చెప్పగలమా ?

1962 అక్టోబరులో చైనా దురాక్రమణతర్వాత జరిగినవి మనకు కనువిప్పు కలిగించాలి. ఆ దురాక్రమణ సంభవించినంతనే మన ప్రజలందరూ ఒక్కత్రాటిమీద నిలబడ్డారు. కాని, చైనీయులు ఏకపక్షయుద్ధవిరమణను ప్రకటించి, ఉపసంహరించుకొన్న తర్వాత ఆ జాతీయభావం ఎంతకాలం నిలిచింది? అది ఎంతక్షణికమో చెప్పటానికి ఒక్క ఉదాహరణ చాలు. ఈమధ్యనే (1965 జనవరిలో) మనభాషల్లో ఒకటైన హిందీపట్ల ద్వేషం, విదేశీభాషయైన ఆంగ్లంపట్ల వ్యామోహాలవల్ల ప్రేరితులై మద్రాసు ప్రాంతంలో ఒక ఉద్యమంలేవదీశారు. కోట్ల విలువగల జాతీయ ఆస్తి ధ్వంసం అయింది. ఉత్తరాది ప్రజలు, దక్షిణాదిప్రజలు ఇక కలసిజీవించటం అసంభవం అని, ఉత్తర దక్షిణాలుగా దేశాన్ని చీల్చిపారెయ్యటం ఒక్కటే శరణ్యం అనికూడా, ఆంగ్లభాషాప్రియుల ప్రముఖనాయకుడు ఒకడు

ప్రకటించాడు. చైనాదురాక్రమణ సంభవించినపుడు - అంటే గట్టిగా రెండు సంవత్సరాలైనాకాలేదు - జాతీయ ఏకత్వాన్ని గురించి ప్రజలముందు చేసిన ప్రసంగాలు, చేయించిన ప్రమాణాలు ఏమైనట్లు?

ప్రస్తుత అత్యవసరపరిస్థితిలోగూడ, ప్రాతఅలవాట్లలోకి దిగజారిపోయే గొంతుకలు వినపడుతున్నాయి. నిరహారదీక్ష పూనుతానని, ఆత్మాహుతి చేసుకుంటాననీ సంత్ ఫతేసింగ్ చేసిన తుదిహెచ్చరికతో తీవ్రరూపందాల్చింది పంజాబీసుబా సమస్య. కాని పాకిస్తాను దురాక్రమణ ప్రారంభించినంతనే అతడు ఆ హెచ్చరికను ఉపసంహరించుకోవటంతో అది తాత్కాలికంగా చల్లారిపోయింది. కావి యుద్ధవిరమణ ప్రకటన జరిగిన మరుక్షణమే పూర్వపు తగాదా మళ్ళీరేగింది. మాతృభూమికొరకు బలియైన వీరుల నెత్తుటితడి ఇంకా ఆరిపోలేదు, పంజాబులో; అంతట్లోనే అంతఃకలహాల్లో మునిగి పోతోంది!

## విషాదానుభవం

మన అధినేతలు గూడా గుణపాఠాలు నేర్చుకోరనీ, సరైన దృక్పథాన్ని అలవరుచుకోరనీ అనిపిస్తోంది. నేటి సన్నివేశంలో కూడా నా కొక విషాదకరమైన అనుభవం కలిగింది. పాకిస్థాన్ మన మీద దండయాత్ర చేయగానే, వివిధ రాజకీయ పక్షాల నాయకుల్నీ, నన్నూ కూడ సంప్రదింపులకు మన ప్రధానమంత్రి ఆహ్వానించారు. ఆ సమావేశంలో ఒకనాయకుడు పదే పదే "మీ సైన్యం, మీ సైన్యం" అనసాగాడు. అతడు 'మీ సైన్యం' అన్నప్పుడల్లా నేను, "మనసైన్యం" అని సూచించేవాణ్ణి. కానీ అతను ఆ మాటనే పట్టుకు వేళ్ళాడుతుంటే, చివరకు నేనడ్డు తగిలి "మీరేమంటున్నారు. మీ మాటలకు అర్థమేమిటో తెలుసునా" అన్నాను. ఈ గట్టి చురకతో, అతను జాగ్రత్తపడి తన్ను తాను సరిదిద్దుకున్నాడు. సమావేశంలో పాల్గొన్న సభ్యుల మాటల తీరుతెన్నులకు నేనాశ్చర్యపడ్డాను.

'శత్రువుని పారద్రోలాలి' అని ఒక కోరిక, ఏదో లీలగా వారిలో వుంది తప్పిస్తే, కలిసికట్టుగా పని చేసే ఆలోచన వారికున్నట్టు లేదు. వారక్కడికి వచ్చి ఏవో కొన్ని ముఠాలకు నాయకులుగానో లేక, పరస్పర విరోధివర్గాల నాయకులుగానో కనబడ్డారు.

నిజానికి పాతపగలను తిరుగతోడే ఇట్టిమనస్తత్వం మనచరిత్రలో కనిపించే దోషాల్లో ఒకటి. కాసేపు మేల్కొని, సుష్ఠుగాభోజనంచేసి మరల గాఢనిద్రలో మునిగిపోయే కుంభకర్ణునివంటిది మన సమాజం. ఒక విజయం కలుగగానే భరోసాఏర్పడి, పట్టుసడలిపోయి, ప్రాతపగలలోకి దిగజారి పోవటంవల్ల, శత్రువు తిరిగి దెబ్బకొట్టటానికి అవకాశం ఏర్పడుతోంది. మన స్వాతంత్ర్యయోధులు సాధించిన తొలివిజయాలు వారిని అశ్రద్ధకు లోనయ్యేట్లు చెయ్యటం, 1857 స్వాతంత్ర్యసంగ్రామంతో మన ఓటమికి గల ముఖ్యకారణాల్లో ఒకటి. నానాసాహెబ్, తాత్యాతోపేవంటి కొంతమంది అగ్రనాయకులుతప్ప తదితర స్థానికనాయకుల్లోను, అనుయాయుల్లోను బిగువు తగ్గింది. కనుకనే అనుకూలపరిస్థితి ఏర్పడినా, సంపూర్ణవిజయం సాధించే నిమిత్తమై, దాన్ని వినియోగించుకోలేకపోయారు వారు. దానివల్ల విప్లవపు తాకిడినుండి తెప్పరిల్లి, స్వాతంత్ర్యయోధులపై చావుదెబ్బ కొట్టటానికి వీలుగా శక్తి నంతనూ కూడదీసుకోవటానికి ఆంగ్లేయులకు అవకాశం లభించింది.

కాబట్టి జాతీయచైతన్య సమైక్యాలు శత్రుదురాక్రమణ జరిగిన సమయంలో తాత్కాలికంగా పెల్లుబికివచ్చే భావాలుగాగాక, మరింత లోతుగాను, భావాత్మకంగాను నాటుకుని ఉండవలసిఉంది. ఐతే అట్టి శ్రద్ధా, ఏకాత్మల వేళ్ళు ఎక్కడ ఉన్నాయి ?

## అత్యుత్తమ వాదం

నేటి క్లిష్టసమయంలో దురాక్రమణదారుని తరిమికొట్టేందుకు త్యాగ భావనను, కష్టసహిష్ణుతను, సమైక్యకృషిని ఆవాహనచేస్తూ మన నాయకులు

రకరకాల పిలుపులు ఇచ్చారు. ప్రజాస్వామ్యం, లౌకికరాజ్యం, సమాజ వాదాల పేరున ఇచ్చిన పిలుపులు అవి. మనోవాక్కాయకర్మలలో స్వాతంత్ర్యపు హక్కును ప్రసాదించే అత్యుత్తమ ప్రజాస్వామ్యభావనకు హిందూపరంపరలోకన్నా మరెక్కడా సరియైన గుర్తింపులేదు; ఆచరణా లేదు. మతనిరపేక్షత అంటే, రాజ్యం ఏ ఒక్కమతసంప్రదాయానికి ముడి వేసికొని ఉండరాదు అనీ, అన్నిమతాలనూ సమానంగా గౌరవించాలనీ అర్థంగనుక ఐతే, అది హైందవపరంపరకు మారుపేరు మాత్రమే. నిజానికి హైందవసంప్రదాయం కేవలం సహనమనే పాశ్చాత్యభావనకన్న ఎంతో ముందడుగువేసింది. అన్నిమతాలు పవిత్రతలో సమానమైనవే అని హిందూవిశ్వాసం. సమాజవాదం అంటే ఆర్థిక అసమానతలను తొలగించటం అనే అర్థమేగనుక ఐతే, అందులోకూడ హిందూ ఆలోచన, ఆచరణలు, ఆర్థిక, సాంఘిక న్యాయాలకు సంపూర్ణమైన హామీ ఇస్తాయి. వ్యక్తికి ఆస్తిమీద హక్కు ఆరోజు ఆహారంవరకు మాత్రమే పరిమితమైనదని మనువు ప్రకటించాడు. అంతకన్న ఎక్కువగా దాచుకోవటానికి ప్రయత్నించినవాడు దొంగ, వాణ్ణి శిక్షించాలి.

మరింత చక్కని పద్ధతిలో తరతరాలుగా వారి రక్తంలో ఇమిడి ఉన్న హిందూసంప్రదాయం, హిందూరాష్ట్రీయతల పేరున ఈ భావనలన్నిటినీ మన ప్రజల్లో ప్రబోధించవచ్చు. ఆత్మసమర్పణ, పరాక్రమాలు వారి పరంపరాగత గుణాలు. వాటిని ఉద్బుద్ధం చేయగల నిజమైన ప్రేరణస్రోతస్సు హిందుత్వంలోనే ఉంది. నేటి జాతీయ పరీక్షాసమయంలో ఏది కోరితే దాన్ని స్వచ్ఛందంగా, సంతోషంగా సమర్పించేట్లు ప్రజలను అదే సంసిద్ధం చేస్తుంది.

జాతీయజీవనంలోని ఈ మౌలికసత్యాన్ని ఎంతత్వరగా అర్థం చేసుకుంటే అంతమంచిది. విశుద్ధజాతీయభావనలోనే వాస్తవము, శాశ్వతము ఐన స్ఫూర్తి లభిస్తుంది. మనందరకు తల్లి ఐన పవిత్రభారతమాతపట్ల

ఉజ్జ్వల ప్రేమభావన, ఒకే తల్లికి సంతానంగా అనన్యము, అవిభాజ్యము ఐన భ్రాతృభావన, మన ప్రాచీనవైభవంపట్ల, మన విశిష్ట సాంస్కృతిక వారసత్వంపట్ల గర్వం, భారతమాతను ప్రపంచజాతులమధ్య ఆమె పురాతన వైభవప్రతిష్ఠల శిఖరాగ్రాన మరల దర్శించాలి అనే ఆకాంక్ష-ఇవిమాత్రమే శక్తిమంతము, శాశ్వతమూ ఐన ప్రేరణ ఇస్తాయి. ఆ పొంగు దేశంలోని మహోన్నతులను, అతిసామాన్యులనుగూడ ముంచి లేవనెత్తి, దేశంకొరకు వారిలోని అత్యుత్తమ గుణసంపదను వెలువరిస్తుంది. ప్రస్తుతక్లిష్టసమయంలో ప్రదర్శితమైన ప్రజల అజేయ ఆంతరికశక్తిని అదిమాత్రమే పూర్తిగా వికసింపజేస్తుంది. ఆనాడే బ్రహ్మతేజ, క్షాత్రతేజాలు మూర్తీభవించి అజేయము, అఖండము ఐన భారతమాత ఒక చేత కమలాన్ని, మరొక చేత వజ్రాన్ని ధరించి, వరప్రదాయినిగాను, దుష్టసంహారిణిగానూకూడ ప్రత్యక్షమౌతుంది.

# 26. గుణపాఠాలను మరువరాదు

(బంగ్లాదేశ్ విమోచన యుద్ధారంభ సమయంలో చేసిన ప్రసంగం నుండి)

ప్రస్తుత యుద్ధం మన దేశాన్ని ఒక మూసలోని లోహం లాగా కరిగించి, మన రాష్ట్రీయ భావనను ఉత్తేజపరచి, సమైక్యతా, దేశభక్త్యా వేశముల కొక రూపాన్ని కల్పించింది. మన జాతి మౌలికంగా ఒక్కటే నని మరొకసారి ఋజువైంది. బూజు పట్టిన మన ఆలోచనలను, గందర గోళాన్నీ, భ్రమలనీ, మున్నెన్నడూ ఎరగనంతగా పరిశుభ్రం చేసింది.

ఆంగ్లేయులు మన దేశం విడిచి పోయినంతర్వాత, ప్రపంచంలోని అందరి శాంతి సౌమనస్యాలకూ, అంకితమైయున్న మనకు, సహృదయతా సమాదరణములే సర్వత్రా లభ్యమవుతాయని సహజంగానే విశ్వసించాం. కానీ గత పాతిక సంవత్సరాలుగా, పదే పదే మన కెదురైన కఠోరాను భవాలు, కనువిప్పు కలిగించాయి. ప్రపంచపు కుటిల నీతులు మన కర్థ మయాయి. మనలాగానే ఉదాత్తమైన ఆదర్శాలకు నిజాయితీతో అంకిత మైన మిత్రులు ప్రపంచంలో మన చుట్టూ ఉన్నారనీ, మనపై దురాక్రమణ జరిగితే, వారు మన సహాయానికి తప్పక పరువెట్టి వస్తారనే మనంనమ్మాం; ఈనాడు మన కెదురైన ఈ ప్రమాదంతో మన నమ్మకం వమ్మయింది. ఆశలు అడియాశలని తేలింది.

## తల బొప్పికట్టింది

ఇంకొక భయంకరానుభవం కూడా మనకు ఎదురైంది. మనది ప్రజాస్వామిక దేశమే— అందునా ప్రపంచంలోని అతి పెద్ద ప్రజాస్వామ్యమే అయినప్పటికీ, ఇంకే ఇతర ప్రజాస్వామ్యదేశం గూడా ముందుకొచ్చి బాహాటంగా మనల్ని సమర్థించలేదు. నిర్ద్వంద్వంగా పాకిస్థాన్ దేశపు ఆటవిక నియంతృత్వాన్ని గర్హించలేదు.

అమెరికా ఉన్నత మానవతా ప్రమాణాలను ప్రశంసించే దేశం. కనుక, మన ఆదర్శాలూ అవే గనుక, మన దేశానికి తప్పనిసరిగా అమెరికా నిజమైన మిత్రుడుగా ఎల్లప్పుడూ వ్యవహరించగలదనుకున్నాం. కానీ పాకిస్థాన్‌కు బాహాటంగా ఆ దేశం చేసిన సహాయంతో మన వెర్రి భ్రమలు తొలగిపోయాయి. నేటి యుద్ధారంభానికి ముందు మన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ న్యాయమైన, మానవతాయుక్తమైన, మన ప్రయత్నానికి సహాయాన్నర్థిస్తూ ప్రపంచమంతా చుట్టి వచ్చింది. అప్పుడే తల బొప్పికట్టి జ్ఞానోదయమయింది. మరొకసారి పాకిస్థాన్ నుండి, చావుతప్పి కన్ను లొట్టపోయి వెలికివస్తున్న లక్షలాది శరణార్థుల సమస్య గురించి ప్రపంచ రాజ్యాలవారు అసలు ఏ మాత్రం పట్టించుకోకుండా, వారి దుఃస్థితికి ఒట్టి సానుభూతినే ఒలకబోస్తున్నారని ఆమె ఎంతో బాధతో ప్రకటించింది.

## బలవంతునిదే రాజ్యం

ఐక్యరాజ్యసమితి న్యాయం సమకూర్చగలదన్న మన విశ్వాసం అపోహయేనని ప్రత్యక్షంగా నిరూపితమయింది. ఐక్యరాజ్యసమితి, పాకిస్థాన్‌కు అనుకూలమూ, భారత్‌కు వ్యతిరేకమూనైన ఎత్తుగడలతో, న్యాయం, సత్యం, మానవత్వపు విలువల వంటి నీతి సూత్రాలను గంగలో కలిపింది. ఐ. రా. స. అంటే— తమ స్వార్థపూర్తికే పని చేస్తున్న పెద్ద

రాజ్యాల వేటకు భూమి అనే సంగతి వెల్లడయింది. ఒకసారి మనం కాశ్మీరు విషయంలో చేతులు కాల్చుకున్నాం. మరింక ఐ. రా. సమితిద్వారా సమస్యా పరిష్కారాన్ని ఆశించి చిక్కులలో మరోసారి పడలేమని మన ప్రధాన మంత్రి ప్రకటించింది సత్యమే.

'కచ్ ట్రిబ్యునల్' అన్న పేరున ఏర్పడిన న్యాయవిచారణ సంఘం ఎదుట, మన పక్షాన వాదించే మన దేశీయ, ప్రథమ శ్రేణి న్యాయశాస్త్రవేత్త నొకరిని,- అంతర్జాతీయ న్యాయసంఘాలపై మాట్లాడవలసిందిగా ఒకసారి ఒక న్యాయవాది మిత్రుడు కోరాడు. ఆయన ఆ విషయంపై సుదీర్ఘ ప్రసంగం చేసేందుకు తనకు సమయం లేదనీ, కానైతే, ఆ విషయ సారాంశాన్ని రెండు ముక్కలలో వివరిస్తానంటూ 'దుడ్డు ఎవరిదో గొడ్డు వాడిదే' అనేదే మొదటి అంతర్జాతీయ న్యాయసూత్రమనీ, ఒక అసత్యాన్ని వందసార్లు పదేపదే చెపితే అదే నిజమై కూర్చుంటుందనేదే రెండవ సూత్రం (డాక్టర్ గోబెల్సు యొక్క తప్పుడు సిద్ధాంతం ఇది) అని అన్నాడు.

నేటి ప్రపంచంలో ఇదే వాస్తవం కాబట్టి మనం ఉదాత్తమైన జాతీయ ప్రయోజనాల కనుగుణంగా మాత్రమే మన విధానాలను రూపొందించుకోవాలి. అనవసరంగా ఆరాటపడి, ప్రపంచాభిప్రాయమనే దానిలోబడి కొట్టుకుపోరాదు. ప్రపంచం జోక్యం చేసుకుంటుందేమోనని మనం బెదిరినంతకాలం మనంతట మనంగా కార్యాచరణకు భయపడినంతకాలం, ప్రపంచం జోక్యం చేసుకుంటూనే ఉంటుంది. మనం నిర్భయంగా పని చేసినప్పుడే, ప్రపంచం మన జోలికి రాదు. ఇది మనకు కలిగిన సరికొత్త అనుభవం. ఇది చాలా విలువైనది.

## దుష్టత్వాన్ని చీల్చి చెండాడాలి

ఏ రకంగా చూచినా, పాకిస్థాన్ యొక్క పాశవికమైన దొంగల దోపిడీ స్వభావం ఇప్పుడు పూర్తిగా వెల్లడయింది. పాకిస్థాన్ మనపైచేసిన

నాలుగవ దురాక్రమణ ఇది. మన దేశం పట్ల విద్వేషం దాని రక్తంలోనే ఉంది. నిజానికి విద్వేషం, రక్తపాతాల నుంచే అది జన్మించింది. అట్టి నెత్తుటి కూడు కుడవనిదే అది బ్రతుకలేదు. పుడుతూనే 1947లో మన మీద దండయాత్ర జరిపి కాశ్మీరులో ఐదింట రెండు వంతుల భూభాగాన్ని కబళించింది. మళ్ళీ 1965 కచ్ ప్రాంతంలో మన మీద దాడి జరిపి, కొంత భాగం ఆక్రమించింది. అటుపైన కాశ్మీరులో మిగిలిన భూభాగం హస్తగతం చేసుకునేందుకై ఛాంబ్ రంగంలో దాడి జరిపింది. తదనంతరం, మన దేశం యెడ పాపిష్ఠి వ్యూహం పన్నే చైనాతో చేతులు కలిపింది.

పాకిస్థాన్ కేవలం పదే పదే మన మీద దాడి జరపటమే గాదు. అది పుట్టిన దగ్గర నుంచీ, ఆ దేశంలో ఉండిపోయిన దురదృష్టవంతులైన అల్పసంఖ్యాక ప్రజానీకంపై రాక్షసమైన దుర్మార్గాలు చేస్తోంది. నీచాతి నీచమైన అధికారాన్ని చలాయిస్తూ, అణచివేత విధానాన్ని కొనసాగిస్తోంది. వారిని జీవచ్ఛవాలుగా చేసి లక్షల సంఖ్యలో మన దేశం లోనికి పారద్రోలు తోంది. తూర్పు బెంగాలులో మున్నెన్నడూ జరుగనిరీతిగా దారుణ హత్యా కాండ జరిపింది. కోటి మంది ప్రజలను నిలువనీడ లేకుండా తరిమివేసింది. మానవత్వానికి వ్యతిరేకంగా జరిగిన నీచాతినీచమైన కిరాతక కృత్యమిది యని యావత్ప్రపంచం అందుకై దానిని గర్హించింది గూడా.

## పెద్దలుచేసిన సముచితమైన హెచ్చరిక

పాకిస్థాన్ మన మీద పదేపదే జరుపుతున్న దురాక్రమణలూ, మన జాతికి వ్యతిరేకంగా అది కొనసాగిస్తున్న కిరాతక నేరాలూ, అందుకుమనం చేసిన ప్రతిచర్యల తీరూ, మనకు గట్టి బుద్ధి చెప్పాయి.

మనం కేవలం ఆత్మరక్షణనే తలచి, ఏదో విధంగా మనల్నికాపాడు కోవాలని మాత్రమే యత్నించటం నిష్ప్రయోజనం. అలా చేస్తే మరింత

పెద్ద ప్రమాదాలను మళ్ళీ మళ్ళీ ఆహ్వానించటం మాత్రమే కాగలదు. అలా కాక, అట్టి దుర్మార్గపు శత్రువును పూర్తిగా ఓడించాలి. అలా ఓడించటం మనకేదో భూభాగాన్ని గెలుచుకోవాలనే కోర్కె వలన కాదు. మానవత్వాన్ని మట్టుబెట్టే క్రూరకృత్యాలకు ఒడిగట్టే దాన్ని శాశ్వతంగా నాశనం చేసేందుకే. అలా చేస్తే భవిష్యత్తులో మన భద్రతకు ఎట్టి ప్రమాదం ఉండదు. అట్టి పరిపూర్ణవిజయమే మన లక్ష్యం కావాలి. విజ్ఞానవంతులైన మన పూర్వజులు, కణశేషం, వ్రణశేషం, ఋణశేషం, రణశేషం మిగులనీయరాదని ప్రకటించారు. ఛాయామాత్రంగానైనా మిగులనీయకుండా వానిని నిర్మూలించాలి. లేకుంటే శేషంగామిగిలిన అగ్నికణమే కాలక్రమంలో సమస్తాన్నీ కాల్చి వేసే జ్వాలగా పెంపొందుతుంది. పూర్వ కాలంలో స్వతంత్రం కోసం పోరాడిన వీరులైన మన సేనానాయకులెందరో విజ్ఞానప్రదమైన ఈ హెచ్చరికను పాటించక, క్షాత్రధర్మమనే భ్రమకు లోనై, తమకు బందీలైన శత్రురాజులనూ, సేనాధిపతులనూ విడిచిపెట్టారు. ఆ శత్రువులే మళ్ళీ తమ బలం పుంజుకొని మనవారిపై మరొకసారి దాడి చేసి, మన వారిని నాశనం చేసిన సంగతి చరిత్ర మనకు చెపుతోంది.

## యుద్ధంపట్ల సరియైన దృక్పథం

విదేశీ పరిపాలకులు మనపైన రుద్దిన రాజకీయ కుతంత్రమే పాకిస్థాన్. పాకిస్థాన్ ఒక అతుకుల బొంత. ఈనాడది చీలిపోతోంది. అందులోని వివిధ భాగాలనూ కలిపి కట్టి ఉంచగల పరస్పరానుబంధ సూత్రం ఏమీ లేదని చెప్పటానికది నిదర్శనం. పశ్చిమ పాకిస్థాన్ కూడా తీవ్రంగా చీటలువారుతోంది. అది మరల మరో నాలుగురాజ్యాలుగా విడివడబోతోంది.

ఈ మాటంటే చాలు అదంతా యుద్ధోన్మాదం అంటుంటారు. దుష్టశక్తులకు వ్యతిరేకంగానూ, న్యాయం, మానవత్వపు విలువల సంరక్షణకుగానూ, పోరాటం జరపాలనటం యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టటమని భ్రమించ

రాదు. యుద్ధోన్మాదం ఎన్నడూ మన రక్తంలోనే లేనే లేదు. మన తత్వశాస్త్రం శక్తినంతనూ వెచ్చించి పోరాడమని బోధిస్తుందిగానీ యుద్ధోన్మాధాన్ని మాత్రం అది తిరస్కరిస్తుంది. యుద్ధజ్వరాన్ని విడిచి యుద్ధం చేయమని శ్రీ కృష్ణుడు అర్జునుని ఆజ్ఞాపించాడు (యుద్ధస్య విగత జ్వరః). స్వీయకర్మ నాచరించుట పట్ల అచంచల నిష్ఠతో యుద్ధం చేయమని గూడా చెప్పాడు (స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హాసి).

## ప్రజాసమర్ధనే వెన్నెముక

యుద్ధకాలంలో, సామాన్యప్రజానీకమైన మనవంటి వారిబాధ్యతలను గురించి ఇంక పరిశీలిద్దాం. ప్రభుత్వానికి సహాయం చేయటంలోనూ, మన సైనికుల్లో సమరోత్సాహం నింపటంలోనూ, మన శక్తియుక్తులన్నిటినీ ఎంతో చక్కగా సమీకరించాలి. క్రియా రూపంలో వాటినన్నిటిని ఏలా వినియోగించాలి? అనే విషయంపై మన దృష్టిని కేంద్రీకరించాలి. ఈ రోజుల్లో యుద్ధాలు కేవలం సైనికులకు మాత్రమే పరిమితం కావనిఅందరికీ తెలిసిన సంగతే. అవి ఏదో ఒక విధంగా ప్రజలందరినీ లుంగచుట్టేస్తాయి. కాబట్టి ఇట్టి సంపూర్ణ యుద్ధాల్లో ప్రజల యొక్క ధైర్యస్థయిర్యాలనుఉన్నతంగా నిలబెట్టాలి. కొందరు విదేశీతొత్తులు మన దేశంలోపలనుంచే, మనకు వెన్నుపోటు పొడిచే ప్రమాదం ఎంతైనా రూఢిగా ఉంది. దానిని జాగరూకమైన ప్రజానీకం మాత్రమే వమ్ము చేయగలదు. కేవలం రక్షక భటులకది సాధ్యం కాదు. పౌరభద్రతా చర్యలు, రక్తదానాలు, క్షతగాత్రులైె సైనిక సిబ్బందికి సేవలూ చికిత్సల వంటివి సామాన్య ప్రజలమైన మనం వెను వెంటనే నిర్వహించవలసిన అత్యవసర సేవా కార్యక్రమాలు.

## సైనికునకు ఉత్తేజం కలిగించేదెట్లా ?

అన్నిటికన్న ముఖ్యంగా ప్రజానీకమంతా, తప్పనిసరిగా, నిరాడంబరంగా, స్వాత్మార్పణ చేయాలనే ఉత్సాహాన్ని నిత్య జీవితంలో ప్రద

ర్శించాలి. పటాటోపాన్నీ, విలాసమయ జీవితాన్నీ ప్రజలు విడిచిపెట్టాలి. మరో ముఖ్యవిషయమున్నది. ప్రమాదకరమైన ఇట్టి విషమ ఘడియల్లో కూడా, మన దేశపు యువత, క్షణికములైన మోజులు, శారీరిక సుఖాలవెంట పడుతుంటే, మన ప్రజానీకం చిలిపి తగాదాలలో, రాజకీయ స్పర్ధలలో మునిగితేలుతూ ఉండిపోతే, ఇట్టి జాతికోసం తన ప్రాణాలను అర్పించాలనే స్ఫూర్తిని మన సైనికుడు పొందగలడా? అలాకాక, దేశప్రజలంతా, తన కష్టనష్టాలన్నిటిలోనూ, తనతోపాటే నిలుస్తారనే నమ్మకం అతనికి కలిగించనక్కరలేదా? ఒకవేళ యుద్ధరంగంలో అకస్మాత్తుగా చనిపోతే, అతని కుటుంబాన్ని సమాజం ఆదుకొంటుందనీ వారి భౌతిక కష్టనష్టాలు గట్టెక్కిస్తుందనీ నమ్మకం అతనికి కలిగించనక్కర్లేదా? వీరోచితమైన తన బాధ్యతానిర్వహణను, ప్రజలు ప్రశంసిస్తారనే విశ్వాసం కల్గిస్తే, అతడు యుద్ధరంగంలో, పరాక్రమాన్నీ, స్వాత్మార్పణాభావాన్నీ, వంద రెట్లుగా ప్రదర్శించేందుకు అది దోహదం చేస్తుంది.

## గుణపాఠాలను మరచిపోరాదు

చివరి మాటగా చెప్పుకోవాలంటే, నేటి ఈ విషమపరీక్షలో, ఎంతో నష్టపోయి నేర్చుకున్న గుణపాఠాలను మరువరాదు. జాతీయ చైతన్యంగల సమైక్య ప్రజానీకం మాత్రమే క్రమంగా, శక్తిమంతమూ, సంపన్నమూ కాగలదు. కాబట్టి, ఈనాడు ప్రకటితమైన ఈ జాతీయ సమైక్యతా, ఉత్సాహాలను, చిన్నచిన్న రాజకీయ తగాదాలు కారణంగా నీరుకారిపోనీయ రాదు. ఇది ఈనాటి ప్రథమ కర్తవ్యం. కష్టించి పనిచేయాలనే మన సత్త్వాన్ని నిలబెట్టుకోవటం రెండవ కర్తవ్యం. మన దేశం స్వయం పోషకమయేట్లుగా ప్రతిరంగంలోనూ ఉత్పత్తి అధికం కావాలి. కాబట్టి అటువంటి స్వాత్మార్పణం చేయగల, క్రమశిక్షణ గల, పౌరుషయుక్తమైన జాతీయ వ్యక్తిత్వాన్ని రూపొందించుకోవటమే ఇప్పుడు మన ముందున్న ముఖ్య కర్తవ్యం. ఈ ఏకైక కార్యం కొఱకే రాష్ట్రీయ స్వయంసేవక సంఘం పూర్తి ఏకాగ్రతతో అంకితమై కృషి చేస్తున్నది.

# 27. కీర్తి పతాకాన్ని ఎగురవేయండి

(విదేశాలలోని హిందువుల నుద్దేశించిన ప్రసంగం)

విదేశాల్లో నివసిస్తున్న మన సోదర సోదరీమణులు, తమ నిత్య జీవన వ్యవహారంలో, ప్రగాఢమైన జాతీయ స్వాభిమానాన్ని ఉజ్జ్వలంగా నిలుపుకోగల్గుటయే వారి ప్రథమ కర్తవ్యం. అందుకై మన పూర్వులు మన కొక మార్గం చూపారు. అట్టి ఉజ్జ్వల వారసత్వాన్ని సరిగా మనం అవగాహన చేసుకొని సదా మనస్సులలో నింపుకోవాలి.

ప్రాచీన కాలంలో భారతదేశం అనుభవించిన ఉజ్జ్వల వైభవానికి సజీవమైన సాక్ష్యాలు ఈనాటికీ ఎన్నో లభిస్తున్నాయి.

## ప్రపంచం మననుండి ఆశించేదేమిటి ?

అమెరికాలోని మెక్సికో మొదలుకొని, దూరప్రాచ్యంలో ఉన్న పసిఫిక్ తీరాల్లోని చిన్న చిన్న ద్వీపాల వరకూ, మన హిందూ జీవనవ్రతులు, సుదూర ప్రయాణాలు చేసి, మన ప్రాచీన విజ్ఞానపు సౌరభాన్ని వెదజల్లారు. వైద్యవిద్య, గణితం, విజ్ఞానశాస్త్రాలు, కళా సంస్కృతీ రంగాలలో తాము సాధించిన ఫలితాలను కానుకలుగా తాము వెళ్ళినచోటనల్లా పంచిపెట్టారు. అయితే అన్నిటికన్న మిన్నగా సర్వదా మానవుని మనస్సుపైన శాశ్వత

మైన ముద్రవేసే సుస్థిరములైన ఆధ్యాత్మిక విలువల గురించే వారు ప్రబోధించారు. వాటిని ఆచరించి చూపారు.

సయాం దేశం స్వాతంత్ర్యం పొంది, మొదటి లోకసభ సమావేశ మవుతున్నప్పుడు ముందుగా సభాధిష్ఠాన దేవతగా మనువు యొక్క విగ్రహం ఉంచాలని వారంతా ఏకగ్రీవంగా నిశ్చయించారు. సయమీభాషలో వ్రాయబడిన శిలాక్షరాలలో 'మనవు మానవజాతికి ప్రథముడైన న్యాయ శాస్త్ర ప్రదాత' అని చెక్కించుకున్నారు. మరొకదేశమైన ఇండొనేషియాలో స్థానికులైన ముస్లిములు, హిందూ సంప్రదాయాలతో తొణికిసలాడుతూ ఉంటారు. వారి పేర్లూ, పాటలూ, నాటకాలూ, జాతీయ ప్రతీకలు అన్నీ కూడా రామాయణం వంటి మన ఇతిహాసాల ప్రభావాన్ని కలిగి ఉంటాయి.

## నిజమైన రాయబారులు

ఎప్పుడెవరు విదేశాలకు వెళ్ళినా, తాను జన్మించిన దేశానికీ, సంస్కృతికీ, జీవనమూల్యాలకూ ప్రతినిధిగా వెడుతున్నాడని మనం గుర్తుంచు కోవాలి. ప్రపంచం అతని దేశాన్నీ, అచటి ప్రజలనూ, వారి విలువలనూ, ఔన్నత్యాన్నీ అతని నడవడికయే గీటురాయిగా అంచనా వేస్తుంది. మన వంటి మహోన్నతమూ, ప్రాచీనమూనైన జాతి విషయంలో ఇది మరింత వాస్తవం. మన ప్రవర్తన, మన ఉన్నత సాంస్కృతిక ప్రమాణాలకు తగిందిగా ఉండకపోతే, ఆయా దేశాలను చౌకబారుగా అనుకరించేదిగా ఉంటే, వారి దృష్టిలో మన దేశం యొక్క రూపం, ప్రతిష్ఠ కూడ దిగ జారిపోతాయి. అందువలన, అచట నివసించే మన దేశస్థులకూ, అలాగే మన దేశానికీ గూడ చెప్పనలవికానంతటి హాని కలుగుతుంది. వారిప్రవర్తన మన ధర్మ సంస్కృతుల యొక్క సదవగాహనతో కూడియున్నపుడు మాత్రమే వారు ఆదర్శ హిందువులుగా నిలువగలుగుతారు. మన జాతి యొక్క ఉత్తేజప్రదమైన ప్రతిబింబాలు కాగలుగుతారు. అప్పుడే, అచటి ప్రజల నుండి సముచితమైన గౌరవ మర్యాదలను పొందగలుగుతారు.

## అయ్యో ! పాపం !

ఈ విషయంలో మనం వినేవార్తలన్నీ చాలా బాధకలిగిస్తున్నాయి. విదేశాలకు వెళ్ళేవారు తమ వ్యక్తిత్వాలను పూర్తిగా కోల్పోతున్నట్లనిపిస్తుంది. వారి భోజనపుటలవాట్లు, నిత్యజీవన ఆచారాలూ,సంప్రదాయాలూ అన్నీ మారిపోతున్నాయి; మన ధర్మం, మన సాంస్కృతికపరంపర, మన చరిత్రల పట్ల వారిలో కొండంత అజ్ఞానం పేరుకుపోయింది. తత్ఫలితంగా మన జీవితం గురించి బుద్ధిపూర్వకంగా, వక్రభాష్యాలూ, వ్యాఖ్యానాలుచేసేటువంటి, ఆయా దేశాల పండితమ్మన్యుల మాటలు నమ్మి పెడత్రోవనుబడుతున్నారు. ఆ విధంగా వారు మన యొక్క ప్రతి విషయం పట్లా ఒక విధమైన అసహ్యతను పెంపొందించుకొని, విదేశీపద్ధతులే ఎంతోగొప్పవనీ, అలవాటు చేసుకోదగినవనీ భావిస్తున్నారు. వారు తరచు అచటిసిరిసంపదలకీ, స్వైరవిహారానికీ నీచమైన వ్యామోహాలకీ లోబడి, మనదేశం మన సంస్కృతుల గురించి పూర్తిగా మరచిపోతున్నారు. వారిలో చాలామంది అక్కడే శాశ్వతంగా స్థిరపడిపోవాలని నిశ్చయించుకుంటున్నారు.

## సంస్కారాలు అందచేయాలి

కాబట్టి సరియైన సంస్కారాలను ఇక్కడనే పొంది అచటకుపోయిన హిందూ సోదరులు జాతీయ స్వాభిమానాన్నీ, గతంలో మనం సాధించిన సర్వతోముఖ విజయాలనూ, దేశాంతరాల్లో ఉండగా మనం చేయవలసిన పనులను గురించిన భావనలనూ, ఆయా దేశాలలో ఉన్న వారందరిలో ప్రజ్వలింపచేయాలి. ఆ దృష్టితోనే క్రమం తప్పకుండా అచట సమావేశమవుతూ వుండాలి. కొన్ని ప్రత్యేక సందర్భాలలోనూ, కొన్ని ప్రత్యేక కార్యక్రమాల నిమిత్తమై మాత్రమే మనం సమావేశమైతే చాలదు. మన శాస్త్రాల్లో కూడా నృత్యం, గీతం, వాద్యాల గురించి చాలా చెప్పారు.

అయితే ప్రత్యేకంగా సంస్కారాలు కలిగించే నిమిత్తమై వినియోగించి నప్పుడు మాత్రమే అవి ప్రయోజనకరాలవుతాయి. కేవలం సంగీతనాట్యాలు, వాటంతటవిగా సంస్కృతిగా రూపొందజాలవు. వానిలోని వినోదాంశం మాత్రమే తీసికొని, సాంస్కృతిక విలువలను విస్మరిస్తే అది తప్పక సాంఘిక పతనానికే త్రోవదీస్తుంది. మన నిత్యజీవన వ్యవహారంలో హిందుత్వపువిలువలను పునరుజ్జీవింపచేసుకోవాలనే గుర్తింపు ముమ్మరంగా మనలో నిరంతరం జీవించి ఉండాలనుకుంటే, సముచితమైన సంస్కారాల నలవరచేవిధంగా, ఒక నియమం ప్రకారం అచట కలుసుకుంటూ ఉండటం అవసరం. విధిగా, నియమంగా జరిగే సమ్మేళనాలతోబాటు, ప్రతి నిత్యం వారి ఇండ్లలో భజనలు, శ్లోకపఠనాలు జరగాలి. ముఖ్యంగా ఆ శ్లోకాలను, భజనలనూ, తగిన భక్తితోనూ, శ్రద్ధతోనూ వల్లించటం పిల్లలకు నేర్పాలి. ఎక్కడెక్కడ మన దేవాలయాలుంటే అక్కడనల్లాకూడాహిందువులందరూ కొన్ని పర్వదినాల్లో, ప్రత్యేక సందర్భాల్లో సమావేశమయే అలవాటు తప్ప కుండా చేసుకోవాలి. అప్పుడు సత్సంగాలు, హవనాల వంటి కార్యక్రమా లను నిర్వహించాలి.

ఆయా దేశాలను, అప్పుడప్పుడు సందర్శించే ఆధ్యాత్మిక గురువుల తోనూ, విద్వాంసులతోనూ, సన్నిహిత సంబంధాలు నిలుపుకోవటం, వారు పాల్గొనే విధంగా, తగిన, మంచి కార్యక్రమాలను ఏర్పాటు చేసుకోవటం- పైన మనం చెప్పుకున్న లక్ష్యసాధనకు ఎంతో సహాయకార్లు కాగలవు.

## మంచిని జీర్ణించుకోవాలి

విదేశాలకు వెళ్ళిన మనవారు అచటనున్న పైపై ఆకర్షణలకు లోనై పోతున్నారు. ఆ దేశపు ప్రజల జీవితంలో అసలైనమంచివిషయాలు తెలుసుకునేందుకై ప్రయత్నించటం లేదు. ఇది చాలా విచారకరమైన విషయం. బొత్తిగా సద్గుణమే లేనివాడుగానీ, అన్ని సద్గుణాలూ ఉన్నవాడు

గానీ లోకంలో ఉండదు. వివేచనాశక్తితో, మనిషియొక్క మంచిచెడులను, నిష్పక్షపాతంగా అంచనా వేసుకోగలగాలి. అట్లాగే మన యొక్క సద్గుణాలనూ, బలహీనతలనూ గూడ గుర్తించగలగాలి. అప్పుడే మనం ఈ రెండు విధానాలలోని ఉత్తమ విషయాలనూ సమన్వయం చేసుకొనగలుగుతాం. విదేశాలలో ఉంటున్న విజ్ఞానవంతులైన మన యువకులు, ఆ విధమైన తులనాత్మక అధ్యయనం చేసి, తాము కనుగొన్న ఫలితాలను ప్రకటించి, అచటనున్న మన ఇతర సోదరులను విజ్ఞానవంతులను చేయాలి.

వాస్తవానికి మనం అనుకరించదగిన సజ్జనులు అన్ని దేశాల్లోనూ ఉంటూనే ఉంటారు. అట్టివారిని మనం అనుకరించటం మంచిది. పూర్తిగా దివ్యమైన జీవనం గడుపుతూ, ప్రాణికోటి అంతటిపట్లా ప్రేమాభిమానాలు గల ఒక మహోన్నతుడూ, అమెరికాదేశంలోని ఒక ఆధునికసాధుమూర్తిని ఉదాహరణగా తీసుకుందాం. ఆయన చెఱువులోని నీటిలో చేతులు ముంచి కూర్చుంటే, చేపలు ఈదుకుంటూ వచ్చి, చుట్టూరా చేరి,ఏ భయం సంకోచం గానీ లేకుండా ఆడుకుంటుంటాయి. సృష్టిలోని ప్రాణికోటి అంతటి పట్ల అతని తాదాత్మ్య భావన అట్టిది.

## అటువంటి రత్నాలను ఎంపిక చేసుకోవాలి

మనం ఎంపిక చేసి, స్వీకరించి, మనవిగా చేసుకోదగిన, స్ఫూర్తిప్రదమైన అంశాలు వారి సాహిత్యంలో కొల్లలుగా ఉన్నాయి. ఉదాత్తమైన మన భావనలెన్నో వారి కవిత్వంలోనూ, తత్వశాస్త్ర గ్రంథాల్లోనూ ప్రతిధ్వనిస్తుంటాయి. లై హంట్ అనే కవి వ్రాసిన 'ఆబూ బెన్ ఆదమ్' అను పేరున గల ఎంతో మనోహరమైన కవిత నాకు గుర్తుంది.

'ఆబు బెన్నాదము'- అనువాడు కలడు
(అట్టివారెందరో పుట్టవలె భువిని)
అతడొక్క రాతిరి- అతి ప్రశాంతముగా

కలగాంచి, చూచె, తన గది నిండియున్న
వెలుగు వెన్నెల్లోన కలువపూవల్లే
దివ్యకాంతుల నింపు దేవదూతికను,
బంగారు పుటలతో భాసించుచున్న
పుస్తకమ్మునవేదో వ్రాసుకొనుచున్న
ఆమె నడిగెను "వ్రాయునది ఏమి" యనుచు
అది విని, తల యెత్తి ఆ దేవకాంత,
తీయని పలుకుల తేనె లొలుకంగ
"దైవభక్తుల యొక్క దివ్యనామములు
వ్రాయుచా నుంటి"నని పలుకగా,- అతడు
"అందులో నా నామముందా" యనంగా
"లేద"నె- నది విని ఖేదమ్ము వడక
మెల్లగా ధైర్యమ్ము, ఉల్లమున నింప-
"అట్లయిన ఓ దేవి! అనుగ్రహమ్ముంచి,-
తోటి మనుజుల ప్రీతితో జూచునట్టి
వాడుగా నా పేరు వ్రాయుమంచ"డిగె.
అది వ్రాసికొని యామె అదృశ్యమయ్యె
మరురాత్రి కలలోన మరల కనిపించి
దైవప్రేమకు పాత్రులైనట్టి వారి
పేర్లను చూపించె, ప్రీతిమీరగనూ,
అందులో ముందుండె 'ఆబు' నామమ్మే!

## స్థానికాకాంక్షలకు సంస్పందించాలి

ఆపైన- స్థానికులైన ప్రజల పట్ల సరియైన దృష్టినీ, వ్యవహార సరళినీ అలవరుచుకోవటం ఒక ముఖ్యాంశం. విదేశాలలోని మన సోదరులు మనసులో ఉంచుకోవలసిన, మొదటి విషయమేమంటే, అచట ఒకవృత్తినో,

ఉద్యోగాన్ని కొనసాగిస్తున్నప్పుడు, ధనాన్నిసంపాదించటం,కూడబెట్టడమే వారి యొక్క ప్రధాన లక్ష్యం కారాదు. వారు స్థానిక ప్రజల యొక్క సమస్యలను సరిగా అవగాహన చేసుకొని, వారి ఆకాంక్షలపట్ల సహాను భూతిని చూపగలగాలి. తమ ఆదాయంలోని కొంతభాగం కేటాయించి,అచటి ప్రజల సంక్షేమానికై హిందుత్వంలోని, మహోన్నతసిద్ధాంతాలూ, మూల్యాలనూ వారికి ప్రబోధించేందుకు వెచ్చించాలి. అలా చేస్తూనే వారు తమ వ్యక్తిగతమైన ఉదాహరణగా చూపి, తాము మహోన్నతమగు సంస్కృతి గల దేశాన్నుండి వచ్చామనే విషయాన్ని ప్రదర్శించాలి. తనను చూచి ఇతరులు గూడా అలాగే నడుచుకునేలా తాను ప్రవర్తించాలి.

## కనువిప్పు

ముఖ్యమైన ఈ అంశాలను వారు తమ ప్రవర్తనలో విస్మరిస్తే, వారికి అగౌరవం, కష్టనష్టాలూ తరుచూ కలుగుతాయి. బహుశః తూర్పు ఆఫ్రికా దేశాల్లోని హిందువులు ఈ రోజుల్లో ఇబ్బందుల పాలవటానికి ఇదొక ముఖ్యకారణం. గతంలో, వలసలేర్పరుచుకొని పెత్తందారులైన తెల్లవారికి వ్యతిరేకంగా, స్థానికులైన ఆఫ్రికా ప్రజలు పోరాడుతుంటే, మన వారు దాదాపుగా, అ ప్రజల కోరికల యెడ సానుభూతి చూపలేదు. సహకరించలేదు. వారు తమ సంపాదనలో నుంచి, స్థానిక ప్రజల యొక్క సంక్షేమానికీ, వారిలో విద్యాభివృద్ధికీ, అలాగే హిందుత్వపు సిద్ధాంతాలను వారికి ప్రబోధించటానికీ వెచ్చించలేదు.

అక్కడ అంతటా ధార్మిక భావశూన్యత వ్యాపించి ఉంది. దానిని, క్రైస్తవ, ముస్లిం ప్రచారకులు కమ్మేసారు. ఇట్టి లోపాలన్నిటివలన పెద్ద ప్రమాదమే జరిగింది. ఆఫ్రికా దేశీయులు స్వతంత్రులు కాగానే, వారిపై ఇస్లాం, క్రైస్తవ ప్రచారమే ఎక్కువ ప్రభావం చూపింది. తత్ఫలితంగా

అతిత్వరలోనే, వారు మన హిందుత్వం పట్లా, సామాన్య హిందూ ప్రజానీకం పట్ల సానుభూతిని కోల్పోయారు. అందుచేతనే వారు ఈనాడు హిందువులను అధికారపు హోదాల నుండి తొలగిస్తున్నారు. హిందువులు తమ వనరులను కోల్పోతున్నారు. హిందువులు అధిక సంఖ్యలో ఆయా దేశాలను విడచిరావలసివస్తోంది. ఆ విధంగా వారచట తమ బ్రతుకంతా కష్టించి సంపాదించుకొన్న ధనాన్ని, ఆస్తులను గూడ పోగొట్టుకొనవలసి వస్తోంది. ఈ అనుభవం విదేశాల్లో నివసించే హిందువులందరకూ ఒక కను విప్పు గావాలి.

## ధ్యేయవృతులు విశ్వవ్యాప్తంగా వెళ్ళాలి

సారాంశాన్ని క్లుప్తంగా చెప్పాలంటే– విదేశాల్లోని మన సోదరులు, మరింత సుఖంగా సమృద్ధితో, గౌరవంగా జీవించాలనుకుంటే, అలాగేఆయా దేశాలలో భారతదేశపు ప్రతిష్ట మరింత ఉజ్వలం కావాలనుకుంటే, తమ జీవిత విధానంలోనూ, ఆలోచనలలోనూ కూడా పూర్తిగా మార్పు తెచ్చుకోవాలి. ఇలా చేయాలంటే, జగత్కల్యాణకార్యంలో, ఉత్తేజితమైన గొప్ప జాతి మనదనే మహోన్నత విశ్వాసం మన కుండాలి. మనధర్మంలో ఇమిడి ఉన్న ఉదాత్త సత్యాలను, మానవజాతి కంతకూ ప్రబోధించవలసిన పవిత్ర కర్తవ్యం, ధర్మం మనమీద ఉన్నాయని గుర్తించాలి. మనజాతికీనాడు ఎదురౌతున్న పెక్కు సవాళ్ళను సర్వసమగ్రమూ, సశాస్త్రీయమూ, ఆధ్యాత్మికమూనైన దృక్పథం గల హిందుత్వం పరిష్కారం చూపగల దన్న మహోన్నత విశ్వాసం, హృదయాల్లో దృఢంగా ఉండాలి. ఇట్టి అంతిమ లక్ష్యం మన మనస్సులలో నిరంతరంగా నిలుపుకుంటేనే, ఇతర విషయాలన్నీ అద్దంలో బొమ్మలా అతిస్పష్టంగా గోచరిస్తాయి.

   

## విదేశాల నుండి వచ్చిన మిత్రులతో

ప్రశ్న: విదేశాలలో ఉంటున్నప్పుడు, మనమాతృభాషకు అంటిపెట్టుకొని వుండటం, ఒక విధమైన పెనుభారంగా మిత్రులు భావిస్తారు. తమ దైనందిన జీవితంలో దాని ఉపయోగం ఏమీ లేదని కూడా వారు భావిస్తారు. ఈ విషయం పట్ల, మన దృష్టి ఎట్లా ఉండాలో చెప్పండి?

జవాబు: విదేశాలలో ఉన్నప్పటికీ, మన ఇళ్ళలో మన స్వభాషలనే ఉపయోగించటం చాలా అవసరం. సామాన్యంగా, విదేశాలలో, చాలా కాలంగా నివసించేవారు భారతదేశానికి వస్తే, వారు తమ మాతృభాషలో ధారాళంగా మాట్లాడలేకుండా ఉన్నారు. చివరకు బంధువులతోనూ, చిరమిత్రులతోనూ గూడా ఇంగ్లీషులోనే మాట్లాడుతుంటారు. అలా చేయరాదు.

అనేకసంవత్సరాలు అమెరికాలో ప్రవాసజీవితం గడిపిన శ్రీరాం లాల్ అనే విప్లవవీరుని ఉదాహరణొకటుంది. ఒకసారితడు మారువేషంలో భారతదేశం వచ్చినప్పుడు స్వయంసేవకులకు సందేశమిమ్మని మేము కోరాం. అతని మాతృభాష హిందీ అయినప్పటికీ, మేంఆశ్చర్యపడేటంతగా అతడు స్వచ్ఛమైన మరాఠీలో ప్రసంగించాడు. అతనిలోని నిజమైనదేశభక్తి, విప్లవోత్తేజములే అందుకు కారణం. అలాంటి ఉత్తేజకరమైన దేశభక్తి మనలో ఉంటే, విదేశాల్లో కూడా మన భాషలను మనం చక్కగా కాపాడుకోగలం. మన హిందూ జీవన సంప్రదాయాన్ని సజీవంగా ఉంచాలంటే అట్టి ప్రయత్నం చాలా అవసరం.

ప్రశ్న: మా పిల్లలు, మన భాషతో సంబంధం చాలా త్వరగా కోల్పోతున్నారు. వారు స్వచ్ఛంగా ఉచ్ఛరించలేకపోతున్నారు. దీనికి పరిష్కార మార్గమేమిటి?

జవాబు: క్రమపద్ధతిలో ఎల్లప్పుడూ, వారికి, పాఠాలు, శ్లోకాలు, స్తోత్రాలు చెపుతూ ఉండాలి.

ప్రశ్న: వారికి నైతిక విద్య బోధించటమెట్లా?

జవాబు: హిందూ సంస్కృతిలోని, గొప్ప సిద్ధాంతాలను, సుగుణాలనూ ప్రకటించే నామధేయాలనూ, పాత్రలనూ, వారికి పరిచయం చేసే, చక్కని కథల పుస్తకాలను తయారుచేయించాలి. అట్టి అనేక కథలకు మన రామాయణ, భారతాలు పుట్టినిళ్ళు.

ప్రశ్న: మేమొక దేవాలయం నిర్మించాలనుకుంటున్నాం.

జవాబు: చాలా మంచి ఆలోచన. అది ఒక ప్రత్యేకమైన దేవునికో, దేవతకో చెందినదిగాగాక, హిందుత్వంలోని అన్ని సంప్రదాయాలవారూ అంగీకరించే, ఓంకారాని కంకితమై ఉంటే మంచిది.

ప్రశ్న: అధికంగా, విదేశాలలో నివసించేవారికి, ఎదురయ్యే ఒక సమస్యఉంది. వారే 'విదేశాలలో ఉంటూ వివాహం కానివారు'. వారిది ఒంటరి జీవితం. విదేశీ సమాజం వారిని తమ జీవితంలోకి అంత తేలికగా చేర్చుకోదు. ఇక సర్వసాధారణమైన టెలివిజన్, సినిమా వంటివి వారికి విసుగు పుట్టిస్తాయి. వారు ఒంటరిగాళ్ళమై పోయామని భావిస్తుంటారు.

జవాబు: దాని కొక పరిష్కార మార్గమేమంటే– మన సంస్కృతీ, చరిత్ర, సాహిత్యం, తత్వశాస్త్రాలపై భారతీయ భాషల్లో వెలువడిన, చక్కని పుస్తకాలతో కూడిన మంచి గ్రంథలయాలను ప్రారంభించుకోవాలి. మనవాళ్ళు ఆ పుస్తకాలు చదువుకుంటూ తమ సమయాన్ని సద్వినియోగపరచుకోవచ్చు.

ప్రశ్న: విదేశంలో ప్రబోధం చేయటానికి వెళ్ళినప్పుడు, మనసన్యాసులు 'హిందూ' అన్న పదప్రయోగం చేయాలని పట్టుబడితే, మన గౌరవప్రతిష్టలు భంగం కావచ్చని కొందరి భావన.

జవాబు: ఇది కేవలం నిరాశావాదం, ఆత్మన్యూనతా భావం. ఆ విధంగా వివేకానందస్వామీ, అభేదానందస్వాము లిద్దరూ విదేశాల్లో కృషి చేసారు. 'హిందుత్వం' కోసమే తాము నిలచామని చెప్పు కోవటానికి వారెన్నడూ బిడియపడలేదు. వారు సత్యాన్ని నిర్మొహమాటంగా, నిర్భయంగా చెప్పారు. క్రీస్తును వారు ప్రగాఢంగా గౌరవించేవారే అయినప్పటికీ, క్రీస్తు పేరు మీద ఆ దేశాల్లో ఆచరింపబడే పద్ధతులను వారు నిశితంగా విమర్శిం చారు కూడా.

అలా చేసినందుకు పాశ్చాత్య ప్రపంచం వారిని అభినందించింది, గౌరవించింది కూడ. కానీ ఈనాడు పరిస్థితి అలా లేదు. మనసన్యాసులనేకమంది, పాశ్చాత్యులను సంతృప్తి పరచటం పనిగా పెట్టుకుంటున్నారు. అందుకుగానూ, తమ ఆలోచనలూ, విశ్వాసాల విషయంలో రాజీ పడుతున్నారు. అందుకే విదేశీయులదృష్టిలో వారి గౌరవం పలుచనై పోతోంది.

ప్రశ్న: ఇంగ్లండులోని కొందరు ముస్లిములు మనతో కలిసి పని చేయ టానికి ఇష్టపడుతున్నారు. అందుకు మనం వారిని ప్రోత్స హించవచ్చా?

జవాబు: హిందూ సంస్కృతిని, తమదని వారు స్వీకరించటానికిసిద్ధంగా ఉంటే అలాగే చేయవచ్చు. వారి ఉపాసనా పద్ధతి వారికుం డొచ్చు. కానీ హైందవ వారసత్వం, చరిత్రలు తమవేనని వారు భావించగలగాలి.

# 28. 'అస్పృశ్యత' ఒక శాపం —దానికి పరిష్కారం

'అస్పృశ్యత' మన ధర్మంలో ఒక భాగమనీ, దానిని అతిక్రమించటం ఒక తీవ్రమైన పాపమనీ, సర్వసామాన్య ప్రజానీకంలో వుండే నమ్మకమే 'అస్పృశ్యత' అనే జాడ్యానికి మూలకారణం. మతపరమైనయిట్టి వికృత భావం ఉన్నందుననే అనేక శతాబ్దాలుగా, ఎందరో మతాచార్యులూ, సంఘ సంస్కర్తలూ నిరంతరంగా కృషి చేస్తున్నప్పటికీ వినాశకరమైన ఈ దురాచారం నేటికి గూడా ప్రజల మనస్సును పట్టుకు పీడిస్తోంది. గురునానక్, రామానుజాచార్యులు, బసవేశ్వరుడు, శంకరదేవుడు, స్వామి దయానందులు, నారాయణగురు, గాంధీజీ, వీరసావర్కార్ మొదలైన వారెందరో మన హిందూ సమాజాన్ని పీడిస్తున్న ఈ కళంకాన్ని రూపుమాపేందుకు, తమ శాయశక్తులా పరిశ్రమించారు.

కానీ కళంకం మాత్రం అలాగే వుండిపోయింది. ఈనాటికీగూడ, ఉన్నత కులాలనబడేవారు, అస్పృశ్యులు అనబడేవారిని తమతో సమానులనుగా చూడటానికంగీకరించరు. క్షత్రియులు మాత్రమే మీసాలను పెంచుకొనవచ్చని భావించి, అందుకు భిన్నంగా మీసాలు తాను పెంచుకున్నాడన్న కారణంచేత రాజస్థాన్‌లోని ఒక గ్రామంలో ఒక హరిజన యువకుణ్ణి కొట్టి చంపేసారని పత్రికల్లో వచ్చింది. కనీసం ధర్మాచార్యులైనా అట్టి దురా

చారాలను ఖండించలేదు. వారు కూడా ఈ ఆచారం ధర్మమని భ్రమపడటమే యిందుకు కారణం.

## ఒక మహా సమ్మేళనం

ఇట్టి సాంఘిక దోషం మతపరమైన తప్పుడు అభిప్రాయాల నుంచే బలం పుంజుకుంటున్నది. ధర్మమీమాంసను ఆధికారికంగా చేయదగిన వారని ప్రజాబాహుళ్యం భావించే పరంపరాగతమైన పీఠాధిపతులు, ధర్మ విరుద్ధమైన ఈ ఆచారాన్ని ముందుకు వచ్చి ఖండించాలి. ఇందుకు సరియైన ప్రయత్నం 1969లో జరిగిన విశ్వహిందూసమ్మేళనంలోఆరంభమయింది.

హిందుత్వంలోని శైవ, వీరశైవ, మాధ్వ, వైష్ణవ, జైన, బౌద్ధ, సిక్ఖాది విభిన్న సంప్రదాయాల ప్రతినిధులు ఆ సమావేశంలో పాల్గొన్నారు. పూజ్యులైన ధర్మగురువులు, ఆచార్యుల ఆదేశం ప్రకారం తమ తమ ధార్మిక సాంఘిక వ్యవహారాల్లో 'అస్పృశ్యత'ను పారద్రోలండని హిందూ విశ్వానికి పిలుపునిస్తూ ఒక తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

## జగద్గురువుల ఆదేశం

చారిత్రాత్మకమైన వారి ఆదేశం యీ క్రింది విధంగా వుంది. "అవిభాజ్యమై ఏకతా భావంతో హిందూ సమాజమంతా సంఘటితంగా వుండాలనే లక్ష్యసాధనకై 'స్పృశ్యత', 'అస్పృశ్యత' వంటి ధోరణులు, విశ్వాసాలు కారణంగా హిందూ సమాజంలో ఎట్టి విఘటనము కూడదు కాబట్టి, విశ్వవ్యాప్తంగా వున్న హిందువులందరూ, తమ పరస్పర వ్యవహారాల్లో సమైక్యత, సమానతాభావ చైతన్యం తప్పక నిలుపుకోవాలి.

ఇట్టి తీర్మానం ఆమోదింపబడటమే, హిందూ సమాజ చరిత్రలో విప్లవాత్మక ప్రాముఖ్యం గల చర్యగా తప్పక చెప్పుకొనవచ్చు. భ్రష్టాచారం మీద ధర్మం విజయం పొందిన శుభఘడియ ఇది.

## తప్పుడు ప్రయత్నం

ఈ విధమైనతీర్మానాన్ని అమలుపరచటానికి దుందుడుకుగా వ్యవహరిస్తే తప్పకుండా విషఫలితాలే వస్తాయి. కేవలం నచ్చచెపుతూ నిర్మాణాత్మకంగా పని చేసినప్పుడు మాత్రమే సత్ఫలితాలు కలుగుతాయి.

కొన్ని యేండ్ల క్రితం పత్రికలలో ఒక వార్త వచ్చింది. ఒక ప్రముఖ సాంఘిక నాయకుడు 'అస్పృశ్యులనూ, హైందవేతరులనూ వెంటబెట్టుకొని కాశీలోని విశ్వనాథ దేవాలయంలో బలవంతంగా ప్రవేశించాలనుకున్నాడనీ, దేవాలయపూజారులు ఆ ప్రయత్నాన్నిఎదుర్కొని విఫలంచేసారని గూడా పత్రికలు ప్రకటించాయి. ఆ సంఘటన జరిగిన తర్వాత కొన్ని రోజులకు నేను కాశీ సందర్శించటం జరిగింది. నేను పూజారులను కలసి ఎందుకు వారిని అడ్డగించారని ప్రశ్నించాను. వారిలా చెప్పారు. "బావుంది. ప్రతి నిత్యం వేలాది భక్తులు స్వామిని పూజించేందుకు వస్తూనే వుంటారు. వారంతాగర్భగుడిలోకి ప్రవేశిస్తారు. పవిత్రమైనలింగాన్ని స్పృశించి, తమ పూజల నర్పిస్తుంటారు. వారంతా ఏ కులంవాళ్ళో, ఏ సంప్రదాయంవాళ్ళో ఎన్నడూ ఎవరూ అడుగలేదు. అయితే, ఆ నాయకుడు ప్రచారం కోసం దర్పంగా, సరంజామానంతా సమకూర్చుకొని, అక్కడికి తానేమో విశ్వమానవ దృష్టి గల అవతారమూర్తియనీ, అణగద్రొక్కబడినవారిని ఉద్ధరించటానికి పుట్టాడనీ, మేమంతా దోషులమనీ, ప్రపంచానికంతటికీ ప్రకటించాలని వచ్చాడు. అది మమ్మల్ని అవమానపరచటమే అని సహజంగానే అనుకున్నాం. అందుకనే ఆయన కర్థమయే భాషలోనే మేమూ సమాధానం చెప్పాలనుకున్నాం. అందుకే అలాగే చేసాం" అన్నారు వారు.

వీరావేశంలో తొందరబాటు మనస్తత్వం గల చాలమంది మన సంస్కర్తలు ఇదే విధమైన పొరబాట్లు చేసారు. బలప్రయోగం,ప్రజలలో

ఒక వర్గాన్ని అల్లరిపాలు చేయటం, ప్రదర్శనం, ప్రచారం వంటి పద్ధతు లన్నీ తప్పక బెడిసికొడతాయి. అంతేగాదు రోగం కంటె మందే ప్రమాద కరమని నిరూపిస్తాయి.

## భయం వాస్తవమయింది

వాస్తవానికి, "హరిజనుడు" అనే పదాన్ని కావాలని పదే పదే వాడటం తగదు. అది మన సమాజంలోని ఆయా వర్గాలవారు బాధగా అను భవిస్తూన్న వేర్పాటుభావనను తొలగింపచేయటానికి దోహదకారి కాదు. ఒకప్పుడు నేను గాంధీజీని కలసే అవకాశం లభించింది. 'హరిజనుడు' అనే కొత్త పేరును– భాషాపరంగా దానిలో ఎంతటి పవిత్ర భావం వున్న ప్పటికినీ కల్పించటం నిహిత స్వార్ధ రాజకీయ ప్రయోజనాలు గల ఒక సమూహాన్ని సృష్టింపచేసే వేర్పాటు మన స్తత్వానికిది త్రోవదీసి, సాంఘిక సమైక్యతకు ప్రమాదకారిగా పరిణమిస్తుందేమోనని భయాన్ని వ్యక్తం చేసాను. అయితే,– అలా ఏమీ జరుగబోదని గాంధీజీ భావించారు. కానీ దురదృష్టవశాత్తు, అప్పటి నుండీ యీ అంతరం తగ్గలేదు. పైగా ప్రతీ ఏడాదికీ పెరుగుతూనే వుంది. అట్టి వేర్పాటుభావం యిప్పుడు రాజకీయ రంగంలో కూడా ప్రవేశించింది.

## అసత్యమూ – దురుద్దేశ పూరితమూ

దురుద్దేశ్యంతో ఈ సమస్యకు మరొకనూతనాంశం చేర్చటం, వ్యాప్తి యివ్వడం జరుగుతోంది. కొన్ని యేళ్ళుగా హరిజనులపై సవర్ణహిందువుల దాడులను గురించిన ప్రకటనలు వార్తాపత్రికలలో రావటం ఒక వెల్లువలాగా అకస్మాత్తుగా ప్రారంభమయింది. ఈ విధమైన వార్తాప్రకటన పద్ధతిలో దురుద్దేశ్యం ఉందేమోనని నేను గట్టిగా అనుమానిస్తున్నాను. చాలాసార్లు ఆ వార్తలు నిజాలు కానే కావు.

మహారాష్ట్ర ప్రాంతంలోని ఒక గ్రామంలో ఒక హరిజన యువకుణ్ణి అగ్నికాహుతి చేసారనే నేరారోపణను విచారించటం జరిగింది. ఆవిచారణా వివరాలను బట్టి మూఢనమ్మకాలు గల ఆ గ్రామప్రజలు, ఆ హరిజన యువకుడు మంత్ర ప్రయోగాలు చేస్తున్నాడనీ, దాని ఫలితంగానే అనేక మంది పసిపిల్లలను పొట్టనబెట్టుకునే అనేక అంటువ్యాధులు వచ్చిపడ్డాయనీ నమ్మారని తెలిసింది. మంత్రప్రయోగాలు చేస్తున్న మాట నిజమేనని ఆ యువకుడు అంగీకరించినట్లు కూడా వెల్లడయింది. అతనిని దహనం చేయ టానికి చొరవతీసుకుని ఏర్పాట్లు చేసిన వారిలో ప్రముఖుడొకరు స్వయంగా అతని మేనమామయేనని తేలింది. కాబట్టి హరిజన, హరిజనేతరుల మధ్య తగాదా అన్న ప్రశ్న అక్కడ రానే రాదు. కానీ వార్తాపత్రికలు ఈ సంఘటనకు భయంకరమైన రంగులు పులిమి సవర్ణ హిందువులు హరి జనులపై జరిపిన దానవత్వంగా దానిని ప్రకటించాయి.

ఇట్టి విషయాన్నే ఇంతకన్న సూటిగా వెల్లడి చేసే మరొకసంఘటన ఉత్తరప్రదేశ్‌లో జరిగింది. ఒకచోట హరిజన కులంపై దాడి జరిగిందనీ, వారి యిళ్ళు తగులపెట్టబడ్డాయనీ, యిదంతా ఆ గ్రామంలోని సవర్ణ హిందువులే చేసారనీ మెరుపులాగా పత్రికలు ఒక వార్త ప్రకటించాయి. కానీ విచారణమీదట ఆ గ్రామంలో హరిజనులు, ముస్లిములు మాత్రమే వున్నారని తెలిసింది. ఒక్క సవర్ణ హిందూ కుటుంబం కూడా అక్కడ నివసించటం లేదు. అంటే ముస్లిములచే హరిజనులపై జరుపబడ్డ దాడి, వక్రీకరింపబడి, 'సవర్ణ హిందువుల'చే హరిజనులపై జరుపబడిన కిరాతకంగా రంగు వేయబడి, ప్రకటింపబడిందని తేలుతోంది.

## ఎందుకీ పాక్షిక వైఖరి ?

ఒక పద్ధతి ప్రకారం, ఎంతో నేర్పుగా జరుపుతున్న యిట్టిప్రచారం వెనుక ఏదో విదేశీహస్తం వున్నదనే నా అనుమానం. లేకపోతే అట్టి

వార్తావిషయాలు అంత ప్రముఖంగా ప్రకటింపబడటానికి కారణాలు కని పించవు. ముస్లిములు దేశమంతటా చేస్తున్న మతకల్లోలాల గురించి వ్రాసే టప్పుడు, వానిలో భాగస్వాములైన మతవర్గాల పేర్లు వెల్లడి కాకుండా వుంచేందుకు, అమితమైన జాగ్రత్త, నిగ్రహాలు చూపుతున్నారు. ఆ విధంగా మతకల్లోలాలు జరిపే జాతులపేర్లు వెల్లడైతే, అది వారి మధ్య పరస్పర సంబంధాలను మరింత పాడు చేస్తుందన్నది అందుకు కారణం. దాంతో కల్లోలాలు యితర ప్రాంతాలకు గూడా విస్తరించవచ్చునని పైకి చెపుతున్నారు. ఈ విధమైన తర్కమే 'హరిజనులు', 'సవర్ణహిందువులు' విషయంలో గూడా ఎందుకు పాటించడం లేదో ఎవరికీ అర్థం కాదు. మన దేశములోనూ, వెలుపలా వుంటూనే హిందూ సమాజాన్ని చీల్చటానికీ, బల హీనం చేయటానికీ కంకణం కట్టుకొన్న కొన్ని దుష్టశక్తులు, మన వార్తా ప్రసారవ్యవస్థలను తమ గుప్పిట్లో పెట్టుకొని ఆడిస్తున్నాయనే అను మానాన్ని ఇది బలపరుస్తోంది. మన పత్రికారంగం అట్టి కుట్రకు ఎరై పోవటం మన దురదృష్టం.

## పాత ఆటే ఆడుతున్నారు

బ్రాహ్మణేతరులను, బ్రాహ్మణులపై రెచ్చకొట్టినట్టుగానే, ఒక కులాన్నో, తెగనో, వేరొకదానిపై రెచ్చగొట్టే భేదోపాయం ఆంగ్లేయులు ఎలా పన్నేవారో ఆ ఆటలో మనవాళ్ళే— చివరకు నాయకులనబడేవారు కూడా— తెలిసి తెలిసి ఎలా బలైపోయారో నన్నది మనకు కలిగినభయంక రానుభవమే. దాని నుంచి మనం గుణపాఠం గ్రహించాలి. ఈనాడు కూడా విదేశీశక్తుల యొక్క తొత్తులుగా మన దేశంలో వున్నవారు పన్నే కుతం త్రాల పట్ల అప్రమత్తంగా ఉండాలి. వేర్పాటు వర్గాల నుంచి లభించే మూకుమ్మడి ఓట్లమీద కన్నేసి, యిట్టివారి ఆటలనే ఇచట కొనసాగించ టానికి సుముఖులైనవారు మన దేశంలో చాలామందే వున్నారని మనం గుర్తుంచుకోవాలి. ఇప్పటికే మనం అనేక చీలికలు వాలికలై విఘటిత

సమాజంగా వున్నాం. మరింతగా విఘటనకు గురి చేసే శక్తులకు మనం ఏ విధంగానూ దోహదం చేయరాదు.

## క్రొత్త గీటురాయి కావాలి

కులమే కారణంగా, సాంఘికంగాగాని, రాజకీయంగాగాని, ఎ విధమైన అనర్హతతో ఎవ్వడు, ఎప్పుడు బాధ పడుతున్నప్పటికీ దానినితప్పక పూర్తిగా నిర్మూలించాలి. ఇందుకు వేరు ఆలోచన పనికి రాదు. డాక్టర్ అంబేద్కరు, షెడ్యూలు కులాల వారికి ప్రత్యేక సౌకర్యాలను, 1950లో మనం ప్రజాస్వామ్యంగా రూపొందిన నాటినుండీ, పది ఏళ్ళవరకు మాత్రమే వుండాలని భావించాడు. కానీ అది యింకా కొనసాగింపబడుతూనే వుంది. కులప్రాతిపదికమీాదే కొనసాగే ప్రత్యేక సదుపాయాల వలన అది పొందే వారిలో, తాము ప్రత్యేక వర్గంగా వుండటమే ప్రయోజనకారి అనే నిహిత స్వార్థాన్ని కల్పించక తప్పదు. వారు మిగిలిన సమాజమంతటితోసమైక్యం కావటానికి అదే అడ్డుగా వుంటుంది.

సమాజంలోని అన్ని తరగతులవారిలోనూ దుర్భర పరిస్థితుల్లో ఉన్నవారున్నారు. బీదవారూ, అవసరాలు తీరనివారు అనాధలై పోయిన వారూ లేనట్టి కులం ఏ ఒక్కటీ లేదు. కాబట్టి, ప్రజల యొక్క ఆర్థిక పరిస్థితులాధారంగా సౌకర్యాలు కల్పించబడటం సబబు. అలా చేయటంవలన వ్యవహారాలన్నీ సజావుగా సాగుతాయి. అప్పుడు హరిజనులనబడేవారు మాత్రమే సౌకర్యాల ననుభవిస్తున్నారనే కడుపు మంట తదితరులలో తొలగిపోతుంది.

## అనేక అంశములలో ముందడుగు

ఈ అస్పృశ్యులు అనబడేవాడు మానసిక, హార్దిక సద్గుణాలలో వెనుకబడ్డవారనీ, ఎంతో కాలానికిగాని సమాజంలోని యితరుల స్థాయిని

వారందజాలరనీ చెప్పటం, వారిని అవమానించటమే. ఇంతేగాదు నిజాన్ని తారుమారు చెయ్యటం గూడా అవుతుంది.

ఈ అస్పృశ్యులు అనబడేవారు, గత వేయి సంవత్సరాలుగా జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ముందు వరుసలోనే వుంటున్నారని చరిత్రఋజువు చేస్తోంది. రాణాప్రతాప్, గురుగోవింద్, శివాజీల సైన్యంలో అతి విశ్వాస పాత్రులుగాను, అమిత ధైర్యవంతులైన వీరులుగానూ వారుంటూ వుండే వారు. ఢిల్లీ, బీజపూర్‌కు చెందిన విరోధి శక్తులతో శివాజీ సలిపిన కొన్ని కీలకములైన భయంకర యుద్ధాల్లో యీ మన సోదరులలోని కొందరు మహావీరులు సేనాధిపత్యం నిర్వహించారు.

యుద్ధరంగంలోనేగాక, ఆధ్యాత్మిక రంగంలో కూడా ఈ మన సోదరులు ముందడుగు వేసారు. ఈ కులాలలో పుట్టి, సమాజంలోని అన్ని తరగతుల వారి యొక్క అరమరిక లెరుగని అత్యంత భక్తిశ్రద్ధలకు పాత్రులైన సాధువులు, సన్యాసులు ఎందరో వున్నారు.

మన ధర్మంపట్ల ఈ మన సోదరులకున్న ఈ అచంచల విశ్వాసం నిజంగా మనకు స్ఫూర్తిప్రదం. ఇంతకాలంగా ధర్మంపేరున మన సమాజం లోని యితరుల నుండి వారు ఎన్నోనిందలను, అవమానాలను పొందుతూనే వున్నప్పటికీ, తమ మాతృధర్మంపట్ల విశ్వాసాన్ని విడిచి విదేశీ ధర్మాన్ని వరించాలనే వ్యామోహాన్ని వారు సుదృఢమైన మనస్సుతో నిగ్రహించుకో గలిగారు. దేశవిభజన జరిగిన కొత్తల్లో, బెంగాలుకు చెందిన 'నామ శూద్రులు' అనబడే లక్షలాది అస్పృశ్యులు, చెప్పరాని కష్టనష్టాలు పడ టానికే అంగీకరించి మనదేశపు హద్దులలోకి వచ్చి, యిచట హిందూ సమాజంలో కలసి వుండిపోయారేగాని ఇస్లాం మతంలోనికి మారటం ద్వారా తమ ప్రాణాలు కాపాడుకుందామనుకోలేదు.

## హృదయాంతరాలనుండి ఉబికివచ్చే కృషి

ఈ సమస్య నెదుర్కొనేందుకు మనం యిప్పుడు ఎక్కడ నుంచి ఆరంభించాలి? ఉడిపి సమ్మేళనంలో జారీ చేయబడిన తీర్మానాలు, ఆదేశాల వంటివానిని తీయతీయగా ఉపదేశించినంతమాత్రాన అవి యదార్థ జీవితంలో అమలుకు రావు. శతాబ్దాల తరబడిగా వున్న దురభిప్రాయాలు, మాటలతోనూ, ఆదర్శాలు వల్లిస్తేనూ తొలగిపోవు. తీవ్రమైన కృషి, సవ్యమైన ప్రచారాలను నగర నగరానికీ, గ్రామగ్రామానికీ యింటింటిలోనూ కొనసాగించే ప్రయత్నం చేయాలి. చేసిన తీర్మానాల్ని అధునాతన కాలపు ఒత్తిడులకు ఒదిగిపోయి చేసుకునే సర్దుబాటు మాటగా మాత్రమేగాక, గతంలో జరిగిన తప్పులకు ప్రాయశ్చిత్తంగా చేస్తున్నామనే వినీతభావంతో దానిని తమ జీవితంలో ఒక ప్రధాన నియమంగా పాటించేట్లుగా ప్రజలకు ప్రబోధించాలి. నైతికమూ, భావాత్మకమూనైన ఒక హృదయపరివర్తనను వ్యక్తుల ఆలోచనలలోనూ నడవడిలో గూడ తీసుకొని రావాలి.

వెనుకకు నెట్టివేయబడిన వారి యొక్క ఆర్థిక, రాజకీయ సమున్నతి కొరకు కృషి చేయటం, మన ప్రజలలోని తదితరులతో సమఉజ్జీలుగా నిలబడేట్లుగా వారిని అభివృద్ధి చేయటం సాహసమైన పనే. అంతమాత్రాన చాలదు. ఎందుకంటే, వేర్పాటు భావాలను విడువకుండా కూడా అట్టి 'సమానత్వం' సాధింపబడవచ్చును. మనం కోరదగిందీ, ప్రయత్నించి సాధించదగిందీ, కేవలం ఆర్థిక, రాజకీయ సమానత్వం మాత్రమే గాదు. మనం కోరేది నిజమైన మార్పును, సంపూర్ణ సమైక్యతను. ప్రభుత్వ పథకాలకూ, రాజకీయాధికారాలకూ అది అతీతమైంది. సమైక్యతా సాధన పేరున అతుకుల బొంతకుట్టే రాజకీయపక్షాల పన్నాగాల ద్వారా దానిని సాధించటం అసంభవం.

హృదయాంతరాల నుండి ఉబికి వచ్చిన కఠోర పరిశ్రమా, నిత్య జీవన వ్యవహారంలో దాని సాక్షాత్కారం, ఆధ్యాత్మిక, నైతిక, సాంఘిక స్థాయిలలో కృషీ అందుకు అవసరం.

# సమైక్యతకే ప్రాధాన్యతనిచ్చి విభేదాలను విస్మరించాలి

ఈ లక్ష్యసాధనకై, పవిత్రమైన ధార్మిక శ్రద్ధాభావ ప్రసారంతో నిండి, స్పృశ్యులూ, అస్పృశ్యులూ అనే తేడాలను అణచివేయగల ఒకే సౌభ్రాతృత్వంతో,హిందువులందరూ సమావేశమై భజనలు, కీర్తనలు, ఉత్సవాలు, రామాయణ, మహాభారతాల నుండి పురాణగాధా ప్రవచనాలూ వంటి కార్యక్రమాలను నిర్వహించాలి. అక్షరాస్యత, ఆరోగ్యం, ఆట పాటల వంటివానిని పెంపొందించేందుకై సేవాకార్యక్రమాలను చేపట్టాలి. శ్రవణానందంగా నయనపర్వంగా వుండే ఆధునిక శ్రవ్య, దృశ్య వైజ్ఞానిక సాధనాలను గూడ వినియోగించి ప్రయోజనం పొందవచ్చును. ఇంతకీ పై ప్రబోధాన్ని హృదయానికి హత్తుకునేట్టు చేయటం యిట్టి కార్యక్రమాలన్నిటి యొక్క ముఖ్య లక్ష్యం కావాలి. విభేదాలన్నీ విస్మరించే సమైక్యభావాన్నీ, ఉదాత్తతనూ సమకూర్చటమే దీనిలో ప్రధానం.

## విజయానికి కీలకం

బంగారం లాంటి ఈ సూత్రాన్ని సంఘంలో తు. చ. తప్పకుండా సాధన చేయటంచేతనే కులం, తెగ, భాషల విభేదాల ఛాయలు గూడా కనుపించవు, సమాజంలోని వివిధ స్థాయిల నుండి వచ్చిన వందలాది, వేలాది స్వయంసేవకులు కలిసి కూర్చుంటారు. కలసి భోజనం చేస్తారు. కలసి ఆడతారు. పాడతారు. తోటివారు ఏ కులానికి, ఏ తెగకు చెందినవారనే విషయాన్నే పట్టించుకోరు.

అపూర్వమైన యిట్టి విశేష దృశ్యాన్ని 1934లో వార్ధాలో జరిగిన సంఘ శిబిరంలో గాంధీజీ స్వయంగా జూచి ఆనందాశ్చర్యాలు పొందారు.

ఆ శిబిరంలో 1500 మంది పైగా పాల్గొన్నారు. వారంతా పందిళ్ళలోనూ గుడారాలలోను బస చేసారు. సరిగా ఆ శిబిరానికి ప్రక్కనే గాంధీజీ ఆశ్రమం వుంది. శిబిరం అనేకమంది యువకుల కార్యక్రమాల సందడితో నిండివుంది. దానిని చూడాలని గాంధీజీ కోరారు. తదనుసారం, మనవార్ధా జిల్లా సంఘచాలకులు- ప్రాంత కాంగ్రెసు మాజీకార్యదర్శి- వెళ్ళి గాంధీజీని శిబిరానికి ఆహ్వానించారు. గాంధీజీ వచ్చారు. శిబిరంలోని వసతి, వంట శాలవంటివాని ఏర్పాట్లన్నిటినీ పరిశీలించారు. ఆపైన- "ఇక్కడ ఎంత మంది హరిజనులున్నారు?" అని ఆయన ప్రశ్నించారు. "నాకు తెలియదు, నే నెప్పుడూ కనుక్కోలేదు" అని మన సంఘచాలకులు బదులు పలికారు. "ఇప్పుడైనా మీరా విషయం విచారించి నాకు చెప్పండని" గాంధీజీ అన్నారు. "ఆ పని నేను చేయలేను. మాకు సంబంధించినంతవరకూ వారందరూ హిందువులే. మాకది చాలు" అన్నారు సంఘచాలకులు. "అట్లా అయితే నే నడగనా?" అన్నారు గాంధీజీ. "అది మీ యిష్టం"అని సంఘచాలకులు బదులు చెప్పారు. ముఖాముఖీగా స్వయంసేవకుల ననేకమందిని పదేపదే గాంధీజీ ప్రశ్నించారు. హరిజనులతోసహా అన్ని వర్గాలవారూ వున్నారు. ఆటపాటల్లో, భోజన భాజనాల్లో తదితర శిబిర కార్యక్రమాలన్నింటిలో, ఉత్సాహంతో సామరస్యంతో, తమ తమ కులాలను గురించిన స్పృహే లేకుండా వారంతా కలసి మెలసి ఉంటున్నారని గాంధీజీ తెలుసుకున్నారు. ఆయన ఎంతో ఆశ్చర్యపడ్డారు. తదనంతరం డాక్టర్‌జీ, మహాత్ముని కలసి సంఘకార్యంలో మౌలికమైన ఏకత్వాన్ని గుర్తు చేస్తామనీ, పైపై విభేదాలను పాటించమనీ కాబట్టే సంఘంలో సమైక్యతను సాధించగలుగుతున్నామనీ వారికి వివరించి చెప్పారు. ఈ అనుభవం గాంధీజీ మనసుపై ఎంతో ప్రభావాన్ని చూపెట్టింది. ఎన్నో ఏళ్ళ తర్వాత 1947 సెప్టెంబరులో, ఢిల్లీలోని భంగీ కాలనీలో, స్వయంసేవకులను సంబోధిస్తూ ఆయన ఈ సంఘటనను మళ్ళీ గుర్తు చేసుకొని చెప్పారు. స్వయంసేవకులలో అనుశాసనం ఉన్నదనీ, అంటరానితనం ఏ కోశానా

లేదనీ; అంతా కేవలం నిరాడంబరంగా ఉంటుందనీ, అది చూచి తానెంతో ప్రభావితుడనైనానని అప్పుడు ఆయన చెప్పారు.

"నీవు హిందువువైతే చాలు, మేమింకేదీ పట్టించుకోం. హిందువు అన్నదే మా ఆలోచనలలో ముఖ్య విషయం. కులం కాదు, తెగ కాదు, ఇంకేదీ కానే కాదు" అని బాహాటంగా ప్రకటించగలిగేట్లుగా, తన కార్య కర్తల మనస్సులను తీర్చినందువల్లననే– ఈ విధమైన, విశిష్టమైన విజయ సిద్ధి సంఘానికి లభించింది.

# 29. ఉపేక్షిత సోదరులకు సేవ

మన దేశపు తూర్పు ప్రాంతాల్లో ఒక వింత పరిస్థితి మనక్కన బడుతూ వుంటుంది. మన ప్రభుత్వం అచట క్రైస్తవుల అస్తిత్వాన్నే గుర్తిస్తుందిగానీ, హిందువుల ఉనికిని గుర్తించదు. క్రైస్తవేతరులనందరినీ, హిందువులకన్న వేరైన కొండజాతి వారలనుగా ప్రభుత్వం పరిగణిస్తుంది.

## రాజకీయవాది మాటలు

ఈ గిరిజనులు చెట్టుచేమల్నీ, రాళ్ళనీ రప్పల్నీ, పాముల్నీ పూజిస్తారు కాబట్టి వీరు ఆటవికులనీ, వారిని హిందువులనదగదనీ వేర్పాటువాదులు అంటుంటారు. హిందుత్వం యొక్క ఓనమాలు గూడా తెలియని అజ్ఞాని మాత్రమే అలా అనగలడు. 'ఆనిమిస్ట్స్' అన్న ఆంగ్ల పదానికి, సృష్టి మొత్తంలో పరివ్యాప్తమైయున్న చైతన్యతత్వమని అర్థం. పైకి ఏలా కనిపించినా, అంతర్లీన చైతన్యమే దానిలో ఆరాధింపబడు తుంది. దేశమంతటా హిందువులు చెట్టుని పూజించటం లేదా? తులసి, అశ్వత్థ, బిల్వవృక్షాలన్నీ హిందువులకు పవిత్రమైనవే గదా!

## శ్రీకృష్ణుని ప్రబోధమేమిటి ?

శ్రీ మద్భగవద్గీతలో శ్రీ కృష్ణుడు- ఏ ఏ వస్తువుల్లో దివ్య చైతన్య స్ఫూర్తి మరింత అధికంగా ఉంటుందో, ఆ పేర్లన్నీ తెలియజేస్తూ,చెట్లలో, తానే అశ్వత్థాన్నని చెప్పాడు. అలాగే ఆయన వివిధ రకాలైన పాములు, జంతువులు, పక్షులు, పర్వతాలు, నదుల గురించి కూడా చెప్పాడు.

*"యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జిత మేవవా!*
*తత్త దేవావ గచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్॥*

(గొప్ప గొప్ప విషయాలన్నీ కూడా నా తేజస్సులోంచి వచ్చినవే) అని ప్రకటిస్తూ తన దివ్యాంశ గల వస్తువుల జాబితాను వర్ణించటం ముగించాడు.

## భేదోపాయం కొనసాగుతూనే ఉంది

నాగపూజ మన దేశమందంతటా ఉన్నదే. సుదూర దక్షిణ భారతంలో, పెద్ద పెద్ద సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవాలయాలున్నాయి. అక్కడ నాగుబాము నాపేరుతో కూడా పిలుస్తారు. కాబట్టి ఆ భక్తులనూ, ఆ పూజలు చేసేవారినీ, ప్రకృతి ఆరాధకులని భావించి వారంతా హిందువులు కానే కాదనాలా?

హిందూ సమాజాన్ని వీలైనన్ని చిన్న వర్గాలుగా చీల్చటానికీ, వీలైతే ఛిన్నాభిన్నం చేయాలనే దృష్టితోనే ఇట్టి వినాశకరమైన సిద్ధాంతాన్ని ఆంగ్లేయుడే ప్రవేశపెట్టాడు. విదేశీయులు వెళ్ళింతర్వాత గూడా, అలాంటి వేర్పాటు విధానాలను మనవారే కొనసాగిస్తుండటం మన దురదృష్టం.

## హృదయపూర్వకమైన కృషి

మన సమాజంలో, ఇంతవరకూ ఉపేక్షితులై యున్నట్టి, మన సోదరుల వద్దకు వెళ్ళి వారి జీవన పరిస్థితులను మెరుగుపరచేందుకు శాయ శక్తులా పరిశ్రమించటం ఈనాడు మన కర్తవ్యం. వారి యొక్క కనీస మైన భౌతిక అవసరాలూ, సుఖాలూ, తీర్చగల పథకాలను మనం రూపొం దించి కృషి చేయాలి. ఈ పథకాల ప్రయోజనం పొందగల అర్హత వారికి కలిగించాలి. అందుకై పాఠశాలలనూ, వసతి గృహాలనూ, శిక్షణ తర గతులనూ మనం ప్రారంభించాలి. ఈ విధమైన భౌతికోపశమనంతోబాటు, వారిలో దైవభక్తిని పెంపొందించి వారి మనస్సులలో హిందూధర్మం పట్ల ప్రేమాభిమానాలనూ, తోటి హిందువుల పట్ల సమైక్యతా భావాన్నీ మరల ప్రజ్వలింపచేయాలి. అందుగ్గాను మనం, ఉన్నతులూ, అధములూననే భ్రమలు విడచి, సమానతా భావం గల్గి వారితో మనం కలసి మెలసి సోదరు లల్లే జీవించాలి. వారితో అరమరికలు లేకుండా మనం కలసిపోవాలి. కలసి భోంచేయాలి, కలసి పాడుకోవాలి. పవిత్రమైన భక్తిగీతాలను అందరం కలసి సంకీర్తన చేయాలి.

ఆపైన– గిరిజనులలో మరొక సమస్య వుంది. నిరంతర సంచారం వారి కలవాటు. కొద్దికాలంపాటు గూడా, ఒకే ప్రదేశంలో వారు నివాసం వుండనప్పుడు వారికి శిక్షణ నివ్వటంగానీ, సంస్కారాల నలవరచటంగానీ ఏలా సాధ్యమన్నదే సమస్య. అటువంటి వారి కొరకు ప్రభుత్వం ఏదో కృషి చేస్తున్నది; అందులో సందేహం లేదు. కానీ ప్రభుత్వం అంటే కేవలం కార్యనిర్వహణా యంత్రాంగం మాత్రమే గదా! అట్టి యాంత్రిక వ్యవస్థ, ప్రజల యొక్క ప్రవర్తనా సరళిని మార్చజాలదు. మాన వత్వంలో మాధుర్యాన్ని చవి చూపినపుడు మాత్రమే, మన గిరిజనసోదరులు ఒకచోట స్థిరపడి జీవించేందుకిష్టపడతారు. అడవులలో తిరుగుతూ వుండే

క్రూరమృగాలను కూడా మచ్చిక చేసి, పెంపుడు జంతువులనుగా మనం గృహజీవితానికలవాటు చేయగలిగినప్పుడు, మరింత సుఖతరంగా, నాగరికంగా వుండే జీవిత పద్ధతుల ననుసరించేట్లు మన సోదరులకు మనం నచ్చచెప్పలేమా?

ఈ ప్రాంతాలలో విదేశీ మతప్రచారకులు ఏలా పని చేస్తున్నారో చూడండి. వారి కృషినీ పట్టుదలనూ చూచి మనం ఆశ్చర్యపోతాం. ఎంతటి కష్టాలన్నయినా సరే వారు చిరునవ్వుతోనే అనుభవిస్తున్నారు. వారు ఎంతో దూరదేశాల నుండి వచ్చి, దట్టమైన కీకారణ్యాలలోకి పోయి స్థిరనివాసమేర్పరుచుకుంటున్నారు. స్థానిక ప్రజలలాగానే వారు కూడా అక్కడ చిన్న చిన్న ఇళ్ళల్లో నివసిస్తున్నారు. వారితో కలిసి జీవిస్తున్నారు. వారి భాషను నేర్చుకుంటున్నారు. స్థానికమైన ఆచార వ్యవహారాల్లో తాదాత్మ్యం చెందుతున్నారు. వారు స్థానికులతో, చాలా ఆప్యాయతతో వ్యవహరిస్తుంటారు. వారి అనుభవం చూచి నేర్చుకుని, మనం కొంతైనా కృషి చేయలేమా?

## 'గతం'నుంచి గుణపాఠం

మనం ప్రత్యేకంగా హెచ్చరిక చూపవలసిన విషయం ఒకటున్నది. అదే జనాభా లెక్కల సేకరణ. ఇస్లాం మతానుయాయులు వాళ్ళ సంఖ్యను పెంచి చెప్పుకుంటారనేది మనకు తెలిసినదే. దాని వలన మన దేశ పరిస్థితుల్లో అనేక విషాదకర పరిణామాలొచ్చాయి. కాబట్టి సంఖ్యా బలాన్ని అంచనా వేయటంలో హిందువులు అజ్ఞానులు కారాదు. వారు జనాభాలెక్కల సేకరణలో తప్పకుండా తమ పేర్లు నమోదు చేసుకోవాలి. అటుపైన- ఏ పంథకు, ఏ కులానికి, ఏ వంశానికి, ఏ తెగకు చెందినవారైనప్పటికీ, హిందువులందరూ, తమది 'హిందూ' జాతి అనే తప్పక నమోదు చేసుకోవాలి. దూరప్రాచ్య ప్రాంతంలో ఉన్న మన సోదరులు- వారు నాగు

లైనా, కాశీ, జైంతియా, మికిర్, మిజో వంటి ఏ తెగలకు చెందినవారైనా సరే, తమ వస్త్రధారణ తీరులలో, భాషల్లో, ఆహార పద్ధతుల్లో, ప్రాంతీయ ఆచారాల్లో ఎంతటి తేడాలున్నప్పటికీ అంతా తమది 'హిందూ' జాతి అనే చెప్పుకోవాలి. మనది ఒకే ఒక సామాజిక అస్తిత్వమనే మౌలిక సత్యం ఎల్లప్పుడూ మనస్సులలో నిలుపుకోవాలి.

అటువంటి మౌలిక సమైక్యత లేకపోవటం చేతనే, ఆ ప్రాంతాల లోని మన సోదరులు విదేశీ క్రైస్తవ మతప్రచారకుల కుతంత్రాల నుండి బయటపడటానికి ఎంతో కష్టపడవలసివస్తోంది. చీలికలై విడివిడిగా బ్రతుకుతున్నందుననే వారు అచట రెండవ తరగతి పౌరుల స్థితికి దిగ జారిపోయారనే విషయం వారు గుర్తించాలి. అందుకనే క్రైస్తవులు అల్ప సంఖ్యాకులే అయినప్పటికీ, తమ ప్రభావాన్ని పటిష్ఠం చేసుకొని, ఆ ప్రాంతంలోని కొన్ని భాగాలలో, తమ నాయకత్వాన్నీ, అధికారాన్నీ సుస్థిరం చేసుకోగలుగుతున్నారు.

## సుగుణ సమృద్ధి

అట్టి వనవాసులైన సోదరులతో కలసిమెలసి జీవించినప్పుడే, ధైర్యం, తెలివితేటలు, పరిశ్రమ, నిజాయితీ, సౌహార్దం, సంస్కృతి, ఆధ్యాత్మిక సంస్కారాల వంటి అనేక సద్గుణాలు వారిలో ఉన్నాయని మనం గుర్తించగలం. మన సైన్యంలోని మహావీరులెందరో వారి నుండి వచ్చినవారే. బహుశః మహారాణా ప్రతాప్ ఒక్కడే, వారితో సన్నిహిత సంబంధా లేర్పరుచుకొని, వారిని, మిగిలిన సమాజంతో సమాన భాగ స్వాములనుగా చేసాడనవచ్చు. ఆ ప్రాంతంలోని వనవాసులు– భిల్లులన బడేవారు– రసపుత్రులతో సమంగా నిలబడి, భుజం కలిపి, తరతరాల పాటుగా, స్వదేశ, స్వధర్మరక్షణ నిమిత్తమై వీరోచితంగా కృషి చేసారు.

## మనం సరిదిద్దుకుందాం

కేవలం వారిని దోచుకునేందుకే ఈ రోజుల్లో మనవాళ్ళు కొందరు వారి దగ్గరకు చేరుతున్నారు. గోమాంస భక్షకులని వారిని నిందిస్తూ, అందుకనే వారితో కలసి జీవించలేమనీ, వారిని హిందువులుగా పరిగణించ రాదనీ కొందరంటుంటారు. కానీ వారి పరిస్థితులను ఎన్నడైనా మనం సానుభూతితో అర్థం చేసుకున్నామా? ముందుగా చెప్పాలంటే— అసలు మనలో ఎవరైనా, వారి దగ్గరకు పోయి గోవుపట్ల భక్తిని గురించి వారికి ప్రబోధించారా? గోవును తల్లిగా చూచుకోవాలని వారికి చెప్పారా? లేదు. అటువంటప్పుడు, తప్పు వారిదికాదు. మనది— రెండవ విషయమేమిటంటే— తమ పొట్ట నింపుకునేందుకు తగినన్ని ఆహారపదార్థాలు వారికి లేవు. అందుచేతనే కేవలం, గత్యంతరం లేక, తప్పనిసరిగా వారు గోమాంస భక్షణకు అలవాటుపడ్డారుకానీ, వ్యామోహం చేతనో, విలాసంగానో కాదు. ఈ విషయంలో కూడా లోపం మనదే. వారి వద్దకు పోయి, వారికి బోధ చేసి, వారి జీవన పరిస్థితులను బాగా ఉన్నత పరచి, వారి సాంస్కృతిక స్థాయిని గూడా మెరుగుపరచటం ద్వారా మన లోపాన్ని సరిదిద్దుకోవలసిన బాధ్యత, మన వంటి ఇతర హిందువుల మీద ఉంది.

వారిని ఉపేక్షించటానికి కారణం మన సాంఘిక వ్యవస్థయే అని చెప్పటం పొరబాటు. పూర్వకాలంలో, సమాజవ్యవస్థలో, పంచాయితీ పద్ధతి మౌలిక ప్రమాణమై ఉన్నప్పుడు, ఈ వనవాసులకు గూడా, దానిలో ఒక గౌరవస్థానం ఉండేది. అతిప్రాచీనంగా శ్రీరామచంద్రుని పరిపాలనా పద్ధతుల వర్ణనలలోనే— ఈ విషయం మనకు కనిపిస్తుంది.

## కర్మయోగం

ఈ సోదరీ సోదరులతోటి మనకు సంపర్క, బాంధవ్యాలు గత అనేక శతాబాలుగా లేవు. అదే, వారి పట ఈనాటి మన ఉపేక్షకూ, వారి

వెనుకబడినతనానికీ గూడ ముఖ్య కారణం, సమాజంలోని ఇతరుల వలే విద్యాబోధనను సద్వినియోగం చేసుకోగల అవకాశం వారికి లేదు. సాంకేతికమైన, తదితరమైన శిక్షణ లేని కారణంచేత, ఉత్పత్తి చేయటం, అభివృద్ధి చెందటం వంటి సామర్థ్యాలలో వారు వెనుకబడిపోయారు.

ఈ విధమైన విద్యాప్రబోధాన్ని, మనం, మన దేశం యొక్క మారుమూల గ్రామాల్లో, కొండల్లో, కీకారణ్యాల్లో, ధర్మమంటే కేవలం కొన్ని మూఢాచారాల మూటగా మాత్రమే భావిస్తూ కుంచించుకుపోయినవారలకూ, ధర్మం గురించి తెలుసుకునేందుకూ, తదనుగుణంగా జీవించేందుకూ, ఎట్టి అవకాశాలూ లభించనివారలకూ అందించాలి. ఈ కృషిలో కష్టనష్టాలూ, పరీక్షలూ తప్పవని గుర్తించాలి. ఈ పనిచేస్తే మనల్ని మెచ్చేవారుండరని, తరచు మనకు అనిపించవచ్చు. కానీ వెంట వెంటనే ఫలితాలు వస్తాయనీ, ఏవో అద్భుతాలు జరుగుతాయనీ ఆశించకుండా మనం కఠోర వాస్తవాలను ఎదుర్కోవాలి. అపరిమితమైన సహనంతో, నిజమైన కర్మయోగిలా, చైతన్య స్ఫూర్తితో విజయసాధనకై మనం ముందడుగు వేయాలి.

## అందరినీ సేవించాలి

దోషాలన్నిటినీ ఇతరుల నెత్తిన రుద్ది సంతోషించే కార్యకర్తలనేకులుంటారు. వారిలో కొందరు ఈ దోషమంతా రాజకీయమైన వికృతులపై ఆరోపిస్తారు. ఇంకొందరు, క్రైస్తవులూ, మహమ్మదీయుల వంటి మతదురభిమానుల యొక్క దురాక్రమణ చర్యలే దీనికి కారణమంటారు. మన కార్యకర్తలు అట్టి ధోరణులకు దూరంగా ఉండాలి. మన ప్రజల కోసం మన ధర్మం కోసం వారు సరైన స్ఫూర్తితో కృషి చేయాలి. సహాయమవసరమున్న మన సోదరులందరకూ చేయూత నిచ్చి, వారి కష్టాలను తొలగించేందుకు పరిశ్రమించాలి. ఇట్టి సేవలో, మనిషికీ మనిషికీ

నకుమ తేడాలను చూపరాదు. అతడు క్రైస్తవుడే గావచ్చు, లేదా మహమ్మదీయుడో, మరే మతాన్ననుసరించేవాడో అయి వుండవచ్చుగాక,— మనం మాత్రం, అందరినీ సేవించాలి. ఎందుకంటే, ప్రమాదాలూ, కష్టనష్టాలూ, మతంతో ప్రమేయం లేకుండానే, మానవులందరినీ ఒకే రకంగా బాధిస్తాయి. తోటి మానవుని దుఃఖం పోగొట్టేందుకు చేసే సేవను, మొహమాటానికో, జాలిపడో చేస్తున్నామనే భావంగాక, జీవులన్నిటి హృదయాలలో నిండివున్న పరమాత్మను సేవిస్తున్నామనే శ్రద్ధాభావంతో చేయాలి. మనకు తల్లీ, తండ్రీ, సోదరుడూ, స్నేహితుడూ, సర్వస్వమూనైన పరమాత్మ యొక్క పవిత్ర సేవలో మన సర్వస్వాన్నీ సమర్పించాలని ప్రబోధించిన మన ధర్మ స్ఫూర్తితో ఈ సేవాకార్యక్రమం నిర్వహించాలి. మన ఈ ప్రయత్నాలు, సనాతనమూ, శాశ్వతమూనైన మన ధర్మం యొక్క కీర్తిప్రతిష్ఠలనూ, తేజస్సునూ, జాజ్వల్యమానం చేయుటలో సఫలమగునుగాక!

## ప్రశ్నలు - సమాధానాలు

ప్రశ్న : మన సాంస్కృతిక భావాలను గిరిజనులలోనూ, ఇతర తెగల వారిలోనూ కలిగించడమెలా?

సమాధానం : వారితో సమంగా వ్యవహరిస్తేనే ఇది సాధ్యం. మనం మహోన్నతులమనుకుంటే ఈ పని చేయటం కుదరదు. ముందుగా వారంతా మనతో సమానులనీ, మన సోదరులేననీ వారికనిపించేట్లుచేయాలి. మన యొక్క నిజమైన ప్రేమాదరాలను వారనుభవించేలా చేయాలి. అప్పుడు మాత్రమే వారు మన పిలుపును విని, మనం చెప్పింది అవగాహన చేసుకునేందుకు సంసిద్ధులౌతారు.

వాస్తవానికి, ప్రాచీన కాలంలో, వారితో సాంస్కృతికసంబంధాలను నిలుపుకునేందుకు ఏర్పాట్లుండేవి. ఆ ప్రాంతంలో ఉండే 'గోస్వాము'లనే వారు, గిరిజనులతో కలుస్తూ, వారికి విద్యాబోధన చేసి, వారి యొక్క

సాంస్కృతిక స్థాయిని, మెరుగు చేసేందుకై ప్రత్యేకంగా ఏర్పడ్డారు. అస్సాములోని వీరంతా, చైతన్య మహాప్రభు శిష్యులైన ఆచార్య శంకర దేవుల పంథకు చెందినవారే. ఒకసారి వారిలో కొందరిని నేను కలిసాను. "అటువంటి అనాగరిక వ్యక్తులతో మేం ఏలా కలియగలమని" వారన్నారు. అయినప్పటికీ, వారితో నేను కొంత చర్చించిన తర్వాత గిరిజనులతోబాటు కలిసి కూర్చుని భోజనం చేయటానికి వారంగీకరించారు. గిరిజననాయకులు వచ్చారు. కానీ సహపంక్తి భోజనం సాధ్యమవుతుందని వారెన్నడూ ఊహించలేదు. అందుకే వారు దూరంగా, గుంపుగా గుమిగూడి ఉండి పోయారు. అప్పుడు "మనమంతా సోదరులమే"నని చెప్పి ఇద్దరు గిరిజన నాయకులను భోజనం నిమిత్తమై నా కిరుప్రక్కలా కూర్చోబెట్టుకున్నాను. వారికి నోటమాట రాలేదు. మనం వారికి దూరదూరంగా ఉండిపోతూ, వారు చాలా దిగజారిపోయిన వారంటూ, వారిపై ఏవేవో నిందారోపణలు చేస్తూ వుంటాం. ఇదే మనతో వచ్చిన పెద్ద ఇబ్బంది.

ఈమధ్య గిరిజనులు ప్రభుత్వోద్యోగులను కలుసుకోవటానికే ఇష్ట పడటంలేదు. ఎందుకో తెలుసా?– ఒక విధమైన 'నాగా' తెగవారున్నారు. కొమ్ములాగా పొడుచుకువచ్చే విధంగా, నుదిటిపైన తమ జుట్టును ముడిగా చుట్టుకొనే అలవాటు వారికుంది. అదే అందమనీ, అది వారికి గౌరవం కూడా కలిగిస్తుందనీ రకరకాలుగా వారు భావిస్తారు. ఇట్టిప్రజల సంక్షేమం చూచేందుకు నియోగింపబడిన ఒక అధికారి ఒకసారి అస్సాముకు వచ్చాడు. గిరిజననాయకులు ఆతనిని చూడటానికి వచ్చారు. ఆ అధికారికి ఇంగిత జ్ఞానం కించిత్తు గూడా లేదు. అతడు వారి నాయకుల్లోని ఒకణ్ణి పట్టుకొని, అతని జుట్టు ముడిని చేజిక్కించుకుని, ముందుకు గుంజుతూ "దీన్ని కత్తి రించేయ్. నీవు ఆధునిక మానవుడివిగా మారితీరాలి" అన్నాడు. అదిచూచి నాగా నాయకులు దిగ్భ్రాంతి చెందారు. ఆతడు కనీసపు ఇంగిత జ్ఞానమైనా లేకుండా వారితో అలా ఎందుకు ప్రవర్తించాడు! వారి విశ్వాసాలనూ, నమ్మిక

లనూ ఎందుకు గౌరవించలేకపోయాడు?? ఇంక ఆ తరువాత నుంచీ ప్రభుత్వోద్యోగులను నాగా ప్రజలు కలిస్తే ఒట్టు.

(బొంబాయిలో 'వడ్డరు'లనబడే ఒక వెనుకబడిన కులసంఘాధ్యక్షునితో జరిపిన సంభాషణ)

ప్రశ్న : మా కులంలో విద్యాప్రమాణాలు చాల తక్కువ. మెట్రిక్‌లో ఉత్తీర్ణులైనవారు ప్రభుత్వకార్యాలయాల్లోనూ, పరిశ్రమల్లోనూ, గుమాస్తాలుగానో, కాపలాదారులుగానో ఉద్యోగం చేస్తున్నారు. అంతకన్న పైచదువులున్నవారు కొన్ని ఉన్నత ఉద్యోగాలు చేసుకుంటున్నారు. కానీ వారి సంపాదనలు, కాయకష్టం చేసి సంపాదించుకొనేవారికన్న తక్కువగా ఉంటున్నాయి. ప్రభుత్వోద్యోగాల్లో చేరటానికి అవసరమైన అర్హతలను, మా కులానికి సంబంధించినంతవరకూ తగ్గించవలసిందిగా ప్రభుత్వాన్ని మేం కోరుకుంటున్నాం.

సమాధానం : విద్య తప్పనిసరిగా ఉండాలి, సందేహం లేదు. కానీ కాయకష్టం ద్వారా వచ్చే ఆదాయం అధికమైతే, అప్పుడు మెట్రిక్‌లో ఉత్తీర్ణులైనవారు కూడా, కాయకష్టమే చేయాలి. విద్యాకాయకష్టములు ఒకదానితో ఒకటి పొసగనివి కావు. ఈ రెంటినీ జోడించినప్పుడు మాత్రమే సమృద్ధి లభిస్తుంది.

మీ వాళ్ళ ఉద్యోగాల కోసం విద్యార్హతలను తగ్గించమని కోరటం కూడా మంచిదిగాదు. అలా కాకుండా, చదువులో వెనుకబడివున్నతరగతులకు చెందిన మన ప్రజలు, తమ విద్యాప్రమాణాలను పెంపొందించుకునేందుకు తప్పక చొరవచూపాలి. ఈ సంవత్సరం కనీసార్హతకు, 35 శాతం మార్కులు అవసరమైతే రెండేళ్ళ తర్వాత దానిని 40శాతానికి పెంచమనికూడా మీరు కోరాలి. అటువంటి స్వయంకృషి ఉంటేనే, వెనుకబడిన తరగతివారు తమంతతాముగా పైకి రాగలుగుతారు. లేకపోతే ఆ తరగతులకు చెందిన పిల్లలకు జీవితంలో ఉన్నత ఆకాంక్షలూ, లక్ష్యాలూ, ఎన్నడూ ఏర్పడవు.

ఎక్కువ తెలివితేటలూ, సామర్థ్యం అవసరమైన ఉన్నత పదవులకు, వారు శాశ్వతంగా దూరమైపోతారు. పైగా తెలివితేటల స్థాయి తక్కువగా ఉన్నవారు ఏ రంగంలో పని చేస్తున్నాసరే— దాని స్థాయిని గూడా దిగజార్చగలరు. అటువంటప్పుడు అతనితోసహా అనేకమంది ప్రాణాలుకూడా సంకటంలో పడతాయి. ఇదే సూత్రం వైద్యులకూ, ఇంజనీర్లకూ, సాంకేతిక నిపుణులకూ కూడ వర్తిస్తుంది. ముఖ్యంగా శాస్త్రీయమూ, సాంకేతికమూనైన ఈ యుగంలో, మనం మన శక్తినీ, నైపుణ్యాన్నీ పెంపొందించుకోవటం తప్పనిసరి. అందుచేతనే మన పిల్లలు సరైన ఆకాంక్షల నలవర్చుకొని, తమ యొక్క సామర్థ్యాన్నీ, విద్యాప్రమాణాలనూ, పెంపొందించుకునేలా చూచుకోవటం అవసరం. ఈ విషయం పట్ల మీకు మరింత పట్టుదలుండాలని నేను కోరుతున్నాను.

ప్రశ్నించినవారు : మీరు చెప్పింది సరికొత్తగా ఉంది. ఈ విషయం నేను ఒప్పుకుని తీరాలి. ఇంతవరకూ ఈ ఆలోచనలను మాకెవ్వరూ చెప్పలేదు. మీ భావనే సరియైనదని నేననుకుంటున్నాను.

ప్రశ్న : మతపరమైన, సామాజికమైన వ్యవహారాల్లో యజ్ఞోపవీతం, గోత్రముల వంటివి, మాకు లేకుండా చేయటం ద్వారా అన్యాయం చేసారని మా సంఘంలో కొందరు బాధపడుతున్నారు. దీనికి మీరు సూచించే పరిష్కార మార్గమేమిటి?

సమాధానం : మీ వారికి, యజ్ఞోపవీతాలు, గోత్రాలూఇవ్వవచ్చును. వారికి తమ గోత్రం తెలియకపోతే, వారి పురోహితుని గోత్రమే, వారి గోత్రమవుతుంది. పూర్వకాలంలో అలా జరుగుతూండేది. అది శాస్త్ర సమ్మతం కూడా. ఏ గోత్రమునకూ చెందనివారుంటే— అందరూ కశ్యపుని సంతానమేనని భావింపబడుతుంది కాబట్టి— వారంతా కాశ్యప గోత్రానికి చెందినవారేనని శాస్త్రాలలో ఉంది. ధర్మవిధులలోనూ, దేవాలయాల అర్చనలలోనూ, వేదాధ్యయనంలోనూ, సర్వసామాన్యంగా మన సాంఘిక,

ధార్మిక వ్యవహారాలన్నింటిలోనూ వారికిగూడా, సమానమైన హక్కులనూ ప్రతిపత్తినీ ఇచ్చితీరాలి. ఈనాడు మన హిందూ సమాజంలో కనబడుతున్న కులతత్వపు సమస్యలన్నిటికీ ఇది ఒక్కటి మాత్రమే సరియైన పరిష్కార మార్గం. ఈ విషయాన్ని నేను కలుసుకున్న శంకరాచార్యులందరకూ, అలాగే నే కలిసిన ఇతర ఆచార్యులకూ మనవి చేసాను.

# 30. మానవతా భావమే మహత్తర పరిష్కారం

(కాఫీ తోటల యజమానుల, పారిశ్రామికవేత్తల నుద్దేశించి చేసిన ప్రసంగం)

మనందరి హృదయాలకూ, అతిప్రియమూ, సన్నిహితమూనైన మన ధర్మం, మన సమాజాల యొక్క పునరుజ్జీవన కార్యంలో మనం ఎటువంటి నిర్దిష్టమైన సహకారాన్ని, అందించగలమో ఆలోచించుకునేందుకే మన మిక్కడ సమావేశమయ్యాం. ఈ సందర్భంలో కొన్ని విషయాలను స్పష్టం చేసేందుకుగాను నేను, అస్సాం ప్రాంతానికి చెందిన తేయాకుతోటల యజమానుల ఉదాహరణ మీ ముందుంచుతాను.

## వ్యత్యాసం

అక్కడ ఆంగ్లేయులకు చెందిన కొన్ని తేయాకు తోటలున్నాయి. ఆంగ్లేయుడైన తోట యజమాని, తన కార్మికులతో ఏలా ప్రవర్తిస్తాడన్నదే ఇపుడు మన ముందున్న ప్రశ్న. అతడు వారిండ్లకు పోతాడు. వారి పిల్లలను లాలిస్తాడు. స్వయంగా వారి యొక్క వైద్యావసరాలను సమీక్షిస్తాడు. తన వద్ద పని చేసే వారి కుటుంబంలోని అందరితోనూ అతడు మానవతాపూర్ణమైన సంబంధాలను నిర్మాణం చేసుకుంటాడు. అతడంతటితో ఆగడు; తన తోటలో ఒక చర్చినిగానీ, ప్రార్థనా మందిరాన్ని

గానీ, నిర్మిస్తారు. అతడూ, అతని కార్యనిర్వాహకోద్యోగులు, వారి వారి కుటుంబాలూ, ప్రతి ఆదివారం ఉదయం తప్పనిసరిగా అక్కడికి పోతారు. కార్మికులను చర్చిలోని ప్రార్థనల్లో పాల్గొనేందుకు కూడా వారు ప్రోత్సహిస్తారు. దానికి హాజరైన వారికి, వారు మరికొన్ని అధిక ప్రయోజనాలను ఇవ్వచూపుతారు. ప్రతి వారం, చర్చిని సందర్శించేవారికి ఉపదేశాలు చేసేందుకు వారొక మతగురువును గూడా అచట నియమిస్తారు. అట్టి ప్రలోభనాలూ, ప్రోత్సాహాలతో వారు తమ కార్మికులను క్రైస్తవ మతం లోనికి మార్చడంలో చాలావరకూ విజయవంతులయ్యారు. అచట తేయాకు తోటలకు యజమానులైన హిందువులు గూడా ఉన్నారు. వారికీ హిందూ తోట యజమానులకూ వ్యత్యాసం ఎంతో ఉంది. హిందూ యజమానులకు. కార్మికులతో సంబంధబాంధవ్యాలు, స్నేహభావపూర్వకంగాకాక విభిన్నంగా ఉంటున్నాయి. వారు కార్మికుల నుండి, వీలైనంత ఎక్కువగా పనిని రాబట్టుకోవటానికి మాత్రమే ప్రయత్నం చేస్తారు. అందుకనే అచటి కార్మికులు తమ నిరసనను వ్యక్తం చేసి, తిరుగుబాటు చేసి, అధిక జీతాలనూ, మరింత మంచి సదుపాయాలనూ కోరుకుంటుంటారు. ఈ ఉద్రిక్తత రోజు రోజుకీ పెరుగుతూ వున్నది. ఇది కేవలం ఆర్థిక విషయాలకు మాత్రమే పరిమితంగా లేదు. వారిరువురి మధ్య సాంఘిక సంబంధ, బాంధవ్యాలు ఏ మాత్రం లేవు. కార్మికులతోటి, తమ వ్యవహారాల్లో, మానవతా భావాన్ని ఆ యజమానులు ప్రదర్శించరు. కార్మికుల యొక్క ఇండ్లను వారెన్నడూ సందర్శించరు. కొద్దిపాటిగానైనా వారి సుఖదుఃఖాలలో యజమానులు పాలుపంచుకొనరు.

## వారిని చూచైనా నేర్చుకోవాలి

విదేశీయులు,— దుష్టబుద్ధితోనే అయినప్పటికీ— స్థానిక ప్రజలతోటి అంతటి మానవతాబంధాలను కలిగి వుంటుంటే, మనవాళ్ళే స్వాతిశయంతో

మన ప్రజల పట్లే నిర్లక్ష్యంగా ప్రవర్తించటం చూస్తే ఎంతో విచారం కలుగుతుంది. ఎంతోమంది కార్మికులుగా తమ వద్ద ఉద్యోగాలలో చేర్చుకొనే, తేయాకు తోటల యజమానులూ, పరిశ్రమల యజమానుల వంటి స్వదేశీయులు, ప్రస్తుతపు రోజుల తీరును గుర్తించి, మన తోడబుట్టిన బంధువులేఅయిన కార్మికులపట్ల, తమ బాధ్యతలనుగుర్తించి జాగరూకతతో నడచుకోవటం ఈనాడెంతో అవసరం. కార్మికులు ఈనాడు, ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడి ఉన్నారు. పనిభారానికి నలిగిపోతున్నారు. వారి కన్నీటిని తుడువటానికి, యజమానులలో మానవతాపూర్ణమైన ప్రవర్తన చాలా అవసరం. వారు ప్రతి తేయాకు తోటలోనూ, లేదా కార్మికవాడలోనూ, ఒక దేవాలయాన్ని కూడా నిర్మించి, అందులో వారం వారం భజనకూ, అర్చనకూ, ధర్మోపన్యాసాలకూ, హరికథలకూ తగిన ఏర్పాట్లు చేయాలి.

## అంతరికమయిన మంచితనంపట్ల విశ్వాసం ఉండాలి

తామిటువంటి మానవతా దృష్టిని ప్రదర్శిస్తే, కార్మికులు కట్టుతప్పిపోయి అలుసు చేసి నెత్తికెక్కుతారని యజమానులు కొందరు వాదిస్తుంటారు. కానీ సామాన్యంగా అలా జరుగుతుందని నేననుకోను. మానవతా భావాల్లో, చేష్టల్లో కేవలం నటనగాక, నిజాయితీతో ప్రవర్తిస్తున్నారని కార్మికులు గుర్తిస్తే, క్రమేణా వారు సరిగానే ప్రవర్తిస్తారు. ఉదాత్త మానవతా గుణాలను నమ్మకుండా, సహృదయత లేనివారైన మన ప్రజలుంటారని నేనెన్నడూ ఊహించలేను. మన నిత్యానుభవం కూడా అట్టిదే. వారి ఊహ కేవలం అపోహ. ఒకసారి నేను కాశీ విశ్వవిద్యాలయంలో పని చేస్తున్నప్పుడు, మా ఇంటి నౌకరొకడు, ఏవో విలువైన వస్తువులను దాచేసినందుగ్గాను, తన స్వగ్రామంలో నిర్బంధింపబడ్డాడు. ఆ వస్తువును నేనే అతనికి ఇచ్చాననీ, అతడు చాలా నిజాయితీగలవాడనీ, నేను హామీ ఇచ్చింతర్వాత

రక్షకభటులాతన్ని విడిచిపెట్టారు. ఆ తర్వాత నుంచీ ఆ సేవకుడు ఇతః పూర్వం తనలో ఏదైనా అవినీతి వుంటే, దాన్ని విడిచిపెట్టి, మా పట్ల నిజాయితీతో ఆదర్శప్రాయమైన సేవ చేసాడు.

ఒకసారి కార్మికులకు సామ్యవాద భావనను, మూఢ సిద్ధాంతంగా నూరిపోస్తే, ఇక, వారు మన చర్యలన్నింటినీ,— అవి ఎంతటి సద్భావంతో కూడివున్నవైనప్పటికీ— సందేహంతోనే చూస్తారు కదా? ఇట్టి సామ్యవాదుల నెదుర్కొనట మెట్లా?" అని తరుచు ఒక ప్రశ్న వినబడుతూ వుంటుంది. అందుకు, "సామ్యవాదులు మానవతా స్పర్శ లేనిచోట మాత్రమే కాలూనగలరని" నా సమాధానం. మానవత్వపు మాధుర్యాన్ని మించగల 'ఇజం' ఒక్కటి గూడా లేదు. కార్మికులు ముందుగా మానవులే. ఆ తర్వాతనే, వారు సామ్యవాదులయితే కావచ్చు.

## మనలో జాలి లేనే లేదు

ఈ విషయంలోనే— అంటే మానవతా స్ఫూర్తిలో, సానుభూతిలో మనం వెనుకబడుతున్నాం. ఈ లోపం కేవలం తేయాకు తోటల్లోనూ, పరిశ్రమల్లోనూ, మాత్రమేగాక, గ్రామాల్లో, నగరాల్లో కూడా, మన ప్రజలందరి నిత్యజీవితంలో ఎదురవుతూ వుంది. ఒక ఉదాహరణ చూద్దాం. నేడు, తమ ఇంటిపనికై, పని మనుషుల నేర్పాటు చేసుకోగల సంపన్నులెందరో ఉన్నారు. అయితే, సామాన్యంగా పనిమనుషులు, తమ యజమానుల ఇంటికి తమ పసిబిడ్డలతోసహా వస్తారు. బిడ్డను ఒక మూల దిగవిడచి, తమ పనిపాటుల్లో వారు నిమగ్నమైపోతారు. ఆలనా పాలనా లేకుండా వున్న ఆ చిన్నపిల్లలు ఏడ్చి, ఏడ్చి గొంతుక తడారిపోయి, పడివుండటం కూడా మామూలు దృశ్యమే. అయితే ఆ ఏడ్చే బిడ్డ గురించి, ఆ ఇంటి యజమానురాలు ఏమీ పట్టించుకోకపోవటం కూడా వింత కాదు. కొద్ది నిమిషాలు పని

ఆపి, ముందుగా, ఏడ్చే పసిపిల్లనోదార్చమని యజమానురాలు పనిమనిషికి చెప్పగలుగుతోందా?

మన దేశంలో నేడెంతోమంది, మనవాళ్ళే కడుపు నిండా తిండికీ, ఒంటినిండా బట్టకూ నోచుకోక, నిరక్షరాస్యులై, ధర్మం పట్ల భక్తి శ్రద్ధలను, అలవరుచుకొనేందుకు ఏ అవకాశాలూ-లేకుండా పడిఉంటున్నారు. ఈ సావకాశాన్ని, సామ్యవాదులూ, క్రైస్తవమతప్రచారకులూ దుర్వినియోగం చేస్తున్నారు. ఆర్థికంగా ముందడుగు వేసిన ప్రాంతాల్లో కూడా నేడు క్రైస్తవ మతప్రచారకులు సమాజం లోపలికి చొచ్చుకుపోవటం మనం చూస్తూనే వున్నాం.

## అనుకరించదగిన ఉదాహరణ

విదేశీ క్రైస్తవ మతప్రచారకులు, సుదూరదేశాల నుండి వచ్చి, దురుద్దేశాలతో అలా చేయగలుగుతూంటే, మన ప్రజలపట్ల, మన ధర్మం పట్ల సవ్యమైన ప్రేమను కలిగిన మనం ఆ పనినే మరింత బాగా చేయగలం. తమిళనాడు ప్రాంతంలోని ఇడిందకరై అనే గ్రామంలోజరిగిన ఒక చిన్న ప్రయోగముంది. ఐదు వందల సంవత్సరాలకు పూర్వం మోసంతో ఆ గ్రామాన్నంతా క్రైస్తవంగా మార్చారు. కానీ ఈ మధ్యనే ఆ గ్రామప్రజానీకం తమ తాతముత్తాతలనాటి హిందూధర్మంలోకి 'తిరిగి రావాలని నిశ్చయించుకున్నారు. మన స్వామీజీలలో ఒకరు అక్కడకు వెళ్ళి వారియొక్క పునరాగమనోత్సవాన్ని నిర్వహించారు. అయితే ఆ ప్రజలకు ఎన్నో సమస్యలున్నాయి. మొదటిది నిరుద్యోగ సమస్య. వారంతా చాలా బీదవాళ్ళు. వృత్తిరీత్యా జాలరులు. వర్షాకాలంలో వారు సముద్రంపై వేటకు వెళ్ళలేరు. అప్పుడు వారికి పనేం ఉండదు. కాబట్టి తినడానికేమీ ఉండదు. మంగుళూర్‌కు చెందిన గణేశ్ బీడీసంస్థ యజమానులు చొరవతో ముందుకు వచ్చారు. స్త్రీలకూ, బాలురకూ పని

చూపించి, వారు తమ జీవనోపాధిని సంపాదించుకోగలిగిన ఒక చిన్న కేంద్రం స్థాపించారు. అటుపైన మరికొంతమంది ఉదారులైన స్నేహితులు ముందుకొచ్చి, వారు వాడుకునే వలలకు అవసరమైన వస్తువులు సమకూర్చారు. ధర్మాచార్యులొకరు ఒక దేవాలయ నిర్మాణానికి విరాళమిస్తానని ప్రకటించారు. చుట్టుపట్ల గ్రామాల నుండి కూడ ప్రజలు వచ్చి తరుచు ఈ ప్రజానీకాన్ని చూచిపోతుంటారు. అందుకు ఆ గ్రామస్తులెంతో సంతోషిస్తుంటారు. ఇడిందకరైలో జరిగిన ఈ ఉదాహరణ పరిసరాల్లో ఉన్న ఇతర గ్రామాల్లో కూడా, సవ్యమైన ధోరణిని సృష్టించింది. ఇదే మానవతాపూర్ణమైన ప్రవర్తనలోని మహేంద్రజాలం.

## విశాల హృదయం కోసం

అన్ని ప్రాంతాల్లోనూ ఇట్టి సాహసయత్నాలు చేపట్టవచ్చు. అట్టి పథకాలన్నిటికీ ఎంతో సాధనసంపత్తి తప్పక కావాలి. అయితే, భగవదనుగ్రహం వలన సంపన్నులై యున్నవారు ఈ పని నిమిత్తమై ముందుకు వచ్చి సహాయం చేయాలి. ఈ బాధ్యత వారిదే.

దేవాలయాలను చక్కగా నిర్వహింపచేయటం కూడా వారి ప్రత్యేక బాధ్యతే. నిత్యపూజలకూ, దేవాలయ పవిత్రతకూ, అవసరమైన ఏర్పాట్లు చూచే నిమిత్తమై స్థానికంగా సంఘాలు స్థాపించాలి. దేవాలయాలునిర్మించటంలో గల ముఖ్యోద్దేశాన్ని సఫలం చేస్తూ, దేవాలయ వ్యవహారాలకు, మార్గదర్శనం, అజమాయిషీ చేసే విధంగా ఒక ధార్మిక వ్యవస్థ, తదనంతరం నిర్మాణం కావాలి. ఈనాడు మన దేవాలయాలెన్నో జీర్ణావస్థలో ఉన్నాయి. నిర్లక్ష్యానికి గురౌతున్నాయి. ఇది మన దేవీ, దేవతలపట్ల మనకు గల తృణీకారభావానికి గుర్తు. అదే, ముస్లిములను చూడండి. మారుమూలనున్న రహదారి ప్రక్కన ఎవరో ఒక పీరు పేరున పడివున్న ఇటుకకుప్పలకు గూడా ఏడాదికి రెండుసార్లు సున్నం వేసి, ఒక ఆకుపచ్చ జెండాను వారు దానిపై ఎగరేస్తారు.

ఇదంతా చేయాలంటే భక్తిభావం, నిండైన హృదయాల వంటివి చాలా ముఖ్యం. హృదయం విశాలమైనదయితే, నిధులూ, ఇతర సాధన సంపత్తులన్నీ వాటంతటవే వచ్చిపడతాయి. మన సమాజంపట్ల ప్రగాఢమైన ప్రేమ, మన హిందు సమాజం మరొకసారి, పరిపూర్ణ సమృద్ధితోనూ, కీర్తిప్రతిష్ఠలతోనూ, మహోన్నతిని పొందాలనే తీవ్రఆకాంక్షలుండాలి. అవే మన హృదయాన్ని అతిఉదాత్తంగానూ, శ్రద్ధామయంగానూ చేయ గలుగుతాయి.



# మాతృమూర్తులకు మనవి

మన సమాజంలో మొగ్గ తొడుగుతున్న క్రొత్త తరాలను సాకవలసిన ప్రత్యేకమైన బాధ్యత మన మాతృమూర్తులపై వున్నది. అయితే, సాకటమంటే సరైన అర్ధం ఏమిటో ఇపుడు ఆలోచిద్దాం. భోజనం పెట్టి బట్టలు కట్టి పిల్లలను పాఠశాలలకు పంపించడం ఒక్కటేనా చేయాల్సిన పని? అలాకాక విధి నిర్వహణపట్ల భక్తీ, స్వయంకృషీ, మాతృభూమిపట్ల ప్రేమ, సమాజసేవకు సంసిద్ధత వంటి సవ్యమైన సంస్కారాలను వారిలో అలవరచడం ముఖ్యవిషయం కాదా? శీలనిర్మాణంలోని ఈ అంశం పట్ల శ్రద్ధ వహించడం మాతృమూర్తుల ప్రధమ కర్తవ్యం. ఇందు నిమిత్తమై వారు పసివారి మనసులను తీర్చిదిద్దగల అనేకములైన చిన్న చిన్న విషయాల పట్ల శ్రద్ధ వహించాలి.

## వేకువవేసే ముద్రలు

నా చిన్నతనపు రోజుల్ని గుర్తు చేసుకోగానే నేను మధురస్మృతుల్లో మునిగిపోతుంటాను. వేకువనే నేను నిద్ర నుండి మేల్కొనేసరికి మా మాతృమూర్తి తన ప్రాతఃకాలకృత్యాలలో నిమగ్నమై వుంటూనే పాడుకునే

ఏవేవో స్తోత్రాలు, భగవన్నామ సంకీర్తనముల స్వరమాధురిని నేను వింటూ వుండేవాణ్ణి. ప్రశాంతమూ, గంభీరమూనైన వేకువ వేళల్లో వినవస్తుండే ఆ మధుర స్వరాలు నా పసి మనసుమీద ఎంతటి ప్రగాఢమూ, పవిత్రమూనైన ప్రభావ ముద్రలను ముద్రించాయో గదా! దీనికీ, నేటి అధునాతనములనబడే ఇండ్లకూ తారతమ్యం చూడండి. వేకువజామునే నేటి తల్లులు వారి పిల్లలను లేపనూ లేపరు, దైవసంకీర్తన కూడా చేయరు. తరచు పిల్లలు అసభ్యకరమైన సినిమా పాటలు వింటూనో, ఆ బాణీల్లో కూనిరాగాలు తీస్తూనో తమ దినకృత్యాన్ని ప్రారంభిస్తుంటారు. ఒక యువతి– చదువుకోనిది కాదు– వంటింట్లో పని చేసుకుంటూ, తన బిడ్డను నిద్రపుచ్చుతూ, అతి చవుకబారు పాటలను పాడుతూ వుంటుందనే ఉదంతం నా కొకటి తెలుసు. తమ తల్లిదండ్రులలో యిట్టి ప్రవర్తన చూచిన పిల్లలు పెద్దల్ని అలాగే అనుకరిస్తారనుకోవడానికి ఆశ్చర్యం లేదు. ఆ విధంగా మన సంస్కృతీ సభ్యతలకు నోచుకోని కుటుంబాలలోని బిడ్డలు తేలికగా క్రైస్తవ ప్రచారానికి ఎర అయిపోతారు.

ఎనిమిది, తొమ్మిది సంవత్సరాల వయస్సు కల్గిన ఒక బాలిక శలవల్లో తన యింటికి వచ్చినపుడు ఒక ఉదంతం జరిగింది. కృష్ణ జన్మాష్టమి రోజున వ్రతం చేసుకోవాలని తల్లి అనగానే ఆ పిల్ల "అటువంటి వ్యభిచారి పుట్టిన రోజున మనకు పండుగెలా అవుతుంది? క్రీస్తు పుట్టినరోజున పండుగ చేసుకోవాలిగానీ" అని తల్లిదండ్రుల్ని ప్రశ్నించింది. ఎనిమిది, తొమ్మిదేళ్ళ బాలిక తన తల్లిదండ్రులను అలాంటి అసభ్యమైన ప్రశ్నలు వేయడం మీరు ఊహించగలరా? మన మాతృమూర్తులు వేకువజామునే పిల్లలను నిద్రలేపి, కుటుంబంలోని పెద్దలకు వారు నమస్కరించి తమ ఇలవేల్పును భక్తితో పూజించేట్లుగా చేయాలి. మాతృభక్తినీ, దేశభక్తినీ, దైవభక్తినీ ప్రతి హిందూ బాలబాలికల్లోనూ కలిగించవలసిన పవిత్ర బాధ్యత మన మాతృమూర్తులమీద వుంది.

— —

## వస్త్రధారణ సంస్కారప్రదంగా ఉండాలి

ఇంక వస్త్రధారణను చూద్దాం. దుస్తులు, ఇతర అలంకరణ వస్తువులు కూడ పసిమనసుల మీద చెరగని ముద్రలను వేస్తాయనే సంగతి తప్పక మనం గుర్తించాలి. వీటిద్వారా కూడ పిల్లలు మన సంస్కృతీ విశేషాలను అలవరచుకొనేట్లుగా మాతృమూర్తులు శ్రద్ధ వహించాలి.

మళ్ళీ మరోసారి నా బాల్యపు తొలిదశ నాకు గుర్తొస్తోంది. నాకు ఒత్తుగా పొడవైన ఉంగరాల జుత్తు ఉండేది. మా తల్లిగారు అప్పుడప్పుడు నా తల దువ్వి బాలకృష్ణుడిలా అగుపించేరీతిగా కొప్పులో నెమలి పింఛం అమర్చేది. ఆమె ఒక పూలదండ నా మెడలో వేసి "మన మధు చూడు! సరిగా బాలకృష్ణుడిలా ఎలా అగుపిస్తున్నాడో!" అని ఇతరులతో అంటూ వుండేది. అలాంటి సంగతులు చూడటానికి చిన్నవే అయినా మన సాంస్కృతిక ప్రమాణాలకు తగ్గట్టుగా పసివాళ్ళ మనస్తత్వాన్ని మలచడంలో దోహదం చేస్తాయి. అట్లా కాకుండా పిల్లలను యిరోపా దేశాల పద్ధతిలో పెంచితే, వారిమీద పడిన ప్రభావాలు కూడా అవే రంగులు పులుము కుంటాయి. అటువంటి మనోభూమికమీద మాతృభూమిపట్ల ప్రగాఢమైన భక్తిభావాలూ, వాని యొక్క ఆదర్శప్రమాణాలు మొలకెత్తవు.

## స్త్రీ సైనికుడిగా ఎలా మారిందా !

దుస్తులు మనస్సు మీద ఎంతటి తీవ్రప్రభావాన్ని చూపుతాయనే సంగతి ఒకోసారి ప్రజలు ఊహించలేరు. మొదటి ప్రపంచయుద్ధం రోజుల్లో ముచ్చటైన ఒక సంఘటన జరిగింది. ఆ రోజుల్లో ఇక్కడ పరిపాలిస్తున్న ఆంగ్లేయులు తమ మాజీ సైనికులనందర్నీ తక్షణమే సైన్యంలో చేరవలసింపిగా ఒక అత్యవసర ఆజ్ఞను జారీచేసారు. ఒక ఊళ్ళో సైనిక

దాకడుండేవాడు. అతనికి మళ్ళీ వెళ్ళి సైన్యంలో చేరటానికి ఇష్టం లేదు. అందువల్ల అతడు తన ఊళ్ళోనే ఉండిపోయాడు. వెదకి పట్టుకుపోయేందుకు రక్షకభటులొచ్చారు. ఈ విషయం తెలియగానే ఆ సైనికుడు స్త్రీ దుస్తులు ధరించి తన యింట్లో దాక్కున్నాడు. రక్షకభటులు రాగానే అతని భార్య తన భర్త యింట్లో లేడని తానూ, తన సోదరీ మాత్రమే ఇంట్లో వున్నామని చెప్పింది. అయితే ఇందులో ఏదో మోసముందని రక్షకభటులు అనుమానించారు. వెంటనే వాళ్ళు ఆమె "సోదరి"ని బయటికి పిల్చి గుట్టురట్టు చేసి అతణ్ణి పట్టుకుపోయారు. ఆ సైనికుణ్ణి లోగడ అతడు పనిచేసిన పటాలంలోకే పంపించారు. ఆ తర్వాత అతనికి సైనిక దుస్తులు కట్టి సైనిక ప్రతతిలో నిలబెట్టి "మళ్ళీ ఇంటికి వెళ్ళాలనుందా?" అని ప్రశ్నించారు. దృఢనిశ్చయంతో కూడిన నూతన ఉత్తేజం నిండిన గొంతుతో "తానొక సైనికుణ్ణనీ, ఇంటికి వెళ్ళిపోయే ప్రశ్నే లేదనీ, ఇక యుద్ధభూమికే వెడతానని అతడు అన్నాడు. నిజానికి సైనిక వస్త్రధారణ వల్లనే అతనిలో ఇంత తేడా వచ్చింది.

## ఆధునికతకు ఆహుతి

ఇక మన కౌటుంబిక సంప్రదాయాలను, వ్రతనిష్ఠలను గూర్చి ఆలోచిద్దాం. మన ఇష్టదైవం, కులదైవం ఎవరైనప్పటికీనీ, ఎంతో భక్తితో వారిని మనం ఆరాధించాలి. పవిత్రమైన మన వంశాచారాన్ని ఉజ్వలంగా ఉంచుకోవాలి. ఈ రోజుల్లో ఇట్టి పద్ధతులు అదృశ్యం అవటం చూస్తుంటే ఎంతో విషాదం కలుగుతోంది. దక్షిణాదిన కనీసం మన ఇళ్ళ ముంగిట తులసి కోటలను తరచు చూస్తుంటాం. సందె చీకట్లు ముసురుతుండగా మన మాతృమూర్తులు వాని ముందు దీపారాధన చేస్తారు. తరచుగా పూజా గృహాల నుండి మధురమైన ఘంటా నినాదాలను వింటూ ఉంటాం. ఇళ్లలో భక్తియుక్తమైన పూజలు కొనసాగుతుంటాయి. కాని ఉత్తరాదిన మాత్రం

యిట్టి దృశ్యం చాలా అరుదు. ఆధునికత మన యిండ్ల నుండి భగవంతుణ్ణి నిజంగా తరిమేసింది. ఇలా 'ఆధునికత' మనం సగౌరవంగా భావించే జీవన మూల్యాలనెన్నింటినో దిగమింగేస్తోంది. "సుగుణవతి తన శరీరాన్ని కప్పుకున్నట్లే సజ్జనుడు తన మంచిపనుల మీద వినయమనే ఉత్తరీయాన్ని కప్పుకుంటాడు." అని 'జ్ఞానేశ్వరి'లో ఒక ద్విపద కవిత వుంది. సద్గుణాలు కల స్త్రీ స్వభావాన్ని అది సూచిస్తోంది. కానీ "నేటి స్త్రీలు" పదిమందికీ కంటబడేట్లుగా తన శరీరాన్ని అధికంగా ప్రదర్శించడంలోనే ఆధునికత వుందని భావిస్తున్నారు. ఎంతటి పతనస్థితి!

మన దేశంలో 'ఆధునికత' అంటే అర్థం గ్రుడ్డిగా పాశ్చాత్యుల్ని అనుకరించడం తప్ప మరింకేమీ కాదు అని భావిస్తున్నట్లగుపిస్తోంది. ఎన్నో అధునాతన కుటుంబాల్లో పిల్లలు తమ తల్లులను 'మమ్మీ'అని సంబోధిస్తుంటారు. ఆ మాటకు అసలైన అర్థమేమిటో మనకు తెలుసునా? ఈజిప్టు దేశంలో, అచటి వారియొక్క ప్రాచీనచక్రవర్తుల శవపేటికలపై నిర్మించిన పెద్ద పెద్ద సమాధులున్నాయి. వానికి 'పిరమిడ్లు' అని పేరు. వాని లోపల వుంచిన శవాలకు 'మమ్మీ'లని పేరు. మరి యిక్కడ మనం జీవంతో తొణికిసలాడే ప్రియమైన మాతృమూర్తులను 'మమ్మీ'లని సంబోధిస్తుంటాం!

## మాతృమూర్తుల వీరగాథలు

మన జాతి నిరంతరం ఎన్నో కష్టాలు ఎదుర్కొంటూనే వుందని మనందరికీ తెలుసు. మన మాతృభూమి యొక్క సమైక్యతనూ, మన సమాజాన్నీ కించపరచటానికి ప్రయత్నాలు అనేకంగా జరుగుతూనే వున్నాయి. మన ఆధ్యాత్మిక వారసత్వంలోని చిరంతనములైన విలువలపై సవాళ్ళు ఎక్కువవుతున్నాయి. సంఘర్షణలూ, పోరాటాల వాతావరణం అంతటా నిండివుంది. ఇట్టి పరిస్థితుల్లో మన పిల్లలకు ఏ విధమైన శిక్షణ ఇవ్వాలి?

తమ యిండ్లలోనే ఒళ్ళు దాచుకుంటూ, చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష అనుకుంటూ వెలికిరాకుండా బ్రతకటం వారికి నేర్పుదామా? స్వసౌఖ్యం, భవిష్యత్తుల గురించినటువంటి విషయాలమీద మాత్రమే ప్రాధాన్యతని చూపుతూ ఇంకొకళ్ళ జోలీ శొంఠీ పట్టించుకోవద్దని వారికి చెప్పుదామా? వారికి మనం ఏం నేర్పుదాం?

మహాభారతంలో చక్కని కథ ఒకటుంది. విదుల అనే పేరు గల ఒక రాణి వుండేది. ఆమె తన కుమారుడైన సంజయుణ్ణి యుద్ధభూమికి పంపింది. కాని అతడు భయంతో గజగజలాడిపోయాడు. శత్రువులకు వెన్నిచ్చి, గుఱ్ఱమెక్కి తన రాజధానికి పరువులెత్తాడు. కొడుకు ఓటమినంది అప్రతిష్టపాలవడం జూచి, ఆమె తన కోట ముఖద్వారాన్ని మూయించి, తీవ్రంగా అతణ్ణి చీవాట్లు పెట్టింది. ఆ తల్లీ, కొడుకుల మధ్య జరిగిన సంభాషణ విదులా సంజయసంవాదంగా ప్రసిద్ధికెక్కింది. దానిలో యుద్ధరంగంలో ఒక సాహసవంతుడైన యోధుడు ఎట్లా ప్రవర్తించాలో ఆమె తన కొడుక్కి ప్రబోధించింది. అటుపైన మరల యుద్ధానికి పోయి, విజయం సాధించిన వీరుడుగా తిరిగి రమ్మని ఆమె ఆజ్ఞాపించింది. ఆ కథ ప్రకారం సంజయుడు యుద్ధరంగంలో ప్రవేశించి ఆదర్శప్రాయమైన పౌరుష పరాక్రమాల్ని చూపించి సగౌరవంగా తన మాతృమూర్తి స్వాగతించేలా విజయం సాధించి తిరిగి వచ్చాడు.

యుద్ధానికి పోబోయేముందు, పంచపాండవులూ కుంతి ఆశీస్సులను గోరవచ్చినప్పుడు, ఆమె పల్కిన పల్కులను వీరత్వానికి గుర్తులుగాచెప్పుకోవచ్చు.

*యదర్థం క్షత్రియా సూతే తస్యకాలోయ మాగతః।*
*న హి వైరం సమాసాద్య సీదంతి పురుషర్షభాః॥*

(ఎందుకు క్షత్రియకాంతలు పురుష సంతానాన్ని కంటారో ఆ శుభ ఘడియ ఆసన్నమైంది. వీరసింహాలు శత్రువులు ఎదురైనంతమాత్రాన నీరు కారిపోరు)

మహాభారతంలో మరొక శ్లోకం ఉంది. "ఎవరు మౌనంగా అవ మానాన్ని సహించి పడిఉంటాడో, ఎవడు తేజోపౌరుష సామర్థ్యాలను కలిగి వుండడో, ఎవడు శత్రువులకు సంతోషాన్ని కలిగిస్తాడో అట్టి కుమారుని ఏ తల్లీ ప్రసవించకుండుగాక" అన్నది ఆ శ్లోకార్థం.

## సరయిన విలువలను ముద్రించండి

ఇంక మన విషయాలన్నిటి మీద జాతీయ స్వాభిమానపు ప్రభావం ముద్రలు పడాలి. ఇంట్లో నిత్యావసర వస్తువులన్నీ స్వదేశీవే ఉపయోగిస్తా నని ప్రతిజ్ఞ స్వీకరించండి. అదే మొక్కవోని జాతీయ సౌశీల్యాన్ని మనలో కల్గిస్తుంది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహం గొడ్డలిపెట్టు. పైపై మెరుగు లను అనుకరించే అలవాటు ఇచట జన్మించిన ఆడపడుచు లలవరచిన ఆభి జాత్యపు సంప్రదాయాలూ, సౌశీల్యాలకు వినాశకారి!

అచంచలమైన సత్యనిష్ఠకూ, వన్నెకెక్కిన సౌశీల్యానికీ హిందువు ప్రసిద్ధి పొందాడు. కానీ ఈ రోజుల్లో మన పెద్ద నాయకులు కూడ వారి యొక్క నైతిక పతనాల కారణంగా అప్రతిష్టపాలయ్యారు. ఇట్టి వినాశక మైన ప్రభావాల నుండి మన భావితరాన్ని కాపాడటం మన మాతృ మూర్తుల చేతుల్లో ఉంది. అవినీతికి పాల్పడి తృప్తి పొందటానికంగీక రించేకన్నా సంతోషంగా ఒక పూట పస్తుండేందుకైనా సిద్ధపడే వాతావర ణాన్ని వారు నిర్మించవలసిఉంటుంది. అవినీతిగా సంపాదించబడిన పాపిష్టి కూటిలో తామెవ్వరూ ఒక్క మెతుక్కూడా తినమని కుటుంబమంతా ప్రతిజ్ఞ బూనాలి.

మన మాతృమూర్తులు వారి పిల్లలలో అటువంటి ఉదాత్తము, పౌరుషోపేతమునైన స్వభావాలను అలవరిస్తే రాబోయే తరాలు తప్ప కుండా మన దేశం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను విజయవంతంగా ప్రతిఘటించగలవు.

## సాంఘిక సామరస్యమే నశిస్తే

ఇక- సమాజం పట్ల మన ధోరణి ఏమిటి? అన్న ప్రశ్న ఒకటి వుంది. వ్యక్తిగత, కౌటుంబిక జీవితాల యొక్క భద్రత, సౌఖ్యములు సమాజం యొక్క సంక్షేమం మీదనే ఆధారపడి ఉన్నాయనే విషయం స్పష్టమే. నిజంగా సామాజిక శాంతి భద్రతలు లేనపుడు వ్యక్తుల యొక్క నైతిక, ఆధ్యాత్మిక పురోగతి ఎన్నో అడ్డంకుల్ని ఎదుర్కొవలసివస్తుంది.

సమాజం కనుక విచ్ఛిన్నమైపోతే ఆధ్యాత్మికంగా మహోన్నతులైనవారు కూడ బ్రతికి బట్టకట్టడం కష్టసాధ్యమవుతుంది. అందుచేత సామాజిక జీవితం సరిగా ఉండేట్లు చూసుకోవడం మనకు ముఖ్యకర్తవ్యం. మన సామాజిక జీవితాన్ని సవ్యంగా, స్వతంత్రంగా స్వాభిమానపూర్ణంగా నిలుపుకోవాలనే, ఈ అంశాన్ని మనం యింతకుముందు విస్మరించాం. సమైక్య సమాజంగా జీవించటం మరచిపోయాం. అద్భుతమైన మానవశక్తి మనకు ఉన్నప్పటికీ "నేను ఒంటరివాణ్ణనే" భావానికి మనం బానిసలమైపోయాం. ఒకప్పుడు నాగపూర్‌లో 20,000మంది పాల్గొన్న బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. అకస్మాత్తుగా ఎవడో ఒకడు "ఓ! వాళ్లు వచ్చారు" అని కేక పెట్టాడు. మరుక్షణం ఆ విశాల జనసమూహం భయంతో త్రొక్కిసలాడుకుంటూ పారిపోవడం ప్రారంభించింది. ప్రజలు తమ చెప్పులను విడిచికూడా పారిపోసాగారు. అలా పారిపోతున్న ఒక మనిషిని ఒకాయన 'ఏం జరిగిందని' ప్రశ్నించాడు. అతడు "నాకు తెలియదు" అందరూ భయపడి వెళ్ళిపోయారు. నేనూ పారిపోతున్నాను" అన్నాడు.

కానీ, నీవు నిలబడి, ఇదంతా ఏమిటి? ఎందుకు జరుగుతోందని విచారించలేదా? అన్న ప్రశ్నకు "నేనేం చేయగలను? నేను ఒంటరిగాణ్ణి" అని అతను బదులు చెప్పాడు.

## వాస్తవమయిన యజ్ఞం

ఒకే తల్లి సంతానమైన కారణం చేత పరస్పర సుఖదుఃఖాలలో మనం పాలు పంచుకోవాలి, అన్న సమైక్య భావన లేకపోయినందుకు ప్రతిఫలమిది. సమాజంపట్ల మన ప్రేమాభిమానాలను ఒక నిర్దిష్టమైనరూపంలో మనం ప్రకటించాలి. ఉదాహరణకు— మన సమాజంలో నిత్యభోజనానికి నోచుకోని వారెందరో వున్నారు. వారి కొరకు మనం ఆవేదన పడుతున్నామా? వారికి ఎంతో కొంత సహకరించాలని మనం ప్రయత్నం చేస్తున్నామా? పూర్వకాలంలో బీదలకూ, ఆకలిగొన్నవారికీ ముందుగా కడుపు నింపి పిమ్మట యితరులకు ఆహారమిచ్చే 'బలి వైశ్వదేవయజ్ఞం' అని ఒకటి వుండేది. ఈనాడు సమాజంలోని అన్నార్తులను పోషించడానికి ప్రతి నిత్యం కనీసం గుప్పెడు గింజలను విడిగా తీసి ఒకచో బెట్టి ఆపైన మాత్రమే మనం ఆహారం తీసుకోవాలి. ఈ పని మనం చేయగలం— చేసి తీరాలి గూడ. అది మాత్రమే నిజమైన బలి వైశ్వదేవయజ్ఞం కాగలదు.

## ఇరుగుపొరుగుపట్ల మన విధి

మన సమాజంలోని ఆర్తులైవున్న సోదరీమణులను సేవించవలసిన ప్రత్యేక బాధ్యత మన మాతృమూర్తులందరి మీద వున్నది. మన మాతృమూర్తులలో ఎక్కువమంది దూరప్రదేశాలకు పోయి, బాధితులూ, నిరాశ్రయులూ, నిస్సహాయులూనైన వారి మధ్య ఉంటూ వారిని సేవింపజాలరన్నమాట నిజమే. అయినప్పటికీ ఈ మాట కర్థం వారు ఎల్లప్పుడూ ఇంట్లో కూర్చుండిపోవాలని కాదు. వారు తమ ఇరుగుపొరుగున వున్న స్త్రీ సమూహంతో సరైన సంబంధాలను నెలకొల్పుకొని వారిలోనూ, వారి పిల్లలలోనూ మనం ఆకాంక్షించే భావనలను అలవర్చగల కార్యక్రమాలను నిర్వహించవచ్చు. పరస్పర సేవా సహకార భావనను కూడా మన దైనందిన

సాంఘిక సంపర్కం ద్వారా బహుజనామోదం పొందేట్లు చేయాలి. మన స్త్రీలు మనం అల్పులమనే భావాన్ని, లేక నిస్సహాయులమనే భావాన్ని పెంపొందించుకోవడానికి అవకాశమీయరాదు. వారు పరాశక్తికి సజీవ ప్రతీకలని వారికి బోధించాలి.

విశ్రాంతీ, ఓపికా కలిగిన, చదువుకున్న మన మాతృమూర్తులు కొద్దిమంది వున్నారు. వారు తమ సమయాన్ని తరచు విలాసోపేతమైన క్లబ్బుల్లో, కాలక్షేపపు కబుర్లతో వృథా చేస్తున్నారు. అట్టివారికి ఇదొక చక్కని సలహా. వారికి ఇరుగుపొరుగున పాఠశాలకు పోనట్టి అనేకమంది చిన్న బాలబాలికలుంటారు. అట్టి పిల్లలను తమ ఇంట్లోనే కానీ, లేదా, మరొక అనువైనచోటగాని సమీకరించి వారిని ఆటపాటల్లోనూ, కథలల్లోనూ శిక్షణ ఇవ్వవచ్చును.

## ఆర్తులకు సేవ

అంగవైకల్యం కలవారూ, కాయకష్టం చేసేవాళ్ళూ, పూర్తిగా నిస్సహాయులూనైన మన సోదరీమణుల నెందరినో మన చుట్టుపట్ల మనం చూస్తూనే వుంటాం. అటువంటి వారిని చూసినపుడు నిజంగా మన హృదయాలు కరిగిపోవాలి. ప్రగాఢమైనదయ, మాతృప్రేమలు మనలో పెల్లుబికి రావాలి వారికి. ఏదో ఒక ఉద్యోగంకానీ, వృత్తిగానీ సమకూర్చి తమ జీవన భృతిని సంపాదించుకోకలిగేట్లుగా వారిని చేయాలి. అందుకుగాను తగిన కార్యక్రమాలను మనం రూపొందించాలి. మన సోదరీమణులలోను, మాతృమూర్తులలోను ఏ ఒక్కరికి కూడ పట్టించుకునేవారు లేక వీధులలో పడే స్థితి రాకుండా చూచుకోవడం మన పవిత్ర కర్తవ్యం.

స్త్రీలలో అక్షరాస్యతను పెంపొందించే ఉద్యమం మరొక ముఖ్య కార్యక్రమం. చదువుకున్న మన మాతృమూర్తులు మాత్రమే దానిని

విజయవంతంగా నిర్వహించగలరు. అయితే ఇందులో కూడ వారిలో ఉదాత్తమైన సంస్కారాలను అలవర్చడానికే ప్రాధాన్యతనివ్వాలి. అక్షరాలు నేర్పడం రెండో అంశం కావాలి. ఇందుకొరకై మన మాతృభూమి పట్ల పవిత్ర భక్తిభావమూ, మన ధర్మం యెడల విశ్వాసమూ, మన చరిత్ర యందు గౌరవమూ వారిలో తప్పనిసరిగా కలిగించాలి. మన పవిత్రభూమి యొక్క చిత్రపటాన్ని అందలి పవిత్ర ప్రవాహములూ, పర్వతములయొక్క దృశ్యములనూ, హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకు వ్యాపించి ఉన్న తీర్థములనూ, దేవాలయములనూ వారికి చూపెట్టాలి. మన భాషా సాహిత్యాల్లోను, కళల్లోను, సాంఘిక సంప్రదాయాలలోనూ ఇమిడివున్న సమృద్ధమూ, బహుముఖమూనైన జాతీయ జీవితంతో వారికి పరిచయం చేయాలి. ఆ తర్వాత మన జాతీయ అస్తిత్వం యొక్క నిజమైన చైతన్యానికి వారిని సన్నిహితులను చేయాలి.

## సావిత్రి హృదయాన్ని సాక్షాత్కరించుకోవాలి

మన మాతృమూర్తులే కనుక ఈ సమాజాన్ని ఉద్ధరించాలని దృఢంగా నిశ్చయించుకుంటే ఇహపరాలు రెంటిలో వారిని ఓడించగల శక్తి ఏదీ లేనేలేదని నా దృఢవిశ్వాసం మృత్యుదేవత కూడా సావిత్రి యొక్క ఆదర్శ జీవితం ముందు తలవంచక తప్పలేదు. ఆ కథ వారందరెరిగినదే. వారంతా, తమంత తాముగా, అటువంటి ఆదర్శం పట్ల ఏకాగ్రమైన నిష్ఠనూ, అటువంటి పవిత్రమైన సౌశీల్యాన్నీ, సాటిలేని పరాక్రమాన్నీ ఆవాహన చేసుకోవాలి.

ఒకసారి అలా చేస్తే ఈ సుదీర్ఘ కాళరాత్రి తొలగుతుంది. మన ధర్మదీప్తియనే క్రొత్త ఉషస్సు యొక్క సువర్ణ కాంతులు, భారతదేశ వినీలాకాశపు వీధులలో మాత్రమేగాక యావత్ప్రపంచం మీదా మరోసారి ప్రసరిస్తాయని నా దృఢవిశ్వాసం.

గాంధీజీ కూడ మన ధర్మం యొక్క ఉజ్జ్వల భవిష్యత్తును గురించి ముందుగానే యిలా ఊహించారు. "హిందుత్వం అంటే సత్యాన్వేషణలో అవిశ్రాంత ప్రయత్నం. ఈ రోజున అది మృతప్రాయంగా అకర్మణ్యతతో, వికాసానికి విముఖమై వున్నదంటే, దానికి కారణం మనం అలసిపోవడమే. ఈ అలసట తీరిన వెంటనే హిందుత్వం బహుశః మున్నెన్నడూ కనీవినీ ఎరుగనంతటి తేజస్సుతో ప్రపంచంలో వెల్లివిరుస్తుంది" అని ఆయన అన్నారు.

# 32. మనమూ — మన విద్యార్థులు

విద్యార్థులను మిగిలిన సమాజం కంటే విభిన్నమైన ఒక వర్గంగా భావించటం సముచితం కాదనిపిస్తుంది. ప్రజలందరి గుణగణాలే సామాన్యంగా యువతరంలో కూడా ప్రకటితమౌతుంటాయి. కానీ వారిలోని అపరిపక్వత, అనుభవరాహిత్యం, భావోద్వేగాల తీవ్రతలనుబట్టి, ఆయా గుణాలు వారిలో కట్టలు తెంచుకుని విరుచుకుపడతాయి. సత్ప్రవర్తనా నియమావళిలో సర్వసామాన్యంగా శిక్షణ లేకపోవడం, జీవితంలో ఒక రకమైన నిస్పృహ కలిగించేటువంటి అనిశ్చయ స్థితీ, భద్రతారాహిత్యాలూ, ఏ ఆదర్శం లేకపోవటం, మార్గదర్శకులమంటూ ముందుకొచ్చిన నాయకుల్లో అంతగా ఆదర్శప్రాయులెవరూ లేకపోవటం, కుటుంబ వ్యవస్థ చితికిపోవటం, వంటివి విద్యార్థులైన మనయువజనుల్లో, క్రమశిక్షణారాహిత్యమని మనం పిలుచుకొనే అశాంతి, అదుపులేని ప్రవర్తన, ఆందోళనలకు దోహదం చేసే కొన్ని కారణాలు.

## మూడుతరహాల ప్రజలు

మన ప్రజల్ని సామాన్యంగా మూడు విభాగాలుగా విభజించవచ్చు. దరిద్రంచేత, అవిద్యచేత, మరింత అధ్వాన్నమైన సాంఘిక అసమర్థతలచేత

అనేక తరాలుగా అణగారిపోయినవారంతా మొదటి వర్గం. అదృష్టవశాత్తూ మన ప్రభుత్వం అట్టి వారిలో కనీసం ప్రాథమిక స్థాయివరకూనైనా విద్యావ్యాప్తి చేసే కృషిని చేపట్టింది. ఈ విభాగంలోని విద్యార్థులు దాని ప్రయోజనాన్ని పొందుతున్నారు. అయితే సరైన వికాసానికి తగిన భూమిక వారికి లేదు. కాబట్టి వారిలో నిద్రాణమై వున్న సమర్థతలను మేల్కొల్పి, వారికి సద్గుణాలను అలవరచేందుకు దోహదం చేసే విధంగా, జాగ్రత్తగా, ప్రేమతో గూడిన శ్రద్ధను ఈ విద్యార్థులపట్ల చూపటం అవసరం. ఒక రకంగా చూస్తే, జ్ఞానజ్యోతికీ, సంపదల్లోని సౌఖ్యానికీ, మన జాతీయ జీవననిర్మాణంలో, తోటివారితో తాము కూడా సమాన భాగస్వాములుగా వుండగలగటమనే అదృష్టానికీ వారు నోచుకోలేదు. ఆ దృష్ట్యా వారి జీవితంలో గాయాలు తప్పనిసరిగా కనిపిస్తూనే ఉంటాయి. అయినా వారి జీవితం ఒక స్వచ్ఛమైన ఫలకం లాంటిదే. వీరే భవిష్యత్తుకు ఆశలు. వీరిని మనం ప్రత్యేకమయిన ఆదరం చూపి పోషించుకురావాలి.

సర్వసామాన్యమైన పరిస్థితుల్లో వుండే ప్రజానీకమంతా రెండవ భాగం. సమాజ జీవితానికి అన్ని అంశాలలోనూ వీరే ఎల్లప్పుడూ వెన్నెముకగా ఉంటుంటారు. మర్యాదస్తులుగా కనిపించాలనే వింతైన సహజ వాంఛ కారణంగా, వారు, తమ సాధన సంపత్తికి అందుబాటులో లేని గొప్పలకు పోయి జీవిస్తుంటారు. నేడు ఆర్థిక పరిస్థితులు, వారిని బాగా దెబ్బ తీస్తున్నాయి. మనఃశాంతి, ఇంటిలో ప్రశాంతి గూడా వారికి అదృశ్యమైపోయాయి. భవిష్యత్తు మీద ఆశ వారిలోగాని, వారి బిడ్డలలో గానీ కన్పించటం లేదు. ఇట్టిపరిస్థితిలో అన్నిరకాల వెఱ్ఱివికారాలూ వారిలో పుట్టవచ్చు. మన విద్యార్థి లోకంలో ఈ తరగతి నుంచి వచ్చినయువజనులే అధికంగా ఉంటారు. ఈ విధంగా, ఏ ఆశకూ నోచుకోని, కేవలం నిస్పృహకు నిలయమైన జీవితం, మామూలుగా మంచిగా వుండేవారి మనఃస్థితిని గూడా పాడు చేస్తుంది. ఇట్టి నిస్పృహతో నిండిన యువతను బాధ్యతారహితమైన ఏ అకృత్యమైనా ఆకర్షిస్తుంది.

సంపదను గలిగి, గౌరవ ప్రవృత్తులననుభవించెవారంతా మూడవ వర్గం. మితిమీరిన సంపద, దాని వెంటనంటివుండే హోదా అధికారాలూ, ఎవరికైనా తలతిరుగుడు పుట్టించగలవు. ఏ మాత్రం అనుభవజ్ఞానం లేక, విచక్షణా లక్షణం ఇంకా బీజప్రాయంలోనే ఉన్నటువంటి, పరిపక్వత లేని యువత విషయంలో ఇది మరింత సత్యం.

*యౌవ్వనం ధనసంపత్తిః ప్రభుత్వం అవివేకతా।*
*ఏకైక మప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్॥*

(పడుచుదనం, ధనం, అధికారం, అవివేకాలలో, ఏ ఒక్కటున్నా చాలు సర్వనాశనానికి. మరి ఆ నాలుగూ కలిసి వుంటే ఇంక వేరే చెప్పే దేమిటి?)

ఈ సంస్కృత శ్లోకం చెపుతున్నట్లు— ఈ పరిస్థితులు యువజనుల జీవితంలోని నైతిక భూమికను పూర్తిగా విచ్ఛిన్నం చేస్తాయి.

పొదుపూ, నిరాడంబరతా, వ్యక్తిత్వ వికాసం జరిగే విద్యార్థి దశలో నియమనిష్ఠలూ, చెడు అలవాట్లలోనూ, అనుచితమైన సుఖానుభవాల్లోనూ, తగులుకునే అవకాశాన్ని మనస్సుకు కల్పించకపోవడం, వంటి ముందు జాగ్రత్తలు అవసరం. అవి వారు, దురభ్యాసాలకు లోనుగాకుండానూ, అకృత్యాలకు పాల్పడకుండానూ సహకరిస్తాయి.

## అంతశ్చైతన్యంపై శ్రద్ధుండాలి

ఇంత పెద్ద యువజన సమూహాన్ని సరైన పద్ధతుల్లో— అంటే- అంతర్నిహిత శక్తిని వికసింపచేసుకోగల మంచి పౌరులనుగా మార్చుటయే మన ముందున్న అసలు సమస్య. పైపై ఆలోచనలతోనూ, తాత్కాలిక పరిష్కారాలతోనూ ఇది తీరదు.

ఉదాహరణగా చెప్పాలంటే, విద్యాసంస్థలు, ఉపాధ్యాయ విద్యార్థి అనుపాతం, సంబంధ బాంధవ్యాలూ, వసతిగృహపు ఏర్పాట్లు వంటి

విషయాలు ఈ సమస్య యొక్క అసలు కారణాన్నందుకోలేవు. ఒక వ్యవస్థ ఎలా నడుస్తోందనే దాని కంటే, విద్య యొక్క లక్ష్యం గురించీ, బోధింపబడే విషయాల గురించీ, అసలు అధ్యాపకుల స్థాయి గురించీ, వసతిగృహాల పర్యవేక్షకుల గురించీ, దేశంలో వ్యాపించియున్న సాధారణ వాతావరణాన్ని గురించీ, ముందుగా ఆలోచించి, ఆ తర్వాత వాటిని సరిదిద్ద టానికీ, పరిష్కరించటానికీ తీవ్రమైన ప్రయత్నం చేయాలి.

మన విద్య కేవలం విషయ పరిజ్ఞానప్రదమేగాని, వ్యక్తి నిర్మాణ సమర్థం కాదు. ఏదో విధంగా జీవనోపాధి సంపాదించుకునేందుకు వ్యక్తిని సంసిద్ధం చేయడమే తప్ప యువతలోని వ్యక్తిత్వాన్ని వికసింపచేయాలనే దృష్టి దానిలో లేదు. నేడు జీవనస్థాయిని మెరుగుపరచటమనేదే లక్ష్యంగా ఉంది. అయితే ఈ మెరుగుపరచడం భౌతికమైన సుఖజీవనానికి,కోరికలను రెట్టించటానికీ, మనిషిలోని పాశవిక భావాలనూ, నీచమైన కామవాంఛల సంతృప్తిపరచుకొనే సాధనాల పెరుగుదలకూ, మాత్రమే సంబంధించి ఉంటోంది. మానవుని యొక్క మహోన్నత, మానసిక బౌద్ధికాంశాలతో దానికి సంబంధం లేదు. భౌతిక సుఖానుభూతికి, దోహదం చేసే సాధన సామగ్రిని ఏదో విధంగా సమీకరించుకోవాలన్న విపరీతమైన కోరిక కలగటమే ఇందుకు కలిగే ప్రతిఫలం. "సాంస్కృతిక కార్యక్రమాలు"అన గానే, సంగీతం, నృత్యముల పేరున, మనిషిలో నీచప్రవృత్తులను తేలికగా రెచ్చగొట్టే గానాబజానా, తైతక్కలన్న అర్థం వచ్చేసింది. మెదడుకు పదును పెట్టేవి, హృదయాలను ఆర్ద్రమొనరించేవే సాంస్కృతిక కార్య క్రమాలు. ఇవి జీవనమూల్యాల యొక్క సరైన అవగాహనను వ్యక్తికి అలవరుస్తాయి. అతనిలోని ఉద్రేకోద్వేగాలను అదుపులో ఉంచుతాయి. సాంస్కృతిక కార్యక్రమాల ఈ పరమార్థాన్ని పూర్తిగా విస్మరించటమో, లేదా అనవసరమనీ, కూడనిదనిగానీ భావించటం జరుగుతోంది.

## మానవుని తీర్చిదిద్దే విద్య

ఈ అంశాన్ని యింతకంటే వివరించనక్కరలేదు. మన విద్యా విధానమంతా పూర్తిగా మార్చవలసిన అవసరం కనిపిస్తోందని చెపితే సరి పోతుంది. ప్రతి విద్యార్థికీ, ధర్మం యొక్క మూలసూత్రాలనూ, వాటిని తమ జీవితంలో అనుసరించి చూపిన శ్రేష్ఠులైన పూర్వజుల జీవిత చరిత్రలనూ, ఉత్తమోత్తమమైన జాతీయ వారసత్వపు గాధలతో నిండిన నిజమైన, నిర్దుష్టమైన మన జాతీయ చరిత్రనూ, వారికి తప్పక నేర్పాలి. సులువైన యోగపద్ధతుల ద్వారా, మనోనిగ్రహంలో కొంత ప్రాథమిక శిక్షణమ గూడా ఇవ్వాలి. విద్యలోని ఇతర అంశాలన్నీ, తప్పనిసరిగా, పరిసరాలకూ, నిత్య జీవిత వాస్తవాలకూ, వ్యక్తి యొక్క అభిరుచులకూ సంబంధించినవై ఉండాలి. జీవితంలోని ఒదుదుడుకులను, ఎదుర్కొనేందుకు అతనిని సంసిద్ధం చేసేవిగానూ ఉండాలి. ముందునుంచీగూడా అన్ని వ్యవహారాల్లోనూ, విధి నిర్వహణానికే ప్రాధాన్యతనివ్వాలి. ఏకాగ్రమైన కర్తవ్యనిష్ఠయే ముఖ్యంగా మనకభిలషణీయం. వ్యక్తి స్వార్థాన్ని, ప్రోత్స హించే ప్రస్తుత వాతావరణంలో అది ఆచరణయోగ్యం కాదనిపిస్తుంది. అయితే విధి నిర్వహణమే సర్వోన్నతమనీ, వ్యక్తి యొక్కగానీ సమాహం యొక్క గానీ హక్కులు, బాధ్యతలతో మాత్రమే ముడిపడిఉంటాయనీ, బాధ్యతకన్న ఇతరాంశాలన్నీ, అప్రధానాలనీ వ్యక్తిత్వం వికసించే దశలో, పదేపదే యువకులకు మనం ప్రబోధించాలి.

## స్ఫూర్తిప్రదమయిన ఆదర్శం

విధినిర్వహణలో సరియైన విజ్ఞానాన్నలవరచేందుకు, మన విద్యా విధానం ఆదర్శానికి కంకితమైనదై ఉండాలి. 'ఆదర్శం' అనే మాట అనేక విభేదాలకూ, వివాదాలకూ, ఆస్కారమివ్వవచ్చు. దానిని అర్థం చేసుకోవ

టంలోనే అభిప్రాయ భేదాలు, నానార్థాలూ మన కనుభవం కావచ్చు. అయినా, అందరూ స్థూలంగా కొన్ని మౌలికాంశాల్లో ఏకీభవిస్తారని నే నాశిస్తాను. అంతిమ పరమసత్యాన్ని చేరుకునే బాటలో మానవుడొక ప్రయాణీకుడు (ఆ పరమసత్యం ఎట్లా భావించబడింది? ఏది మార్గంగా స్వీకరించబడింది? అన్నది వేరే విషయం) ఆ పరమ సత్యాన్ని, నిష్ఠతో కూడిన స్వార్థరహితమైన సేవద్వారా చేరుకోవచ్చు. మానవసేవే మాధవ సేవ. ఈ మానవ సమూహంతో మనకెంతో అనుబంధం వుంది. మన పూర్వజులు ఒక్కరే, వారసత్వం ఒక్కటే. సంప్రదాయం ఒక్కటే. మనందరిదీ ఒకటే జాతి, మనలనందరినీ, పెంచి పోషించే ఈమాతృభూమి పట్ల, కృతజ్ఞతాపూర్వకమైన భక్తిభావం ఒక్కటే, అదే మనల్ని ఒకే జాతీయ వ్యక్తిత్వంగా సమైక్యం చేస్తుంది. వీటన్నిటికీ మూలాధారమైన భూమిని మాతృదేవతగా ఆరాధించే ప్రజలను సేవించటంతోనే మానవసేవ ప్రారంభం కావాలి. మన ఏకైక ఆదర్శంలోని మౌలికాంశాలివే. ఇట్టి ఏకైక లక్ష్యమే మన మనస్సుల నొకటిగా చేస్తుంది. మన ఆలోచనలు దీని ద్వారానే ఒకటి కాగలుగుతాయి. ఈ సమష్టి ఆత్మవిశ్వాసంతోబాటు, పరస్పర సహకారంతో కూడిన నిగ్రహవంతమైన శారీరక క్రియా కలాపాలను జోడించినప్పుడు, అది అనుశాసనం అనిపించుకుంటుంది. సైనిక శిక్షణలో శారీరిక కార్యకలాపాల సమన్వయం మాత్రమే గోచరిస్తుంది. అంతవరకూ అది మంచిదే. ఆ మేరకు, మన విద్యలో అవసరమైన మరో అంశాన్ని జోడించినట్టే అవుతుంది. ప్రభావితమవటానికి అనువుగా ఉండే పాఠశాల వయసులో దాని నారంభించి, అంచెలంచెలుగా, కళాశాల స్థాయి వరకూ పెంచుకుంటూపోవచ్చు. అయితే అట్టిశిక్షణ సైనికులకవసరమైనంత స్థాయిలో ఉండనక్కరలేదు. ఏకైక ఆదర్శాని కంకితమయేట్లుగా నిష్ఠను కలిగినందున వికసించే నిజమైన క్రమశిక్షణ అలవరచేందుకు సర్వతోముఖమైన ప్రయత్నాలు జరగకపోతే, అధికాధికమైన సైనికశిక్షణ ఇచ్చినంత మాత్రంచేత అనుశాసనం వ్యక్తికి అలవడదు.

## వరయిన వరిసరాలు

విద్యాసంస్థల్లోనూ, విద్యార్థి వసతిగృహాల్లోనూ, నేడు అనుమతింప బడిన సదుపాయాలన్నిటినీ ఈ లక్ష్యం కొరకే వినియోగించాలి. కానీ ఈ నాడచట లభించే సదుపాయాలన్నీ ఆటవిడుపుగానో, సుఖాలను రేకెత్తించేవిగానో ఉన్నాయి. అయితే విద్యార్థి జీవితంలో వీనికి గూడా ఒక స్థానం ఉంది. అయితే, అచటి వాతావరణమంతా, తాను విద్యనార్జించా లనీ, విజ్ఞానాన్ని తాను కూడా పెంపొందించాలనీ, ఆశయ సాఫల్యంలో తన వంతు కృషి కూడా కనిపించాలనే, ఉదాత్తమైన ఆశయాలతో నిండి ఉండాలి. ఆటపాటల్లోనూ, శారీరిక వ్యాయామరూపంలోనూ, కళలూ, విహారాలూ, వినోదయాత్రల రూపంలోనూ, నిత్యజీవితంలో వివిధ వృత్తుల ననుసరించి బ్రతికేటందుకవసరమైన కాయకష్టం రూపంలోనూ, సముచిత మైన బోధనేతర కార్యక్రమాలను వారికి సమకూర్చాలి.

## ఉపాధ్యాయుడే ముందుకు రావాలి

దీనికంతకూ, అధ్యాపకుల యొక్క, వసతిగృహ సంరక్షకుల యొక్క నిరంతర మార్గదర్శనం, పర్యవేక్షణలవసరం. సామాన్యంగా ఉపాధ్యాయులు సమర్థులుగానూ, తాను బోధించాల్సిన విషయంలో నిష్ణాతులు గానూ, ఉండాలి. వారి శీలం వేలెత్తి చూప వీలులేనిదిగా వుండాలి. విద్యార్థులపట్ల వారిలో, ఆదరణా, వాత్సల్యాలు ఉండాలి. మరి ఈనాటి ఉపాధ్యాయుని స్థితి ఏమిటి? దరిద్రంలో మునిగిఉన్నాడు. తన కుటుంబ సభ్యుల్ని పోషించేందుకు చాలీచాలని జీతం,- పూటెలా గడుస్తుందా అన్న బెంగ- సగౌరవంగా జీవించటానికి కావలసిన ఆర్థికస్తోమతు పెంచుకోవాలని ఆరాటపడుతున్నాడు. పనిభారం పెరుగుతూనే వుంది. ఆపైన విద్యార్థి బృందాన్ని కాపలా కాయాల్సొస్తోంది. ఇట్టి నేటి ఉపాధ్యాయుడు మనం

ఆశించిన స్థాయికి ఎదగటం కష్టం. అతని ఆర్థికస్థితిని మెరుగు చేయాలి. అతడు తీర్చిదిద్దవలసిన విద్యార్థులు పరిమిత సంఖ్యలోనే వుండాలి. సులువుగా, పదహారు నుంచి ఇరవై నాలుగుమంది విద్యార్థుల వరకూ ఒక వ్యక్తి తీర్చిదిద్దగలడన్నది మన అనుభవం. ఆశించిన ఫలితాల నందుకునేందుకై ఈ నిష్పత్తి స్థిరీకరింపబడాలి. వసతిగృహాల సంరక్షకుల విషయంలో గూడా ఇదే వర్తిస్తుంది.

## కుటుంబమే ఉత్తమ సంస్కార కేంద్రం

ఆర్థికమైన ఒత్తిడులూ, ఇబ్బందులూ కారణంగానూ, పారిశ్రామికీకరణ పెరిగిన కారణంగానూ, కుటుంబవ్యవస్థ విచ్ఛిన్నమై పోయింది. తల్లిదండ్రులకు, సంరక్షకులకూ కూడ తమ బిడ్డలను పరిచూసుకునేందుకు సమయంకానీ, ఓపికగానీ ఏ మాత్రం ఉండటం లేదు. కాబట్టి వారి నుంచి ఎక్కువగా మనం ఆశించలేము. అయినప్పటికీ ప్రశాంతమూ, ప్రేమభరితమైన కుటుంబ జీవితం నిలబెట్టుకోవటం, సద్గుణభరితమైన ధార్మిక జీవనం గడపటం, తమ సంప్రదాయక విధులను కనీసం ఎంతో కొంతగానైనా హుందాతనంతో ఆచరించడం, వాటిలో తమ పిల్లలు శ్రద్ధా, విశ్వాసాలతో పాల్గొనేట్లుగా శిక్షణ ఇవ్వడం, భక్తిభావం, కర్తృత్వభావం కలిగి వుండటం వంటి లక్షణాలు వారిలో ఉంటే అవి వారి బిడ్డలలో సత్ప్రవర్తననూ, క్రమశిక్షణనూ అలవర్చడంలో, చాలవరకూ ఉపయోగిస్తాయి. ఇతర వ్యక్తులు– అంటే ఇరుగుపొరుగువారు– తమ స్వీయజీవితాలలో సత్ప్రవర్తనా ప్రమాణాలను నిలబెట్టుకోడం ద్వారా ఈ కృషిలో సహాయకారులు కావచ్చును.

పిల్లలు అనుకరణ ద్వారా నేర్చుకుంటారు. ప్రభావితమవటానికి అనుకూలంగా వుండే వారి మనసులమీద ఉపాధ్యాయుల యొక్క వసతి

గృహసంరక్షకుల యొక్క, తల్లిదండ్రుల యొక్క, ఇరుగు పొరుగువారి యొక్క ప్రభావం ఉంటుంది. వారి విషయం గమనించి తమ జీవితాన్ని సరిగా తీర్చిదిద్దుకోవాలి.

## సరైన నాయకత్వం

దేశంలోని సాధారణ వాతావరణం గురించి కూడా మనం ఆలోచించుకోవాలి. జీవితంలో, రాజకీయ ఆర్థికాంశాల పట్ల అత్యధికమైన ప్రాముఖ్యం చూపటం వలన వాతావరణమంతా కలుషితమైపోయింది. ఈ రంగాలలోని వ్యక్తులను, సమాజానికి నాయకులనీ, ఆదర్శప్రాయులనీ అనుకుంటున్నారు. ఏ కొద్దిమందినో తప్పిస్తే రాజకీయవాదుల పౌశీల్యమూ, ప్రవర్తనలు అనుకరణ యోగ్యాలని చెప్పడం కష్టం. రాజకీయంగా, ఎప్పుడూ ఏదో ఒక సమస్య, ఏదో ఆందోళన, ప్రజల ఉద్రేకాలను రెచ్చగొడుతుంటాయి. వీనిలో నైతికస్థాయి లేని వ్యక్తులు నాయకులుగానూ, ఆదర్శప్రాయుల్లాగానూ తరుచు ముందుకొస్తుంటారు. దేనికైనా తేలికగా ప్రభావితంకాగల, ఉద్రేకపూర్ణులూ, శక్త్యుత్సాహాలు అపరిమితంగా గల, యువకులు వీటివల్ల ప్రభావితం కారనీ, నిమ్మకు నీరెత్తినట్లుగా వుంటారనీ ఊహించటం అసహజం. ఉద్యమకారులు తమఉద్యమానికి బలం చేకూర్చుకునేందుకు, ఇట్టి ఉద్రేకపూరితమైన యువశక్తిని తమ స్వార్థానికి వినియోగించుకో చూస్తారు.

రాజకీయ ఆందోళనలలో ఈ యువకశక్తిని, తమ చెప్పుచేతల్లో వుంచుకోవటం, విద్యార్థి సంఘాల ద్వారా సాధ్యం కాబట్టి, ప్రస్తుతం విద్యార్థి సంఘాల్లో అధికభాగం అనేక రాజకీయపక్షాల్లో ఏదో ఒక దాని యొక్క మార్గదర్శనంలోనో, పోషణలోనో వుంటూ పని చేస్తున్నాయని మనకి తెలుసు. ఈ పరిస్థితి తప్పక మారాలి. రాజకీయాలనుగానీ, పక్షాలను

గానీ పెద్దతరగతుల విద్యార్థులు, కేవలం జ్ఞానసముపార్జన నిమిత్తంగా మాత్రమే, నిష్పక్షపాతంగా అధ్యయనం చేయవచ్చు. కానీ వారు తమ విద్యార్థి సంఘ కార్యకలాపాల్లో రాజకీయపక్షాలనుగానీ, పక్షనాయకులనుగానీ జోక్యం కలిగించుకోనీయరాదు. దేశం యొక్క సర్వసాధారణ రాజకీయ వాతావరణంలో గూడా ఒక మార్పు రావాల్సి వుంది. సమస్యలకు, ఆందోళనాత్మకమైన భావంతో గూడిన పరిష్కార ప్రయత్నం కాక, చర్చల ద్వారా పరస్పర అవగాహన ద్వారా, ఒకరి అభిప్రాయాలను వేరొకరు ఆమోదించేందుకూ, శాంతియుత పరిష్కారాలను కనుగొనేందుకూ నిర్మాణాత్మకమైన దృష్టి అవసరం. ఈ సందర్భంలో ప్రభుత్వాధినేతల పాత్ర అతిముఖ్యం. అభిప్రాయభేదాన్ని గౌరవించక, అధమపక్షం పరిగణనలోకి తీసుకోక, తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళని, సముచిత మైన రాయితీలైనా ఇవ్వకుండా వ్యవహరిస్తే ఆందోళనలు ఇలా కొన సాగుతూనే వుంటాయి. వానితోబాటు విద్యార్థుల క్రమశిక్షణారాహిత్యం కూడా రోజురోజుకూ పెరుగుతూనే ఉంటుంది.

## యువశక్తిని సరైన త్రోవలో నడిపేందుకే విద్యార్థి సంఘాలు

అందుచేత విద్యార్థి సంఘాలు, రాజకీయ పక్షాలకూ, ఇతరములైన ఆందోళనాత్మక సంస్థలకూ పూర్తిగా స్వస్తి చెప్పాలి. వారి కార్యకలాపా లన్నిటినీ, విజ్ఞానాభివృద్ధికీ, సేవాభావం, శ్రమశక్తిపై గౌరవం, సౌభ్రా తృత్వం, సహజీవనముల వికసింపచేసే సముచితమైన త్రోవల్లోకి మళ్ళిం చాలి. విద్యార్థి సంఘాలను రద్దు చేయటం పరిష్కారం మాత్రం కాదు. ముఖ్యంగా కళాశాల స్థాయిలో విద్యార్థి సంఘాలను ప్రోత్సహించాలి. (విద్యార్థి సంఘాల కార్యకలాపాలపట్ల, వాటినినిర్వహించటంపట్ల పాఠశాల విద్యార్థులు పరిజ్ఞానంలేని కసుగందులు). అది యువతలో పొంగిపొర్లుతూ

వుండే శక్త్యుత్సాహాలకు సరైన త్రోవను చూపెడతాయి. వారి కార్య కలాపాలు ఏ త్రోవలలో సరిగా మళ్ళించాలన్న విషయం ఇంతకు ముందే చెప్పుకున్నాం.

## పత్రిక, ప్రచార రంగాల ఉదాత్త కర్తవ్యం

పత్రికారంగం ప్రజాజీవితానికి అద్దం పట్టేది మాత్రమే. సమాజం లోని చెడు విషయాలన్నీ పత్రికలద్వారా వెంటనే ప్రకటితమౌతాయి. ఈనాడు మన ప్రాణశక్తిని హరించేస్తున్న రాజకీయాలూ, జీవితంలోని భౌతికాంశాలూ, గోరంతలు కొండంతలుగా పత్రికారంగంలో ప్రకటిత మౌతున్నాయి. ఇంద్రియాలను రెచ్చగొట్టి, పాపాలు, నేరాలను గొప్పగా చూపే నీచమైన కథలు వార్తాపత్రికల్లో ప్రముఖస్థానాన్ని పొందుతున్నాయి. ఈ రకమైన దృష్టిలో పూర్తిగా మార్పు రావాలి. రాజనైతిక, ఆర్థికాంశాల పట్ల అధిక ప్రాముఖ్యం ఇచ్చే బదులూ, ఆయా రంగాల వ్యక్తులనే ఆదర్శ ప్రాయులుగనూ, అనుకరింపదగినవారుగనూ ప్రదర్శించేబదులూ, దైవ సేవకూ, మానవసేవకూ అంకితమైన వారికీ తగిన ప్రాముఖ్యత నివ్వాలి. స్వార్థరహితమైన కృషిలో విశ్రాంతి కోరక నిమగ్నులైనవారికీ, పైపై మెరుగులు లేకపోయినా, జీవితంలో ఒకరు వంక బెట్టటానికి వీలులేని స్వచ్ఛజీవితాలుకలవారికీ, పత్రికలవారు ప్రాధాన్యతనిచ్చి,అనుకరించటానికీ, అనుసరించటానికీ, యోగ్యమైనవారు వీరేనని ప్రకటిస్తే పత్రికలు దేశానికి పెద్ద సేవ చేసినట్లు అవుతుంది. అప్పుడప్పుడుగానీ, వరుసగాగానీ ప్రక టితమయ్యే వార, మాసపత్రికల వంటివి ఈ పనిని సరిగా నిర్వహించగల వని నేననుకుంటాను. దినపత్రికల నుండి ఇట్టి ప్రయోజనం ఆశించటం గొంతెమ్మ కోరికే అవుతుంది.

విద్యాప్రబోధానికీ, శీలనిర్మాణానికీ, శ్రవ్య, దృశ్య సాధనాలెంతో ఉపయోగిస్తాయన్న మాట నిజమే. కానీ ఈ పద్ధతులన్నీ, పత్రికల్లో,

గోడలమీద, బడ్డీ దుకాణాలమీద, దృష్టిని తేలికగా ఆకర్షించగల ప్రదేశాల్లో, వ్యాపారప్రకటనలు చేసేవారిచేతనూ, దూరశ్రవణ యంత్రాల ద్వారానూ, రేడియోలూ, ట్రాన్సిస్టర్ల ద్వారానూ, అసభ్యమైన పాటలను ప్రజల చెవుల్లో గింగురుమనేట్లుగా వినిపింపచేస్తూనూ, దుర్వినియోగం అవుతున్నాయి. అడుగడుగునా, కామాన్ని రెచ్చగొట్టే చిత్రాలు మన కళ్ళబడుతూ, అట్టి పాటలే మన చెవుల్లో మారుమ్రోగుతూ ఉన్నాయి. యువకుల యొక్క నైతిక భూమికను ఇవి ఎంతగా పతనం చేస్తున్నాయో మనం తేలికగా ఊహించుకోవచ్చు.

## మౌలికమయిన పునర్నిర్మాణమే ఈనాటి అవసరం

కానీ, ప్రగతి పేరిట ఇదంతా అదుపూ ఆజ్ఞలు లేకుండా కొనసాగుతోంది. భౌతిక, రాజకీయ, ఇంద్రియపరములైన సహజ వ్యామోహాలపట్లా ఇట్టి అత్యధిక ప్రాముఖ్యత కారణంగా, నైతిక విలువలన్నీ పతనమవుతున్నాయని మనకనిపిస్తుంది. నేటి నాయకత్వం ఇట్టి వాతావరణాన్నే రూపొందిస్తోంది. పశువాంఛలను తృప్తిపరచుకోవటమే ఆధునికతయనీ, అభ్యుదయవాదమనీ, అభివృద్ధి యొక్క పరమార్థమనీ, ఒక దురభిప్రాయం ప్రజలను, మరింత ముఖ్యంగా, ఎదుగుతున్న విద్యార్థులనూ నీతిబాహ్యులనుగా చేయటానికే-ఇది ఉపయోగపడుతోంది. 'నైతికప్రవర్తన' చాలా మంచిదే 'అవినీతి' చెడ్డదేయైనప్పటికీ, అందులో ప్రయోజనం లేకపోలేదు. దానిలో, నైతిక విలువల అవగాహనము, వాటి నుండి పెడత్రోవను బట్టినట్లు గుర్తింపూ- అనే ఒక మంచి లక్షణముంది. అయితే నీతి గురించి కానీ, అవినీతి గురించిగానీ పట్టించుకోని స్థితి మహాప్రమాదకరం. దానిలో నీతీ, అవినీతులు రెంటిమీదా దారుణమైన అగౌరవభావం ఉంటుంది. అవినీతిపరులూ, పాపులూ కూడా మార్పు చెంది, క్రొత్త జీవితాన్ని ఆరంభించే అవకాశం వుంది. కానీ నీతి ఉపేక్షకుడు మాత్రం తప్పొప్పులను

లెక్కచేయని దురహంకారిగా మారుతాడు. అందుచేత వానిని సరిదిద్దటం కష్టం. సమాజం యొక్క సమ్యద్వికాసానికి వారే మరింత ప్రమాదకారులు.

ఆలోచనా పద్ధతుల్లోనూ, జీవన మూల్యాలను నిలబెట్టటంలోనూ, వ్యక్తికి పరిపూర్ణ జీవితాన్ని కల్పిస్తూ, తత్ఫలితంగా జాతికూడా పరిపూర్ణతను సమకూర్చే వివిధాంశాల పరస్పర ప్రాముఖ్యతను తగురీతిగా విశ్లేషణ చేసుకోవటంలోనూ, సమగ్రమైన సింహావలోకనం ఈనాటి అవసరం. ఇది లేకపోవటమే, విద్యార్థుల క్రమశిక్షణారాహిత్యానికీ, మన సాంఘిక దోషాలన్నిటికీ కూడ ముఖ్యకారణం. ఈ ఒక్క సమస్యనూ, మొత్తం నుంచి విడదీసి దాన్నే సరిచేయటానికి ప్రయత్నిస్తే ప్రయోజనం ఉండదు. ఇట్టి పునర్నిర్మాణ కార్యక్రమం, మిక్కిలి శ్రద్ధతో, వెనువెంటనే ప్రారంభింపకపోతే, ఇతర పరిష్కారమార్గాలు కేవలం, పైపై మెరుగులుగానూ, నిష్ప్రయోజకాలుగానూ ఉండిపోతాయి.



# సఫల కార్యపద్ధతి

## 1. సరియైన జాతీయ పునస్సంఘటన

ఏ ఆదర్శాన్ని సాక్షాత్కరించుకునేందుకైనా దానికి తగిన ఒక విశిష్ట కార్యపద్ధతి అవసరం. వివిధసంస్థలకు వివిధపద్ధతు లుంటాయి. ప్రారంభసమయంలో సంఘంలోకూడ వివిధపద్ధతులు వాడుకలో ఉండేవి. సంఘస్థాపకులైన పూజ్యశ్రీ హెడ్గెవార్‌జీ మన సంఘటనకు ఈ ప్రత్యేక పద్ధతిని రూపొందించారంటే ఆపద్ధతులేవీ వారికి తెలియవని కాదు. వారు సంఘం ప్రారంభించటానికిముందు చాలాకాలంపాటు ఆ యా సంస్థల కార్య కలాపాల్లో మునిగితేలుతూ, వాటియొక్క కార్యపద్ధతులను బాగా ఆకళించు కొన్నవారే.

అయితే వారు ఒక విభిన్నమైన కార్యపద్ధతితో మరొక సంఘటన ఎందుకు ప్రారంభించారు? ఒక స్వతంత్రసంస్థను ప్రారంభించిన ప్రముఖ నాయకుడనే కీర్తిప్రశంసలను పొందటానికి ప్రారంభించారా? ఈ ఊహ కన్నా అసత్యం మరొకటి ఉండదు. ఇతర వేదికలపై డాక్టర్‌జీ తగినన్ని ప్రశంసలను పొందారు. తమ అపార సమర్పణ, అసాధారణ కార్యశక్తి, ప్రతిభాప్రకాశాలమూలంగా వారేకనుక కోరుకున్నట్లయితే దేశంలో

అత్యున్నత రాజకీయ పదవులను అలవోకగా సంపాదించి ఉండేవారు. కానీ వారు అవన్నీ విడిచిపెట్టి ప్రశాంత, నిరాడంబర పద్ధతిగల సంఘటనను ప్రారంభించారు.

## సరియైన మార్గం కొరకు అన్వేషణ

జాతీయక్షేత్రంలో క్రొత్తదారులు తీయటానికి వారిని ప్రోత్సహించిన కారణమేమిటి? బాల్యంనుంచికూడ వారిది నిప్పులుగ్రక్కే దేశభక్తి గనుక, వారిని ఆనాటి విప్లవఉద్యమాలు సహజంగా ఆకర్షించాయి. కలకత్తా ఆనాడు విప్లవకార్యకలాపాలతో లోపలరాజుతూరగులుకొంటున్న అగ్నిపర్వతం కనుకనే, కేవలం ఆ ఉద్యమాల లోతుపాతులను తరచిచూచే నిమిత్తమై ఎన్నో వ్యక్తిగతమైన బాధలు అనుభవిస్తూకూడ వారు అక్కడ వైద్య విద్యార్థిగా చేరారు. భయంకరమైన అగ్నిధారల్లో (లావా) జీవిస్తూకూడ వారు తమ విచక్షణను ఎన్నడూ కోల్పోలేదు. విప్లవ సహచరుల మండే గుండెలతో సమరసమై తమ హృదయం స్పందించినప్పటికీ, సంపూర్ణ జాతీయపునరుజ్జీవనానికి వాళ్ళ పద్ధతి ప్రభావజనకమైన సాధనం కానేరదని వారు గ్రహించారు. రహస్యము, సాహసోపేతమునైన వారి మెరుపుదాడుల్నీ, మహోజ్జ్వలమైన వారి ఆత్మాహుతుల్నీ తమప్రజ్వలితహృదయం ఎంతగానో ప్రశంసించినప్పటికీ, ఆ విప్లవ విస్ఫులింగాలవల్ల గ్రుడ్డిదై పోలేదు వారి ప్రశాంతమైన మేధ.

యావత్తుజాతిని జాగృతపరచి సంఘటితం చేయడంలో ప్రజలతో ప్రత్యక్షసంబంధంలేని రహస్యకార్యకర్తలు నిర్వహించేపాత్ర అత్యల్పమైందని వారు తెలుసుకొన్నారు. అంతేగాక, ఆయావిప్లవసంఘాల్లో పెద్దపెద్ద కార్యకర్తల్లోనే కొందరు గుట్టుబయటపెట్టడంవల్ల, ఆయాపథకాలు భగ్నమైపోతుండేవి. ఆవిధంగా అసంఖ్యాక విప్లవకారుల మహోజ్జ్వల త్యాగ, పరాక్రమాలు ఒక్క దెబ్బతో తుడిచిపెట్టుకొనిపోయేవి. ఆంగ్లేయులు

మవ దేశంలో నిర్మించుకొన్న సువ్యవస్థిత బలసంపన్న యంత్రాంగాన్ని అత్యంత దృఢసంకల్పశక్తిసమన్వితము, దేశభక్తియుతము, సుశిక్షితము నైన సంఘటితశక్తిలేని ఏ విప్లవం ఐనా సరే, విధ్వంసం చేయజాలదు అని వారు గ్రహించారు.

కలకత్తానుంచి నాగపూర్ తిరిగివచ్చినతర్వాత వారు కాంగ్రెసు యొక్క స్వాతంత్ర్యోద్యమంలో దూకారు. లోకమాన్య తిలక్ నాయకత్వంలో కాంగ్రెసు ఒక ప్రజాఉద్యమంగా అచిరకాలంలోనే రూపొందసాగింది. పడకకుర్చీ రాజకీయవేత్తలరోజులు పోయాయి. బ్రిటిష్‌వారిని మూకఉమ్మడిగా ప్రతిఘటించే ఒక క్రొత్తశకం ఆరంభమైంది. వాతావరణమంతా స్వరాజ్య భావనతో నిండిపోయింది తిలక్, పిదప గాంధీజీ ఈఅగ్నిని మూలమూలలకు వ్యాపింపచేసి ప్రతిగ్రామంలోను, నగరంలోను ప్రతిఘటనజ్యోతిని వెలిగించి నారు. వారు తమ ఋజుశీలంతోను, అత్యంతము నిస్వార్థము, నిర్భీకమునైన భావనతోను, అతిసామన్యమే ఐనా, అత్యంత ప్రభావజనకమై సామాన్య ప్రజానీక హృదయాన్ని కదలించే పద్ధతులతోను, సంఘర్షణ, సమర్పణల శిఖరాలకు జాతిని నడిపించుకొనిపోయారు. ఉజ్జ్వలమైన ఆదర్శవాదము, గౌరవ కలిగిన పండిత నెహ్రూ స్వాభిమాన, స్వతంత్ర, భావనాపూర్ణమైన యువతరానికి అగ్రేసరుడుగా, స్ఫూర్తిప్రదమైన ప్రతీకగా ప్రసిద్ధిలోకి వస్తున్నరోజులవి, అటువంటి మహామహులకృషిఫలితంగా ఆంగ్లవ్యతిరేకత అనే వెల్లువ దేశమంతటినీ ముంచెత్తింది. బరువు బాధ్యతలను వహిస్తూ డాక్టర్‌జీకూడ అప్పుడు అగ్రశ్రేణిలోనే నిలచినారు; విదేశీ పాలకులను ధిక్కరించి కారాగారంలో కఠిన శిక్షలను అనుభవించినారు అయితేవారు ఆఉద్యమాన్ని నిశితంగా పరిశీలించినారు ప్రశంసార్హమైన ఆశయాలన్నింటినీ ముందుముందు రూపుమాపివేయగల కొన్ని తీవ్రలోపాలు ఆ ఉద్యమంలో ఉండటం గమనించి హతాశులయ్యారు.

ఈ రెండు రకాల ఉద్యమాల్లోగూడ ఉన్న ముఖ్యప్రేరకం ఆంగ్లేయ వ్యతిరేకభావనయేకాని, భావాత్మకమైన జాతీయస్వాతంత్ర్యదృష్టి కాదు అని

వారు గ్రహించారు. సామాన్య ప్రజానీకంలోనేగాక ఎక్కువమంది నాయకుల్లో ఉన్నదిగూడ అదే. మన జాతీయజీవనాన్ని గురించిన భావాత్మకమైన దృఢ విశ్వాసం లేనప్పుడు కాలక్రమంలో ఆ యా ఉద్యమాలు ప్రతిక్రియాత్మక మార్గంలో పడిపోకతప్పదు అనికూడా వారు గ్రహించారు.

రెండవవిషయమేమిటంటే, అతిబాల్యదశనుండి డాక్టర్‌జీని వేధిస్తున్న ప్రశ్నకు అవేవీ సమాధాన మీయలేకపోయాయి. కొద్దిమంది విదేశీయులు -వారు ముస్లిములుకానీయండి, ఆంగ్లేయులుకానీయండి-మనల్ని స్వాధీనం చేసుకొని అంతటి సుదీర్ఘకాలం ఎలా పరిపాలించగలిగారు ? ఆంగ్లేయులను తరిమివేయటం బాగానేఉంది; కానీ, ఆ విదేశీ ఆధిపత్యం ఏర్పడటానికి కారణమైన మనలోని మౌలికజాడ్యం ఏమిటి? అందరకుతెలిసినట్లే, మనలోని అనైక్యమే మనయొక్క బానిసత్వానికి కారణం. ఐతే ఇట్టి భయోత్పాదక చర్యలు, ఆందోళనాత్మక విధానాలు ఆ అసలుజబ్బును నయంచేయగలవా? ఒక్క కుదుపు కుదిపి ఆగిపోయే ప్రజల ఆందోళనలు, విప్లవోత్పాతాలు ప్రజల్లో సుస్థిరమైన ఏకత్వం సృష్టించగలవా ? అనేక శతాబ్దాలుగా మన సమాజంయొక్క నరనరాన్ని నమిలివేస్తూ, బానిసత్వానికి త్రోవదీసిన స్వార్థపరత్వం, క్రమశిక్షణారాహిత్యం జాతీయచైతన్యభావం వంటి చెడు ధోరణులు ఒక్కదెబ్బలో తుడిచిపెట్టుకపోగలవా ?

సువ్యవస్థిత జాతీయజీవనంయొక్క భావాత్మకము, పోషకములునైన సద్గుణాలు ప్రజల్లో వేళ్ళూని నిలువందే కేవలం వ్యతిరేకత ఆధారంగా ప్రజాసమూహంలో ద్వేషాగ్నిని రెచ్చగొట్టడం సమంజసం అవుతుందా ? షేక్స్పియర్ రచించిన "జూలియస్ సీజరు"లో తనమిత్రుల చేతుల్లోనేసీజర్ హతుడయ్యాడు; బ్రూటస్, కాషియస్‌లు పెల్లుబికిన ప్రజాభిమానన్నిచూరగొన్నారు. కానీ ప్రజావిప్లవ ప్రవాహతాలోత్తాలతరంగాగ్రాన నిలచిఉన్న సీజరుమిత్రుడైన ఆంటోని తెలివిగా అటూ ఇటూ చేసి ప్రజా క్రోధాగ్నికి ఆ హంతకులనే గురిచేశాడు. రెచ్చిపోయిన ప్రజాసమూహం

ఉద్రేకంతో వారివెంటపడగానే ఆంటోని "ధూర్తత్వమా! నీఆట మొదలయింది. ఇక నీవాడింది ఆట, పాడింది పాట!" అనే ప్రసిద్ధవాక్యాలు అన్నాడు. భావాత్మకమైన జాతీయజీవనమూల్యాలపై ఆధారపడి ఉద్యమానికి మార్గదర్శనం చేసి, తదనుగుణంగా అదుపులోఉంచగల దేశవ్యాప్తసంఘటన లేకపోతే అటువంటి ప్రజావిప్లవాలన్నింటిలోనూ, 'మా కోరిక మేరకు' అని కాక, 'నీవాడింది ఆట, పాడింది పాట' అన్న ఈ విపత్కరదోషమే దాపురిస్తుంది.

## మానసిక విప్లవం కోసం

ఈ విషయాన్ని ఇట్లా మథించిన తర్వాతనే ప్రజల మనఃస్థితిలో ఒక విప్లవంరావటం అవసరంఅని డాక్టర్ జీనిర్ణయించుకొన్నారు. విదేశీఆధిపత్యం, జాతీయ సమస్యలు – అన్నింటికి సర్వరోగనివారిణి భౌతికవిప్లవం కాదు; మానసికవిప్లవం రావాలి. ఒక్కొక్కవ్యక్తినే ఎన్నుకొని సుసంఘటిత జాతీయజీవనానికి అనువుగా అతణ్ణి మలచటంద్వారా సమాజంయొక్క మనఃస్థితిలో, ఆలోచనాధోరణుల్లో, ప్రవర్తనల్లో ఆమూలాగ్రపరివర్తన కలిగించే పని అవసరం. దానికి ప్రచారము, ప్రదర్శనలతో అనుబంధం లేనట్టిన్నీ, పట్టుదల, ప్రశాంతత, ఏకాగ్రతలతో కూడు కొన్నట్టిన్నీ ప్రయత్నమొకటి అవసరమని వారు గ్రహించారు.

జాతీయ పునస్సంఘటన అంటే, జాతీయశీలాన్ని ఏకాత్మతలను పోషించటమే; మాతృదేశంపట్ల భక్త్యావేశం, సోదరభావం, జాతీయ కార్యంలో పాలుపంచుకోవాలనే కోరిక, జాతీయాదర్శాలపట్ల ప్రగాఢమైన గౌరవం, అనుశాసనం, పరాక్రమం, పురుషకారంవంటి ఉదాత్తగుణాలను ప్రజల్లో జాగృతపరచటమే దాని లక్ష్యం. మనసులను మలచి, శీలాన్ని తీర్చిదిద్దే ఈ పని ప్రవచనాలుచేయటంవల్లగాని, ప్రతిజ్ఞలుచేయించటంవల్ల గానీ జరుగదు. జాతిపట్ల భక్తిభావన అహర్నిశము, కలకాలము అఖండ

జ్యోతిలా వెలుగొందుతూ ఉండాలి. కాబట్టి దానికి దోహదంచేసే వాతావరణంతో ప్రజలు నిత్యము, నియబద్ధంగా ఏకత్రితం కావాలి. దీన్ని దృష్టిలో ఉంచుకొని సంఘస్థాపకులు చివరకు నేటి కార్యపద్ధతిని రూపొందించారు.

## స్ఫూర్తిప్రద దృశ్యం

మన పద్ధతిలో ముందుగా కనిపించేది దైనందిన కార్యక్రమం. ఒక బహిరంగమైన ఆటస్థలం. కాషాయధ్వజచ్ఛాయల్లో తరుణ, బాల బృందాలు వివిధ భారతీయక్రీడల్లో నిమగ్నులై ఉంటారు. ఆనందోత్సాహాల కేరింతలు మిన్నుముట్టుతుంటాయి. 'కబడ్డీ కబడ్డీ' అంటూ ధైర్యంగా ముందుకు చొచ్చుకపోయే యువకులను చూస్తుంటే హృదయ ముప్పొంగుతుంది. నాయకుని 'ఈల'గాని, 'ఆజ్ఞ'గాని ఇంద్రజాలమే. క్షణంలో ఎక్కడివారక్కడ; అంతా నిశ్శబ్దం. తర్వాత వివిధ వ్యాయామాలు: కర్రసాము, సూర్యనమస్కారాలు, సంచలన్ జరుగుతాయి. ప్రతికార్యక్రమంలోనూ సామూహికకృషి, స్వయంస్వీకృతానుశాసనం ఉంటుంది. ఇక వారంతా కూర్చొని దేశభక్తిగీతాలు సామూహికంగా పాడుకొంటారు. తర్వాత చర్చా కార్యక్రమం ఉంటుంది. జాతీయజీవనాన్ని ప్రభావితంచేసే సమస్యలను తరచి తరచి చూస్తారు; చివరలో వారంతా ధ్వజం ఎదుట వరుసల్లో నిలబడి "నమస్తే సదా వత్సలే మాతృభూమే" (ఓ వాత్సల్యపూర్ణ మాతృభూమీ! ఎల్లప్పుడూ నీకు నా నమస్సులు.) అంటూ ప్రార్థన; వాతావరణం ప్రార్థనా ప్రతిధ్వనిసంభరితమౌతుంది, హృదయం పులకిస్తుంది. 'భారత్ మాతాకీ జై' అంటూచేసే గుండెలోతుల్లోంచి పెల్లుబికిన నినాదం ఆనాటి కార్యక్రమాని కంతకూ స్ఫూర్తిప్రద భరతవాక్యం.

హిందూస్థానమంతటా – నగరాల్లోనేగాదు, మారుమూల పల్లెల్లో, కొండల్లో, కోనల్లోగూడ – స్ఫూర్తిప్రదమైన ఈ దృశ్యాలే హృదయాలను

కదలించే ఈ గీతాలే ప్రతినిత్యము, సకాలానికి సూర్యోదయ, సూర్యాస్తమయాల్లోగాని, రాత్రులందుగాని మనకు స్వాగతం పలుకుతుంటాయి. అదే శాఖ అంటే.

శాఖతో సంబంధం ఏర్పడ్డప్పుడే ఎవరికైనా మన కార్యంయొక్క వాస్తవికభావన అర్థమవుతుంది. ఒకసారి ఒక ప్రముఖవ్యక్తి నాగపూర్‌లో ఒకానొక సంఘ ఉత్సవంలో అధ్యక్షత వహించేందుకు వచ్చినారు. "సంఘ కార్యంపట్ల ఏండ్లతరబడిగా నాకు అనేకసందేహా లుంటూఉండేవి. సంఘ కార్యకర్తలను వేలాది ప్రశ్నలతో వేధిస్తుండేవాణ్ణి. కానీ ఈనాడు స్వయంగా సంఘాన్ని చూచినతర్వాత నా అనుమానాలన్నీ పటాపంచలై పోయాయి" అంటూ ఆయన మోమోటంలేకుండా ఒప్పుకొన్నారు. ఎక్కడ శాఖ ఉన్నా ఇట్టి ఉదంతాలే. దానికి కారణం సుస్పష్టం. శాఖ అనేది శుష్కోపదేశాలమూట గాదు. అది ఆదర్శాల సాధనకుగల చైతన్యస్వరూపం. వాగ్రూపంలో వ్యక్తం చేయటం దుస్సాధ్యమైన సంఘకార్యసందేశాన్ని హృదయపూర్వకమైన భక్తిభావనతో గూడిన వ్యక్తులు - తరుణులు, వృద్ధులు - నిత్యసాధనలో నిమగ్నులై ఉన్న ఆ దృశ్యం నిశ్శబ్దంగానే నొక్కివక్కాణిస్తుంది.

## ఎందరో యోజకులు

రాష్ట్రశరీరంలోని సజీవాంగాలుగా వ్యక్తులను రూపొందించటానికి పూనుకొన్నది సంఘం. సంఘపద్ధతి హడావుడిలేనిది. ఆచరణకు అత్యంతము అనువైనది. బయటి వాతావరణాన్ని చూస్తే, సంఘం ఇంతటి ఏకాగ్రంగా కృషిచేయడానికి అవసరమైన అనివార్యకారణాలేమిటో అవగతం కావు.

ఒకసారి నేనొక వయోవృద్ధుణ్ణి కలిసినాను. మన సంఘటన గురించి తన కంతా తెలుసుననీ, నిజానికి డాక్టర్ హెడ్గెవార్‌గారికి ఈ పథకాన్ని

ఇచ్చింది తానే అని ఆయన చెప్పటం మొదలుపెట్టాడు. ఆదర్శప్రాయమైన సంఘటనయొక్క కార్యపద్ధతినిగురించి తాను వ్రాసుకొన్న వివరణలుకూడా చూపించినాడు. అప్పుడు "చిన్నవయస్సునుండికూడా మీరు ఇక్కడే ఉన్నారుగదా! ఎట్టి పరిస్థితిలోనైనాసరే మిమ్మంటిపెట్టుకొని ఉండేమిత్రులు ఇక్కడ ఎందరున్నారో చెప్పగలరా?" అని అడిగాను. "నాతో స్నేహం చేయడానికి అర్హుడైనవాడొక్కడుకూడ ఇక్కడలేడు. అందరూ పాపిష్ఠి వెధవలే" అని అన్నాడు ఈసడింపుగా. అప్పుడు నేను నవ్వుతూ అన్నాను, 'మీకట్టెను మోసుకపోయేందుకైనా నలుగురు మిత్రులు ఉండక్కరలేదా?'

సమాజజీవనంలో ప్రతిఅంశంలోనూ, ఇటువంటి నిపుణులైన 'ఆయోజకులు' 'ఉపదేశకులు' 'సలహాదారులు' వాళ్ళ పాండితీస్ఫోరక ప్రబోధాలతో దేశం సతమతమౌతోంది. ఆకాంక్షించిన లక్ష్యాన్ని సాధించేందుకు ఆవశ్యకమైన కార్యపద్ధతిని, నిష్ఠతో, నిజాయితీతో అనుసరించని వ్యక్తులు 'మాటలు కోటలు దాటుతాయి; కాళ్ళు గడపలు దాటవు' అన్నట్లు దిగజారి పోతారు.

## ఆరాధ్యదైవం

లక్ష్యసాధనకు ఉపకరించే కార్యక్రమ స్థూలస్వరూపాన్ని నిర్ణయించుకొని, దానికి ప్రాణంపోసే అతిసూక్ష్మవిషయాలనుగూర్చిగూడా నిశితంగా ఆలోచించింది సంఘం. తగినపద్ధతి లేనిదే ఆదర్శమెంతటి గొప్పదైనప్పటికీ, దీన్ని సాక్షాత్కరించుకోవటం అసాధ్యం. మన వివిధ సంప్రదాయాల్లోకూడ ప్రతిదానికి తదనుగుణమైన నిర్దిష్టచిహ్నమొకటి ఉంటుంది. ఆ యా సంప్రదాయాలకు చెందిన వ్యక్తులు విశిష్టవస్త్రధారణ, అలంకరణ చేసుకుంటారు. ప్రత్యేకమైన నియమనిష్ఠలను పాటిస్తారు. ప్రతిశైవునకు, శాక్తేయునకు, వైష్ణవునకు ఆ సంప్రదాయానికి చెందిన ఒక ప్రత్యేక ఆరాధనాపద్ధతి, కర్మకాండ, జీవితాన్ని క్రమబద్ధంచేసే విధి నిషేధాలు, ఆచారాలు ఉంటాయి.

సమైక్యము, క్రమశిక్షణాయుతమునైన జాతీయజీవన నిర్మాణ లక్ష్యానికి అనుగుణమైనపద్ధతిని, చిహ్నాన్ని, ప్రతీకాన్ని, మంత్రాన్ని, అనుశాసనవిధానాన్ని మనం రూపొందించుకొన్నాం. ప్రాంతం, పంథ, జాతి కులం, భాష, ఆచారాలు అనే బాహ్యాలైన అడ్డుగోడలను పూర్తిగ అతిక్రమించి మన ప్రాచీనము, పవిత్రము, సమగ్రమునైన జాతీయజీవనంలోని సహజ పవిత్రతను, పరిపూర్ణతను, సజీవంగా కనులకుకట్టినట్లు చూపే అమర భగవాధ్వజాన్ని, స్ఫూర్తిప్రదమైన ఉత్తమ ప్రతీకంగా స్వీకరించాం. అనాదిగా భగవధ్వజం మనధర్మం,సంస్కృతి,పరంపర, ఆదర్శాలకుప్రతీకంగా ఉంటోంది. ఆదర్శవాద హోమాగ్నిలో ఆత్మాహుతి చేసుకొమ్మనే సందేశాన్ని ఇచ్చే పవిత్ర యాగాగ్ని వర్ణాన్ని, సర్వత్రా వెలుగులను జిమ్ముతూ, చీకట్లను పారద్రోలే బాలభానుని భవ్య కాషాయవర్ణాన్ని తనలో నింపుకొన్నది ఆ ధ్వజం. మనయొక్క భౌతిక, ఆధ్యాత్మిక సాధనలన్నిటికీ అదే ఏకైక ధ్రువతారగా మార్గదర్శనం చేస్తోంది. చరిత్రలోని ప్రతి పుటకు తిరుగులేని సాక్ష్యం పలికేది అదే. సామ్రాజ్యాల ఉత్థాన పతనాలకు, యోగుల తపస్సులకు, వీరుల బలిదానాలకు సాక్షీభూతమై, తరతరాల అసంఖ్య ప్రజాకోటి యొక్క స్వప్నాలను తనలో ప్రతిఫలించుకొన్నది అదే. క్లుప్తంగాచెప్పాలంటే మన రాష్ట్రత్వానికి మహోన్నతము, మహోదాత్తము, అత్యంతవాస్తవికమునైన ప్రతీక అదే.

## కావలసింది తత్వనిష్ఠ – వ్యక్తినిష్ఠ; గ్రంథనిష్ఠకాదు

ఈ సజీవప్రతీకను తనకు మార్గదర్శకజ్యోతిగా–అంటే గురువుగా సంఘం స్వీకరించింది. ఈ ధ్వజాన్ని గురువుగా, ఆదర్శంగా డాక్టర్‌జీ మన ముందుంచినప్పుడు తోటికార్యకర్తల్లో అనేకులు నివ్వెరపోయారు. ఆదర్శాన్ని సజీవంగా డాక్టర్‌జీలో సాక్షాత్కారం పొందినవారంతా 'డాక్టర్‌జీనే మనం ఆదర్శంగా ఎందుకుస్వీకరించరాదు?' అని ప్రశ్నించినారు. కానీ మన సంఘసంస్థాపకులుమాత్రం సంఘటనయొక్క తత్త్వాని కనుగుణమైన రీతిలో

ఈ అమరభగవాధ్వజాన్ని ఆదర్శంగా మనముందుంచినారు. ఒకవ్యక్తి-అత డెంతటిఘనుడైనప్పటికీ-జాతికి ఆదర్శంగా ఉండజాలదు. అనంతమైన జాతీయజీవనంలో వ్యక్తిఅస్తిత్వం కేవలం క్షణికం. వ్యక్తి ఎంత ఘనుడైనప్పటికీ, అనేక శతాబ్దాల జాతీయజీవన పరిపూర్ణవికాసంయొక్క సౌందర్య, సౌరభా లను అంశామాత్రంగానే వ్యక్తీకరించగలడు. వ్యక్తి ఎంతటి ఉదాత్తుడు, పూజార్హుడు ఐనప్పటికీ, ప్రజలందరూ అతనిపట్ల ఒకేవిధమైన శ్రద్ధ కలిగిఉంటారని ఊహించరాదు. కొందరు శ్రీరాముణ్ణి, మరికొందరు శ్రీకృష్ణుణ్ణి తమ ఇష్టదైవంగా ఆరాధిస్తారు. కాబట్టే సార్వజనికమూ, సర్వగ్రాహకము ఐన ఈ ప్రతీకాన్ని సంఘం స్వీకరించింది.

స్ఫూర్తికొరకు, ఆదర్శంకొరకు కేవలం వ్యక్తులచుట్టూ పరిభ్రమించిన ఉద్యమాల విషాదగాథ, ప్రపంచజాతుల చరిత్రలన్నిటిలో కనపడుతూ ఉంది. ఆదర్శాలను ఉపేక్షించి, వ్యక్తులను ఆరాధించటంవల్లనే వ్యక్తినిష్ఠ ఒక శాపమై నియంతలు ఆవిర్భవించి మానవజాతిస్వరూపాన్ని వికృతం చేసినారు. ఒక ఆదర్శాన్ని తనజీవితంలో ప్రకటించేంతమేరకే వ్యక్తిని శ్రేష్ఠునిగాను, పూజార్హునిగాను పరిగణించుమని మన సంస్కృతి ఎల్లప్పుడు మనకు ఉపదేశించింది. ఈ విశాల విశ్వమంతటిలోను ఎవ్వరో ఒకవ్యక్తి యొక్క చారిత్రకత లేక ప్రామాణికతపై ఆధారపడనిది కేవలం మన ధర్మం ఒక్కటే.

మన ధర్మానికీ, సంస్కృతికీ, ఏకైక సర్వోన్నత ప్రమాణంగా ఒక గ్రంథాన్ని స్వీకరించకపోవటం మన సాంస్కృతిక వారసత్వంలోని మరొక విశిష్ట లక్షణం. మనశాస్త్రాలన్నీ మానవ జీవన ఏకైక పరమావధి యొక్క వివిధాంశాలను, మార్గాలను వివరించేవి మాత్రమే. సంఘంకూడ తన ఏకైక ప్రమాణ గ్రంథంగా దేన్నీ అంగీకరించలేదు; రచించలేదు. "మీ రనుసరించే గ్రంథమేమిటి ?" అని ఒకసారి ఒక ప్రముఖ ధార్మిక నాయకుడు నన్ను ప్రశ్నించినాడు. "ఒక గ్రంథంలో సూక్తులకు ముడిపెట్టు

కొన్నట్లయితే ఒక గ్రంథంమీదనే ఆధారపడిఉన్న ముస్లిములు, క్రైస్తవులకన్న మే మేవిధంగాను మెరుగు కాబోము. కాబట్టి మా శ్రద్ధా కేంద్రం ఆదర్శమేగాని, మరింకేదీకాదు'' అని సమాధానం చెప్పాను.

అటువంటి ఉదాత్తమైన సాంస్కృతిక పరంపర కనుగుణంగానే సంఘం తనముందు ఒక వ్యక్తినో, ఒక గ్రంథాన్నో ప్రమాణంగా పెట్టుకొనక, మన జాతీయజీవనంలో ఉదాత్తము, శ్రేష్ఠమునైన వాటన్నిటికీ ఉజ్జ్వలప్రతీకమైన భగవాధ్వజాన్ని ఆదర్శంగా స్వీకరించి, తద్వారా యావత్తుజాతిలోను విశుద్ధభక్తిని అలవరచటానికి కృషిచేస్తోంది.

## జాతీయ పునస్సంఘటనకు మూస

పునీత భగవాధ్వజచ్ఛాయల్లో దైనందిన కార్యకలాపం జరుగుతూ ఉంటుంది. మన సమాజంలోని అన్ని తరగతుల ప్రజలు అచట చేరుతారు; భాష, ప్రాంతం, కులం, వర్గం, పక్షం, పంథ-ఇట్లాంటి బాహ్యమైన వ్యత్యాసాలను విస్మరించి, ఒకే మాతృభూమియొక్క సంతానంగా ఆమె పవిత్రధూళిలో కలసి ఆడుకొంటారు; ప్రగాఢభక్తిభావనతో మాతృభూమిని ప్రార్థిస్తారు; ఆమె వైభవంకోసం తమ జీవితాలను ధారపోస్తామని సంకల్పించుకొంటారు. ఆటపాటల్లో తామంతా ఒక్కటే అన్న అనుభూతి వాళ్ళను ఏకంచేస్తుంది. కలిసి వ్యాయామంచేసి, కదంకదం కలిపి నడుస్తూ ఉంటే వాళ్ళ హృదయాలు సమశ్రుతిలో స్పందిస్తాయి.

అక్కడి వాతావరణం, కార్యక్రమంకన్నా ముఖ్యమైనది. పవిత్రత, మధురిమలతో అక్కడి వాతావరణమంతా నిండిపోతుంది. క్రమేపి అచ్చటికి చేరినవారిలో వివిధత, విభిన్నతల మధ్య శుభప్రదమైన ఏకత్వం ఆవిర్భవిస్తుంది. స్నేహ సమరసభావాలు వారి మనస్సుల్లో మొలకెత్తుతాయి; సాంఘిక, రాజకీయ, ఆర్థికాది భేదాలను అధిగమించిన జాతీయసమైక్యాన్ని

గూర్చి కన్న కలలు నిజమౌతాయి. ఆవిధంగా దేశసేవకు అంకితమై అందరిని భ్రాతృభావప్రేరితులుగా రూపొందించే మూసయే శాఖ. విశుద్ధ జాతీయశీలాన్ని, శాశ్వత రాష్ట్రీయ సమరసతను సృజించే కేంద్రం అదే.

## జనజాగరణ మాధ్యమం

దీంతోపాటు సంఘం రూపొందించిన జాతీయ ఉత్సవ పరంపర మన సామాన్యప్రజల్లో నిజమైన సమైక్య జాతీయజీవనంపట్ల జాగృతిని కల్గించడానికి ఒక సమర్థమైన మాధ్యమం.

హిందువుల వర్ష ప్రతిపత్ (లేక) ఉగాది: మహామహులైన మన శకకర్తలను, అమరమైన వారి విజయపరంపరలను జ్ఞప్తికితెస్తుంది. ఇది సంఘసంస్థాపకుల జన్మదినంకూడ కావడం మరింత సంతోషకరం. హిందూ సామ్రాజ్యదినోత్సవం (జ్యేష్ఠశుద్ధ త్రయోదశి): 800 సంవత్సరాల ముస్లిముల రాక్షసపరిపాలనపై, వీరశివాజీ నేతృత్వంలో పునరుజ్జీవిత హిందూశక్తి విజయాన్ని సాధించి, సర్వస్వతంత్రంగా 1674 లో సింహాసనాన్ని అధిష్ఠించిన పర్వదినం ఇది. గురుపూజ (ఆషాఢపూర్ణిమ): శిష్యుడు తన గురువుకు భక్త్యంజలి ఘటించే సంప్రదాయసిద్ధమైన దినం. దానిపై జాతీయతాముద్ర వేసి మన జాతీయతకు, ధర్మానికి ప్రతీక ఐన తన గురువగు భగవాధ్వజాన్ని ఈదినమే సంఘం ఆరాధిస్తుంది. రక్షాబంధన్ (శ్రావణపూర్ణిమ) : మనమంతా ఒకే మాతృభూమియొక్క సంతానమని గుర్తుచేస్తుంది. సౌభ్రాత్రానికి చిహ్నంగా నాడు మనం రక్షను కట్టుకుంటాము. విజయదశమి (ఆశ్వయుజశుద్ధదశమి): దుష్టశక్తులపై విజయం సాధించిన ఉజ్జ్వల పరంపరయొక్క దివ్యస్మృతులను జాగృత పరిచే దినం. సంఘ జన్మదినంకూడ ఇదే. మకరసంక్రమణ : ప్రకృతిలోని మార్పును సూచిస్తూ 'చీకటినుండి వెలుగుకు', స్వార్థ తమస్సునుంచి జాతీయ చైతన్యజ్యోతిలోనికి పయనించుమని మన కుపదేశమిస్తుంది.

ఈ విధంగా వ్యక్తులకు ఒకప్రక్క జాతీయ చైతన్య, సౌశీల్య సమైక్యభావనలు, దైనందిన శాఖాశిక్షణద్వారా అందచేస్తూఉంటే, మరొక ప్రక్క వివిధజాతీయఉత్సవాలద్వారా జాతీయజాగృతి దేదీప్యమానమౌతుంది.

## సంస్థావాద శాపం

ఏ ఒక వ్యక్తికో, ఒక సంస్థకో కాక, పరిపూర్ణసమాజంపట్ల అనన్యనిష్ఠాభావన మాత్రమే సంఘంలో నిర్మాణం చేయటానికి యత్నం జరుగుతూఉన్నదని పై వివరణలనుబట్టి స్పష్టంగా తెలుస్తూనేఉంది. అట్టి జీవనప్రదప్రేరణ లేకుండా కేవలం బాహ్యస్వరూపానికి అంటిపెట్టుకొని మురిసిపోతూఉంటే, అది విఘటనకు మరియొక కారణమౌతుంది.

జాతీయ పునస్సంఘటనకు మూలాధారమైన ఈ సూత్రాన్ని విస్మరించి నాడూ, నేడూకూడా చేతులుకాల్చుకున్నాం. నాడు దేశంలోని వివిధప్రాంతాల్లో ప్రజలను మేల్కొలిపి సంఘటితపరిచేందుకు అనేకయత్నాలు జరిగాయి. అట్టి ఉద్యమాలను ప్రారంభించిన మహాపురుషులు, యావత్సమాజాన్ని సమైక్యపరచి బలోపేతం చెయ్యాలనే దృష్టితోనే కృషిచేసినారు. కాని పరిస్థితులు మారి వాటి ప్రాదుర్భావకారణం తొలగిపోగానే, వాటిలోని అంతర్భావన లుప్తమైంది; బాహ్యస్వరూపానికి మాత్రం అంటిపెట్టుకోవటం జరిగింది. తత్ఫలితంగా నేటి స్వార్థపూరితవాతావరణంలో కరడుకట్టి, పరస్పరం విరుద్ధంగా, విభిన్నంగాతయారై, అనేకపంథలు, నన్ను ముట్టు కోకు నా మాలకాకి అంటున్నాయి.

ఉదాహరణకు ముస్లిందురాక్రమణతో సతమతమౌతున్నప్పుడు గురు నానక్ దేవ్ అనే మహాత్ముడు పంజాబులో ఉద్భవించి మన ప్రాచీనధర్మం పట్ల చల్లారిపోతున్న విశ్వాసాగ్నిని మళ్ళీ ప్రజ్వలింపచేసినాడు. ఆయన

అనంతరం ధర్మంపట్ల భక్తికి, త్యాగభావనకు మహోజ్జ్వల ఉదాహరణలుగా జీవించి, మరణించిన తొమ్మండుగురు గురువుల పరంపర ఉద్భవించింది. విక్రమకార్యవిరహితమైన కేవల ధార్మిక, భక్తిభావనా పునరుద్ధరణ అధార్మికమైన పాశవికశక్తులను ప్రతిఘటించలేదు, అని పదియవ గురువైన శ్రీ గురుగోవిందసింహ్ భావించాడు. తన అనుచరుల్లో ఆయన అదమ్యమైన శౌర్యాగ్నిని ఉద్దీపింపచేసి వారందరినీ విజయశాలులైన వీర యోధులుగా రూపొందించినాడు. కాని ఎంతటి దౌర్భాగ్యం! అట్టి మహోద్యమానికి స్ఫూర్తినొసగిన మహత్తరలక్ష్యం మటుమాయమై, దానికి భౌతిక రూపమైన సంస్థపట్ల ఏర్పడ్డ కేవల వ్యామోహం, వేర్పాటుధోరణి వంటి వికృతభావాలను రెచ్చగొట్టి, ఆ సంస్థకు జన్మనిచ్చిన జీవశక్తినే దెబ్బతీసే టఃతగా కరడుకట్టుకుపోయింది.

ఈమధ్య జరిగిన ఒక ఉదంతం పరిశీలిద్దాం. 1947 లో ఆంగ్లేయులు ప్రభుత్వాధికారాన్ని కాంగ్రెసుచేతుల్లో పెట్టినప్పుడు, ఆ సంస్థను రద్దు చేయుమని గాంధీగారు చేసిన సూచనను త్రోసిరాజని, ఆ సంస్థయొక్క ఒక నాటి కీర్తిప్రతిష్ఠలు ఆధారంగా అధికారాన్ని అంటిపెట్టుకొని ఉండటానికి దాని పేరును, రూపాన్ని పట్టుకొని వ్రేళ్ళాడినారు. ఫలితమేమిటంటే నేడు పదవీవ్యామోహంలో పడ్డ కాంగ్రెస్‌వాదులు ఎంతనీచానికైనా ఒడిగట్టుతున్నారు. అయినా వాళ్ళకు చీమకుట్టినట్లుండదు. సామాన్యప్రజానీకాన్ని కూడగట్టుకునేందుకు స్వార్థాన్ని రెచ్చగొట్టుతారు; నీచప్రలోభాల ఎర చూపిస్తారు; ప్రత్యర్థుల్ని బెదిరిస్తారు; అవసరమైతే చంపిస్తారుకూడ.

మన అనుభవంలోనిదే ఒక ఉదాహరణ: సంఘాన్ని నిషేధించి నన్ను కారాగారంలో నుంచినప్పుడు ఒకనాటి ఉదయం నాగదిలో కొన్ని అచ్చు కాగితాల్ని చూచాను. చెరసాలలో స్వయంసేవకులు క్షమాపణచెప్పుకునేందుకు

ఉద్దేశించినపత్రాలవి. క్షమాపణకోరుకొని బయటకుపోదల్చిన స్వయంసేవకుల కోసం ఆపత్రాలు, అని కొద్దిసేపైనతర్వాత ఖైదు అధికారి వచ్చి అన్నాడు. అప్పుడు నేనన్నాను, "తమ ప్రాణంకన్నా మిన్నైన పనికోసం మావాళ్ళు బుద్ధిపూర్వకంగా ఇక్కడికి వచ్చారు. వాళ్ళెవరూ కలలోకూడ క్షమాపణ కోరరు. అది సరే, ఇట్లాంటి జిత్తులు చేసి మీా రేంసాధిస్తారు ? కార్యంపట్ల ఒక వ్యక్తిలోనున్న దీక్షను భంగపరిస్తే అతడు తదనంతరజీవితంలో నీళ్లుకారిపోయి, ఎందుకూ కొరగానివాడై పోడా? అటువంటి భ్రష్టుడు జాతీయ జీవనంలో దేనికి పనికివస్తాడు ? ఆంగ్లేయులు ఈ పద్ధతి అనుసరించారంటే అర్థముంది. ఎందుకంటే తమ పరిపాలన ఇక్కడ కొనసాగించడానికి ఇక్కడ యువకుల ఆత్మశక్తిని నాశనం చేయాలి. కానీ మన నాయకులు దీన్ని స్వరాజ్యమంటున్నారుగదా ? మరి మనవాళ్ళనే నిర్వీర్యపరిస్తే వాళ్ళకు ఒరిగేదేమిటి ?"

## అహిందూభావన నుంచి బయటపడాలి

కాబట్టి, సమాజంలోపల ఒక ప్రత్యేకకూటమిగా సంఘటనను నిర్మించాలనే అభిప్రాయం సంఘాని కెన్నడూ కలుగలేదు కేవలం ఏదో ఒక భాగాన్ని కాక సమాజాన్నంతనూ సుసంఘటితం చెయ్యాలనే నిర్దిష్ట లక్ష్యాన్ని సంఘం పెట్టుకుంది. కరువులు, వరదలు, కాందిశీకుల తాకిడి వంటి జాతీయ ఉపద్రవాల్లో వేలాదిమంది స్వయంసేవకులు తమ సర్వస్వాన్ని ఒడ్డి కృషి చేస్తున్నప్పటికీ, తామొక ''సంఘవర్గం''గా ప్రదర్శించుకోక పోవటానికి ఇదే కారణం. సమాజంలోని సామాన్యవ్యక్తులుగా జీవిస్తూ ఉండటంతోనే తృప్తిపొంది, జాగృతము, సంఘటితమునైన సాంఘిక జీవనంలో ఒక సామాన్యమానవుడుకూడా ఎట్లా ప్రవర్తించాలో తాము నిరూపిస్తారు. అటువంటిసంఘటితము. దేశభక్తియుతము, స్వయంపోషకము నైన జాతీయజీవనం మాత్రమే జాతికి అపారము, శాశ్వతమునైన శక్తిని సమకూర్చగలదు.

సమాజంలోపల ఒక శక్తిమంతమైన ముఠాను-అదే ఒక్కొక్క సారి స్వకీయసైన్యంగా రూపొందుతుంది - నిర్మించటం స్వతంత్రము, సమృద్ధమునైన జాతీయవికాసానికి గొడ్డలిపెట్టు అవుతుంది. జర్మనీ, ఇటలీ, చైనాల్లో అటువంటిసంస్థలు రాజకీయాకాశంలో ఉల్కలవలె పుట్టు కొచ్చి, తమతమ దేశాల్లో నిరంకుశపాలనలను స్థాపించాయి. సమాజంపై ఆధిపత్యాన్ని కలకాలం కొనసాగించటానికి ప్రజలను ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా - అన్నివిధాలా బానిసలుగా చేసుకోవటానికి ప్రయత్నించటం - నిరంకుశపక్షాల స్వభావంలోనే ఉంది. రష్యా, చైనాల్లో ఈనాటికీ కొనసాగుతూఉన్న మూకఉమ్మడి ఏరివేతలు, మస్తిష్కమార్జనలు (బ్రైన్ వాష్), బానిసశిబిరాలు - ఇట్టి ఒళ్ళుజలదరించే వార్తలు ఆ యా దేశాల్లోని పరిస్థితులను మన కనులకు కట్టినట్లు చూపెట్టుతాయి. అట్టిపరిస్థితుల్లో జాతీయవాణి మూగవోతుంది. వ్యక్తి నశించిపోతాడు. వ్యక్తిగతమైన చొరవ స్వాతంత్ర్యం పోగానే సమాజపతనంకూడా ప్రారంభమౌతుంది.

ఇట్టి పశుశక్తితో పెత్తనం చెలాయించటమనేది మన సంస్కృతికి ఏమాత్రం అతకనిది. ఇట్టి అహిందూభావనకు మన వ్యక్తిత్వం అణువణువూ వ్యతిరేకిస్తుంది. అనేకమతాలు, పంథలు ఇక్కడ అతిప్రాచీనకాలంనుండి వికసించాయి. వివిధ రాజకీయపద్ధతులుండేవి; గణతంత్రరాజ్యాలూ, మనకు వంశపారంపర్యమైన రాచరికముకూడా ఉండేవి. ఆనాటి ప్రజలకు తమకు నచ్చిన పద్ధతిని అనుసరించటానికి స్వేచ్ఛ ఉండేది. వ్యక్తిగతమైన ప్రతిభ, స్వభావం, అభిరుచుల కనుగుణంగా తనంత తాను వికసించటానికి ప్రతిఒక్కరికి ప్రోత్సాహం లభించేది. ఇట్టి భావనకు అనుగుణంగానే సమాజాన్ని జాగృతపరచి సంఘటితం చేయటానికి హిందూధర్మప్రచారకులు స్వీకరించిన కార్యము ఎల్లప్పుడు త్యాగ, ప్రేమ, స్నేహ, సౌశీల్యాలతో కొనసాగింది. కాని అది పాశవికశక్తితోగాని, రాజకీయమైన అధికారంతో గాని ఏనాడూ కొనసాగలేదు.

కని విని ఎరుగని అత్యాచారాలకు, దురాక్రమణలకు సమాజం తట్టు కొని తన సమైక్యాన్ని సంరక్షించుకోవటానికి, పట్టువిడుపులు గలిగిన ఆత్మాభివ్యక్తపూర్ణమైన ఇట్టిసంఘటనపద్ధతియే సహాయపడింది. బలవంతాన పైనుండిరుద్దిన కఠోరపద్ధతి అయినట్లయితే, పెద్ద పెద్ద జంతువులు వాటియొక్క రక్షాకవచాల భారంవల్ల కదలలేక క్రమక్రమంగా నశించిపోయి నట్లే, మన సమాజంకూడ కేవలం శిలాజం (ఫాసిల్) ఐపోయేది. కాబట్టే ఆత్మఘాతుకమైన పరకీయ సంఘటనపద్ధతులన్నిటినీ పరిత్యజించి సంఘం మనయొక్క స్వచ్ఛము, హితప్రదమునైన జాతీయసంప్రదాయాన్నే సమాజ పునర్నిర్మాణంలో స్వీకరించింది.



# సఫల కార్యపద్ధతి

## 2. సరియైన దృక్పథం

సంఘం కృషిచేస్తున్నటువంటి సంపూర్ణ రాష్ట్రీయ పునస్సంఘటన భావన సాక్షాత్కరించుకోటానికి రాజకీయేతర కృషి సహజంగా అవసరమౌతుంది. ఇంతకూ, ఒక రాజకీయపక్షం సమాజంలోని ఒక స్వల్పాంశానికి మాత్రమే ప్రాతినిధ్యం వహించగలదు. అంతేగాక జాతీయసమైక్యం ఎన్నికలద్వారాగాని, రాజకీయప్రచారాలవల్లగాని సాధ్యపడదు. రాజకీయ పద్ధతులు-ఆమాటకువస్తే రాజకీయాధికారంకూడ - ప్రజల్లో భక్తిభావనను, సాహసాన్ని, శీలాన్ని, సామంజస్యాన్ని, త్యాగాన్ని ఏమాత్రం కల్గించ లేవు. నిజానికి సువ్యవస్థితమైన సమాజజీవితానికి మూలాధారమైన భావనలు లేందే, రాజకీయపక్షాలు పరస్పర శత్రుత్వానికి దిగజారి జాతి వ్యవస్థనే నాశనం చేస్తాయి.

### అకారాలమీద అపేక్ష, అంతర్యాలయెడ ఉపేక్ష

ఈనాడు మన కిట్టి దుర్దశ దాపురించింది. మనమంతా ఒకేజాతి దృఢవిశ్వాసం, జాతిప్రయోజనాలనుగురించిన శ్రద్ధ, వివేకాలు కరు

రాజకీయపక్షాలు విఘటనశక్తులకు, విశృంఖలప్రవృత్తులకు పుట్టినిండ్లైనాయి. జాతికి వ్యతిరేకంగా బాహాటంగా పనిచేస్తున్న వర్గాలతోను, ఒక్కొక్కసారి శత్రురాజ్యాలతోకూడ, తమ సంకుచిత ప్రయోజనాలనిమిత్తం రాజకీయపక్షాలు చేతులుకలుపుతున్నాయి.

రెండు రాజకీయపక్షాలు ఒకదాన్ని ఇంకొకటి అదుపులో ఉంచుతూ, తద్వారా ఏకపక్ష లేక ఏకవ్యక్తి నియంతృత్వవిషంనుండి జాతిని కాపాడగలిగేవిధంగా, హితప్రదమైన పోటీభావనతో పనిచేస్తూ ఉండే స్థితి వాంఛనీయంకదా ? అని అనవచ్చు. ప్రజాస్వామ్యవ్యవస్థలో ఇట్టి మేలు లేకపోలేదు. కాని అదైనా, తమ రాజకీయపక్షంకన్న జాతి మిన్న అనే దృఢవిశ్వాసం ప్రజల్లో ఉంటేనే సాధ్యపడుతుంది. శతాబ్దాలతరబడి ప్రజాస్వామ్యపద్ధతి పాతుకుపోయిన పాశ్చాత్యదేశాల్లోగూడ రాజకీయ పక్షాలు పరస్పర ఈర్ష్యాద్వేషాలకు పూర్తిగా అతీతంగా లేవు. అయినప్పటికీ జాతీయప్రయోజనాలకు లోబడి ఉండేట్లుగా రాజకీయ ప్రయోజనాలను అదుపులో ఉంచగలిగాయి. అట్టి వ్యవస్థలు వాళ్ళకు నూతనోత్తేజాన్ని కల్గిస్తాయి. ఒక దృఢకాయుడు పల్చని మల్లుచొక్కా వేసుకుంటే అది అతనికి నప్పుతుంది. కాని బక్కచిక్కిపోయి, నిటారుగానైనా నిలబడలేని వాడు ఆ చొక్కాను వేసుకుని, డాబుగా తిరిగితే నవ్వులపాలవుతాడు.

మనదేశ పరిస్థితులను ఇంగ్లండుతో పోల్చి చూద్దాం. కొన్నిఏండ్ల క్రితం పండిత నెహ్రూ అమెరికాకుపోతూ లండన్‌లో ఆగినప్పుడు అక్కడి మన దేశీయులు కొందరు, తాము కేవలం మరొక రాజకీయపక్షానికి చెందిన సంతమాత్రాన, విమానాశ్రయంలో వారికి వ్యతిరేకంగా నల్లజండాల ప్రదర్శన జరిపినారు. విదేశంలో మన ప్రధానమంత్రికి వ్యతిరేకంగా ప్రదర్శనలు చేయడం మనజాతికే అవమానమన్న సంగతి వాళ్ళు మరచి పోయారు.

మరి ఇంగ్లండు సంగతి చూద్దాం. బ్రిటన్‌లోని అప్పటి ప్రతిపక్ష నాయకుడు విన్‌స్టన్ చర్చిల్ అమెరికాలో పర్యటిస్తుండగా తనదేశంలోని లేబర్‌పార్టీ ప్రభుత్వం గురించి తన ఉద్దేశ్యాలను తెలుపుమని కొందరు ప్రశ్నించారు. అప్పుడాయన 'మాలో మా కెన్నితేడా లున్నప్పటికీ బయట మేమంతా ఒకటే' అని ఖండితంగా చెప్పినాడు. రెండు ప్రపంచయుద్ధాల్లో కూడ ఎన్నిబాధలు పడినప్పటికీ ఏపక్షంకూడ ఆ పరిస్థితిని తన పార్టీకి ప్రయోజనాలకోసం వాడుకోలేదు. ఎన్నికల్లో తమ అభ్యర్థుల ధరావతుల నైనా నిలబెట్టుకునేందుకు పాపం అక్కడ సామ్యవాదులు పదేపదే విఫల ప్రయత్నాలు చేస్తూఉంటారు; ఆ సమాజంలో గాఢంగా వ్రేళ్ళూనిఉన్న జాతీయభావనకు అది ఒకనిదర్శనం.

## భయంకర వ్యత్యాసం

విదేశాల్లోని వ్యవస్థల బాహ్యస్వరూపాన్ని మాత్రమే పరికిస్తూ, వాటి లోని ఆంతరికభావనను గమనించకుండానే కొందరు "ఇంగ్లండువంటి దేశాలు మీరుచేసే ప్రత్యేకకృషివంటిది ఏమీలేకుండానే పరీక్షల్లో నెగ్గుకొస్తున్నాయి; పురోగమిస్తున్నాయి. అచటి ప్రజలు మామూలుగా పనిపాటలు చేసికొంటూనే ఉన్నారు..రాజకీయపక్షాలు దేశవ్యవహారాలను సక్రమంగా నిర్వహిస్తూనే ఉన్నాయి. అటువంటప్పుడు మనదేశంలో మీసంస్థవంటి ఒక ప్రత్యేకసంఘటన మీ ద్వైనందిన శిక్షణ దేనికి?" అని అడుగుతారు.

అయితే ఆ దేశంలో దాదాపు ప్రతి ఒక్కడూ జన్మతః దేశభక్తుడే. ఒక వ్యక్తినిగురించిచెప్పేటప్పుడు"మనిషి"అని ప్రత్యేకంగాచెప్పనక్కర్లేదు అతడు "మనిషి" అన్నది స్పష్టమే. అట్లాగే అక్కడ ఒకవ్యక్తిని "దేశ భక్తుడు" అని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. కాని, మనదేశంలోమాత్రం 'దేశభక్తుడు' అని కొంతమందిని ప్రత్యేకించి పొగడటం పద్ధతి ఐపోయింది. ఇంగ్లండులోని ప్రతిఒక్క వ్యవస్థలోనూ – పాఠశాల, కళాశాల, సాహిత్య

మండలి, యువజనపరిషత్తు, సాంఘిక సాంస్కృతిక సంస్థలు - ఆఖరికి ఇంట్లోకూడ - ప్రతిశిశువు నేర్చుకొనే మొదటిపాఠం, "ఓ ఇంగ్లండ్ దేశమా! నీలో ఎన్ని లోపాలున్నా నిన్ను ప్రేమిస్తాను" అని. ఇక్కడ మన మహా నాయకులో! మహిమాలయాలైన హిమాలయాల్ని 'అక్కడ గడ్డిపరకైనా మొలవద'ని అంటుంటారు.

శతాబ్దాలుగా ఇంగ్లండు రూపొందించుకొన్న దేశభక్తియొక్క స్ఫూర్తిప్రదమైన సంప్రదాయం చూడండి. కొన్ని శతాబ్దాలతరబడి అక్కడ దేశద్రోహులే లేరనవచ్చు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో దేశద్రోహ ఉదాహరణ ఒక్కగానొక్కటి ఉంది. నాటి భారతవ్యవహారాల కార్యదర్శి లార్డ్ ఎమెరీయొక్క కుమారుడు జర్మనీకి సహాయం చేశాడు. యుద్ధానంతరం విచారణ జరిగింది; అతనికి మరణశిక్ష పడింది. అతని తండ్రి శిక్షను తగ్గించటానికి తన పలుకుబడి నుపయోగించాలని కలలోకూడ అనుకోలేదు. పైగా కృపాభిక్షకై పత్రంకూడ పెట్టలేదు. ఉజ్జ్వల దేశభక్తి సంప్రదాయం కల తమవంశంలో చెడబుట్టిన కొడుకు ముఖం చూడటంకూడ పాపమే అన్నాడు; వాణ్ణి ఉరిదీసే రోజునకూడ చూడలేదు.

ఇక్కడో? అలనాటి దాహిర్, పృథ్వీరాజుల కాలంనుండి ఆంగ్లేయ పరిపాలనాకాలంవరకుగూడ దేశద్రోహుల పరంపర ఒకటి ఇక్కడ ఉంది. అది నేటివరకు కొనసాగుతూనేఉంది. నేడు, మనదేశంలో ఉన్నతపదవులకు దేశద్రోహమనేది దాదాపు ఒక తిరుమంత్రం అయింది. మనదేశ రాయబారిగా ఉంటూనే మనకుచేరవలసిన ఆయుధాలనిండుఓడను పాకిస్తాన్‌కుమళ్ళించిన పెద్దమనిషితదనంతరంమనదేశంలోఒకప్రాంతానికిగవర్నరై కూర్చున్నాడు.

అక్కడ రాజకీయాలోక చక్కని క్రీడ. లేబర్‌పక్షం అధికారంలో ఉన్నప్పుడు, ప్రతిపక్షనాయకుని అమెరికాకు, ఉపనాయకుని చైనాకు రాయబారులుగా పంపింది. మన దేశంలోని అధికారపక్షం ఇటువంటి

సత్సంప్రదాయాన్ని అనుసరిస్తుందని కలలోనైనా అనుకోగలమా? అధికార పక్షంలోని వట్టినాసిరకం వ్యక్తి ఇతరపక్షాల్లోని అత్యంత సమర్థులకంటె కూడ గొప్పక్రింద లెక్క. ఫలితంగా పరిపాలన అంతా అధికారపక్షం యొక్క గుత్త అయిపోయింది. అంతటితో ఆగలేదు. ప్రభుత్వయంత్రాంగాన్ని తమ పక్ష ప్రయోజనాలకై విచ్చలవిడిగా వాడుకుంటున్నారు; ప్రతిపక్షాల ఆందోళనలను, ఉద్యమాలను, ప్రభుత్వం పశుశక్తితో అణచివేయజూస్తోంది.

## క్రొత్తరకం అస్పృశ్యత

ఇది ఈమధ్యనే సంభవించిన పరిణామం కాదు. 1937 లో కాంగ్రెసు రాజకీయాధికారం రుచిమరిగిననాటినుండే ఈ వికృతి ప్రారంభమైంది. సంఘకార్యప్రారంభదశలో కాంగ్రెసునాయకులు బాహాటంగా సంఘంతో సంబంధాలు పెట్టుకుంటూ ఉండేవారు. ఇది స్వానుభవం. సంఘం ప్రారంభమైన తరువాతకూడా, కాంగ్రెసు ఉద్యమాల్లో మన సంస్థాపకులు పాల్గొన్నారు. కాని 1937 లో కాంగ్రెసు వివిధప్రాంతాల్లో ప్రభుత్వాల నేర్పరచినపిదప, అది ఒక రాజకీయాల గుల్లలోకి ముడుచుకపోయి, తన సభ్యులు సంఘకార్యక్రమాల్లో పాల్గొరాదని నిషేధించి, క్రొత్త 'రాజకీయ అస్పృశ్యతా' విషాన్ని సమాజంలోకి ఎక్కించింది.

1937 లో ఒక రాజకీయ ఆందోళనను అణచివేయటానికి కాల్పులు జరుపమని ఆప్రాంతంలోని కాంగ్రెస్ మంత్రివర్గం ఆదేశించింది. అహింసకు అంకితమైన కాంగ్రెసు ప్రభుత్వం కాల్పుల కెట్లా దిగిందని ప్రశ్నిస్తూ ఒక సజ్జనుడు కాంగ్రెసు అధ్యక్షునకు లేఖ వ్రాసినాడు. "మా అహింసావిధానం ఆంగ్లేయులపట్ల మాత్రమే. మనవాళ్ళపట్ల మాత్రం కాదు" అని కాంగ్రెసు అధ్యక్షుడు సమాధానం వ్రాసినాడు. ఆ పెద్దమనిషి ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను పత్రికల్లో ప్రచురించినాడు!

## మౌలిక చికిత్స

అట్టి విఘటనక్రియలు జాతియొక్క నరనరాన్ని నమిలివేస్తుంటే, ఇతర దేశాల రాజకీయాది వ్యవస్థల అంధానుకరణ మన సమస్యలను పరిష్కరించి, సర్వతోముఖ జాతీయ పునరుజ్జీవనం కల్గించగలదని ఆశించటం వట్టి దండుగ. జబ్బు మనలో జీర్ణించిపోయింది; మరింత మౌలికమైన చికిత్స కావాలి. కనుక అట్టి అసలుజాడ్యాన్ని నిర్మూలించేందుకు, పునరుజ్జీవిత సమైక్య జాతీయజీవనాన్ని సృజించగల త్యాగభావం, అనుశాసనం, జాతీయ భక్తి వంటి సద్గుణాలను నిత్యమూ అలవరిచే దైనందిన శిక్షణ పద్ధతిని సంఘం రూపొందించింది.

ప్రతినిత్యం, నియమబద్ధంగా, అందరం శాఖలో కలుసుకోవాలని చెప్పటం అందుకే. నియమపూర్వకంగా, నిర్ణీతసమయంలో, ఒకే భావాన్ని మననం చేస్తూఉంటే, అది మనలో గాఢంగా నాటుకొని మనశీలంలో అవిభాజ్యమైన అంశంగా రూపొందుతుందనేది స్పష్టమే అందుకనే సంఘంలో నియమబద్ధత, సమయపాలనల విషయమై అంతగా నొక్కి చెప్పటం.

ఈ అంశాన్ని స్పష్టపరచే ఒక చిన్నికథ: ఒక ఆసామి విశ్రాంతికోసం ప్రతిరోజు మధ్యాహ్నం తన తోటకు వెళ్ళుతుండేవాడు. ఒకనాడు నెమలి ఒకటి వచ్చి చెట్టుపై వ్రాలింది. "ఈ నెమలి రోజూ ఇదేసమయంలో ఇక్కడకు వస్తే ఎంత బాగుంటుంది" అని అనుకొన్నాడు. తినుబండారాల్లో కొంచెం నల్లమందు కలిపి దానిముందు పడేశాడు. నెమలి వాటిని తిని ఉప్పొంగిపోయింది; రుచిమరిగిన ఆ నెమలి మరునాడుకూడా తోటకువచ్చింది. ఆ వ్యక్తి మళ్ళీ దానికి కొంచెం నల్లమందు పెట్టాడు. చివరకు అది నల్లమందు అవసరంలేకుండానే ప్రతిరోజూ అదేసమయానికి అక్కడికి రావటం మొదలు పెట్టింది.

మనస్సు తీరు అట్టిది. మనోవాక్కాయకర్మల్లో ఒకే విషయం నిత్యమూ మెదుల్తూ ఉంటే, అదే అలవాటు అవుతుంది. దీనిలో నియమం ముఖ్యం. నియమభంగం నద్భీలనిర్మాణాన్ని కుంటుపరుస్తుంది. కొలిమిలో పనిచేస్తూ, చెట్లను నరుకుతూ, రాళ్ళను పగులగొడుతూ కాయకష్టంచేసేవాళ్ల ఎంతమందిలేరు? కాని వాళ్ళలో ఒక్కడైనా వస్తాదు అయ్యాడా? లేదు. కారణం వాళ్ళది నియమపూర్వక పరిశ్రమకాదు. కాని, నియమపూర్వకంగా, కొద్దివ్యాయామం చేసినా, వ్యక్తి శరీరసౌష్ఠవాన్ని నిర్మించుకొని చక్కని క్రీడాకారుడుగా రూపొందవచ్చు. మొదటి ప్రపంచయుద్ధానంతరం జర్మనీకి అధ్యక్షుడుగా నియుక్తుడైన ప్రసిద్ధ జర్మను సైనికాధికారి ఫీల్డ్‌మార్షల్ హిన్‌డెన్‌బర్గ్ తన ఎనభైయ్యో యేటగూడ ఎంతో చురుకుగాను, బలంగానూ ఉండేవాడు. అంతటి జవజీవాల రహస్యమేమిటని అడిగినప్పుడు రోజూ ఒకేవేళకు ఒక గంటసేపు కట్టెలుకొడుతూ ఉంటాననీ, ఆ వయస్సులో గూడ ఆ అలవాటును కొనసాగిస్తూనే ఉన్నాననీ సమాధానం చెప్పినాడు.

## క్షణికోద్వేగాలకు పట్టేగతి

స్ఫూర్తిప్రదమైన ఒక భావాన్ని వింటున్నప్పుడుగాని, దేనైనా అధ్యసించాలని నిశ్చయించుకొన్నప్పుడుగాని ఉత్సాహానుభూతి కలిగి తీరుతుంది. కాని అట్టి అనుభూతులు, నిశ్చయాలు ఎంతసేపు నిలుస్తాయి? ఏదో ఒక సుముహూర్తాన ఇకనుంచి ప్రతినిత్యమూ దినచర్య వ్రాయాలనీ, నియమపూర్వకంగా వ్యాయామం చేయాలనీ–ఇట్లాంటి 'గంభీర నిర్ణయాల్ని' మన యువకులు చేసుకోవటం, వాటిని ఆ మరునాడే మరచిపోవటం మనకు తెలీదా?

తాత్కాలికఉద్రేకాలతో పనిచేసే వ్యక్తులు తరచు తారసపడ్తారు. కొన్నికొన్ని సందర్భాల్లో ప్రజల్లోని భావనలు, ఉద్రేకాలు తారస్థాయికి చేరుతాయి. కాని, అట్టి తాత్కాలికఉద్వేగాలు ప్రజలమనస్సులపై శాశ్వత సంస్కారాలముద్ర వేయలేవు. ఈనాడు ధార్మికజాగృతి అనే వెల్లువ దేశాన్ని ముంచెత్తుతోందని అంటున్నారు. ధర్మోపదేశాలు ధ్వనివర్ధక యంత్రాల

(లౌడ్‌స్పీకర్) ద్వారా ప్రసారమవుతున్నాయి. గంగలో లక్షలాది ప్రజలు ఏటా మునుగుతూనే ఉన్నారు పురాణప్రవచనాల్లో, హరికథల్లో శ్రీరామనవమి, సత్యనారాయణపూజ, గణేశచతుర్థి వంటి ఉత్సవాల్లో ఎంతోమంది సమావేశమవుతూనే ఉన్నారు. కాని అవేవైనా అపేక్షిత ఫలితాలను ఇస్తున్నాయా ? స్వార్థపూరితమైన నేటి జీవితానికి స్వస్తి చెప్పాలనీ, త్యాగం, శీలం, సేవ వంటి పవిత్రోపదేశాల కనుగుణంగా జీవించాలనీ, ఒక ఉదాత్తమైన నిశ్చయాన్ని మనస్సుల్లో అవి కలుగ కేస్తున్నాయా ?

గంగ స్నానానికి పోయేవాళ్ళను గూర్చి ప్రవిత్రమైన గంగ ఒడ్డున చేరుకోగానే వాళ్ళ పాపాలు ఎగిరిపోయి చెట్లెక్కి కూర్చుంటాయని, స్నానంచేసి గట్టెక్కగానే మళ్ళీ వాళ్ళమీద దూకుతాయని—శ్రీరామకృష్ణ పరమహంస నవ్వుతూఅంటుండేవారు. క్షణికభావోద్వేగాలు మానవునిశీలాన్ని మలచలేవనేదే దీని సారాంశం. క్షణికోద్వేగాన్ని తన శీలంలోని శాశ్వత లక్షణంగా మార్చుకోగలిగిన మానసికక్షమత నూటికి కోటికి ఏఒక్కడికో ఉంటుంది. భావోద్వేగపు పొంగులో మునిగిపోయి భగవంతుని పేరిట ఎడవవద్దనీ, కఠోరనియమాలతోకూడిన దైనందిన తపశ్చర్యలో నిమగ్నం కావాలనీ, మనోనిగ్రహం విషయంలో ప్రామాణికులైన మన మహాపురుషు లందరూ మనలను ఆదేశించారు. ఉద్వేగాలను వెళ్ళగ్రక్కటంవల్ల నరాలు శిథిలమై వ్యక్తి మరింత బలహీనపడి, నైతికంగా భ్రష్టుడవుతాడు. మైకం దిగిపోగానే త్రాగుబోతు బలహీనుడు అయినట్లే ఇదీనూ.

ఒక సంఘసమావేశంలోపాల్గొన్న ఒకప్రౌఢుడు, ఎంతోఉత్సాహంపొంది తన సంసారబంధాలన్నీ తెగిపోయాయనీ, ఇకపైన తాను సంఘకార్యానికే పూర్తిగా అంకితమైపోతాననీ తన కుటుంబీకులముందు ప్రకటించాడు! ఆ వేడి చల్లారిపోగానే, యథాప్రకారంగానే సంకుచితస్వార్థంలో మునిగిపోయి నాడు; "తన సర్వస్వ పరిత్యాగ ప్రతిజ్ఞ" అతనికి గుర్తే లేకపోయింది.

## బెడిసికొట్టే పనులు

భావావేశాలకులోనై ఊగిపోవటం, మానసిక సంతులనాన్ని చెదర గొడుతుంది. భావోద్రేకాలను అదుపులో వుంచుకోలేనివారు వాటిని అవాంఛనీయ మార్గాల్లో వెలువరిస్తారు. కొందరు దుఃఖపడుతుంటాడు. మరికొందరు ఆదర్శానికే నష్టం కలిగించే పద్ధతిలో తెగింపు ధోరణిని ప్రద ర్శిస్తుంటారు. బహుకాలంగా, ఓపికతో, శ్రద్ధాసక్తులతో నిర్మించిన అను కూల వాతావరణాన్ని కూడా అట్టి తెగింపుపనులు ధ్వంసంచేస్తాయి. ఇటలీ స్వాతంత్ర్య సమర కాలంలో జరిగిన ఒక విషాదసంఘటనవుంది. గారిబాల్డీ, మేజినీ, మొదలైన ఇటలీ అగ్రనాయకులు కొందరు ఫ్రెంచినాయకులతో ఒక రహస్య ఒప్పందం చేసుకున్నారు. దాని ప్రకారంగా ఇటలీ స్వాతంత్ర్య సముపార్జన త్వరితగాతిని సాగుతుందనుకున్నారు. కానీ ఫ్రెంచి చక్ర వర్తిని ఎవరో కాల్చిచంపివేశారని మాజినీకి వార్త అందింది. మాజినీ నిశ్చేష్టుడయ్యాడు. అతడు వెంటనే అన్నాడు. "భగవంతుడే మనల్ని కాపాడాలి. ఆ హంతకుడు ఇటాలియను కాకుండా ఉండాలి." కానీ విధి మరోరకంగా నిర్ణయించింది. ఆ హంతకుడు ఇటలీ వాడే; మాజినీ మొదలైనవారు వేసుకున్న రహస్య పథకాలన్నీ మట్టికసిపోయాయి.

## కాలామోదిత పద్ధతి,

అయితే సంస్కారాలు శాశ్వతంగా హత్తుకపోవటానికి మార్గమేమిటి? ఒక ఆదర్శానికి అనుగుణంగా వ్యక్తి శీలాన్ని తీర్చిదిద్దాలంటే మూడంశాలు అవసరమని మన తత్వశాస్త్రవేత్తలు చెప్తారు. సంస్కారంగా రూపొంద వలసిన ఆదర్శాన్నిగురించి నిరంతరధ్యానం, ఆ ఆదర్శానికే అంకితులైన వ్యక్తులయొక్క సంతత సాంగత్యం, ఆ ఆదర్శానికి అనుగుణమైన క్రియా కలాపాల్లో శరీరవినియోగం-ఇవే ఆ మూడంశాలు. కుటుంబ పాలన, పోషణల్లో అత్యధికసమయం వెచ్చించవలసిన సామాన్యమానవునికి ఈ

ఇరువదినాల్గుగంటల ప్రణాళిక అందుబాటులో ఉండదు. సర్వసంగపరిత్యాగి యైన యోగికూడా సంపూర్ణసమాధిస్థితిలో మూడుదినాలు మించి ఉండలేడు. తర్వాత అతడు వ్రాలిపోతాడు.

సంస్కారాలను కల్గించే ఆ నియమాల సారాన్ని ఇముడ్చుకున్న ఒక పద్ధతిని, సామాన్యమానవుని నిమిత్తమై మహామహులైన మన సమాజ నిర్మాతలు ప్రవేశపెట్టినారు. ఉభయసంధ్యల్లోనో, రాత్రివేళనో, లేదా ఎప్పుడో ఒకప్పుడు రోజులో ఒక నిర్ణీతసమయాన్ని కేటాయించుకొని, ఆ సమయంలో క్రమబద్ధంగా, నియమపూర్వకంగా, వేళతప్పకుండా తనశరీరం, మనస్సు, బుద్ధి – వీటియొక్క శక్తులనూ, కార్యకలాపాలన్నిటినీ తానెంచు కొన్న ఆదర్శంపై లగ్నంచేయాలనీ, రోజూ కనీసం కొంతసమయాన్ని తనవంటివారి సాహచర్యంలో గడపాలనీ ఆ పద్ధతి సూచిస్తుంది.

సంస్కారప్రదమైన ఈ కాలామోదితపద్ధతిని అనుసరించియే సంఘం కూడా నేటి శాఖాపద్ధతిని రూపొందించింది. జాతీయ పునస్సంఘటనాదర్శానికి అనుగుణంగా "రాష్ట్రదేవోభవ" అనే భావనతో ప్రేరితమైన నిత్య సంస్కార పద్ధతి శాఖా కార్యక్రమాల్లో కొనసాగుతూ ఉంది. పైపైకి చిన్న విషయాలుగా తోచే ఆటలు, పాటలు, కర్రసాము, సంచలనం వంటివి ఇదే భావనతో అనుప్రాణితాలై సుసంఘటితము, శక్తిమంతమునైన జాతీయ జీవనానికి కావలసిన ప్రగాఢసంస్కారాలను నిర్మించగల్గుతాయి.

ఒక సువ్యవస్థితమైన పద్ధతిలో చిన్నచిన్న వస్తువులు ఒకచోట చేరితే ఒక పెద్దవస్తువుగా ఏర్పడితీరుతాయి. "పైసల గురించి జాగ్రత్తపడు, రూపాయలు వాటి జాగ్రత్త అవే పడతా"యనే సూక్తి శ్రేష్ఠమైన గుణవంతులను రూపొందించడంలో ప్రత్యక్షరసత్యమే. శ్రేష్ఠగుణసంపన్నులు ఒక్కసారిగా ఊడి పడరు. వారు నిశ్శబ్దంగా, నింపాదిగా నిర్మితులౌతారు. మహోన్నతవైభవశిఖరాగ్రాలకు ఒక్కొక్క అంగుళమే, ఒక్కొక్క మెట్టే అధిరోహిస్తారు.

## ఈ లోపం సరిదిద్దటమెట్లా

దుశ్శీలం కూడా ఎక్కడో అక్కడ ఒక చిన్నలోపం జరగడంతో పెరుగుతూ వస్తుంది. హత్య చేసి నందుకుగాను ఉరిశిక్షపడ్డ యువకుని కథ ఒకటి ఉంది. అతని చివరికోరిక ప్రకారం తల్లి అతనివద్దకు వచ్చింది. కాని అతణ్ణి తిట్టటం మొదలుపెట్టింది; మరింత దగ్గరకు రమ్మని అతను ఆమె చెవి కొరికేశాడు. ఆమె లబోదిబోమని అంటుంటే 'తోటకూరనాడేచెప్పలేకపోయావా?' అని అన్నాడు. చచ్చిపోయే చివరిగడియల్లోగూడ అంతగొడ్డులాగా ప్రవర్తించినందుకు అతణ్ణి నల్గురూ 'ఛీ' అన్నారు. తన విషాదాంతజీవనానికి ఆమెయే కారణమని అంటూ "బాలుడుగా ఉన్నప్పుడు నే నొకసారి తోటకూర దొంగిలించితెచ్చి అమ్మ కిచ్చినాను. ఆనాడు ఆమె చెవులునులిమి బుద్ధి చెప్పలేదు. పైపెచ్చు వీపు తట్టింది. ఆ చెడుఅలవాటు నాలో పెరిగింది; తీవ్రపరిణామాలను నే నీనాడు అనుభవిస్తున్నాను" అని అతడు వివరించినాడు.

నా చిన్నతనంలో ఒక ఇంగ్లీషుపద్యం చదువుకున్నాను. చిన్న చిన్న విషయాలకు ఎంతటి ప్రాధాన్యంవుందో అది ప్రస్ఫుటం చేస్తుంది. ఆ పద్యం ఈ వాక్యంతో ప్రారంభమవుతుంది. "మేకులేక నాడా పోయింది;"– ఇలా ప్రారంభమై – "నాడా లేక గుఱ్ఱం పోయింది; గుఱ్ఱం లేక రౌతుపోయాడు;రౌతులేకయుద్ధంపోయింది–చివరకు రాజ్యమేపోయింది. ఆ పద్యంలో చిట్టచివరి వాక్యం "గుఱ్ఱపు నాడాకి మేకులేకపోబట్టే అంతా నాశనమై పోయింది" అని.

గత అనేకశతాబ్దాలకాలంలో మనలో పెరుగుతూవస్తున్న చెడు అలవాట్లు, మన స్తత్వాలు ఒక్కరోజులో ప్రక్షాళితంకావు. కాబట్టే ప్రతిదినం సంస్కారాలను కల్గించటం తక్షణావసరం. దేహాన్నికూడ ప్రతిదినం శుభ్రం చేయాలి; అటువంటప్పుడు, మరింతతేలికగా కలుషితం కావడానికి అవకాశ మున్న మనస్సును, మరింత శ్రద్ధతో నియమబద్ధంగా పరిశుద్ధం చేయాలి.

మనచుట్టూఉండే వాతావరణంలోని వివిధ దుష్టప్రవృత్తుల నిరంతర సంపర్కంలో అది ఉంటుంది కాబట్టి మరింత ప్రత్యేకమైనశ్రద్ధ వహించాలి. "ఆత్మసాక్షాత్కారం పొందిన మీరుకూడా, నిత్యసంస్కారాలను క్రమంగా ఇంకా ఎందుకు కొనసాగిస్తున్నా"రని శ్రీరామకృష్ణునకు అద్వైతాన్ని ప్రబోధించిన తోతాపురిని అడిగితే, నీళ్ళుత్రాగే చెంబును ప్రతినిత్యం శుభ్రపరచటం ఎట్లా అవసరమో, అట్లాగే ఈ ప్రపంచంలో జీవించి ఉన్నంత కాలం మనస్సును ప్రతినిత్యం సంస్కరించడం అవసరమని ఆయన సమాధానం చెప్పినారు.

## వ్యక్తినిర్మాణ ప్రక్రియ

కనుకనే మహత్తర సంఘటిత సమాజదేహంలో సజీవమైన ఒక అంగంగా వ్యక్తిని రూపొందించేనిమిత్తమై అతనిశరీరానికీ, మనస్సుకీ, బుద్ధికీ శిక్షణ ఇచ్చే సంస్కారక్రమాన్ని సంఘం రూపొందించింది. ఉదాహరణకు, మానవుని శరీరంలో అనేక అవయవాలున్నాయి. ప్రతి అవయవంలోనూ లక్షలాది జీవాణువులు ఉన్నాయి. వాటిలో ప్రతిఒక్కకణం శరీరమంతటితోను తాదాత్మ్యాన్ని అనుభవిస్తూ ఉంటుంది. శరీరంయొక్క ఆరోగ్యానికి, వృద్ధికి, తనను తాను ఆహుతి చేసుకొనేందుకు అది సర్వదా సంసిద్ధంగా ఉంటుంది. నిజానికి అటువంటి లక్షలాది జీవాణువులు ఆత్మాహుతి చేసుకుంటేనే శారీరక చైతన్యానికి అవసరమైన శక్తి ప్రభవిస్తూ ఉంటుంది

అత్యంత క్రమబద్ధంగా శాఖలో ఇచ్చే శిక్షణ, అటువంటి తాదాత్మ్య భావనను, సువ్యవస్థితమైన కృషిని అలవాటుచేస్తుంది. వ్యక్తి తనలోని అవకతవకలను సరిచేసుకునేందుకు, సమాజంలోని తోటి సోదరులతో ఐక్య భావనతో ప్రవర్తించేందుకు, ఇతరుల దృక్పథాలతో సర్దుబాటు చేసుకోగలుగుతూ సువ్యవస్థితము, అనుశాసనయుక్తమునైన జీవనపద్ధతిలో ఒకటయేందుకు, అవసరమైన ప్రోత్సాహాన్ని అదే కల్పిస్తుంది అక్కడ

సమావేశమైన వ్యక్తులు ఒకే ఆజ్ఞను పాటించే శిక్షణ పొందుతారు. క్రమ శిక్షణ వారి రక్తంలో రంగరించుకుపోతుంది. శారీరకమైన క్రమశిక్షణకన్నా మానసికమైన క్రమశిక్షణ మరింత ముఖ్యమైంది. తమ వ్యక్తిగతమైన భావోద్వేగాలను, ప్రవృత్తులను మహోన్నతమైన జాతీయ హితం కొరకు అంకితంచేసే పద్ధతిని వారు అలవరచుకొంటారు. ఆవిధంగా సంఘంలో రూపొందే ఆదర్శప్రాయమైన క్రమశిక్షణ, జాతియెడ ప్రగాఢ సమర్పణభావంనుండి జనించేదిగాబట్టి అది స్వయంస్వీకృతం. వ్యక్తిలో అంతర్నిహితమై ఉన్న శక్తిసామర్థ్యాలను అటువంటి క్రమశిక్షణ జాతీయ సంక్షేమానికి అనువుగా పెంపొందించి,వికసింపజేసితీరుతుంది. పురుషపుంగవో చితమైన సద్గుణాలన్నీ పూర్తిగావికసించి, పరస్పర ప్రేమసహకారభావాలతో నిండి, స్వయంస్ఫూర్తితో అలవరచుకొన్న క్రమశిక్షణతో అన్యోన్య అనుబంధం కలిగి, ఒక్కసారి కలిసికట్టుగా కార్యరంగంలో దూకగలిగిన వ్యక్తులే, అక్షయ జాతీయశక్తి విధానాలను సృష్టించగలుగుతారు.

## మన పెద్దపొరపాటు

ఆవిధంగా క్రమశిక్షణ జాతీయజీవనంలో ఒక ప్రముఖ విషయం. ఒకే లక్ష్యంకోసం ఏకత్రితులైనాసరే క్రమశిక్షణలేని వ్యక్తులకు సమైక్య కృషి చేసేశక్తి ఉండదు. అట్టి గుంపు లక్ష్యాన్ని సాధించలేదు. ప్రతి సంవత్సరం లక్షలాది యాత్రికులు జగన్నాథుని దర్శనంకొరకు పూరిలో గుమిగూడుతారు. ఆ త్రొక్కిడిలో అనేకమంది పడిపోతారు; కొందరు చేతులు విరుగగొట్టుకుంటారు; కొందరు కాళ్ళక్రిందపడి నలిగిపోతారు. అట్టి విషాదసంఘటనలు తరచు జరుగుతూనే ఉంటాయి. జగన్నాథ దర్శనమే వారందరి ఏకైక లక్ష్యం. సందేహంలేదు. కాని వారిలో ఒకక్రమంగాని, అనుశాసనంగాని లేనందున జగన్నాథుని దర్శనానికిబదులు గందరగోళం, ప్రమాదాలు సంభవిస్తాయి. జీవితంలోని అన్నిరంగాల్లోనూ ఇదే అనుభవం. కొద్దిమంది సుశిక్షితులు అయిన వ్యక్తుల కార్యశక్తిముందు వందలాది

వ్యక్తులగుంపు పనిచేసే తీరు ఎందుకూ కొరగాదు. తమకంటె ఎన్నోరెట్లు ఉన్న మన సైన్యాలను ఆంగ్లసేనలు చిత్తుగా ఓడించినట్లు చరిత్ర చెబుతోంది. వారి మెరుగైన క్రమశిక్షణయే దీనికి కారణం.

క్రమశిక్షణారాహిత్యంవల్ల మనం గతంలో ఎంతో నష్టపోయాం. 1761 లో జరిగిన మూడవ పానిపట్టు యుద్ధం, విజృంభిస్తున్న హిందూ స్వరాజ్యానికి ఒక పరీక్ష. అపారమైన హిందూసైన్యానికి నాయకుడు కాకలుతీరిన సదాశివరావు పీష్వా దురాక్రమణకారులకు నాయకుడు అహ్మద్‌షా అబ్దాలీ. హిందూసైన్యాధికారులు యుద్ధతంత్రాన్ని నిర్ణయించు కొనేందుకు సమావేశమైనారు. మల్హారరావుహోల్కర్, మరికొందరు వృకపద్ధతి (గెరిల్లా) యుద్ధాన్ని ప్రతిపాదించారు. సంకులసమరాల్లో సాటిలేని సైన్యాధిపతిగా ప్రశంసలందిన సదాశివరావు, ఒకే దెబ్బతో శత్రువును నాశనంచేసేందుకు ప్రయోజనకారి అని, ముఖాముఖీ యుద్ధాన్నే నిర్ణయించాడు. దీనికి మల్హారరావు అంగీకరించక అస్త్రసన్యాసం చేశాడు. మిగిలిన సైన్యం సదాశివరావు నాయకత్వంలో యుద్ధం మొదలెట్టింది. యుద్ధరంగానికి చేరువలోనే ఉన్న మల్హారరావుహోల్కర్ చిన్న సహాయం చేసిఉన్నట్లయితే చరిత్రాత్మకము, భయానకమునైన అపజయం ఒక మహావిజయంగా మారి బహుశః మన చరిత్రగతినే పూర్తిగా మార్చివేయ జాలిన ఒక నిర్ణాయకక్షణం అది. కాని అతనిసైన్యం చూస్తూ ఊరుకుంది. దానితో అతిశ్రేష్ఠమైన హిందూసైన్యం పూర్తిగా ఓడిపోయి సర్వనాశనం అయిపోయింది. దురాక్రమణదారుని తరిమివేయాలనేదే ఇద్దరి లక్ష్యమూ అయినప్పటికీ, వారిద్దరూ ఒకేత్రాటిపై నిలువలేకపోవటమే దీనికి కారణం.

## తరుణోపాయం

జాతీయ పునస్సంఘటనకు అవసరమైన క్రమశిక్షణ కేవలము శారీరికమైనదికాదని సంఘం భావిస్తోంది. అది రక్షకభటుల క్రమశిక్షణ, సైని

కుల క్రమశిక్షణ వంటిదికాదు. మనది విక్రమాదిత్యుడు నిర్మించిన సంఘటన వంటిదా లేక శంకరాచార్యుడు సృజించిన సంఘటనవంటిదా అని ఒక మిత్రుడు ప్రశ్నించినాడు. ప్రస్తుతయుగంలో ఆ రెండు పద్ధతులుకూడ నిష్ప్రయోజనాలే అని నేను సమాధానం చెప్పినాను. విక్రముడు చేపట్టిన సైనికసంఘటన ఆనాడు శత్రువును తరిమికొట్టే తాత్కాలికప్రయోజనాన్ని మాత్రమే సాధించి కేవలం ఒక శతాబ్దంపాటు పనిచేసింది. కాని ఆ పద్ధతి సార్వకాలికంగా మన ప్రజలందరినీ ఐక్యపరచనూలేదు, వారిలో శాశ్వతాలైన జాతీయసద్గుణాలను పాదుకొల్పనూలేదు. శంకరాచార్యుల వారు చేకొన్న శాస్త్రార్థాల, ప్రవచనాల పద్ధతిని ఆచరణలో పెట్టాలంటే ఆనాడు ప్రాచుర్యంలోఉన్న నిజాయతీ ఈనాడు ఏమాత్రం కనిపించడం లేదు. తన భర్తకు, శంకరులవారికీ జరిగిన ప్రసిద్ధమైన శాస్త్రార్థంలో ఆనాడు మండనమిశ్రునిభార్య ధర్మాసనంమీద కూర్చుంది; శంకచార్యుడే విజేతఅనితీర్పుఇచ్చింది. ఆ శాస్త్రార్థనిబంధనలప్రకారం దంపతు లిరువురూ సన్యాసాన్ని స్వీకరించి శ్రీవారి శిష్యులయ్యారు.

కాని ఈనాటిపరిస్థితి వేరు. సరియైనదని తాము నమ్మి, దాన్ని ఆచరించ డానికి అవసరమైన నీతి, నిజాయితీ కలవారు నేడు కొద్దిమంది మాత్రమే ఉన్నారు. బహిరంగంగా సంఘసిద్ధాంతాలను నిశితవిమర్శ చేసిన ప్రముఖ నాయకులే విడిగా కలసి మాట్లాడినప్పుడు, పూర్తి ఏకీభావాన్ని వ్యక్తంచేస్తుం టారు, ఇది మన అనుభవం. కనుక యావత్తుప్రజలు స్వయంస్ఫూర్తితో, అనుశాసనబద్ధులై, జాతికి అంకితులై, ఏకసూత్రబద్ధులై తమ దృఢవిశ్వాసాల ఆదేశానుసారం కార్యోన్ముఖులు కాగలిగే శిక్షణను ఇవ్వటానికి అనువైన విశిష్టపద్ధతిని సంఘం రూపొందించింది.

## సాధారణ భ్రాంతులు

కాని మన అనుశాసనంయొక్క అసలుస్వభావాన్నిగురించి ఎన్నో భ్రాంతులు ఉన్నాయి. దండభీతిగాని, ధన, పదవీ ప్రలోభాలుగాని ఉండే

సైనికులయొక్క, రక్షకభటులయొక్క అనుశాసనానికి అలవాటుపడ్డ ప్రజానీకం సంఘ కార్యకర్తల్లోనూ, కార్యక్రమాల్లోనూ తొణికిసలాడే తీవ్ర అనుశాసనభావాన్ని చూచినప్పుడు సంఘం దాదాపు సైనికసంస్థయే అనీ, సొంత సేన అనీ అంటూ ఉంటుంది. ఆత్మసంయమనాన్ని, స్వయంస్వీకృతమైన క్రమశిక్షణను తన సభ్యులలో రూపొందించకల్గిన ఏకాత్మభావాన్ని సోదరభావాన్ని, ఆదర్శవాదాన్ని మెచ్చుకోగలిగే పరిజ్ఞానంగాని, సామర్థ్యం గాని వాళ్ళలో బొత్తిగా లేవనడానికి ఇది నిదర్శనం.

'ఈ అణుశస్త్రయుగంలో లాఠీవంటి కాలదోషంపట్టిన ఆయుధాల శిక్షణవల్ల ప్రయోజనమేమిటి' అని కొందరు ప్రశ్నించడానికి ఆ అజ్ఞానమే కారణం. అణ్వాయుధాలు, క్షిపణులు (మిసైల్స్) చేపట్టటానికి అవసరమైన శిక్షణను సైన్యం మాత్రమే పొందగలుగుతుంది అనే విషయం వారు విస్మరిస్తున్నారు. రష్యా అమెరికాలతోసహా ఏదేశంలోనూ అట్టి ఆయుధాలు ఉపయోగించటానికి సామాన్యమానవునికి అనుమతిలేదు. ఆ దేశాల్లోగూడ సామాన్యులకు సంబంధించినంతవరకు ప్రాథమికమైన వ్యాయామపద్ధతుల ద్వారాను, చిన్నచిన్న సాధనాలద్వారాను శిక్షణ ఇస్తారు. ప్రజల్లో శారీరక, మానసిక అనుశాసనాలు అలవరచడానికి అటువంటి శిక్షణ అవసరం.

మరోరకం మనుష్యులున్నారు. మన సంఘటనలోని నియమబద్ధమైన శిక్షణకు బహుశః తట్టుకోలేక, 'వ్యక్తి స్వేచ్ఛ'కు ఇవి రోజులు, మేం ఎట్టి నిర్బంధాలకు లొంగి ఉండడానికి అంగీకరించం – ఇట్లా అంటూ ఉంటారు. అట్లాంటి పెద్దమనిషి ఒకడు తానెరిగినంతవరకు ఆసేతుశీతనగమూ సంఘంలోని అబాలగోపాలం, ఒక ప్రశ్నకు ఒకేవిధమైన సమాధానమిస్తారు కనుక, సంఘంలో ఆలోచనాస్వాతంత్ర్యం లేదు. ఇది నియంతృత్వసంస్థ అని ఆరోపించాడు. 'రెండు రెళ్ల నాలుగు అంటాను; నీ వేమంటావు ?' అని అడిగినాను. 'అదేమిటి, నాలుగేకదా ?' అని అత డన్నాడు. 'అయితే

నీవు ప్రజాస్వామ్యవాదివి కానేకాదు; నేను చెప్పిన సమాధానాన్నే నీవుకూడా చెప్పావుకాబట్టి నీవుకూడా నియంతృత్వవాదివే!' అన్నాను. ఒక ప్రశ్నకు సరిఅయిన సమాధానం ఒక్కటే ఉంటుందనే సామాన్యసత్యం ఆ పెద్దమనిషికి తట్టలేదు.

సరియైన జాతీయదృక్పథాన్ని అలవరచుకొన్న సంఘంలోని వ్యక్తులు, ఆ యా సమయాల్లో ఎదురయ్యే వివిధ జాతీయసమస్యలకు అతిసహజమైన తీరులో, ఒకేవిధంగా ప్రతిస్పందించటం సహజమే. దాన్ని మానసికమైన నిర్బంధం అని అనడంవల్ల జాతీయభావనను భావ నిర్బంధసాధనం అని అనవలసివస్తుంది. 'భావస్వాతంత్ర్యం' 'వాక్స్వాతంత్ర్యం'వంటి నవీనభావాలనుగురించిన మిడిమిడిజ్ఞానంవల్ల మన యువకుల మనస్సుల్లో గందరగోళం చెలరేగి స్వాతంత్ర్యం అంటే స్వైరవిహారం అని, ఆత్మనిగ్రహం అంటే 'భావనిర్బంధం' అని వాళ్ళు భావిస్తున్నారు.

## స్వయంసేవక్ ధ్యేయవ్రతుడు

సంఘం పెంపొందించే క్రమశిక్షణ సంస్కారవంతులైన ప్రజలు అతిసహజంగా అలవరచుకునే ఆత్మనిగ్రహం మాత్రమే. జాతిపట్ల తన కర్తవ్యం ప్రముఖమైనదని, తనవిగాని, తనకుటుంబానివిగాని కోరికలు అంత ముఖ్యంకాదని, ప్రతివ్యక్తి భావించుకొనేట్లుచేసే అనుశాసనం ఇది. అట్టి ఉన్నత లక్ష్యసాధనకు వ్యక్తి తనంతట తాను సువ్యవస్థితంగాను, సుసంబద్ధంగాను సంసిద్ధుడౌతాడు. జాతీయసంక్షేమకార్యంలో ప్రతివ్యక్తీ తన బుద్ధిని, భావనలను, శారీరికశక్తులను, ఆస్తిపాస్తులను కూడగట్టగలిగే ఒక విశిష్టమైన అనుశాసనమిది.

సంఘశాఖలో శిక్షణపొందే వ్యక్తిలో సహజము, స్వయంస్వీకృతములైన ఆత్మనిగ్రహం, ఆత్మబలిదానం కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. అతణ్ణి

స్వయంసేవక్ అంటాము. సామాన్యంగా అందరూ అనుకునేట్లు ఏదో గణవేషం ధరించి కొన్ని సార్వజనిక కార్యక్రమాల్లో హడావిడిచేస్తూనో, వ్యాయామవిద్యాప్రదర్శనల్లో పాల్గొంటూనో ఉండే స్వచ్ఛంద సేవకుడుకాడు స్వయంసేవక్. అతడు, ఇతరుల ఆజ్ఞను పాటిస్తూ, వెట్టిచాకిరీచేసే కింకరుడు కాదు. జాతీయదృష్టిగల ధ్యేయవ్రతుడు స్వయంసేవక్. అనేకకారణాలవల్ల గతవేయిసంవత్సరాలుగా ఛిన్నాభిన్నమైపోయిన జాతిని, సంఘటితపరచడం అనే మహత్తరపథకాన్ని తాను నెరవేర్చాలనే ప్రగాఢకర్తవ్యతాజ్ఞానంతో అత డుంటాడు; అట్టి చారిత్రకపాత్రను నిర్వహించటానికి సంసిద్ధుడవుతాడు; జాతీయ పునర్నిర్మాణకార్యక్రమానికి తానొక సమర్థసాధనంగా రూపొందే నిమిత్తమై, సహజసిద్ధమైన తన ఆవేగ సంవేగాలను, ధోరణులను సమన్వయ పరచి ఏకోన్ముఖంచేయడం నేర్చుకొంటాడు; తన స్వార్థప్రయోజనం, పదవీ పటాటోపం, పేరుప్రఖ్యాతులు - ఇట్టి ఆలోచనలను దరిచేరనీయక సమాజాన్ని సేవిస్తూ ఉంటాడు.

## సర్వస్వార్పణ భావన

సంఘపద్ధతిలోని వివిధాంశాలన్నింటిలోను ఇదే చైతన్యం ప్రస్ఫుటం ఔతుంది. వివిధ శిక్షణశిబిరాల్లోను, సమావేశాల్లోను పాల్గొనే స్వయంసేవకులు తామెంతటి బీదవారైనప్పటికీ, సొంతడబ్బే ఖర్చుపెట్టు కొంటారు. వారు శిబిరరుసుం చెల్లిస్తారు; గణవేష కొనుక్కుంటారు; తమ ప్రయాణఖర్చులు తామే భరిస్తారు. స్వావలంబన, స్వార్థత్యాగభావాల ప్రేరణవల్లనే ఇదంతా సాధ్యమవుతోంది.

సంఘం అనుసరిస్తున్న ప్రాచీన గురుదక్షిణా సంప్రదాయంకూడా ఈ భావానికి అనుగుణమైనదే. ఏడాదికొకసారి గురుపూర్ణిమ పర్వదినాన ప్రతిస్వయంసేవకూ గురువైన పవిత్రభగవాధ్వజాన్ని పూజించి, దక్షిణ సమర్పిస్తాడు. నిధిసేకరణగాని, నెలవారీ, సంవత్సరవారీ చందాలు వసూలు

చేసే పద్ధతిగాని సంఘంలో లేదు. సమర్పణలన్నీ ఆరాధనాభావనతోనే జరుగుతాయి. తమ పేర్లు, తామిచ్చిన ధనం పదిమందిలోను ప్రచారం కావాలని స్వయసేవకులు కోరనైనా కోరరు. నిజానికి స్వయంసేవక్ దాన్ని ఒక త్యాగంగా భావించడు; ఏవిధమైన ప్రతిఫలాన్ని-పేరుప్రతిష్ఠలను కూడ-ఆశించరాని ఒక సహజకర్తవ్యంగా భావిస్తాడు.

*"అతా ఉరలో ఉపకారా పురతా"*
(ఇప్పుడు ఇతరుల సేవకొరకే నా బ్రతుకు)

అనే తుకారామ్ సూక్తికి అనువైన భావనలో వారు శిక్షణ పొందుతారు.

*"తేరా వైభవ అమర రహే మా హమ దిన చార రహే న రహే,"*
(మేము మరోనాలుగురోజులు బ్రతికినా బ్రతుకకపోయినా ఓతల్లీ! నీవైభవం అమరమగుగాక)

అనే ఆవేశపూరితుడైన కవి వాక్యాలు ప్రతి స్వయంసేవకుని హృదయాన్ని ఉర్రూతలూగిస్తూ ఉంటాయి.

కాని దురదృష్టవశాత్తు నేడు దేశంలోఉన్న వాతావరణం దీనికి పూర్తిగా విరుద్ధంగా ఉంది. తానొనర్చిన 'త్యాగాన్ని సొమ్ముచేసుకోవా'లనే ధోరణి, చేసిన సేవకు ప్రతిఫలంగా ఏదో గిట్టుబాటు చేసుకోవాలనే ఆలోచనా ఈనాడు ప్రతిచోట రెచ్చిపోతున్నాయి. భగవదారాధనలోకూడ పేరు ప్రఖ్యాతులకై ప్రాకులాట కనబడుతున్నది. దేవాలయాల్లోని శిలాఫలకాల్లో కూడ దాతలపేర్ల ప్రదర్శనే. ఒక పర్యటనలో ఒక స్వామీజీ నాతో ఉన్నారు. ఆయనదగ్గర ఉన్న పాత్రపై ఒకపేరు చూచినాను. ఆ పేరు ఆయనదిగాని, ఆయన ఆశ్రమానిదిగాని కాదు. విషయం ఏమిటని అడిగాను. అటువంటి అనేకపాత్రలను ఆశ్రమానికి బహూకరించిన వ్యక్తిపేరు అది అని సమాధానం చెప్పినాడు. దీన్ని 'దానం' అనగలమా? ఏదో ప్రతిఫలాన్ని పొందాలనే తలంపుతో చేసిన దానం – పేరుకోసం చేసినదైనా సరే

దానంకాక వ్యాపారమే అవుతుంది. సంఘంలో ఇట్టి బేరసారాలకు అవకాశమే లేదు. డబ్బు మూలుగుతూ ఉండేవాళ్ళు దేవాలయానికిచ్చిన 'దానం'కన్న ఏసుక్రీస్తు భావించినట్లు నిరుపేద ముదుసలిస్త్రీ ఇచ్చిన చిన్నినాణెం మరింత ఉదారమైనది, ఉదాత్తమైనది. నిజమైన శ్రద్ధాభక్తులతో సమర్పించిన దాన్ని మనమూ అట్లాగే భావిస్తాం.

## విజయానికి పునాది

సంఘంలో రూపొందిన వివిధ పద్ధతులు, సంప్రదాయాలు అన్నీ అట్టి ఆత్మార్పణభావనవల్ల ప్రేరితమైనవే. ఒక గంటసేపుశాఖ ఈ భావనకు పుట్టినిల్లు.

ఒక వృద్ధస్త్రీ తన యింటిపనులన్నిటినీ ఎడమచేతితోనే చేసుకుంటోంది. విషయమేమిటని అడిగాను. తన కుడిచేతిని ఒక సంవత్సరం పాటు మీదుకట్టినానని, అంతవరకు ఆచేతిని పూజచేయటానికి మాత్రమే వినియోగిస్తానని సమాధానం చెప్పింది. అది ఎంతో సామాన్యమైన నియమమే అయినప్పటికీ, మనస్సును పరిపరివిధాల ఆకర్షించే దైనందిన వ్యవహారాలన్నిటిమధ్యలోకూడ, భగవంతునిపై భక్తిభావనను నిలుపుకునేటందుకు ఎంతచక్కని ఆలోచన! శాఖలోని 'ఒకగంటసమర్పణ' వెనుక నున్న ఈ భావనే వ్యక్తులను తీర్చిదిద్ది, వారిని యావజ్జీవితమూ నిష్ఠతో కార్యనిమగ్నులయ్యేట్లు చేస్తుంది.

సంఘం భావించే మహోజ్జ్వల, బృహత్తర సామాజికపరివర్తనాన్ని స్వల్పమైన ఒకగంట కార్యక్రమం సాధించగలుగుతుందా అని సందేహపడుతుంటారు. శుష్కోపదేశాలనుగాక, సజీవోదాహరణలనే ప్రజలు అనుసరిస్తారనేదిసర్వసామాన్యమానవానుభవంలోరూఢిఅయినవిషయమే. ఈ గంటసేపుశిక్షణవల్ల మూర్తీభవించినజాతీయశీలంగావ్యక్తులురూపొందుతారు.

వారు తమయొక్క అమోఘశక్తివల్ల ప్రజలను ఆకర్షించి తమమార్గంలోకి రప్పిస్తారు.

శ్రీరామకృష్ణుని జీవితంలో ప్రబోధాత్మకమైన ఒకసంఘటన జరిగింది. ఒకనాడొకస్త్రీ తనబిడ్డను ఆయనవద్దకు తీసుకవచ్చింది. తనబిడ్డకు తీపిఅంటే అంతులేనిఇష్టమనీ, అందువల్ల ఆరోగ్యం పాడయిపోతోందనీ, కాబట్టి ఆ వ్యామోహాన్ని పోగొట్టుమని ఆయనను కోరింది. శ్రీరామకృష్ణుడు ఒకవారం పిదప రమ్మని చెప్పినాడు. ఆమె అట్లాగేవచ్చింది. కాని ఆమెను మరికొన్ని రోజులతర్వాత రమ్మని ఆయన చెప్పిపంపినాడు. మళ్ళీ ఆమె వచ్చినపుడు శ్రీరామకృష్ణుడు ఆబిడ్డను తనవద్దకు పిలిచి, 'బాబూ! మిఠాయిలు ఎక్కువగా తినడం మంచిదిగాదు. మానివేయు'మని చెప్పినాడు. వెంటనే ఆబిడ్డ నేనింక తినననీ వాగ్దానం చేశాడు; నాటినుండి మిఠాయి తినడం మానివేశాడు. దీన్ని గమనించిన రామకృష్ణుని శిష్యులు 'స్వామీ! మొదటిసారి వచ్చినపుడే ఆబిడ్డను మిఠాయి తినవద్దని ఎందుకు చెప్పలేదు? ఆమెను మూడుసార్లు ఎందుకు తిప్పించినా'రని అడిగినారు. అందుకు శ్రీరామకృష్ణుడు 'చూడండి! నాకూ మిఠాయిలంటే మోజేగదా! అటువంటప్పుడు మిఠాయిపట్ల మోజు విడచిపెట్టుమని ఆబిడ్డకు నే నెట్లాచెప్పగలను? ఒకవేళ నే నట్లా చెప్పినప్పటికీ, నామాటలు ఆబిడ్డమీద ఏమి పనిచేస్తాయి? కాబట్టే ఆమెను మరొకసారి రమ్మన్నాను. ఆ వ్యవధిలో దాన్నిగురించి ఏమాత్రం ఆలోచించలేకపోయినాను. కాబట్టి మళ్ళీరమ్మని చెప్పవలసివచ్చింది. మిఠాయి అంటే నాకున్న మోజును తుడిచిపారవేసినతర్వాతనే ఆ పిల్లవాడికి ఉపదేశించే అర్హత నాలో ఉన్నదని భావించాను' అని చెప్పినాడు.

మహాశక్తుల, మహోద్యమాల ఆవిర్భావాలన్నీ అసంఖ్యాకమైన స్వల్పప్రయత్నాల ఫలితంగా ఏర్పడినవే అనేది అనుభవంలోని మరొక యథార్థవిషయం.

మనవా డొకడు యాత్రచేసివచ్చి తన అనుభవాలను వివరించాడు. అతడు ఒక ముస్లిం 'పీరు' యొక్క సమాధినిగూడ దర్శించినాడు. సమీపంలో ఉన్న ఒక పెద్ద రాతిని ఎత్తుమని అక్కడ ఉండే మౌల్వీ చూడవచ్చినవారిని అడుగుతుండేవాడు. వాళ్ళు ప్రయత్నించి విఫలులైన తర్వాత ఆతడు 'మీరందరుకలిసి మీచేతులన్నీ ఆరాతిక్రింద పెట్టి 'పీరుసాహెబ్‌కి జై' అని కేకవేస్తూ దానిని పైకెత్తు'డని ఆదేశించేవాడు. వాళ్ళు ఆవిధంగా చేయగానే ఆ రాయి ఒక్కసారిగా పైకిలేచేది! అదంతా ఆ పీరుయొక్క 'అద్భుతశక్తి' అని భావించేవారు. ఆ 'అద్భుతా'న్నిగురించి విన్నతర్వాత నేను కొంతమంది స్వయంసేవకులను పిలిచి, ఆ రాతికన్న మరింత పెద్దరాతిని చూపించి దానిక్రింద ఒక్కొక వ్రేలే ఉంచండని చెప్పినాను. ఆతరువాత "జయ్" అని కేకవేస్తూ దానిని ఎత్తండని చెప్పినాను. ఆ రాయి 'ఆ పీరురాతి'కన్న ఎంతోపైకి లేచింది! దాంతో ఆ పీరుసాహెబ్‌యొక్క అద్భుతశక్తిలోని బండారం బయటపడింది! అల్పములయిన అనేక ప్రయత్నాలను ఒకే సమయంలో సమన్వయ పరచడంలోనే ఆ శక్తిరహస్యం ఇమిడిఉంది. 'జయ్' కారము కేవలం దానికి సహాయకం మాత్రమే. క్రమశిక్షణయుతులు, నిష్ఠావంతులునైన లక్షలకొలది వ్యక్తులు రోజుకొకగంటను సమర్పిస్తే వారు మన జాతీయ జీవనంలో అద్భుతాలను సృష్టించగలరు.

## ఏకతా బీజం

ఇక, మన కోట్లకొలది ప్రజలనందరనూ సంఘస్థానానికి చేర్చి వాళ్ళందరినీ దైనికశాఖాకార్యక్రమాల్లో పాల్గొనేట్లు చేయటం ఆచరణ సాధ్యమా అనేప్రశ్న ఒకటి ఎదురవుతుంది. దానికితోడు సమాజంలోని సగ భాగానికి-అంటే స్త్రీలకు-దైనికశాఖాకార్యక్రమంలో ప్రవేశంలేదు. అనేక అనివార్యకారణాలవల్ల నియమపూర్వకమైన శాఖాశిక్షణలో పాల్గొనలేనటు వంటి ముసలివారు, పసిపిల్లలు, మరికొందరు-ఒక పెద్దవర్గంకూడా ఉంది. అటువంటప్పుడు నిత్యకార్యక్రమమైన ఈ వ్యక్తినిర్మాణపథకంద్వారా

సమాజం మొత్తాన్ని పునస్సంఘటితంచేసే కృషి ఎంతవరకు సాధ్య పడుతుంది ?

ప్రతిదినం గంటసేపు జరిగే శాఖాకార్యక్రమంగాక సంఘకార్యంలోని ఈ ప్రముఖాంశాన్ని పూరించేనిమిత్తమై స్వయంసేవకులు తమ సౌశీల్యం తోనూ, సర్వస్పర్శియైన ప్రేమభావనతోను, క్రమశిక్షణ, సమర్పణలతో కూడిన సేవాభావంద్వారాను మన సమాజంలోని తోటిసోదరులతో కలసిమెలసి వాళ్ళ సుఖదుఃఖాల్లో పాలుపంచుకొంటూ, వాళ్ళ హృదయాల్లో దృఢవిశ్వాసాన్ని ప్రేరేపించగలరు. ఆవిధంగా స్వయంసేవకుల, వారి సానుభూతిపరుల, మిత్రుల గృహాల్లో స్త్రీపురుషులు, బాలురు, వృద్ధులుగూడ సంఘభావనతో ప్రభావితులౌతారు. ఆప్రాంతంలోని ప్రజలందరియొక్క సమష్టి అనురాగానికీ,దృఢనిశ్చయానికీ ప్రతీకగా శాఖ రూపొందుతుంది. అట్లా నిలకడగా, నిశ్శబ్దంగా, ప్రతినిత్యం మిగతాసమయాల్లో ఏర్పడే హార్దిక సంపర్కంద్వారా సమాజంలోని అన్నివర్గాలవారిని – శాఖాశిక్షణలో ప్రత్యక్షంగా పాల్గొనలేనివారినికూడ-కలుపుకొని ప్రేమపాశంతో సుదృఢంగా బంధించి జాతీయకార్యానికి అంకితమయ్యేట్లు చేస్తాం.

## గంగాసాగర సంగమం

ఈవిధంగా అంతులేని ఓర్పుతోనూ, పట్టుదలతోనూ స్వయం సేవకులు ఊరూరా, వాడవాడా ప్రతిహృదయాన్ని కదలిస్తారు. ప్రతిచోట జాతీయ ఏకతావాతావరణాన్ని వారు సృష్టిస్తారు. వేషభాషలు, ప్రాంతం, ఆహారం-వీటివల్ల ఏర్పడే పైపై వ్యత్యాసాలు వెలుగులు విరజిమ్మే వారి ముందు అదృశ్యమైపోతాయి. గ్రామాల్లోనూ, మన్యప్రాంతాల్లోనూకూడ అచటివారు అర్థంచేసుకునే భాషలోనే వారు మాట్లాడుతారు. సీతారాముల కథలను, మన మహాత్ముల, వీరుల ఉదాహరణలను వివరించి చెప్పుతారు. దేశవ్యాప్తంగా ఉన్న యాత్రాస్థలాలను ఉదాహరించి, వాటిద్వారా ప్రజల మనస్సులపై మన మాతృభూమియొక్క సంపూర్ణస్వరూపాన్ని, పవిత్రతను

సుస్థిరంగా ముద్రిస్తారు; ధార్మిక, సామాజిక ఉత్సవాలద్వారా విశాలమైన జాతీయసౌభ్రాత్రాన్ని ప్రజలు గుర్తించేట్లుచేసి తద్వారా జాతీయశక్తికి అక్షయనిధులుగా వారిని రూపొందిస్తారు.

తాలూకా, జిల్లా, ప్రాంత, అఖిలభారత– ఇట్లా ప్రతిస్థాయిలో కూడా స్వయంసేవకులు సమావేశమవుతుంటారు. జాతీయసమైక్యాన్ని ప్రత్యక్షంగా సాధించే శిక్షణశిబిరాలు జరుగుతాయి. ఈవిధంగా ఆదర్శప్రేరితులై, కార్యపద్ధతిలో సుశిక్షితులై స్వయంసేవకులు రాష్ట్రధర్మజ్యోతిని దేశం మూలమూలలకు తీసుకొనిపోతారు. అట్టివ్యక్తులను చూసి సామాన్యప్రజలు తాముకూడ జాతికొఱకు కష్టించి పనిచేయాలని, త్యాగంచేయాలని స్ఫూర్తిని పొందుతారు. కలిమిలేముల్లో, కష్టసుఖాల్లో ప్రజలు వారియొక్క అడుగు జాడల్లో నడవటానికి సంసిద్ధులవుతారు. జాతీయ పునర్నిర్మాణానికి యావత్తు సమాజంలోని అంతర్గతశక్తి ఆ విధంగా ఉపయోగపడుతుంది. నవోత్తేజాన్ని పొంది పునస్సంఘటితమైన జాతీయజీవనాన్నిగురించి కన్న కల నిజ మవుతుంది.

స్వయంసేవకులు ఒరవడిదిద్దిన సంప్రదాయాలను కొనసాగించేస్వయం స్ఫూర్తికేంద్రాలుగా జాతీయ జీవనంలోని వివిధరంగాలు కూడా అప్పుడే తయారవుతాయి. ఈ సంస్కారపద్ధతి తరతరాలను తీర్చిదిద్దుతుంది. ఆవిధంగా జాతీయ పునస్సంఘటనకు, పునరుత్థానానికి శాశ్వత జీవన స్రోతస్సుగా సంఘశాఖ పనిచేస్తుంది. మన జాతీయజీవనంలో సంఘం ప్రారంభించిన ఈ ప్రక్రియ శాశ్వతము, సర్వగ్రాహకమునై ఉన్నది. సుసంఘటిత జాతీయజీవన సహజస్థితిని–అంటే జాతీయసంస్కారాన్ని అందించే జీవన బీజాలకు అన్నివ్యవస్థలు, సంప్రదాయాలు బుద్ధిపూర్వకంగా నీరుపోసి దోహదంచేయడానికి కృషిచేసేస్థితి – సాక్షాత్కరించుకొన్నతర్వాత సంఘం తన ప్రత్యేకమైన సంస్థాగతనామాన్నిగాని, రూపాన్నిగాని నిలబెట్టుకోవలసిన అవసరం ఉండదు. అప్పుడు సంఘగంగ సమాజసాగరంలో విలీనమైపోయి ప్రేరణప్రదమయిన జాతీయభావనారూపంలో శాశ్వతంగా నిలిచిపోతుంది.

# 33 సఫల కార్యపద్ధతి

## 3. కార్యపద్ధతియొక్క సామర్థ్యం

కడచిన నాలుగు దశాబ్దులుగా సంఘం సాధించిన ప్రగతి, దాని సత్ఫలితాలు పరిశీలిస్తే, మహామహులైన సంఘసంస్థాపకుల దృష్టి, వ్యవహారజ్ఞత సుస్పష్టమౌతాయి. వారు రూపొందించిన పద్ధతి అత్యుత్తమమైనదని ఋజువైంది. ఇది సఫలకార్యపద్ధతి అని స్వయంసేవకులుకానివారుకూడ అంగీకరిస్తున్నారు.

### పవిత్రధూళి ప్రభావం

పంజాబులో ఒక పెద్ద సైనికాధికారి నన్ను ఒకసారి కలిసి "సంఘంలో మీరు ఇచ్చే ప్రత్యేకశిక్షణ" ఏమిటని అడిగాడు. "ఆట పాటలే" అని అన్నాను. "అదెట్లా ? దాన్ని మించిందేదో ఉండితీరాలి. ఎందుకంటే, దేశవిభజన జరిగిన ఆ గడ్డుకాలంలో సుశిక్షితులైన మాసైనికులకన్న పరాక్రమంలోను, బలిదానంలోనూ స్వయంసేవకులు మిన్నగా ప్రవర్తించినతీరు నేను స్వయంగా ఎరుగుదును. మనవాళ్ళను కాపాడటంలో, వాళ్ళలో చాలామంది తమ జీవితాలనుగూడా సంతోషంగా ధారపోశారు.

కాబట్టి వారిని అటువంటి వీరులుగా తీర్చిదిద్దిన ప్రత్యేకశిక్షణ ఏమిటో చెప్పండి" అని మళ్ళీ అడిగాడు. మన శాఖాకార్యక్రమాన్ని ఆయనకు వివరించి ఒక్కమాటలో చెప్పాలంటే మా శిక్షణ అంతా 'కబడ్డీ'యే అని అన్నాను. నా సమాధానంలో అతనికి నమ్మకం కుదిరినట్లు లేదు.

దివ్యజనని, భారతమాతయొక్క సంతానమంతా కలిసి ఆడుకుంటూ, పాడుకుంటూ ఆమె వైభవంకోసం ప్రార్థించే తావు సంఘస్థాన్. అక్కడి పవిత్రధూళికణాల ప్రభావం అట్టిది. "ఈటన్ హారోల క్రీడాస్థలాల్లో వాటర్లూ విజయాన్ని సాధించాం"అని వెల్లింగ్టన్‌ప్రభువు అన్న వాక్యం లోని భావన ఇదే.

## ఎల్లెడలా విజయమే

స్వయంసేవకుల క్రమశిక్షణకూ, సమర్పణభావానికీ ఎన్నో పరీక్షలు వచ్చాయి; వ్యక్తిని తీర్చిదిద్దేశాఖాపద్ధతికికూడ వచ్చాయి. ప్రతిపరీక్షతర్వాత స్వయంసేవకులచేవ మరింత నిగ్గుతేలింది, 1948 లో ప్రభుత్వం న్యాయాన్ని నిలువునా పాతేసి, సంఘాన్ని నిషేధించినప్పుడు, జాతీయ జీవనంలో న్యాయాన్ని, ఋజువర్తనాన్ని కాపాడటంకోసం సంఘం దేశ వ్యాప్తమైన ఉద్యమాన్ని నడపవలసివచ్చింది. ఆ ఉద్యమాన్ని అణచి వేసేందుకు ప్రభుత్వం ఎంతప్రయత్నించినా సంఘం సంపూర్ణవిజయం పొందింది. అపారమైన త్యాగ, శౌర్య, అనుశాసనాలతో వ్యక్తులను తీర్చిదిద్ది వాళ్ళను జాతీయకార్యోన్ముఖులుగా చేయడంలో సంఘకార్యపద్ధతికి ఏదీ సాటిరాదు అని ఈ విజయం నిరూపించింది.

నేడు దేశంలో హడావిడిచేసే కార్యపద్ధతులు ఎన్నోఉన్నాయి. కాని లోపలిసరుకు ఏమిటి అనేదిమాత్రం పెద్దప్రశ్నే. పెద్దగా చప్పుడుచేసే డోలు లోపలడొల్లే ! ఇతరులు ఎంత బాకాలూదినా, డప్పులు వాయించినా, వాటికి సంఘకార్యకర్తలు రవ్వంతైనా చలించరు. పునరుజ్జీవితము, పునస్సం ఘటితమునైన జాతీయజీవనాన్నిగురించి కన్న కలలు నిజంచేయటానికి సర్వసమర్థమైన కార్యపద్ధతి సంఘానికున్నది అని ఋజువైంది.

## సముచిత పద్ధతి

ఒక మహావ్యక్తి ఉన్నాడు; కాని ప్రసిద్ధుడు కాదు- గొప్పవారందరూ ప్రసిద్ధులుకారు, ప్రసిద్ధులైనవారందరూ గొప్పవారు కారుకదా! ఒకప్పుడు ఒక ఐరోపీయుడు ఆయనతో అన్నాడు: "మీ హిందువుల దుస్తులు ఎంత విచిత్రమైనవి! ధోవతి కట్టుకుంటారు; పోరాటంవస్తే లుంగచుట్టుకుని బోర్లపడతారు". అప్పుడాయన ఘాటుగా అన్నాడు: "మేము కయ్యానికి కాలు దువ్వేవాళ్ళం కాదే? మాకు సంస్కారం ఉంది. విశ్వశాంతి మా ధ్యేయం. ఓం శాంతిః శాంతిః శాంతిః అనేది మా ఆదర్శం. తదనుగుణం గానే మేము వస్త్రధారణ చేస్తాం. మీకు మనశ్శాంతి ఉండదు. ఎప్పుడూ ఇతరులపై కత్తులు నూరుతూ ఉంటారు. కనుకనే మీదెప్పుడూ సైనిక వేషం. మేమో నిర్భీకులం, శాంతికాముకులం. కనుక మా దుస్తులు మాకు అనుగుణంగా ఉంటాయి. మమ్మల్ని కవ్వించినప్పుడు మాత్రమే సైనిక దుస్తులు ధరిస్తాం." ఎంతటి సముచిత సమాధానం!

అట్లాగే మనం స్వీకరించిన విశిష్టలక్ష్యానికి చక్కగా నప్పుతుంది మన కార్యపద్ధతి. ఉదాత్తమైన లక్ష్యం చేరుకోటానికి సూటిగా మోటుగా కనపడే మనశాఖ ఉపయోగపడ్తుందా అని మహామేధావులుకూడా సందేహపడ్తారు. మధురమైన మామిడిపండ్లు కావాలంటే మధుభాండంలో మంచిగంధం కలిపి మామిడిటెంకను అందులో ఊరవేస్తాడా తోటమాలి? ఎరువుకలిపిన మట్టిలో పాతేస్తాడు. శక్తిసౌశీల్యాల సంస్కారాలు కలిగించాలంటే మోటుగాకనిపించే పద్ధతి తప్పనిసరి అవుతుంది.

## పెద్దల బాధ్యత

దైనందిన శాఖాకార్యక్రమాల బాహ్యస్వరూపాన్ని చూస్తున్నప్పుడు ముఖ్యంగా, మన సమాజంలోని పెద్దలకు ఒక పొరపాటు అభిప్రాయం కలుగుతుంది. ఆటపాటలు, కసరత్తులు, ప్రార్థన మొదలైనవి ఏదో

బాలురకు యువకులకు మాత్రమే అనీ, వీపుతట్టి ఆశీర్వదించి అండగా ఉండటంవరకే తమబాధ్యత అనీ వాళ్ళఉద్దేశ్యం. అట్టి ఆలోచన వస్తే సంఘంయొక్క మూలభావనను విస్మరించినట్లే. మనం సమాజాన్ని పునస్సంఘటితం చేస్తున్నాం అంటే ప్రస్తుత సమాజాన్నే అని దాని అర్థం. 'నేటిసమాజం' - అంటే పెద్దలు, గృహస్థులు అని. పిల్లలు 'నేటి సమాజం' అని ఎవరూ అనరు. ఒకవీధిలో కొందరుపిల్లలు దిసమొలతో ఆడుకుంటున్నా రనుకుందాం. అదిచూచి, ఆఊళ్లో ప్రజలు, దిసమొలతో వీధుల్లోఆడుకుంటారు అని ఎవరైనా అంటారా? పిల్లలది రేపటితరంకదా. కాబట్టి సమాజాన్ని సంఘటితం చేసేబాధ్యత ప్రస్తుతతరంమీదనే, అంటే పెద్దల భుజస్కంధాల మీదనే పూర్తిగా ఉంది. జాతీయ పునస్సంఘటన మహాకార్యంలో వాళ్ళే అగ్రగాములు కావాలి.

ఈమాట అనగానే, ఈపని తమవల్లకాదు అనటానికి సామాన్యంగా పెద్దలు రెండు కారణాలు చూపుతారు. తమకు తీరికలేదు అనేది మొదటిది. కాని సామాజికరంగంలోకూడా బాధ్యతను చేపట్టటానికి నిరంతర కార్యనిమగ్నుడైన సమర్థుడు సమయం కేటాయించుకోగలడనేది వాస్తవం కాదా? ఫలానాపని తనది అని ఒకసారి అనుకుంటే, తన కార్యక్రమా లన్నింటినీ సర్దుబాటు చేసుకొని, దానికికూడా కొంత సమయాన్ని అతడే కేటాయించగలడు. సోమరిపోతు మాత్రమే తీరికలేదంటాడు. అసంగతంగా కనపడ్డా, ఇదిమాత్రం నిజం.

తలఎత్తుకుతిరిగే పెద్దమనుషులు కనుక, తాము పిల్లల్లాగ పొట్టి లాగులు వేసికొని శారీరక కార్యక్రమాల్లో పాల్గోవటం తగదు అనేది వారు చెప్పే సాకుల్లో రెండవది. అది తమ హోదాకు తగదు అనుకొంటారు. కాని ఇది సరైన దృష్టేనా? మనకు ప్రతిష్ఠ గనుకఉంటే, అది మన వ్యక్తిస్వ యోగ్యతనుబట్టి ఉంటుందా లేక దుస్తులనుబట్టి ఉంటుందా? అది మన దుస్తులనుబట్టి ఉంటే, ఆ ఘనత దర్జీదో, ధోబీదో! మరి మనలో నిజమైన

విలువగానీ, ప్రతిష్ఠగానీ ఏమాత్రం లేనప్పుడు స్వతస్సిద్ధమైన ఆ లోపాన్ని తీర్చటానికి పైపై సింగారాలు ఏమాత్రం అక్కరకురావు.

ఈ సందర్భంలో మనం గుర్తుపెట్టుకోవలసిన ప్రముఖవిషయం ఒకటి ఉంది.

*యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః*

(శ్రేష్ఠులు ఆచరించినదాన్నే సామాన్యులు అనుసరిస్తారు.

అని భగవద్గీత చెప్తోంది. సమాజంలో నిజమైన విలువ, ప్రతిష్ఠ గల పెద్దలు ఒక ఉదాత్తఆదర్శానికి అనుగుణంగా ఒక విశిష్టమైన పద్ధతిలో వ్యవహరిస్తే అదే నల్గురినీ ఆకట్టుకుంటుంది; దాన్నే అందరూ గౌరవిస్తారు. నిజానికి దానివల్ల వారిప్రతిష్ఠ ఇనుమడిస్తుంది. ఉదాహరణకు మహాత్మాగాంధీ, పండిత మాలవ్యాలు 'గుండ్రబల్ల' సమావేశంలో పాల్గొనేందుకు ఇంగ్లండుకు వెళ్ళినప్పుడు వారు స్వదేశీపద్ధతిలోనే వస్త్రాలు ధరించినారు. కాని దానివల్ల వారి ప్రతిష్ఠకు ఏభంగమూ కలుగలేదు; పైగా వారిపట్ల గౌరవం పెరిగింది.

భ్రష్ఠత, విఘటనల విషక్రిములతో నిండిపోయిన నేటి వాతావరణంలో మొగ్గవంటి యువతరాన్ని సంరక్షించవలసిన ప్రత్యేకబాధ్యత ఈనాటి పెద్దతరంపై పడింది. అట్లా చేస్తేనే, సహజసిద్ధమైన శ్రేష్ఠతావైభవాల శిఖరాగ్రాలకు జాతిని చేర్చగలిగిన ఉదాత్తము, సాహసోపేతమునైన మానవులుగా మన యువత రూపొందగలదు. కనుక సంఘం ఇన్నిసంవత్సరాలుగా విజయవంతంగా కొనసాగిస్తున్న జాతీయ పునస్సంఘటనోద్యమానికి సజీవసాధనాలుగా, చక్కని ఉదాహరణలుగా నిత్యజీవితంలో తమను తాము తీర్చిదిద్దుకోవాలి.

## శుభశకునము

"హిందువులు సామూహికంగా ప్రతిదినం ఉదయం, సాయంత్రం పదినిముషాలపాటు ప్రార్థనచేస్తే, వారు అజేయమైన సమాజంగా రూపొందు

తారు." అని వివేకానందస్వామి యొక్క అనుంగు శిష్యురాలగు సోదరి నివేదిత ఒకసారి చెప్పింది. నివేదితమైన ఆ ఆత్మ కన్నకలలు నిజం అవుతాయనటానికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘ దైనిక శాఖ శుభసూచకం.

దేశవ్యాప్త సమైక్య సౌభ్రాత్రాన్ని నిండుగా, నిలకడగా, నిష్ఠతో నిత్యమూ నిర్మించి, జాతి పవిత్రపాదాల చెంగట అనుశాసనంతో అంకితమవుతుంది మన దైనిక శాఖ. దాని ఆహ్వానాన్ని అందుకుని మనమంతా కార్యోన్ముఖులం కావాలి.

# 33. సఫల కార్యపద్ధతి

## 4. గురుదేవుని ఆహ్వానం

శ్రీగురుపూర్ణిమ అనీ, వ్యాసపూర్ణిమ అనీ వ్యవహరించే– శుభ దినం మనకు ఎంతో ప్రముఖ పవిత్ర పర్వం. అనంత విజ్ఞాననిధులైన వేదాలను విభజించి, సువ్యవస్థితం చేసి మనకు అందించినవాడు మహామహు డైన వ్యాసమహర్షియే. యుగయుగాలుగా భారతవర్షంలో వికసించిన ఉత్తమమైన సద్గుణ సంపత్తిని ప్రపంచానికి ప్రకటించినదానిలో అంతర్లీనమై యున్న ఆలోచనకూ ఆచరణకూ నడుమ గల మనోహర సమన్వయాన్ని ఆయన మన కందించాడు. ఆయన కృషి మనకు మాత్రమేగాక మానవ జాతి కంతకు కూడ మార్గదర్శనం చేసే దీపస్తంభం లాంటిది. కాబట్టే వేదవ్యాసుని– జగద్గురువు అంటే ప్రపంచ ప్రబోధకుడని చెప్పటం సము చితం. ఇందుచేతనే గురుపూజని, వ్యాసపూజ అనికూడా చెప్పుకుంటున్నాం.

ఈ రోజున మనం మన గురువునకు– వారెవరైనప్పటికీ అర్చన చేసి, వారి పాదాలవద్ద మన వినయపూర్వక సమర్పణ చేస్తాం. వారి ఆశీస్సును కోరి– వారి మార్గదర్శకత్వపు వెలుగుల్లో మన జీవన లక్ష్య సాధనా మార్గంలో ముందడుగు వేసేందుకు దృఢనిశ్చయం చేసుకుంటాం.

సంఘటన కార్యవ్యవస్థకు సంబంధించినంతవరకు మనం ఏ ఒక్క వ్యక్తినీ గురువుగా భావించలేదు. మన శాస్త్రాలు గురువు యొక్క లక్షణాలను ఉజ్వలపదజాలంలో ప్రశంసించాయి. గురువునకు సాక్షాత్తు దైవంతో సమానమైన స్థానాన్నిచ్చాయి. అట్టి గురువును ఒక మానవునిలో చూడ గలగటం దాదాపు అసంభవమే. ఏ మానవుడైనా ఏదో ఒక దోషంగానీ, లోపంగానీ లేకుండా పరిపూర్ణుడుగా వుంటాడని మనం ఊహించలేము. మానవునిది అశాశ్వతమైన అస్తిత్వమే. అతడు తరతరాలకూ, ఒక జాతి కంతకూ శాశ్వతమైన మార్గదర్శకుడు కాలేడు

అందుచేతనే సంఘంలో మనం మన జాతీయ వారసత్వంలోని మహోన్నతమూ, మహోదాత్తమూనైనదంతనూ ఒక్కుమ్మడిగా ప్రతిబింబించగల ఒక ప్రతీకను గురువుగా స్వీకరించాం. అదే మన పవిత్రమైన భగవాధ్వజం.

## యజ్ఞభావనకు అదే ప్రతీక

యజ్ఞము- అంటే త్యాగభావన- మన సాంస్కృతికవారసత్వంలో కీలకమైన స్థానం కలిగి వుంది. యజ్ఞ పదానికి అనేక అర్థాలున్నాయి. సమాజ పునరుజ్జీవన కార్యంలో తన వ్యక్తిగత జీవితాన్ని సమర్పణ చేయటమే యజ్ఞం. సద్గుణాలనే అగ్నిజ్వాలల్లో, మనలోని అయోగ్యమూ, అవాంఛనీయమూ, అపవిత్రమూ ఐనవన్నీ ఆహుతులుగా సమర్పించడం కూడా యజ్ఞమే. అలాగే జ్వాజ్వల్యమానమైన భక్తి, సమర్పణ, సేవ, తపస్సుల మార్గానికంకితం కావటమే యజ్ఞం యొక్క పరమతత్వం. యజ్ఞానికి అధిదేవత అగ్ని. అగ్నిజ్వాలలు అగ్నికి ప్రతీకలు. పవిత్రమైన భగవాధ్వజం- అరుణారుణ కాంతుల యజ్ఞజ్వాలలకు ప్రతీక.

## భగవాధ్వజం

మనం శ్రద్ధాభావనను ఆరాధించేవారమేగాని- మౌఢ్యాన్ని గాదు. మనం విజ్ఞానపు భక్తులమేగాని- అజ్ఞానానికి గాదు. మన మునులు, ఋషులు అజ్ఞానాన్ని తొలగించుకొని సత్యము, చిరంతనమూనైన విజ్ఞాన సముపార్జనకై తీవ్రమైన తపస్సును చేసారు. చీకటి అజ్ఞానానికి గుర్తు. సూర్యుడు జ్ఞానజ్యోతికి గుర్తు. మన ప్రాచీన సాహిత్యంలో సూర్యుడు- సూర్యనారాయణుడు- ఏడు గుర్రాలు లాగే రథం మీద కూర్చుండినట్లు వర్ణింపబడింది. ఆయన ఉదయించటానికి ముందే- ఆయన రథంపై ఎగురుతున్న కాషాయధ్వజం- తూర్పుదిక్కున రంగుల కాంతులు విర జిమ్ముతూ కనిపిస్తుంది. చీకటిని చిల్చుకుంటూ, ఉదయకాంతుల ఆగమ నాన్ని ప్రకటిస్తూ సూర్యోదయ సమయంలో తూర్పుదిక్కు విరజిమ్మే అరుణకాంతుల కది ప్రతీక. సూర్యభగవానుని ఆ ధ్వజమే- భగవానుని ధ్వజం- అదే పదం కాలక్రమంలో భగవాధ్వజమయింది.

మానవ జీవన వికాసంలోని అత్యున్నత స్థాయీ- నాలుగవదీ- చివరదీ అయిన ఆశ్రమంలో అంటే- పరిపూర్ణ త్యాగ, సేవాభావాలు అవ సరమైన- సన్యాసం- ఇందు ప్రతిబింబిస్తుంది. 'సన్యాసి' ఆత్మార్పణమనే అగ్నిజ్వాలల మార్గంలో తొట్రుపాటు లేకుండా పయనించాలి. అతనికి సదా త్యాగమయ జీవితాన్ని గుర్తు చేసేదిగానే కాషాయవస్త్రాన్ని సన్యాసి ధరిస్తాడు.

## నిజమైన ఆరాధన

ఈ పవిత్ర భూమిలో తరతరాలలో వికసించిన ఉత్తమోత్తమ సిద్ధాంతాలకు ఆచారాలకూ ప్రతీకగా భగవాధ్వజం వుంటూ వున్నది. ఈనాడు అట్టి గురువును ఆరాధించేప్పుడు మనం ఎట్టి మనఃస్థితిని పెంపొం

దించుకోవాలి? పూలు, గంధం సమర్పించటం, హారతులీయటం, కేవలం బాహ్యాచారాలు మాత్రమే. గురువులో రూపుకట్టిన సద్గుణాలను మన జీవితంలో అలవరచుకునేందుకు ప్రయత్నించటంలోనే నిజమైన పూజా సాఫల్యం వున్నది. కాబట్టి, సాక్షాత్తు గురువుతో మరింత తాదాత్మ్యం చెందటం నిజమైన ఆరాధన. శివుడవై శివుని పూజించుకోవాలి– "శివో భూత్వా శివం యజేత్" అని ప్రకటించే ప్రాచీన ప్రబోధం ఒకటుంది.

ఈ గురుపూజాదినం నాడు ధనరూపంలో మనం సమర్పణ చేసేది జీవితమంతా మనం సంపాదించే డబ్బు. అది మన చుట్టూవున్న సమాజం యొక్క సహకారం వల్లనే సాధ్యమయిందనే విషయాన్ని గుర్తు చేస్తుంది. కేవలం ధనసంపాదనను మాత్రమేగాక మన సంపూర్ణ భద్రత, సౌఖ్యములు కూడా సమాజమే సమకూరుస్తోంది. ఆ విధంగా సమాజ ఋణాన్ని, మనకు వీలైనంత అధికంగా తీర్చుకోవటం మన విధి. నిజానికి సమాజ ఋణాన్ని తీర్చుకునేందుకే మన శరీరాన్నీ, మనస్సునూ, బుద్ధిని సమర్పిస్తూ రోజుకొక గంట సమయం వెచ్చించే దైనందిన శాఖాకార్యక్రమం. సంఘంలో నేర్పే స్వాత్మార్పణ భావానికి అనుగుణంగానే, గురుదక్షిణ పద్ధతి కూడా రూపొందింది.

# 34. వ్యక్తిగత - జాతీయ శీలాలు

మన జాతీయపరంపరలో ఎల్లప్పుడూ శీలానికి అత్యంత ప్రముఖస్థానం ఉంది. శీలం ద్విముఖమైంది. వ్యక్తిగతమైనది ఒకటి; మనకు సమాజంతో ఉన్న సంబంధస్వరూపంగ వ్యక్తమయ్యేది రెండవది. శీలంలోని ఈ రెండు అంశాలుకూడ పవిత్రంగా, కళంకరహితంగా ఉండాలి. కాని ఒకవ్యక్తి సామాజికరంగంలో చక్కగా పనిచేస్తుంటే, అతని వ్యక్తిగత వ్యవహారంతో మనకు సంబంధం ఏమిటి? అతనికెన్నో వ్యసనా లుండవచ్చు. కాని ప్రజలకు మేలుచేస్తుంటే అతని వ్యక్తిగత జీవితంలోకి మనం ఎందుకు తొంగిచూడాలి? అని ఈరోజుల్లో అనేకులు అంటుంటారు.

## మన తలంపు

మనసంస్కృతిలో వ్యక్తిగతశీలంయొక్క పవిత్రతకు ఎల్లప్పుడూ అత్యున్నతస్థానం ఉంటూనే వచ్చింది. స్వార్థపరుణ్ణి, త్రాగుబోతును, కాంతా కాంచనాలకు దాసుడైనవాణ్ణి, మన మెన్నడూ తత్త్వవేత్తగా పరిగణించలేదు. మనదృష్టిలో తత్త్వవేత్త అంటే అన్నిటికన్న ముఖ్యంగా ఒక పరమ పవిత్రుడు, ఆత్మసంయమనశీలం కలవాడు అని అర్థం. మన తత్త్వానికి, సంస్కృతికి ప్రతినిధులైన నాటి మహర్షులనుండి నేటి మహాత్ములవరకు అందరూ పవిత్రులై మహోన్నతసత్యాల కనుగుణమైన త్రికరణశుద్ధ

జీవనాన్ని నడిపినవారే. అట్టివ్యక్తులు మాత్రమే మన జాతీయపరంపరకు ఉజ్జ్వలప్రతీకలు. కాని ఈనాటి సామాజిక కార్యకర్తల తీరు వేరు. ఒక వ్యక్తికి భూరివిరాళాలిచ్చినా, గంభీర ఉపన్యాసాలిచ్చినా, లేదా ప్రజాకార్యనిమిత్తమై పలుమార్లు కారాగారశిక్ష అనుభవించినా చాలు; అతని వ్యక్తిగతజీవితం ఎంతహేయమమైన దైనప్పటికీ క్షమించవచ్చు, అని సాధారణంగా అనుకొంటూ ఉంటారు.

బాహ్యప్రపంచంలో కూడా గొప్పతనమంటే ఈ రకమైన అభిప్రాయమే నెలకొనివుంది. జాతినిర్మాతలూ, జాతీయవీరులూ అని ప్రశంసల నందుకున్న ఎంతోంది వ్యక్తుల యొక్క జీవితాలు పరిశీలిస్తే, వారు తమ వ్యక్తిగత శీలం విషయంలో ఎంత దిగజారిపోయారో తెలుస్తుంది.

## సాధనాల పవిత్రత

ఐనా 'సమాజసంక్షేమ'మనే సాధ్యాన్ని సాధించేందుకు 'సాధనం' ఐన 'వ్యక్తి'కూడ నిష్కళంకంగా ఉండితీరాలని మన సంస్కృతి ప్రబోధిస్తోంది. సాధనం ఒక పాత్రవంటిది. అది మౌలికంగా కిలుంపట్టివుంటే, దాంట్లో నీరు మనం త్రాగినప్పుడు, ఆ నీటి ద్వారా, మన శరీరంలో రోగం ప్రవేశిస్తుంది కనుక నీరు ఎంత పరిశుభ్రంగా ఉండాలో చెంబు కూడా అంత పరిశుభ్రంగా ఉండితీరాలి. సాధ్యమే సాధన యొక్క ఔచిత్యాన్ని నిర్ణయిస్తుందని అంటూఉంటారు. ప్రజలను ఆకర్షిస్తున్నట్లు కనపడుతున్న సిద్ధాంతాల్లో చాలా భాగం ఈ కోవకు చెందినవే. అంటే ఏ సాంఘికపరివర్తనానైనా సాధించడానికి 'సాధనం' అయిన వ్యక్తి అప్రధానుడైపోతున్నాడు. కాబట్టే ఎక్కువగా రాజకీయజీవులు చూపిన లక్ష్యాలను సాధించే ప్రయత్నంలో మానవత్వానికి తిలాంజలి ఇవ్వటంవల్ల, యావత్ప్రపంచంలోనూ అత్యధిక వేగంతో మానవుడు పతనమైపోతున్నాడు. కాని మన సంస్కృతి ఇచ్చిన

ఆదేశం మాత్రం వేరు. శ్రీరాముడు, శివాజీ జాతివిషయంలో వారు సాధించిన విజయాలవల్ల ఎంతటి గౌరవనీయులో, ప్రేవేట్టుచూపటానికి వీలులేని వ్యక్తిగతశీలంవల్లగూడ అంతటి గౌరవనీయులే. సామాజిక రంగంలో వ్యక్తి మంచిగా ఉంటే చాలు, అతని వ్యక్తిగతజీవితంలోని చిన్నచిన్న లోపాల్ని లక్ష్యపెట్టనక్కరలేదనిగాని, లేదా వాటిని సమర్థించవచ్చునిగాని అనుకోవటం మన స్వభావానికే విరుద్ధం.

అయితే, ఈ రెండుదుర్గుణాల్లో ఏదో ఒకటి తప్పనిసరి అయినప్పుడు సమాజహితానికి అడ్డురానంతమేరకు వ్యక్తిగతశీలంలోని, కొన్ని లోపాలను మనం విధిలేక సహించామేగాని, సమర్థించలేదు.

చెడుసాధనాలు సత్ఫలితాలను ఎక్కువకాలంపాటు ఇవ్వలేవు. చెడ్డ సాధనాలు కొన్నిసమయాల్లో మంచిఫలితాల నిస్తున్నట్లు కనిపించినాగాని అవి తాత్కాలికాలు మాత్రమే. వడగళ్ళవానలో చిక్కుకున్నవాడు చలికి వణికిపోతూ వెచ్చదనానికై వహ్నిలో దూకినట్లుంటుందది. ఒళ్ళు వేడెక్కుతుందిగాని, వెంటనే మాడిదగూడా అవుతుంది. ఈనాడు దేశంలో వివిధ వ్యక్తులు, పక్షాలవారు ఏవిధంగా ఎన్నికలప్రచారం చేస్తున్నారో చూస్తున్నాం. 1957లో జరిగిన ఎన్నికల ఉదంతం ఒకటుంది. 'ఎన్నికల ప్రచారంలో ఎందుకింత దిగజారిపోయావు' అని ఒక కాంగ్రెసు అభ్యర్థిని అడిగాను. చెడును చెడుతోనే ఎదుర్కోవాలని అతడన్నాడు. "బొగ్గులవల్ల తారు తెల్లబడుతుందా ? ఇట్లాగైతే నిజాయితీగల పెద్దమనిషి ఒక్కడూ మిగలని పరిస్థితి ఏర్పడుతుంది. మనం కొంతకాలం బాధపడవలసివచ్చినా దుర్మార్గులను ఎదిరించవద్దా ?" అని అన్నాను. నేడు ఎంతటి దౌర్భాగ్యం దాపురించిందంటే, కుయుక్తుల్లో ఎంతగా ఆరితేరితే అంతగా పైమెట్టు ఎక్కుతున్నారు. కనుకనే వ్యక్తిగతశీలంయొక్క ప్రాధాన్యాన్నిగురించి, అంటే సాధనాల పవిత్రతగురించి ఎంతచెప్పితేమట్టుకు ఎక్కువ చెప్పినట్లు?

## ప్రచ్ఛన్న ప్రమాదం

వ్యక్తి శీలవంతుడై విషయలోలుడైతే అతడు జాతికి ప్రమాదం కలుగజేస్తాడు. మనచుట్టూ అనేక జాతులున్నాయి. ఏ రెండు జాతులమధ్య శాశ్వత మిత్రత్వంగాని, శత్రుత్వంగాని ఉండదు అని చరిత్ర చెపుతోంది. వాటిమధ్య సంబంధాలు మారుతూ ఉంటాయి. ప్రతి దేశం తన స్వప్రయోజనాలను సాధించుకునేందుకు ఎంతటి నైచ్యానికైనా ఒడిగట్టుతుంది. కాబట్టి ఒకవిధంగా అవన్నీ మనకు 'ప్రచ్ఛన్నశత్రువులే.' నలుగురిమధ్య మాట్లాడేటప్పుడు స్నేహం, ప్రపంచశాంతి, ప్రపంచసౌభ్రాత్ర సద్భావనలనుగూర్చి ప్రశంసింపనూవచ్చు, వాటికొరకు కృషిచేయనూవచ్చు. కానీ దేశభవిష్యత్తును రూపొందించే నాయకులుమాత్రం కఠోరమైన ఈ ప్రాపంచికసత్యాన్ని ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి. దీన్ని విస్మరించడం మహాప్రమాదం.

ఈ ప్రచ్ఛన్నశత్రువులుగాని, మనచుట్టూ ఉన్న ప్రత్యక్షశత్రువులు గాని, మన బలహీనతను వినియోగించుకునేందుకు యత్నిస్తారు. ఇందుకు ఉదాహరణగా మొదటిప్రపంచయుద్ధంలో జరిగిన ప్రసిద్ధ ఉదంతం ఒకటుంది. 'మిత్రరాజ్యా'ల యుద్ధాధినేతలు చర్చించుకుని తీసుకునే నిర్ణయాలు, పథకాల వివరాలు జర్మనులు తెలిసికోగలుగుతున్నారని కొంతకాలానికి తెలిసింది. వారు తమ పథకాలను ఆచరణలో పెట్టేలోపునే శత్రువు ప్రతిక్రియ చేయటంతో ఆ పథకాలన్నీ నవ్వులపాలు అయ్యేవి. ఇట్లాగే చాలాకాలం జరిగింది. ఈ రహస్యాలు ఏవిధంగా బయటకు తెలిసిపోతున్నాయో కనుగొనేందుకు కొందరు ప్రత్యేకాధికారులను నియమించినతరువాత, ముఖ్యులైన సైన్యాధిపతుల శిబిరాలలో మాతాహారి అనే పేరుగల ఒక మహిళాగూఢచారిణి ఉన్నదని తెలిసికొన్నారు. ఆ కాముకులకు ఆమె రంభ. ఆమె సంగీతం, నాట్యం మొదలైన కళలన్నిటిలోను అందెవేసినచేయి. ఆమె వాళ్ళని వ్యామోహపరచి వారిహృదయాలు చూరగొంది: వారితోబాటే,

వారి గుడారాల్లోనే ఉండేది. ఆమె ఎదుటే వారు తమ పథకాలు స్వేచ్ఛగా చర్చించుకొనేవారు. ఆమెఅంటే వారికి ఎంతనమ్మకం! కాని ఆమె మాత్రం, ఆ పథకాలన్నిటినీ ఎప్పటికప్పుడు తనవాళ్ళకు చేరవేస్తూ ఉండేది. ఆమె ఆచూకీ కనిపెట్టి, బంధించినతరువాతనే వీళ్ళు విజయం సాధించారు. ఆ సైన్యాధికారులు నిర్దుష్టమైనశీలం గలవారై, స్త్రీజాతినంతనూ, దివ్య మాతయొక్క అభివ్యక్తిగా ప్రతిహిందువు భావించవలసినరీతిలో తలంచి నట్లయితే, వారు తమ దేశాలకు జరిగిన పెద్దనష్టాన్ని ఆపగలిగి ఉండే వారు.

## నీతికథ

పొగడ్తకు కొందరు పడిపోతారు. ఎవరైనా ప్రశంసలు కురిపిస్తే చాలు, వారు మురిసిపోయి, ఉబ్బి తబ్బిబ్బై కోరినవన్నీ చేసిపెడ్తారు. దేన్నైనా తట్టుకోవచ్చు, కాని పొగడ్తనుమాత్రం తట్టుకోవటం కష్టం. మహాభయంకరమైన విషాన్నైనా ప్రశంసాగౌరవాలకంటె తేలికగా హరించుకోవచ్చు లోకసంరక్షణార్థం, శంకరుడు మహాభయంకర విషాన్ని త్రాగినాడు; ఎట్టిహానీ కలుగలేదు. కాని అట్టివాడుకూడ, భస్మాసురుని పొగడ్తలకు పొంగిపోయి ఇబ్బందులను కొనితెచ్చుకున్నాడు! పొగడ్త మనిషిని గాలికొట్టినబంతిలా ఉబ్బిస్తుంది. ఆ బంతికి అటూ ఇటూ కాలి తాపులు తగులుతూనే ఉంటాయి. ఇంద్రుడవు, చంద్రుడవు అని స్తోత్ర పాఠాలు వల్లించి, ఎవరైనాసరే తమతమ ప్రయోజనాలను సాధించుకోవచ్చు చివరికి ఇతనికి కనువిప్పు కలుగవచ్చు, లేదా కలుగకపోనూవచ్చు.

ఈ నీతిని బోధించే ప్రాతకథ ఒకటుంది. మాంసపుముక్క ఒకటి నోటకరచుకొని ఒకకాకి చెట్టుకొమ్మమీద కూర్చుంది. ఒక నక్క ఆ చెట్టు క్రింద చేరి కాకివంక చూస్తూ 'కాకిబావా! కాకిబావా! ఎంతటి మనోహర మైన రంగు నీది! శ్రీకృష్ణుని మేనిరంగువంటి శ్యామలవర్ణం నీది. లోగడ నీవు పాడుతుంటే విన్నాను. ఆహా! గంధర్వులుకూడా నిన్ను చూచి అసూయ

పడుతారు. మరొక్కసారి, నీ దివ్యగానాన్ని వినేఅవకాశం కలిగితే నే నెంత అదృష్టవంతుణ్ణోకదా !' అంటూ పొగడ నారంభించింది. ఆ కాకి ఉల్లాసంతో ఊగిసలాడిపోయింది. "సరే! దీని కోరిక మన్నిద్దాం" అనుకొని నోరు తెరవగానే మాంసపుముక్క క్రిందపడింది. నక్క వెంటనే, 'నీపాట ఎవడికి కావాలి ?' అని చెప్పి ఆ మాంసపుముక్కను నోటకరుచుకొని పోయింది. ఈనాటి మన మహాపురుషుల్లో చాలామంది పొగడ్తలకు పడిపోతారు. ఇటువంటి సునిశితమైన ప్రశంసాయుధాన్ని వినియోగించుకొనే మోసగాళ్ళు ఎంతోమంది ప్రపంచంలో ఉన్నారు. 'నీ వెంతటి శాంతిప్రియుడవు! ఎంతటి అహింసావాదివి! ఎంతటి ఉదారపురుషుడవు! ప్రపంచంలోని అంతర్జాతీయ మహావ్యక్తుల్లో నీవొకడవు.'- ఇట్లా పొగడగానే మన నాయకులు గాలిలో తేలిపోతూ, వారు ఏ వర మడిగితే దాన్ని – అది కాలువ నీరుగానివ్వండి, ధనం, సాధనసామాగ్రిగానివ్వండి, లేదా ప్రపంచవ్యాప్తంగా జరిగే సంఘర్షణ లన్నిటిలోనూ మన సైనికులను శతఘ్నిగ్రాసంగా గానివ్వండి – ప్రసాదిస్తారు.

## అడుగడుగునా అప్రమత్తత

కాబట్టి ఎట్టిపరిస్థితుల్లోనైనాసరే జాతికి సేవ చేయగలగాలంటే ఇటువంటి బలహీనతలకు ఏమాత్రం లొంగిపోకుండా స్వచ్ఛమైన వ్యక్తిగత శీలాన్ని పెంపొందించుకోవాలి. సంఘసేవ చేస్తుంటే అందరి చూపులు అనుక్షణమూ ఆ కార్యకర్తమీదే ఉంటాయి. అతడు ఒక వీసమెత్తు కాలు జారినా, నల్గురూ ఒక్కసారి, 'ఎంతటి పతనం' అనేస్తారు. సామాన్యప్రజల్లో ఇంతకన్న చాలాతీవ్రమైన లోపాలున్నప్పటికీ వాటిని ప్రజలు పట్టించుకోరు. రంగుచొక్కా వేసికొంటే ఒకరోజైనా, పదిరోజులైనా పెద్దతేడా కనబడదు. అదే, శుభ్రమైన తెల్లని గుడ్డమీద, పడింది నీటిబొట్టే ఐనా సరే కాసేపు ఆ మచ్చ ఉండిపోతుంది. కాబట్టి మనం ఎంత ఎక్కువ పవిత్రంగా ఉండదల్చుకుంటే, అంత జాగరూకతతో అనుక్షణమూ ఉండాలి. సమాజ

మంతా మనల్ని వ్రేలెత్తిచూపటానికే కాచుకూర్చుందని అనుకొని అడుగడుగునా అప్రమత్తులమై ఉండాలి.

## 'పెద్దమనిషితరహా' కొక నమస్కారం

ఇక జాతీయశీలంగురించి పరిశీలిద్దాం. మంచి వ్యక్తిగతశీలంగల మనుష్యుల్ని ఎంతమందినో చూస్తాం. చెడు చేసేందుకు చొరవగాని, అవకాశంగాని లేక, కొందరు మంచివాళ్ళుగా, మెతకవాళ్ళుగా ఉండిపోవచ్చు. అట్టి జడప్రాయమైన, వ్యతిరేకాత్మక సౌజన్యం నిష్ప్రయోజనం. అట్టి వ్యక్తుల్నిగురించి "శ్రీ............గారు ఎంతటి పెద్దమనిషో చూడండి! వేళతప్పకుండా ఆయన ఉద్యోగానికి వెళ్తారు. సాయంత్రం ఇంటికి వస్తారు. పెళ్ళాం పిల్లలతో కబుర్లు చెప్పుకుంటారు. భోజనంచేస్తారు. నిద్రపోతారు. ఆయన ఎన్నడూ ఇతరులజోక్యం పెట్టుకోలేదు. పాతికేండ్లుగా ఆయన ఇక్కడే ఉంటున్నప్పటికీ ఇరుగుపొరుగునుగురించి ఆయన కేమీతెలియదు. వాళ్ళకుకూడ ఈయనగురించి అట్టే తెలియదు. అట్లాంటి మంచివాడు, అమాయకుడు, అణకువ గలిగిన పెద్దమనిషి మరెక్కడా కనపడడు." అని డాక్టర్‌జీ నవ్వుతూ అంటూండేవారు. కాని వెంటనే, ఇరుగుపొరుగుల సుఖదుఃఖాలు ఏమాత్రం పట్టించుకోకుండా తన సమాజానికి జరుగుతున్న అవమానాలన్నింటినీ చచ్చుదద్దమ్మలాగా సహిస్తూ ఉండే ఇట్టి 'పెద్దమనిషి తరహా'ను దుయ్యబట్టేవారు. జాతీయసమస్యలన్నిటికి మూలం ఇటువంటి పాడు మనఃప్రవృత్తియే అని వారు అంటూఉండేవారు.

పూర్వకాలంలోగూడ పవిత్రులు, సద్భావన కల్గినవారు మనదేశంలో చాలమంది ఉంటూఉండేవారు. అయినప్పటికీ గత వేయిసంవత్సరాలకాలంలో ఎడతెరిపిలేకుండా అనేకప్రమాదాలకు మనం లోనుకావలసి వచ్చింది. వ్యక్తిగతమైన ఈ అతిమంచితనమే జాతిని ఈస్థితికి దిగజార్చిందనికూడ కొందరు వక్కాణిస్తారు. అది చరిత్రను సరిగా అవగాహన చేసికోవటం కానేరదు. కాని అసలుకారణం, వ్యక్తిగతశీలంతోపాటుగా ఉండితీరవలసిన

రెండవ అంశమైన జాతీయశీలం మనలో లేకపోవటమే. మనం కేవలం ఏకాకులైన వ్యక్తులం కాము; సమాజంలోని అవిభాజ్య అవయవాలం. కనుక సమాజంపట్ల మనం వ్యవహరించే తీరులోగూడ పవిత్రశీలాన్ని వ్యక్తం చేయాలి; దాన్ని నిలబెట్టుకోవాలి. ఈ అంశాన్ని విస్మరిస్తే, వ్యక్తిలోని కేవలపవిత్రత, మంచితనం, సమాజానికి అక్కరకురావు. అంతమాత్రమే గాదు, సమాజం చల్లగాలేకపోతే, వ్యక్తిగతమైన మంచితనం, శీలంగూడ కిరాతక దురాక్రమణకారుల కాళ్ళక్రిందపడి నలిగిపోతాయి. మన చరిత్రలో జరిగిందిదే.

## భయంకర ఉదాహరణలు

కొట్టవచ్చినట్లు కనపడే ఒక ఉదాహరణ ఉంది. గుజరాత్ రాజు కర్ణుని ప్రధానమంత్రి గొప్ప వేదపండితుడు, వివిధ కళల్లోను శాస్త్రాల్లోను దిట్ట. ఒక విషగడియలో ఆ రాజు, తన సర్దారుల్లో ఒకడి భార్యను అపహరించాడు. దీనికి ప్రధానమంత్రి రెచ్చిపోయి రాజు చేసిన పాపానికి శిక్షిస్తానని ప్రతిజ్ఞచేశాడు. తన పవిత్రత, ధర్మశాస్త్రపరిజ్ఞానాలకు అది నవాలని అత దనుకున్నాడు. తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనేందుకు అత దనుసరించిన పద్ధతి ఏమిటి? గుజరాతు ఉత్తరసరిహద్దుల్లో ముస్లిం సైన్యాలు పొంచిఉన్నాయని అతనికి తెలుసు. గుజరాతును స్వాధీనపరచుకోవటానికి వాళ్ళనేకపర్యాయాలు ప్రయత్నించి విఫలురయ్యారు. ప్రధానమంత్రి సరాసరి ఢిల్లీ పోయి, తన రాజును శిక్షించటానికి సహకరించుమని ఆ సుల్తానును కోరాడు. ఈ దివ్యమైన అవకాశం లభించగానే శత్రువు ఎగిరి గంతేశాడు. గుట్టుమట్లన్నీ తెలిసిన ప్రధానమంత్రి అందించిన సమాచార సహాయంతో శత్రురాజు గుజరాతుపైకి దాడిచేశాడు. దక్షిణానికి విస్తరిస్తున్న ముస్లిములను సమర్థంగా అడ్డుకొంటున్న శక్తిమంతమగు హిందూ సైనిక స్థావరం కర్ణావతి, వారి వశమైంది. తర్వాత ఒక గుజరాతేకాదు, దక్షిణాపథమంతా ముస్లిము దోపిడీముఠాల పాదాలముందు మోకరిల్లింది. ఇంతకీ ఆ

ప్రధానమంత్రికి ఒరిగిందేమిటి? రాజేకాదు, అతనితోపాటు ప్రధానమంత్రి బంధుగణమంతా వేలకొలది కత్తికెరయ్యారు; అతని కండ్ల ఎదుటనే అగణిత స్త్రీజనానికి మానభంగం జరిగింది; దేవాలయాలు నేలమట్టమైనాయి; తాను వేదపారాయణచేస్తూ, భగవదారాధనచేస్తూ ఉండే ఆతని స్వగృహం, గోవధ జరిగే కసాయిశాలగా మారింది; ఇంతతో ఆగలేదు; మాతృభూమిలోని విశాలభూభాగం శతాబ్దాలతరబడి దాస్యంలో క్రుంగిపోయింది.

రాజు వ్యక్తిగతశీలంవిషయంలో లోపభూయిష్ఠుడైనప్పటికీ, జాతీయ శీలంలో పటిష్ఠుడే. ప్రధానమంత్రిమాత్రం వ్యక్తిగతంగా చాలా పవిత్రుడు, దైవభీతి కల్గినవాడే; కాని యావత్తుసమాజంయొక్క సంక్షేమాన్నే పరమావధిగా భావించి, జాతిశ్రేయస్సు అనే బలిపీఠంవద్ద, తాను విశ్వసించే సత్ప్రవర్తనాది భావాలతోబాటు, తన సర్వస్వాన్నిగూడ త్యాగం చేసే ప్రేరణను వ్యక్తిలో కలిగింపజాలిన జాతీయశీలం లేనివాడనేది స్పష్టం. ఆవిధంగా, రాజు, మంత్రికూడ ఉభయులకూ ప్రియమైన లక్ష్యానికే తీరని ద్రోహం చేసుకొన్నారు. వ్యక్తిగతశీలానికి, ధర్మానికి వక్రభాష్యాలుచెప్పే ఇట్టి ప్రధానమంత్రివంటివారు మన జాతిచరిత్రలో అనేకులున్నారు. ఈ వక్రదృష్టి పాతుకపోయి, కడచిన శతాబ్దాల్లో దేశద్రోహుల తెగనే ఒకదాన్ని సృష్టించింది. సోమనాథదేవాలయాన్ని అపవిత్రంచేసి, ధ్వంసం చేస్తాననే నిర్దిష్టలక్ష్యంతో బయలుదేరివచ్చిన ఘజనీమహమ్మదుకు దారి చూపి సహాయం అందించినవారు నిష్ఠాగరిష్ఠులైన శివభక్తులే. ఔరంగజేబు సర్దారుల్లో ప్రసిద్ధుడు, శివాజీని నాశనంచేద్దామని వచ్చినవాడు అయిన జయసింహుడుగూడ విద్వాంసుడే, నిష్ఠావంతుడైన భక్తుడే, మేధావియే, సహృదయుడే కానీ, శివాజీ స్వదేశ స్వధర్మాల పేరున ఆతణ్ణి సంబోధిస్తూ క్రూరుడైన విదేశీయుడికి బానిసగా బ్రతికేకన్న దేశభక్తియుతమైన శక్తులకు నాయకత్వం వహించి నడిపించవలసిందంటూ చేసిన విజ్ఞప్తిని అతడు పెడచెవినిపెట్టాడు. దైవభక్తి 'రాజభక్తి'-వీటితోనే అతడు తృప్తి

పడ్డాడు. దైవభక్తి భావనకు, వ్యక్తిగతమైన నిజాయితీ, విధేయతలకు ఎంతటి ప్రమాదకరమయిన వక్రభాష్యమిది! శీలంలోని ఈ రెండంశాలనూ సమానంగా సమాదరించినపుడే వ్యష్టి సమష్టుల ప్రగతి సాధ్యపడుతుంది. ఈ రెండు ఒకే నాణానికున్న బొమ్మ బొరుసు వంటివి ఒకప్రక్క జాతీయ చిహ్నం, రెండోప్రక్క నాణెం విలువ. ఈ రెండింటిలో ఏఒక్కటి అరిగి పోయినా నాణెం చెల్లదు.

## జాతీయాంశం

కాబట్టే వ్యక్తిగతమైన మంచితనం, పవిత్రశీలం జాతీయకార్యంలో పూర్తిగా వినియోగపడాలి. పేరుప్రతిష్ఠలనుగాని, మరేవిధమైన ప్రతిఫలం గాని ఆశించని సర్వస్వార్పణభావంగా అవి రూపొందాలి. మనం సేవించే ప్రజలు మనలను ప్రశంసిస్తున్నారా లేదా అని ఆలోచించకూడదు. నిజానికి వాళ్ళు ప్రశంసించకపోవటమే మేలు. ప్రజలపొగడ్తలు అనే బంధంనుండి అప్పుడే మనం బయటపడగలం. లేకుంటే అదే మనలను ఏదైనా అవాంఛ నీయకార్యానికి కట్టిపడవేస్తుంది. జాతియే మన ఇష్టదైవం. రాష్ట్ర పరమేశ్వరుని ఆరాధిస్తున్నామనే భావనతోనే మన సర్వస్వాన్ని సమ ర్పించాలి. అటువంటప్పుడు ప్రతిఫలంగా మన మేంకోరగలం ?

ఈనాడు ఇటువంటి సర్వస్వార్పణభావన దాదాపు లుప్తమై పోయింది. సామాజికరంగంలో పనిచేసే వ్యక్తులు ప్రతిఫలంగా ఏదో ఒకటి- డబ్బో, పేరో, ఒక జయధ్వానమో, కనీసం ఏదో పత్రికలో తన ఛాయాచిత్రమో-ఆశిస్తున్నారు. ఘనస్వాగతాలకు అలవాటుపడ్డ ప్రముఖ నాయకు డొకడు ఒక ఊరికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు స్వాగతం పలక టానికి ఎవరూ లేరు. నినాదాలుగాని, పూలదండలు, ఛాయాచిత్రాలుగాని లేవు. అది ఒక అవమానంగా భావించి ఆయన ఒక్కక్షణం ఆగకుండా తిరిగి వెళ్ళిపోయినాడు! ఇది మెరుగులు దిద్దిన స్వార్థం. లాభసాటి అయిన ప్రత్యక్షమార్గాలుకూడా అమలులో ఉన్నాయి. ఒకవ్యక్తి జాతిపేరట

స్వప్రయోజనాలను సాధించుకుంటే, అది రాష్ట్రభక్తి కాదు; స్వార్థభక్తి అవుతుంది. అట్టి వ్యక్తివిషయంలో ప్రజాసేవ అనేది వ్యక్తిగత మహత్వాకాంక్షకు ఒక ముసుగు మాత్రమే.

ఈనాడు పలుపుర దైవారాధనకూడా ఈ ధోరణిలోనే సాగుతోంది.

*పుత్రాన్ దేహి ధనం దేహి'* ॥

'ఓ దేవా! నాకు పుత్రులనిమ్ము, ధనమునిమ్ము'

ఇట్లాంటివి ఆ ప్రార్థనలు. ఏదైనా కోరిక ఉంటే, అది ఆరాధన కానేరదు; వ్యాపారం అవుతుంది. మన ధర్మశాస్త్రాలు, మన మహాత్ములు అటువంటి నీచమైన భావనను గర్హించినారు. ఆరాధన, ఆరాధనకొరకే; కేవలం ఆనందంకొరకే. ఒకవేళ మనకేదైనా కోరిక ఉంటే అది మరింత బాగా ఆరాధించే అర్హతకొరకు, త్యాగసేవామార్గంలో పయనించడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలనుగురించి మాత్రమే అయిఉండాలి

యుధిష్ఠిరుని ఉదంతం ఒకటి: పాండవులు, ద్రౌపది అడవుల్లో తిరుగుతూ ఉండగా, యుధిష్ఠిరుడు నిరంతరాయంగా భగవన్నామస్మరణ చేస్తూండటం ద్రౌపది గమనించింది. తమయొక్క కష్టపరిస్థితి బాగా తెలిసినదిగనుక ఆమె "ఎందుకు మీరెల్లప్పుడు భగవన్నామస్మరణ చేస్తారు? బాల్యంనుంచిగూడ మీరు దైవాన్ని ఆరాధిస్తున్నారు. అనేక యజ్ఞాలు చేశారు. శాస్త్రవిహితకర్మలన్నీ ఆచరించారు. కాని ఈనాటి వరకు భగవంతుడు ఏమి అనుగ్రహించాడు? న్యాయరీత్యా మీకు రావలసిన సింహాసనంకూడ మీకు దక్కలేదు. ప్రతిక్షణం ప్రమాదాలకు గురిఅవుతూ, ఈనాడు ఒకచోటినుండి మరొకచోటికి తిరుగవలసి వచ్చింది. ఇప్పటికైనా ఆ భగవన్నామస్మరణ అంటే విసుగుపుట్టటం లేదా?" అని యుధిష్ఠిరుణ్ణి అడిగింది. "ఆ హిమాలయాలవంక చూడు! ఎంత ప్రశాంతగంభీరంగా ఉన్నాయో దాన్ని మనం ప్రేమిస్తాం గదా? దానినుంచి ఏదైనా ఆశించి ప్రేమిస్తామా? దాని ఉజ్జ్వల

గాంభీర్యమూ, ప్రశాంతత, పవిత్రతల్నిబట్టి దాన్ని ప్రేమిస్తాం. భగవంతుడూ అంతే. అయితే ఆయనది అవధులులేని మహత్తు! ఆ ఉదాత్తగాంభీర్యం ముందు మరింత ఆనందించటం, దాన్ని మరింత ప్రేమించటం తప్పిస్తే నా కేకోరిక లేదు" అని యుధిష్ఠిరుడు ప్రశాంతంగా సమాధానం చెప్పాడు. నారద భక్తి సూత్రాల్లో దైవం సాక్షాత్తూ మూర్తీభవించిన ప్రేమరూపంగా సా పరమ ప్రేమరూపా- అని వర్ణించబడింది.

## భక్తిలోని శక్తి

భక్తి వ్యాపారంకాదు. అది కేవలం ఆత్మార్పణమే. అది ఏకోన్ముఖమే. మనది కేవలం సమర్పణే. శిథిలాల ప్రోగుల్లోంచి జాతిని వైభవశిఖరాలకు తీసికొనివెళ్ళగలిగేది సర్వస్వార్పణభావం గల వ్యక్తులు మాత్రమే.

ఖండోబల్లాళ్‌ది స్ఫూర్తిప్రదమైన ఉదాహరణ. సింహాసనమెక్కిన తరువాత, శంభాజీ పాతపగవల్ల ఛత్రపతిశివాజీయొక్క అష్టప్రధానుల్లో ఒకడైన ఖండోబల్లాళ్ తండ్రిని చంపివేసినాడు. ఆనాటికి ఖండోబల్లాళ్ స్వాభిమానంగల వీరయువకుడు. అయినా ఆ వ్యథను, అవమానాన్ని ఆతడు మౌనంగా దిగమ్రింగినాడు. వ్యభిచారానికి, త్రాగుడుకు అలవాటు పడ్డ శంభాజీ ఖండోబల్లాళ్ చెల్లెలిని కామించినపుడు, ఆమె తన మానాన్ని కాపాడుకునేందుకై ఆత్మహత్య చేసుకుంటానంటే అతడు అనుమతించినాడేగాని, శంభాజీపట్ల తన విధేయతనుమాత్రం వదలుకోలేదు. దానికి కారణం ఉంది. వ్యక్తిగతంగా ఎన్ని వ్యసనాలున్నప్పటికీ, ఆనాడు హిందూశక్తులన్నీ ఏకత్రితం కావడానికి కేంద్రమై, పునఃప్రతిష్ఠితమవుతున్న హిందూ స్వరాజ్యానికి సమైక్యసాధన చిహ్నంగా ఉన్నది శంభాజీయేనని ఖండోబల్లాళ్‌కు తెలుసు. తరువాత, ఔరంగజేబు శంభాజీని నిర్బంధించినప్పుడు ఆయనను విడిపించేందుకై ప్రాణాలుతెగించి కృషిచేశాడు. ఇట్టి సమర్పణభావానికి అనుగుణంగానే శంభాజీఅనంతరం అతడు రాజారామ్‌కు

విధేయుడయ్యాడు. జింజీకోటలో చిక్కుపడ్డ రాజారామ్‌ను విముక్తుణ్ణిచేసే యత్నంలో తన యావదాస్తినేకాక కన్నకొడుకుప్రాణాలనుకూడ ఒడ్డినాడు; రాజారామ్‌ను విడిపించగలిగాడు. స్వరాజ్యం నిమిత్తమై ఆఖరుకు తన ప్రాణాలనే ధారపోశాడు. ఎంతటి ఉజ్జ్వల సర్వస్వార్పణమది !

తన జీవితాన్నిమాత్రమేగాదు, తన ఆస్తులు, తన ప్రేమనిధానాలూ-అహంకారాన్నిగూడా - ఆవిధంగా త్యాగం చేసిన ఫలితంగానే చరిత్రగతియే పూర్తిగా మారిపోయింది. శివాజీ మరణించినతరువాత మన సమాజం లోలోపల ఇంకా రగులుతున్న స్వరాజ్యభావాగ్నిని ఆర్పివేద్దామనేఉద్దేశ్యంతో దక్షిణభారతదేశానికి ఐదులక్షల సైన్యంతో వచ్చిన ఔరంగజేబు ఖండో బల్లాళ్‌వంటి వీరపురుషుల, ఆత్మార్పణహోమాగ్నిజ్వాలల్లో చిక్కుకొని చివరకు దక్షిణదేశంలోనే మట్టి ఐపోయాడు.

## శీలం వికసించినప్పుడు

అదే జాతీయశీలం అంటే. నిరంతర ప్రయత్నంద్వారా దాన్ని మన జీవితాల్లో పెంపొందించుకొందాం. స్వార్థచ్ఛాయలైనా లేకుండా యావత్తుసమాజంపట్ల మన హృదయాల్లో పొంగిపొరలే స్వచ్ఛమైన ప్రేమతో జాతిని సేవిద్దాం. మన శీలపద్మం, స్వచ్ఛ, పవిత్ర, తేజోమయ రాష్ట్రభక్తి కిరణకాంతిలో వికసించుగాక !

బుద్ధ్యహంకారాల సామాన్యస్థాయికి అతీతమైన మన అంతరాంతరాల్లోకి ప్రసరించే అచంచలమైన అపారభక్తిభావనకై కృషిచేద్దాం. ప్రగాఢము, అఖండమునైన విశుద్ధభక్తిప్రవాహం మన అణువణువును ఆవహించాలి. మహాత్ముల జీవితాలన్నీకూడా ఏకాగ్రమైన సమర్పణభావాన్నే ప్రబోధిస్తాయి. చైతన్యమహాప్రభువు అనన్యసామాన్య పాండితీమండితుడు. తన సమకాలికులైన ఘనులందరినీ, ఆయన వివిధ ఆధ్యాత్మిక శాస్త్రార్థాల్లో

ఓడించినాడు. కానీ మేధయొక్క ప్రతిభావిశేషాలు, పాండిత్యాధిక్యం ఉన్నప్పటికీ, ఆతరువాతరోజుల్లో ఆయన చర్చలను, వాగ్వాదాలను కట్టిపెట్టి తనతో వాదించ వచ్చినవారికి ఎంతో భక్తిభావపూర్ణంగా, 'హరిబోల్, హరిబోల్' అని మాత్రమే చెప్పసాగినాడు. ఆ పలుకుల్లోని భక్తిభావపు పులకింత, వినేవారిని భక్తిప్రవాహంలో ఓలలాడించి, శుష్కప్రవచనాలలోని డాంబికతను, భక్తిభావనలోని వైభవాన్ని గ్రహించేట్లు చేసేవి.

అట్టి ప్రగాఢభక్తిభావన కలిగిన వ్యక్తి, తనలక్ష్యాన్ని సాధించేందుకు అసాధారణమైన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకుంటాడు. ఒకసామాన్య కార్మికుడు తన పనిని అభిమానించి, ఆరాధించినప్పుడు ఉత్తమోత్తమంగా కృషి చేస్తాడనీ, తనను మరచిపోయి తన హృదయఫలకాన హత్తుకొన్న రూపాన్నిచిత్రించడంలో అత్యుత్తమంగా చిత్రకారుడు విరాజిల్లుతాడనీ మనం నిత్యజీవితంలో చూడడంలేదా ? జాతీయసమర్పణపథంలో సంపూర్ణమైన ఏకాగ్రతను పెంపొందించుకొని, వన్నెకెక్కిన సచ్ఛీలానికి సజీవ ఉదాహరణలుగా మనలను మనం తీర్చిదిద్దుకొందాం.

# 35. పురుష పుంగవులుగా రూపొందండి

నేను ఒక సాధువుతో మాట్లాడుతుండగా, విద్యార్థులు తరచు సమ్మె చేస్తున్నారనే విషయం ప్రస్తావనలోకి వచ్చింది. "జాతికి ఆధార స్తంభాలు మీరే; భావి నాయకులు మీరే – ఇట్లా విద్యార్థుల చెవుల్లో మారుమ్రోగేట్లు మన నాయకులు చెప్పేదాని విషఫలితమే ఇది. దీనికి వాళ్ళ మానసిక అపరిపక్వత తోడై, నెత్తిమీదికి కళ్ళువచ్చినై. అహంకారం వెర్రితలలు వేయకుండా ఉండటానికి వాళ్ళలో నిస్వార్థసేవాభావం కల్గించటమొక్కటే సవ్యమైన ఆలోచన. 'ఆధార స్తంభాల'నీ, 'భావి నాయకుల'నీ – ఇట్లా అంటూండటంవల్ల వాళ్ళఅహంకారం పెరిగిపోతుంది; ఎంత చిన్న అన్యాయం గాని, అవమానంగాని జరిగినా, లేక జరిగిందేమో అని అనుకున్నా వాళ్ళు వెంటనే సమ్మెలకు, హింసాకాండకు దిగుతారు" అని ఆయన వ్యాఖ్యానించినారు.

ఈ మాటలు వింటుంటే నాకు శ్రీరామకృష్ణపరమహంస జీవితంలోని ఒక సంఘటన జ్ఞప్తికి వచ్చింది. బీదలపై జాలిచూపటం, వాళ్ళకు సహాయం చేయటం – ఇట్లాంటి విషయాలు శిష్యులు కొందరు మాట్లాడుకుంటున్నారు. శ్రీరామకృష్ణుడు దివ్యోన్మాదంలో అచటకు వచ్చి 'వాళ్ళపట్ల జాలిచూపటానికి మీరెవరు ? వాళ్ళకి సహాయం చేయటానికి మీరెవ్వరు ? వాళ్ళు సాక్షాత్తు

నారాయణస్వరూపులే. కాబట్టి మీరు వాళ్ళని కేవలం సేవించగలరు' అని శిష్యులను మందలించినాడు.

## పునాదిరాళ్ళు కండి

ఇట్టి ధోరణి మనలో నిజమైన నిస్వార్థ సేవాభావాన్ని కలిగించి పవిత్రశీలం, వినయం, సామర్థ్యం, రూపొందిస్తుంది; అవినీతికి తొలిమెట్టు అయిన గర్వోన్మత్తతనుండి మనలను కాపాడుతుంది. పునాదిరాయి మనకు ఆదర్శం. అది కంటపడదు, దానికి మెప్పులేదు. అందంగా ఉండకపోవచ్చు; నునుపుగా ఉండకపోవచ్చు; అయినా అదే మూలాధారం. అది ఏమాత్రం కదిలినా, కట్టడం మొత్తం కుప్పకూలిపోతుంది. శిఖరంకంటె, మరేఇతర భాగంకంటె పునాదిరాయే అతిముఖ్యమైంది. అయినప్పటికీ ఆ రాయి తన ఉనికినే విస్మరించి, తనను కాదనుకొని, అక్కడే పడిఉండి సేవచేస్తూ ఉంటుంది. అట్టి భావనతోనే ప్రజాసేవ చేయాలి. తాను వెలుగులోకి రావాలని, పైనే ఉండాలని, నల్గురూ తన్ను ఓహో అనాలని కోరుకోవటం వ్యక్తిలోని ఆంతరిక అల్పత్వాన్ని, స్వోత్కర్షను సూచిస్తుంది. అయినా శిఖరాగ్రాన కూర్చోటంలో ఘనత ఏముంది? కాకికూడ అక్కడ కూర్చోగలదు!

## నిజమైన సేవ

అత్యుత్తమ భక్తిమార్గం సేవాభావమే అని మన మహాపురుషులు భావించారు. అటువంటి ఒక మహాత్ముడు భగవంతుని ఈ విధంగా ప్రార్థించినాడు.

*న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।*
*కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తినాశనమ్ ॥*

(రాజ్యంగాని, స్వర్గంగాని, మోక్షంగాని, నేను కోరను; ప్రాణికోటి దుఃఖాన్ని పోగొట్టటమే నే కోరేది.)

నిజమైన సేవాభావమిదే. సేవచేయటానికి మరింత శక్తిసామర్థ్యాలను కావాలనే దొక్కటే అట్టిభక్తుని నిరంతర ప్రార్థన. భగవంతుడు తనకు ప్రసాదించినదంతా తాను సేవాకార్యంలో వినియోగించటమే అతని జీవితానికి సార్థక్యం. "ఓ దేవా! నా జీవితపు జోలెను నీ పాదాలముందల గుమ్మరించినాను; నా జీవితం ధన్యమైంది" అని అతడు అనుకుంటాడు.

'మహోమహుడైన గురుగోవిందసింహునివలె ప్రజలకొరకు అన్నీ భరించగలగాలి. తనది, తనవాళ్ళందరిది నెత్తురు ధారపోసిన తర్వాత గురుగోవిందుడు ప్రశాంతంగా, రంగంనుండి వైదొలగి, తన తనువు చాలించటానికి దక్షిణానికి చేరుకున్నాడు; అంతేగాని కృతఘ్నులై తన్ను పరిత్యజించినవారిని పల్లెత్తుమాట అనలేదు.' అని వివేకానందస్వామి చెప్తుతుండేవాడు.

ప్రతిఫలాపేక్షలేకుండా సమాజకళ్యాణార్థమై బాధలను భరించి, త్యాగంచేసి, ధన్యోస్మి అనుకున్నవాడే నిజమైన సమాజసేవకుడు.

ఇతరుల కన్నీటిని తుడిచివేసే సమయంలోగూడ ఆత్మోత్కర్ష, ఆత్మసంతృప్తిభావనలు వాళ్ళ మనస్సుల్లో ప్రవేశించవు. ఇతరుల కష్టాలతో నిజమైన తాదాత్మ్యం లేనప్పుడే అట్టి వికృతులు ప్రవేశిస్తాయి.

బొంబాయిలో ఒక 'వితంతుశరణాలయం' వార్షికోత్సవం జరిగింది. ఆ సంస్థ ప్రగతిని వివరిస్తూ, శరణాలయంలో ప్రతిఏటా అధికసంఖ్యలో విధవలు చేరుతున్నందున కార్యదర్శి తన సంతృప్తి వ్యక్తంచేశాడు! ఆ సంస్థ అట్లాగే దినదినప్రవర్ధమానం కావాలని ఆశించాడు! ఆ విధవుల దీనావస్థ చూచి అతడు నిజంగా బాధపడిఉన్నట్లైతే, వారిసంఖ్య పెరగాలని కోరిఉండేవాడు కాదు. నిజమైన సేవాదృష్టిఉన్న కార్యకర్తయొక్క భావనలు జబ్బుతో బాధపడుతూఉన్న తల్లికి సేవచేసే కుమారుని భావనలను

పోలి ఉంటాయి. మనమంతా సమాజానికి సంతానమే. ఎంత సేవచేసినప్పటికీ అది ఇట్టి పవిత్రము, ఉదాత్తమునైన భావనతో కూడిఉండాలి.

## స్వావలంబనకు ప్రతీకలు

వినమ్రత, సేవాభావం ఉండాలి అంటే అర్థం, మన ఆత్మవిశ్వాసాన్ని, స్వావలంబనాన్ని విడిచిపెట్టమనికాదు. ఈ రెండు సద్గుణాల సమ్మేళన స్వరూపాలే మన మహాపురుషులు. వాస్తవానికి ఈ రెండు సద్గుణాలు నాణెంయొక్క బొమ్మా బొరుసులవంటివి.

మహారాష్ట్రకు చెందిన ప్రఖ్యాతవిద్వాంసుడు, మహదేవగోవిందరానడే చిన్నతనంలో దిక్కులేనివాడు. మధుకరవృత్తి చేస్తూ చదువుకున్నాడు. ఆనాడది గౌరవప్రదమైనదే. ఆయన దేవాలయంలో ప్రమిదదీపాలవద్ద చదువుకుంటుండేవాడు. బెంగాలుకు చెందిన గొప్ప విద్యావేత్త, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌కూడ కడు బీదవాడు. 'మెట్రిక్యులేషన్' పూర్తిచేయటంకూడ ఆయనకు గగనమైపోయింది. అప్పుడాయన ఒక ఉద్యోగంలో ప్రవేశించి, వచ్చే కొద్దిజీతంలోనే మిగుల్చుకుని కళాశాలవిద్య అభ్యసించాడు. స్వావలంబనాన్నే జీవనసూత్రం చేసుకొని వాళ్ళు మహోన్నత పాండితీ శిఖరాల నధిరోహించారు.

స్వామి రామతీర్థుల స్ఫూర్తిప్రదమైన ఉదాహరణ మరొకటి. ఆయన పుట్టింది నిరుపేదకుటుంబంలో. ఆనాటి ఆచారం ప్రకారం చిన్నతనంలోనే ఆయనకు వివాహం జరిగింది. మెట్రిక్యులేషన్ పూర్తికాగానే ఉద్యోగంలోచేరి కుటుంబాన్ని ఆదుకోవాలని తండ్రికోరిక. కాని ఇంకా చదువుకోవాలని ఈయన పట్టుదల. దానితో ఘర్షణ ప్రారంభమైంది. తండ్రి ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు. రామతీర్థుడు తండ్రికి నమస్కరించి, భార్యను వెంటపెట్టుకొని ఇల్లువిడిచి వెళ్ళిపోయినాడు. అప్పటికి ఆయన వయస్సు పదిహేను సంవత్సరాలు. భార్యకు ఎనిమిది సంవత్సరాలు. సీతా ద్రౌపదులు తమ భర్తలవెంట అడవులకు వెళ్ళిన

కథలు పుట్టింట్లో శ్రద్ధగా విన్నది గనుక ఆమెకూడా ఆ తుఫానుకు తట్టుకో గలిగింది. రామతీర్థుడు ఒక చిన్నగది చూచుకొని ఆమెను అక్కడఉంచాడు. ఒక పాఠశాలలో అంశకాలీన (పార్ట్ - టైమ్) ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ కళాశాలలో చేరినాడు. దానికితోడు బ్రహ్మచర్యవిధులన్నిటికీ కట్టుబడిన విద్యార్థి ఆయన. కాబట్టి, తన తల్లి కాక మరి ఏ స్త్రీ చేతివంట తినకూడదు. తనకు, తనభార్యకుకూడ అతడే వంటచేసేవాడు; ఆమెకుకూడ చదువు చెప్పటం మొదలుపెట్టాడు. ఇన్ని ఇబ్బందుల్లోగూడా ఆయన పరీక్ష లన్నిటిలో ఎప్పుడూ అత్యున్నతశ్రేణిలోనే ఉత్తీర్ణుడవుతుండేవాడు. ఎం. ఏ. లో సంస్కృతం తీసుకున్నాడు. నాటికి సంస్కృతంలో ఆయనకు ఓనమాలుకూడ రావు. కాని ఉడుముపట్టు పట్టినాడు; ఉత్తీర్ణుడైనాడు ప్రథమ శ్రేణిలో. తమ సంకల్పబలంవల్ల అవరోధాల నన్నిటినీ అధిగమించి మహోత్తుంగ సఫలతాశిఖరాగ్రాలను అధిరోహించగలిగినారు ఇట్టి మహోన్నత వ్యక్తులు.

'తనకు, తాన తోడగుటయ తగినతోడు' అనేది అక్షరాల నిజం. ఒక పల్లెటూరు రైతు తన బండిలో పొరుగూరు వెళ్తున్నాడు. దారిలో బండి చక్రం బురదలో కూరుకుపోయింది. ఏమీ పాలుపోక చతికిలబడి 'దేవుడా నన్నీ కష్టంనుంచి గట్టెక్కించు' అని విలపించసాగాడు. దారినపోయే ఒక ఆసామి ఇది చూచి 'అదేమిటయ్యా, ఏడిస్తే అవుతుందా? నీ వొకపట్టుపట్టు, నేనూ సాయంపడ్తాను' అన్నాడు. ఒక్క ఊపులో బండి బయటపడింది. అప్పుడా పెద్దమనిషి 'తన తోడు తానైన దైవమే కూడు' అని చెప్పి అదృశ్యుడైపోయాడు.

## 'అజీవికావాద' (కెరీరిజం) అభిశాపం

కాని, నేడు మనచుట్టూరా కనబడేదేమిటి ? అటువంటి స్వయంకృషి, స్వావలంబన మన యువకుల్లో ఉన్నాయా? ఒక ఉదాహరణ తీసుకుందాం.

ప్రతిరోజూ ఇంటివద్ద టీకాటిప్పణులు వ్రాసే శ్రమపడటానికి అతడిష్టపడడు. పాఠ్యపుస్తకాలను చదవటంగూడ కాలదోషం పట్టిపోయింది. ముద్రిత ప్రశ్నోత్తర టిప్పణులకు అతడు ఎగబడి వాటిని కంఠస్థంచేస్తాడు. దానికి గూడ ఉద్వాసన చెప్పగలిగితే మరీ సంతోషం. పరీక్షల్లోవచ్చే ప్రశ్నలు ముందే తెలుసుకునేందుకు తంటాలు పడ్తాడు. అప్పుడప్పుడు పరీక్షల్లో కాపీకొట్టటానికికూడ జంకడు. అదీగాకపోతే తిరుపతి వెంకన్నకు తల నీలాలు మ్రొక్కుకుంటాడు. అంతేగాని, స్వయంకృషివల్ల విజ్ఞానాన్ని సముపార్జిద్దాం అన్న ఆలోచనే అతనికి రాదు. పరీక్షల్లో ఇట్లా నెట్టుకొస్తే వా డెప్పటికీ మామూలు శుంఠే.

తేలికగా తెమిలే ఉద్యోగాలకు, తేరగా దొరికే సొమ్ముకు నేటి చదువుకున్న పడుచువారు ప్రాకులాడుతున్నారు. ఆత్మగౌరవానికి, స్వావలంబనకు చుక్కెదురైన చవుకబారు ఆజీవికల (కెరీర్) వెంటబడు తున్నారు. ఆ అల్పమనస్తత్వమే ప్రభుత్వోద్యోగాల ప్రాకులాటకు కారణమవుతోంది. క్రమం తప్పని నెలవారీ ఆదాయానికి హామీ, స్వల్ప పరిశ్రమ, అతిస్వల్పమైన బాధ్యత, ఉద్యోగానంతర భృతి ఆహా ఇట్లాంటి తేలికగా గట్టెక్కేపద్ధతి చాలామందికి నచ్చుతోంది; కడుపులో చల్ల కదలకుండా హాయిగా గడవటానికి అడ్డుత్రోవలకే అడ్డుదార్లు వెతుకు తున్నారు. జానెడుపొట్ట నింపుకోటానికి ఇట్లాంటి సోమరి 'నౌకరీ'లా ? ఎంత రోతపుట్టిస్తాయి !

ఒకొక్కసారి సదాశయాలు గల వ్యక్తులుసైతం ఆ త్రోవలో పడిపోయి, తాము ప్రభుత్వోద్యోగులు కావటం కారణాన తమ విశ్వాసాల కనుగుణంగా నడుచుకోలేకపోతున్నామని అంటుంటారు. ఒక వ్యక్తి మెడకు ఉచ్చు బిగించుకుని ప్రాణం పోతోందని గోలపెట్టినట్లుంటుందిది. సులువుగా డబ్బు సంపాదించటానికి అడ్డుత్రోవగా 'తమ కత్యంతవిధేయుడైన సేవకుడ'నని ఆత్మనమ్మకోవటం, నిజానికి, పశుత్వానికే అడ్డుదారి.

చెమటోడ్చి 'కూలి'గానైనా జీవించడంలో ఒక ఆనందముంది. ఎం. కామ్. చదివి రిక్షాలాగుతున్న వ్యక్తి ఒకడు నాకు తెలుసు. సోమరిగా, బానిసబ్రతుకు బ్రతికేకంటె కష్టపడి స్వతంత్రంగా జీవించటం అతనికిష్టం. అతనికి మంచి రాబడికూడ ఉంది. ఆత్మగౌరవ, స్వాభిమాన పూర్ణమైన ఆ జీవితానికి జోహారు.

సులువుగా డబ్బు సంపాదించటానికి, తక్కువ శ్రమతో ఎక్కువ సౌకర్యాలు పొందటానికి మనం ఆజీవికావాదులం కావద్దు. రామతీర్థుని, విద్యాసాగరుని కనిన ఈ దేశంలో జన్మించినట్టి విద్యావంతులైన యువకులకు ఇట్టి పౌరుషహీనజీవనం ఏమాత్రమూ తగదు. సేవాభావాన్ని ఆత్మ గౌరవంతోనూ, వినయాన్ని ఆత్మవిశ్వాసంతోనూ సమన్వయంచేసిన ఆ స్ఫూర్తిప్రదులైన మహామహులు గడిపిన జీవితాల పద్ధతిలోనే మనమూ జీవిద్దాం. అప్పుడే మనలో సుప్తమై ఉన్న సుగుణసంపత్తి, శక్తిసామర్థ్యాలు సుందరకుసుమాలుగా వికసించి వీరోచిత మానవతాసౌరభాన్ని వెద జల్లుతాయి.

## ఉచ్ఛ ప్రవచనాలు – తుచ్ఛజీవనాలు

మరి నిస్వార్థసేవాభావాన్ని, తదితర సద్గుణాలను మన ప్రత్యక్ష జీవితంలో రూపొందించుకొనడమెట్లా? మనకు ఆరాధ్యవిషయం ఏది? మన పూజనూ, సేవనూ సమర్పించవలసిన ఉత్తేజకరమైన వస్తువేది? 'మానవసమాజమా'? 'విశ్వసౌభ్రాత్రం' 'మానవసేవ' మొదలైనవాటిని గురించి పలువురు మాట్లాడుతుంటారు. కాని వాస్తవాల్ని ఎదుర్కోవలసి వచ్చినపుడు వారి కలలన్నీ కరిగిపోతాయి. "*సర్వం ఖల్విదం బ్రహ్మ*" (ఇదంతా బ్రహ్మము, నిశ్చయం) అనే అత్యున్నతమైన అద్వైతసిద్ధాంతాన్ని పదేపదే వల్లిస్తూ, ఒక నీగ్రోని చూచి అసహ్యించుకున్న పెద్దమనిషిని నే నెరుగుదును. చదువుకున్న మన యువకులు, గ్రామీణ వాతావరణాన్నే భరించలేరే; అట్టివారివద్ద మానవసమాజ ప్రసక్తియా! "గ్రామాలకు మరలండి" అని నేటి నినాదం. దాన్ని వినేవాడెవడు? గ్రామాల్లోని

గర్భదరిద్రుల్ని చూచినప్పుడు వాళ్ళనోళ్ళు పడిపోతాయి. ఒక యువకుడు గ్రామోద్ధరణ కార్యానికై బయలుదేరినాడు. అతనికి నువ్వులనూనె అలవాటు. ఆ గ్రామీణులకు అవిసెనూనె అలవాటు. ఆ వాసనను అతడు భరించలేక పోయాడు. వాతావరణమంతటా అదే వాసన ఉన్నట్లు అతనికి అనిపించింది. అతనికి నిద్రాహారాలు కరువయ్యాయి; అక్కడ ఒక్కరోజు కూడ నిలువలేక పారిపోయివచ్చాడు.

ఆదర్శానికనుగుణమైన శిక్షణ లేకపోతే, కఠోరవాస్తవాల నెదుర్కోలేం. మల్లవిద్య అభ్యసించాలనుకున్న యువకుడు ఒకడు నాకు తటస్థపడ్డాడు. కానీ,ఆ గుడ్డలు మార్చుకొని రమ్మనగానేఅతడు "వద్దు; ఈ దుస్తులతో కుస్తీపట్టటం అనేది ఏదైనా ఉంటేనే నేను నేర్చుకొంటాను" అని అన్నాడు. "అయితే దోమలతో కుస్తీపట్టు" అన్నాను! మానవ సమాజాన్ని సేవించాలనే ఉన్నతఆదర్శాలను వల్లించేవారి విషయం ఇంతే. తీరా ఆచరణవేళకు వెనుకంజ వేస్తారు; అకర్మణ్యులై తీరుతారు.

## మధ్యేమార్గం

'నేను, నా కుటుంబం – అంతే' అనే మన స్తత్వం మరొక కొనకు లాగుతోంది. ఒక ప్రముఖ న్యాయవాది, "మానవసమాజ మంతటిగురించి నే నాలోచించలేనప్పుడు, కేవలం నాకుటుంబాన్నిగురించి ఎందుకు ఆలోచించ కూడదు?" అని నాతో అన్నాడు. "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అన్నది పైపైన అర్థంచేసుకున్నప్పుడు మన జాతీయవైభవంనాశనమైపోయింది.కేవల స్వార్థంతో సంసారలంపటంలో చిక్కుకుపోయినపుడుకూడ అదేగతి పట్టింది. కాబట్టి 'అతివ్యాప్తి' 'అవ్యాప్తి' అనే ఈ రెండు విపరీతాలను పరిహరించి మధ్యేమార్గం త్రొక్కాలి. ఈ రెండు అతివాదాలకు మధ్యేమార్గంగా 'జాతి'ని స్వీకరిస్తే సంతులనాన్ని, ప్రశాంతతను పొందగలం.

## ప్రతిక్రియాత్మక 'ప్రగతి శీలురు'

కాబట్టి జాతిసేవ అనే లక్ష్యమొక్కటే మన అందరిలో సమర్పణ భావాన్ని ప్రేరేపిస్తుంది. జాతి ఒక్కటే వాస్తవిక ఆదర్శాన్ని - వాస్తవిక దృష్టిని, ఆదర్శవాదాన్ని సమకూరుస్తుంది. అభిమానించి, గర్వించి, ఆదరించదగిన విషయం ఎడ మాత్రమే వ్యక్తికి సేవాభావం కుదుర్తుంది. కాబట్టి మన ధర్మం, చరిత్ర, పరంపర, జీవనతత్త్వం, ఆకాంక్షలపట్ల మన విశ్వాసాలకు, గౌరవానికి చిహ్నాలైనటువంటి జాతీయజీవనంలోని వివిధాంశాలపట్ల ప్రగాఢమైన ప్రేమ, గర్వం, శ్రద్ధాభావాలను మనలో అలవర్చుకోవటం ప్రప్రథమంగా మనం పొందవలసిన శిక్షణ.

కాని 'మేము ప్రగతిశీలురం' అని చెప్పుకునే కొందరికి మన ప్రాచీన జీవనాదర్శాలన్నీ క్రూరంగాను, ప్రతిక్రియాత్మకంగాను కనిపిస్తాయి. వాటిఎడ వీళ్ళ వైముఖ్యానికి ముఖ్యకారణం వాటి ప్రాచీనత. ఈ క్రొత్త ప్రవక్తలకు క్రొత్తమీద మోజు; పాతదంతా బూజు. తమ సిద్ధాంతాలు అర్వాచీనాలు గనుక అవి మరింత సముచితాలు అని వాళ్ళ భావన. కాల గతిలో మొదట జీవితం, తర్వాత మరణం వస్తాయి. కాబట్టి, తర్వాత వచ్చే మరణమే కోరదగినదని వైద్యుడు రోగికి సలహా చెప్పినట్లుంటుందిది. చీకట్లను పారద్రోలే సాధనాల్లో అధునాతనమయింది 'గొట్టం దీపం' (ట్యూబ్‌లైట్) కాబట్టి, మనం దాన్ని ఆదరించి, నిజానికి అతిప్రాచీన మైన సూర్యుణ్ణి నిరసించాలా ?

ప్రాతదైనంతమాత్రాన దేనైనా నిరుపయోగమనీ, ప్రగతినిరోధక మనీ నిందించటం నీచాతినీచమైన దాస్యాన్ని - భావదాస్యాన్ని - అంగీక రించటమే. అయినప్పటికీ ఇట్టి భావదాస్యంలో ఉన్న వీళ్ళు తాము ఆధునిక యుగ 'అభ్యుదయవాదుల'మని విర్రవీగుతుంటారు. ఇది ఒక మానసిక

మైన బలహీనత. నిర్భయంగా, స్వతంత్రంగా, భావాత్మకంగా, పరిపూర్ణంగా, ఆలోచించే బౌద్ధికశక్తి లేకపోవటానికి ఇది నిదర్శనం.

## భావదాస్యం

పాశ్చాత్యులతో తమను పోల్చుకొని, న్యూనతాభావాన్ని పొందటం ఈ మానసికబలహీనతకు మరొక కారణం. ఆంగ్లేయుల పరిపాలననుండి సంక్రమించిన దుష్టవారసత్వ మిది. ఒక శతాబ్దానికి పైగా అనేకమంది మహాపురుషులు ఈదేశంలో ఉద్భవించి విదేశీ ఆధిపత్యాన్ని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నించారు. కాని, వాళ్ళలో చాలామంది తాముమాత్రం ఆంగ్లేయులకు మానసికంగా బానిసలై పోయారు. పరాజయభావం, న్యూనతాభావం, వాళ్ళ మనస్సులను లోగొన్నాయి. ఇది ఎట్లా సంభవించింది ? సంపద, అధికారాలున్నచోటే సుగుణసంపత్తికూడ ఉంటుందనుకొనే సామాన్య మానవబలహీనతయే దీనికి కారణం. సంపదలు, అధికారం కలిగినవానికి సర్వసద్గుణాలు, పాండిత్యం, జ్ఞానం, ఉత్తమమైన ఆభిజాత్యం ఏవిధంగా మానవమనస్తత్వం ఆపాదిస్తుందో

*యస్యాస్తి విత్తం స నరః కులీనః*

*స పండితః స శ్రుతిమాన్ గుణజ్ఞః ॥*

అనే ప్రసిద్ధ సంస్కృత లోకోక్తి వివరిస్తుంది. ఆంగ్లేయులతో మనం జరిపిన పోరాటంలో విజయం వాళ్ళను వరించినపుడు, మనం ఎన్నటికీ నెగ్గలేం అనే భావం ఏర్పడి, ఒకవిధమైన నిరాశ, నిస్పృహ కలిగాయి. దీనివల్ల ఆంగ్లేయులు మనకంటె సైనికశక్తిలోనూ, కూటనీతిలోనూ, భౌతికసంపదల పటాటోపంలోను మిన్న అయినవాళ్ళు కనుక, వాళ్ళే సకలవిద్యల్లోనూకూడ మనకంటె అధికులై తీరుతారు అనే అభిప్రాయం మనలో పెంపొందసాగింది. అందుకనేమనప్రజలు ఆంగ్లేయులపరిపాలన ప్రారంభకాలంలోవాళ్ల పద్ధతులను

ఆచారాలను గ్రుడ్డిగా అనుకరిస్తూ పాశ్చాత్యులనుంచి ఎరువుతెచ్చుకొన్న అభిప్రాయాలను ఎంతో దృఢవిశ్వాసంతో ప్రవచించసాగినారు. ఎంతటి అసంబద్ధమైన దైనప్పటికీ ప్రతిఒక ఐరోపీయ ఆదర్శం వేదవాక్కు అయిపోయింది; మన ప్రతిదీ అసత్యం. మూర్ఖం అనిపించింది. ముఖ్యంగా పాశ్చాత్యవిద్య నభ్యసించిన "విద్యాధికవర్గం" నిజానికి నల్లతోలు గల ఆంగ్లేయులుగా మారిపోయింది.

మన పరాజయ, పతనాలకు మూలకారణం మన జీవనవిధానమే అని విదేశీయులు తెలివిగా ప్రచారం చేస్తే, ఆ అత్యంత అసంబద్ధమైన విషయాన్నిగూడ ఇట్టి 'విద్యాధికులు' నిస్సంకోచంగా నమ్మారంటే ఏమీ ఆశ్చర్యపడనక్కరలేదు. అందుచేతనే వాళ్ళకి మన సంస్కృతిపట్ల అసహ్యం; విదేశీ ఆదర్శాలపట్ల వెర్రివ్యామోహం కలిగి జాతీయజీవనాన్ని పునర్నిర్మించ పూనుకున్నారు. ఆంగ్లేయులుకూడ అట్టి మెతకబుద్ధికల నాయకత్వాన్నే తెలివిగా పైకితెచ్చారు. విదేశీపరిపాలకులు, తాము స్వాధీనం చేసుకొన్న దేశాల్లోని స్వాతంత్ర్య సంగ్రామ తీవ్రతను సడలింపచేసే నిమిత్తమై, నిజమైన దేశభక్త వర్గాలను కొరగానివాళ్ళుగా చిత్రించి, రాజీపడే వర్గాలను పైకి తీసుకొనివచ్చే విధానాన్ని ఎల్లప్పుడూ అనుసరిస్తూ ఉంటారు.

## పశుత్వం దివ్యత్వాన్ని త్రోసిరాజంది

నీచమైన ఇట్టి అనుకరణమనస్తత్వం మన జాతీయజీవనంలో వినాశకరమైన ప్రభావాన్ని కల్పించింది. అది మన జీవనదృక్పథాన్నే మార్చివేసింది. అనుకరించటం అంటే వ్యక్తియొక్క జీవనదృక్పథంలో ఆంతరికమైన ప్రతిభ, సృజనాత్మకశక్తులు, అసలే లేకపోవటమని మనకు తెలుసు. శారీరకమైన సుఖానుభూతి, సంతృప్తులను పొందాలి అనే పాశ్చాత్య జీవనపద్ధతిని స్వీకరించాలనే వెఱ్ఱి ఆదుర్దాలో స్వార్థత్యాగం, ఆత్మ

సంయమనం వంటి మన ఉదాత్త ఆదర్శాలను విడిచిపెట్టటం పాశ్చాత్య అనుకరణయొక్క తొలిఫలితం. జీవనం కేవలం బహిర్ముఖమైనది. లౌకికసుఖాలే దాని పరమావధి. ఇంద్రియాలకు మనస్సుపై విశృంఖలమైన ఆధిపత్యమిచ్చి తద్వారా పశుప్రవృత్తికి బానిసగా చేయటమే వారి దృష్టిలో వ్యక్తిగత స్వాతంత్ర్యం. మనంకూడా గ్రుడ్డిగా తెల్లవారి ఆదర్శాలను అనుసరించటానికి అఱ్ఱులుచాస్తూ, 'జీవనప్రమాణాన్ని పెంచాలి' అనే పాశ్చాత్య నినాదాన్ని ప్రతిధ్వనిస్తున్నాం. దాని అర్థం, జీవితంలో భౌతిక విషయాలకు మరింత బానిసలం కావటమే; అంటే మానవుని పశుత్వానికి మరింత బానిసగా చేయటమే. పశుత్వాన్ని అందల మెక్కించటంవల్లనే ఈనాడెల్లెడలా అసూయాస్వార్థాలు ఇష్టారాజ్యం చేస్తున్నాయి. అత్యధిక సుఖానుభూతిస్వప్నం ఒక్కటే నేటి మన యువకులకు వెర్రెత్తిస్తోంది.

## రాజకీయాల ప్రోక్రస్టీస్ శయ్య

రెండవ విషయం : మన జాతికి జీవనాధారమైన సంస్కృతీ సారాన్ని కోల్పోవటంవల్ల రాజకీయాలే జీవితానికి కీలకం అనే స్థూలదృష్టికి ఎరైపోయాం. ఇట్టి వికృతదృష్టి కనుగుణంగానే 'రాజకీయ చైతన్యం పొందండి' అని ప్రజలకు ప్రబోధించారు. రాజకీయ అవసరాల దృష్ట్యా క్రొత్త జీవన ఆదర్శాలను సృష్టించుకోవాలనేదాకా ఈ ధోరణి పోయింది. జీవితం అంటేనే రాజకీయాలనుకోవటంవల్ల తాత్కాలిక రాజకీయ వెఱ్ఱివికారాలకు అనువుగా మన ధర్మాన్ని, భాషను, చివరకు చరిత్రనుకూడ తారుమారుచేశారు.

*"వారాంగనేవ నృపనీతిరనేకరూపా"*

రాజకీయాలు సానిదానివంటివి, వేషాలు మారుతుంటాయి)

అన్నారు. రాజకీయాలు సంఘజీవనానికి ఉపయోగపడే ఒక వ్యవస్థ మాత్రమే వ్యవస్థ బాహ్యమైనది; అది సర్వస్వంకాదు, జీవితంకాదు. కాని 'సాధనా'న్నే 'సాధ్య'మని పొరబడటం జరిగింది. శరీరంకొలతలనుబట్టి

దుస్తులు కుట్టించుకుంటాంగాని, దుస్తులకొలతల్నిబట్టి శరీరాన్ని నరుక్కోంగదా !

ప్రోక్రస్టీస్ అనే దొంగ ఒకడుండేవాడు. వాడు అప్రాగత్తగా ఉండే వాళ్ళను తనకుటీరానికి అతిథులుగా పిలిచి ఒక మంచంమీద విశ్రాంతి తీసికో మనేవాడు. మంచంకంటె అతిథి పొడవైతే అదనపుపొడవును నరికేసేవాడు. మంచమే పొడవైతే మనిషిని బలవంతంగా సాగదీసేవాడు ! మనుష్యుల్ని చంపటానికి అది వాడి కొత్తచిట్కా. నేడు మనవాళ్ళు రాజకీయమంచానికి తగ్గట్లుగా జాతి శరీరాన్ని సమ్మెటపోటులతో కొట్టి సాగదీస్తున్నారు. దీనికి ఫలితంగా యుగయుగాల మన సామాజికజీవితం చావుబ్రతుకుల్లో పడింది.

ప్రతికుటుంబానికి ఒక ఇలవేల్పు ఉంటుంది. శ్రీరాముణ్ణో, భవానినో మరి శంకరుణ్ణో తమ ఇష్టదైవంగా ఆరాధిస్తారు. అట్టి స్థానంలో ఒక దయ్యాన్నో, భూతాన్నో ప్రతిష్ఠిస్తే, ఆ కుటుంబం సర్వనాశనం కావడం తథ్యం. మనదేశంలో ఈనాడు జరుగుతున్నదదే. ప్రాచీన ఆధ్యాత్మిక, సాంస్కృతిక పరంపర అనే ఇష్టదేవతను మన హృదయపీఠంనుండి తీసి పారవేసి, అక్కడ భౌతికవాదం, రాజకీయాలు అనే పాశ్చాత్యపిశాచాన్ని ప్రతిష్ఠించారు.

## 'స్వ' లేని స్వాతంత్ర్యం

అమెరికా, ఇంగ్లండు, రష్యాల జీవనవిధానపుటచ్చుల్లో ఏదో ఒక దాంట్లో మన జీవనపద్ధతిని పోసి క్రొత్తరూపు తేవాలనే ప్రయత్నం సర్వత్రా జరుగుతోంది. 'స్వ' లేని స్వాతంత్ర్యం ఏమిటి? అటువంటప్పుడు అది పర-తంత్రతే అవుతుంది. లెనిన్ ఆదర్శమైతే అది లెనిన్-తంత్రం అవుతుందేగాని, స్వ-తంత్రం కాదు ! మన జాతీయజీవన ఆదర్శాలను-ధర్మ సంస్కృతులను-పరిరక్షించి ప్రచారంచేయటమే,అసలు స్వాతంత్ర్యం యొక్క పరమలక్ష్యం అని మన చారిత్రక పరంపర చెపుతోంది.

చక్రం తిరగాలంటే దానికి లోపలే ఉండాలి దాని గుడిదె (పివట్). అది చక్రానికి వెలుపల ఉంటే ఆ చక్రం తిరుగదు. కేంద్రబిందువు వెలుపల ఉండే వృత్తం ఉండనే ఉండదు. అట్లాగే భారతీయజీవనానికి కేంద్ర బిందువు (ఆయువుపట్టు) విదేశాల్లో ఉన్నట్లైతే భారతీయత నిలువనేరదు. దేశాంతరాలకు విధేయుడైనవాణ్ణి దేశద్రోహి అంటాం. దేశాంతర ఆదర్శాల నుండి స్ఫూర్తిని పొందే వ్యక్తి మరింత దేశద్రోహం చేసినట్లుకాదా ?

'మీది ఏవాదం (ఇజమ్)?' అని కొందరు మనల్ని అడుగు తుంటారు. వాళ్లు పాశ్చాత్యఆలోచనావిధానానికి బానిసలనీ, ఆ యా 'వాదా'ల చట్రాల్లో ఇరుక్కుపోయారనీ, వాళ్ళ ప్రశ్నను బట్టే స్పష్టంగా తెలుస్తుంది. మనకుకూడా ఒక సొంత ఆలోచనాపద్ధతి ఉందనీ, సుస్థిరాలైన సొంత పునాదులపై ఆదర్శ జాతీయజీవనసౌధాన్ని నిర్మించుకోగలమనీ వాళ్ళకు కనీసం ఊహైనా రాదు.

ఇటువంటి అనుకరణ, న్యూనతాభావాల సంకెళ్ళు త్రెంచుకొని మనం బయటపడాలి. అంటే ఇతరదేశాలనుండి మంచిని గ్రహించరాదని కాదు. కాని వాటిని జీర్ణంచేసుకుని, మనజాతి శరీరంలోని రక్తమాంసాలుగా మార్చుకోగలగాలి. కాని నేడు మనం ఈ విదేశీవిషయాల నన్నిటినీ మన జీవశక్తి హరించుకుపోయేటంతగా స్వీకరిస్తున్నాం. పొట్టనిండా తిండి దట్టిస్తే అది అరుగక, ఆ బరువుకే క్రుంగిపోయేవాడి అవస్థే మన కీనాడు పట్టనున్న గతి.

విదేశీయులకు భావదాస్యం చేస్తే మన సహజ సద్గుణాలు నశించి, ప్రపంచంలో నవ్వులపాలవుతాం. "పర్వతాగ్ర ప్రవచన ప్రతి ఒక్కటుంటే చాలు, భగవద్గీత ప్రతులన్నీ అగ్నిపాలైనప్పటికీ ప్రపంచాని కేమీ నష్టం రాదు" అని పోపుతో అన్నాడు మన రాయబారి ఒకడు. ఎంతఘోరం! ఇట్టి 'అభ్యుదయవాద'పు 'ఆ తానులో గుడ్డ'యే ఐన ఇంకొకడు, ఒక చౌకబారు

చలనచిత్ర ప్రేమగీతాన్ని మన జాతీయగీతాల్లో ఒకటిగా, విదేశంలో వినిపించటానికి ఎంపిక చేశాడు. మన అదృష్టంకొద్దీ, క్రిందిఉద్యోగుల్లోని ఒకనియొక్క దేశభక్తిభావనవల్ల ఆ జాతీయావమానం తొలగిపోయింది.

## ఆత్మలేని దేహం

"ఢిల్లీ చూచినప్పుడు, నాకు భారతదేశంలో ఉన్నట్లే అనిపించలేదు. ఆ నగరం లండన్‌కో, న్యూయార్కుకో వట్టి చవుకబారు అనుకరణ మాత్రమే. ఇది ఇట్లాగే కొనసాగుతుంటే మీదేశాని కింక భవిష్యత్తులేదు. అది మరొక దేశంయొక్క కేవల ఉపగ్రహంగానో, బానిసగానో మారక తప్పదు." అని ఒక పాశ్చాత్యుడు అన్నాడు. మనం ఇంగ్లండ్‌వెళ్తే ఆంగ్లం మాట్లాడుతాం; ఆంగ్లేయుడు ఇక్కడకు వచ్చినా మనం ఆంగ్లంలోనే మాట్లాడుతాం! ఎంతవిచిత్రం! పైగా "అంతర్జాతీయవాదులం" అని చెప్పుకుని మురిసిపోతాం. ఇది జాతీయ స్వాభిమానం ఏమాత్రం లేకపోవటం, పూర్తిగా భావదాస్యం అవుతుంది. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ రష్యాకు రాయబారిగా వెళ్ళినపుడు ఆమె తన అధికృతపరిచయపత్రాన్ని ఆంగ్లభాషలో సమర్పించింది.కాని అది మనజాతీయభాషలో లేనందున దాన్ని వారు తిరస్కరించారు అప్పుడు ఆమె హిందీ ప్రతిసమర్పించారు. ఆ హిందీ అనువాదంలో తప్పు ఉండబట్టి త్రిప్పిపంపారు. ఎంతటి అవమానం !

మన సంస్కృతీ దర్శనాలనుగురించి ఎంతో గొప్పగా వ్రాస్తూ, ఉపన్యసిస్తూ, వాటి ఆధారంగా ప్రపంచానికి మనం మార్గదర్శనం చేయగలమని వక్కాణించే ప్రముఖులు మనదేశంలో కొందరున్నారు. కానీ వాళ్ళే ఆంగ్లాన్ని అట్లాగే ఉంచేయాలని, విదేశీవిధానాలు, సంప్రదాయాలు మనంకూడా అనుసరించాలని కాకిగోల పెడుతున్నారంటే విడ్డూరమే మరి!

ఆంగ్లేయులతో పోరాడేదినాల్లో విదేశీవస్తువులను బహిష్కరించి వాళ్ళ వస్త్రాలను దహనం చేశారు. కాని నేడు, ఆంగ్లేయులు వెళ్ళిపోయిన

తరువాత, వాళ్ళ వేషభాషలు మొదలైనవి ఉంచుకొనడమే కాదు, పదేండ్ల క్రితంకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా విదేశీవస్తువులను వాడుకుంటున్నాం. ఇచట ఉత్పత్తికాని వస్తువులను - అంటే సైనిక సాధన సంపత్తి, కొన్నికొన్ని మందులు మొదలైనవాటిని తప్పనిసరిగా దిగుమతిచేసికొనితీర వలసివస్తోంది అంటే అర్థంచేసుకోవచ్చు కాని చీట్లపేకలు, పెదవిపూతలవంటి కొరగాని వస్తువులకోసం కోట్లు ఖర్చుచేయటం మతిలేనిపని. క్రికెట్ ఆట: కోట్లకొలది రూపాయలు ఖర్చుచేస్తున్నాం దీనిమీద; ఇదొక విలాసం అయిపోయింది; ఇంతేకాదు, మన మనస్సుల్ని ఇంకా ఏలుతున్నది బ్రిటిష్‌వారే అని ఋజువుచేస్తోందికూడా. పండిత నెహ్రూ, తదితర సంసద్(పార్లమెంటు) సభ్యులు కొన్నేళ్ళక్రితం క్రికెట్ ఆడారు; అది, ఆంగ్లేయత మనలో ఎంతలోతుగా పాతుకుపోయిందో తెలుపుతోంది. ఒక గొప్పఆటగా 'కబడ్డీ'ని అనేకదేశాలవారు ప్రశంసించారుగదా? అట్టి మన జాతీయక్రీడను వారెందుకు ఆడలేకపోయారు ?

సంపత్తుల్లోనైనా, విపత్తుల్లోనైనా పాశ్చాత్యుల ప్రతి కార్యకలాపాన్ని చైతన్యవంతం చేసేవాళ్ళ జాతీయస్వాభిమానాన్ని, దేశభక్తిని ఉపేక్షించి వాళ్ళ నాగరికతయొక్క క్షుద్రమైన బాహ్యస్వరూపాన్ని మాత్రమే పట్టుక వ్రేల్లాడటం ఎంతవిచిత్రం! కొన్ని దశాబ్దాలక్రితం, సర్వతోముఖమైన సకలసంపదలు ఉన్నప్పటికీ ఇంగ్లండు ఆర్థికసంక్షోభాన్ని ఎదుర్కొవలసివచ్చింది. అప్పుడు ఆ దేశంలోని నాయకులందరూ ఆ సవాలు నెదుర్కొటానికి సమాలోచన చేసి, స్వదేశీభావనను పునరుద్ధరించాలని నిర్ణయించుకున్నారు. దానికి ప్రదర్శనలు ఏర్పాటుచేశారు; ప్రచార యంత్రాంగాన్ని చురుకుగా పనిచేయించారు. ఆ ఉద్యమంలో రాజుకూడా అగ్రేసరుడై నిలిచాడు. రాజు, సమాజంలోని ఇతరనాయకులు, పట్టుదలతో స్వదేశీవస్తువులను తాము స్వయంగా వాడి, ఆదర్శంగా నిలిచారు. తమ దేశంపై ముంచుకొనివస్తున్న ఆర్థికవిపత్తును వాళ్ళు అవిధంగా తొలగించు

కోగలిగారు. మనమో ? పాశ్చాత్యజీవనంలోని డాబు దర్పాల మోజులోపడి స్వదేశీభావనకు తిలాంజలి ఇచ్చి, మన జాతీయజీవనంలోని అన్ని క్షేత్రాల్లోనూ సర్వనాశనాన్ని కొనితెచ్చుకుంటున్నాం.

మన జాతీయఆత్మను పట్టి పీడిస్తున్న ఈ భ్రష్టత మన జీవితంలోని అతిపవిత్రమైన విషయాలనుగూడ విడిచిపెట్టలేదు. వివాహం మనకొక ధార్మికసంస్కారం. సత్కార సమయాల్లో మాత్రమేగాక పవిత్ర పాణిగ్రహణ సమయంలోకూడ పెండ్లికుమారుడు సూటు, బూటు, టై ధరించి, నఖశిఖపర్యంతం ఆంగ్లేయ వేషధారణతో కనబడుతున్నాడు. ధార్మికసంస్కార సమయాల్లోకూడ విదేశీయులను గుడ్డిగా అనుకరించటం చూస్తే మతిపోతోంది. ఎక్కడకు పోయినా ఇటువంటి నిరాశాజనకము, అవమానకరమునైన దృశ్యాలే! తన జీవనవిధానంలో నమ్మకం వమ్మైపోయి, తన గొయ్యి తానే తీసుకునే జాతికి భవిష్యత్తు ఉండబోదు.

మహోన్నత జాతీయ ఆదర్శ, ఆత్మగౌరవాల పరిజ్ఞానం కలిగినవారు కావటంచేతనే మన పూర్వులు మహామహులుగా ప్రపంచగౌరవాన్ని చూరగొన్నారు. తమను తాము వ్యవహరించుకున్న 'ఆర్య' శబ్దంలోనే వారి సంస్కృతీ సౌశీల్యాలు వ్యక్తమైనాయి.

*'న త్వే వార్యస్య దాసభావః'*

(ఆర్యు డేనాడూ దాసుడు కానేరడు)

అని వారు సగర్వంగా ప్రకటించుకున్నారు; సహజగరిమాపరిజ్ఞానజన్యమైన ఇట్టి ఆత్మవిశ్వాసంవల్ల, ధీర గంభీర స్వరంతో యావత్ప్రపంచాన్ని సంబోధించి,

*ఏతద్దేశప్రసూతస్య సకాశా దగ్రజన్మనః ।*
*స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥*

(సమస్త పృథివీవాసులారా ! ఈ దేశంలో జనించిన అగ్రజన్ముల పాదాల వద్ద మీ మీ జీవితపాఠాలు నేర్చుకోండి.)

అని ఆహ్వానించేవారు.

స్వీయ జాతీయజీవనాదర్శాలపట్ల మనకు గల అంతటి ప్రగాఢ ప్రేమాభిమానాలవల్ల మాత్రమే ఈనాడుకూడ మన దేశంయొక్క ఉజ్జ్వల స్వరూపం ప్రపంచంముందు సమంగా ప్రదర్శితమౌతుంది. ఇట్టి పవిత్ర దేశభక్తి దీపాన్ని ఈ గడ్డమీద పుట్టిన ప్రతిబిడ్డ గుండెల్లోనూ తప్పక వెలిగించాలి. ఈనాడు మన దేశాన్ని కమ్ముకుంటున్న మనోదుర్బలతా తిమిరాన్ని అట్టి హృదయాలు వెదజల్లే అమృతరోచిస్సులు పటాపంచలు చేస్తాయి.

ఇట్టి అచంచలవిశ్వాసంతో, జాతీయపునరుజ్జీవనపథంలో ముందుకు చొచ్చుకుపోదాం. జాతిపట్ల ప్రజల భక్తివిశ్వాసాలను భ్రష్టంచేసే చతుర, కుటిలతర్కాల్లోపడి మనం కొట్టుకపోరాదు. ఒక ప్రముఖవ్యక్తి రాష్ట్రీయ స్వయంసేవక సంఘంవారిది 'మూర్ఖదేశభక్తి' అని ఒక వ్యాసంలో వ్రాశాడు. ఎందుకట్లా అనవలసివచ్చిందో మనకు తెలియదు. కాని, మనకు సంబంధించినంతవరకు చెప్పాలంటే దేశభక్తిలో అంతరువులు లేవు. భక్తి అంటే ఆత్మార్పణ; కించిత్తైనా స్వార్థచింతనలేని సర్వస్వసమర్పణ. నిజమైన భక్తిలో అర్ధమనస్కతకు తావులేదు. కాని ఇట్టి ఉరకలెత్తే దేశభక్తిని కొందరు భరించలేరు అనుకొంటాను. బహుశః దాని తాపానికి వాళ్ళు తట్టుకోలేరు. వెచ్చని, గోరువెచ్చని, చల్లని—ఇటువంటి తరతమ బేధాలు గల దేశభక్తి వాళ్ళకు అవసరమై ఉండవచ్చు. భక్తిమకరందాన్ని కడుపార గ్రోలగలిగినవారు 'మూర్ఖత' వంటి పదాలకు వెరచి పెడదారులు త్రొక్కనక్కరలేదు. "అవును, దుర్నిరీక్ష్యతేజోమయ దేశభక్తి జ్వాలను మేం రగిలించితీర్తాం" అని సవాలు చేసి చెపుదాం.

## జాతీయ వైభవ స్రోతస్సులు

నిజానికి అనాదిగా మన సమాజనిర్మాతలందరూ ఇట్టి సుగుణ భూషణులైన మహామహులే. స్వార్థరహితులు, ఆత్మవిశ్వాసభరితులు,

జాతీయతా వైశిష్ట్యానికి గర్వపడే ఆ కార్యరతధ్యేయవాదులు కష్టసమయాల్లో జాతిలోని నిద్రాణమైన పురుషకారాన్ని మేల్కొల్పారు; శిథిలావశేషాల రాశులనుండి, జాతిని వైభవోపేతంగా పునరుద్ధరించారు. అటువంటివ్యక్తులు మాత్రమే సమాజానికి ప్రాణం. ప్రాచీనకాలంలోగూడ విద్యావంతులు, మేధావంతులునైన యువకులు వ్యక్తిగతమైన సుఖానుభూతుల ఆలోచనలను విడిచిపెట్టి, సమాజాన్ని సేవించేందుకు, పైకితెచ్చేందుకు అవిచ్ఛిన్న పరంపరగా ముందుకువచ్చారు. నిస్వార్థసేవకు, త్యాగసౌశీల్యాలకు వారు సాకారమూర్తులు. వారు కందమూలాలు తిని బ్రతికేవారు; లేదా ఇంటింటికి తిరిగి గుప్పెడన్నం తెచ్చుకొనేవారు; ఏదోవిధంగా తమ దేహయాత్రను కొనసాగిస్తూండేవారు. సామాన్యమానవునికి సంక్షేమం సమకూర్చే ఏకైక కార్యంలోనే వాళ్ళ శక్తిసామర్థ్యాలన్నీ సంలగ్నమయ్యేవి. వాళ్లు సామాన్య మానవులతో కలిసిమెలసి ఉండేవారు; వాళ్ళ సుఖదుఃఖాల్లో పాలుపంచుకునే వారు; వాళ్ళ భౌతికమైన వాంఛలను, దుఃఖాలను తీర్చటానికి ప్రయత్నించే వారు; వాళ్ళలో మహోన్నత జీవనాదర్శాలను పాదుకొల్పేవారు. యువకులు, మేధావులు, స్వార్థత్యాగులునైన వారి హృదయశిఖరాలనుండి ఆధ్యాత్మిక, సాంస్కృతిక, ఆదర్శాల ప్రవాహాలు దిగివచ్చి మన సమాజంలోని అన్ని అంతస్తులను సించితం చేశాయి. సాంస్కృతిక దివ్యత్వం, భౌతిక సమృద్ధి అనే ఎడతెగక పారే రెండు ప్రవాహాలకు ఆ యువకులు ఉద్గమస్థానాలు. ఆ ప్రవాహాలు జాతీయజీవనాన్ని పరిప్లావితం చేశాయి. వాళ్లు మనజాతిని భౌతిక, ఆధ్యాత్మిక వైభవాల ఉత్తుంగ శిఖరాన నిలిపి, విశ్వానికంతకూ మార్గాన్ని నిర్దేశించారు.

## మాతృదేవి కోరిక

సేవాభావం, స్వావలంబనం, పవిత్ర మాతృభూమి పాదాలముందల సర్వస్వార్పణ – ఇట్టి ఉదాత్తభావాలే ఊపిరిగా చేసుకొని జాతీయ స్వాభిమానంతో ఉత్రూతలూగే పురుషపుంగవులుగా జీవిద్దాం. ధ్యేయనిష్ఠతో

ప్రజ్వరిల్లే యువకబృందం మాత్రమే, దేశం లోపలనుంచి, వెలుపలనుంచి, వచ్చే మహాప్రమాదాలనన్నిటినీ నివారించటానికై మన ప్రజలను కార్యోన్ముఖులను చేయగలుగుతుంది.

ఈ పరీక్షాసమయంలో జన్మించటం మన అదృష్టమని భావిద్దాం. శాంతిసమృద్ధులు, అధికారవైభవాలు కలిగిన జాతిలో జన్మించటం అరుదైన అదృష్టంగా కొందరు భావించవచ్చు. ఇట్లా భావిస్తూ, అమెరికా, ఇంగ్లండు మొదలైనదేశాల్లోని విలాసాలచే వ్యామోహితులై అక్కడకే వెళ్ళిపోయేవారు నేడు మనదేశంలో అనేకులున్నారు. కాని, నిజమైన వీరులు దీనికి భిన్నంగా ఆలోచిస్తారు. తమ జీవితకాలంలో కష్టనిష్ఠురాలు, ఇబ్బందులు, ఇక్కట్లు ఎదురైతే వాటితో పోరాడి సమృద్ధిని సాధించాలనుకుంటారు; అట్టి అవకాశం తమకు కల్పించినందుకు భగవంతునికి ధన్యవాదాలు తెల్పుతారు. 'పుట్టటం, కొంతకాలం హాయిగా జీవించటం, ఏదో ఒకనాడు రాలిపోవటం' – సమృద్ధిగల సమయాల్లో పుడితే మన జీవితానికి ఇంతకంటె విలువేముంటుంది? కాని, కష్టసమయాల్లో పుడితే, మనలోని ఉత్తమలక్షణాలన్నిటినీ ప్రదర్శించేందుకు, మన పౌరుషాన్ని పరీక్షించుకొనేందుకు, యావత్ప్రపంచంముందు భవ్యమైన ఒక ప్రచండ వ్యక్తిత్వ ప్రతీకగా నిలబడేందుకు మనకొక అవకాశం లభిస్తుంది. మనలో పరిపూర్ణవ్యక్తిత్వాన్ని వికసింపచేసుకునేందుకు, మానవుని మేధకు అందని మహోన్నతశిఖరాల నధిరోహించటానికి మనకొక సదవకాశం లభించిందన్నమాట.

ఈనాడు అన్నిటికన్న మిన్నగా యువకులు, మేధావులు, త్యాగులు, మగసిరిగలిగిన వీరులు కావాలని భారతమాత కోరుకుంటోంది. శాశ్వత జ్ఞానస్వరూపుడైన నారాయణుడు, శాశ్వత పౌరుషస్వరూపుడైన నరుడు కలిస్తే విజయం తథ్యం. అట్టి పౌరుష, ప్రభావ సంపన్నులైన పురుష పుంగవులే చరిత్రను సృష్టించగలరు.

# 36. ధ్యేయవ్రతులు

విభిన్నకారణాలవల్ల చెల్లాచెదరైపోయిన మన సోదరులనందరను ఒకే శాశ్వత భ్రాతృత్వభావనతో బంధించి ఉంచటం, అట్టి సంఘటనలోని ప్రతిఒక్కరికి తగినపని ఒప్పగించి, ఆ విధంగా వాళ్లు జాతికి సేవచేయగల్గేట్లుగా చేయటం, అనే ఈ జాతీయపునస్సంఘటనోద్యమం బహుక్లిష్టమైన విషయం. ఈ క్లిష్టతకు కారణం, కార్యకర్తల నడవడికి సంబంధించిన ఒకేవిధమైన నియమావళిని క్రోడీకరించటానికి అలవికానట్టి, లెక్కలేనన్ని తరహాల మానవప్రకృతులను సమన్వయపరచవలసిరావటమే. ప్రతిమనిషికీ స్వతంత్రవ్యక్తిత్వ ముంటుంది; కనుక అతనితో వ్యవహరించటానికి ఒక ప్రత్యేకమైన వ్యవహారసరళి అవసరమౌతుంది. కాబట్టి రాష్ట్రకార్యానికి అంకితమైన కార్యకర్తయొక్క వ్యవహారసరళికి సంబంధించిన ముఖ్యమైన మార్గదర్శక సూత్రాలపై మాత్రమే మన దృష్టిని కేంద్రీకరిద్దాం.

## ఉన్నతుడైనా ఉపయోగం శూన్యం

మన ప్రజల్లోని జాతీయచైతన్యశూన్యత, సంఘటితజీవన భావనారాహిత్యం జాతీయ పునర్నిర్మాణాన్ని చేపట్టినవాళ్ళకు అడుగడుగునా ఎదురయ్యే అడ్డంకులు. కాబట్టి అట్టి కార్యకర్తలకు, ఇతరులను తమతో

పొల్చుకొని వాళ్ళు చాలా తక్కువస్థాయిలో ఉన్నారని అనాలనిపిస్తుంది. ఇది సామాన్యంగా ఆత్మస్తుతికి, అహంకారానికి దారితీస్తుంది. జాతికంకిత మైన కార్యకర్త అతిక్రమించవలసిన మొదటిప్రమాద మిది. ఇతరులందరూ నిష్ప్రయోజకులనే భావనతో ప్రారంభిస్తే, అట్టి ప్రజలమధ్యనే అత డెట్లా పనిచేయగలుగుతాడు ? ఎట్లా వారినుండి ప్రేమపూర్వకమైన సహకారాన్ని పొందగలుగుతాడు ?

మైత్రీభావంతో తనవాళ్ళతో కలిసిమెలిసి జీవించటానికి అడ్డువచ్చే ఔన్నత్యం'వల్ల ప్రయోజనమేమిటి ? అందుకే సంత్ కబీర్ ఇట్లా అన్నాడు :

*ఊంచా భయా తో క్యా భయా జైసే తాల్ ఖజూర్ ।*
*పథికన్ కో ఛాయా నహీ ఫల లాగే అతి దూర్ ॥*

(బాటసారికి నీడనివ్వవు; పళ్ళు, అందుబాటులో ఉండవు. అంత ఎత్తుగా ఉన్న తాటిచెట్లు, ఖర్జూరపు చెట్లవల్ల ఏప్రయోజనమూ లేదు. ఇట్టి పెద్దఱికం ఏమిలాభం ?)

చిన్నచెట్లే ఐనా కొద్దినీడను, కొద్దిపాటి పళ్ళను ఇవ్వగలిగితే అవి ఉపయోగకరం.

కనుక కార్యకర్తకు కొన్ని గొప్పగుణాలున్నప్పటికీ అతడు తన ఉన్నతస్థాయి' నుండి సాధారణమానవుని స్థాయికి దిగివచ్చి, తన ఔన్నత్యాన్ని సాటివారితో పంచుకోవాలి. తా నేదో అసాధారణమైనవ్యక్తి అనేభావం ఇతరులకు రానివ్వకుండా అతడు అందరిలో ఒకడై పోవాలి. తన త్యాగ సామర్థ్యాల స్పృహయొక్క నీడైనా తనకు ప్రజలకు మధ్య పడకూడదు. కార్యకర్త తనలో అలవరచుకొనేందుకు ప్రయత్నించే వివిధసద్గుణాలన్నీ ఈ సమాజంయొక్క పాదాలప్రోల సమర్పించటానికే గదా ! అసలు గొప్పతనమంటే ఇదే.

## మట్టినుంచి మణిక్యాలు

మహామహులైన మన యుగకర్తలందరూ, చెల్లాచెదరై ఉన్న ప్రజాశక్తిని సంఘటితంచేసి అజేయ జాతీయశక్తిగా రూపొందించింది ఈ పద్ధతిలోనే. నిరుపేదలు, నిరక్షరకుక్షులు ఐన కృషీవలులతో సహవాసం చేసి, వాళ్ళను ధ్యేయనిష్ఠాగరిష్ఠులుగా, విజయశీలురైన జాతీయ మహావీరులుగా శివాజీ తీర్చిదిద్దాడు. పాదుషాల పాదసేవలో మునిగి తేలుతున్న వాళ్ళనుకూడ బయటికిలాగి స్వదేశ, స్వధర్మాల సేవలో పాలు పంచుకొనేట్లు చేశాడు. అతడు శత్రువునుండి గుంజుకున్న అమూల్య రత్నాల్లో, సాటిలేని మేటి యోధుడైన మోరాక్ బాజీ దేశపాండే ఒకడు. ముస్లింస్త్రీప్రలోభ, పదవీవ్యామోహాలకు, సుల్తానుల దమననీతికి లొంగి పోయిన అనేకులను శివాజీ స్వధర్మ పునరాగమనం చేయించాడు. శివాజీ సైన్యాధిపతుల్లో ఒకడైన నేతాజీ పాల్కర్‌ను ఔరంగజేబు బంధించి, ఇస్లాం లోకి మార్చి స్తే, అతడు తప్పించుకొని శివాజీవద్దకు వచ్చాడు. శివాజీ అతణ్ణి పునరాగమనం చేయించి, అతనితో కలిసిమెలిసి ఉండటానికి ఇతరులేమాత్రం వెనుకాడవలసిన పనిలేకుండా, తన కుటుంబంలోనుండే ఒకతె నిచ్చి పెండ్లి చేసి రక్తసంబంధమేర్పరచుకున్నాడు. బజాతీ నింబాల్కర్‌ని హిందుత్వ పరిధిలోనికి తిరిగితెచ్చుకొని, అతని కొడుక్కి స్వంతకూతుర్నిచ్చి శివాజీ పెళ్ళి చేసాడు. జాతీయ సంఘటనపట్ల ఎంతటి మహోత్కృష్ట దృష్టి!

శ్రీకృష్ణుని జీవితంలో ఇట్టిసంఘటనే జరిగింది. లోకానికి నరకాసురుని పీడ తొలగించి, అతడపహరించితెచ్చిన వేలాదిస్త్రీలకు శ్రీకృష్ణుడు విముక్తి ప్రసాదించగా, నాటిపెద్దలకు ఒక తీవ్రసమస్య ఎదురైంది. సాటిలేని మేధా సంపత్తిచేత, గుణగణాలచేత, సర్వోత్తమ ధర్మవేత్తగా విశ్వమాన్యతను పొందిన శ్రీకృష్ణుడు వాళ్ళందరూ తన ధర్మపత్నులేనని లాంఛనప్రాయంగా ప్రకటించి, తద్వారా వాళ్ళకు సమాజంలో గౌరవప్రపత్తులు కల్గించాడు; ఆ సమస్యను పరిష్కరించాడు. నిజానికి, వ్యక్తులు ఎంతటి తక్కువస్థాయికి చెందినవాళ్లైనప్పటికీ, వాళ్ళలో ప్రతిఒక్కడికి ప్రతిష్ఠను, ప్రయోజకత్వాన్ని

కల్పించటమే సమాజంయొక్క మహోన్నతధర్మం. కవి, మోరోపంత్ ఇట్లా అన్నాడు :

*పరి ప్రభుహి సంగ్రహీ సకల వస్తులా తేవితీ /*
*గుణా న వ్హాణతా ఉణా అధిక ఆదరే సేవితీ //*

(విలువలేనిది అని దేనినీ తొలగత్రోయక, మహాపురుషులు అన్నివస్తువులను తమతోనే ఉంచుకుంటారు.)

## ప్రథమావశ్యకత

గుణదోషాల విషయంలో వ్యక్తులందరూ ఒకేవిధంగా ఉండరు. అయినాగాని, సమాజాన్ని సర్వసద్గుణసంభరితము, సర్వశక్తిసంపన్నము చేసేందుకుగాను, ప్రతివ్యక్తి తనలోని సమస్తసద్గుణసంపత్తిని సమర్పించాలి. ఆవిధంగా అతనికి స్ఫూర్తిని ప్రసాదించగలిగే సామరస్యపూర్ణము, సుసంబద్ధమునైన సంఘటన నిర్మాణనిమిత్తమై వ్యక్తులందరిని సమీకరించాలి. ఈపని సాధించటానికి, ప్రప్రథమంగా, జాతిసేవకుడు సమాజంతో పూర్తి తాదాత్మ్యం పొందాలి.

ఒకసాధువు కుక్కనొకదాన్ని ఒళ్ళో కూర్చోపెట్టుకొని, వీధిలో పారేసిన ఎంగిళ్ళను ఎంతో ఆపేక్షతో దానికి పెడ్తూ, తానూ తింటున్నాడు. త్రోవనేపోతున్న ఒకాయన అతణ్ణి ఆత్మసాక్షాత్కారం పొందిన వ్యక్తిగా గుర్తించి దగ్గరకు వెళ్ళాడు. ఈయన్ని చూడగానే ఆ సాధువు పారిపోతూ ఈయన తనవెంటపడకుండా ఉండటానికి రాళ్లువిసరటం మొదలుపెట్టాడు. కానీ, ఏమాత్రం ఆగకుండా తనను వెంటనంటివస్తున్న ఆ వ్యక్తిని చూచి, నిలిచి "ఎందుకు నావెంటపడివస్తున్నా"వని ఆ సాధువు ప్రశ్నించాడు. స్వామీ! మీరు భగవత్సాక్షాత్కారం పొందారు; నాకు తెలుసు. నాకుగూడ దారిచూపించండి' అని అన్నాడు. అప్పుడాసాధువు ప్రక్కనున్న మురుగు కాలవచూపి 'ఈనీటికి గంగాజలానికి ఏమీ తేడాలేదని నీవు తెలుసుకున్నప్పుడే

భగవత్సాక్షాత్కారానికి అర్హుడవవుతావు' అని అన్నాడు. నిజానికి సమాజ సంఘటనమంటే రాష్ట్రభగవానుని సాక్షాత్కారమే. ఇది ఎప్పుడు సాధ్య పడుతుందంటే, మామూలు బిచ్చగాణ్ణి, మహావిద్వాంసుణ్ణికూడ ఒకేవిధమైన భ్రాతృత్వానురాగంతో వీక్షించటానికి అవసరమైన తాదాత్మ్యభావన మనలో ఏర్పడినపుడు.

## నటనలు వద్దు

జాతీయ కార్యవ్రతుని మనస్సులో ఒక ప్రముఖవిషయం ఎప్పుడూ మెదలుతూ ఉండాలి. ప్రతిఒక్కరితోను తనకుండవలసిన అనుబంధము, ఆప్యాయతలలో ఎటువంటి నాటకము, బూటకము ఉండగూడదు. తెచ్చి పెట్టుకున్న జాలి ఎవరిమీద ఒలకపోయకూడదు. 'శుష్కప్రియాలు - శూన్యహస్తాలు' అన్నట్లు - మెరమెచ్చు మాటలవల్ల, వింతచేష్టలవల్ల ఏ సంఘటనా కొనసాగజాలదు. కార్యకర్తలోని సోదరప్రేమ సహజంగా పెల్లుబకాలి. సమాజమంతా దివ్యత్వంయొక్క సజీవప్రతీకగా అతడు సందర్శించగలగాలి; బాహ్యస్వరూపాన్ని పట్టించుకోక, ప్రతివ్యక్తిలోనూ ఆ దివ్యత్వంయొక్క వెలుగురేఖను చూడగలగాలి. ఆంతరిక ఏకత్వ సాక్షాత్కారజన్యమైన సమతాదృష్టిని అలవరచుకునేందుకు మన సంస్కృతి మనలను సర్వదా ప్రోత్సహించింది.

బాలఋషి, అష్టావక్రుడు (అష్టవంకరలు కలవాడు) జనకమహారాజు ఆస్థానంలో అడుగుపెట్టాడు. అక్కడ విద్వత్సభ జరుగుతోంది. అతని వికారాకారాన్ని చూచి ఆవిద్వాంసులు ఫక్కున నవ్వారు. "ఇది వేదాంతులసభ అనుకొన్నాము.ఎంత పొరబాటు ! ఇది గొడారివాళ్ళు కసాయివాళ్లున్నచోటా! అని ఆ బాలుడు ప్రశాంతంగా అన్నాడు. సభ నివ్వెరపోయింది. 'వివరంగా చెప్పు' అని జనకుడు అడిగాడు. "నేను అంటే నా ఎముకలు, మాంసం, చర్మమే అనుకొన్నారు ఈ పెద్దమనుష్యులు. మాంసమూ, ఎముకలవ్యాపారం

కసాయివాడిది; తోళ్ళవ్యాపారం గొడారివాడిది. నిజమైన వేదాంతి సర్వ జీవుల్లోనూ ఒకే ఆత్మను సందర్శిస్తాడు" అని అన్నాడు ఆ బాలమహర్షి.

## మధుర సమన్వయం

తా నెంతటిఘనుడై నప్పటికీ, ఇతరుల్లోకూడ కొద్దో గొప్పో సుగుణా లుంటాయన్న మాట మరచిపోరాదు. సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు జ్ఞానజ్యోతిని కొందరికే ఇచ్చి, ఇతరులందరినీ అంధకారంలోనే ఉంచాడని అనుకోవటం మిథ్యాభిప్రాయమే. తమను 'ఆర్యులు'గా సగర్వంగా ప్రకటించుకొని, మానవసమాజాన్నంతను ఆర్యమయం చేయసంకల్పించు కొన్న మన ప్రాచీనఋషులే, మ్లేచ్ఛుల్లోగూడ ఉదాత్తము, శ్రేష్ఠము ఐన నడవడికి అవకాశమున్నదని ప్రకటించారు. తమ ఆత్మగౌరవానికి ఏమాత్రం భంగం రానీయకుండానే ఇతరులను తమతో కలుపుకొనే విశిష్టలక్షణం మన పూర్వీకులవద్ద ఉండేది. ఈ పద్ధతిలోనే, ఎవరినీ విడువకుండానే, అందరినీ గౌరవిస్తూనే జాతీయ పునస్సంఘటనాకార్యక్రమం కొనసాగింపవలసి ఉంది.

ప్రజలందరూ సద్గుణవంతులు అనీ. కాకపోయినా తీర్చిదిద్దగలమనీ, వాళ్ళుకూడా బాధ్యతల్లో పాలుపంచుకోగలరనీ, ఏ ఒక్కడూ స్వతస్సిద్ధంగా మూర్ఖుడు, దేశద్రోహి కాడనీ-ఇట్టి దృఢవిశ్వాసంతోనే జాతిసేవకుడు పని ప్రారంభించాలి. ఒక్కొక్కసారి జాతీయసంక్షేమానికి వ్యతిరేకంగా ఆలోచనలు, ఆచరణలు చేస్తున్న కొందరు వ్యక్తులను విమర్శించవలసి రావచ్చు. అప్పుడుకూడా, వ్యక్తికి సముచితగౌరవాన్నిచ్చి, అతనిలోని మంచిని అంగీకరించాలి.

## మంచితనంలో నమ్మకం

వాస్తవానికి ఇతరుల మంచితనాన్ని గుర్తించగల్గటం అత్యుత్తమము, అపురూపమునైన సద్గుణాల్లో ఒకటి. ఇతరుల సద్గుణబీజాలను నీరుపోసి

పెంచాలి; అందరిముందు ప్రదర్శించకుండానే, వాళ్ళలోని దుర్గుణాల కలుపు మొక్కలను జాగ్రత్తగా ఏరిపారెయ్యాలి; డాబు దర్పాలు లేని తన ఉదాత్త ప్రవర్తనయొక్క ఉదాహరణద్వారా ఇదంతా సాధించాలనేది కార్యకర్తకు నిర్దేశకసూత్రం. వ్యక్తులయొక్క విలువనుబట్టి, వాళ్ళతో 'వ్యాపార సరళిలో' మాత్రమే వ్యవహరించాలి - అనేది లౌక్యమెరిగినవారి సలహా. కాని సమాజాన్నంతనూ సంఘటితపరచాలనే ధ్యేయం కలవాళ్ళకు ఉండవలసిన మనఃస్థితికి ఇది పూర్తి విరుద్ధం. పదేపదే తోటివారు వ్యతిరేకించినా, అవమానించినా, ఎప్పటి సేవా, ప్రేమభావాలతోనే పదేపదే వాళ్ళచుట్టూ తిరుగవలసివస్తుంది.

ప్రవాహవేగాన కొట్టుకుపోతున్న ఒక తేలును ఒక సాధువు నదిలో స్నానంచేస్తూ చూచాడు. దాన్ని కాపాడుదామని చేయిచాచగానే అది కుట్టింది. వెంటనే చేయి విదిలించాడు. మళ్ళీ చేయిచాచాడు. మళ్ళీ కుట్టింది. ఇట్లా చాలాసార్లు జరిగింది. చివరకు ఆయన దాన్ని నీళ్ళల్లోంచి బయటికి విసిరివేశాడు. చూచినవాళ్ళకు ఇది వింతగా తోచింది. 'తేలు సంగతి తెలిసి కూడ ఎందు కింత తంటాలుపడ్డాడు?' అని ముక్కుమీద వ్రేలు వేసుకొన్నారు. అది చూచి సాధువు అన్నాడు, 'బుద్ధిలేని ఆ క్షుద్రజీవికూడ తన స్వభావాన్ని విడిచిపెట్టనపుడు, బుద్ధికలిగిన నేను నా స్వభావాన్ని ఎందుకు విడిచిపెట్టాలి?'

## అచంచల సాహచర్యం

మనమంతా భారతమాత సంతానం. ఏకగర్భజనితులమధ్య ఆగర్భ శత్రుత్వం ప్రశ్నేరాదు. కార్యకర్త అనుభవించే ఉపేక్ష, వ్యతిరేకతలకు కేవలం ఇతరుల్లోని అజ్ఞానమే కారణం; అవి తాత్కాలికాలు మాత్రమే. ప్రతివ్యక్తియొక్క ప్రస్తుత అభిరుచులు, స్థితిగతులు ఎట్లాఉన్నప్పటికి అతణ్ణి సమానతా, స్నేహభావాలతోను, అతని స్వతస్సిద్ధమైన మంచితనంపట్ల విశ్వాసంతోను కార్యకర్త సమీపించాలి. స్వచ్ఛమైన తన సౌశీల్యాన్ని

ఉదాహరణగా చూపుతూ అతనిపట్ల తనకున్న నిష్కల్మషమైన ప్రేమ, గౌరవం ఆదారంగా, అతనిలోని వివిధ బలహీనతలను, దుర్గుణాలను, స్వభావగతమైన విభేదాలను సరిదిద్దగలను అనే ఆత్మవిశ్వాసం కూడ కార్యకర్తకు ఉండాలి.

సచ్ఛీలం ఉన్నంతమాత్రాన చాలదు. కొందరికి విశుద్ధశీలం ఉన్నప్పటికి వాళ్ళు తమ మొరటుమాటలతోనూ, చేతలతోనూ ఇతరులను నొప్పిస్తారు. పైగా తమ మొరటుతనానికి తామే మురిసిపోతారు. 'నేను కుండపగుల గొట్టినట్లు మాట్లాడుతాను, ఎవరైనా బాధపడినా నాకు లెక్కలేదు' అనిఅంటారు. కాని జాతీయ పునస్సంఘటనకార్యాన్ని చేపట్టినవ్యక్తి, అట్లా ఉండటానికి వీల్లేదు. అతని పలుకుల్లో తేనెలొలికితీరాలి. ఒకరాజు తన ఆయుర్దాయాన్ని గురించి ఎప్పుడూ జ్యోతిష్కులనడుగుతూ ఉండేవాడు. 'నీవు దీర్ఘాయువువే గాని, నీకండ్లముందే నీకొడుకు చనిపోతాడు' అని అందరూ చెప్పేవాళ్ళు. కష్టంకలిగించే ఈమాటకు అతనికి సహజంగా కోపంవచ్చేది; వాళ్ళను దండించేవాడు. చివరకు ఒక వృద్ధజ్యోతిష్కుడు, "రాజా నీవంటి అదృష్ట జాతకుడులేడు. నీ సొంతచేతులతో నీ మనుమడికి పట్టాభిషేకం చేస్తావు" అన్నాడు.దీనితో రాజు ఉబ్బితబ్బిబై, అతణ్ణి ఘనంగా సత్కరించి పంపాడు. ఇతరులవలె అతను కటువుగా చెప్పక, ఉన్నవిషయాన్నే మరొకపద్ధతిలో తీయగా చెప్పాడు. తేడాఅంతా ఇందులోనేఉంది. అందుకే "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్" (నిజం చెప్పు; తియ్యగా చెప్పు) అన్నారు.

మరొక సర్వసాధారణమైన లోపం గురించి గూడా జాగ్రత్త వహించాలి. నిందారోపణలు, అవహేళనలవంటివాటికి జీవితంలో స్థానం లేదని, కాదుగానీ, వాటిని అత్యవసరమైనప్పుడు మాత్రమే వాడాలి. గరళాన్ని కూడా వైద్యానికుపయోగిస్తున్నాం కదా ! కానీ– ఎల్లప్పుడూ ఈ

ధోరణి మంచిదికాదు. ఈ ధోరణి మనిషిని దిగలాగేస్తుంది. అయితే మానవుడెప్పుడూ గంభీరంగా వుండాలనిగానీ, తుమ్మల్లో ప్రొద్దుక్రుంకినట్లా తని ముఖంవుండాలనిగానీ, హాస్యానికీ, హాసానికీ తావులేదనిగానీ అర్థం కాదు. ఒక ఆదర్శ కార్యకర్తను భగవద్గీత ఈ రకంగా వర్ణిస్తోంది.

ముక్తసంగో ఽ నహంకారీ, ధృత్యుత్సాహ సమన్వితః।
సిధ్యసిధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥

(నిస్సంగుడు, నిరహంకారి, ధైర్యోత్సాహాలు కలిగినవాడూ, గెలుపోటములకు చలించనివాడూ సాత్త్వికుడగువాడే కార్యకర్త అవుతాడు.)

కార్యకర్త తన విశుద్ధశీలానికి, మధురవాక్కును, ప్రవర్తనను జోడించుకొన్నప్పుడే, లోకసంగ్రహంచేసి, కష్టనిష్ఠురాలన్నిటిలో తానుంతా కలిసికట్టుగా నిలబడేట్లు చేయగలుగుతాడు.

శీల, ధైర్య, విప్లవభావాలకు మారుపేరైన చంద్రశేఖర అజాద్‌కు సంబంధించిన ఉదంతం ఒకటుంది. ఆంగ్లేయ గూఢచారిదళమంతా ఆయన కోసం గాలిస్తోంది. అప్పుడాయన తన మిత్రుడు, ఒక ప్రభుత్వోద్యోగి, ఇంట్లో తలదాచుకొన్నాడు. రక్షకభటులు అనుమానించి ఆ ఇల్లు చుట్టుముట్టారు. చంద్రశేఖర్ అజాద్ గురించి, తనకేమీ తెలియదని రక్షక భటాధికారులను నమ్మించటానికి ఆస్నేహితుడు ఎంతగానో ప్రయత్నించాడు. లోపల ఉన్న అతనిభార్య ఇదంతా విన్నది. చంద్రశేఖర్ లోపల పిల్లలతో ఆడుకొంటున్నాడు. ఆరోజు సంక్రాంతి. తక్షణమే ఆ గృహిణి ఇట్లా అరచి : "ఓరి చవటదద్దమ్మా ! ఇప్పటికే ఆలస్యమై పోయింది. ఇంకా ఇరుగుపొరుగు వాళ్ళందరికీ మిఠాయిలు పంచిపెట్టిరావాలి. నువ్వేమో, పిల్లలతో ఆడుకుంటూ కూర్చున్నావు" అని గదమాయించింది. చిటికలో సేవకుడైపోయాడు చంద్రశేఖర్; ఆమె వెనకాలే నెత్తిమీద బుట్టపెట్టుకొని, రక్షకభటాధికారుల

కళ్ళల్లో కారంకొట్టి, బయటికి జారుకొన్నాడు. 'మిఠాయిలు పంచిపెట్టిన తర్వాత బుట్టగాని, 'ఆ సేవకుడు' గాని తిరిగివస్తే మరి ఒట్టు! పిల్లల్లో పిల్లవాడై ఆడుకుంటూనే ఆ యింటిని, సమాజకార్యానికి ఉపకరించే ధైర్య, విశ్వాస, చాతుర్యాలకు పెట్టనికోటగా మార్చగలిగాడు. ఎక్కడ ఉన్నా, ఏమి చేసినా, అదే మన పద్ధతి; అదే మన ఆదర్శం.

## సర్వసద్గుణాలకు ఏకైక శత్రువు

పని పెరిగి, ప్రతిష్ఠ, ప్రభావాలు పెరుగుతున్నకొద్దీ, ప్రజలు కార్యకర్తలను ప్రశంసిస్తూ ఉంటారు. అదిగో, అక్కడే ఉంది గొయ్యి. తన సామర్థ్యం, పలుకుబడులమీద ఒక నమ్మకం కలిగి అతనిలో అహంభావం ఏర్పడుతుంది. అతనికి సన్నిహితంగా వచ్చినవాళ్ళకు అతని అహంకార దుర్గంధం వెగటు పుట్టించి, వాళ్ళ ముక్కుపుటాలను బద్దలుచేస్తుంది. వాళ్లు అతనికి దూరదూరంగా ఉండిపోతారు. సంత్ జ్ఞానేశ్వర్ అహంకారం యొక్క విచిత్ర స్వభావాన్ని మనోహరంగా వర్ణించాడు.

*నవల అహంకారాచే గోఠీ । విశేష న లగే అజ్ఞానాచే పాఠీ*
*జ్ఞానీయాంచే పడె కంఠీ । మహా సంకటీ ఘాలితసే ॥*
(అహంకారంయొక్క పద్ధతులు విచిత్రాలు. అవి అజ్ఞానులను స్పృశించ లేదు. కాని విద్వాంసులను మెడబట్టి మహాప్రమాదంలోకి నెట్టుతుంది ).

కాబట్టి అతడు ఎంతో మెలకువతో ఉండాలి; అహంకారంయొక్క టక్కులకు తాను గురికాకుండా చూచుకోవాలి. అహంభావమే సకల సద్గుణాలకు పరమశత్రువు. ప్రలోభాలన్నిటికీ అదేపుట్టిల్లు

ఒకసారి వ్యాసుడు తనశిష్యుడైన జైమినిని వ్రాయుమని ఒకశ్లోకం చెప్పాడు.

*"బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి"*

(బలీయమైన ఇంద్రియ సమూహం విద్వాంసులను సైతం పెడత్రోవను పట్టిస్తుంది.)

కాని, తన ఆత్మసంయమనంపట్ల విపరీతమైన నమ్మకంగల జైమిని అందు లోని పదాలను

*"బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంసం నాపకర్షతి"*

(ఇంద్రియ సమూహం ఎంతబలీయమైనదైనప్పటికీ, విద్వాంసుని పెడత్రోవ పట్టించలేదు.)

అని మార్చివ్రాశాడు. వ్యాసుడు అదిగమనించి, అప్పటికి ఊరుకొన్నాడు. జైమిని తపస్సుచేస్తూ అడవిలో ఉండేవాడు, ఒకసాయంత్రం పెనుగాలివాన వచ్చింది. ఒక అందమైనయువతి వానలో పూర్తిగాతడిసి ముద్దై, ఆ చీకటివేళ పర్ణశాలకువచ్చి, ఆ యువతాపసుణ్ణి శరణుకోరింది. ఆశ్రమంలోని అగ్నికుండందగ్గరకువెళ్ళి ఆమె తనవస్త్రాన్ని ఆరబెట్టుకుంటోంది, ఇంతట్లోనే పెనుగాలివీచి ఆమెవస్త్రాన్ని ఎగురకొట్టింది; ఆమెవివస్త్రఐంది. అదిచూచి యువకుడైన జైమిని నిగ్రహించుకోలేకపోయాడు; ఆమెను కోరాడు. ఆమె మీరు తాపసులు, ఇట్టి వ్యామోహంలో పడకూడదు, అని ఎంతగానో చెప్పింది. కాని ప్రయోజనం శూన్యం. చివరకు, తనను భుజాలపై ఎత్తుకొని అగ్నిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేస్తే అతనికోర్కె తీరుస్తానన్నది. వెర్రివ్యామోహంతో వెంటనే దానికి ఒప్పుకొని అతడు ఆమెను భుజాలపై ఎత్తుకున్నాడు. అగ్నిచుట్టూ తిరగటం మొదలుపెట్టగానే, ఎగతాళిగా *"విద్వాంసం నాపకర్షతి?"* అంటూ ఆమె అతని తలపై మొట్టసాగింది. తన గురువు మాటలే పదేపదే వినబడుతుంటే అతనికి ఆశ్చర్యం కల్గింది. ప్రదక్షిణాలు పూర్తిచేసి, అతను ఆమెను క్రిందికిదించాడు. కాని తన గురువైన వేదవ్యాసుడే తనవంక సాభిప్రాయంగా చిరునవ్వుతో చూస్తూ ఉండటం గమనించి, కంగారుపడి, జైమిని పశ్చాత్తాపంలో మునిగిపోయాడు; పరుగుపరుగునపోయి ఆ శ్లోకాన్ని యథాప్రకారంగా మార్చిరాశాడు.

# ఆత్మవిశ్వాసం పెంచుకోండి, అహంకారం త్రుంచుకోండి

తాను ఎంతటి సద్గుణవంతుడైనప్పటికి ప్రతిఒక్కడి నడవడిలో నమ్రత, కుశలత ఉండాలని మన మహాపురుషులందరూ ఆదేశించారు. ఐతే తాను తోటివ్యక్తులతో వ్యవహరించేటప్పుడుగాని, క్లిష్టపరిస్థితుల్లోగాని కార్యకర్త తన ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవాలనిగాదు దాని అర్థం. నిజానికి గొప్పగొప్ప కార్యకర్తలందరకూ ఆత్మవిశ్వాసమే ప్రాణం.

శాంతం, స్థైర్యం, ఆత్మవిశ్వాసం కల వ్యక్తులే పర్వతాలనైనా పెకలించివేయగలరు. రెండవ ప్రపంచయుద్ధసమయంలో బాంబులవర్షానికి గురియైంది లండన్ నగరం. అక్కడ శిథిలాలరాశిపై నిటారుగా నిలబడి తన ప్రజలను ఉద్దేశించి మాట్లాడుతూ తానచటకు దుఃఖించటానికి రాలేదనీ, నెత్తుటిని, చెమటను, శ్రమను, కన్నీటిని, విజయాన్ని ! వాగ్దానంచేయటానికి వచ్చాననీ ప్రకటించాడు, ఇంగ్లండువృద్ధసింహం, విన్‌స్టన్ చర్చిల్. ఆయన్ని చూచినప్పుడు, ఒడుదుడుకుల నెరుగని, దృఢవిశ్వాసంగల మనస్సుయొక్క శక్తి ఎంతటిదో మనకు తెలుస్తుంది.

జైన సాహిత్యంలో ఒక చక్కని కథ ఉంది. ఒకసారి బలరామ కృష్ణులు, సాత్యకి, అడవిలో చిక్కుబడిపోయారు. ఆరాత్రి అంతా ఒక చెట్టుక్రింద గడపాలనీ, ప్రతిఒక్కడూ రెండేసి గంటలు కాపలాకాయాలనీ నిర్ణయించుకున్నారు. మొదట సాత్యకివంతు; మిగిలిన ఇద్దరూ నిద్రపోయారు. కొద్దిసేపట్లోనే ఒకబ్రహ్మరాక్షసుడు చెట్టుపైనుండి క్రిందకుదూకి అముగ్గురినీ మ్రింగివేస్తానని సాత్యకిని భయపెట్టాడు. సాత్యకి రెచ్చిపోయి వాడితో పోరు మొదలుపెట్టాడు. కాని ఆకృతిలోను, శక్తిలోను ఆ రాక్షసుడు పెరిగిపోతూఉండడంచూసి సాత్యకికి మతిపోయింది. మరింత రెచ్చిపోయాడు. రెండుగంటల తర్వాత పూర్తిగా అలసిపోయి, బలరాముణ్ణి నిద్రలేపి, తాను నిద్రపోయాడు. సాత్యకి నిష్క్రమించగానే ఆ బ్రహ్మరాక్షసుడు క్షణకాలం పాటు మాయమైపోయి, బలరాముడు రంగంలోకిరాగానే తానూ వచ్చాడు.

తాను అపారశక్తిమంతుడననే భావంగల బలరాముడు ఆగ్రహోదగ్రుడై వాడితో తలపడ్డాడు. కాని ఇతనికీ అదేగతి పట్టింది. తర్వాత శ్రీకృష్ణుణ్ణి మేల్కొల్పి తాను నిద్రపోయాడు. బ్రహ్మరాక్షసుడు శ్రీకృష్ణుణ్ణికూడా ఎదిరించాడు. కాని శ్రీకృష్ణుడుమాత్రం ప్రశాంతంగా ఊరుకున్నాడు. తన అనంత శక్తిసామర్థ్యాలపై అతనికి ఎంతో విశ్వాసం. రాక్షసుణ్ణి ఎట్లా ఆడించాలోకూడ తెలుసు. ఆటలుపట్టిస్తూ, అలవోకగా వాణ్ణి కొట్టటం మొదలు పెట్టాడు. ఎంత ఆశ్చర్యం! శ్రీకృష్ణుడీమాదిరిగా చేస్తుంటే, రాక్షసుడు క్రమంగా కుంచించుకుపోయాడు. చివరకు శ్రీకృష్ణుడు వాణ్ణిపట్టుకొని తన కొంగున ముడివేశాడు. బలరామసాత్యకులు ప్రొద్దున్నే నిద్రలేచారు. కాని, శ్రీకృష్ణుడు అసలు ఏమీ జరుగనట్లుగా, తీరికగా, ప్రశాంతంగా ఉండటం చూచి, ఆశ్చర్యపడ్డారు. తర్వాత శ్రీకృష్ణుని ఉత్తరీయంచెంగున చిన్న పురుగులాగా ఆ బ్రహ్మరాక్షసుడు వణికిపోతుంటే, వాళ్ళు మరింతగా విస్మయం చెందారు.

స్వశక్తియందలి ప్రగాఢ విశ్వాసంవల్ల ఏర్పడిన మానసిక ప్రశాంతతయే అనంతశక్తిస్రోతస్సు. కోపోద్రేకాలు ప్రశాంత నిర్ణయశక్తిని, సుదృఢ క్రియాశక్తిని నాశనంచేస్తాయి.

కాని కార్యకర్త ఆత్మవిశ్వాసంపేరిట అహంకారానికి లోను కాగూడదు; వినయంపేరిట ఆత్మవిశ్వాసహీనుడు కాగూడదు. ఇట్టి సవ్యమైన మానసిక సంతులనాన్నే ప్రయత్నపూర్వకంగా అలవరచుకోవాలి.

మన చరిత్రలోని మహాపురుషులను ఒక్కసారిపరిశీలిస్తే అట్టి మానసిక సంతులనం పెంపొందించుకోటానికి తగినంత స్ఫూర్తి లభిస్తుంది. స్వార్థత్యాగాల, ధైర్యస్థైర్యాలయొక్క శిఖరాగ్రాల నందుకున్న మహోన్నతులైన ఆ వ్యక్తులముందు మన మెంత మరుగుజ్జులుగా, . కొరగానివారుగా

కనుపిస్తామోకదా! ఆలోచనలోనూ, ఆచరణలోను మహాసమర్థులైన ఆ వ్యక్తిత్వాలతో పోల్చినప్పుడు మనలో ఏమిచూసుకొని విర్రవీగగలం? ముప్పది రెండేండ్ల స్వల్పజీవనవ్యవధిలో ఆ శంకరాచార్యుడార్జించిన జ్ఞానసాగరంలో ఒక్క బిందువైనా పొందగలమా? కడు బాల్యంలోనే కష్టభూయిష్ఠమైన సన్యాసిజీవితాన్నే స్వీకరించి, రాష్ట్రీయ పునరుత్థాన సందేశాన్ని చాటుతూ, ఈ సువిశాలదేశంలో నలుమూలలా పాదచారియై పర్యటించారు. ఆయన నింగినీ నేలనూ ఒక్క చేతిమీదుగానే ఏకంచేసి, ప్రజలను మేల్కొలిపి వాళ్ళలో మన పరంపరాగత జీవన ఆదర్శాలపట్ల నిజమైన చైతన్యాన్ని కల్గించారు. అయినా ఎంతటి వినయశీలత! ఒకచోట ఇలా అంటారు

*సత్య పి భేదాపగమేనాథ తవా హం న మామకీనస్త్వం।*
*సాముద్రోహి తరంగః క్వచన సముద్రోన తారంగః॥*

(నీకూ నాకూ తేడా సమసిపోయింది. కానీ స్వామీ! నేను నీవాణ్ణి, నీవు నావాడవు కావు. తరంగాలు సముద్రానివేగానీ, సముద్రం మాత్రం తరంగాలది కాదుగదా!)

అట్టి మహోజ్జ్వల జీవితాలను నిరంతరం స్మరించటంవల్ల మన హృదయాలుకూడ ప్రదీప్తమౌతాయి; నిరహంకారంగా, ఆత్మవిశ్వాసంతో వాళ్ళ అడుగుజాడలను అనుసరించటానికి స్ఫూర్తి లభిస్తుంది.

## అహంకారరాహిత్యమే విజయం

అహంకార దర్పాలఛాయ లేశమాత్రమైనా ఉన్నట్లైతే కార్యకర్త తన సమాజంయొక్క సుఖదుఃఖాల్లో సౌహార్దపూర్వకంగా, తాదాత్మ్యభావనతో పాలుపంచుకోలేడు. ఇతరులు తనను ఆడిపోసినా నొచ్చుకోక, వాళ్ళ ఎడ స్నేహం కల్గిఉన్నప్పుడే అది సరియైన స్నేహం అవుతుంది. తన ఎడ ఇతరులు ప్రవర్తించిన తీరువల్ల, ఇతరుల దృష్టిలో తానెంత అవమానింపబడినా, తానుమాత్రం ఏమీ బాధపడకుండా ఉండగలిగినప్పుడే, ఆ యా వ్యక్తులతో తనకు నిజమైన స్నేహముందని, ఆ కార్యకర్త అనుకోవచ్చు.

ఈ అభిప్రాయాన్ని మనోహరంగా వ్యక్తంచేసే ఒక చిన్న పద్యం ఉంది. ఒక యువతి, ఒక యువకుడు పరస్పరం ప్రేమించుకొన్నారు. కాని ఆమె తల్లిదండ్రులు వారి వివాహానికి ఒప్పుకోలేదు. కాబట్టి వారిద్దరూ ఒకసారి చాలాదూరప్రాంతంలో ఏకాంతంగా కలుసుకొంటారు. "నేను ఆమెను గొంతుపిసికి చంపినా, ఆమె ఏమాత్రం బాధపడలేదు" అని ఆ యువకుడా పద్యంలో అంటాడు! నిజమైన ప్రేమ ఉంటే, ఒకరిపట్ల ఒకరి ప్రవర్తనలో బాధా కోపాలు వ్యక్తం కావని మాత్రమే దీని అర్థం. మనకు అవమానం జరిగిందనే భావన కలిగితే, మనలోని అహంకారాన్ని పూర్తిగా తుడిచివేయ లేదని దాని అర్థం. ఇటువంటి ప్రతిసందర్భంలోను మనం నెగ్గుకురావలసిన అగ్నిపరీక్ష ఇదే.

తాను స్వీకరించిన మహత్తరకార్యం అనే హోమాగ్నిలో తన అహంకారాన్ని పూర్తిగా ఆహుతిచేసుకొన్నప్పుడు మాత్రమే కార్యకర్త ఆ మహోద్యమానికి ఒక యోగ్యమైన సాధనంగా రూపొందగలడు. సమంగా శ్రుతిచేసిన మంచివాద్యం మాత్రమే విద్వాంసుని చేతుల్లో మధురస్వరాలను పలుకుతుంది. అదేవిధంగా కార్యకర్త తన అహంకార స్వభావంయొక్క వంకరటింకరల నన్నిటినీ సరిచేసుకొంటే, విశుద్ధము, స్ఫూర్తిప్రదమునైన ఆత్మవిశ్వాస కార్యదీక్షలయొక్క ఉత్తేజకరమైన స్వరాలు అతనిమాటల్లో-చేతల్లో అన్నింటిలో చైతన్యంతో తొణికిసలాడుతుంటాయి.

వ్యక్తియొక్క సహజసిద్ధమైన స్వభావం మార్చనలవికాదు. అది కుక్కతోకవంటిది, అని కొందరంటారు. కాని ఇది పాక్షికసత్యం; జీవితంలో ఒకలక్ష్యమంటూ లేని వ్యక్తులకు మాత్రమే ఇది అన్వయించదగినది. కాని ఒక ధ్యేయంగల మనిషికి,

*"నర కరనీ కరే తో నర కా నారాయణ బన్ జాయ్"*

(స్వయంకృషితో నరుడు నారాయణుడు కాగలడు.)

అనే సందేశం బాగా అన్వయిస్తుంది. "ప్రతిసాధువుకూ ఒక గతం ఉంది. ప్రతిపాపికి ఒక భవిష్యత్తు ఉంది" అని గుర్తుంచుకోండి. "నే నేమాత్రం

మారను; నన్ను నన్నుగా తీసుకోండి" అనే మనస్తత్వం సుసంఘటిత సమాజ నిర్మాణంలో ప్రయోజనకారికాదు. 'యూజ్ మి' (నన్నువాడుకో) అని వ్రాసిన కాళ్లతుడ్చుకొనే పీచువంటిదది. ధ్యేయానికంకితమైన చైతన్యంగలవ్యక్తులకు ప్రాణరహితమైన వస్తువులకు వ్యత్యాసము ఉండనక్కరలేదా? నిరంతర చింతన, ఆత్మపరీక్షలద్వారా కార్యకర్త తనకవసరమైన సద్గుణాలన్నిటినీ అలవరచుకొని. తాను స్వీకరించిన ఆదర్శాన్ని సఫలమొనర్చడానికి అనుగుణంగా తనజీవితాన్ని మలచుకోవాలి.

## ఒక జీవితం, ఒకే లక్ష్యం

సంఘటిత జాతీయజీవనం సృజించాలనే ఆదర్శంతో తానెంతవరకు తాదాత్మ్యం పొందాడో, ఆత్మ పరీక్షద్వారా కార్యకర్త సరిగా అంచనా వేసుకోగలుగుతాడు; ఏకాకిగా ఉన్నాగాని, ఎంతమందిలో ఉన్నాగాని తన ఆలోచనలను, అనుభూతులను, ఆచరణలను ఉద్రూతలూగించేవిధంగా ఆదర్శం తన జీవితాన్నంతటినీ ఆవరించుకొన్న ఏకైకఆవేశంగా ఏర్పడిందా లేదా, అనేదికూడా కార్యకర్త గ్రహించగలుగుతాడు. ఒంటరిగా ఉన్నప్పుడు వ్యక్తి ఆలోచించేదాన్నిబట్టి, ఆచరించేదాన్నిబట్టి అతని సిసలైన శీలం ఉంటుంది. ముఖ్యంగా ఈనాడు రకరకాల అశ్లీలచిత్రాలు, పాటలు, చలనచిత్రాలు, నవలలు, వినోదాలు మొదలైన ఆధునిక నాగరికతా వ్యామోహాలు, యువకుల మనస్సులను ఆవరించటంవల్ల, తెలియకుండానే యువకుడు వాటిప్రభావాలకులోనయ్యే అవకాశాలు చాలాఉన్నాయి. వేలాది ఆకర్షణలు అతణ్ణి వెర్రెత్తిస్తాయి. మనస్సంయమనం లేకపోతే పెనుతుఫానులో నట్టనడిసంద్రాన చుక్కానిలేని నావలాగ అవుతుంది అతని పరిస్థితి. అట్టి అస్తవ్యస్త చిత్తం వ్యక్తిని సర్వనాశనం చేస్తుంది. కనుకనే

"అవ్యవస్థితచిత్తానాం ప్రసాదోఽపి భయంకరః"
(అస్తవ్యస్త చిత్తుల అనుగ్రహంకూడా అపాయకరమైనదే.)

మరి అట్లాంటివాళ్ళకు కోపంవస్తే ఇక చెప్పేదేముంది ? కాబట్టి పెదదారులు పట్టించి, సర్వభ్రష్టతకు దారితీసే నేటి వాతావరణంలో ధ్యేయవ్రతుడు కఠోరమైన ఆత్మపరీక్ష చేసికోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## నిత్య సింహావలోకనం

ఈ పని చేయాలంటే కార్యకర్త ప్రతి ఉదయమూ, రాత్రి ఒంటరిగా కూర్చొని తన మనస్సును తాను పరిశీలించుకోవాలి. వివేక పూరితమైన దృష్టితో, తన మనస్సులో ఏదైనా చెడు తలంపు ప్రవేశించిందేమో చూచుకోవాలి; అలా ప్రవేశించినట్లయితే, దాన్ని నెట్టిపారేసి, మరునాడు మనస్సు పరిశుభ్రంగా వుండాలని నిశ్చయం చేసుకోవాలి. పాపిష్ఠి సంగతుల నుండి మనస్సును వెనక్కులాగేసుకుని, తన జీవన వ్రతానికి చెందిన ఆలోచనల్లో నిమగ్నమై పోవాలి. మొదటి రోజులాగే మరునాడు కూడా అతడు దుష్ట ఆలోచనల బారిపడవచ్చు. అయినా నిరుత్సాహ పడకూడదు. రోజూ తనను తాను పరీక్షించుకోవడం, మళ్ళీ నిశ్చయం చేసుకుంటూ ఉండటం, అవసరం. క్రమక్రమంగా, తన మనస్సు పాపపుటాలోచనలకు అంతగా పరిగెత్తటం లేదనీ, మంచి మంచి ఆలోచనలు మనస్సులో మెదులుతూ ఉన్నాయనీ అతడు తెలుసుకోగలుగుతాడు.

రోజూ మన ప్రార్థనను పఠించటం, ఈ దృష్ట్యా ఒక శక్తిప్రదమైన సాధన. ప్రార్థనలోని ప్రతీమాటా, ప్రతీ అక్షరం యొక్క ఉచ్చారణా సమంగా ఉండాలి, అనే విషయంలో ఎంత శ్రద్ధవహిస్తాడో, ప్రతి పదం యొక్క అర్థం విషయంలో కూడా అంతటి శ్రద్ధా వహించాలి. ఈ రకమైన సంస్కారాలు పదే పదే కలుగచేస్తుంటే క్రమంగా ఆలోచనల్లోకి రంగరించుకొని అవే శీలాన్ని సరిదిద్దుతాయి.

లౌకిక ఆకర్షణలు ఎన్ని ఉన్నప్పటికీ, నిరంతర ప్రయత్నంవల్ల తాను స్వీకరించిన జాతీయ పునరుజ్జీవనకార్యంమీద పరిపూర్ణఏకాగ్రతను కార్యకర్త సాధించగలుగుతాడు. దైవీశక్తుల ముందు ఆసురీఆకర్షణలు నిలువనేరవు; ఎంత చిన్న ప్రయత్నం చేసినాసరే అతనికి దైవీశక్తులు శ్రీరామరక్షయై, అతని శక్తిసామర్థ్యాలను అధికాధికం చేస్తాయి. అప్పుడు లక్ష్యసిద్ధిలోనే అతని జీవితానికి సంతృప్తి, సార్థక్యం లభిస్తాయి. ఆ ఆనందం ముందు బాహ్యాకర్షణలన్నీ వెలవెలపోతాయి.

లోకమాన్య బాలగంగాధరతిలక్ జీవితంలో రెండు ఉదంతాలున్నాయి. పూర్తిగా పరస్పర విరుద్ధమైన రెండు సన్నివేశాల్లో తిలక్ ఎంతటి మానసిక సంతులనమూ, ధ్యేయంయెడ ఏకాగ్రచిత్తత కలిగి వుండే వారో, ఆ రెండూ తెలుపుతాయి. ఒకసారి కుమారుడికి పెద్దజబ్బుచేస్తే, ఆయన కుమారుడి సేవచేస్తూనే 'కేసరి' పత్రిక సంపాదకుడుగా కూడా తన బాధ్యతని తూ. చా. తప్పకుండా నిర్వర్తిస్తూండేవారు. పత్రిక సకాలంలో వెలువడేది. ఒక రోజున సంపాదకీయవ్యాసం వ్రాయటంలో మునిగిపోయి వున్న తిలక్ వద్దకు, ఆయన కుమారుని స్థితి ప్రమాదకరంగా ఉందని కబురువచ్చింది. వార్తాహరులతో "వ్యాసం పూర్తిచేసి వచ్చేస్తాను. ఇంతట్లోకే వైద్యుణ్ణి పిలవండి" అన్నారు. తిలక్ సంపాదకీయం పూర్తిచేసి ఇంటికివెళ్ళి కన్నకొడుకు శవాన్ని మాత్రమే చూచారు. తమ కుమారుని అంత్యక్రియలు ఎంతో గంభీరంగా తొణక్కుండా నిర్వర్తించారు.

ఒక ప్రఖ్యాతగాయకుని పాటకచేరికి ఒకసారి లోకమాన్య తిలక్‌ను తీసికొనిపోయారు. సంగీత సుధాస్రవంతిలో సభాసదు లందరూ ఓలలాడారు. కాని తిలక్‌కు ఇదేమీ పట్టలేదు. తర్వాత ఆ గాయకుడు అది గమనించి, 'నేను బాగా పాడలేదా ?' అని అడిగాడు. "నీగానం ఎంతోబాగుంటుంది; సందేహంలేదు. కాని నా చెవులు ఆ భగవానుని దివ్యగానం - భగవద్గీతతో నిండిపోయాయి. కనుకనే నేను నీ సంగీతం విని ఆనందించలేకపోయాను" అని తిలక్ సమాధానం చెప్పారు.

## ఆత్మసమర్పణలోని ఆనందం

ఆదర్శంకోసం సర్వసమర్పణ చేయాలి అనే భావనచే ప్రభావితమైన హృదయంలో జనించే ఆనందోత్సాహాలు, నిరాశానిస్పృహలను పటాపంచలు చేస్తాయి. ఇద్దరు యోగులు భగవత్సాక్షాత్కారం కొరకు తీవ్రతపస్సు చేస్తున్నారు. నారదుడు దేవలోకం పోతూపోతూ వాళ్ళవద్దకు వచ్చాడు. మరింకెన్ని జన్మలపాటు ఈ తపస్సు కొనసాగిస్తే సాక్షాత్కారం కలుగుతుందో ఆ భగవంతుణ్ణే అడిగిరమ్మని వారు నారదుణ్ణి అర్థించారు. నారదుడు తిరిగివచ్చి మొదటివాడితో అన్నాడు: "ఇక నాలుగు జన్మలు చాలు" అని. ఇది విని "భగవాన్! ఇంకా నాలుగుజన్మలా?" అని కుప్పకూలిపోయాడు. తర్వాత రెండవయోగికి ఒక చింతచెట్టు చూపి, "ఆ చింతచెట్టుకు ఎన్ని ఆకులున్నాయో అన్ని జన్మలెత్తాలింకా" అన్నాడు. ఇదివినగానే ఆ యోగి ఎగిరిగెంతేశాడు. నారదుడు ఆశ్చర్యపోయి, కారణం అడిగితే అతడు "భగవంతుణ్ణి చేరేటందుకు ఇంకెన్ని జన్మలెత్తాలో కచ్చితంగా తేలింది. అంటే భగవంతుణ్ణిచేరుకోవటం ఖాయంఅన్నమాట. ఎంతఊరటకల్గించారు?" అన్నాడు. అతడామాట అంటుండగానే "ఈక్షణంలో ముక్తుడవైపోయావు" అని అశరీరవాణి పలికింది. అట్టి యావజ్జీవ ప్రయత్నశీలత, పరిపూర్ణ విశ్వాసం, అచంచలఇచ్ఛాశక్తి మాత్రమే అద్భుతాలను సాధించగలవు.

## ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత

ఎంతో కష్టపడందే, ఎన్నో త్యాగాలు చేయందే, ఏ మహాకార్యమైనా సిద్ధించదు. కార్యకర్తతనవ్యక్తిగతసుఖాలను,కుటుంబంయొక్క సంతోషాలను వెలగా చెల్లించి, ప్రయాసలు, ప్రమాదాలతో కూడిన జీవితాన్ని ఆనందంగా ఆహ్వానించి, ధ్యేయవాద పథంలో పయనించాలి. కర్తవ్యకఠోరతామయ జీవిత నౌకాయాత్రలో ధృవతార శ్రీరామచంద్రుని ఉజ్జ్వల ఉదాహరణ. బాల్యంలో విశ్వామిత్రుని ఆదేశానుసారం తల్లిదండ్రులకు దూరమై

రాక్షసులతో తలపడ్డాడు. రాజభోగాలు వదలుకొని ఆశ్రమవాసం చేశాడు. తదనంతరం సీతను చేపట్టి, అయోధ్యకు తిరిగివస్తుండగా మహాభయంకరుడైన పరశురాముడిని ఎదుర్కోవలసి వచ్చింది. తర్వాత కొంచెం కుదుటపడి, కొద్దిగా భోగాలు అనుభవించాడో లేదో, పదునాలుగేండ్ల అరణ్యవాసం వచ్చిపడింది. ఆ పదునాలుగేండ్లుకూడ పరీక్షా సమయమే – రాక్షసులతో యుద్ధాలు, సీతాపహరణం, లంకలో మహాయుద్ధం. అయోధ్యకు తిరిగి వచ్చి పట్టాభిషిక్తుడయ్యాడు; రాజవిధి నిర్వహణలో సీతనే పరిత్యజించాడు. తర్వాత దుర్వాసునిబారినుండి అయోధ్యను కాపాడే నిమిత్తమై, ఆయన కోపాన్ని శమింపజేసేందుకుగాను, కష్టాలన్నిటిలోనూ నీడలా తనను వెన్నంటి నిలచినవాడు, ప్రాణసమానుడు, ఆత్మీయుడు అయిన లక్ష్మణుణ్ణిగూడ వదలుకోవలసివచ్చింది. నిజానికి శీలంలోను, సామర్థ్యంలోను, కష్టసహిష్ణుతలోను, త్యాగంలోనూ రాముడికి రాముడేసాటి.

ఒక పద్యకథ. ఒక యువకుడు 'ఉత్కర్ష' (ఎక్సెల్సియర్) అని వ్రాసిఉన్న జెండా పట్టుకొని ఒక పర్వతమార్గంగుండా పెనుతుఫానులో ముందుకు సాగిపోతున్నాడు. ఆ కటికచీకటిలో కొంతసేపటికి ఒక కుటీరం కన్పడింది. లోపల ఒకదీపం; దాన్ని సమీపించేసరికి ఒక ముదుసలి స్త్రీ ఆగుడిసెలోనుండి వెలుపలకువచ్చి, అతణ్ణాపి 'నాయనా! ఇంత పెనుతుఫానులో ఎక్కడకుపోతావు; నాకు కొడుకులు లేరు; ఇక నీవే నాకొడుకువి. ఇక్కడే ఉండిపోయి ఈ ఆస్తంతా అనుభవించు' అని చెప్పింది. అతడామాటలు పట్టించుకోలేదు. ఇంతట్లో ఆమె అందాల కూతురువచ్చి, ఆ అందగాణ్ణి, ఆ కండలుతిరిగిన యువకుని ఊరించింది. "ఇంతవరకు నా హృదయాన్ని ఎవరికి అర్పించలేదు. ఇక నన్ను నీకు అర్పించుకుంటున్నాను. ఇక్కడే ఉండిపోవా!" అని అంది. ఆ యువకుని సమాధానం యథాప్రకారంగానేఉంది. "ముందుకేపోతాను. నన్నేదీ ఆపలేదు" అని ముందుకు సాగిపోయాడు.

1857 స్వాతంత్ర్యసమరంలో సాటిలేనిమేటిసేనాధిపతి తాత్యాటోపే జీవితంలో సరిగ్గా ఇట్లాంటి సంఘటనే సంభవించింది. అజీజాన్ అనే నవ జవ్వని ముస్లింసర్తకి, అతని పురుషపుంగవ సౌందర్యానికి ముగ్ధురాలైంది, అతని హృదయాన్ని చూరగొనటానికి తన సొగసులన్నీ చూపింది. కాని తాత్యా ఆమెను చూచి "ఆంగ్లేయులను తరిమివేయటం ఒక్కటే నాజీవిత వాంఛ; నీకు తెలుసుగదా ? నాకు మరొక ఆలోచనేరాదు! కానీ, నీవు నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్లైతే, నాకు ఆనందం ఇవ్వదల్చుకుంటే నీవుకూడా ఈ మహత్తర కార్యంలో నీ చేయూత ఇయ్యి" అని ఆమెతో చెప్పాడు. అజీజాన్ వెంటనే అంగీకరించింది. తనవద్ద నున్న ధనమంతా తాత్యాటోపే స్వాధీనం చేసింది. అతని పథకం ప్రకారం ఆంగ్లేయుల సైనిక శిబిరానికి పోయింది. అచ్చట ఆంగ్ల సేనాధిపతులకు తన అందచందాలు చూపి వాళ్ళను వలలో వేసికొని, వాళ్ళ కదలికలన్నిటినీ కనిపెట్టి జాతీయవిప్లవనాయకులకు అందజేసింది. స్వయంగా యుద్ధరంగంలో వీరోచితమరణాన్ని పొందేటంత వరకు ఆమె ఈ కార్యం కొనసాగించింది.

తాత్యాటోపేవంటి వ్యక్తులే, కేవలం తమ స్పర్శ మాత్రం చేతనే క్షుద్రలోహాలను బంగారంగాను, కష్టాలనన్నిటినీ సదవకాశాలుగాను, చివరకు వ్యామోహాలనుగూడ-తమలక్ష్యసాధనకొరకు కొనసాగించే మహాయుద్ధంలో అవకాశాలుగాను మార్చుకోగలరు. వివేకానందుడుచెప్పినట్లు, వాళ్ళ 'భయంకర శక్తి'ని ఉపాసిస్తారు. ('వర్షిప్ ది టెరిబుల్') ప్రమాదాలనే కోరుకొంటారు. తమ నరనరాల్లో సెగలురగిల్చే శక్తితో, తమ కన్నుల్లో ఆదర్శవాదపు కాంతిరేఖలతో, వ్యామోహాలు, కష్టాలు అనే తుఫానుల్లో కలవరపాటు లేకుండా, స్థైర్యంతో నలుగడల స్ఫూర్తిని ప్రసరింపచేస్తూ, తాము కన్న కలల్లోని ధ్యేయాన్ని సాధించేంతవరకు విజయపథంలో ఒక్కొక్క అడుగేవేస్తూ పురోగమిస్తూనే ఉంటారు.

## 37. మూర్తీభవించిన ఆదర్శం

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సంస్థాపకులు డాక్టరు కేశవరావు బలీరామ్ హెడ్గెవార్ నాగపూరులో, క్రీ. శ. 1889 వ సంవత్సరంలో జన్మించారు. శైశవదశనుండి అంతిమశ్వాసవరకు వారిజీవితం మాతృదేశ సేవలో నిశ్చలజ్యోతిగా వెలుగొందింది. ఎనిమిదేండ్ల వయస్సులోనే విక్టోరియారాణి జన్మదినంనాడు పాఠశాలలో తనకిచ్చిన మిఠాయిలను, అవి బానిసమనస్తత్వానికి చిహ్నమనిచెప్పి, చీదరించుకొని పారవేశారు. వారువేసే విచిత్ర ప్రశ్నలకు పెద్దలు ఆశ్చర్యచకితులయ్యేవారు. "ఎన్నోవేలమైళ్ళ నుంచి వచ్చిన ఆంగ్లేయులు మనలనెట్లాపరిపాలించగలిగారు?" ఇటువంటివి ఆ ప్రశ్నలు. తోటి ఉన్నత పాఠశాలా విద్యార్థుల్లో 'వందేమాతరం' ఉద్యమ జ్వాలను రగిలించినందుకు వారిని బడినుండి బహిష్కరించారు. మాతృ గర్భంలో ఉన్నప్పుడే వారు దేశభక్తిభావనను అలవరచుకున్నారా అనిపిస్తుంది.

### అపురూపాల్లో అపురూపం

పూణేనగరంలో మెట్రిక్యులేషను పూర్తిచేసిన పిదప విప్లవోద్యమాన్ని అతిసన్నిహితంగా అధ్యయనంచేయటానికి, దాంట్లోపాల్గొటానికి ఆరోజుల్లో విప్లవవీరులకు నిలయమైన కలకత్తానగరం వెళ్ళారు. బెంగాలీ ఆచారాలను

పాటించటం మొదలుపెట్టారు; అచిరకాలంలోనే వాళ్ళలో ఒకరై పోయారు. అక్కడ వివిధ సాంఘిక, రాజకీయ కార్యకలాపాల్లో దూకి, భారతదేశం నలుమూలలనుండి అక్కడకుచేరిన యువదేశభక్త బృందానికి అనతికాలం లోనే ఒక స్ఫూర్తికేంద్రమయ్యారు.

ఆ ప్రతిభావంతుడైన యువకవైద్యుడు నాగపూర్ చేరుకోగానే ఒక ఉజ్జ్వల ఆజీవిక ( బ్రైట్ కెరీర్ ) వారికోసం కాచుకూర్చుంది, అని పలువురు ఎంతో ఆశపడ్డారు. అందరి కండ్లూ వారిమీదే. ఎన్నో పెండ్లి సంబంధాలు వచ్చాయి. కాని, సంకుచిత, సాంసారిక శృంఖలాబద్ధం కాదగింది కాదు వారి జీవితం. అటువంటి ప్రతిపాదనలన్నిటికీ, తుదిసమాధానంగా వారు తమ పినతండ్రిగారైన ఆబాజీ హెడ్గెవార్‌కు లేఖలో, "నా జీవితాన్ని ఒక ఆదర్శాని కంకితంచేశాను. ఆ పూజాపీఠంపై నా సర్వస్వాన్ని సమర్పించు కున్నాను. అటువంటప్పుడు వ్యక్తిగత సుఖాలకు, గృహస్థజీవితానికి తీరిక, ఓపిక నా కెక్కడిది ?" అని వ్రాశారు.

వారిది గర్భదరిద్ర కుటుంబం. తనయొక్క, తన ఆప్తబంధువుల యొక్క ఉదరపోషణ నిమిత్తమై ఎటువంటి చీకు చింత లేనంతటి సంపదతో జన్మించిన వ్యక్తులు దేశకార్యంకొరకుముందుకురికేవారిని-అట్టిఉదాహరణలు కూడా చాలా అరుదుగా ఉన్నా-కొందరిని మనం చూచి ఉండవచ్చు. అయితే డాక్టర్‌జీ అపురూపుల్లో అపురూపులు. కటికబీదరికంతో, అర్ధాకలితో సతమతమవుతున్నా, తనకోసంగాని, కుటుంబంకోసంగాని ఒక్కపైసాకూడా సంపాదించాలన్న ఆలోచనే వారికి రాలేదు. వారు వైద్యులే; అయినప్పటికీ ఎన్నడూ వైద్యవృత్తి స్వీకరించలేదు. 'జాతికి వైద్యుడు' కావటానికే వారి నిర్ణయం.

## దీపకళిక

దుర్భరదారిద్ర్యం ఆత్మసఖునిలా వారిని అంతిమశ్వాసవరకు అంటి పెట్టుకొనేఉంది. వారు నెలలతరబడి ఏకభుక్తంతోనే కాలక్షేపం చేశారు;

చాలాసార్లు చినిగిన దుస్తులతోనే గడిపేవారు. జీవితపు కనీసావసరాలకు గూడా వారి కెప్పుడూ లోటే.

ఒకనాడొక పెద్దమనిషి డాక్టర్‌జీని చూడవచ్చాడు. సంభాషణ పూర్తికాబోతూంటే డాక్టర్‌జీ వారిని తేనీరు త్రాగివెళ్ళ మని కోరారు; లోపలికి కబురు పంపారు. పదినిమిషాలు గడిచాయి; తేనీరురాలేదు. మరో పదినిమిషాలూ గడిచాయి; ఇంకా రాలేదు. ఆ పెద్దమనిషి వెళ్ళాలని తొందర పడుతున్నాడు. విషయం తెలుసుకుందామని డాక్టర్‌జీ లోపలికి వెళ్ళారు. లోపల మంచినీరుతప్ప ఇంకేమీలేదు. వదినగారు కూర్చుని ఉన్నారు. అంగడికి వెళ్ళిరావటానికి కూడ ఎవరూలేరు. అందుచేత డాక్టర్‌జీయే స్వయంగా వెళ్ళి పంచదార, తేయాకు తీసుకువచ్చారు. కాసేపటికి ఆ పెద్ద మనిషికి తేనీరు ఇచ్చారు. విషయం బోధపడటానికి ఆ పెద్దమనిషికి అట్టేసేపు పట్టలేదు. ఎంతోకాలంగా డాక్టర్‌జీ తెలిసిఉన్నా, వారియొక్క ఆర్థికస్థితిని గురించి ఆయనకు బొత్తిగాతెలియదు. ఎప్పుడూ చిరునవ్వులు చిందే వారి ముఖం, ఉజ్జ్వలమైన వారి ఉత్సాహం, సాంక్రామికహాసం, అందరినీ ఆకట్టు కొనే అలవాట్లు, సర్వత్ర మాధుర్యాన్ని, ఆనందాన్ని, వెదజల్లుతూఉంటే, మాసేవారెవరికి డాక్టర్‌జీ ఎట్టి విపరీత పరిస్థితుల్లో జీవించేవారో ఊహకైనా అందేదేకాదు. తనను తాను నిశ్చలంగా దహించుకుంటూ, నలుగడలా వెచ్చదనాన్ని, వెలుతురును వెదజల్లే దీపకళికవంటివారు డాక్టర్‌జీ.

ఆ సంఘటన జరిగిన వెంటనే ఆ పెద్దమనిషి నాకు కబురుపంపి డాక్టర్‌జీయొక్క ఆర్థిక స్థితిగతులను గురించి వివరంగా చెప్పుమన్నారు. ఆ దుర్భర పరిస్థితులను తెలుసుకొని ఆయన నిశ్చేష్టులయ్యారు. ఎంతో బాధపడి, "వారి ఆర్థికమైన చిక్కులను తొలగించటానికి ఎందుకు ప్రయత్నించలేదు" అని నన్ను కోపపడ్డారు. "శివరాత్రి ఆకలిని ఏకాదశి తీర్చగలదా ?" అని నేను అన్నాను. కొద్దిక్షణాలు గంభీరంగా ఆలోచించి "నేను దీన్ని భరించలేను; ప్రతినెలా పాతికరూపాయలు ఇస్తాను; అధమం

అతిథి మర్యాదలు నడిపేందుకైనా మీరు తీసుకొని తీరాలి. కాని ఈ సంగతి మాత్రం డాక్టర్‌జీకి తెలియకూడదు సుమా!" అన్నారాయన. "వారితో ఈ విషయం మీరే చెప్పండి" అన్నాను. ఇట్టి విషయాల్లో డాక్టర్‌జీ సంగతి ఆయనకు బాగా తెలుసు కనుక, వారితో ప్రస్తావించటానికి సాహసించలేదు. అంతటితో ఆ కథ ముగిసింది.

## వీగిపోయిన సామెత

జ్వలంతమైన ఆదర్శవాదానికి తోడు, తాను స్వీకరించిన జీవిత కార్యానికి అనుగుణంగా తనను తాను సంస్కరించుకోగల ఇచ్ఛాశక్తి అనే ఉత్తమోత్తమ గుణానికి వారు ఒక ఉజ్వల ఉదాహరణ. వారిది ఉగ్రము, సాహసోపేతమునైన స్వభావానికి పేరుగన్న కుటుంబం. పిత్రార్జితమైన ఆ 'ఆస్తి'ని వారసత్వంగా డాక్టర్‌జీ పూర్తిగా పుణికిపుచ్చుకున్నారు. 'పుర్రెతోపుట్టినబుద్ధి పుడకలతోగానిపోదు' అనీ, 'స్వభావో దురతిక్రమః' అనీ అంటుంటారు. 'తల్లిదండ్రులను జాగ్రత్తగా ఎన్నుకోవాలి' అనే విచిత్ర వాక్యంకూడా ఆ అర్థాన్నే సూచిస్తుంది. కానీ, ఆత్మవిశ్వాసాన్ని బలహీన పరచే ఇట్టి అభిప్రాయాలన్నీ అసత్యాలని డాక్టర్‌జీ నిరూపించారు. వివిధ స్వభావాలుగల వ్యక్తులను కలబోసి, సుసంఘటితము, సామరస్యపూర్ణము ఐన ఒక సమష్టిగా నిర్మించాలనే దృఢనిశ్చయం చేసుకొన్ననాటినుండి తననుతాను సంస్కరించుకోవాలని వారు నిర్ణయించుకున్నారు. డాక్టర్‌జీ పూర్తిగా మారిపోవటంచూచి, అంతకుపూర్వం వారినెరిగినవారు ఎంతో ఆశ్చర్యపడ్డారు. సంఘాన్ని స్థాపించినతరువాత వారు కటువైన మాట అనటం గాని, ఎంతటి రెచ్చగొట్టేపరిస్థితిలోనైనా ఉద్విగ్నత పొందటంగాని ఎవ్వరూ చూచిఎరుగరు. ఎవరైనా ఒకవేళ తమతో కటువుగామాట్లాడినా తాముమాత్రం చిరునవ్వు నవ్వేవారు. ఆ నవ్వు ఎదుటివాడి వ్యతిరేకతలోనివాడిని పోగొట్టేది. వారిలోని ఆంతరికకోపాగ్ని అప్పుడప్పుడు వెలికివచ్చేమాట నిజమేకాని

మన జాతిమీద అవమానాలు, కళంకాలు విరుచుకుపడినప్పుడు, మన ప్రజలు మూగగా వాటికి తలవంచటం, చూచినప్పుడుమాత్రమే అట్టిది సంభవించేది.

మహోన్నతమైన మన సాంస్కృతిక వారసత్వం ఆధారంగా చేసుకొని ప్రారంభమైన జాతీయ పునస్సంఘటనాకార్యానికి అంకితమైన ఒక సజీవోదాహరణగా, వారు నిలకడగా, తీవ్రమైన స్వయంకృషితో ప్రతి చిన్నవిషయంలోనూ, తమను తాము మార్చుకున్నారు. నిప్పులుగ్రక్కే బహిరంగోపన్యాసాలు, తాత్కాలికంగా ఎంతో ఉత్సాహాన్ని కలిగించవచ్చు; కాని వ్యామోహాలు, వ్యతిరేకతలు అనే పెనుతుఫానులలో స్థిరంగా వెలిగే జ్యోతులవంటి, సమర్పిత హృదయాలయొక్క శాశ్వత సంఘటన నిర్మాణంలో అవి ఏమాత్రం సహాయపడవని స్వానుభవంతో వారు గ్రహించారు. ప్రయోజనం కనిపించకపోగా, అటువంటి ఉద్రిక్తోపన్యాసాలు, ఎరుకలేకుండానే అయినప్పటికి, తనయొక్క ప్రతిస్పర్థులను విమర్శించటం, నడివీధికీడ్చడం అనే చవుకబారు సంతృప్తినిపొందే మన ప్రకృత్వాన్ని అలవరచటంద్వారా సంఘటనకు హానిమాత్రమే కలిగిస్తాయి. మన భ్రష్టతకు, వినాశనానికి–అంతకూ ఇతరులుకాక మన ప్రజలే బాధ్యులు అనే ఒక చారిత్రిక గుణపాఠాన్ని గుర్తించి, తదనుగుణంగా సమాజంలో స్వప్రేరణతోకూడిన సంస్కరణ కల్గించడాని కాశించిన సంఘంవంటి సంస్థలో అటువంటి మన ప్రకృత్వానికి స్థానంలేదు.

సంఘం ప్రారంభించటానికి ముందు డాక్టర్‌జీకూడ ఒక నిప్పులు గ్రక్కే ఉపన్యాసకులే. 1921 సహాయనిరాకరణోద్యమసమయంలో వారి ఒక మహోగ్రప్రసంగానికి వారిని నిర్బంధించారు; విద్రోహనేరం మోపి బోను ఎక్కించారు. న్యాయస్థానంలో తమపై వచ్చిన అభియోగానికి వ్యతిరేకంగా వారు అభినివేశంతో చేసిన వాదనను విని న్యాయాధికారి అసలు ఉపన్యాసంకంటె ఈ ప్రతివాదమే మరింత విద్రోహకరంగా ఉంది! అని వ్యాఖ్యానించాడు. కాని సంఘం ప్రారంభించినతరువాత వారు తమ

ప్రసంగాల్లో ఎంతో సంయమనం చూపించారు. ఆ తర్వాత వారి ప్రసంగాలు శ్రోతల హృదయాలను రగిలించేటంత భావగర్భితాలుగా ఉన్నప్పటికీ, రెచ్చగొట్టేటంత తీవ్రములుగా ఎన్నడూ ఉండేవికావు. పిచ్చాపాటిగా మాట్లాడే మాటలు గూడ శ్రోతలహృదయాలకు హత్తుకుపోయేటంతటి మధురంగా ఉండేవి. సమాజాన్ని సంఘటితపరచేవ్యక్తికి మాటల్లో మధురిమ తప్పనిసరి అని వారు స్వానుభవంద్వారా గ్రహించారు.

## అభినవ అజాతశత్రువు

ఈ పరివర్తన పైపైది ఏమాత్రంకాదు. అది వారి స్వభావంలో అంతర్భాగమయేటంత ప్రగాఢంగాను, శాశ్వతంగాను జరిగి, మనో వాక్కాయ కర్మల్లో అతిసహజంగా వ్యక్తమైంది. సన్నిహిత సంపర్కంవల్ల, పరిశీలనవల్ల బండారం బయటపడే 'దూరపుకొండలు నునుపు' ప్రసిద్ధి కాదు వారిది. 'ఎంతటి వీరుడైనా, వీడా! అనిపిస్తాడు సేవకుడికి' అని ఆంగ్లంలో సామెత ఒకటుంది. దీనికి వారు ప్రత్యుదాహరణం. చేరువైనకొద్దీ అందరు వారిని మరింత అధికంగా ఆరాధించేవారు. అంత రంగికజీవితంలోను, బహిరంగజీవితంలోను వారి శీలం ఒకేవిధంగా పరిపూర్ణసామరస్యంతో ఉండేది. సామాజికరంగంలో వారి ప్రతిస్పర్ధులు కూడ వారి వ్యక్తిత్వాన్నిగురించి వ్రేలెత్తిచూపటానికి ఏమాత్రం ఆస్కారం లేని పద్ధతిలో ఉదాత్తము, ఉజ్జ్వలము, పవిత్రము, పారదర్శకముగా వారి శీలముండేది.

బారిష్టర్ అభ్యంకర్ ఆ ప్రాంతంలో ఒక ప్రముఖ రాజకీయ నాయకుడు. ఆయన పలుకే పిడుగు. తన ప్రత్యర్థులను వీధికి ఈడ్వటంలో ఆయనది అందెవేసినచేయి. ఎన్నికల సమయంలో ప్రత్యర్థులను దెబ్బ తీసేందుకు ఆయనకు ఈ గుణాలు బాగా అక్కరకువచ్చేవి. ఒకసారి డాక్టర్ ముంజే ఆయనతో పోటీచేశాడు. డాక్టర్ ముంజేకు డాక్టర్‌జీయొక్క,

సంఘంయొక్క మద్దతే ప్రధానమైనదని ఆ బారిష్టరు ఊహించుకున్నాడు. కాబట్టి ఒక బహిరంగోపన్యాసంలో డాక్టర్‌జీని, సంఘాన్ని విమర్శిద్దామని నిశ్చయించుకున్నాడు. తన ఉపన్యాసం కొనసాగిస్తూ డాక్టర్ ముంజేను సమర్థించే వారందరినీ పేరుపేరున తూర్పారపట్టాడు. కాని, డాక్టర్‌జీని గురించి ప్రసక్తితెచ్చేసరికి మరుక్షణంలో ఆయనకంఠం మెత్తబడిపోయింది. డాక్టర్ హెడ్గెవార్‌ను పల్లెత్తుమాట అనలేను అని నిర్మొహమాటంగా ఒప్పుకున్నాడు. ఉద్రేకపూరితమైన ఎన్నికల ఉద్యమంలో అభ్యంకర్‌వంటివ్యక్తి ఇట్లా బహిరంగంగా అంగీకరించాడంటే ఇక ఊహించండి!

ప్రత్యర్థులతోగూడ డాక్టర్‌జీ సంబంధాలు పైపైఅభిప్రాయభేదాలచే ప్రభావితం కానంతటి ప్రగాఢమైనవి. కలకత్తాలో ఉన్ననాటినుండి గూడ జాతిని పటిష్ఠం చేయటానికి అంకితమై, వ్యక్తులందరితోను, అన్ని సంస్థలతోను - చివరకు తాను ఏవిధంగాను ఏకీభవించని వ్యక్తులతోగూడ ప్రేమాభిమానాలతో సహకరించే మనఃస్థితిని వారు అలవర్చుకొన్నారు. రాజకీయమైన ఈర్ష్యాసూయలకు, వారు తావీయలేదు. సంకుచితమైన ఆలోచనల నీడలను దరిదాపులకుగూడ చేరనీయనంతటి తేజస్సుతో దేశభక్తి జ్యోతి వారిహృదయంలో ఎల్లప్పుడూ ఉజ్జ్వలంగా వెలుగుతూ ఉండేది.

ఒకసారి అయిదువందల రూపాయలు అప్పుగా ఇప్పించవలసిందిగా ఒకమిత్రుడు డాక్టర్‌జీని కోరాడు. అప్పటికి అర్ధరాత్రి కావచ్చింది. డాక్టర్‌జీ సందిగ్ధావస్థలో పడ్డారు. అప్పుడు వారు లేచి, సరాసరి అభ్యంకర్‌వద్దకు వెళ్ళి తనకు డబ్బు కావాలని కోరారు. మారుమాట లేకుండ అభ్యంకర్ అయిదువందలు తెచ్చి డాక్టర్‌జీ చేతిలో పెట్టాడు. ఋణపత్రం వ్రాసేందుకు కాగితం కలం ఇప్పించమని డాక్టర్‌జీ అడిగారు. అది విని ఒక్కసారి విరుచుకుపడి "డాక్టర్‌సాబ్! డాక్టర్ హెడ్గెవార్‌నుంచి ఋణపత్రం వ్రాయించి పుచ్చుకోవటానికి నాకేమైన మతిపోయిందనుకుంటున్నారా? అట్లా చేస్తే నాగపూర్‌లో అంతా నన్నుచూచి నవ్వుకోరా?" అన్నాడు అభ్యంకర్.

సామాజిక రంగంలో తనకు ప్రత్యర్థులైన వారి మనస్సుల్లోగూడ అంతటి పరిపూర్ణమైన శ్రద్ధను, విశ్వాసాన్ని కలిగించేటంతటి విశుద్ధశీలం వారిది. దుర్యోధనుణ్ణిగూడ 'సుయోధనా' అని సర్వదా సంబోధిస్తూ ఉండే యుధిష్ఠిరుని వంటివారు డాక్టర్‌జీ. నమ్మశక్యంగాని అశ్వత్థామ మరణవార్త యుద్ధభూమిలో వ్యాపించినపుడు, నిజానిజాలను, తనకు అతిముఖ్య ప్రత్యర్థి అయిన యుధిష్ఠిరునిద్వారా నిర్ధారణ చేసుకోదలచాడు ద్రోణుడు. మిత్రులు, శత్రువులు గూడా ఒకేవిధంగా విశ్వసించేటువంటిదిగా యుధిష్ఠిరుని సత్ప్రవర్తన ఉండేది. నిజంగా మిత్రులేతప్ప శత్రువులెవ్వరూలేని అభినవ అజాతశత్రువు డాక్టర్‌జీ.

పెరుగుతున్న సంఘశక్తి దేశంలోని 'మతపరమైన ప్రశాంతత'కు ప్రమాదకారి అవుతుందేమో అని, మధ్యపరగణాలలోని ప్రభుత్వం భయపడి ప్రభుత్వోద్యోగులు సంఘ కార్యకలాపాల్లో పాల్గొరాదని నిషేధిస్తూ 1932 లో ఒక ఆజ్ఞను జారీచేసింది. పురపాలక సంఘాలు, జిల్లా పరిషత్తులుగూడ అట్టిచర్యలను అమలుచేయవలసిందని సూచించింది. ఆలోచనా శూన్యము, జాతి వ్యతిరేకమునైన ఈ ప్రభుత్వచర్యపట్ల ప్రాంతమంతటా గగ్గోలు పుట్టింది. ప్రాంతీయ శాసనసభలోగూడ అది ప్రతిధ్వనించింది. శాసనసభలో ప్రభుత్వంపై అభిశంసన తీర్మానం ప్రవేశపెట్టారు. ఆ తీర్మానాన్ని కేవలం హిందువులేగాక, ముస్లిములు, క్రైస్తవులు, పార్శీలు, తదితరులందరూ సమర్థించారు. తర్వాత కొద్దిరోజులకు మంత్రివర్గమే పదవినుండి తొలగిపోయింది.

## అజేయులు

పొగరుబోతుతనానికి పేరుపడ్డ వ్యక్తులుగూడ, డాక్టర్‌జీ ఎదుట ఎంతో వినయంగా, మర్యాదగా ప్రవర్తించేటంతటి శక్తిమంతమైన అసామాన్య వ్యక్తిత్వం, వారికి తమ సౌశీల్యంవల్ల సమకూడింది. నాగపూర్‌లో

ఒకవ్యక్తి తనను 'సేనాధిపతి' అని చెప్పుకుంటూఉండేవాడు. తాను అధ్యక్షత వహించని ఏ సమావేశమూ ప్రశాంతంగా సాగనివ్వనని అతని ప్రతిన. ఆ సేనాధిపతిని ఆశ్రయించి ఒక గుండాసేన ఉండేది. అతడు అధ్యక్షత వహించని కారణంచేత 'అనుమతిలేని' సమావేశాలపై ఆ సైనికులు విరుచుక పడేవారు. కొద్దినిముషాల్లో అట్టిసమావేశాలు, గందరగోళంలోపడేవి; చెల్లా చెదురయ్యేవి. ఆ రోజుల్లో డాక్టర్‌జీయొక్క మిత్రులొకరు పొరుగూరినుండి వచ్చి నాగపూర్‌లో ఒకసభలో ప్రసంగించవలసిఉంది. కాని ఆ సమావేశం ఏర్పాటుచేసినవారికిమాత్రం సమావేశాన్ని ప్రశాంతంగా సాగనివ్వడేమో ఈ సేనాధిపతి, అన్న బెంగపట్టుకుంది; కానీ డాక్టర్‌జీ నిమ్మకు నీరెత్తినట్లు హామీఇచ్చారు. దానితో విశ్వాసంకలిగి వారు సభఏర్పాటుచేశారు. సమావేశం ప్రారంభమయ్యేసరికి 'సేనాధిపతి' తన సేనతోపాటు అక్కడకు చేరాడు. అతడు రావటంచూచి డాక్టర్‌జీ ఎదురువెళ్ళి ఎంతో ఆదరంతో ఆహ్వానించి తీసుకవచ్చి తన పక్కన కూర్చుండబెట్టుకున్నారు. ఆ ఉపన్యాసకుడుకూడా మంచి ఊపులోఉన్నాడు; సేనాధిపతికిచెందిన పక్షాన్ని కడిగిపారేస్తున్నాడు. సేనాధిపతి కోపంతోరెచ్చిపోయి ఇటూఅటూ చూచేవాడు; నిశ్చలంగా, నిబ్బరంగా ఉన్న గంభీర మూర్తి తనప్రక్కనే కూర్చుని ఉండటం చూచి నప్పుడల్లా కాళ్ల చేతులు చల్లబడి ఉసూరుమని కుర్చీలో వ్రాలిపోయేవాడు. దాదాపు రెండుగంటలుపైగా ఆ సమావేశం ప్రశాంతంగా సాగిపోయింది. 'కిక్కురుమనలేదేమ'ని సభ పూర్తిఐపోయినతర్వాత ప్రశ్నలు గుప్పించారు అతని అనుచరులు. "ఆయన ప్రక్కన కూర్చున్నాడు; నే నేంచేయను" అని అతడు అన్నాడు.

## అనుపమ ఏకతాసాధకుడు

అసంఖ్యాకమైన వ్యక్తులను ఒకటిగాచేసి వారిలో ప్రతిఒక్కరిని ఆదర్శ జాతీయకార్యకర్తగా రూపొందించి, యావత్తుజాతియొక్క సుసంఘటితజీవనం తరతరాలు నిలువటానికి భూమికగా, శాశ్వతమైన

సంప్రదాయాలను, స్ఫూర్తిప్రదమైన ఉదాహరణలను రూపొందించటానికి పర్వతోపమాన భారాన్ని, ఆరాటాన్ని, వ్యథను వారు తమ హృదయంలో వహిస్తుండేవారు. ఎన్నో వ్యక్తిగతమైన గడ్డు సమస్యలను ఎదుర్కొంటూ కూడ వారు ఇదంతా చేశారు! కానీ వారి జీవితంలోని ప్రతిక్షణం లోలోపల పనిచేస్తున్న ఈ ప్రగాఢభావప్రవాహాలను ఎవరూ పసికట్టలేకపోవటం ఎంతో ఆశ్చర్యం. డాక్టర్‌జీ పరిచయంలోకి వచ్చినవారంతా వారిలో ఎల్లప్పుడు పెల్లుబుకుతూండే హర్షహాసాల స్వచ్ఛ స్రోతస్సుల్లో ఓలలాడుతుండేవారు. రకరకాలవ్యక్తులు, విభిన్న మనస్తత్వాలవారు, ఎప్పుడూ వారిచుట్టూ మూగుతూండేవారు. డాక్టర్‌జీ 'మానవ- జంతుప్రదర్శనశాలను' నిర్వహిస్తున్నారని వారి స్నేహితులు హాస్యోక్తులాడుతూండేవారు. కాని, డాక్టర్‌జీ సత్సంగంలో ఉన్నంతకాలం ఈ 'జంతుప్రదర్శన'శాలలోని ఏ ఒక్కరూ ఏవిధమైన అసంగతభావనను పొందేవారు కారు. పిన్నలు పెద్దలు, సనాతనులు అధునాతనులు, చదువుకొన్నవారు చదువుకోనివారు, ధనికులు దరిద్రులు-ఎల్లరూ డాక్టర్‌జీతో సమాన ఏకత్వానుభూతి పొందేవారు. వారిలో ఉన్న సామరస్యం, చాకచక్యం అట్టివి. ఇతరుల దృష్టిలో ఎంతటినీచుడు, లోపభూయిష్ఠుడు ఐన వ్యక్తికూడ, వారి దృష్టిలో మాత్రం కొరగానివాడు కాడు.

## నిరహంకారత

అహంకారంచేత అణుమాత్రమైనా కలుషితంగాని పరిపూర్ణ వినయ భావన వారి అపురూపమైన ఈ సద్గుణానికి మూలాధారంగా ఉండేది. పేరు ప్రఖ్యాతులకోసం, అంతస్తు, అధికారాలకోసం వారెప్పుడూ తాపత్రయపడలేదు; ప్రారంభంనుండికూడ, సంఘానికి అధినేతగా ఉండదగిన వ్యక్తికోసం ఎల్లప్పుడూ వారు వెతుకుతూనే ఉండేవారు. అట్టి వారికి తాను అనుచరుడుగా ఉంటూ ఇతర కార్యకర్తలందరకు, ఒక సజీవోదాహరణగా ఉండాలని

వారు కోరుకున్నారు. నిజానికి, ఒక హిందూమహానాయకుణ్ణి సంఘానికి అధినేతగా తీసుకొనిరావటానికి నిరవధిక ప్రయత్నాలు చేసికూడ విఫలురయ్యారు. ఎన్నో సద్గుణాలు కలిగిఉన్నప్పటికీ, ఆ మహానాయకుడు సంఘకార్యంయొక్క ఆంతరిక శక్తిసామర్థ్యాలను అవగాహన చేసుకోలేక పోయాడు; సుముఖత చూపలేదు. డాక్టర్‌జీ ఎంతో నిస్పృహ పొందారు. అయినా తమ అన్వేషణ మానలేదు. 'స్వయమేవ మృగేంద్రతా'– మృగాలకు సింహం సహజంగా రాజు–అన్నట్లు కేవలం తమ సద్గుణాల ప్రభావంచేతనే వారు సంఘానికి అతిసహజంగా నాయకులయ్యారు. కాని అంతిమదినంవరకు వారు ఆ పదవిని అధిష్ఠించటం విషయమై తమను తాము సమాధాన పరచుకోలేకపోయారు.

డాక్టర్‌జీ ఎంతటి ప్రబలులైనప్పటికి ఎన్నడూ విర్రవీగలేదు. తోటి కార్యకర్తలు, స్వయంసేవకులు అతిసహజంగా చేసే ప్రశంసలను కూడ వారు నివారించేవారు. ఆ విషయంలో వారు ఏమాత్రం రాజీపడేవారు కాదు. 1940 లో పూనాలో జరిగిన శిక్షణశిబిరాన్ని సందర్శించి వారు నాగపూర్‌కు తిరిగివస్తున్నారు. వారికి స్వాగతం పలకటానికి నేను రైల్వే స్టేషనుకు వెళ్ళాను. బండి ఆగింది; చిరునవ్వుతో వారు కనపడ్డారు. పూల మాల వేద్దామని ముందుకు వెళ్ళేసరికి 'వద్దు' అన్నట్లు ఉరిమిచూచారు. చాచీచాచని చేతులు ఆగిపోయాయి. వెంటనే వారు నవ్వుతూ "నేను నాయింటికి వస్తున్నాను. ఇదంతా ఎందుకు? వీరు మన గౌరవనీయ అతిథులు, సన్మానించవలసింది వీరిని" అని అంటూ తమతో ఉన్న ఒక సజ్జనుణ్ణి చూపించారు. వెంటనే ఆ అతిథికి పూలమాల వేశాను. డాక్టర్‌జీ జీవించి ఉన్నంతకాలం నేనొక్కసారైనా వారికి పూలమాల వేయలేక పోయాను. వారు మనలను వీడిపోయినతర్వాత వారి మృతదేహానికి మాత్రమే పూలదండ వేయగలిగాను. ఛాయాచిత్రాలకుకూడ వారు అంతటి విముఖులే. తోటి కార్యకర్తలు ఎంతోపట్టుబడితే, ఎప్పుడైనా ఒకసారి తమ ఛాయా చిత్రం తీయటానికి అంగీకరించేవారు.

తాము తమపట్ల ఎంత కఠోరంగాను, నిర్మోహమాటంగానూ ప్రవర్తించుకొన్నప్పటికీ, మనలో ప్రతిఒక్కరిపట్ల ఎంతటి స్నేహసముద్రులు వారు! విశుద్ధము, స్వార్థరహితమునైన ఆ ప్రేమయొక్క లోతులను వర్ణించడానికి మాటలుచాలవు. మాతృహృదయంయొక్క అంతులేని ఆపేక్ష, తండ్రియొక్క నిరంతర శ్రద్ధా పరిశ్రమలు, గురువుయొక్క స్ఫూర్తిప్రద మార్గదర్శనం పరాకాష్ఠనంది వారి హృదయంలో సంపూర్ణసమన్వయం పొందాయి. ఆదర్శమూర్తిగా వారిని ఆరాధించడం నాకు గర్వకారణమైన సదవకాశంగా భావిస్తాను. అట్టి మహాత్ముని ఆరాధించడం వ్యక్త్యారాధనను అతిక్రమించి ఆదర్శాన్నే ఆరాధించటం కాగలదు. నిజానికి వారే నా ఇష్ట దైవం.

## కర్మయోగం

అనన్య మనస్కమైనశ్రద్ధ, విశుద్ధశీలం, సాటిలేనిసంఘటనకౌశలం, జీవనవ్రతంగా తాము స్వీకరించిన కార్యంయొక్క అంతిమ విజయంపట్ల దుర్దమమైన విశ్వాసం, పరిశ్రమించటానికి అంతులేని సామర్థ్యం మాత్రమే వారు చేపట్టినకృషికి మూలధనం. ఎంతటి కష్టానికైనా వారు వెనుదీయలేదు. అంతిమదశలో అనారోగ్యంవల్లనైనా, శారీరక, మానసిక పరిశ్రమయొక్క తీవ్రత మందగించకుండా ఉండేటంతగా శరీరాన్ని నిర్లక్ష్యంచేశారు; శ్రమించారు. దిగజారిపోతున్న వారిఆరోగ్యపరిస్థితిని చూచి తోటికార్యకర్తలు ఆందోళనతో సతమతమయ్యేవారు. అదేవిధంగా పరిశ్రమ కొనసాగిస్తే వారి శరీరం ఎక్కువకాలం దానికి తట్టుకొని నిలవదనిగూడ కొందరు హెచ్చరించారు. కాని, అటువంటి వాటన్నిటికీ ఒకటే సమాధానం, "అసలీశరీరం దేనికి ? సంఘకార్యంకోసమేకదా !" అంతటితో ఆ ప్రసంగం ముగిసేది. వారు విరతి, విశ్రాంతి ఎరుగరు. వారిది కర్మయోగం. నిరంతర తీవ్రకృషి -ముఖ్యంగా యౌవనంలో - వారికి ఇష్టం. "ఉత్సాహంతో కార్యశీలురుగా ఉండటానికి ఎట్లాగూ వీలుపడదు ముసలితనంలో. మరి యౌవనంలోకూడ

అకర్మణ్యతకు ఆలవాలమైతే ఎట్లా?" అని వారు అంటుండేవారు. తోటి కార్యకర్తల ఒత్తిడివల్ల ఒకవేళ వారు ఏదైనా ఒక ప్రదేశానికి విశ్రాంతికి వెళ్ళినా, అక్కడా, ఆ చుట్టుప్రక్కలా కొన్ని శాఖలను ప్రారంభించందే విశ్రాంతిని తీసుకునేవారుకాదు!

1939 లో వారి ఆరోగ్యం తీవ్రంగా విషమించింది. పూర్తి విశ్రాంతిని గైకొనాలని వైద్యులు సలహాఇచ్చారు. ఆ సమయంలో నేను వారివెంట ఉన్నాను. వైద్యం సాగుతూనేఉంది. క్రమబద్ధంగా మందులు ఇస్తున్నారు. కాని ప్రయోజనం మాత్రం కనిపించలేదు. వైద్యుడు దిగ్భ్రమ చెందాడు. చికిత్సాపద్ధతిని ఒకసారి సింహావలోకనం చేసుకుంటూ డాక్టర్‌జీ ఎన్నిగంటలకు నిద్రపోతారని ఆ వైద్యుడు అడిగాడు. "ఎప్పటిలాగే రాత్రి ఒంటిగంటకో, ఒంటిగంటన్నరకో పరుంటారు" అని నేను బదులుచెప్పాను. అది విని స్తంభించిపోయిన వైద్యుడు "అందుకే వారు కోలుకోవటంలేదు. బహుశః మీరే వారిని ముందు పడుకోనివ్వటం లేదనుకుంటాను. వారు తప్పని సరిగా రాత్రి 10 గంటలకు పరుండాలి" అన్నాడాయన. అంత పెందలకడనే వారు నిద్రపోయేట్లు చేయటం నావల్ల సాధ్యం కాదని నా అశక్తతను అంగీకరించాను. "సరే! ఆ పని మీరు చేయలేకపోతే, నేనే స్వయంగా చేస్తాను" అన్నాడాయన. దానికి నేను సంతోషంగా అంగీకరించాను. ఆరాత్రి 9 గం॥ లకు ఆ వైద్యుడు వచ్చాడు. అప్పుడే భోజనం చేసి డాక్టర్‌జీ తమ గదిలో ఒంటరిగా ఉన్నారు. భోజనం చేసిన వెనువెంటనే నిద్రించటం మంచిదికాదు కాబట్టి డాక్టర్‌జీతో ఆ వైద్యుడు కొద్దిసేపు పిచ్చాపాటి మాట్లాడటం మొదలుపెట్టాడు. అంతసేపు నేను బయట వేచిఉన్నాను. చివరకు వైద్యునకు నిద్రమత్తు వచ్చినప్పుడు తన చేతిగడియారం చూచుకున్నాడు. అప్పటికి రాత్రి ఒంటిగంట దాటిపోయింది! ఆయన తొందరగాలేచి, ఇంక పండుకోండి అని డాక్టర్‌జీకి చెప్పి బయటకు వచ్చాడు. ఆయన బయటకు రాగానే గంట ఎంత అని నేను మామూలుగా ప్రశ్నించాను.

"మాటలాడుతూ నన్ను నేను మరచిపోయా!" అని నొచ్చుకుంటూ చెప్పి వెళ్ళిపోయాడాయన.

## యౌవనకుసుమం సమర్పించాలి

తీవ్ర అనారోగ్యానికి గురి ఐనప్పుడుకూడా డాక్టర్‌జీ ఇదే అలవాటును అంటిపెట్టుకొని ఉన్నారు. వారు రాత్రిపూట, సంఘకార్యకర్తలను ఒక్కరొక్కరుగాకాని, బృందాలుగాకాని పిలిచి, వారితో బాగా నడిరాత్రి దాటేంతవరకు మాట్లాడుతూ ఉండేవారు. వేగంతో సంఘకార్యాన్ని పెంచవలెననే వారి కఠోరనిశ్చయం ముందు, ఆ అలవాటు తప్పించాలని చేసే మా ప్రయత్నాలన్నీ నిరుపయోగాలయ్యాయి. ఉక్కుముక్కలాంటి వారి దేహం తీవ్రక్రియాశీలతకు తట్టుకొని నిలబడలేకపోయింది. సంఘాన్ని ప్రారంభించిన పదిహేను సంవత్సరాల్లోనే వారి దేహం ఆదర్శజ్వాలల్లో పూర్తిగా ఆహుతి అయిపోయింది. అవసానం సమీపిస్తోందని వారికి తెలియదు అనిగాదు. "శరీరంలోని రోగస్వభావమేమిటో నాకు బాగాతెలుసు; దానికి చికిత్స ఏమిటోగూడా నాకు తెలుసు. కాని చికిత్సకు కేటాయించటానికి నాకు తీరికలేదు. కనుక రాబోయే ఫలితమేమిటోకూడా నాకు తెలుసు. కాని దానికి నే నేమీ చేయలేను. ఈశ్వరేచ్ఛ ఎట్లా ఉంటే అట్లా అవుతుంది" అని వారు అంటూనే ఉండేవారు.

ఒకయోగి, తనశరీరంలో రగుల్కొల్పిన యోగాగ్నిలో, హవిస్సులా తననుతాను సమర్పించుకోవటంలోనే జీవన సాఫల్యముందని భావించినట్లే వ్యథ, త్యాగం అనే అగ్నిలో డాక్టర్‌జీ తమ దేహాన్ని ఆహుతిచేశారు. అట్టిదే తరతరాలుగా వస్తున్న మనపరంపర. మనజీవనపరిమాణం తగ్గకుండా ఉండేనిమిత్తమై యౌవనంలో అత్యధికమైన పరిశ్రమచేయరాదు అనేమాట ఈనాడు తరచు వింటూంటాం. ముసలితనాన్ని మరికొన్ని ఏండ్లపాటు పొడిగించుకొనే నిమిత్తమై విలువైన యౌవనక్షణాలను వృథాచేయాలా అని ఆ సలహాను డాక్టర్‌జీ అపహాస్యం చేస్తూఉండేవారు. నిజానికి నలుదిక్కులా

సువాసనలను, కాంతిని ప్రసరిస్తూ పూర్తిగా వికసించినసమయంలోనే, యౌవన పుష్పాన్ని మాతృదేవి చరణపీఠంవద్ద తనంతటతాను సమర్పించాలి. తన ఇష్టదేవతయొక్క అర్చనలో రంగు, వాసన కోల్పోయి, వాడి వత్తలై పోయిన పువ్వును సమర్పించడం అపచారమే కాగలదు. మానవ జీవిత సాఫల్యాన్ని గురించి వారిభావన అట్టిది. ఆవిధంగానే వారు జీవించారు; ఆవిధంగానే మరణించారు.

## జీవితం — మరణం

వారిది సాధారణమైన మరణం కాదు. యౌవనకాలం యావత్తూ విస్తరించి అణువణువు భక్షించివేస్తున్న అగ్ని అది. హుతాత్ములం కావాలనే మెఱుపులాంటి ఆవేశంలో జీవితాలను త్యాగంచేసేవారు కొందరున్నారు. అదికూడ ఉజ్జ్వలమే; స్ఫూర్తిప్రదమే. కాని అసంఖ్యాకాలైన ఇతర హృదయాలను జ్వలింపచేసేందుకు తమ జీవితంలో ప్రతిక్షణమూ తమకు తామే జ్వలింపచేసుకోవటం నిజంగా అత్యున్నతశ్రేణికి చెందిన తపస్సు అవుతుంది. సమాజ 'పావురాన్ని' సంరక్షించేనిమిత్తమై తమ మాంసాన్ని ముక్కలు ముక్కలుగా కోసిఇచ్చిన ఆధునిక శిబిచక్రవర్తి వారు. వృత్రాసురుణ్ణి సంహరించేందుకై మృత్యుపాశం వంటి వజ్రాయుధాన్ని రూపొందించే నిమిత్తమై తన ఎముకల నొసగిన దధీచివలె, డాక్టర్‌జీ తమ దేహంలోని ప్రాణరక్తాన్ని చివరిబొట్టువరకు, సమాజ శరీరం లోకి చిరునవ్వు నవ్వుతూ ఎక్కించారు. శంకరాచార్యుడు 32 వ ఏట, వివేకానందస్వామి 39వ ఏట, శివాజీ 50వ ఏట అదేవిధంగా మరణించారు. డాక్టర్‌జీకూడ తన 50 వ ఏటనే మరణించారు. మరి అట్టివారే అనంత కాలం జీవిస్తారు.

## మాటలకు బలం ఎట్లావస్తుంది ?

అట్టి మహాత్ములు ఉచ్చరించినప్పుడు, తోటివారు ప్రతిఘటింపజాల నంతటి శక్తి మాటలకు సమకూరుతుంది. డాక్టర్‌జీ మాటలు, వారు

పసివానితో మాట్లాడుతున్నారా అన్నంతగా, చాలా తేలికగా ఉండేవి. కాని వాటిలో శక్తి ఎంత మహత్తరమైనదో! సుస్మరణీయుడైన డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ ఒకప్పుడు డాక్టర్‌జీతో కొన్ని ముఖ్య సమస్యలను చర్చించాలని చూడవచ్చారు. ఆ సమయానికి డాక్టర్‌జీ సుదీర్ఘమైన చర్చలో పాల్గొనలేనంతటి అస్వస్థతతో బాధపడుతున్నారు. అదే వారి అంతిమ అనారోగ్యం. కాబట్టి మొట్టమొదట మనం చర్చించుకుందాం, తరువాత ఇంకేమైనా మిగిలిఉంటే, డాక్టర్‌జీవద్దకు వెళ్ళవచ్చు అని డాక్టర్ ముఖర్జీతో అన్నాను. ఆయన అంగీకరించారు. సుదీర్ఘమైన చర్చ జరిగింది. ఆయన ప్రతిప్రశ్నకు, అనుమానానికీ నేను సమాధానం ఇచ్చాను. ఐనప్పటికీ, ఆయనకు తృప్తి కలుగలేదు. కాబట్టి డాక్టర్‌జీవద్దకు వెళ్ళాం. ఆయన డాక్టర్‌జీని అదేప్రశ్న అడిగారు; నేను చెప్పిన సమాధానాన్నే కొద్ది మాటలతో డాక్టర్‌జీ చెప్పారు. "నాకిప్పుడు సమాధానం లభించింది" అని డాక్టర్ ముఖర్జీ అన్నారు. నా కాశ్చర్యం కలిగింది. వ్యక్తియొక్క త్యాగం, శీలం, తపస్సు – అతడుచెప్పే మాటలకు ఇవే బలాన్నిస్తాయి. నా జీవిత మంతటికీ కావలసిన పాఠం ఆ ఉదంతంలో నాకు లభించింది. శాస్త్రార్థాలు, చర్చలు, మెరుపుల్లాంటి మేధావిలసనాలు – అన్నీకూడా ఆ సర్వోత్తమ శక్తిముందు పూర్తిగా వెలవెలపోతాయి.

## పసివానివంటి మహాపురుషుడు

ఒక యుగకర్తకుండవలసిన లక్షణాలన్నీ వారియందు పుష్కలంగా ఉన్నప్పటికీ, వారు తమ జీవితమంతా ఒక పసివాడిలా – సరళంగా, వినమ్రంగా, నిరహంకారంగా, అందరితోనూ ఆత్మీయంగా మాట్లాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ, ఇతరుల్లోని అత్యంత స్వల్పమైన సద్గుణాలను సైతం అభినందిస్తూ ఉండేవారు.

ఒకసారి సంఘంలోని కొందరు న్యాయవాదుల సాప్తాహిక సమావేశంలో, సంఘానికి సంబంధించిన అనేక సమస్యలమీద స్వేచ్ఛగా,

యథాలాపంగా చర్చ జరుగుతోంది. సంఘంయొక్క భావివ్యవస్థ ఎట్లా ఉంటుందనే విషయంగురించి ఒకరు ప్రశ్నిస్తే, మరొకరు కేంద్రీయసమితిని యథావిధిగా ఏర్పరచాలని – ఇట్లా జరుగుతోంది ఆ చర్చ. వారిలో ఒకరు "అసలు సంఘానికి మూలాధారం ఏమిటి?" అని ప్రశ్నించారు. "ఏముంది? డాక్టర్‌జీయే!"అని నేనన్నాను. డాక్టర్‌జీని బాల్యంనుంచి ఎరిగిన ఒక వృద్ధవ్యక్తి ఆసమావేశంలో ఉన్నాడు, ఆయనదగ్గరకు డాక్టర్‌జీ తరచు వెళ్ళి సలహాసంప్రదింపులు జరిపేవారు. డాక్టర్‌జీగురించి నేనన్నమాటలు విని ఆయన ఎంతో మురిసిపోయారు. 'బాలకేశవుడు' అకస్మాత్తుగా ఎంతఎదిగి పోయాడు! అని ఆశ్చర్యపడ్డాడు. ఆయనలో ఏదో సరికొత్త అనుభూతి మెరిసినట్లైంది. సమావేశానంతరం ఆయన డాక్టర్‌జీవద్దకుపోయి, వాత్సల్యా పూర్వకంగా "డాక్టర్! నీవెంత గొప్పవాడవైనావు? ఇంతవరకు నిన్ను చిన్ననాటి బాలకేశవుడుగానే ఊహించుకుంటున్నాను" అని అన్నాడు.

విశ్వరంగస్థలానికి శోభగూర్చిన మహోత్తమ వ్యక్తులందరూ – ఇతరులు తమ శ్రేష్ఠత్వాన్నిచూచి, భయపడి వెనుకాడకుండా, తమ సహవాసంలో, సన్నిహితంగా వచ్చి, స్వేచ్ఛగా కలిసిమెలసి జీవించ గలిగేందుకు వీలుగా ఉండడానికి–తమయొక్క శ్రేష్ఠత్వాన్ని గుర్తించలేనంతగా ఇతరులను మంత్రముగ్ధులను చేస్తారు.

శ్రీకృష్ణుడు తన చిన్నతనపు చిలిపిచేష్టలతో గోకులంలోనివారందరిని మంత్రముగ్ధులను చేశాడు. ఎవ్వరికైనాగాని చివరకు యశోదకుగూడ అతడు స్వయంగా భగవంతుని అవతారం అన్న గుర్తేలేదు. ఒకసారి మన్ను తిన్నాడని చాడీలు విని, యశోద కృష్ణుణ్ణి నోరుతెరచిచూపుమని బలవంత పెట్టింది. ఆ చిన్ని నోటిలో అనంత విశ్వం నాట్యమాడుతున్నట్లు ఆమె చూచింది. దిగ్భ్రాంతిచెందింది. నోటమాటరాలేదు. అది క్షణకాలంమాత్రమే. మళ్ళీ బాలగోపాలుని అదే చిరునవ్వు, అదే చిలిపితనం, అదే కొంటెతనం; ఆమెలో కలిగిన క్షణికమైన ఆ దివ్యానుభూతి మరుగున పడిపోయింది.

ఎదుటివారిని పరవశుల్ని చేయజాలిన డాక్టర్‌జీయొక్క నిరాడంబరత వారికి సన్నిహితులుగా చేరిన వారందరిపైన, చివరకు తమ అతిసన్నిహిత మిత్రులపైన, తోటి కార్యకర్తలపైన గూడ అదేవిధమైన ఇంద్రజాలాన్ని ప్రయోగించింది. సమాజసముద్ధరణకై యుగాని కొక్కసారి జన్మించేటువంటి ఒక మహా విభూతియొక్క సాహచర్యంలో తామున్నామనే ఎరుక మెరుపు మెరసినట్లుగా ఎప్పుడైనా ఒకసారి వారికి కల్గిఉండవచ్చు. వారితో తాము సమఉజ్జీలం అని అనుకొని ఒక్కొక్కసారి అతిచనువు తీసుకొని ప్రవర్తించిన తీరునుచూడగా, తమకే దిగ్భ్రాంతి కలిగేది! కాని అది నిమేషమాత్రమే. మళ్ళీ అంతలోనే చిరునవ్వులు చిందించే డాక్టర్‌జీయొక్క నిరాడంబరమూర్తి మళ్ళీ మత్తుమందుజల్లేది. తర్వాత ఎవ్వరికీ ఈ స్పృహ ఉండేదికాదు.

ఏవంగుణవిశిష్టులు మన సంఘస్థాపకులు డాక్టర్‌జీ. రక్తమాంసాలను దాల్చి వచ్చిన ఆదర్శ హిందూవ్యక్తిత్వం డాక్టర్‌జీ.

*'క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే'*

(మహాపురుషులకు కార్యసాఫల్యం సాధనసంపత్తివల్లకాక. స్వతస్సిద్ధమైన సత్త్వంవల్లనే సాధ్యం.)

అనే లోకోక్తికి ప్రతిరూపం డాక్టర్‌జీ. భవ్య అమర జాతీయ జీవన సాధనాపథంలో తరతరాలవారు తమ జీవితాలను తీర్చిదిద్దుకునేందుకు మార్గదర్శనం చేసే మహోజ్జ్వల జ్యోతి మన డాక్టర్‌జీ.

# 38. అంతిమ సందేశం

## 1. కార్యానికి కటిబద్ధులు కండి

(1973 మార్చిలో, నాగపూర్‌లో జరిగిన అఖిల భారత ప్రతినిధి సభ సభ్యుల నుద్దేశించి చేసిన ప్రసంగం)

ఈ మధ్య అందరూ నా ఆరోగ్యం గురించి ఆందోళన చెందు తున్నట్లున్నారు. ఏదిఏమైనా సంఘ శిక్షావర్గల శిబిరాలకు నా పర్యటనా కార్యక్రమం రూపొందించమని డాక్టర్ ధట్టేకి చెప్పాను. కార్యక్రమం నిర్ణయించి సిద్ధంగా ఉంచితే, ఏదో విధంగా దానిని కొనసాగించగలనేమో నని ఆశ.

### నజావుగా సాగిపోవటం ఖాయం

ఇప్పుడు మనం ఒక విషయం గురించి ఆలోచించాలి. అదేమిటంటే- ఒకానొక వ్యక్తి జీవించి వున్నా, గతించినా, మన సంఘటన యొక్క భవి ష్యత్తు కుంటుపడదనే సంగతి. దీన్ని సరిగా అర్థం చేసుకుందాం. మన దేశంలోని ప్రాచీనాలూ, నవీనాలూ అయిన వ్యవస్థల యొక్క చరిత్ర

చూస్తే, ఆయా సంస్థలన్నీ కొంతకాలం అభివృద్ధి చెందటం, తమ కృషిని ఒడిదుడుకులు లేకుండా సజావుగా చేసుకుపోవటం, ఆపైన వాటి సభ్యులలో విభేదాలు వృద్ధి చెందటం కనిపిస్తుంది. అయితే, అట్టి విభేదాలు, సభ్యులు నమ్మే సిద్ధాంతాలాధారంగా కాక, చాలావరకూ, వ్యక్తిగత కారణాలవల్లనే తలెత్తుతున్నాయి. దాదాపు అన్నిసంస్థలూ,– కాంగ్రెసుతో సహా– చీలి పోవటం మనం చూస్తున్నాం. ఏదో ఒకనాడు రాష్ట్రీయ స్వయంసేవక సంఘం కూడా ఆ విధంగా చీలిపోకతప్పదని కొందరాశిస్తున్నారు. ఆ ఊహతోనే రా. స్వ. సంఘంలో సర్‌సంఘ్‌చాలక్ పదవి కొఱకై కుమ్ము లాట ఆరంభమయిందంటూ, వార్తలను కొన్నిపత్రికలు దురుద్దేశ్యపూర్వ కంగా ప్రకటించాయి. ఎవరేమనుకున్నా, మనం సమైక్యతకు కృషి చేస్తున్నాంగాని, విఘటన కోసం కాదు. మన సంఘటన కార్యం, సాఫీగా, చక్కగా కొనసాగేలా మనం మన ప్రవర్తనను మలచుకునేందుకు కృత నిశ్చయులమై వున్నాం.

## సమైక్యపరచటానికే సంకల్పించుకున్నాం

మనలో అప్పుడప్పుడు అభిప్రాయభేదాలు పొడసూపకపోలేదు. కానీ మనం వాటిని సౌహార్దంతో, సానుభూతితో చక్కబరుచుకోగలిగాం. సంస్థ యొక్క అభివృద్ధే మన మనస్సులలో ప్రాధాన్యం వహించినప్పుడు చిన్న చిన్న విషయాలు మనకి అడ్డురావు.

ప్రజలనందరినీ మరల సంఘటితపరచటానికే మనముంది. సంఘ టిత జీవనతత్వాన్ని సమాజానికంతకూ మనం వ్యాపింప చేయవలసి వుంది. అసాధారణమైన కృషీ, బాధ్యతలను జోడించి చేయవలసిన మహా కార్య మిది. అందుచేత ఎట్టి పరిస్థితుల్లోనూ, దురభిప్రాయాలూ, పరస్పర వైమనస్యాలూ, మన సంఘటనా కార్యానికి హాని కలిగించే అవకాశం ఇవ్వ రాదని నిశ్చయించుకున్నాం.

## ఆదర్శాన్ని సుదృఢం చేసుకోండి

మన సోదరులు జాతీయ జీవితంలోని వివిధ రంగాల్లో, అంటే, విద్యార్థుల్లో, కార్మికుల్లో, రాజకీయాల్లో, ఇంకా అనేకవాటిల్లో కృషి చేస్తున్నారు. వారు మన వాటికన్న విభిన్నములైనట్టి, ఆయా రంగాలకు సంబంధించిన నియమ నిబంధనల కనుగుణంగా కృషి చేస్తుంటారు. ఏది ఏమైనా స్వయంసేవకులు హిందురాష్ట్రంపట్ల తాము సంఘంలో అలవరుచుకొనిన మౌలికమైన విశ్వాసంతోనే ఆయా రంగాల్లో కృషి చేయవలసి ఉంటుంది. ప్రాణప్రదమైన అట్టి భావనతో, ఆయా రంగాల్లో చొచ్చుకుపోవటానికీ వానిని ప్రభావితం చేయటానికీ ప్రయత్నించాలి.

మన యొక్క హిందురాష్ట్ర భావనను ప్రజలందరూ ఒప్పుకోకపోవచ్చునని కొందరు భావించవచ్చు. మనం ప్రతిపాదించే సత్యాన్ని కొందరు అంగీకరిస్తారా? తిరస్కరిస్తారా? అన్నది ముఖ్యంగాదు. మన భావనలు స్పష్టంగానూ, వాటి పట్ల మన విశ్వాసం అచంచలంగానూ వుండి తీరాలి. అప్పుడు మాత్రమే ఆ సత్యాన్ని అంగీకరించటానికి ప్రజలు సుముఖులు కాగలుగుతారు. తుదకు ప్రజలంతా దానిని విశ్వసిస్తారనే నా నమ్మకం. మన మన రంగాల్లో, మన మన ఆలోచనలను స్పష్టంగా పదే పదే ఎందరెందరికో వివరించి చెపితే, వారు క్రమంగా మన సహచరులుగా మారి, మన భావనలను అంగీకరించగలుగుతారు. అంతేగాని, మనం, మన హృదయాల్లోనే బెరుగు పెట్టుకొని, ప్రజల వద్దకు పోయి, నీరుగారిపోయినట్లు మెతకమాటలు మాట్లాడితే పనంతా పాడై పోతుంది. మనకు బలమైన సహాయకారిగా వుంటుందని ఆశించినది కూడా, అట్లాకాక, మన ఆదర్శ పథంలో మరొక అడ్డంకిగా గూడా తయారవుతుంది.

## ప్రజల విశ్వాసం

మన దేశంలో, ఆదర్శంతోబాటు ఉన్నతమైన నైతిక ప్రవర్తన కూడా ముఖ్యమని ఎల్లప్పుడూ అంగీకరింపబడినదే. అట్టి స్థితిని మనం కొంతమేరకు సాధించుకోవటంలో విజయం పొందాం. ప్రజలు గూడా ఈ వాస్తవాన్ని ఎట్లా గుర్తించగలిగారో ఒక ఉదాహరణతో చెప్తాను. 'డాక్టర్ మూంజే శతజయంత్యుత్సవ సమితి' నిధి వసూలు కొరకై ప్రచురించే విజ్ఞాపనపత్రంలో, ఎవరెవరి సంతకాలుండాలనే ప్రశ్న నాగపూర్‌లో ఒకసారి చర్చకు వచ్చింది. వివిధ స్థాయిల నుండి ఏడు పేర్లు ఎంపిక చేయబడ్డాయి. వాటిల్లో రాజాజీ పేరొకటి. ఆయన అంగీకారాన్ని తీసుకునేందుకై వారిని కలియవలసిందిగా నేను మదరాసు సంఘచాలక్‌గారిని కోరాను. నిధులు వసూలు చేయటానికై చేసే విజ్ఞప్తులలో అంతవరకూ, ఆయనకున్న కటువైన అనుభవాన్నిబట్టి అట్టి విజ్ఞప్తులపై ఇంకెన్నడూ తన సంతకం చేయరాదని నిశ్చయించుకున్నట్లు రాజాజీ చెప్పారు. అప్పుడు రాజాజీకి నేను వ్రాసిన జాబును మన సంఘచాలకులు అందచేసారు. దాన్ని చూచింతర్వాత "ఈ సమితిలో సభ్యుడుగా గోల్వాల్కర్ వుంటే-నాకెట్టి అభ్యంతరం ఉండనక్కరలేదు. వసూలైన ధనమంతా, ఉద్దేశింపబడిన కార్యక్రమం కొరకే వినియోగింపబడుతుందంటానికి, నాకే సందేహం ఇంక లేదు" అని వ్యాఖ్యానిస్తూ వెంటనే ఆయన ఆ విజ్ఞప్తిపై సంతకం చేసారు. ప్రజలకు మనమీద నమ్మకం అటువంటిది.

## పెంపుడుకుక్కలుగా దిగజారిపోతున్నారు

నేడు దేశంలోని పరిస్థితుల్ని పరిశీలించినప్పుడు, మన దేశం క్రమంగా, నియంతృత్వం దిశగా మొగ్గిపోతున్నట్లు కనబడుతోంది. రష్యా తరహా నియంతృత్వం త్వరగా వచ్చేస్తోందని కొందరంటున్నారు. అది

ఏ రకందైనాగానీ, తీవ్రమైన పద్ధతిలో ప్రచారం చేయటం ద్వారా, ఈ రోజుల్లో కార్మికులను దానికి బానిసలనుగా చేసుకోవచ్చుననిపిస్తోంది. ప్రస్తుతంలో, 'జాతీయకరణం' అనేది ప్రచారం చేయబడుతోంది. అవసర వస్తువులన్నింటినీ జాతీయం చేయాలనే కోర్కె బాహాటంగా వినవస్తోంది. నాగపూర్‌లోని మిర్చి వ్యాపారులు, మిర్చి వ్యాపారమంతా జాతీయం చేయబడాలని కోరారు. ఈ మధ్యనే, ఒక ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు; 'ఒక్క ఆహారధాన్యాలు జాతీయం చేయటం చాలదు; ఈ జాతీయకరణ విధానం ఇతర వస్తువులన్నింటికీ కూడా తప్పక వర్తించాలని' ప్రకటించాడు. ప్రజాస్వామ్యానికి ప్రామాణిక చిహ్నంగా వుండవలసిన 'వ్యక్తి గౌరవం' ఈనాడెక్కడుంది? మనిషి ఒక పెంపుడు కుక్కగా పరిగణింపబడుతున్నాడు. చైతన్యరహితుడుగా మనిషి చేయబడుతున్నాడు. కొరడా దెబ్బలు తింటూ కూడా మనిషి రొట్టెముక్కకు లొట్టలేస్తూ చొంగ కారుస్తాడు.

## దిగజారుతున్న ప్రమాణాలు

మన ప్రజలు ఎంత స్థాయికి దిగజారగలరో ఈ ఉదాహరణ తెలుపుతుంది. సింధ్ నిర్వాసితుల శిబిరాన్నొకదాన్ని ఒకసారి నేను సందర్శించాను. నన్ను చూడగానే వారు తమ ఇండ్ల కప్పులకు వినియోగించుకొనేందుగ్గాను నిర్వాసితులకు ఉచితంగా ఇవ్వాలని తొలుత కంపెనీతో చేసుకున్న ఒప్పందం ప్రకారం, కాంగ్రెసు మహాసభ కొరకు తెచ్చినరేకుల వ్యవహారాల్లో కాంగ్రెసువాదులు చాలా లాభాలు చేసుకున్నారనీ, వారు ఫిర్యాదు చేసారు. నాతో చెపితే లాభమేమిటని నేను వారినడిగాను. ఈ సమస్యను ప్రతిపక్షాలు చేపట్టి పోరాడాలని కోరుతున్నామని వారు చెప్పారు. "గత ఎన్నికల్లో ఏ పక్షానికి ఓట్లు వేసారని" వారిని నేనడిగాను, వారు మాట్లాడలేదు. నా ప్రశ్న వారిని ఎంత ఇరకాటంలో పెట్టిందో నాకు

తెలుసు. అప్పుడు నేను వారినిలా ప్రశ్నించాను. "మీరు ఒకరికి ఓటువేసి అధికారంలోకి పంపి, ఆపైన మీ పనులను ప్రతిపక్షాలు చేసిపెట్టాలని ఆశిస్తే పనెలా జరుగుతుం"దన్నాను. ప్రతిపక్షాలు తీవ్రంగా గొంతెత్తి మాట్లాడాలని వారాశిస్తే, వారు ప్రతిపక్షాలనే సమర్థించి వుండవలసింది. ఈనాడు మన ప్రజలు, ప్రవర్తించే తీరిది. వారికి ఏ విధమైన స్థిరవిశ్వాసాలూ లేవు. ఏ ఒక్క పని కోసమైనా దృఢంగా నిలువగల మానసిక స్థయిర్యం వారికి లేదు.

## అన్నీ వదలుకునైనా అంతిమలక్ష్యం చేరుకుతీరాలి

ఈనాడు మన దేశంలో విఘటనశక్తులు అడుగు ముందేస్తున్నాయి. ఈ సంకట స్థితిని వినియోగించుకునేందుకు, విదేశీశక్తులు పొంచి ఉన్నాయి. కొన్ని ఏళ్ళ క్రిందట— అస్సాంలో భాష పేరిట జరిగిన పోరాటాల వెనుక విదేశీశక్తుల హస్తం వుంది. ఈనాడు హరిజనులపై జరుగుతున్న అత్యాచారాలను గోరంతలు, కొండంతలుగా చేసి ప్రచారం చేయటంలో గూడా విదేశీహస్తం ఉన్నదనిపిస్తోంది. హిందువులను చీల్చటంద్వారా మాత్రమే, తమ ప్రాబల్యాన్ని ఈ దేశంలో నిలబెట్టుకోగలమని, విదేశీశక్తులకు బాగా తెలుసు.

సమాజాన్ని సమైక్యపరచటంలోనూ, దానిలో ప్రగాఢమైన దేశభక్తి భావనను కల్గించటంలోనూ, మనం ఆశించినమేరకు విజయం పొందలేకపోయామని మనం ఒప్పుకుతీరాలి. అందుచేత— మనం మనబాధ్యతలను గుర్తించి, వర్తించటంలో మరింత మెళకువతో ఉండాలి. మన కార్యం యొక్క వివిధాంశాలను గురించి ఆలోచించుకోవాలి. మనస్ఫూర్తిగా మనం కొమ్ము కాసి, కార్యరథాన్ని ముందుకు నడిపేందుకై ఉద్యమించి, అచిర కాలంలోనే ఏమైనాసరే మనలక్ష్యాన్ని చేరుకోవాలనే ధృఢసంకల్పంతో కృషి చేయాలి. దేశంలోని వివిధ ప్రాంతాల ప్రతినిధులు ఇచట సమా

వేసమై ఉన్నారు. వారు తమ సర్వశక్తియుక్తులనూ, తప్పక వినియోగించి తమతమ రంగాల్లో పురోగమిస్తారని నా ధృఢవిశ్వాసం.

ఈరోజు నేను ఇలా మాట్లాడగలిగాను. భగవంతుడు మరొక అవకాశం కల్పిస్తాడో? లేదో? ఎవరికి తెలుసు?

# 38. అంతిమ సందేశం

## 2. ధ్యేయాన్ని ఆరాధించండి

## శ్రీ గురూజీ వ్రాసిన చివరి మూడు లేఖలు

మొదటి లేఖ :

॥ శ్రీః ॥

**రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్, కేంద్ర - నాగపూర్**

సర్ సంఘచాలక్ :
*మా. స. గోళ్వాల్కర్*

సర్ కార్యవాహ ;
*మ. ద. దేవరస్*
దినాంక : 2-4-73

పరమప్రియ ఆదరణీయ స్వయంసేవక బంధువులారా!

ఒక నెలరోజులుగా శారీరికశక్తి శీఘ్రగతిని క్షీణిస్తోంది. వైద్య సోదరులు నిరాశులయ్యారు. ఈ శరీరం ఇక కొద్దికాలంపాటు మాత్రమే సహకరిస్తుందనే భావం అందరి మనస్సుల్లో ఏర్పడ్డదని స్పష్టపడింది.

ఇప్పుడు సంఘకార్య వ్యవస్థకు చెందిన ఒక ప్రముఖమైన ప్రశ్న ఉదయిస్తుంది. సంఘకార్యం మన సంవిధానం ప్రకారం చక్కగా నడవటం తథ్యమే. అయితే ఆ సంవిధానం ప్రకారం నూతన సరసంఘచాలక్‌ను నియమించటానికి సంబంధించిన ప్రశ్న ఉంది. అఖిలభారత కార్యకారీ మండలి సభ్యులలో కొందరిని సంప్రదించగలిగాను. వారంతా పాతకార్యకర్తలు, విశేషానుభవం గడించినవారు, వివిన్న ప్రాంతాల సంఘచాలకుల పదవులలో ఉండి కార్యనిమగ్నులైనవారే. వారందరియొక్క నిర్ణయసారాంశాన్ని ప్రకటించే బాధ్యత ప్రస్తుత సరసంఘచాలక్‌గా నాపైన ఉంది.

ఈ బాధ్యతను పూర్తిచేయటంకొరకు ఈనిర్ణయం ప్రకటిస్తున్నాను. ఈదేహం చ్యుతమైపోయిన తర్వాత సరసంఘచాలక్ పదవీభారాన్ని అందరికీ పరిచితులైన, బాళాసాహెబ్ అని వ్యవహరింపబడే శ్రీ మధుకర దత్తాత్రేయ దేవరస్ స్వీకరిస్తారు.

మన కార్యంయొక్క స్నేహపూర్ణ ఏకాత్మతాపద్ధతి, వ్యక్తి నిరపేక్షత, ధ్యేయనిష్ఠ మొదలైన విశేషతలను దృష్టిలో ఉంచుకొని ఆబాలగోపాలం స్వయంసేవకబంధువులు మన పరమపూజ్య సరసంఘచాలక్‌గారి మార్గదర్శనంలో సంఘకార్యపూర్తికొరకు మనసా వాచా కర్మణా నిమగ్నులవుతారనీ, ఈకార్యం శీఘ్రమే లక్ష్యాన్ని చేరుకుంటుందనీ నా విశ్వాసం.

బంధువులెల్లరికీ సాదర నమస్కారాలు.

ఇతి శమ్

(సం.) మా. స. గోళ్వల్కర్

దినాంక : 2-4-73

## రెండవ లేఖ :

మన కార్యం రాష్ట్రపూజకం. ధ్యేయపూజకం. వ్యక్తిపూజకు దాంట్లో స్థానంలేదు. నా శరీరం కొలదికాలంపాటు మాత్రమే సహకరిస్తుందని వైద్య సోదరుల అభిప్రాయంగా తోస్తోంది. ఎప్పుడో ఒకప్పుడు ఈ నశ్వర శరీరం రాలిపోయేదే. శవానికి అలంకరణలు చేయటం విచిత్రమనిపిస్తుంది. సంఘధ్యేయానికి, ఆ ధ్యేయం చూపించిన సంఘనిర్మాతకు తప్ప మరే

వ్యక్తికీ వారి వ్యక్తిత్వాన్ని పురస్కరించుకొని ప్రాముఖ్యాన్ని పెంపొందించటం, వారి స్మారకచిహ్నాన్ని నెలకొల్పటం ఆవశ్యకం గాదు.

శ్రాద్ధాదుల బరువు మరెవరిమీదా ఉండకూడదనే ఉద్దేశ్యంతోనే బ్రహ్మకపాలంలో నా శ్రాద్ధకర్మనుకూడ జరుపుకున్నాను. సూచనప్రాయంగా చెప్పాను. దీని విపులార్థం అందరూ తెలిసికొనగలరని నా సంపూర్ణ విశ్వాసం.

ఇతి—

(సం.) మా. స. గోళ్వల్కర్.

## మూడవ లేఖ :

దినాంక : 2-4-73

పరమప్రియ ఆదరణీయ స్వయంసేవక బంధువులారా !

1940 సంవత్సరం జూన్ 21 వ తేదీన పరమపూజనీయ డాక్టర్ హెడ్గెవార్‌జీ దేహం కనుమరుగై పోయింది. వారి ఇచ్ఛానుసారం గురుతరమైన సరసంఘచాలక్ బాధ్యత నాపై బడింది. నాకేమీ తెలియనప్పటికీ పాత కార్యకర్తలందరూ ప్రేమాభిమానాలతో సహకరించి మార్గదర్శనం చేయటంవల్ల నే నీ బరువు బాధ్యతలను 33 సంవత్సరాల సుదీర్ఘకాలం వహిస్తూ వచ్చాను. ఇప్పుడు ఈ బాధ్యతను మరొక యోగ్యవ్యక్తికి ఒప్పగించి, ఇంకా త్వరగా, త్వరితగతిని కార్యపూర్తివైపు పురోగమింపచేయటం భగవానుని ఇచ్ఛగా కనిపిస్తోంది. ఇప్పుడా ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఈదీర్ఘకాలంలో నా స్వభావవైచిత్రివల్లకాని, ఇతర లోటుపాటులు, దోషాలవల్లకాని అనేకమంది మన కార్యకర్తల మనస్సు నొచ్చుకొని

ఉండవచ్చు; అందులకు మన్నింపుడని చేతులు జోడించి అందరినీ వేడు కొంటున్నాను. ముగిస్తూ, మహాత్ముడైన శ్రీ తుకారామ్ పలుకులను ఉదాహరిస్తాను. వీటిద్వారా నా భావమంతా అవగతం కాగలదు.

శేవట్ చీ వినవణీ ! సంతజనీ పరిసావీ ।
విసరతో న పడావా । మాఝూ దేవా తుమ్హాంసీ ।
ఆతా ఫార బోలోకాయీ । అవఘేం పాయీం విదిత
తుకా మ్హణే పడతో పాయాం । కరా ఛాయా కృపేచీ ॥

(సం.) మా. స. గోళ్వల్కర్

(కడకొక్క విజ్ఞప్తి కలదయ్య వినుడు
మరువబోకుడు నన్ను మహనీయులార
పలుమాట లింకేల పలుకంగవలయు
కాళ్ళ కెరగుచు తుకారాము పలికె
నను కృపజూడుడు నాదేవులార ! )



# ముస్లిం సమస్య

(1971 ఫిబ్రవరిలో కలకత్తాలో పత్రికా రచయిత, ప్రముఖ అరబ్బీ పండితుడూ ఐన డాక్టర్ సైఫుద్దీన్ జిలానీతో జరిపిన సంభాషణ)

**ప్రశ్న : అన్ని వైపుల నుంచీ దేశం ప్రమాదాల నెదుర్కొంటున్న ఈ క్లిష్ట పరిస్థితిలో హిందూ-ముస్లిం సమస్యకు పరిష్కారాన్ని తప్పక కనుగొనటం అవసరమని మీరు భావించటం లేదా?**

సమాధానం : దేశకార్యంలో హిందువులకూ, ముస్లిములకూ మధ్య తేడా వుందని నేననుకోను. కానీ ఈ సమస్యపట్ల ప్రజల దృష్టి ఏమిటి? ఈ రోజుల్లో బహుశః ప్రతివాడూ ఒక రాజకీయజీవై పోయాడు. రాజకీయ పరిస్థితులను తమ స్వార్థానికి వినియోగించుకోవడం ద్వారా తన తెగ కోసం కొన్ని కోర్కెలనో, లేక ప్రత్యేక సదుపాయాలనో ముందుముందుకు నెట్టగలుగుతానని ప్రతివాడూ భావిస్తున్నాడు. ఈ స్థితి చక్కబడి, ప్రజలు దేశభక్తిదృష్ట్యానే— కేవలం దేశభక్తితో మాత్రమే— రాజకీయాలను పరిశీలించినప్పుడు క్షణంలో సమస్యలన్నీ తీరిపోతాయి.

ప్రశ్న : దేశవ్యవహారాల్లో, తమ వాటా తమకు రావటం లేదనే ముస్లిముల యొక్క నిష్ఠురోక్తికీ, ఈ సమస్యకూ ఏమైనా సంబంధం వుందా?

స : అందరికివలెనే ముస్లిములకు గూడా వారికి చెందవల్సిన దాన్ని వారికివ్వవలసిందే. కానీ ఆ మాట కర్థం వివిధములైన అదనపు హక్కులూ, సదుపాయాలూ వారు కోరుకోవచ్చని కాదు. ప్రతి ప్రాంతం లోనూ ఒక పాకిస్తాన్ కావాలనే కోర్కెను గురించి నేను విన్నాను. ఒక ముస్లిం సంస్థ అధ్యక్షుడు ఎర్రకోటమీద తన ఝెండా ఎగురుతుంటే చూచేందుకు తానొక పథకం వేసానని చెప్పినట్లుగా పత్రికల్లో ప్రకటిత మైంది. ఈ ప్రకటన అసత్యమని ఆతడు ఎన్నడూ ఖండించలేదు. దేశ సమగ్రతను దృష్టిలో పెట్టుకొని ఆలోచించేవారికి ఇటువంటి విషయాలే బాధాకరంగా ఉంటూ వుంటాయి.

ఉర్దూ విషయంలో వాళ్ళ దృష్టి చూడండి. ఏభై ఏళ్ళ క్రితం వివిధ ప్రాంతాల్లో, ముస్లిములు స్థానికభాషలనే మాట్లాడారు, చదివారు కూడా. తమ స్వంతమైన, ప్రత్యేకమైన మతభాష ఉన్నదని వారెన్నడూ భావించలేదు.

ఉర్దూ ముస్లిముల యొక్క మతభాష కాదు. ఉర్దూ అనేది మొగలుల పరిపాలనా కాలంలో రూపొందిన ఒక సంకరభాష. దానికీ ఇస్లాముకీ ఎట్టి సంబంధమూ లేదు. ఇస్లాం అరేబియా దేశంలో పుట్టింది. పవిత్రమైన ఖొరాను అరబ్బీభాషలోవుంది. ముస్లిములకు ఒక మతభాషనేదే వుంటే అది అరబ్బీ అవుతుంది. అటువంటప్పుడు ఉర్దూ భాషమీద ఎందు కింత పట్టుదల? ఎందుకంటే- ఒకే భాష నాధారంగా చేసుకొని ముస్లిముల నందరినీ ఒక రాజకీయశక్తిగా సంఘటితం చేసుకు నేటందుకే. అది అందుకు మాత్రమే. అట్టి రాజకీయశక్తి దేశంయొక్క ప్రయోజనాలకు విరుద్ధంగా ఉండితీరుతుంది.

రుస్తుంను తమ జాతీయవీరునిగా కొందరు ముస్లిములు చెబుతుంటారు. కానీ 'రుస్తుం' పారశీకదేశపు వీరుడు. అతనికీ ముస్లిములకూ సంబంధం లేదు. అతడు ఇస్లాం స్థాపనకంటే ఎంతో ముందుగానే పుట్టాడు. అతణ్ణే ముస్లిములు తమ వీరునిగా భావించగలిగితే, శ్రీరాముని ఎందుకు భావించలేరు? ఈదేశపు చరిత్రను ముస్లిములు తమదని ఎందుకొప్పుకోరని నేనడుగుతున్నాను.

ఈనాడు పాకీస్తాన్ అని పిలువబడే భారత భూభాగంలో పుట్టిన 'పాణిని' యొక్క ద్విసహస్ర జయంత్యుత్సవాన్ని పాకిస్తాన్ జరిపింది. పాకిస్తానే పాణినిని తమ పూర్వజులైన మహాపురుషులలో ఒకనిగా చెప్పుకొనగలిగినప్పుడు, స్థానికులైన మన హిందూ ముస్లిములు,– వారిని హిందూ ముస్లిములనే నేను అంటాను– వారు పాణిని, వాల్మీకి, వ్యాసుడు, రాముడు, కృష్ణుడూ వంటివారందరూ కూడా తమ యొక్క శ్రేష్ఠులైన పితరులనుగా ఎందుకు చెప్పుకోరు.

శ్రీ రామునీ, శ్రీ కృష్ణునీ, దివ్యమైన అవతారమూర్తులనుగా విశ్వసింపనివారు హిందూ ధర్మంలో అనేకమంది ఉన్నారు. అయినప్పటికీ వారిని మహోన్నత వ్యక్తులనీ, ఆదర్శప్రాయులనీ వారు నమ్ముతారు. అందుచేత భగవంతుడు స్వయంగా వారి రూపంలో అవతరించాడని ముస్లిములు నమ్మకపోతే నష్టమేముంది? కానీ అట్టి మహోన్నతులైన వ్యక్తులను తమ జాతీయవీరులనుగా ముస్లిములు ఎందుకు భావించుకోకూడదూ?

మన మతవిశ్వాసాలూ, తత్వశాస్త్రాలను బట్టి చూచినప్పుడు హిందువు ఎటువంటివాడో, ముస్లిమూ అటువంటివాడే. పరమేశ్వరుని చేరగలిగినది హిందువొక్కడే కాదు. తన విశ్వాసాని కనుగుణంగా తన త్రోవను తాను అనుసరించే హక్కు ప్రతి ఒక్కనికీ వుంది.

ఈ సందర్భంలో శృంగేరీ మఠానికి చెందిన పూర్వపు శంకరాచార్యులు, పూజ్యశ్రీ చంద్రశేఖర భారతీస్వామివారికి సంబంధించిన ఒక

ఉదంతం చెబుతాను. ఒక అమెరికా దేశస్థుడు తనను హిందుత్వంలోనికి మార్చమంటూ ఆయన దగ్గరకు వెళ్ళాడు. ఎందుకు మారదల్చుకున్నావని స్వామీజీ అతణ్ణి ప్రశ్నించారు. క్రైస్తవమతం తనకు సంతృప్తి కలిగించ లేదనీ, తన ఆధ్యాత్మిక తృష్ణను అది తీర్చలేకపోయిందనీ, ఆ అమెరికా దేశీయుడు బదులు పలికాడు. అపుడు ఆచార్యులవారు "నీవు నిజాయితీతో క్రైస్తవాన్ననుసరించావా? ముందుగా అట్టి ప్రయత్నం చేయి. అదికూడా నీకు సంతృప్తినివ్వకపోతే అప్పుడు నా దగ్గరకు రా" అని చెప్పారు.

ఇదీ మన ఆలోచనా పద్ధతి. మతమార్పిడులను ప్రచారం చేయని ధర్మం మనది. దాదాపు అన్ని సందర్భాల్లో కూడా మతాంతరీకరణమనేది, రాజకీయమో, అటువంటి మరే ఇతర ప్రయోజనమో కారణంగా జరుగుతూ వుంటుంది. అట్టిదానిని మనం తిరస్కరిస్తాం "ఉన్న నిజమిది. నీ కిష్ట మైతే దీని ననుసరించు" అని మాత్రమే మనం చెపుతుంటాం.

అల్పసంఖ్యాక వర్గాల సమస్య— అనబడే ఇది, కేవలం ముస్లిములకు సంబంధించింది మాత్రమే గాదు. హిందువుల్లో కూడా ఇట్టి సమస్య వుంది. ఉదాహరణకు చెప్పాలంటే మనలో జైనులున్నారు. షెడ్యూలు కులాల వారనబడేవారిలో కొందరు డాక్టర్ అంబేద్కర్ అనుయాయులై బౌద్ధులుగా మారి, తాము ప్రత్యేక వర్గం వారమని చెప్పుకునేందుకు ప్రయత్నిస్తు న్నారు. మన దేశంలో 'అల్పసంఖ్యాక వర్గము'నకు కొన్ని రాజకీయ సదు పాయాలు కల్పిస్తున్న కారణంచేత, ప్రతి ఒక్కడూ తాను అల్పసంఖ్యాక వర్గానికి చెందినవాడుగా ఋజువు చేసుకొని ఆయా సదుపాయాలను తాను పొందే అర్హతను సాధించాలని కోరుకుంటున్నాడు. ఈ పద్ధతి మన వినాశ నానికి త్రోవదీసేదిగా ఉంది; ఈ పద్ధతి ఈ దేశమంతనూ ముక్కలు చెక్కలు చేస్తుంది. నిజం చెప్పాలంటే ఇపుడు మనం ఆ దిశగానే పయ నిస్తున్నాం.

రాజకీయమైన పేరుప్రఖ్యాతులను, పెంచుకోవాలన్న దృష్టితోనే కొందరు విషయాలనన్నింటినీ చూస్తున్నప్పుడు అనేక క్లిష్టపరిస్థితులెదురౌ

తాయి. ఈ పేరుప్రఖ్యాతుల మీద వ్యామోహాన్ని విడిచిపెడితే మనదేశం సమైక్యమవుతుంది. యావత్ప్రపంచం నుంచీ మనకు ఎదురయ్యే సవాళ్ళను కూడా అప్పుడే మనం ఎదుర్కొనగలుగుతాం.

ప్రశ్న: సర్వసామాన్యంగా భౌతికవాదం, అందునా ప్రత్యేకంగా సామ్యవాదం మన దేశాన్నంతనూ ముంచెత్తే ప్రమాదం కనిపిస్తోంది. హిందువులూ, ముస్లిములూ భగవంతునిపై విశ్వాసం కలిగినవారు గనుక ఒక్కటై, ఈ ప్రమాదాలకు వ్యతిరేకంగా సమైక్యకృషిని చేయాలని మీరనుకోవడం లేదా?

స: దాదాపు ఇదే ప్రశ్న కొంతకాలం క్రితం కాశ్మీర్ నుంచి వచ్చిన ఒక పెద్దమనిషి నన్నడిగాడు. అతడి పేరు నాజిర్ ఆలీ అనుకుంటాను. ఆయన మంచివాడే. ఆయనను నేను ఆలీఘర్‌లో కలిసాను. నాస్తికత్వ ప్రమాదం సామ్యవాదపు ముసుగులో మనమీద దాడిచేస్తోంది. దేముడున్నాడని నమ్మే మనమంతా ఒక్కటై ఆ ప్రమాదాన్నెదుర్కోవాలీ, అని నాతో అన్నాడాయన. అప్పుడు నేను "నిజమే. నేను మీతోపూర్తిగా ఏకీభవిస్తున్నాను. కానీ ఇబ్బంది ఏమిటంటే భగవన్మూర్తిని మనమంతా ముక్కలు చెక్కలూ చేసి ఎవరి ముక్కను వాళ్ళు తీసికొన్నట్లున్నాం. అటువంటప్పుడు మనమేం చేయగలం? మీరు భగవంతుణ్ణి ఒక ప్రత్యేకవిధంగా ఊహిస్తారు. క్రైస్తవుడు మరోలా భావిస్తాడు. బౌద్ధుడు భగవంతుడే లేడు కేవలం నిర్వాణం మాత్రమే ఉందంటాడు. జైనుడు దాన్నే 'శూన్యం'అని అంటాడు. మరి మాలో చాలామంది "మేం భగవంతుని శ్రీ రాముడు, శ్రీ కృష్ణుడు, శివుడు వంటి దేవతల రూపంలో ఆరాధిస్తా"మంటారు. ఇటువంటి వాళ్ళందర్నీ ఒకే దైవాన్ని నమ్మండని అడగటమెట్లా? దీనికి

మీరేదైనా మార్గం సూచిస్తారా?" అన్నాను. ఆ కాశ్మీరీ పెద్దమనిషి సూఫీ మతస్థుడు. నేను అతనిని మేధావి అనీ, దైవచింతన గలవాడనీ అనుకున్నాను. ఆతడు చెప్పిన సమాధానం వింటే మీరాశ్చర్యపోతారు. "అటువంటి వారందరూ ఇస్లాంలో ఎందుకు చేరిపోకూడదూ" అన్నాడతడు.

అది విని- "అందరూ క్రైస్తవంలో ఎందుకు చేరిపోకూడదని ఎవరో ఒకరు అంటారని మీరు ఎందుకు ఊహించరు? నేను నా ధర్మానికి అంకితమైనవాణ్ణి కాబట్టి అందరూ హిందువులే ఎందుకాక్కూడదూ అని అడగవచ్చు కదా! మళ్ళీ కథ మొదటికే వస్తుంది. ఇక ఈ సమస్య ఎప్పటికీ తీరదు" అని నేను బదులు చెప్పాను. అయితే అందుకు 'మీ సలహా' ఏమిటని అతడు నన్నడిగాడు. "మీరు మీ మతాన్నే అనుసరించండి. కానీ కేవలం హిందుత్వానికో, ముస్లిం మతానికో మాత్రమే చెందనటువంటి ఒక మౌలికమైన తత్వశాస్త్రం వుంది. దానిని మీ ఇష్టమొచ్చిన పేరుతో పిలుచుకోండి. అదేం చెబుతుందంటే,- సత్యస్వరూపమైన, ఆనందరూపమైన ఒకే ఒక శక్తి వుంది. అదే సృష్టిస్తుంది; పోషిస్తుంది; నాశనం చేస్తుంది కూడా. దైవాన్ని గురించిన మన ఊహలన్నీ కూడా ఒకే ఒకటైన ఆ పరమసత్యాన్ని గురించి కేవలం మనయొక్క పరిమితమైన ఊహలు మాత్రమే. కాబట్టి పునాదిరాయి వంటి ఆ పరమసత్యమే మనలనందర్నీ కలుపగలదు. అది ఏ ఒక్క మతానికీ చెందింది కాదు. ఈ కారణంచేత ప్రతి ఒక్కరూ దానినే సమానభూమికగా అంగీకరించవచ్చు. మతం అనేది కేవలం ఒక ఆరాధనాపద్ధతి మాత్రమే. ఈ మౌలిక విశ్వాసం కేవలం ఆరాధనా పద్ధతి కాదు. అది ఈ విశ్వమును గురించిన ఒక తాత్విక అవగాహన. ఇస్లాంయొక్క భగవంతుడూ, క్రైస్తవంయొక్క భగవంతుడూ, హిందుత్వంలోని భగవంతుడూ ఒక్కటే. మనమంతా ఆ పరమాత్మని భక్తులమే. సూఫీమతస్థులుగా మీరు దీనిని హేతుబద్ధమైన ఆధారంగా తప్పక అంగీకరించాలి" అన్నాను. అందుకాతడు బదులు పలకలేదు. ఆ తర్వాత మేం విడిపోయాం. అక్కడితో ఆ వ్యవహారమంతా ముగిసింది. అది మన దురదృష్టం.

ప్రశ్న : హిందువులకూ, మహమ్మదీయులకూ గూడ పరస్పర సుహృద్భావం చాల ఎక్కువగానే వుందని మనకు తెలుసు. అయినప్పటికీ అప్పుడప్పుడు, చిన్నా, పెద్దా పరిమితుల్లో సంఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. వీనిని తగ్గించటానికిగానీ, లేదా పూర్తిగా నిరోధించటానికిగానీ, ఏ చర్యలు తీసుకుంటే బాగుంటుందని మీరు భావిస్తున్నారో- మీ అభిప్రాయం చెప్పండి?

స: ఇట్టి సంఘర్షణలకు ఒక కారణం గోవు. గోవుని చంపటం తమ హక్కనుకునే భావాన్ని ముస్లింలు ఎందుకు పాడిందే పాటగా పట్టుకూర్చుంటారో నాకు తెలియటం లేదు. వారలా భావించనక్కరలేదు. నిజం చెప్పాలంటే అది వారి మతనియమంకాదు. పూర్వకాలంలో వారు హిందువులను కించపరచేందుకు అదొకమార్గం మాత్రమే. అది ఇప్పుడు కూడా ఆలాగే ఎందుకు కొనసాగాలి?

తోటివారి పండుగల్లో మనం పాలు పంచుకోలేమా? సమాజంలో వివిధ స్థాయిలవారిని ఒకటి చేసేటువంటి బహుళ ప్రచారం గల ఉత్సవం మన హోలీ పండుగ. ఈ హోలీ పండుగలో, ఒక ముస్లింమీద ఎవరో రంగునీళ్ళు చిలకరించారనుకుందాం. అంతమాత్రంచేత కొరాను యొక్క ఆదేశాలు అతిక్రమించబడ్డాయని మీరు అనుకుంటారా? అది ఒక సాంఘిక వ్యవహారంగా ఎందుకు అనుకోకూడదు? అజ్మీర్‌లోని ఉరుసు వంటి అనేక ముస్లిం ఉత్సవాల్లో హిందువులు పాలుపంచుకుంటూనే ఉన్నారు. కానీ సత్యనారాయణపూజల్లో పాల్గొనేందుకు రమ్మని ముస్లిములను మనం ఆహ్వానించామని ఊహించండి. అప్పుడేమవుతుంది? ఒకప్పుడు ద్రవిడమున్నేట్ర కజగంవారు ఒక ముస్లిం మంత్రిని రామేశ్వరానికి తీసుకుపోయారు. దేవాలయ అధికారుల ఊహలమేరకు అన్ని సత్కారాలూ అతనికి చేశారు;

అన్నీ స్వీకరించాడు. కానీ తీర్థప్రసాదాలు ఇవ్వగానే అతడు వాటిని దూరంగా పారేసాడు. అతడు అట్లా ఎందుకు చెయ్యాలి? అతడు ప్రసాదాన్ని స్వీకరించాడే అనుకుందాం. అప్పుడతడు తన మతాన్ని అతిక్రమించినట్లవుతుందా? కాబట్టి ఒకరినొకరు గౌరవించుకునే ధోరణిని మనం అలవరుచుకోవటం అభ్యాసం చేయాలి. మనం కేవలం ఇతరుల విశ్వాసాలను సహించడం మాత్రమే గాదు. వాటిని తప్పక గౌరవించాలి. మనది సహిష్ణుతావాదం కాదు. సమ్మానవాదం.

**ప్రశ్న : హిందూ ముస్లిముల మధ్య సామరస్య సాధనా ప్రయత్నంలో నడుం కట్టి ముందుకు రావటానికి అర్హులైనవారు మనలో ఎవరు? రాజకీయవాదులా? విద్యావేత్తలా? లేక మతాచార్యులా? మీ అభిప్రాయమేమిటి?**

స : రాజకీయవేత్త దీనిలో చివరివాడు. మతాచార్యుల గురించి కూడా అదే మాట చెప్పవచ్చు. ప్రస్తుతం మన దేశంలో పూర్తిగా సంకుచితత్వం కలిగిన మతాచార్యులు రెండు మతాలవారిలోనూ ఉన్నారు. భావనలో, మతపరంగానూ, రాజకీయాలకతీతంగానూ ఉంటూ తమ మనస్సుల్లో సమైక్యజాతీయభావం కలిగినటువంటి మూడవరకం మనుషులను ఈ పనికి మనం ఆశిస్తాం. వారు తప్పనిసరిగా మతవిశ్వాసాలు కలిగినవారుగా వుండాలి. మతపరమైన భూమికలేనిదే సాధించకలిగిందేమీ లేదు.

రాజకీయవాదులు ప్రజలను అధికాధికంగా విభజిస్తూ తమ ఆటలు కొనసాగిస్తున్నారు. కులంమీద పట్టింపులను పెంచేదీ, హిందూ ముస్లిం ఉద్రిక్తతలను రెచ్చగొట్టేదీ వారే. అటువంటి మతపరమైన వ్యవహారాలన్నిటిలోనూ దుష్టపాత్రధారి రాజకీయవాదే. దురదృష్టవశాత్తూ అతడే

ప్రజానాయకుడౌతున్నాడు. మిక్కిలి పవిత్రులై, శీలవంతులై, భగవద్భక్తులైనవారే, వాస్తవానికి నిజమైన ప్రజానాయకులు కావాలి. కానీ అట్టివారు మాత్రం నేడెక్కడా కనిపించటం లేదు.

**ప్రశ్న : మతవర్గాల పట్ల సామరస్యపూర్వకమైన వాతావరణాన్ని నిర్మాణం చేసేందుకు, అధిక సంఖ్యాకవర్గమైన కారణంచేత హిందువులే, ప్రత్యేకమూ, ప్రముఖమూనైన బాధ్యత వహించాలని మీరనుకోవటం లేదా?**

స : నిజమే. తప్పనిసరిగా అది నిజమే, కానీ దానిలోని ఇబ్బందులను గుర్తించండి. హిందువులమీద దోషారోపణ చేయటానికి, ముస్లిములను నిర్దోషులని ప్రకటించటానికీ, మన నాయకులు మొగ్గు చూపుతున్నారు. ఇది ముస్లిములను తమ మతతత్త్వదృష్టిలో మరింత రెచ్చిపోయేట్టుగా చేస్తోంది. కాబట్టి ఇద్దరూ ఈ బాధ్యతను పంచుకోవాలని నేనంటాను.

**ప్రశ్న : ఇట్టి సామరస్య సాధనలో, రెండు మతవర్గాలవారూ సత్వరమే స్వీకరించదగినదిగా ఏ చర్యను మీరు సూచిస్తారు?**

స : మతాన్ని సరిగా అవగాహన చేసుకునే విద్యాబోధన సామూహికంగా స్వీకరించబడాలి. ఈ రోజుల్లో మన రాజకీయ నాయకుల చేత నేర్పబడుతున్న మతరహితమైన విద్య కాదు. నిజమైన మతవిద్యకావాలి. ఇస్లాంను కూర్చినటువంటి యదార్థ విజ్ఞానాన్ని ప్రజలకందించండి. అలాగే హిందుత్వాన్ని గురించిన నిజమైన విజ్ఞానాన్ని ప్రజల కందించండి. అన్ని మతాలూ మనిషిని, నిస్వార్థంగా, నిర్మలంగా, పవిత్రంగా వుండమనే బోధిస్తాయి అనే విషయాన్ని వారికి తెలియచేయండి.

ఇక ఉన్నదున్నట్లుగా చరిత్రను బోధించండి. ప్రస్తుతం వున్న అవకతవకలను సరిచేయండి. గతంలో ముస్లిం దురాక్రమణదారులు దండెత్తి వచ్చారనే చెప్పండి. అంతేగాదు దురాక్రమణదారులు విదేశీయులనీ, అతనికీ ప్రస్తుతం ఇక్కడున్న ముస్లిమునకూ ఏ విధమైనసంబంధం, సమానత్వం లేవని కూడా చెప్పండి. తాము ఈ దేశమునకు చెందినవారమే ననీ, పూర్వకాలపు దురాక్రమణదారులూ, వారి దండయాత్రలూ తమ వారసత్వంలో భాగాలు కావనీ, ఇక్కడుంటున్న ముస్లిములను చెప్పమనండి.

సత్యమైనదాన్ని బోధించటానికి బదులు, ప్రస్తుతం ముస్లిములకు, అవకతవకగా తారుమారైన విషయాలని బోధిస్తున్నాం. సత్యాన్ని ఎంతో కాలం దాచలేం. ఎంత దీర్ఘకాలం దాచివుంచినా చివరకు అది బయటపడుతుంది. మరిన్ని విషమానుభూతుల్నే కలిగిస్తుంది. అందుకనే చరిత్రను ఉన్నదున్నట్లుగా చెప్పమని నేనంటున్నాను. అఫ్జల్‌ఖాన్ శివాజీచేత చంపబడ్డాడనే విషయాన్ని, ఒక విదేశీ దురాక్రమణదారుడు ఒక జాతీయవీరునీ చేతిలో చచ్చాడని చెప్పండి.

**ప్రశ్న: 'భారతీయకరణం పై ఈమధ్య ఎంతగానో చర్చ సాగుతోంది. ఎంతో గందరగోళం చెలరేగింది. ఈ గందరగోళం తొలగించడమెట్లాగో దయవుంచి చెప్పగలరా?**

స: భారతీయకరణమనేది 'జనసంఘం' ఇచ్చిన నినాదం. దాన్ని గురించి అసలు తికమక ఎందుకుండాలి? భారతీయకరణ అంటే అందర్నీ హిందువులుగా మార్చడమని అర్థం కాదు. మనమంతా ఈ భూమి సంతానమేననీ మన జనమంతా ఒకటేననీ, శ్రేష్ఠులైన మన పూర్వజులందరూ ఒకరేననీ, మన ఆకాంక్షలు కూడా ఒక్కటేననీ, మనమంతా గ్రహించాలి. విశ్వసించాలి. 'భారతీయకరణ'మంటే ఇదేనని నా నమ్మకం.

ప్రశ్న : మతవైషమ్యాన్ని శాశ్వతంగా తొలగించేందుకు **మార్గాలనూ**, ఉపాయాలనూ కనుగొనటంలో మీతో సహకరించ కలిగినట్టి భారతీయ ముస్లిం నాయకులకూ మీకూ ఒక సమావేశం ఈపాటికే జరిగుండవలసిందని మీరనుకోవటం లేదా? అట్టి నాయకులను కలుసుకునేందుకు మీరు ఇష్టపడతారా?

స : నేను ఇష్టపడటమే గాదు. స్వాగతిస్తాను కూడ.

## ఢిల్లీలో పత్రికా సంపాదకులతో...

ప్రశ్న : స్వతంత్రజాతిగా ఇన్ని ఏళ్ళు గడిచినతర్వాత **గూడా** భారతదేశంలో మతపరమైన ఉద్రిక్తతలు తగ్గలేదు. **దీనికి** కారణం గురించి, మీ విశ్లేషణ ఏమిటి?

స : భారతదేశం, దాని ప్రజలూ, దాని సంస్కృతులతో భారతీయ ముస్లిములు ఇంతవరకూ పూర్తిగా తాదాత్మ్యం చేసుకోకపోవడమే హిందూ ముస్లిం ఉద్రిక్తతకు ముఖ్యకారణం. ఇది తన దేశమనీ, వీరంతా తన ప్రజలనీ భారతీయముస్లిం హృదయపూర్వకంగా చెప్పగలిగితే ఈ సమస్య పరిష్కారమౌతుంది. ఇదంతా ఆతని మనస్తత్వంలో మార్పుకు సంబంధించిన వ్యవహారం.

ప్ర: అంటే మీరు హిందువుల ఆధిక్యతను కోరుతున్నట్లే గదా! ఇందుకోసం రాజ్యాంగం సవరించటం అవసరమని మీరు కోరుతున్నారా?

స : ఒకరి ఆధిక్యమనే ప్రశ్నలేదిక్కడ. మేంకోరేది, ఇక్కడ సువ్యవస్థితమైన సమాజం. మన రాజ్యాంగం అందరికీ సమాన హక్కుల్ని

ఇస్తోంది. అట్టి రాజ్యాంగాన్ని సవరించవలసిన అవసరం లేదు. హిందువు పుట్టుకతోనే మత విద్వేషరహితుడు. భగవత్సాక్షాత్కారానికి విభిన్న మార్గాలున్నాయనే సత్యాన్ని అతడు అంగీకరిస్తాడు.

**ప్రశ్న : మీరెపుడూ హిందువులను గురించే మాట్లాడతారేమీ? భారతీయుల గురించి ఎందుకు మాట్లాడరు? మీ కార్యంలో ముస్లిములను మీరెందుకు చేర్చుకోరు?**

స : మహాత్మాగాంధీతోసహా, ఏ ఉత్తముడైన హిందువుకంటేగూడా, అతినికృష్టుడైన ముస్లిమైనప్పటికీ ఉత్తముడే అని మౌలానామహమ్మదాలీ ప్రకటించినప్పుడు కూడా, మన నాయకులు ముస్లింలను మంచిచేసుకోవాలనీ, స్వాతంత్ర్యసమర సమయంలో ప్రయత్నించారు. ఆ ప్రయత్న ఫలితంగానే హిందువుడు "హిందుస్తానీ"గా మారాడు. కానైతే ముస్లింలు అందుకు సుముఖంగా ప్రవర్తించారా ? ముస్లిం కూడా ఆ విధంగా స్పందించాడా ? ముస్లిం కూడా హిందుస్తానీగా మారాడా ? లేదు !

దాదాపు రాజకీయపార్టీలన్నీ కేవలం ముస్లిముల యొక్క, మూకుమ్మడి ఓట్లను కోరుకుంటున్న కారణం చేతనే, తమ ప్రత్యేక అస్తిత్వాన్ని నిలబెట్టుకోవలసిందిగా వారిని నిరంతరం ప్రోత్సహిస్తున్నాయి. ముస్లింల నుండి హిందుస్తానీలను తయారుచేసే మార్గమదా ? దానిబట్టి ముస్లింలను సరిదిద్దే ప్రయత్నానికి ముందు, హిందువులయొక్క ధోరణిని, మనస్తత్వాన్నీ సరిదిద్దటం ముందుగా అవసరమనీ తేలుతోంది. కాబట్టే నేను ముస్లింలను గురించికాక, హిందువులను గురించే పట్టించుకొంటున్నాను.

**ప్రశ్న : యదార్థంగా ముస్లిములు, మన జీవితంలో ఒక భాగమయ్యారు కదా!**

స : నేనా విషయం ప్రశ్నించటంలేదు. వారు ఇలాగే ఎందుకు ప్రవర్తిస్తున్నారనేదే నా ప్రశ్న. వాస్తవానికి ఇస్లాం వ్యాపించిన ప్రపంచంలోని

ఏ ఇతర దేశంలో అయినప్పటికీ, అంతకు పూర్వం నుంచీ ఉన్న, ఆయా దేశాలకు సంబంధించిన వస్త్రధారణ, భాష, జీవనపద్ధతులువంటివి మారలేదు. ఇరాన్‌లోనూ, టర్కీలోనూ, అలాగే ఇతర దేశాల్లోనూ వారియొక్క సహజ ములైన వస్త్రధారణ,భాష, జీవనదృష్టివంటివి. యథాపూర్వంగానేవున్నాయి. కానీ మన దేశంలో ప్రతిదీ, చివరకు ఆలోచన కూడా మారిపోయింది.

ఈ మార్పేగనుక లేకపోయినట్లయితే ముస్లిం సమస్య అనేదే వుండేది కాదు. అదే, ముఖ్యమైన జాతీయ జీవన ప్రవాహం నుంచి, వారిని దూరం చేసేసింది

# 2. గోవధ

ప్రశ్న : **గోవధ** అనేది మన దేశంలో ఎలా ప్రారంభ మైంది?

స : విదేశీ దురాక్రమణదారుల రాకతో అది ప్రారంభమైంది. ప్రజానీకాన్ని బానిసత్వంలో క్రుంగదీసేందుకుగాను హిందువులలోని స్వాభిమానపు చిహ్నాలన్నింటినీ తుడిచిపెట్టివేయడమే ముఖ్యమార్గం కాగలదని వారు ఊహించారు. మాతాంతరీకరణమూ, మన దేవాలయాలు, మఠాలను కూలగొట్టడంవంటి వివిధములైన కిరాతక పద్ధతులను వారు చేబట్టారు. ఆ వరుసలోనే గోహత్య కూడా ఆరంభమైంది. ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, ఇంగ్లీషువారలు జరిపిన తదనంతరకాలపు దురాక్రమణల్లో ప్రజలను లొంగదీసుకునే మార్గాలకు ఇది సహాయం చేయవచ్చునని ఈ గోహత్య కొనసాగించారు.

ప్రశ్న : ముస్లిముల మనోభావాలను గౌరవించేనిమిత్తమే గోహత్యను మనం సహించవలసి వుందని కొందరంటారు?

స : అయితే ఇపుడు మనం, మన స్వాభిమానాన్ని వదులుకోవాలన్నమాట. 'సహనం' పేరు మీద మన విశ్వాసాలనూ, ఆలోచనలనూ మనం అగణగద్రొక్కనీయాలన్నమాట ? ముస్లిముల విశ్వాసాలను గౌర

వించాలీ, అనేవారు అలా అంటానికి రెండు కారణాలున్నాయి. ఒకటి ముస్లిములు సంఘటితులైవున్నారు. వారు తమ 'విశ్వాసాలను' కాపాడుకునే నిమిత్తమై దేశాన్ని కొల్లగొట్టి దోచుకోవటం ప్రారంభిస్తే వారిపైన చర్యతీసుకునేందుకు ప్రభుత్వం సిద్ధంగాలేదు అన్నది మొదటి కారణం. అయిదేళ్ళకొకసారి అధికారంలోవున్నవారు ఓట్లకోసం వారిదగ్గరికి వెడతారు. తమకు కాకుండా ఇతర పక్షాలకు ముస్లిములు మూకుమ్మడిగా ఓట్లు యివ్వకుండా వుండాలనే ఆదుర్దా వారికుండడం రెండవ కారణం. ఈ విధంగా వారిలోవున్న స్వార్థమే ఇట్టి వాదనలను ప్రతిపాదించేందుకు వారిని ప్రోత్సహిస్తోంది. దీన్ని ఊతగా తీసుకొనే యితర రాజకీయపక్షాలు కూడ అదే పథకాన్ని అనుసరించి యిటువంటి వాదాన్ని లేవనెత్తి ముస్లిములను బుజ్జగించడానికి ప్రయత్నిస్తుంటాయి.

ప్రశ్న : గోహత్యా నిషేధ ఉద్యమానికి వ్యతిరేక ప్రచారం పెద్దగా సాగుతోంది దానిని ఎదుర్కొనడ మెట్లా?

స : అన్ని విషయాలను ప్రజలముందుంచాలి. ఇందులో ఆర్థిక విషయాలూ, విశ్వాసాలవంటివి అనేక దృక్పథాలున్నాయి. అయినా నేను యింకొక దృష్టికోణం నుంచి కూడా ఈ సమస్యను చూస్తాను. ఈ దేశంలో గోహత్య విదేశీ ఆధిపత్యంతో ఆరంభమైంది. మహమ్మదీయులు దీన్ని ప్రారంభించారు. ఆంగ్లేయులు కొనసాగించారు. కాబట్టి అది మనకొక కళంకం. ఈనాడు మనం స్వాతంత్ర్యం సంపాదించుకున్నాం. స్వాతంత్ర్యం రాగానే ఇటువంటి కళంకాలన్నీ కూడా తుడిచివేయాలి. లేకుంటే మనం మానసిక బానిసత్వంలో సతమతమవుతూనేవుంటాం. ఈనాడు అది తొలగటానికి బదులు, ఎన్నో రెట్లుగా పెరిగింది. 1944–45ల్లో, అంతకు పూర్వంకంటె గోహత్య 50 నుంచి 100 రెట్లవరకూ పెరిగింది. యుద్ధ సమయంలో విదేశీసైన్యం యిచట బసచేయడంవల్లనే ముఖ్యంగా యిది సంభవమైంది. ఈనాడు స్వరాజ్యం వచ్చిన తర్వాత యిది తగ్గడానికి

బదులు, విదేశీసైన్యం యిక్కడ లేకపోయినప్పటికీ 1945 నాటి స్థాయి కంటె 20 రెట్లు ఎక్కువయింది. మన సైన్యానికి సంబంధించినంత వరకు ఆంగ్లేయ ప్రభుత్వం సైనిక జీవనంలో ఆవుమాంసం, పంది మాంస ముల వినియోగాన్ని నిషేధించింది. 1857లో వారు బుద్ధితెచ్చుకున్నారు. ఈనాడు మన స్వతంత్ర జాతీయ సైన్యంలో మనవాళ్ళు గోమాంసాన్ని వుపయోగిస్తున్నారు. కానీ పంది మాంసాన్ని మాత్రం ఉపయోగించరు! ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో గోహత్యమీద చట్టపరమైన నిషేధం ఉన్నప్పటికీ సైన్యం అవసరాలు తదితరాల కొరకు పనికిరాని పశువులను చంపవచ్చునని అనుమతించడానికి అవసరమైన చట్టసవరణలను తీసుకొని రావలసిందిగా ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. ఈ పద్ధతిలో- ఉపయోగించే పశువులను కూడ చంపుతున్నారు. గోహత్యా నిషేధం కొరకే ఏర్పడిన చట్టం వల్ల ప్రయోజనాలు కూడా ఇలా వమ్మయ్యాయి. అంతే కాదు గోహత్య నిషేధంవున్న మైసూరువంటి ప్రాంతాలలో సరిహద్దుల చుట్టూరా పశుమారణం జరుగుతూనేవుంది. గోమాంసం రాష్ట్రంలోనికి చేరుతూనేవుంది. ఈ కారణాలవల్లనే దేశవ్యాప్తంగా సంపూర్ణ గోహత్యా నిషేధాన్ని కేంద్రప్రభుత్వమే చేయాలని మేం కోరుతున్నాం, విదేశీ మారకద్రవ్యపు ప్రశ్నను గురించి కూడ ఉదాహరిస్తూ "మనం గోమాంసాని్నవిదేశీ మారకద్రవ్యంగా పంపకపోతే మనం చాలా నష్ట పోతామని" కొందరు నాయకులు నాతో అన్నారు. విదేశీ మారకద్రవ్యం కోసం మన జాతీయశ్రద్ధాకేంద్రాల విషయంలో మనం ఎలా రాజీపడగలం?

ప్రశ్న : గోహత్యా నిషేధాన్ని అంగీకరించకపోవడంలో ప్రభుత్వ ఉద్దేశ్యమేమిటి?

స : గోహత్య నిషేధించడం వలన ముస్లిముల యొక్క, క్రైస్తవుల యొక్క ఓట్లను కోల్పోతామని వారు భయపడుతూ వుండివుండవచ్చు. వెల్తిబాగుల హిందువు ఎలాగూ వారికే ఓటువేస్తాడు కాబట్టి ముస్లిముల

యొక్క, క్రైస్తవులయొక్క ఓట్లను కాపాడుకోవాలి. గోహత్యను నిషేధించరాదని అమెరికా కూడ మనలను ఒత్తిడి పెట్టింది. చౌకగా గోమాంసం, చర్మాలూ, తోళ్ళు మన నుంచి వారికి అవసరం. వారి దేశపు మంచి గోవులను పెద్దపెట్టున చంపుకోడానికి వారు అంగీకరించరు. పైగా చివరకు పాలపొడికి కూడ మనం వారిమీద ఆధారపడి వుండాలని వారు కోరుకుంటున్నారు.

ప్రశ్న : మైసూరు ప్రాంతంలో సంపూర్ణ గోహత్యా నిషేధాన్ని ప్రకటిస్తూ చేయబడిన పూర్వపు చట్టము 12 సం॥ల వయసు దాటిన ఎద్దులను చంపడానికి అనుమతిస్తున్న కేంద్ర ప్రధాన న్యాయస్థానం యొక్క ఆదేశాల దృష్ట్యా సవరించబడింది. అట్లా చేయడం తప్పనిసరా?

స : కేంద్రన్యాయస్థానము' ఉత్తరప్రదేశానికి చెందిన కసాయి వారి విషయంలో, ఒక ప్రత్యేకమైన వృత్తిని అనుసరించేందుకు వారుకోరిన కోర్కెను పాక్షికంగా అంగీకరిస్తూ ఆదేశాలను జారీచేసింది. ఇపుడు మైసూరు ప్రాంతం విషయంలో ఆవాదన ఏమాత్రం తగదు. ఎందుకంటే అక్కడ చాలా కాలంగా గోహత్యా నిషేధం అమలులోవుంది. కాబట్టి వారి వృత్తికి విఘాతం కలగడం అన్న ప్రసక్తే లేదు.

అసలు, వృత్తిస్వేచ్ఛ తప్పక గౌరవింపబడాలి, అనేటువంటి కేంద్రన్యాయస్థానం యొక్క వాదన కూడా ఒక అభూతకల్పనే. మద్యపాన నిషేధంవల్ల మన ప్రజల్లోని ఒకవర్గం జనులకు, వారియొక్క తరతరాల వృత్తిపోతుంది. మహారాష్ట్ర ప్రాంతంలో రామోషీ అనే ఒక తెగ వుంది. వారు రాముణ్ణి పూజించి దోచుకోవడానికి బయలుదేరతారు. అది వారికి కలకాలంగా వస్తున్న వృత్తి. అటువంటప్పుడు వారి హక్కులకు గూడ కేంద్రన్యాయస్థానం సంరక్షణ కల్పిస్తుందా ?

ప్రశ్న ; "గోమాంస భక్షణను గూర్చి వేదాలలో కూడ ప్రసంగములున్నవి" అని కొందరంటారు. అది నిజమేనా?

స : వేదాలలో గోమాంస భక్షణ గురించి ఉదాహరణలుగా భావించ బడేవన్నీ "గా" అన్న శబ్దమును తప్పుగా వ్యాఖ్యానించడం వల్లనే ఏర్పడినవి. వేదాలలో 'గా' శబ్దమునకు యింద్రియములనిగూడ అర్ధ ముంది. ఈ అర్ధంలోనే "నేను గోవునుతింటాను" అనగా "జితేంద్రియుణ్ణి అవుతాను" అన్న భావనతోనే యాజ్ఞవల్క్యుడు అట్టి పదప్రయోగం చేసాడు. కానీ ఈ దుర్వ్యాఖ్యానం-లేదా- ఈ అజ్ఞానం గోహత్యను సమర్ధించే వారికి ఉపయోగపడుతోంది.

# 3. రాజకీయ సిద్ధాంతాలు—వ్యవస్థలూ

ప్రశ్న : తమ సిద్ధాంతం మానవక్రమ వికాసాన్ని సూచించే వైజ్ఞానిక సూత్రంమీద ఆధారపడివుందని సామ్యవాదులు చెప్పుకుంటుంటారు. అది వారి వాదనలో ఒక ప్రధానాంశం కాదా?

స : కానీ. నిజంచూస్తే, మానవక్రమవికాసం యొక్క యదార్థ స్వరూపాన్ని గురించిన వైజ్ఞానిక పరిశోధన వారి వాదాన్ని తిరస్కరిస్తుంది. మానవపరిణామక్రమంలో తొలిమెట్టుననిలిచే భౌతికవాదంమీద సామ్యవాదుల సిద్ధాంతం పూర్తిగా ఆధారపడివుంది. ఈ క్రమవికాసం తప్పనిసరిగా స్థూలం నుండి సూక్ష్మం దిశగా పురోగమిస్తుంది. మానవుడు తన ప్రాథమిక దశలో కేవలం స్థూలవస్తుజాతానికే అంటిపెట్టుకొని వుంటాడు. అతడు తన సమయం, శక్తులనంతనూ, భౌతికసుఖాన్వేషణలోనూ, శారీరకవాంఛల సంతృప్తిలోనూ వెచ్చిస్తాడు. ఆపైన అతడు క్రమంగా అభివృద్ధిచెంది ఒక ఉన్నతదశకు తననుతాను వికసింపచేసుకునే తరుణంలో తన భావోద్వేగపుటాకాంక్షలను సంతృప్తిపరుచుకోవడం ద్వారా మానసిక సుఖానుభూతిని కోరుకుంటాడు. ఇప్పుడాతడు మానవక్రమవికాసానికి మరోపైదైన సంస్కృతీపథంలో ఉంటాడు. అప్పుడే అతనిలో

కళాత్మకదృష్టి ఆరాటపెడుతుంది. తత్ఫలితంగా అతడు అనంతరూపాల్లో కళోపాసన చేస్తాడు. ఆపైన మరొక అడుగు ముందుకువేసి, ఆయా కళా రూపాలకు భూమికగానున్న నిగూఢ సౌందర్యాంశాన్ని వెలికితెచ్చేందుకు ప్రయత్నంచేస్తాడు. బౌద్ధికమైనస్థాయిలో సంతోషానుభూతిని ఆతడు పొందనారంభించేది ఆ దశలోనే. అప్పుడే ఆతడు విజ్ఞానసాగరపులోతుల్లోకి చొచ్చుకుపోవటంలోనే సంతోషముందని గుర్తిస్తాడు. అప్పుడు శాస్త్ర విజ్ఞానం తత్వశాస్త్రాల పరిధులు అతని మేధాశక్తికి, పరిశోధనార్థం ఎన్నో సవాళ్ళు విసురుతాయి. అయినా ఆతడు, వానికి సమాధానం కనుగొనడంతో సంతృప్తిపడటానికొప్పుకోడు. ఇంకా పురోగమించాలని ఆశపడతాడు. తన మేధను కూడా దాటి ముందుకుపోవాలనీ, తన స్వీయ అస్తిత్వంలోని రహస్యాన్ని గురించి అన్వేషణకు యత్నిస్తాడు. అప్పుడాతడు ఆత్మ సామ్రాజ్యంలోనికి ప్రవేశిస్తాడు. తుట్టతుదకు పరమసత్యాన్ని–దైవమును– సర్వత్రానిండియున్న మహదానంద సూత్రాన్ని చేరుకుంటాడు.

స్థూలం నుండి సూక్ష్మానికీ, పదార్థం నుండి చైతన్యానికీ వికసించటం మానవక్రమవికాసం యొక్క సహజలక్షణం. అటువంటప్పుడు తమ భౌతికవాదమౌఢ్యానికి, వైజ్ఞానిక భూమిక వుందని సామ్యవాదులు ఎలా చెప్పుకోగలరు ? నిజానికి ఈ దృష్టితోచూచినప్పుడు, ప్రతిక్రియావాదులూ అభివృద్ధి నిరోధకులూ, తిరోగాములూ సామ్యవాదులే అవుతారు.

ప్రశ్న : ఏమైనప్పటికీ సమానత్వం వారి మౌలికసూత్రం గదా!

స : కానీ అది భౌతికవాదమనే దోషయుక్తమైన భూమికపై నిలిచివుంది. "నేను" కేవలం ఒక పదార్థం మాత్రమే అయితే, సమానత్వమనే ప్రాతిపదికపై ఇతరులతో సహకార భావనలను నేనెందుకు ఆకాంక్షించాలో అర్థం చేసికోలేకపోతున్నాను. ఇతరులను దిగమ్రింగుతూ

నేనెందుకు జీవించరాదు ? అంతేగాదు. మానవుడు కేవలం భౌతికవాంఛల కుప్ప అనే మౌలిక భావన వాస్తవంకాదు. భౌతికముతోబాటు మానవు నకు భావోద్వేగమయమూ, మనస్తత్వపరమూ, విశ్వాసాత్మకమూనైన, తత్తుల్యమైన ఇతర వాంఛలు గూడా అనేకంగా ఉన్నాయి. భౌతిక వాంఛలకన్న ఎక్కువకాకపోయినా, కనీసం సమాన ప్రాతినిధ్యం వీని కున్నది. మానవునిలోని ఇట్టి వైవిధ్యాన్ని పరిగణనలోకి తీసికోనట్టి ఏ ఆలోచనా పద్ధతైనాసరే, స్వతహాగా విలువైనదికాదు. సర్వసమానమైన ఒకే ఒక పరమసత్యం యొక్క, దానిని దేముడు అనవచ్చు- లేదా నిత్య సత్యమనుకోవచ్చు- అంతర్భాగములే ఈ జీవకోటిఅంతా యని సాక్షాత్క రించుకోవటమే నిజమైన సమానత్వానికి భూమిక కాగలదు.

ప్రశ్న : సంఘ కార్యానికీ, సామ్యవాదం గానీ, లేదా ఇతర 'ఇజములను' గానీ, జోడించదలచుకొన్నారా?

స : ఇతర 'ఇజము'లతో నాకు పనిలేదు. మా సిద్ధాంతములో ఏదైనా 'ఇజం' పూర్తిగాగానీ, లేదా పాక్షికంగాగానీ ఉన్నదా అన్నది నాకనవసరం. లేకపోతే అదిలేదని నేను బెంగపడను.

ప్రశ్న : ఏ ఇజమును మీరు విశ్వసిస్తారు?

స : ఏదో ఒక 'ఇజం'తో ప్రయత్నపూర్వకంగా ఇరికించవలసి నంతగా నేడు మానవమేధాసక్తి దిగజారిపోయిందని నేను విశ్వసించను.

ప్రశ్న : ఆర్థిక వ్యత్యాసాలు కొనసాగుతున్నంతవరకూ మన దేశంలో సామ్యవాదం యొక్క పెరుగుదల తప్పనిసరి కాదా?

స : సామ్యవాదం పెరగటానికి, మూలాధారమైన వర్గ విద్వేష వాదానికి ఆర్థిక వ్యత్యాసమనేది నిజమైన కారణం కాదు. శ్రమ గౌరవ

భావాన్ని మన ప్రజలు సరిగా అలవరచుకోలేదు. ఉదాహరణకు- మనం రోజుకు మూడు నాలుగు రూపాయలు సంపాదించుకునే రిక్షావాలాను 'ఒరేయ్' అనిపిలుస్తాం. కానీ నెలకు అరువది రూపాయలు సంపాదించుకునే ఒక గుమాస్తాను 'బాబూజీ' అంటాం. మన దృక్పథంలోని ఈ తేడాయే విద్వేషాన్ని పుట్టిస్తోంది. కాయకష్టానికి గౌరవం రావాలంటే అట్టి వృత్తులను పట్టభద్రులు చేపట్టడమే పరిష్కారమార్గం. 'పనిలో' ఉచ్ఛమనీ, 'నీచ'మనీ, తేడాలేదు. ప్రతి పనీ సమాజరూపంలోవున్న ఒకే పరమేశ్వరుని ఆరాధనమే. 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విదంతి మానవాః (స్వకర్మ ద్వారా పరమేశ్వరునారాధించి మానవుడు సిద్ధిని పొందుతున్నాడు) అని భగవద్గీత చెపుతోంది.

దోచుకునేవాడూ, దోచుకోబడేవాడు- అనే వర్గీకరణే తప్పు. ఒకసారి యజమానులూ, మరొకసారి కార్మికులూ పనిని స్తంభింపచేస్తుంటారు. కార్మికుల కోర్కెల, యజమానుల నష్టాల భారం పడేది చివరకు వినియోగదారుడిమీదే కనుక అసలు దోపిడీకి గురయ్యేది అతడే.

ప్రశ్న : సామ్యవాదుల ఆర్థిక ప్రణాళికకు బదులుగా మీరు సూచించే ప్రణాళిక ఏమిటి?

న : ఆహారం, కట్టుకునేందుకు బట్ట, ఉండేందుకు ఇల్లు వంటి ప్రాథమిక అవసరాలు ప్రతి ఒక్కరికీ తప్పక తీరాలని వేరుగా చెప్పనక్కరలేదుకదా ! రష్యాలోమల్లే ప్రభుత్వం అన్ని అధికారాలను గుత్తగొనరాదు. కాబట్టి సహకార ఉద్యమాల ద్వారా ఉత్పత్తిని పెంచాలని నేను సూచిస్తాను. ఉత్పత్తిని పెంచేందుకు నవీన సాంకేతిక పద్ధతులను మనం అమలుచేయవచ్చును. అయితే మన సమాజ స్వభావ స్వరూపాలను మనం నిలబెట్టుకుంటూనే ఈ పనిని కొనసాగించాలి.

ప్రశ్న : ప్రజాస్వామ్యం భారతీయమైన భావనా?

న : మనం పాశ్చాత్యులకంటేగూడా ముందుగానే, ప్రజాస్వామ్యంతో సహా అన్ని ప్రయోగాలను అమలుచేసిచూచాం.

ప్రశ్న : ప్రజాస్వామ్యమే ఉత్తమమైన వ్యవస్థ అని మీరు విశ్వసిస్తారా?

స : ప్రజాహిత నిరంకుశుడు కరువై ప్రజాస్వామ్యం వచ్చిందని బెర్నార్డ్‌షా అన్నాడు. నడిపేవాళ్ళు నీతిమంతులూ, స్వార్థరహితులూ అయితే ఏ పరిపాలనావ్యవస్థ అయినాసరే పనికివస్తుంది. అంటే మానవుని స్థాయి ముఖ్యమన్నదే ఇందులోని సారాంశం.

ప్రశ్న : నీతిమంతుడైన ఒక నియంత అధికారంలోకి వచ్చాడనుకుందాం. అయితే అవినీతిపరులు నడిపే ప్రజాస్వామ్యం కన్న అతని పాలనే అంగీకరింపదగిందా?

స : నియంతల ప్రభుత్వం, ఒక తరం తర్వాత మరొక తరానికి చక్కని పరిపాలనా సంప్రదాయాలను అందింపజేయటం కష్టం. ఏదో ఒక పద్ధతిద్వారా అవసరమైన మార్పులు తెచ్చుకునే అవకాశం వుండాలి. మానవస్వభావం అటువంటిదికాబట్టి అట్టి ఒక ఏర్పాటు అవసరమౌతోంది. అటువంటి ఏర్పాట్లలో ప్రజాస్వామ్యం ఒకటి.

ప్రశ్న : రాజు యొక్క పాత్రను గురించి హిందూ శాస్త్రాలు ఏమని ఆదేశిస్తున్నాయి?

స : ధర్మం యొక్క ఆదేశాల ప్రకారం అతడు నడుచుకోవాలి. అతడు చక్రవర్తి కాగోరినపుడు, చక్రవర్తిత్వాన్ని సమకూర్చే అశ్వమేధ యాగం అతడు నిర్వహిస్తాడు. అందులో 'అదండ్యోఽస్మి' (ప్రపంచాన్ని నేను గెలిచాను. నన్ను శిక్షించగలవాడెవ్వడూ లేడు) అని మూడుసార్లు అంటాడు. అతడలా చెప్పినప్పుడల్లా, ఆ యజ్ఞం యొక్క ప్రధాన ఋత్విక్కు ధర్మదండం తనచేతబట్టి— 'ధర్మదండ్యోఽసి' అంటాడు. (నిన్ను దండించేందుకు ధర్మమున్నది) అని అతని తలపై కొడతాడు.

**ప్ర : ప్రజాస్వామ్యం మన దేశంలో పొందదగినంత విజయాన్ని ఎందుకు పొందలేకపోయింది?**

స : ప్రజాస్వామ్య వ్యవస్థను నిర్వహించే బాధ్యతను చేపట్టిన వ్యక్తులే వారి స్వభావాల్లో ప్రజాస్వామికంగాలేరు. ఉదాహరణకు– ఒక వ్యక్తి కలకాలం తానే అధికారంలో ఉండాలని కోరుకుంటుంటే– అతనిది ప్రజాస్వామ్య మనస్తత్వం కానేరదు. నిజమైన ప్రజాస్వామ్యవాది ఇతరులకధికారాన్నప్పగించటానికి అంగీకరిస్తాడు. కానీ మన దేశంలో వ్యక్తులు, ఊపిరున్నంతవరకు తామే పదవులనంటిపెట్టుకొని కూర్చోవాలని కోరుకుంటారు.

**ప్రశ్న : సరియైన మనస్తత్వాన్ని నిర్మాణం చేయటం ఎట్లా?**

స : ప్రజలను విజ్ఞానవంతులనుగా చేయటం ద్వారానే అదిసాధ్యం. అంటే, జాతిపట్ల, ప్రజలపట్ల జాతీయ మౌలికతత్వంపట్ల సవ్యమైన మనస్తత్వాన్ని అలవరచటమని అర్థం.



# ఆర్థిక సమస్యలు

ప్రశ్న : ఈ రోజుల్లో పదేపదే వల్లిస్తున్న 'పరిశ్రమల జాతీయకరణ'ను గురించి మీ అభిప్రాయమేమిటి?

స : పరిశ్రమల జాతీయకరణమంటే ప్రభుత్వపు ధనస్వామ్యమే (పెట్టుబడిదారీ విధానం) ధనస్వామ్యమెంత చెడ్డదో ఇదీ అంతే చెడ్డది. నేను పారిశ్రామిక సహకార సంస్థలేర్పడాలని కోరుతాను. అందులోని ప్రతి సభ్యుడూ తన హక్కులను గుర్తించి, విధులను తప్పించుకునే పద్ధతుల నెరిగినదానికన్న ఎక్కువగా, తనీహక్కులతోబాటు విధులనూ గుర్తించగలగాలని ఆశిస్తా. ఆ విధంగా సహకారసంఘాల సభ్యులేగాదు, సమాజంలోని ప్రతివ్యక్తి ఉండాలని కోరుతాను. భారతీయ సంస్కృతి సమాజంపట్ల వ్యక్తియొక్క బాధ్యతలకూ, విధులకూ ప్రాధాన్యతనిస్తుంది. స్వతంత్రభారతం అట్టి భావస్ఫూర్తిని మరల సాధించుకోవాలని నేనాశిస్తాను.

ప్రశ్న : భారతీయ స్థితిగతులకు బాగా సరిపోయే పారిశ్రామికీకరణ పద్ధతి ఏది?

స : చిన్నతరహా పరిశ్రమలూ, గృహపరిశ్రమలూ ప్రతిచోటా వ్యాప్తిచెందాలి. అవి పెద్దపెద్ద పారిశ్రామిక కేంద్రాలకు పరిపోషకాలుగా

వుండాలి. ఉదాహరణకు చెప్పాలంటే, జపాన్ దేశం యొక్క పారిశ్రామిక వ్యవస్థ అట్లాగేవుంది. సైకిలు పరిశ్రమను ఉదాహరణగా తీసుకుందాం. దానిలో ప్రతి ఒక్క భాగం విడివిడిగా తయారుకావచ్చు; ఆ తర్వాత వాటన్నింటినీ ఒక కేంద్రంలో సైకిలుగా జతకూర్చవచ్చును. రక్షణ వ్యవస్థవంటి కొన్ని ప్రత్యేక పరిశ్రమలు మాత్రమే భారీఎత్తున నడుపబడే ఏకైక పారిశ్రామిక సంస్థలుగా ఉండొచ్చు.

ఇది మాత్రమే వ్యవసాయానికీ, పరిశ్రమలకూ నడుమ సమన్వయాన్ని సాధించగలదు. గ్రామీణ నాగరిక జీవనముల నడుమ పెరుగుతున్న అంతరాలను తొలగించటంలో గూడా ఇది సహకరించగలదు.

**ప్రశ్న : యీ రోజుల్లో పారిశ్రామికీకరణ దేశాల యొక్క ప్రగతికి ఒక కొలబద్దగ రూపొందినట్లు కనిపిస్తోంది.**

స : ప్రపంచమంతా సంఘర్షణలూ, యుద్ధాలమయం కావటానికి అదే కారణం. తమ అధికోత్పత్తులను ఇతర దేశాలకు అమ్ముకొనే విషయంలో ఎదురయే పోటీలో ఒక దశ దాటింతర్వాత, కొనుగోలు దేశాల కోసమై స్పర్థలొస్తాయి. తగాదా మొదలవుతుంది. ఇంకొక విషయమేమంటే— యంత్రాల వలన మనుష్యుల చేతికి పని లేని స్థితి వస్తుంది. అది అలా జరుగరాదు. కొల్లలుగా కోర్కెలను పెంచుకోవటం, వాటి కొరకు మరిన్ని యంత్రాలను సమకూర్చుకోవటం, ఇత్యాదిగాగల పాశ్చాత్య సిద్ధాంతం మనిషిని యంత్రానికి బానిసగా చేస్తుంది.

యంత్రం మానవుని సుఖం కొఱకేనని సుస్పష్టంగా గుర్తించాలి. అది భస్మాసురునివంటిది. దానిని అదుపులో వుంచకపోతే, తనను సృష్టించినవానినే అది నాశనం చేసేస్తుంది. నైతికశక్తి, విజ్ఞత కలిగిన వారు మాత్రమే అట్టి భస్మాసురుని అదుపుచేయగలరు. ఆదేశింపగలరు. అట్టి సామర్థ్యం గల పురుషులు మానవుని భవితవ్యానికి మార్గదర్శనం చేయగలగాలి.

ప్రశ్న: మన దేశంలో ఎటువంటి యంత్రాలను, ఎంత మేరకు నిర్మించుకోవాలని మీరు అభిప్రాయపడుతున్నారు?

స: ఆర్థికవ్యవస్థ, పారిశ్రామికీకరణ, యాంత్రికీకరణం వంటివి, ధనం పదిమంది చేతుల్లోకీ అందేవిధంగా కొనసాగుతూ, ఉద్యోగావకాశాలను అధికం చేసేవిగా రూపొందింపబడాలి. క్రొత్తగా కట్టిన ఆనకట్ట ఉదంతం ఒకటుంది. దాని నిర్మాణంలో త్రవ్వకాలకూ, మిట్టపల్లాలను సరిచేయటంవంటి పనుల నిమిత్తమై కోట్ల రూపాయలు విలువచేసే యంత్ర సామగ్రిని విదేశాల నుండి కొనుగోలు చేశారు. ఆ నిర్మాణానికి సంబంధించిన ఇంజనీర్లు తటస్థపడ్డప్పుడు, పనంతా యంత్రం ద్వారా ఎందుకు చేయించారు? అది చవుకవుతుందా? అని అడిగాను. కూలివారితో చేయించినప్పటికీ ఈ పనికి వ్యయం సమానమే అయుండేదని వారు బదులు చెప్పారు. ఈ నిర్మాణంలో క్రొన్ని వేల కూలీలకిచ్చే వేతనాలమొత్తం యంత్రాలపై పెట్టిన వ్యయానికి సమానమే అయేది. కానీ ఇలా చేసి, మన ధనాన్ని విదేశాలకు ధారపోసాం. పైగా వేలాదిగా మన ప్రజలను నిరుద్యోగులను చేసాం.

ప్రశ్న: దారిద్ర్యమనే పెనుభూతం నుంచి దేశాన్ని కాపాడుకునేందుకు, వేసిన అన్ని ప్రణాళికలూ, సత్వరపథకాలూ గూడా విఫలమైనట్లున్నాయి. ఇక ఎవడైనా ఒక ఆర్థికమాంత్రికుడొచ్చి ఇంద్రజాలమేదో చేయాలని నేడెదురు చూచేవారు కొందరున్నారు.

స: అట్టి ఇంద్రజాలానికి సజీవ నిదర్శనాలుగా, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరపు జపాన్, పశ్చిమ దేశాలున్నాయి. అవి ఆయా దేశస్థుల తీవ్రమైన దేశభక్తి, క్రమశిక్షణా ప్రయత్నాలబలంవల్ల మాత్రమే సంపూర్ణ ఆర్థికవికాసాన్ని సాధించాయి. అణుమారణ ప్రమాదానికి గురియై, విధ్వంస

మైపోయిన జపానుదేశం అత్యద్భుతమైన ప్రగతిని సాధించింది. వాణిజ్యరంగంలో ఈనాడు జపానుతో పోటీకి, చివరకు అమెరికా కూడా తట్టుకోలేకపోతోంది. జపాన్‌వారి 'ఎన్ను' (yen)ను, అమెరికా యొక్క డాలర్ల మారకంతో జోడించమని, అమెరికా జపానును యాచిస్తోంది. జపానును సందర్శించిన ప్రతివాడికీ ఇది తెలుస్తుంది. ఇదంతా అక్కడ వున్న అతిసామాన్య కార్మికునిలో కూడా వున్న ప్రగాఢ దేశభక్తిభావన వల్లనే సాధ్యమయింది. "అన్నిటికన్నా జాతియే మిన్న" అనే ధ్యేయ గీతానికి, ప్రతి జపానీయుని గుండె తాళంవేస్తుంది.

జర్మనీ కథ కూడా అలాంటిదే. అచట యువకశక్తి మొగ్గలోనే రాలిపోయింది. దాంతోబాటు అచటి పరిశ్రమలన్నీ దాదాపు నాశనమయి పోయాయి. తన ఇంట్లోనే మకాంబెట్టిన విజేతల సైన్యాలను పోషించే రూపంలో యుద్ధ ఋణాలను అది తీర్చవలసివచ్చింది. ఇట్టి విషమపరీక్షలూ, కష్టాలకు తోడు, యుద్ధానంతరం దేశమే ముక్కలై పోయింది. అయిన ప్పటికీ జర్మనులు గుండెధైర్యాన్ని కోల్పోలేదు. యదార్థంగా చెప్పాలంటే, పశ్చిమజర్మనీ తన బూడిదనుంచి, క్రొత్త ప్రాణంతో, నూతనశక్త్యుత్సాహా లతో పునర్జన్మ నెత్తింది. నేడు ఆధునికమైన జాతులన్నిటితోనూ అది పోటీపడుతోంది. ఇట్టి అద్భుతాన్ని గూడా, దేశభక్తులైన అచటి ప్రజలే సాధించగలిగారు. పెట్టుబడిదారుడు, కార్మికుడూ, శాస్త్రజ్ఞుడు, ఉపా ధ్యాయుడూ, వ్యాపారీ, వ్యవసాయదారుడూ వంటి వారిలో ప్రతి ఒక్కడూ గూడా, తమ జాతి యొక్క సర్వతోముఖాభివృద్ధిని, ప్రగతినీ సాధించే నిమిత్తమై మహోన్నత త్యాగాలను చేసారు. ఈ పద్ధతిలోనే ఆయా దేశాలు, బీదరికమూ, దారిద్ర్యములను తమ నేలపై నుండి తొలగించుకో గలిగాయిగానీ కేవలం నినాదాలిస్తూనో, లేక తమ బృహత్తర ప్రజాశికలను గూర్చి బాకాలూదుకుంటూనో సాధించలేదు. ఏ జాతి ప్రగతికైనా ఇదే మార్గం. జాతిప్రగతి, సమృద్ధులకు అడ్డుత్రోవలులేవు.

# 5. ఆందోళనలు

ప్రశ్న : హింసాయుతమైన ఆందోళనలు ఈ మధ్య పెచ్చు మీరిపోతున్నాయి. ఇందుకు ప్రత్యేకమైన కారణమేమైనా ఉందా?

స : పెరుగుతున్న అసంతృప్తి; నిస్పృహ; బహుశః ప్రభుత్వం మీద ఏమాత్రం నమ్మకం లేకపోవటం వంటివే దేశంలోని వివిధ ప్రాంతాలలోనూ, తమ సంకటాలను తొలగించుకునే నిమిత్తంగా ప్రజలను ఆందోళనలకు ఉద్యమించేట్లుగా ప్రేరేపిస్తున్నట్లున్నాయి. దురదృష్టవశాత్తూ, ఏదో ఒక ఆందోళనలేందే–అది హింసాత్మకం కాకపోతే–ప్రభుత్వం నిద్ర మేల్కొని సమస్యను సరిచేయదనే భావన పెరిగిపోతోంది. ఇంక ప్రభుత్వం మేల్కొన్నదా అంటే, అది కూడా విచక్షణారహితమైన హింసకు దిగజారుతోంది. ఇట్టి ఆలోచన చాలా ప్రమాదకరమని అనుకుంటున్నాను. తగిన సమయంలో, సానుభూతితో తగు చర్యను తీసుకోవడం, ఇటువంటి ప్రమాదకర ధోరణి ప్రజలలో కలగకుండా చూసుకోవడం అధికారంలో ఉన్నవారి విధి.

**ప్రశ్న : ఆందోళన పేరున విద్యార్థులు వ్యక్తిగత ఆస్తులకు, ప్రభుత్వఆస్తులకు కలిగిస్తున్న వినాశనం మాటేమిటి?**

స : ఈ విషయాలు ఎవరూ పెద్దగా పట్టించుకుంటున్నట్లు లేదు. ఇది విచారకరమైన విషయం. పైగా అట్టివి యువత మేల్కొన్నదనటానికది చిహ్నమని కూడా మన ప్రధానమంత్రి చెప్పారు. ఎంతటి వింత వికృత వ్యాఖ్యానమిది! ఏదో ఒక రకమైన క్రియాశీలత కనిపించినంత మాత్రాన, దానిని జాగృతీ అని మనం చెప్పగలమా? తీవ్రమైన జ్వరంలో మరింత ఎక్కువగా సంధి లక్షణాలు ఏర్పడినప్పుడు, ఒక వ్యక్తి రెచ్చిపోయి విధ్వంసకంగా తన కాళ్ళూ చేతులను శక్తియుక్తంగా'నే కొట్టుకుంటూ ఉంటాడు. దానిని 'జాగృతీ' అని మనం అనగలమా? అలాకాక శరీరంలోని ప్రాణశక్తుల ఒడిదుడుకులకది గుర్తుకాదా?

అసలింతకీ, ఇట్టి విధ్వంసక ఆందోళనలకూ, కల్లోలాలకూ, 'తీవ్రమైన కవ్వింపు'లేమున్నాయనీ? ఒకచోట 'కాపీ' కొట్టినందుగ్గాను, ఒక విద్యార్థిని పరీక్షనుంచి బయటకు పంపేయటం జరిగింది. వెంటనే ఇతర విద్యార్థులు ఆతనిని 'కాపాడటానికి' ఉపాధ్యాయుని ఎదిరించటం ప్రారంభించారు. ఆ రౌడీతనం చివరకు ఒక 'విద్యార్థి ఉద్యమంగా' విరుచుకుపడింది. ఇంకొకచోట బర్మా శరణార్థిని, పండ్లదుకాణం మీద కూర్చుండగా ఒక విద్యార్థి ఆమెపట్ల అసభ్యంగా ప్రవర్తించాడు. ఆమె కేకలుపెట్టగానే, ఆమె భర్త వచ్చి విద్యార్థిని చితగ్గొట్టాడు. ఇంకేముందీ! వందలాదిగా ఉన్న అతని సహవాసులు, ఆ భర్తపైన దండయాత్ర చేసారు. అలాగే హిందీకి అనుకూలంగానో, ప్రతికూలంగానో, నినాదాలు ఇస్తూన్న ఆందోళనలన్నీ హింసాయుతంగానే ఉంటున్నాయి.

ఒకసారి కొందరు విద్యార్థి నాయకులు నన్ను కలసి, 'విద్యార్థులు కట్టవలసిన జీతాల పెంపుదలకు' వ్యతిరేకమైన ఉద్యమం గురించి సమర్థించుకుంటూ మాట్లాడారు. తమ కుటుంబాలకు ఆర్థికంగా ఇబ్బంది చాలా

అధికంగావుందనీ, తమ తల్లిదండ్రుల భారాన్ని తగ్గించేటందుకే ఈ ఉద్యమాన్ని విధిగా తాము ప్రారంభించవలసి వచ్చిందనీ వారు వాదించారు. అది విని నేనొక చిన్న ప్రశ్న వేసాను. "నిజంగా మీరు మీ తల్లిదండ్రుల ఇబ్బందిని గురించే తీవ్రంగా ఆందోళన చెందుతున్నట్లయితే, మీరు తప్పకుండా, చలనచిత్రాల మీదా, అల్పాహారశాల నిమిత్తం, తదితర విలాసాలూ, వేడుకల కొరకు చేసే వ్యయం తగ్గించుకునే వుండుంటారు. నిజమేనా?" దానికి ఇక వారు బదులుపలుకలేదు.

# 6. జనాభా సమస్య

ప్రశ్న : మన జనాభా సమస్యను గురించి మీ అభిప్రాయమేమిటి?

స : మనిషికి భద్రత లభిస్తే అతడు అపరిమితమైన సంతానాన్ని కనడన్నమాట అందరికీ తెలిసిందే.

ప్రశ్న : అలా అయితే పొలం, పుట్రాగల్గి భద్రంగా వున్న భారతీయ రైతు ఎక్కువ సంతానాన్ని కనకూడదు కదా!

స : అలాకాదు. భద్రంగావున్నానని చెప్పలేనంతటి కటికబీదవాడు ఇంక అతనికి భద్రతెక్కడ ? వానలు కురవకపోవచ్చు. అంటు వ్యాధులు రావచ్చు. ఆ విధంగా సంకటం, చావులే ఆతని ఇరుగుపొరుగులు. ఏలాగోలా బ్రతకాలనే అవ్యక్తవాంఛ కారణంగా, కనీసం తనవారిలో ఎవరో ఒకరైనా బ్రతికుంటారన్న ఆశకొద్దీ వారు అనేకమంది బిడ్డలను కంటున్నారు.

ప్రశ్న : జపాను దేశంలోని బీదవానికి సంతాన నిరోధానికై ఉచిత సదుపాయాలు కల్పిస్తారు. అటువంటిదేదో ఒకటి మనం కూడా ఇక్కడ కల్పించాలా!

స : అలాకాదు. కేవలం పోషించటానికి తగిన ధనం లేకపోయి నంతమాత్రన ఆ వ్యక్తి తన కుటుంబాన్ని పరిమితం చేసుకునేట్లు ఒత్తిడి చేయాలనటం, సమాజంలోని లొసుగును వేలెత్తి చూపటమే కాగలదు. అట్టి దానికి పరిష్కారం అతని కుటుంబాన్ని అదుపుచేయటంకాదు. ఆతనికి పనిని చూపించాలి. చికిత్సకు లొంగని రోగులకు సంతాన నిరోధక శస్త్ర చికిత్సలు నేనర్థంచేసుకోగలనుగానీ, బీదవాడుకదాయని, ఇట్టి చికిత్స చేయాలనటం నేనంగీకరించలేను. 'జాలితో చంపివేయటమనే' వంక చెప్పే అవకాశం కూడా ఇందులో లేదు. బీదవాడై ఉండటం నేరమేమీకాదు.

ఇంకొక అభ్యంతరం కూడావుంది. సంతాన నిరోధాన్ని మీరు ఒకసారి ప్రోత్సహించారా ? ఇక, బీదవారికన్న సంపన్నులే అధికంగా దానికి పూనుకుంటారు. చదువుకుని సంపన్నుడైన వ్యక్తి ఈ విషయా లన్నీ అర్థం చేసుకోగలడు. వాటిని అతడు ఆచరణలో పెట్టగలడు కూడా. కానీ, బీదవాడు ఈ విషయాలు అర్థంచేసుకోలేడు. పైగా, ఈ విషయం, వారికేదన్నావుంటే, అది భయం మాత్రమే. తత్ఫలింగా సంతాన నిరోధానికై చేసే ప్రచారమేమైనాసరే, చదువుకున్న వారినే ప్రభావితంచేయ గలుగుతుంది. చివరకు బేరీజు వేసిచూస్తే ఇదంతా ప్రజలస్థాయి పడి పోవటమనే అర్థమవుతుంది.

సత్సంతాన ప్రాప్తికి, విధి నిషేధాల అవగాహన కలిగి, వైజ్ఞానిక సూత్రబద్ధమైన జానాభావిధానం, మనదేశంలోగానీ, ఆమాటకొస్తే, ఏ ఇతరదేశంలోగానీ ఉన్నదా ? మానవజాతి సర్వసమస్యలకూ పరిష్కారం వివిధ జాతులను కలిపి సంకర సంతానాన్ని ఉత్పత్తి చేయటమేనని ఇటీవల కొందరు భావించారు. కానీ, ఆ విషయంపై ఈ మధ్యనే పునరాలోచన కూడా చేస్తున్నారు. పరాయివాడితో సంకర సంతానోత్పత్తిని చేయటం ఆరోగ్యానికి హానికరమైనంతగా, స్వతీయుల ద్వారా సంతానోత్పత్తి హాని ప్రదం కాకపోవచ్చునని పరిశోధనలు సూచిస్తున్నాయి. ఇవన్నీ కూడా వ్యతిరేకాత్మకమైన విదర్శనాలే. సంకర సంతానం కొన్ని తరాల తర్వాత

తల్లివంశం, తండ్రివంశం వారికంటే గూడా బలహీనులుగా ఋజువవుతుందని గూడా కనుక్కున్నారు. సంతానం యొక్క శ్రేష్ఠతను నిలుపుకొనేందుగ్గాను ప్రత్యేక ఎంపికద్వారా సంకర సంతానోత్పత్తి చేయటం నిరంతరం అవసరం కాగలదు. అసలు ముఖ్యవిషయమేమంటే, మనుష్యులను జంతువులతో సమానమని వ్యవహరించాలా? మానవ సమాజం గొడ్లపాకకాదుగదా!

వారు సంతాన నిరోధం గురించి మాట్లాడుతూ ఉంటారు. కాని ఆత్మనిగ్రహం ఊసే ఎత్తరు. సాకదలుచుకున్న దానికంటే ఎక్కువ పిల్లలు తమకు, కలుగనంతవరకూ లైంగిక వాంఛానుభవం వెర్రితలలు వేసినా వారికభ్యంతరం లేదు. అట్టిది భ్రూణహత్యను అంగీకరించటమే కాగలదు. అట్టి సమాజంలో వ్యక్తులు నైతికంగా రాక్షసులే అవుతారు.

ప్రశ్న: క్రిమివిధ్వంసక మందుల వాడకం ద్వారా, శాస్త్రీయవిజ్ఞానం, మరణాల సంఖ్యను తగ్గిస్తూ, జనాభాని పెంచుతున్నప్పుడు, పుట్టుకలను మాత్రం అది ఎందుకు అదుపు చేయగూడదూ?

క్రిమివిధ్వంసక మందులవంటివి, దీర్ఘకాలికంగా, ప్రాణరక్షకములని నేను భావించటం లేదు. దేహం యొక్క జీవశక్తిని అవి దెబ్బతీస్తాయి. అవి వాస్తవానికి ప్రాణశక్తిని నాశనం చేసేవేనని, త్వరలోనే అర్థమవుతుంది. ప్రకృతి తన సహజ ధోరణిలో తాను పనిచేస్తూ వుంటుంది. ప్రతియుద్ధానికీ, ముందూ, వెనుకా, గూడా జననాల సంఖ్యలో పెంపుదల వుంటున్నట్లు ఋజువైంది. తాను నశించిపోతానేమోననే భయం వలన మానవునిలో అతిసహజంగా కలిగే ప్రతిక్రియగానే అది జరుగుతూవుంది. అలాగే పరిస్థితులు మెరుగైనకొలదీ, వ్యక్తికి మరింత భద్రత లభించిన కొలదీ, జననాల సంఖ్య దానంతటదే తగ్గిపోతుంది.



# మతవిషయాలు

ప్రశ్న : మన సామాన్య ప్రజానీకం యొక్క మతపర మైన అవసరాల గురించి మన మతాధిపతులు పట్టించుకోలేదని ఒక నిందారోపణ వుంది. ఈ విషయంపై మీ భావన ఏమిటి?

స : వాస్తవమే. ఇంతవరకూ వారిలో చాలా మంది తమ మఠాలకు మాత్రమే అంటిపెట్టుకొనివుంటూ, ఒంటిస్తంభాల మేడల్లోలాగా ఒంటరిగా జీవిస్తున్నారు. తత్ఫలితంగా మన ప్రజలు, ముఖ్యంగా, సుదూర ప్రాంతాల్లో, అడవుల్లో నివసిస్తున్నారు. పూర్తిగా మత సంబంధ మైన సహాయాన్ని పొందలేకపోయారు. అస్సాం ప్రాంతంలో— ఉదాహరణ చెప్పాలంటే— సత్రాధికార గోస్వాములు నలుగురూ, గత అనేక వందల యేండ్లుగా తమ మఠాలనుండి అడుగు బయటపెట్టలేదు. వారి మఠాలన్నీ బ్రహ్మపుత్రానది నడుమనున్న ఒకే ద్వీపంలోఉన్నాయి. అయిన ప్పటికీ వారు ఒకరినొకరు చూడనుకూడా లేదు. అస్సాం ప్రాంత విశ్వ హిందూ పరిషత్ సమ్మేళనంలో ఆ నలుగురూ ఒకచోటి కలిసినప్పుడు, ప్రతివాడూ మీరెవరంటే, మీరెవరని ప్రశ్నించుకున్నారు. కానీ ఇప్పుడు పరిస్థితి మారిపోతోంది. పూజ్యులైన దక్షిణాపథ స్వామీజీ తన గిరిజన భక్తులను కలుసుకొంటూ, వారికి ఓంకార దీక్షనిస్తూ పర్యటనలు ప్రారంభించారు. ఈ చర్య ఆ ప్రాంతాల్లోని గిరిజన హిందువుల్లో నూతనమైన భక్తి భావ తరంగాలనూ, ఉత్సాహాన్ని రేకెత్తించింది.

ప్రశ్న : మఠాధిపతులు తమంత తామే, తమ నైతికాధికారాన్ని కోల్పోయినట్టే కనిపిస్తోంది.

స: ఒకప్పుడు విశ్వహిందూ సమ్మేళనంలో పాల్గొనమని, మన కార్యకర్తలు అనేక మంది మఠాధిపతులను ఆహ్వానించారు. ఆ మఠాధిపతులు వివిధ సంప్రదాయాలకు చెందినవారు. ఒకే సంప్రదాయానికి చెందిన వారిలో కూడా, కొందరు 'పెద్ద మఠాలవారు', మరికొందరు 'చిన్న మఠాలవారు' ఉన్నారు. "వేదిక మీద మా కోసం ప్రత్యేకంగా ఉన్నత ఆసనాలు ఏర్పాటు చేస్తారా?" అని మన కార్యకర్తలను పెద్దమఠాధిపతులు అడిగారు. వారడిగిన మొదటి ప్రశ్న ఇది. ఎందుకంటే, చిన్న స్వాములు కూర్చున్న స్థాయిలోనే తాము కూడా కూర్చుంటే, తమ పీఠాల యొక్క గౌరవం దిగజారిపోతుందట! సన్యాసుల మధ్య వ్యత్యాసాలను చూపడం సాధ్యంకాదని వారికి చెప్పినప్పుడు కొందరు రావడానికే తిరస్కరించారు. దురదృష్టం! ప్రాపంచికమైన బంధనాలనూ, వ్యత్యాసాలనూ పరిత్యజించటానికి ప్రతీకగా వుండవలసిన సన్యాసి, ఈనాడు తన యొక్క 'స్థానం' కోసం, 'గౌరవం' కోసం ప్రాకులాడే దశకు దిగజారిపోయాడు. తన విలువ తాను కూర్చునే ఆసనంయొక్క ఎత్తునుబట్టి నిర్ణయింపబడుతుందని ఆతడు ఆలోచించ నారంభించటమనేది ఎంతటి విపరీతం!

ఇంకొక కారణం కూడా ఉంది. ఈ రోజుల్లో, సాధువులూ, మఠాధిపతులూ కూడ రాజకీయవాదుల పాదాలపై పడనారంభించారు. ఒకసారి నేను ఢిల్లీలో ఉండగా, రాజధాని నగరంలో చాలా పెద్ద ప్రాభవం కలిగిన ఒక గృహస్థు ఇంటిలో అతిథిగా ఉన్నప్పుడు, ఆయన వద్దకు కాషాయ వస్త్రాలు కట్టిన సాధువొకరు వచ్చారు. ఏం పనిమీద వచ్చారని నేనా సాధువును ప్రశ్నించాను. తన ఆశ్రమానికి చెందిన భూములను, చట్టపు ఉచ్చుల్లోంచి, తప్పించేటందుకు, ఒక కేంద్రమంత్రికి సిఫార్సు చేయమని, నేనున్న ఇంటి యజమానిని అడగటానికి వచ్చానని, ఆయన చెప్పాడు. తాను సన్యాసియైన కారణంచేత, ఆస్తిపాస్తుల గురించి తాను

పట్టించుకోరాదనీ, నేను ఆయనకు సూచించగానే, ఆయన ఏ ఆస్తీ లేకపోతే తన ఆశ్రమం ఎలా నిర్వహింపబడుతుందంటూ నాకు ఎదురుప్రశ్న వేసాడు. "మొట్టమొదటిగా ఆ ఆశ్రమం ప్రారంభించిన వ్యక్తికి ఆస్తి ఏమన్నా వుందా? ఆయన కేవలం తన తపోబలంచేత మాత్రమే ప్రజలను ధర్మ మార్గంలోనికి ఆకర్షించాడా? లేదా?" అని నేను ఆయనను అడిగాను- అది నిజమేనని ఆ సాధువు అంగీకరించాడు. మరైతే, తాను కూడా ఎందుకు గురువుగారి అడుగుజాడల్లో నడువరాదని నేనాయన్ను ప్రశ్నించాను. దానికి ఆ సాధువు మారుమాట్లాడలేదు.

సాధువుల్లోనూ, మతాధిపతుల్లోనూ గూడా అట్టి వికృత ధోరణులు సర్వసామాన్య ప్రజానీకానికి కనపడ్డప్పుడు వారి ప్రబోధాలకు ప్రజలమీద ఏం ప్రభావముంటుంది. నైతికమైన లేక, ఆధ్యాత్మికమైన విలువలు పైస్థాయి వారినుండి క్రిందకు దిగిరావాలి. అందుచేత పైస్థాయిలో ఉన్న వారు, తమనెవ్వరూ వ్రేలెత్తిచూపేందుకు ఆస్కారం ఇవ్వరాదు.

**ప్రశ్న : ఆధ్యాత్మిక భావావేశం ఈనాడు తక్కువగా ఉన్నట్లనిపిస్తోంది. చాలా కొద్దిమంది యువకులు మాత్రమే సన్యాసం స్వీకరించటానికి ముందుకొస్తున్నారు. మన సమాజం లోని లోపమేమిటంటారు?**

స : ఈ రోజుల్లో యువతయొక్క, మానసిక, ఆధ్యాత్మిక అంశాల పట్ల పట్టింపు కనిపించటంలేదు. సంస్థల గురించే శ్రద్ధ మరింతగా చూప బడుతోంది. యువకులను ఆధ్యాత్మిక సాధనలో సుశిక్షితులను చేసే బాధ్యతను స్వాములు, సాధువులు తమ భుజస్కంధాలపై స్వీకరించాలి. శిష్యులకు సంస్కృత వ్యాకరణంతో సహా, సంప్రదాయిక పద్ధతిలోనే వారు తప్పక శిక్షణనివ్వాలి. వివేకానందస్వామి తన శిష్యులకు నిరంతరం క్రమబద్ధంగా సంస్కృతం నేర్పుతూ ఉండేవారు. అంతిమ దినంనాడు కూడా వారు తన శిష్యులకు వ్యాకరణం బోధించారు.

ఇంతకూ, సన్యాసులు ఎక్కడ నుండి ఉద్భవిస్తారూ? మన హిందూ కుటుంబాల నుండే, హైందవ ప్రజానీకం నుంచేగదా! ఆధ్యాత్మిక వికాసానికి అనువైనదిగా కుటుంబ వాతావరణం నిర్మించాలి. ఇంక మనం సమాజాన్ని పోషించటం, తీర్చిదిద్దుకోవటం, అనే మాటకువస్తే- అదంతా ఎప్పుడో విస్మరించబడింది! మన ప్రముఖసన్యాసులలో అనేకమంది 'హిందూ' అన్న మాటను ఉచ్చరించటానికి కూడా సిగ్గుపడుతున్నారు. అట్టి మనస్తత్వం మన యొక్క స్ఫూర్తి కేంద్రాన్ని వట్టిపోయేటట్లుగా చేస్తుంది.

ప్రశ్న: మన సంప్రదాయంలోని మత నియమాలు, అధిక కాలహరణాలు, కఠినాలూ అయినందుచేతనే, వాటిని తమ నిత్యజీవితంలో, మన సర్వసామాన్య ప్రజానీకం అనుష్ఠించలేక పోతున్నారు. వారికి నిర్దేశించేందుగ్గాను, ఏవైనా సులువైన నియమాలూ, సాధనలూ, సంస్కారాలూ ఉన్నాయా?

స: వారికి మనయొక్క అతి సామాన్యములైన భక్తి సాధనలో ఏదో ఒకటి- చివరకు రామనామమో, మరే ఇతర దేవతానామమో, ఉపదేశిస్తే చాలుననీ, దానిలోగూడా ఎంతో శక్తి నిక్షిప్తమై ఉన్నదనీనేనంటాను. ఒక ప్రత్యేక మంత్రోపదేశమో, ఒక సాంప్రదాయ దీక్షాస్వీకారమో, యథావిధిగా జరగనంతమాత్రాన వారికి భక్తి లేదని చెప్పటం సరైన మాటకాదు. మన సమాజంలోని అట్టి తరగతుల జనం నుంచే 'అగ్రవర్ణాలవారు' కూడా పూజించదగిన, కొందరు మహోన్నత ఆధ్యాత్మిక పురుషశ్రేష్ఠులు ఉద్భవించారు. శతాబ్దాల తరబడిగా, ఆ తరగతివారు, అతిసామాన్య పద్ధతుల ద్వారానే, ఏకాగ్రతతో కూడిన భక్తి సాధించుకొని, చెప్పుకోదగిన హృదయ సంస్కారాలను ప్రదర్శించారు. ఈనాడు వారి దగ్గరకుపోయి వారిలో అంతర్లీనంగావున్న భక్తినీ, సద్గుణాలనూ మేల్కొల్పే బాధ్యత మన మతాచార్యులపై వుంది.

ఈ సందర్భంలోనే— ఇంతతరకూ అలవాటుగా వస్తున్న ఒక ఆచారం గురించి, మన మతాచార్యులు తగిన జాగ్రత్త వహించాల్సుంది. మన మతాచార్యులలోని ప్రతి ఒక్కరూ, ఏదో ప్రత్యేక సంప్రదాయానికో, ఒక ప్రత్యేక మతానికో చెందినవారై ఉంటారు. తమ మతాలకు సంబంధించినంత వరకూ, తామనుష్ఠించవలసిన కొన్ని సంప్రదాయిక పద్ధతులను నిలబెట్ట వలసిన విధి వారికున్నదన్నమాట నిజమే. కానీ, వారు బాహాటంగా ప్రజల ముందుకొచ్చినప్పుడు, సామాన్య జనసముదాయంతో సంపర్కమేర్పడినప్పుడు, వారు, ప్రతి ఒక్కరికీ అన్వయించదగినట్టి విషయాలకే ప్రాధాన్యత ఇవ్వాలి. ఒక ప్రత్యేకమైన సంప్రదాయం గురించో, లేక దైవం యొక్క ఒక ప్రత్యేక రూపం గురించో, ప్రబోధిస్తూనో, వాదిస్తూనో· తదితరములైన వాటినన్నిటినీ విమర్శించడం— సంపూర్ణ హిందూ ప్రజానీకాన్ని సమైక్యపరచి, పునరుజ్జీవింపచేసే మహత్కార్యానికి హానినే చేయగలదు.

**ప్రశ్న : మన శాస్త్రాలు, వ్యక్తిగత జీవన సాధనాలను గురించి మాత్రమే ఉపదేశిస్తాయనీ, సంఘటిత జీవితాన్ని గురించి ప్రబోధించవనీ, ఇదే మనం దిగజారిపోవడానికి కారణమనీ ఒక సర్వసామాన్యమైన అభిప్రాయం వుంది.**

స : ఋగ్వేదం మనకు అతి పురాతనమూ, అతి ముఖ్యమూనైన ధర్మగ్రంథం. అందులో చివరి భాగంలో, ప్రజలు, సమైక్యంగా, సువ్యవస్థితంగా, ఉజ్వలంగా, జీవించడానికిగాను కొన్ని ఆదేశాలున్నాయి. 'సంగచ్ఛధ్వం, సంవదధ్వం, సంవోమనాంసిజానతాం (మనందరిదీ ఒకటే బాట, ఒకటే మాట, ఒకే ఆలోచనా అగునుగాక) అని వేదం ఆదేశిస్తోంది.

**ప్రశ్న : తనను గురించి మాత్రమే తానాలోచించేట్లుగా మోక్షసిద్ధాంతం ఒక వ్యక్తిని తయారుచేస్తుంది. దానివల్ల సామా**

జికమైన బాహ్యతల నుంచీ, విధులనుంచీ అతడు తప్పుకుంటాడూ అని కొందరంటారు. అది నిజమేనా?

స: మోక్షతత్వం సరిగా అర్థం చేసికోలేకనే అలా అంటుంటారు. అందులో ధ్యానింపబడే 'ఆత్మ' భౌతికమైన శరీరం కాదు. స్వతః సిద్ధమూ, సర్వశ్రేష్ఠమూ, సర్వాంతర్యామీ అయిన 'ఆత్మ' అది. తన జీవుణ్ణి గురించి ఆలోచించేవ్యక్తి, స్వల్పమైన తన వ్యక్తిగత జీవుణ్ణిగురించి గాక, తన తోటి మానవుల సుఖ దుఃఖాలలో తాను తాదాత్మ్యం చెందుతాడు.

ప్రశ్న: పునరాగమన ప్రక్రియ మన హిందువులదృష్టిని గట్టిగా ఆకర్షించినట్లే లేదు! దాన్ని గురించి మనం ఏం చేయ గల్గుతాం?

స :మన బీద ప్రజానీకంలో అధిక సంఖ్యాకులు- ఉదాహరణకు- మన సముద్ర తీరభూముల్లో వుంటున్న, ఆర్థికంగా చితికిపోయిన వర్గాలు, క్రైస్తవులుగా మారారు. దానికి కారణం వారికి క్రైస్తవంమీద విశ్వాసంగాదు. దారిద్ర్యమే దానికి కారణం. అట్టివారికోసం, వారి చేపల అమ్మకం కొరకూ, వాణిజ్య సంఘాలు ప్రారంభించాలి. మనం క్రైస్తవ కొనుగోలుదారుల గుత్తాధిపత్యం నుంచి వారిని విముక్తులను చేయాలి. క్రమక్రమంగా శ్రీరామునీ, శ్రీకృష్ణునీ, లేక వివేకానందుని, లేక వేరెవరో ఒక ప్రసిద్ధ పుణ్యపురుషుని పేరు మీద చిన్న చిన్న భజన సంఘాలేర్పరచి, ఆయా మహాపురుషులు, ఎంతపవిత్రంగా త్యాగభావంతో జీవించారోచెప్పాలి. ఆ విధంగా, ఆ అమాయిక హృదయాల్లో తాముగూడ స్వచ్ఛమూ, నిరాడంబరమూ, పవిత్రమూనైన జీవితాన్ని గడపాలనే కోర్కెను మనం నిర్మాణం చేయాలి. క్రీస్తుయొక్క ఔదార్యం క్రైస్తవ మత ప్రచారకులలో ఏమాత్రమూ లేదనే విషయాన్ని వారికి మెల్లమెల్లగా తెలియచేయాలి.

మంచివారి నుండి లభించే కొద్దిపాటి సహాయమైనా, చెడ్డవారి నుండి లభించే పెద్ద సహాయంకన్న ఎప్పుడూ ఉత్తమమేననే భావనను వారిలో పెంపొందింపచేయాలి.

ఇక—వారిని మన ధర్మంలోనికి తిరగ తెచ్చుకోవటం గురించి ఆలోచిస్తే మనం చేసేది తక్కువ, చెప్పుకునే ప్రచారం ఎక్కువగా కొనసాగుతున్న నేటి పద్ధతి ఏమాత్రం ప్రయోజనకారికాదు. దాన్ని గురించి పెద్ద రాద్ధాంతం చేయనక్కరలేదు. పల్లెపట్టులలో మఠాలను, ఆశ్రమాలను నిర్వహిస్తూన్న హిందూ సన్యాసులను కలిసికొని ఇందుకు పూర్తి ప్రయత్నం చేయవలసిన ఆవశ్యకతను వారికి నచ్చచెప్పాలి.

**ప్రశ్న : క్రైస్తవులు నడిపే మిషన్ ఆస్పత్రుల్లో, క్రైస్తవ రోగులకు, ప్రాధాన్యత చూపి, ఉచిత వైద్యసౌకర్యం వంటివి జరుగుతున్నాయి. ఈ పక్షపాతధోరణి దేనికని అడిగితే "ఆర్థిక సహాయాన్ని క్రైస్తవ దేశాల నుండి, మతస్థుల నుండి పొందుతున్నారు కాబట్టి క్రైస్తవుల అవసరాలను ముందు తీర్చవలసివుంటుందని వారు సమర్థించుకుంటున్నారు.**

స : ఇట్టి మనస్తత్వం వైద్యవృత్తియొక్క తత్వానికీ, ప్రయోజనానికీ గూడ పూర్తిగా వ్యతిరేకం. వైద్యవృత్తి యొక్క ఉదాత్తాశయం బాధపడుతున్న మానవకోటిని రోగాల నుండి విముక్తం చేయటమొక్కటే. వైద్యం చేయించుకొనే మనిషియొక్క మతం, హోదా, లింగవిభేదాలు కారణాలు ఎన్నడూకారాదు. రోగి అవసరం తీర్చటమే ముఖ్యం.

**ప్రశ్న : క్రైస్తవ మతప్రచారకులు, తమ మత మొక్కటే, ఆధునిక మానవుని యొక్క ఆధ్యాత్మిక పిపాసను**

తీర్చగలదని చెప్పుతూ, తాము చేసే మతం మార్పిడులను సమర్థించుకుంటారు.

స : కానీ, క్రైస్తవం వారి స్వంతదేశాల్లోనే పెల్లుబుకుతున్న భౌతిక వాదాన్ని అదుపుచేయలేక పోయింది! మన వారిని మతం మార్చేందుకు ఇక్కడ ఎంతో మంది క్రైస్తవ ప్రచారకులు తంటాలుపడుతూంటే, క్రైస్తవదేశాలేమో రోజురోజుకీ క్రీస్తుకు మరింతగాదూరమయిపోతున్నాయి. ఈ మధ్య అక్కడ చాలా కొద్దిమంది మాత్రమే చర్చికి వెడుతూ ఉన్నారు. 'చర్చి'లు దెయ్యాల కొంపల్లా తయారయాయి. వాస్తవానికి, వాటిలో కొన్నింటిని అమ్మకానిగ్గూడాపెట్టారు! అధునాతన మనస్తత్వానికి సంతృప్తినీయగలదీ, ప్రస్తుత కాలంలో ఎదురయ్యే సంకీర్ణములైన సవాళ్ళను తట్టుకొని, వారి జీవితంలో ఆధ్యాత్మికతత్వాన్నలవరచ గలదీయైన మరింత సమగ్రమైన వేరొకతత్వం కావలసియున్నదని దీన్నిబట్టి స్పష్టమౌతోంది. ఆ దేశాలలోని ప్రస్తుత ధోరణి, వారికి భవిష్యత్తులో హిందుత్వమే శరణ్యమన్న విషయాన్ని సూచిస్తోంది.

**ప్రశ్న : మన దేశంలో పెద్ద పెట్టున ఎన్నో యజ్ఞాలు, పూజలు జరుగుతూనే ఉన్నాయి. ఎంతగానో మంత్రాలు వల్లె వేస్తున్నారు. అయినా ఈ దేశంలో మన సౌశీల్యం అనుక్షణం దిగజారిపోతూండటం వింత కాదా?**

స : 'యజ్ఞం' అంటే అగ్నిలో ఆజ్యం పోయటం మాత్రమేకాదు. మన జీవితంలో త్యాగభావనకు ఆవాహనయే పరమార్థమనే విషయం విస్మరించాం. మంత్రాలు కూడా కేవలం చిలుకపలుకులై పోయాయి.

హృదయపూర్వకమైన నిష్ఠ వాటిల్లోలేదు! జపం ఒక గ్రామ్‌ఫోన్ రికార్డులా అయిపోయింది! నేడు ఆవిధంగా రికార్డుచేయబడిన మంత్రాలు ఎక్కువ వాడకంలోకి వచ్చాయి. అటువంటివాటికి ఏం ప్రభావం ఉంటుంది!

ప్రశ్న: తరుచు మన సమాజంలోని అస్పృశ్యత, దారిద్ర్యం, ఉచ్ఛనీచ భావాలవంటి వివిధ దోషాలను హిందూ తత్వశాస్త్రానికీ ధర్మసూత్రాలకీ అంటకడుతూ వుంటారు.

స: అలా కాకుండా హిందూతత్వం యొక్క మౌలికసూత్రం సమాజాన్నంతనీ ఒకే సజీవ స్వరూపంగా– విరాట్‌పురుషునిగా– సందర్శించమని ఆదేశిస్తుంది! ప్రతివ్యక్తీ, తన స్థానం ఏదైనప్పటికీ విశాలమైన సంఘటిత సమాజదేహంలో ఒక సజీవ అవయవమే! దేహం, తనలోని ప్రతి చిన్న అవయవం యొక్క అవసరాలను తీరుస్తున్నట్లే సమాజంకూడ ప్రతి వ్యక్తి యొక్క అభిరుచులనూ, అవసరాలనూ, ఆకాంక్షలనూ గురించి పట్టించుకోవాలి! సజీవమైన దేహంలో 'అంటరానిది'గా కాని 'ఉపేక్షితంగా' కాని, 'అణగద్రొక్కబడినది'గా గానీ ఏ అవయవమైనా ఉంటుందా? ఒకటి తక్కువ వేరొకటి ఎక్కువ అన్న భావనఉంటుందా? మనల్ని సమైక్యం చేయగల్గిన ఇటువంటి సామాజిక చైతన్యం పోయింది కాబట్టే ఇలా వివిధ దోషాలు పుట్టుకువస్తున్నాయి!

ప్రశ్న: 'హిందూ' పేరెత్తగానే మన నాయకులు ఎందుకో బెంబేలుపడిపోతున్నారు. అందుకు ముఖ్యమైన కారణం ఏమిటంటారు?

స: రాజకీయాలు!– తొలిదశల్లో కాంగ్రెస్ నాయకులు కూడా హిందూ జాతీయతా సారభూతమైన విషయాలనే చెపుతూ ఉండేవారు! 'హిందూరాష్ట్ర'మని కూడ వారు వ్యవహరిస్తుండేవారు! ఈ పదప్రయోగం లోకమాన్య బాలగంగాధరతిలక్ ఉపన్యాసాల్లో ఉంటూండేదని మనం గమనిస్తాం! శ్రీ అరవిందులు కూడా భారతాన్ని పూర్తిగా 'మహామాత', 'మహాదుర్గ' అనే భావించారు! అలాగే రవీంద్రనాథఠాకూర్ 'దేవీ భువన

మనమోహినీ' అంటూ తన సుప్రసిద్ధ గీతంలో హిందూ రాష్ట్రం యొక్క కీర్తిని గానంచేశారు. బంకించంద్రుని యొక్క అమరగీతం 'వందే మాతరం' నిజమైన హిందూరాష్ట్రీయత యొక్క సారాన్నే చిత్రీకరిస్తోంది! అనేకసార్లు కాంగ్రెస్ వేదికల నుండి ఈ భూమియొక్క ఘనత, ప్రాచీన సంస్కృతి, నాగరికత చరిత్ర, వారసత్వాల కీర్తి ఎలుగెత్తి చాటబడింది! కాలక్రమంలో జాతీయ భావప్రభావానికి బదులు రాజకీయ తంత్రాలకే స్థానం ఇవ్వటం మొదవటంచేత, పదప్రయోగం కూడా మారింది! ఉదాహరణగా చెప్పాలంటే— "హిందూ" 'హిందీ'గా మారి తర్వాత 'హిందుస్తానీ' గానూ, ఆపైన 'ఇండియన్'గానూ అయింది!

నేటికీ అదేరోగం కొనసాగుతోంది! ఈ మధ్యనే ఒక విచిత్రోదంతం నాకు తెల్సింది! 1972లో శ్రీ అరవింద శతజయంత్యుత్సవంలో అరవింద సాహిత్యాన్ని అన్ని భారతీయ భాషల్లోనూ ప్రచురించేందుకు కేంద్ర ప్రభుత్వం ఆర్థిక సహాయాన్నందించాలనే ప్రతిపాదన వచ్చింది! అపుడు ప్రభుత్వం దానికి రెండు ఆంక్షలు పెట్టిందని తెలుస్తోంది! పాండిచ్చేరిలోని

అరవిందాశ్రమంలో ఉన్న 'అఖండభారత్' దేశపటాన్నితొలగించాలనీ, దాని స్థానంలో ప్రస్తుత భారతదేశ రాజకీయ చిత్రపటం ఉంచాలన్నది మొదటి ఆంక్ష! అరవింద సాహిత్యంయొక్క రాబోయే ప్రచురణల్లో 'హిందూ' 'హిందూరాష్ట్రం', 'సనాతన ధర్మం' వంటి మాటల్ని తొలగించాలన్నది రెండవ ఆంక్ష! కానీ అరవిందాశ్రమంలోని 'మాతాజీ' ఈ ఆంక్షలను తిరస్కరించారు! ప్రభుత్వం ఆర్థికసహాయం ఇవ్వకపోయినా తమకి ఇబ్బందిలేదని, ఏమైనప్పటికీ అరవిందుల బోధనలోని పరమార్థాన్ని మార్చే ప్రసక్తిరాదని' ఆశ్రమ అధికారులు ప్రభుత్వానికి సమాధానం చెప్పారు!

ప్రభుత్వం ఇలా ఒత్తిడులుతెచ్చీ, ఆగ్రహానుగ్రహాలు ప్రదర్శించీ 'హిందూ' శబ్దాన్ని తారుమారు చేయటానికి ఎంతో ప్రయత్నిస్తోంది!

**ప్రశ్న : పరస్పర విరోధం కల ఇన్ని పంథలూ, ఉప పంథలూ, ఆరాధనా మార్గాలూ, మన సమాజంలో ఎలా ఏర్పడ్డాయి?**

స : మన దేశంపై విదేశీయుల నిరంకుశత్వం కొనసాగినరోజుల్లో, బానిసత్వంనుంచీ, దుఃఖంనుంచీ బయటపడేందుకు ఆశాకిరణాలగుపడనప్పుడు ఒకే శరణ్యమైన భగవత్పాదాలను ప్రజలు ఆశ్రయించటం సహజమే. వారు పరమేశ్వరుని వివిధనామాలతో ఆరాధించటం మొదలుపెట్టారు. వివిధ మతాచార్యులు తమ సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ వేదప్రమాణ్యాన్నే చూపారు. ఆ విధంగా ప్రజలకు వేదంపైగల విశ్వాసం చెక్కుచెదరలేదు. వివిధ ఆరాధనా పద్ధతుల్లో విశ్వాసాలున్నప్పటికీ, ఒకే సమైక్యతా సూత్రం ప్రజల నందరినీ కలిపివుంచుతూ వచ్చింది. కానీ తదనంతర కాలంలో వచ్చిన కొందరు ఆచార్యులు ఈ మౌలికాంశాన్ని విస్మరించారు. దాని ఫలితమేమంటే, అట్టి ఆచార్యుల యొక్క మాటలే వారి శిష్యులకు పరమ ప్రమాణాలై, వారంతా ఒక ప్రత్యేకమైన పంథగా తమను ఏర్పరచుకున్నారు. అందుచేత ఇటువంటి వివిధ పంథలు, విశ్వాసాలన్నింటిలోనూవున్న సహజ సూత్రాలను, మౌలిక విశ్వాసాలనూ ఎత్తిచూపటం, వాటన్నిటిలోనూ ఉన్న మౌలికమైన ఏకత్వాన్ని వెలుగులోనికి తేవడం ఈనాటి అవసరం.

**ప్రశ్న : దీన్ని 'సైన్సు యుగం' అంటున్నారు. అందుచేత మన ధర్మస్వరూపం మార్చబడాలనీ సైన్సు సిద్ధాంతాలకు అనుగుణంగా దానిని మరల రూపొందించాలనీ కొందరంటారు.**

స : విజ్ఞానశాస్త్రమో, మరొకటో, విసిరే ప్రతి గాలితాకిడికీ, దిక్కులు మారుస్తూవుండే గాలికోడి వంటిదిగాదు 'ధర్మ'మంటే జీవన శాశ్వత సూత్రాలు ధర్మంలో నెలకొని ఉన్నాయి. నిజానికి, మానవ సుఖం,

నాగరికత, అభివృద్ధుల కొరకు అటువంటి మౌలికములైన, జీవన సూత్రాలకు విరుద్ధం కానట్లు సైన్సుని మనం వినియోగించుకోవాలి. అలాగే అదే విజ్ఞానశాస్త్ర దృష్టియే కొలబద్దగా, జీవితంలోని అన్ని అంశాలకూ అన్వయించటమంటే, వివిధ దేశాల్లోనూ, వివిధ శీతోష్ణస్థితుల్లోనూవున్న విభిన్నములు, సుసంపన్నములూనైన మానవ జీవితానుభవాలనన్నింటినీ నాశనం చేయటమే కాగలదు. అందుకు ప్రతిఫలం మూసలో కరిగించి, ఒకే అచ్చులా పోసిన నిర్జీవప్రతిమలుగా మన వ్యవహారాలు రూపొందుతాయి.

# 8 రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్

ప్రశ్న : రా. స్వ. సంఘం రాజకీయ సంస్థా?

స : అనునిత్యం జరిగే ఎన్నికల్లోనూ, అధికారం కొరకు జరిగే పోటీపందేలవంటివాటిల్లోనూ పాల్గొనదు కాబట్టి ఆ అర్థంలో సంఘం రాజకీయ సంస్థకాదు. ఈ దేశం, ఇందలి ప్రజలయొక్క సమైక్యతకే ప్రాధాన్యమిచ్చే సాంస్కృతిక సంస్థ ఇది. దేశ సమైక్యతకు హానికరాలుగా కనిపించేవేవైనావుంటే వాటిని గురించి మా అభిప్రాయాలు చెప్పటానికీ, ప్రజలకు బోధించటానికీ, మేం ప్రయత్నిస్తాం.

ప్రశ్న : రాజకీయ అధికారం లేకుండానే మీ సిద్ధాంతాలనూ, కార్యక్రమాలనూ కొనసాగించగలమని మీరు ఏలా ఆశిస్తున్నారు?

స : జాతీయకార్యాన్ని కొనసాగించటానికి రెండు మార్గాలున్నాయి. రాజ్యాధికారం ద్వారా చేసేది ఒకటి. ప్రజల మనస్తత్వాలను మార్చటం ద్వారా జరిపించేది రెండవది. మేము రెండవ మార్గాన్ని ఎన్నుకున్నాం.

ప్రశ్న : రాజకీయ ప్రశ్నలమీద తరచూ మీరు మీ అభిప్రాయాలను వ్యక్తం చేయటం ఎందుకు జరుగుతోంది?

స : కేవలం రాజకీయాలే కానక్కరలేని అనేక వ్యవహారాలున్నాయి. ఒకో వ్యవహారం సాంస్కృతికంగానూ, రాజకీయంగానూ, ప్రాధాన్యత కలిగివుండవచ్చును.

ప్రశ్న : రాజకీయ ప్రయోజనాల సాధనకై ఏ విధంగానైనాసరే హింసనుపయోగించటం మీరంగీకరిస్తారా? నిరాకరిస్తారా?

స : పౌరులనడుమ పరస్పర హింసాప్రవృత్తి ఏమాత్రం పనికిరాదు.

ప్రశ్న : ప్రభుత్వాన్ని మార్చేటందుకు హింస సమర్థనీయమేనని మీరనుకుంటున్నారా?

స : దమనకాండ మితిమీరినప్పుడూ, ప్రజలు తీవ్రాతితీవ్రమైన బాధలననుభవిస్తున్నప్పుడూ, పరిపాలకులు నిరంకుశులైనప్పుడూ, రాక్షసులైనప్పుడూ, వారిని మార్చేందుకు శాంతియుత మార్గాలన్నీ విఫలమైపోయినప్పుడూ— ఆ విధమైన విపరీత పరిస్థితి ఏర్పడినప్పుడు— 'హింస' సమర్థనీయమే అవుతుంది.

ప్రశ్న : మనది లౌకికరాజ్యం కాబట్టి సంఘం వంటి హిందూ సాంస్కృతిక సంస్థలు, లౌకికవాదాన్ని సమూలంగా నాశనం చేస్తాయేమోనని ప్రభుత్వం భయపడవచ్చు గదా?

స : ఊహాకల్పితమైన ప్రశ్నయిది. లౌకికరాజ్యం, సాంస్కృతిక

కార్యకలాపాలను అనుమతించదని ఏలా అనగలం? హిందుత్వ పరిధిలో వున్న వివిధ కులాలనూ, తెగలనూ, మనయొక్క ఏకైక సాంస్కృతిక భూమికమీద సమైక్యపరచే సంఘకృషి పూర్తిగా న్యాయసమ్మతమే.

ప్రశ్న : హైందవేతరులపట్ల సంఘం విద్వేషాన్ని ప్రబోధిస్తుందనటం నిజమేనా?

స : సంఘానికి వ్యతిరేకంగా చేసే, అత్యంత బాధ్యతారహితమూ, నీచమూనైన నిందారోపణలలో ఇది ఒకటి. హిందూ సంస్కృతి యొక్క పరిపూర్ణ ఔదార్యమూ, సహనముల గురించి ప్రపంచమంతా ఎరుగును. కేవలం వేరొక విశ్వాసానికి చెంది ఉన్నంత మాత్రాన, ఏ వ్యక్తినిగానీ హిందువుడు కలలోగూడా ద్వేషించడు. అట్టి ఉదాత్తమైన సంస్కృతిని పునరుజ్జీవింప చేయటానికంకితమైన సంఘం విద్వేషాన్ని ప్రబోధిస్తుందని ఎన్నడైనా, ఏలా ఊహించగలరు ?

ప్రశ్న : హింస చేస్తుంటారని కొందరు మీపై నిందా రోపణ చేస్తారేం?

స : హింసపైన విశ్వాసంతో, రాజ్యాంగాన్ని విధ్వంసం చేసేందుకు హింసాచరణకు పూనుకునే సామ్యవాదుల మాయమాటలను అట్టి వారు నమ్ముతారు. మా వ్యతిరేకులే హింసాచారులు. వారియొక్క హింసా ద్యోతకమైన భాషనూ, వారి హింసాసూచకమైన బెదిరింపులనూ చూడండి. మీకే తెలుస్తుంది.

ప్రశ్న : మతకలహాలలో రా. స్వ. సంఘపాత్ర వుందని కొందరు వ్యక్తులు నిందారోపణ చేస్తారు?

స : వారి ఊహాలు వెఱ్ఱితలలు వేస్తున్నట్లున్నాయి. ఆ నిందారోపణ పూర్తిగా హాస్యాస్పదం. మతకలహాలు, నిన్నమొన్న పుట్టినవి

కావు. రా. స్వ. సంఘం పుట్టకముందు కూడా మన దేశంలో అట్టి కల్లో లాలు జరిగాయి. భయంకరములైన మోప్లామారణాలూ, బెలూచీస్థాన్ దురంతాలూ జరిగాయి. నాగపూర్‌లో కూడా 1923–27 మధ్య కాలంలో మతకలహాలు చెలరేగాయి. నిజానికి నాగపూర్‌లో 1927 నుంచీ అంటే, అక్కడ రా. స్వ. సంఘం బలపడినదగ్గర నుంచీ మతకలహాలు జరగలేదు. రా. స్వ. సంఘమే గనుక మతకలహాలను రెచ్చగొట్టేదైవుంటే, దాని కేంద్రకార్యస్థానమైన నాగపూర్‌లో ఈపాటికి హైందవేతరుడెవడూ బ్రతికివుండేవాడు కాదు. దాదాపు రెండేళ్ళ క్రితం నాగపూర్‌లో జరిగిన కల్లోలం ఆ నగరంలో మన సంఘశాఖ లేని ప్రాంతంలో జరిగింది. పరిస్థితిని ప్రశాంతపరిచేందుకు మేము సత్వర చర్యలు తీసుకున్నామని ప్రభుత్వం గూడా అంగీకరించింది. సుదృఢమైన రా. స్వ. సంఘం మత కల్లోలాలకు కారణం కాదు సరికదా, అదే అట్టి కల్లోలాలను శాశ్వతంగా నివారించగలుగుతుంది.

**ప్రశ్న : రా. స్వ. సంఘం ఒక చక్కని సంఘటన. కానీ ప్రజల మనస్సులలో దానిపై ఏదో ఒకవిధమైన అనుమానం వుంది. అందుకు కారణం ఏమిటి?**

స ; అందుగ్గాను, నాయకులనూ, వారారంభించిన నిందారోపణా ప్రచారాన్నీ అభినందించాలి.

**ప్రశ్న : హిందూరాష్ట్రసిద్ధాంతాన్ని కొందరు చాలా బాహాటంగా వ్యతిరేకిస్తున్నారు?**

స : వాళ్ళే, ఏకాంతంలో దాన్నే అంగీకరిస్తుంటారు.

**ప్రశ్న : రా. స్వ. సంఘం కేవలం చదువుకున్న వర్గాల వారికే పరిమితమై వుందనీ. సమాజంలోని పీడిత జనులకూ,**

అలాగే వెనుకబడిన వర్గాల వారికి సంఘంతో ఏ సంబంధం లేకుండా వుందనీ ఒక అభిప్రాయం వుంది?

స : ఏ కృషైనా చదువుకున్నవారితోనే ఆరంభమవుతుంది. తర్వాత మాత్రమే అది సమాజం యొక్క అన్ని వర్గాలకూ చేరుతుంది. ఈనాడు సమాజంలోని ప్రతివర్గాలలోనికీ— అది ఎంత బీదదైనా సరే, బలహీనమైనదైనా సరే— దానిని దాదాపుగా చేరుకుంటోంది.

ప్రశ్న : హిందూ సంఘటనవంటి ఆలోచనలు, ప్రస్తుత పరిస్థితుల్లో నిరుపయోగాలని కొందరు భావిస్తుంటారు. పాతవాటి నన్నిటినీ తుడిచిపెట్టే సంపూర్ణ విప్లవం మాత్రమే సమస్యలను పరిష్కరించగలదు అంటారు?

స : నిజమే. ప్రపంచంలో అనేక విప్లవాలు జరిగాయి. కానీ వానిలో చాలా భాగం ప్రాచీన పరంపర కొనసాగిస్తూనే వచ్చాయి. లేదా విప్లవాత్మకమైన పరిణామంగా రూపొందాయి. సంప్రదాయంతో తెగతెంపు చేసుకున్నచోటనల్లా సామాజిక జీవనం నశించిపోయింది.

ప్రశ్న : మరి చైనా మాటేమిటి?

స : వారు తమ గతం నుంచి తెగతెంపులు చేసుకోలేదు. మరి కొంతకాలం వేచిచూడండి. వారి సాంప్రదాయక పద్ధతులన్నీ మళ్ళీ బయట పడతాయి. తమ అధికారమునూ, ప్రభావమునూ వ్యాప్తి చేసుకునేందుకు నేడు వారు వేస్తున్న పథకాలన్నీ తమ పూర్వచక్రవర్తుల సంప్రదాయాను గుణంగానే ఉన్నాయి.

ప్రశ్న : కానీ, బౌద్ధమతం దానిలో తప్పని సరిగా మార్పును తెచ్చే వుండాలిగదా?

స : చైనాయొక్క మనోభూమికలో బౌద్ధమతం లోతుగా ఎన్నడూ పాదుకొనలేదు. అది కేవలం వారికొక ఉత్తరీయం లాంటిదే. దానిని ఒక జీవన విధానంగా వారెన్నడూ స్వీకరించలేదు. ఈనాడు కూడా చైనా దేశం, ముఖ్యంగా కన్ఫ్యూషియస్ మతానుయాయిగానే ఉన్నదని ఒక విద్వాంసుడు వ్రాసాడు. అయితే, అది గూడా పాక్షికంగానే నిజం. కొద్దిగా కన్ఫ్యూషియస్ సిద్ధాంతమూ, అధికాధికంగా వారి పూర్వ చక్ర వర్తుల స్వభావం కలబోసుకొని వారి ప్రధాన జీవనప్రవాహం రూపొం దింది. సామ్యవాదం కూడా అక్కడ ఒక తాత్కాలికదశమాత్రమే. వారి జీవితం భ్రష్టమయినందుననే భయంకర సాయుధ విప్లవం అచట తప్పని సరైంది.

**ప్రశ్న : హిట్లర్ కూడా మీలాగానే- యువకులను సమీకరించటం— వారిలో క్రమశిక్షణను ఐకమత్యాన్ని ప్రబో ధించటం ప్రారంభించాడు. కానీ తర్వాత ఆతడు ఇతర రాజకీయ పక్షాలన్నిటినీ అణగద్రొక్కాడు. ఆ నాజీసంస్థకు, మీ సంస్థకూ తేడా ఏమిటి?**

స : హిట్లరుయొక్క ఉద్యమం రాజకీయాలే కేంద్రంగా కలిగివుంది. రాజకీయాలతో పెనవేసుకోకుండామేము, జీవిత నిర్మాణానికి ప్రయత్ని స్తాము. చాలామంది రాజకీయ ప్రయోజనాలకోసం కలుసుకోవటం చాలాసార్లు చూస్తాం. కానీ ఆ ప్రయోజనం విఫలంకాగానే, వారిసమైక్యతకూడా అదృశ్య మయింది. తాత్కాలికమైన కార్యసిద్ధినిగాక, శాశ్వతంగా నిలువగల సమైక్య తను మేము కోరుకుంటాం. అందుకనే, రాజకీయాలనుండి మమ్మల్నిమేము దూరంగా ఉంచుకున్నాము.

**ప్రశ్న : అదెట్లా సాధ్యమవుతుంది?**

స : సమాజంకోసం అర్పితమైన జీవితాన్ని మేంగడుపుతూనే దాన్ని సాధిస్తాము. తగినంతమంది వ్యక్తులు ఈ విధంగా ఆలోచించి, ఆచరించే ట్లుగా చేయగలిగితే మిగతా సమాజమంతా వెంటనంటి వస్తుంది.

ప్రశ్న : సంఘకార్యం సర్వవ్యాపి అని వర్ణింపబడింది. ఈమాటకు సరియైన అర్థమేమిటి?

స : ఒకపోలికలో చెప్పాలంటే, వెలుగు-సర్వవ్యాపి. అయినా కానీ అదే అన్నిపనులనూ నిర్వహించటంలేదు. అది చీకటిని పోగొట్టి అందరికీ త్రోవను చూపిస్తుంది. సంఘకార్యంకూడా అటువంటి స్వభావం కలిగినదే. సంఘమేగనుక జీవితంలోని ప్రతిరంగంలోనూ పథకాలను రూపొందించటం, ఆ ప్రణాళికలను కార్యరూపంలో నిర్వహించటంకూడా చేయవలసివస్తే అప్పుడు సర్వత్రా తికమక ఏర్పడుతుంది. ప్రతి ఒక సమస్యపైన సంఘమే ఒక పరిశోధకవ్యాసం వంటిది తయారుచేయవలసి వస్తుంది. అప్పుడు మౌలికమైన, సామాజిక పునరుజ్జీవన కృషికి విఘాతం ఏర్పడుతుంది. ఇంక సిద్ధాంతవ్యాసాలు కుప్పలుకుప్పలుగా వచ్చిపడతాయి.

ప్రశ్న : ఎన్ని ఏండ్లలో మీ లక్ష్యాన్ని మీరు చేరుకొనగలుగుతారు?

స : దాన్నిగురించి నేనొకచిన్నకథ చెప్తాను. శబ్దకోశ నిర్మాతగా ప్రసిద్ధుడైన డాక్టర్ జాన్సనూ, ఆ రోజుల్లో ఉన్నతస్థాయిలో ఉన్న కొందరు ప్రముఖులూ దాదాపు ప్రతీరాత్రిపూట ఒక చిన్నక్లబ్బులో కలుస్తూ ఉండేవారు. ప్రసిద్ధరచయిత అయిన గొల్డుస్మిత్ గూడా ఆ క్లబ్బులో ఒక సభ్యుడే. ఒకరాత్రి వారందరూ భోజనానికి కూర్చుండగా ఆకాశంలో చంద్రుడు ప్రకాశించాడు. గొల్డుస్మిత్ అదిచూచి తన్మయుడైపోయాడు. కంచంలోని చేపనూ, ఆకాశంలోని చంద్రుణ్ణి చూస్తూంటే ఒక విచిత్రమైన

కూడా అతనికి కలిగింది. "డాక్టర్ జాన్సన్– ఇటు విను– మన నుంచీ చంద్రునివరకూ గొలుసు కట్టాలంటే ఎన్నిచేపలు కావల్సొస్తాయి అన్నాడు. (ఎవడూ సమాధానం చెప్పలేదు) ఆ వింత ప్రశ్న విని చికాకుపడిన డాక్టర్ జాన్సన్ "బాగుంది– అది మాకు తెలియదు– నువ్వే చెప్పు" అన్నాడు. అప్పుడు గోల్డుస్మిత్ "అంత పొడుగ్గా వుండేట్లయితే ఒక చేపైనా చాలు" అన్నాడు. సంఘకార్యం ఎంత కాలం పడుతుందని ? అడిగేవారికి నేనెప్పుడూ చెప్పే సమాధానమిదే. అది మనమంతా కలసి కృషిచేస్తే రేపటికే పూర్తి కావచ్చును.

ఒక పత్రికా విలేకరి వేసిన ప్రశ్న : గోళ్వల్కర్ తర్వాత నాయకుడెవరు?

స : మీరే !– మీరే ఎందుక్కాకూడదూ !

ప్రశ్న : ధన్యవాదాలు– గురుపీఠం అధిష్ఠించటం అంత తేలికైనది కాదు?

స : బాగుంది. అది అంత తేలికకాకపోతే, మరి దానికోసం మీరు గట్టి ప్రయత్నమే చేయాలి– ఇకపోతే– మాకు ఇటువంటి ప్రశ్నే ఎదురు కాదు. సంఘటనలో ఒక వ్యక్తిని తప్పనిసరియైనవాడుగా భావించుకున్నప్పుడు మాత్రమే ఆ ప్రశ్న ఉత్పన్నమౌతుంది. సంఘం ఆ తీరులో నిర్మాణం కాలేదు. ఎవరో ఒకరు ముందుకొచ్చి బాధ్యతను తన భుజస్కంధాలపై స్వీకరిస్తారు. నాకు సంబంధించినంతవరకూ, నా ఆట దాదాపుగా అయిపోవచ్చింది. ఇంక నేను వెళ్ళిపోతున్నట్లేనని మా వాళ్ళకు నేనెప్పుడో చెప్పేశాను.

# 9. మనం ఓటు ఎలా వేయాలి ?

(1957 సాధారణ ఎన్నికలకు ముందు (18-2-57) శ్రీ గురూజీ వ్రాసిన వ్యాససారాంశం.)

లోక్‌సభకూ, వివిధ విధానసభలకూ ప్రతినిధుల నెన్నుకునే నిమిత్తమై రాబోయే ఐదు సంవత్సరాల వరకూ, దేశపరిపాలనాధికారాన్ని వారి కప్పగించేందుగ్గాను, ప్రజలు త్వరలోనే ఎన్నికలలో పాల్గొనబోతు న్నారు. ఆయా ప్రతినిధుల స్వభావాలను బట్టి ప్రజలకు ఎంతగానో, మేలునుగానీ, కీడునుగానీ చేయటానికి ఐదు సంవత్సరాల గడువు చాల ఎక్కువే కాగలదు. నియోజకవర్గంలోని ప్రజలకు సమాధానం చెప్పలేక పోయినా, ఎన్నికల సమయంలో ప్రజలపై ఉదారంగా కురిపించిన వాగ్దానాలను నిలుపుకొనలేకపోయినా, ప్రతినిధులను వెనుకకు పిలిపించే సదుపాయం మన రాజ్యాంగంలోలేదు. అట్టి వైఫల్యంగానీ, ఉద్దేశ్యపూర్వ కంగా ప్రజాభిలాషలను వమ్ముచేయటంగానీ అరుదుగాదు. అట్టి లోపా లున్నప్పటికినీ, తమచే ఎన్నుకొనబడిన ప్రతినిధులయొక్క అభిప్రాయాల తోనూ, చేష్టలతోనూ, తాము ఆమోదం వ్యక్తం చేయనప్పటికీ, అట్టివారిని మరల వెనుకకు పిలిపించే యంత్రాంగం నియోజకవర్గపు ఓటర్లకు లేదు.

# వెనుకకు పిలిపించే అవకాశం లేనందుకు ఫలం

ఒక్కసారి ఎన్నికైతే తమ యొక్క సుఖప్రదమైన– ఈనాడు లాభసాటిగా కూడా ఉండే– పదవులలో పూర్తి ఐదేళ్ళపాటు భద్రంగా వుండవచ్చుననే విషయం తెలుసుకొన్న తర్వాత, అభ్యర్థులందరూ– ఆతనిని నిలబెట్టే రాజకీయపక్షాలూ– తప్పనిసరిగా అపరిమితమైన వాగ్దానాలు చేస్తారు. తమనే ఎన్నుకొని స్వర్గాన్ని భూమికి దించేందుకు, తమకు అవకాశమిచ్చినట్లయితే, కొద్దిపాటి చదువులు గలిగినవారూ, తెలిసీ తెలియని వారూనైన ఓటర్ల ఎదుట, తమ మాటల గారడీతో నిజంగా స్వర్గాన్నే సృష్టిస్తారు. ప్రేమలోనూ, యుద్ధంలోనూ ఏ పనైనా చెల్లుతుందంటారు గదా. కాబట్టి ఎన్నికలు అంటే ఇతర పక్షాలన్నింటితోనూ, ఇతర అభ్యర్థులతోనూ చేయబడే 'యుద్ధం' లాంటిదే కాబట్టి, ఎన్నికల ప్రచార సమయంలో చేసే వాగ్దానాలను తీర్చటమనేది జరుగదు. వాటిని భంగం చేయటమే అలవాటను కోవడం జరుగుతున్నది. ఇందులో ఏదో అవినీతి వున్నట్లుగూడా ఎవ్వరూ అనుకోవడం లేదు. అందుచేత మాటలగారిడీతో ఓటర్లపై మత్తుమందు చల్లటంలో అభ్యర్థులు ఒకరితో ఒకరు పోటీపడతారు. ఇట్టి అసత్య ప్రచారంలో అంది వేసిన వ్యక్తిగానీ, పక్షంగానీ, అత్యధికంగా ఓట్లను సంపాదించుకోగలరు. వారే, ప్రజలకు తామిచ్చిన వాగ్దానాలను ఏ మాత్రం పట్టించుకోకుండానే, తమ ఇచ్ఛవచ్చినరీతిగా ఉపయోగించుకునేందుకుగాను అధికారాన్ని చేజిక్కించుకునే అవకాశం వుంది. దీనిలో మినహాయింపులుండవచ్చును. అయినా గత అనుభవాన్నిబట్టి చూచినప్పుడు అట్టివి ఎడారిలోని, చిన్నచిన్న నీటిపట్టులలాంటివి మాత్రమే అనిపిస్తుంది. అట్టివారు ఎన్నికయ్యే అవకాశాలే చాల తక్కువ.

అందుచేతనే ఓటరు యొక్క బాధ్యత చాలా పెద్దది. ఎందుకంటే ఐదు సుదీర్ఘ సంవత్సరాలపాటు దేశభవిష్యత్తును తీర్చే బాధ్యత అతని చేతుల్లోనే వుంది మరి. ఒకసారి ఏదో ఒక పక్షానికి తన ఓటు వేసాడా, ఇంక

తన పొరబాటునుగానీ, నిర్ణయాన్నిగానీ, తద్వారా తనకు కలుగబోయే ఏ విధమైన హానినైనాగానీ, నివారించుకునేందుకు, లేదా సరిదిద్దుకునేందుకు అతనికి అవకాశం లేదు. కాబట్టి ఓటరు గట్టిగా తన ఇంగితజ్ఞానాన్నంతా, అతిముఖ్యమైన ఈ అవసర గడియలో వినియోగించి సరియైన ఎన్నిక చేయాలి.

## సగం సగం నిజాలు రెండు

ఈనాడు ప్రముఖ వ్యక్తులు, ఓటర్లకు, తమ సలహాలనిస్తున్నారు. వాటిలో రెండు ముఖ్య సిద్ధాంతాలు ప్రతిపాదింపబడుతున్నాయి. అవి పాత సిద్ధాంతాలే; దేశంలో ఎన్నికల పద్ధతి ప్రారంభమయినప్పటినుంచీ విన వస్తున్నవే. వాటిల్లో కొత్త ఏమీ లేదు. అయితే మళ్ళీ చెప్పటంమాత్రమే జరుగుతోంది. వాటిల్లోఒకటి పండితజవహర్‌లాల్ నెహ్రూ అంతటివాడు సూచించాడు. దాని ప్రకారం, ఆయా అభ్యర్థుల మంచిచెడులను పట్టించుకోకుండా, రాజకీయపక్షాన్ని మాత్రమే (ప్రస్తుతంలో కాంగ్రెసు సంస్థ)- గుర్తించి, దానికే ఓట్లను వేయమని ఆయన ప్రజలకు పిలుపిచ్చారు. ఇంక రెండవది ఉంది— ఈ మధ్యనే దీన్ని శ్రీ చక్రవర్తిరాజగోపాలాచారిగారు ప్రతిపాదించారు. ఎన్నికల్లో రాజకీయపక్షాలను పట్టించుకోకుండా అభ్యర్థి యొక్క- గుణగణాలనే పరిశీలించండి అన్నారాయన. ఆయన చెప్పింది నిజమే. ఏమంటే- శాసనసభలోనూ, బయటా కూడా ప్రభుత్వ వ్యవహారనిర్వహణా సమయంలో, ప్రజాప్రతినిధి యొక్క- పౌశీల్యమే అత్యంత ముఖ్యమైంది. ఈ రెండు అభిప్రాయాలూ పాక్షికంగానే సరియైనవి. ఎందుకంటే, మంచి శీలమూ సమాజకార్యంపట్ల సంపూర్ణమైన నిస్వార్థ భక్తిభావమూ లేనట్టి వ్యక్తులతో కూడిన రాజకీయపక్షం పక్షవాతానికి లోనైన చెయ్యిగల శరీరంలాంటిది. అది నిరుపయోగం మాత్రమే కాదు. అది చెప్పుకునే గొప్పలూ, ఇచ్చకాలూ, వాగ్దానాల వలన ప్రమాదకారి కూడ అవుతుంది.

అలాగే వ్యక్తిగతమైన మంచి సౌశీల్యం గల అభ్యర్థులు, సమానలక్ష్యం, సమాన కార్యక్రమం, సమాన అనుబంధాలు లేకుండా, ఒకరితో ఒకరు పోటీ పడుతూ, తత్ఫలితంగా సుసంఘటితమైన ఏకత్వం గల రాజకీయ పక్షంగా కట్టుబడని కారణంచేత, వారంతా వివిధ యంత్రాల విడిభాగాలు, దేనికదే చక్కగా, నిర్దుష్టంగా వుంటూనే సమీకృత కార్యాచరణకు నిరుపయోగములైనట్టుగానే, ఏమీ సాధించలేరు. అందుచేత ఈ రెండు అభిప్రాయాలనూ జోడించుకొని, జాతీయకార్యం పట్ల శ్రద్ధా, సౌశీల్యాలు గలిగి, స్వార్థం కోసం ప్రయత్నించని, సామర్థ్యం కలిగిన, కలసి కృషి చేయగల్గిన, పొందికైన జాతీయ భావాలుగల, అభ్యర్థులున్న రాజకీయ పక్షాన్ని ఓటర్లు ఎన్నుకోవాలి. ఇట్టి విచక్షణజ్ఞానాన్ని వినియోగించకుండా ఎన్నుకుంటే తర్వాత, తర్వాత పశ్చాత్తాపపడవలసివస్తుంది.

అయితే అప్పుడు ఓటరు ఏం చేయాలి? ఏ రాజకీయపక్షాన్ని అతడు వరించాలి? ఎటువంటి అభ్యర్థిపట్ల అతడు తన ఆమోదం చూపాలి?

## ఏ ముసుగులో ఉన్నప్పటికీ నిరంకుశత్వాన్ని తిరస్కరించాలి

ఎన్నికల్లో నిలబడిన పెద్ద పక్షాల్లో కొన్ని సమాజవాదం తమ ఆదర్శంగా చెప్పుకుంటున్నాయి. జర్మనీలో ఈ సమాజవాదమే 'నాజీ ఇజానికి' త్రోవదీసింది. ఇదే ఇటలీలో 'ఫాసిజం'గా పరిణమించింది. ఆ రాజ్యాల యొక్క ఉత్థాన, పతనాలూ, వాటితోబాటు ప్రపంచం అనుభవించవలసి వచ్చిన నిరంకుశత్వాలూ అందరికీ తెలిసినవే. అదే విషాదగాథ మన దేశంలో కూడా పునరావృతం కాదని చెప్పటానికి నమ్మకం చాలదు. ఎంతో విలువైన తన స్వేచ్ఛను ప్రతి పౌరుడూ ప్రాణప్రదంగా కాపాడుకోవాలి. వ్యక్తిగా తనకున్న గౌరవాన్నీ నియంతృత్వపు దహనకాండకు లొంగిపోనీయరాదు. కేవలం గంజినీళ్ళ కమ్ముడుపోయే బానిసగా మారి

పోరాదు. కాబట్టి అలాంటి సమాజవాద సిద్ధాంతాలనబడే వాటన్నిటికీ కూడా అతడు పూర్తిగా దూరంగా వుండాలి. సుదృఢ నిశ్చయంతో నిలబడి ఆతడు అటువంటి సమాజ వ్యతిరేకసిద్ధాంతాలలో పాలుపంచుకొనేవారందరికీ విముఖుడు కావాలి.

సామ్యవాదులు రష్యాతో పుస్తె ముడేసుకున్నారు. రష్యా విధానాన్ని ఇచ్చట ప్రతిష్ఠించాలని కలలు కంటున్నారు. ఆ విధానం ఎలా వుంటుందో ఈమధ్యనే హంగరీలో జరిగిన సంఘటనలనుబట్టి ఊహించవచ్చును. గత నలుబది సంవత్సరాలుగా కొనసాగిన వారి మనుగడ నెత్తుటి మడుగులమయం అయింది. మానవ చరిత్రలోని; నాగరికతాగంధమెరుగని కటికచీకటియుగాల్లో కూడా వీటికి సాటి వేరొకటి లేదు. సామాన్య మనిషిని బానిసగా చేయటం, వాని అభిప్రాయాలూ, ఆలోచనలూ, విశ్వాసాలను నియంత్రించటం, కేవలం ఒక నిర్జీవమైన పనిముట్టు దశకు మనిషిని దిగజార్చటం, అతని అన్ని స్వేచ్ఛలనూ, పూర్తిగా హరించటం వంటివి ఈ విచిత్ర సిద్ధాంతపు భయంకర పరిణామాలు మాత్రమే. ఇది తరతరాల మన వారసత్వానికి పూర్తిగా విరుద్ధం. నిజానికి సామ్యవాదం, సమాజవాదాల్లో దేన్నెన్నుకున్నా ఒక్కటే. ఎందుకంటే అవి రెండూ కూడా, రాజ్యాధికారాన్నీ, ధనాధికారాన్నీ వాని ద్వారా ఉత్పత్తి సాధనాలన్నిటినీ పూర్తిగా కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం చేయగోరుతున్న- ఒకే ప్రతిక్రియాత్మకమైన వికృత భావనాపద్ధతికి పుట్టినిళ్ళు. ఆ విధంగా జీవన రంగాలన్నిటిలోనూ ఇనుపపిడికిలిని బిగించే ఉచ్చులను వ్యాప్తి చేసి, తద్వారా వ్యక్తిగత మానవ జీవితాన్ని చైతన్యరహితమూ- సంతోష విహీనమూ అయ్యేటట్లు అవి చేస్తాయి.

## ఒకే హిందూ వ్యతిరేక కూటమిలోని భాగాలే ఇవి

దానికితోడు, ఈ రాజకీయ పక్షాలన్నీ హిందూ వ్యతిరేకాలుగా ...గిశే గరింసాయి. ఒకే విశిషమైన ధర్మం, సంస్కృతీ గల్గిన

ఒకే జాతిగా, మన నుండనివ్వనిరీతిగా, హిందూ జీవన విధానంలో జోక్యం కల్పించుకునే అనేక చట్టాలు చేయడం, గోవు విషయంలో హిందువుల శ్రద్ధాభావనలను గౌరవించేందుకామోదం చూపకపోవటం, ముస్లిముల పట్ల వారి పక్షపాత వైఖరీ,— కాంగ్రెసు, తన పక్షం నుంచి ఎంపిక చేసే అభ్యర్థులలో ముస్లిములకు కొన్ని స్థానాలు కేటాయించటం, ముస్లిములు జరిపే ఆందోళనలను ప్రోత్సహించటం, ఇటువంటివన్నీ, ఆయా పక్షాల యొక్క అహైందవ స్వభావమునూ, సిద్ధాంతాల వికృత స్వరూపాన్నీ వ్యక్తం చేస్తున్నాయి. అహైందవమూ, తరుచు హైందవ విరోధమైన ఇట్టి వర్గాల చేతులకు అధికారపు కళ్ళేలప్పగిస్తే, హిందూ సమాజమూ, ధర్మము, సంస్కృతీ, అలాగే వారి శ్రద్ధాకేంద్రాలన్నీ కూడా, పూర్తిగా నామరూపాలు లేకుండాపోయే ప్రమాదానికి లోనుకాగలవు. వారి పక్షంలో గూడా, కొందరు నిజంగా మంచి వ్యక్తులు వుండివుండవచ్చు. ఓటరు కేవలం అటువంటి మంచితనం చూచి వ్యామోహపడితే, అట్టి అభ్యర్థి నెగ్గింతర్వాత పార్టీ క్రమశిక్షణ అనే మాటకు కట్టుబడి వుండవలసివస్తుంది. అతని మంచితనం, హైందవ ఆదర్శాలపట్ల అతని గౌరవం, అప్పుడు నిరుపయోగమౌతాయి. పార్టీ యంత్రాంగం ఒత్తిడిలో అతడు నలిగిపోయి కొట్టుకుపోతాడు.

## సరియైన ఎంపిక కోసం

సనాతనమూ, అమరమూనైన విశాల హిందూ సమాజాన్ని, సాక్షాత్తు రూపుకట్టి నిలిచిన శాశ్వతమైన దేవతామూర్తిగా నేను పూజిస్తాను. దానికొరకు కృషి చేయటమే నా ధర్మం. దాని సేవకే నేనంకితమవుతాను. ఓటర్లందరకూ నాదొకవిన్నపం. వారు ఆత్మస్ఫూర్తితో స్వేచ్ఛగా, ధైర్యంగా, తమ 'ఓటు' హక్కును వినియోగించుకోవాలి. చెప్పుడుమాటలు విని పెడద్రోవ పట్టరాదు. భయానికిలోనై గానీ, తడబడి గానీ, ఒక వ్యక్తినో, ఒక రాజకీయపక్షాన్నో ఎన్నుకు తీరవలసిన స్థితికి

గురికారాదు. వారు జాగరూకులై, విచక్షణతో, దృఢనిశ్చయంతో-హిందు సమాజానికీ, హైందవజాతికీ అంకితమైనటువంటివన్నీ- సంకుచితపక్షపాతాలు లేనట్టివన్నీ- ప్రగతిశీలం, విశాల మనస్తత్వం, సమతాభావం కలిగినట్టివన్నీ- తమకన్న విభిన్న ఆలోచన కల వారిపట్ల అనుచితవిద్వేషం, అనవసర విరోధభావాలు లేనట్టీ- ప్రధానంగా హిందుత్వానికి చెందినట్టీ- వ్యక్తిగత, రాష్ట్రీయ, సౌశీల్యాలు కలిగినట్టీ- పదవీ, కీర్తిప్రతిష్టలు, అధికారం, ఐశ్వర్యాలతో నిమిత్తం లేకుండా ప్రజలనూ దేశాన్నీ సేవించటానికి దృఢ వ్రతులైనట్టీ ఏకోన్ముఖమైన సమైక్య కార్యాచరణ యొక్క విలువనూ, పద్ధతినీ ఎరింగినట్టీ- మాతృభూమిపట్ల, రాష్ట్రంపట్ల, ప్రజలపట్ల అచంచలమైన భక్తిశ్రద్ధలు కలిగినట్టీ- వ్యక్తిగత సౌఖ్యాన్నేమాత్రం లెక్కపెట్టకుండా, సమాజంపట్ల బాధ్యతయుతమైన కృషిని కర్తవ్యంగా స్వీకరించ సిద్ధంగా వున్నట్టి వారిని ఎన్నుకుంటే, వారి ఓటు విలువ వృథా కాలేదని అర్థం. ఆ విధంగా వారు సరియైన ఎంపిక చేస్తే ఇచట గౌరవపూర్ణమూ, ప్రగతిశీలమూనైన జాతీయజీవనానికి మన ప్రియతమ మాతృభూమిలో సుదృఢమైన పునాదులు వేయడానికి సహకరించినవారు కాగలరు.

# 10. ఎన్నికల ఫలితాలు ప్రకటించిన పిమ్మట కార్యకర్తలకు మార్గదర్శనం

ఎన్నికలతో ముడివడిన రాజకీయాలపట్ల నా అనాసక్తి మీకు తెలునుగదా? ఎన్నికలలో ఓడిపోయినవారు ఫలితాలను ఒక ఆటగా, ఒక వేడుకగా భావించటమేగాక జయాపజయాలపట్ల సమభావంతో కర్తవ్యాన్ని అనాసక్తితో చేయాలనేటువంటి సరియైన మన సంస్కృతీ భావన తగ్గట్టుగా వ్యవహరించాలి. గెలిచినవారికి ఆనందించే హక్కున్నది. కాని అందుకు వారు ఉబ్బితబ్బిబ్బుగారాదు. ఓడినవారు విచారించటం సహజమే. అంతమాత్రాన కృంగిపోరాదు; నీరు కారిపోరాదు. ఎన్నికలంటే కేవలం ఒకే రాజకీయవ్యవస్థకు చెందిన కొన్ని రాజకీయపక్షాల నడుమ ఆడబడే ఒక ఆట వంటిది. ఈ క్రీడను పూర్తిగా, స్నేహపూర్వకంగానూ, సోదర భావంతోనూ నిర్వహించాలి.

ప్రచార సమయంలో, నిందలూ, నిష్ఠురోక్తులూ, విచ్చలవిడిగా రావటం సహజమే. కానీ అట్టి అవాంఛనీయమైన భావావేశాలను పూర్తిగా

తుడిచెయ్యాలి. మనమంతా ఒక్కటేననీ, మన మాతృభూమికీ, మనజాతికీ, మనమంతా బిడ్డలమేననీ సరియైన అవగాహన, ప్రయత్నపూర్వకంగా అల వరుచుకోవాలనీ, అందరూ రాజకీయ సంబంధం ప్రసక్తి లేకుండా, పరస్పర సహకారంతో, మన ప్రజానీకం యొక్క సంక్షేమానికి కృషి చేయాలనీ నా భావన. సరిగా అర్ధం చేసుకుంటే మనందరి నడుమ, పర స్పర అంగీకారం కుదిరే అంశాలే అధికమనీ, విభేదాలు స్వల్పములనీ తెలుస్తుంది.

ఈ దృష్టిని అలవరుచుకుంటే, మన ప్రజాస్వామ్యవ్యవస్థ— దానిని భగ్నం చేయాలనీ, దేశంలో అల్లకల్లోలం సృష్టించాలనీ కోరుకునే వర్గాల యొక్క దాడులను తట్టుకొని జీవించగలదు.

(ఒక కార్యకర్తకు వ్రాసిన లేఖ ఇది)